# సరస్వతీ కంఠాభరణము

## [ప్రథమ సంపుటి]

సంస్కృత మూలము :
ధారాధీశ్వర శ్రీ భోజదేవుడు

టీకాకర్త – వ్యాఖ్యాత :
"సూర్యశ్రీ"
శ్రీ టి. భాస్కరరావు, ఎం. ఏ.




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ – సైఫాబాదు,
హైదరాబాదు-4

SARASWATI KANTHABHARANAM (First Volume) - A book on Poetics in Sanskrit by King Bhoja (11th Centrury A. D.) with Telugu Translation and Commentary by Sri T. Bhaskara Rao, M.A. (Sphurti Sri), Senior Lecturer, A C. College, Guntur.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
హైదరాబాదు – 500 004



ప్రచురణ : 331
ప్రథమ ముద్రణ : 1982
ప్రతులు : 2,000
వెల : రూ. 16–00



ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు – 500 004

ముద్రణ :
వికాస్ ప్రెస్, గుంటూరు

Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# సరస్వతీ కంఠాభరణము

## తొలి పలుకు

సాహిత్య స్వరూపాన్నీ, సాహిత్య ప్రమాణాలనూ, విశేషించి భారతీయ సాహిత్యాత్మను తలస్పర్శిగా అవగతం చేసుకోవడానికి సాహిత్య శాస్త్ర పరిచయం అవసరం. పరిశోధకులకూ, రచయితలకూ, పండితులకూ సాహిత్య శాస్త్రగ్రంథాలు కరదీపికలు. వీటిని పట్టుకునే తీరునుబట్టి, చూసేవాని కనుచూపుకలిమిని బట్టి, ఇవి వెలుగులను గుమ్మరిస్తూఉంటాయి. ఇవి మార్గదర్శక సూత్రాలు. రచయితలకు సంకెళ్లు కావు; శాసనాలుకావు. సాహిత్య తత్వాన్ని సహృదయ పండితులు పరిశీలించిన తీరు తెన్నులు. తమ రచనలను మరెంత శక్తిమంతంగానూ, మరింత నిర్దుష్టంగానూ, మరింత నూత్నంగానూ రూపొందించుకునేందుకు ఇవి తోడ్పడగలవనడంలో సందేహం ఉండకూడదు.

రచయితలకూ, సహృదయులకూ సేతువులనదగిన ఈ సాహిత్య శాస్త్ర గ్రంథాలు తెలుగులో కూడా కొన్ని శతాబ్దాలనుంచి వస్తున్నమాట నిజమే; అయినా సంస్కృత భాషలో వెలసిన సాహిత్య శాస్త్ర గ్రంథాలే ప్రామాణికమైనవిగా ఉంటూ ఉన్నవి. ఈ కారణంచేత సాహిత్య అకాడమీ సంస్కృతభాషలోని సాహిత్య శాస్త్ర గ్రంథాలకు సరళమైన పద్ధతిలో తెలుగులో వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రకటిస్తున్నది. ఇంతవరకు 'కావ్య స్వరూపమ్, రసగంగాధరం, కావ్యాదర్శః' అకాడమీ పరిత్ర్యలో కానికి అందించింది. ఇప్పుడు భోజదేవుని "సరస్వతీ కంఠాభరణాన్ని" ఆంధ్ర వ్యాఖ్యాన సహితంగా సమర్పిస్తున్నది.

భోజదేవుడు మహాకవి, అశేష శేముషీ సంపన్నుడు, బహు శాస్త్ర విజ్ఞాన నిష్ణాతుడు. కవిత్వం, సాహిత్య పర్యాలోచనం, వ్యాకరణం, జ్యోతిషం, యోగం, ధర్మశాస్త్రం, వైద్యం, తత్త్వ శాస్త్రం ఇత్యాది విషయాల రచనలతో సంస్కృత వాఙ్మయాన్ని పరిపుష్టం చేసిన సకలకళానిష్ణాతుడు. అతని 'సరస్వతీ కంఠాభరణం' సమగ్రమైన, విస్తృతమైన సాహిత్య శాస్త్ర గ్రంథం. శృంగార ప్రకాశము కూడ భోజుని ప్రతిభా పాండిత్యాలకూ, సహృదయ వివేచనకూ ప్రతీక.

అయితే గీర్వాణభాషతో గట్టి పరిచయం లేనివాళ్ళకు 'సరస్వతీ కంఠాభరణం' అందేంమాదయమే. సాహిత్య సమాలోచనకు పరమ ప్రమాణమైన ఈ గ్రంథాన్ని చక్కని తెలుగు వ్యాఖ్యతో వెలయించి రచయితలకూ, విద్యార్థులకూ, పరిశోధకులకూ తోడ్పడాలని సాహిత్య అకాడమీ తలపెట్టింది.

గుంటూరు ఎ. సి. కాలేజీలో ఆంధ్రోపన్యాసకులైన శ్రీ టి. భాస్కరరావు (స్ఫూర్తిశ్రీ) గారు తమ చిరకాలాధ్యాపనానుభవాన్ని ఉపయోగించుకొని భోజుని "సరస్వతీ కంఠాభరణానికి" సరళమైన తెలుగు వ్యాఖ్యను సమకూర్చి అకాడమీకి ప్రచురించే అవకాశాన్ని కల్పించి విద్వల్లోకానికీ, సహృదయులకూ, విద్యార్థులకూ కృతజ్ఞతాపాత్రులైనారు. ఇది మొదటి సంపుటం. మొత్తం మూడు సంపుటాల్లో ఈ గ్రంథం రూపుదిద్దుకుంటుంది. శ్రీ టి. భాస్కరరావుగారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన ధన్యవాదాలను సమర్పించుకుంటున్నాను.

హైద్రాబాదు
7-8-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# కృతజ్ఞత

నన్నయభట్టంటే నాకు చాలా ఇష్టం. ఆ యిష్టమే 'నన్నపార్యుని నాటకీయత' 'నన్నపార్యుని ఛందోయోగం' అన్న వ్యాసాలుగా రూపుదిద్దుకుంది. ఆ తరువాత నా దృష్టి నాకర్షించినవాడు 'ఉమరుఖయ్యాము'. ఆతని రుబాయీలు చదివి చదివి కొన్నింటి నెన్నుకొని 'మధుపాలిక' గా అనువదించాను. గ్రంథమంత పీఠికనుకూడా సంతరించాను. అప్పటికిగాని సంతృప్తి కలుగలేదు. ఈ యిద్దరూ పదకొండో శతాబ్దంవారే. అందువల్ల ఆ శతాబ్దంమీదనే ఒక అభిమానం ఏర్పడింది.

అలంకార శాస్త్రగ్రంథాలు పెక్కింటిలో భోజదేవుని పరామర్శ ఉండడమూ, అదికూడా ఎంతో ప్రశంసాత్మకంగా ఉండడమూ గమనించాను. ఇతడుకూడా పదకొండో శతాబ్దంవాడే. ఆ శతాబ్దంమీద ఏర్పడ్డ అభిమానం మరింత గట్టిపడింది. 'సరస్వతీ కంఠాభరణం' మా కళాశాలా గ్రంథాలయంలోనుంచి తెచ్చి చదివాను. భోజదేవుని విశిష్టత స్పష్టంగా విడమరిచి చెప్పగలిగినంతగా గోచరం కాకపోయినా, ఆ వెలుగులకొనలు నన్ను పులకితుణ్ణి చేశాయి. 'ఈ గ్రంథాన్ని ఆంధ్రీకరించాలి' అని నిర్ణయం చేసుకున్నాను. కాని, యింత పెద్ద గ్రంథాన్ని అనువదించడం మాటలా? అచ్చువెయ్యడం మాటలా? ఈ ప్రశ్నలతో నిర్ణయంలో కొంత సడలింపు కలిగింది. కొంత సరుదుబాటు అవసరమయింది. పంచమ పరిచ్ఛేదం మాత్రమే అనువదించాలని అనుకున్నాను. దీనికి తగినట్లుగా మూలగ్రంథాన్ని కొంతవరకూ ఎత్తి వ్రాసుకున్నాను. అనువాదం ప్రారంభింపకముందే అక్షిరోగం తటస్థపడింది. దాదాపు రెండు నెలలపాటు పఠనాదికానికి అవరోధమేర్పడింది. దానితో అప్పటి నా ప్రయత్నం కూడా అవరుద్ధమయింది; కాలంతోపాటు కరిగిపోయింది. ఇది ఇరవైయేళ్ల క్రిందటి విషయం.

చంద్రాలోకంలోని పంచమ మయూఖానికి 'చంద్రాలోక సమున్మేషం' అన్న పేరుతో వ్యాఖ్య వ్రాశాను. అలంకారశాస్త్రక్షేత్రంలో తొలిసారిగా హస్తచాలనం చెయ్యడం ఈ గ్రంథంతోనే జరిగింది. ఇది విద్యార్థుల అవసరాన్ని తీర్చడమే కాకుండా విద్వాంసుల ఆమోదాన్నికూడా సంపాదించుకుంది. వ్రాసిన గ్రంథం

వాసికెక్కిందన్న తృప్తికలిగింది. కొందరు మిత్రులు 'ఏదయినా ఒక అలంకార గ్రంథాన్ని సమగ్రంగా అనువాదం చెయ్యరాదూ!' అని పదే పదే హెచ్చరించడం మొదలుపెట్టారు. సరస్వతీ కంఠాభరణం నా హృదయంలో ప్రతిఫలించింది.

'వ్రాయాలని అనుకున్న సమయంలో మొదలుపెట్టకుండానే ముగిసిపోయింది. అది నావల్ల కావలసిఉంటే అప్పుడే అయిఉండేది. ఇప్పుడుకూడా అంతే' అనే నిస్పృహ నా ఉత్సాహంమీద నీళ్ళు చిమ్ముతూనే ఉంది; వ్రాయాలన్న కోరిక బలపడుతూనే ఉంది. ఆ ద్వంద్వదోలికలో కొన్నాళ్లు అటూ ఇటూ ఊగినా, వ్రాయాలన్న సంకల్పమే గెల్పుపొందింది. కేవలమూ అనువాదం మాత్రమే కాక, తెగుమాత్రంగా వ్యాఖ్య కూడా చేర్చాలని నిర్ణయించుకున్నాను. వ్యాఖ్యాతృశిరోమణి మల్లినాథసూరి 'నామూలం లిఖ్యతే కించిన్నానపేక్షిత ముచ్యతే' అని ప్రతిజ్ఞపట్టి నిర్వహించాడు. ఆయన నీడలో మూలంలో లేనిది వ్రాయకూడదనీ, అపేక్షితం విడువకూడదనీ, అనపేక్షితం తడువకూడదనీ ప్రతిజ్ఞగా కాక, ఆదర్శంగా నిలుపుకున్నాను. ఆదర్శం ఉన్నతంగా ఉండడం అభిలషణీయమేకదా!

మూలంలోని కారికలనూ, ఉదాహరణలనూ, వృత్తినీ కూడా వచనంలోనికే అనువదించాను. చాలాచోట్ల మూలంలో ఉన్న పదాలనే యథాతథంగా ఉపయోగించాను. నా అనువాదాన్నిబట్టి మూలాన్ని అవగాహన చేసుకోవాలనుకునేవారికి, అది వీలుగా ఉంటుందని నా అభిప్రాయం. సంస్కృతానభిజ్ఞులకు సైతం ఈవిధంగా సౌకర్యం కలిగించవచ్చునని నా అభిలాష. ఇట్టిచోట్ల ప్రతిపదార్థం వ్రాయడం మంచిదే. కాని గ్రంథవిస్తరణభీతి నాకు హస్తనిగళమయింది. మరీ, తప్పనిచోట్ల వ్యాఖ్యలోనే ఆపని ఒకవిధంగా నిర్వహించాను. వివరణాపేక్ష లేనిచోట్ల వ్యాఖ్య వ్రాయలేదు. మూలాన్ని వివరించడమే లక్ష్యంగా ఉంచుకోవడంచేత, గ్రంథస్థ లక్ష్యాలకే లక్షణం సమన్వయంచేసి చూపించాను. లక్షణం సంస్కృతభాషకే పరిమితమైనప్పుడు తెలుగుభాషకు సమన్వయింపదగిన సదృశలక్షణం చెప్పాను.

వ్రాస్తున్నప్పుడు ఎన్నో సందేహాలు కలగడం సహజం. నేనేమి సర్వజ్ఞుడిని కాను. శ్రీనాథుడు చెప్పినట్లు 'సర్వజ్ఞ నామధేయము శర్వునికే'. ఎంతటిపండితులూ సర్వజ్ఞులు కారు. అల్పజ్ఞుడిసైన నాకు చెప్పగల అధికజ్ఞులు ఆంధ్రదేశంలో అధికంగానే ఉన్నారు. అందువల్ల ఆ యా సహృదయ శిరోమణుల సహకారంతో బహుజ్ఞత నాపహింపజేసుకునే అవకాశాన్ని వినియోగించుకున్నాను. నా సందేహాలు శ్రద్ధగా విని, ఓపికగా నాకు సమాధానాలు చెప్పిన పండితవరేణ్యులు జమ్ములమడక

మాధవరామశర్మ, జంధ్యాల పాపయ్యశాస్త్రి, ఓరుగంటి నీలకంఠశాస్త్రి, మిన్నికంటి గురునాథశర్మ, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులకు నా భక్తిపూర్వక కృతజ్ఞతలు.

ప్రథమ పరిచ్ఛేదం రచన పూర్తి అయింది. ద్వితీయ పరిచ్ఛేదం సాగుతూఉంది. ఆ సమయంలో డాక్టర్ తూమాటి దోణప్పగారిని కలుసుకోవడం తటస్థించింది. ఆయన యథాలాపంగా 'మీరిప్పుడేం వ్రాస్తున్నారు?' అని అడిగారు నన్ను. నేను సమాధానం చెప్పేలోపుగానే నాకు మిత్రులూ, వారికి పరిశోధక శిష్యులూ అయిన డాక్టర్ సేతి అనంతరామశాస్త్రిగారు 'సరస్వతీ కంఠాభరణం' అని చెప్పారు. "సాహిత్య అకామీవారు ప్రచురించాలని నిర్ణయించారు. మీరు వ్రాస్తే కొత్తవారిని అడగడమెందుకు?" అన్నారు. 'నేనింకా వ్రాయడం పూర్తికాలేదు. మొదటి పరిచ్ఛేదం మాత్రమే వ్రాశాను' అని చెప్పాను. 'అయితే మీ విషయం అకాడమీ వారికి వ్రాస్తాను. మీరు అకాడమీవారికి ప్రచురణ కిస్తారా?' అని అడిగారు. 'అకాడమీవంటి అధికారిక సంస్థ ప్రకటిస్తే, అది నా అదృష్టమనుకుంటాను. అయితే నా వ్రాతప్రతి మీ కిస్తాను. మీరు పూర్తిగా చూచి, మీకు నచ్చితే అప్పుడు అకాడమీ వారికి వ్రాయండి. లేకపోతే వద్దు' అని చెప్పాను. ఆ తరువాత నేను నా వ్రాతప్రతిని ఆచార్య దోణప్పగారి కిచ్చాను. దాదాపు నెలరోజుల తర్వాత నా వ్రాతప్రతిని తెచ్చుకున్నాను. కొన్నాళ్లపోయాక డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తిగారి నుంచి ఒక ఉత్తరం వచ్చింది - నా వ్రాతప్రతిని పంపించమని. ఆ తరువాత అకాడమీవారు నా రచనను అంగీకరిస్తూ, మిగిలిన పరిచ్ఛేదాలను కూడా తొందరగా పూర్తిచేయ వలసిందని ఆదేశించారు. డాక్టర్ ఇరివెంటి తమ లేఖలద్వారా నిరంతరమూ అందిస్తున్న ఉత్సాహ ప్రోత్సాహాలవల్ల 'సరస్వతీ కంఠాభరణం' సమగ్రతను సంపాదించుకుంది. నా కోరిక మేరకు నా పర్యవేక్షణలోనే గ్రంథముద్రణ జరిగే యేర్పాటు చేశారు — స్నేహశీలీ, సంతత కార్యశాలీ అయిన కృష్ణమూర్తిగారు. డాక్టర్ కృష్ణమూర్తిగారికి నా సౌహార్దపూర్వక కృతజ్ఞతలు. అకాడమీ కార్యవర్గ సభ్యులకూ, అకాడమీతో నాకు సదనుబంధాన్ని సంధించిన డాక్టర్ దోణప్పగారికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ముద్రణ కార్యక్రమాన్ని చేపట్టి, పట్టువిడువకుండా సంతృప్తిగా నిర్వహిస్తున్న వికాస్ ప్రెస్ (గుంటూరు) వారికి, తత్సహకారులకు సామోద సాధువాదాలు.

గుంటూరు/5-8-82 — స్ఫూర్తిశ్రీ

# సరస్వతీ కంఠాభరణము

మూడు సంపుటములు

*

## ప్రథమ సంపుటి :

ప్రథమ ద్వితీయ

పరిచ్ఛేదములు

*

## ద్వితీయ సంపుటి:

తృతీయ చతుర్థ

పరిచ్ఛేదములు

*

## తృతీయ సంపుటి:

పంచమ

పరిచ్ఛేదము.

# స్వయంప్రభ

## (పీఠిక)

'సాధితం విహితం దత్తం జ్ఞాతం తద్యన్న కేనచిత్
కి మన్యత్ కవిరాజస్య శ్రీభోజస్య ప్రశస్యతే'

అని ఉదయపురప్రశస్తి చేసిన ప్రశంస. కవిరాజయిన భోజుడు ఎవరును సాధింపనిది సాధించెను; విధింపనిది విధించెను; ఇయ్యనిది యిచ్చెను. ఎరుగనిది యెరిగెను. భోజదేవుడు గొప్ప విజేత యనియు, గొప్ప శాసకు డనియు, మహాదాత యనియు, మహాజ్ఞాని యనియు శాసనకారుని యభిప్రాయము.

'కవిషు వాదిషు భోగిషు దేహిషు
ద్రవిణవత్సు సతా ముపకారిషు
ధనిషు ధన్విషు ధర్మధనేష్వపి
క్షితితలే నహి భోజసమో నృపః'

కవులయందు, వాదులయందు, భోగవంతులందు, దేహధారులందు, వైభవవంతులందు, సజ్జనోపకారులందు, ధనవంతులందు, విలుకాండ్రయందు, ధర్మధనులయందు భోజసమానుడైన నృపాలుడు భూలోకమున లేడు – అని యొక కవి ప్రశంసించెను. ఎందరో కవులు ఎన్నోవిధములుగా ప్రశంసించిరి. బల్లాలు డను కవి 'భోజప్రబంధ' మనుపేర నొక మనోహర గ్రంథమునే రచించెను. సంస్కృతమునందలి సర్వ కవులను బల్లాలుడు భోజుని యాస్థానకవులుగానో, భోజ సమ్మానితులుగానో చిత్రించెను చారిత్రకముగా కాళిదాస, భవభూతి, బాణ, హర్ష, మయూరాదులు సమకాలికులు కారు. అయినప్పటికిని భోజకీర్తిని పరివేష్టించి యున్న ప్రభామండలము చరిత్రను సైతము మరపింపజేసినది. ఇట్లే సింధులుని (సింధురాజు) అనంతరము ముంజరాజు పరిపాలన మొనరించెననియు, భోజుని చంపించుటకు యత్నించెనని, దైవవశమున భోజుడు రాజ్యాభిషిక్తు డయ్యెనని భోజప్రబంధ కథనము. శాసనములనుబట్టి చూడగా ముంజురాజే ముందుగా పరిపాలించినట్లు తెలియుచున్నది. అతనిని తైలపుడు క్రీ. శ. 994 _ 997 సంవత్సరముల నడిమిభాగ

మున సంహరించెను. అప్పుడు ముంజరాజు తమ్ముడై న సింధులుడు రాజై పరిపా లించెను. పరిమళ కవి రచించిన నవసాహసాంక చరితమునందు సింధురాజు విజయ గాధలే చిత్రితములై నవి. క్రీ. శ. 1009 నాటి బంస్వర, బేత్మా శాసనములు, క్రీ. శ. 1056 నాటి జయసింహుని మాంధాతశాసనము సింధురాజు వాక్పతి (ముంజ) రాజు మరణానంతరము పరిపాలించినట్లు ధ్రువపరుచుచున్నవి. ఆ పిమ్మటనే భోజ రాజు మాలవాధీశ్వరుడుగా ధారానగరసింహాసనము నధిష్ఠించెను. డాక్టర్ భండార్కర్ భోజరాజు పదునొకండవ శతాబ్ది పూర్వార్ధమున వర్ధిల్లినట్లు నిర్ణయించెను. డాక్టర్ బుహ్లర్ (Buhler) భోజకాలమును మరికొంచెము ముందునకు నెట్టెను. రాజ తరంగిణియందు 'స చ భోజనరేంద్రశ్చ । దానోత్కర్షేణ విశ్రుతౌ । సూరీ తస్మిన్ క్షణే తుల్యౌ । ద్వా వాస్తాం కవి బాంధవౌ' అన్న శ్లోకము కలదు. అతడును భోజ నరేంద్రుడును దానోత్కర్షచేత విశ్రుతులు; పండితులు; ఆ క్షణమునందు సమా నులు; కవి బాంధవులు – అని యర్థము. 'అతడు' అనగా కలశభూపతి యని, క్రీ. శ. 1062 దాటిన తర్వాతనే అతని ప్రసంగము వచ్చును కాబట్టి భోజభూపతి కూడ అప్పటివాడై యుండవలయునని; చౌరపంచాశిక యందలి శ్లోకమును భోజు డుదాహరించుటచేత బిల్హణుని కాలమునుబట్టికూడ భోజు డనంతరుడై యుండవలయు నని – ఆతని వాదము. డాక్టర్ కాణే 'అతడు' అన్నది అనంతుని సూచించుచున్న దని, చౌరపంచాశికా కర్తృత్వ విషయము నిశ్చితము కాదని చెప్పెను. జయసిం హుడు క్రీ. శ. 1056 ప్రాంతమున వేసిన శాసనముకలదు. ఇతడు భోజుని పుత్రుడై యుండునని, భోజానంతరము వారసుడుగా సింహాసనము నధిష్ఠించెనని చారిత్రకుల నిర్ణయము. భోజుని శాసనములు క్రీ. శ. 1019, 1021, 1036 సంవత్సరములలో నివి లభించినవి. భోజరాజు చాలకాలము పరిపాలించినట్లు చరిత్రకారులు అంగీక రించుచున్నారు. కాబట్టి క్రీ. శ. 1010 – 1055 భోజుని పరిపాలనకాలముగా నిర్ణ యము చేయవచ్చును.

భోజుడు పరిపాలన కాలములో ఉత్తర దక్షిణ ప్రాంతములతో పెక్కుపర్యాయ ములు యుద్ధముచేసెను. అతడు పరాక్రమశాలియైన ప్రభువుమాత్రమే కాదు; ప్రజాభివృద్ధికి పాటుపడిన ఆదర్శపాలకుడు; కవిపండిత పోషకుడు; స్వయముగా మహాకవి; మహాపండితుడు. అతడు తన రాజ్యమునందు పెక్కు విద్యాలయములను వెలయించెను; 'భోజపురము' అని తనపేర ఒక నగరమును నిర్మించెను అనేకము లయిన దేవాలయములను నిర్మించెను. ధారానగరమునందు భోజశాలా సరస్వతీ

దేవాలయము నిర్మించి, వాగ్దేవిని ప్రతిష్ఠించెను. ఎనుబది నాలుగు బిరుదములను ధరించెను; ఎనుబది నాలుగు గ్రంథములను రచించెను. 'ఇహ హి శిష్టశిరోమణి నిఖిల నిరవద్య విద్యానిర్మాణాపూర్వ ప్రజాపతి ప్రచండ భుజదండ పరాక్రమార్జిత చతురశీతి బిరుదప్రకాశిత స్వకృతగ్రంథ సమాజః శ్రీ భోజరాజః' అని సరస్వతీ కంఠాభరణ వ్యాఖ్యానమునందు 'అజడ' వక్కాణించెను. భోజునకు రాజమృగాంక, సమరాంగణ సూత్రధార, సరస్వతీ కంఠాభరణ, శృంగారప్రకాశ – మున్నగు బిరుదములు గలవని, అవియే తద్రచిత గ్రంథనామములుకూడ నని స్పష్టమగుచున్నది. చంద్రప్రభాసూరి రచించిన 'ప్రభావకచరిత' మందు –

'అసౌ హి మాలవాధీశో విద్వచ్చక్ర శిరోమణిః
శబ్దాలంకార దైవజ్ఞ తర్కశాస్త్రాణి నిర్మమే॥
చికిత్సా రాజసిద్ధాంత తరువాస్తూదయాని చ
అంక శాకుని కాధ్యాత్మ స్వప్నసాముద్రికాణ్యపి॥

గ్రంథాన్నిమిత్త వ్యాఖ్యాన ప్రశ్న చూడామణీ నిహ
వివృత్తిం చాయ సద్భావేఽర్థశాస్త్రం మేఘమాలయా॥

అని భోజుడు రచించిన వివిధవిషయముల ప్రస్తావము కలదు. మదరాసు విశ్వవిద్యాలయము సరస్వతీ కంఠాభరణము (వ్యాకరణము) నందు భోజుని గ్రంథములను వర్గీకరించి ప్రదర్శించెను.

'సాహిత్యము : సాలికథ, శృంగారమంజరి, విక్రాంతివిద్యావినోదము.
సాహిత్యవిమర్శ : సరస్వతీకంఠాభరణము, శృంగారప్రకాశము.
వ్యాకరణము : సరస్వతీ కంఠాభరణము.
నిఘంటువు : అమరవ్యాఖ్య, సంయమినామమాలిక.
ధర్మశాస్త్రము : రాజమార్తాండము, యుక్తి కల్పతరువు, వ్యవహార సముచ్చయము, రత్నమాల
జ్యోతిషము : రాజమృగాంకము, విద్వజ్జనవల్లభము, భుజబల నిబంధము, ప్రశ్నచింతామణి
యోగము : యోగసూత్రవృత్తి.

వైద్యము : రాజమృగాంకము, చారుచర్య, ఆయుర్వేద సర్వస్వము.
విజ్ఞానశాస్త్రము : సమరాంగణ సూత్రధారము, శాలిహోత్రోన్నయము.
శైవము : తత్త్వప్రకాశము.
సంగీతము : గీతాప్రకాశము. (కొందర భావము)'

డాక్టర్ కాణే భూపాలకృత్య సముచ్చయము, భుజబలభీమము, రాజమార్తండము – అన్న ధర్మశాస్త్ర గ్రంథములను; రాజమార్తండము – అన్న పేరుతో ఒక వైద్యశాస్త్రగ్రంథమును, ఒక యోగసూత్ర వివరణను పేర్కొనిరి. పైపట్టిక యందున్న వ్యవహారసముచ్చయమే భూపాల కృత్య సముచ్చయము కావచ్చును. భుజబల నిబంధ మన్న జ్యోతిషగ్రంథము పట్టికలోనున్నది; భుజబలభీమము ధర్మశాస్త్ర గ్రంథ మగుటచేత భిన్నము కావచ్చును. పట్టికయందలి యోగసూత్రవృత్తికే 'రాజమార్తండము' అని పేరుండి యుండవచ్చును. ఒకే పేరుతో వేర్వేరు విషయములపై వేర్వేరు గ్రంథములు వ్రాయుట భోజుని యలవాటు. మొత్తముమీద ఇరువదియైదు గ్రంథములు భోజరచితములు తేలుచున్నవి. ఇవికాక చంపూరామాయణము సుప్రసిద్ధమే. ఇంక మిగిలిన గ్రంథము లేవో, యేమైనవో కాలమే చెప్పవలయును.

భోజదేవుని అలంకారగ్రంథములలో మొదటిది సరస్వతీ కంఠాభరణము. ఇది పెక్కు పర్యాయములు ముద్రితమయినది. క్రీ. శ 1882 వ సంవత్సరమున శ్రీ ఆనందరామ్ బారువా పీఠికతో వారణాసి నుండి ప్రకటితమయినది. 1894 లో శ్రీ జీవానంద విద్యాసాగర్ కలకత్తా నుండి ద్వితీయ సంస్కరణమును ప్రకటించెను. (ప్రథమ సంస్కరణము తేదీ తెలియదు). ఇందు మొదటి మూడు పరిచ్ఛేదములకు రత్నేశ్వర విరచితమైన రత్నదర్పణ వ్యాఖ్య యున్నది. చతుర్థ పంచమ పరిచ్ఛేదములకు శ్రీ జీవానందసాగర విరచిత వ్యాఖ్య యున్నది. క్రీ. శ. 1925 లో నిర్ణయసాగర ముద్రణాలయము వారి సరస్వతీ కంఠాభరణము ముద్రితమయినది. ఇందు మూడు పరిచ్ఛేదములకు రత్నదర్పణ వ్యాఖ్య యున్నది. చతుర్థపరిచ్ఛేదమునకు జగద్ధర విరచిత వ్యాఖ్య చేర్పబడినది. 'రామసింహ విరచితయా తృతీయ పరిచ్ఛేదాంతయా జగద్ధర విరచితయా చ చతుర్థపరిచ్ఛేద టీకయా సనాథమ్' అని ముఖపత్రమునందు ముద్రితము. రామసింహుడు మహారాజు. కారయితయే కాని కర్త కాడు. తృతీయపరిచ్ఛేదాంతమునందలి గద్య యీ విషయమును స్పష్టముగానే

వెల్లడించుచున్నది. 'ఇతి శ్రీమన్మహారాజ శ్రీరామసింహేన మహామహోపాధ్యాయ మనీషి రత్నేశ్వరేణ విరచయ్య ప్రకాశితే దర్పణాఖ్యే సరస్వతీ కంఠాభరణ వివరణే౽ర్థాలంకార స్తృతీయఃపరిచ్ఛేదః సమాప్తః' అని యున్నది. రామసింహుడు పదునాలుగవ శతాబ్దికి చెందిన వాడని చారిత్రకుల నిర్ణయము. రత్నేశ్వరుడు మూల గ్రంథము వెలువడిన మూడుశతాబ్దులకే వివరణము వెలయించిన విద్వన్మణి. సరస్వతీ కంఠాభరణమునకు ఆజడ, భట్ట నృసింహ ప్రభృతులు వ్యాఖ్యాతలుగా వినిపించుచున్నారు; కాని వారి వ్యాఖ్యలు ముద్రితములు కాలేదు; వ్రాతప్రతులుగానే మిగిలిపోయి ప్రవాసము చేయుచున్నవి.

"The Saraswati Kanthabharana is probably the best rhetorical work in Sanskrit, but the retinement of its classification and the difficulties of its language have long deterred our pandits to study it carefully". అని శ్రీ బారువా తనపీఠికయందు రచించెను. అలంకార గ్రంథములలో సర్వసమగ్రము, బృహత్తమము, సూక్ష్మవివేచనా కలితము, బహులక్ష్య సమన్వితము – అయినది సరస్వతీ కంఠాభరణ మొక్కటియే. ఇంతకంటె పరిమాణమునందు పెద్దది శృంగారప్రకాశము. అదియు భోజరాజో పజ్ఞమే. అది ప్రధానముగా ప్రస్థానగ్రంథము. 'శృంగార ఏవ రసః' అన్న పట్టుదలతో శృంగారమునకు పట్టము కట్టుటకు రచించిన గ్రంథ మది. 13 వ ప్రకరణమునుండి 36వ ప్రకరణము వరకు, 24 ప్రకరణములలో రసవిషయము ప్రసక్తమయినది. తొలుతటి పండ్రెండు ప్రకరణములలోను శబ్దార్థసాహిత్య వ్యాకరణ శబ్దశక్తి దోషగుణములును, అలంకారములును, దృశ్యశ్రవ్యభేద రసావియోగ సంధ్యంగాదులును సంగ్రహముగా ప్రసక్తము లయినవి. కావున సరస్వతీ కంఠాభరణమునకే సర్వసాహిత్య విషయ సమగ్రత్వము లభించుచున్నది అయినను, వ్యాఖ్యలు విరళములుగా నుండుటకు భాషాక్లిష్టతయే కారణమయ్యెనేమో! చారిత్రక కారణములు మరేమైన నుండెనేమో! ఏమయినను, అనంతరాలంకారికులు పెక్కండ్రు భోజుని మహత్త్వమును గుర్తించి రనుటలో, అతని ననువర్తించి రనుటలో సందేహము లేదు. సరస్వతీ కంఠాభరణము నందున్న నిశిత పరిశీలన, సూక్ష్మవివేచన, సర్వాంగీణత్వము, సంఖ్యాన సమత్వము, లక్ష్యప్రదర్శన లక్షణ నిర్దేశన విధానము నాన్యతో దర్శనీయములు సంస్కృత ప్రాకృత సాహిత్యములనుండి యెన్నిక చేసి తెచ్చి గ్రుచ్చిన యెన్నో సూక్తిరత్నముల సుందరహారమ్మే సరస్వతీ కంఠాభరణమ్ము.

ప్రథమపరిచ్ఛేదమునందలి ద్వితీయశ్లోకము కావ్యలక్షణ ప్రయోజన నిర్దేశకము.

'నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్
రసాన్వితం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతిం చ విందతి'

కావ్యము 1. నిర్దోషము 2. గుణవంతము 3. సాలంకారము 4. రసాన్వితము — అయి యుండవలయును. దోషహానము, గుణోపాదానము, అలంకారయోగము, రసావియోగము - అని కూడ ఈ నాల్గులక్షణములనే పేర్కొందురు. భోజుడు ప్రణాళికాబద్ధముగా ప్రథమపరిచ్ఛేదమును దోషములను గుణములను వివేచన చేయుటకు వినియోగించెను. అలంకారములను మూడు విధములుగా విభజించి శబ్దాలంకారములను ద్వితీయపరిచ్ఛేదమునందు, అర్థాలంకారములను తృతీయపరిచ్ఛేదమునందు, ఉభయాలంకారములను చతుర్థపరిచ్ఛేదమునందు వివేచన చేసెను. పంచమ పరిచ్ఛేదము రసవివేచనకు వినియుక్తమయ్యెను. పై శ్లోకమునకు పరిపూర్ణమయిన వివరణమే మొత్తము గ్రంథము. అయిదు పరిచ్ఛేదములతో, దాదాపు ఆరువందల యేబది లక్షణ శ్లోకములతో, పదునైదువందల డెబ్బది ఉదాహరణశ్లోకములతో సౌష్ఠవము గల నిర్మాణముతో నిత్య నిరవద్య సాహిత్య ప్రభలు విరజిమ్ము కంఠాభరణమును సరస్వతీదేవికి సమర్పించి, వరివస్య గావించిన వశ్యవాక్కు భోజదేవుడు ధన్యుడు.

భోజదేవుని నాటికి అలంకారశాస్త్రము సహస్రాధికవర్ష పరిణతిని సాధించుకొన్నది. అగ్నిపురాణము, భరతుని నాట్యశాస్త్రము, భామహుని కావ్యాలంకారము, దండి కావ్యాదర్శము, వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి, రుద్రటుని కావ్యాలంకారము, ఆనందవర్ధనుని ధ్వన్యాలోకము, రాజశేఖరుని కావ్యమీమాంస, కుంతకుని వక్రోక్తిజీవితము. ధనంజయుని దశరూపకము, మహిమభట్టు వ్యక్తివివేకము ప్రసిద్ధములయిన అలంకార గ్రంథములు. వీని నన్నింటిని భోజదేవుడు అధ్యయనము చేసియుండును; అందలి విశేషములను తన సమీక్షాయణమునందు సమన్వయించికొని యుండును. త్యాజ్యములను త్యజించి గ్రాహ్యములను గ్రహించి, తన యవగాహన కనుకూలముగా తానొక ప్రణాళికను సిద్ధముచేసికొనియుండును. అట్లు సిద్ధమైన గ్రంథమే సరస్వతీ కంఠాభరణము. కొందరు దీనిని కేవల సంకలన గ్రంథముగా (it is more or less a compilation) భావించిరి. అది సమంజసము కాదు. శాస్త్రగ్రంథము లెప్పుడును స్వతః కల్పితములు కావు. పూర్వాపూర్వుల నాధారము

చేసికొనియే ప్రవర్తిల్లును; ప్రవర్ధిల్లును. పూర్వుల ననుసరించుటతోనే తృప్తిచెందక శాస్త్రకారుడు తానై అర్వాచీనుల కేమయిన నందింపగలిగి యుండవలయును. అట్లే బహుముఖములుగా నున్న శాస్త్రార్థములను సమన్వయించుటయు, మేలేర్చి తీర్చి దిద్దుటయు శాస్త్రకారుని కర్తవ్యమనుటలో సందేహము లేదు. ఈ దృష్టితో ఆలంకారిక లోకమున భోజదేవుని స్థానమును గుర్తించుకొనవలయును.

'ధ్వని ర్వర్ణాః పదం వాక్య మిత్యాస్పద చతుష్టయమ్
యస్యాః సూక్ష్మాదిభేదేన వాగ్దేవీం తాముపాస్మహే' [స. కం. 1-1]

ఇది నాందీ ప్రాయము; సరస్వతీ స్వరూపకము; ఆశీర్నమస్క్రియా సంకలితము. అగ్నిపురాణమునందు 'ధ్వనిర్వర్ణాః పదం వాక్య మిత్యేతద్వాఙ్మయం మతమ్' అని యున్నది. ఇందలి ఒక పాదమును యథాతథముగా భోజదేవుడు గ్రహించెను. వాఙ్మయముగా చెప్పబడిన అంశములను వాగ్దేవికి అధిష్ఠానములుగా భోజుడు మార్చెను అంతేకాక, సూక్ష్మాదిభేదములతో ఉపాసింతుమన్న భావమును కలుపుట చేత భర్తృహరి వాక్యపదీయమునందు తెల్పిన పరా పశ్యంతీ మధ్యమా వైఖరీభేదములను జ్ఞాపనము చేసెను.

తొలుదొల్త దోషప్రసంగమునందు భోజుని స్థానమును చూతము.

'దోషాః .........హేయాః కావ్యే కవీన్ద్రైర్యే తానేవాదౌ ప్రచక్ష్మహే' (స. కం. 1-3). దోషములు హేయములు అన్న భావము నందు ప్రదర్శించెను. హేయము లని యనగా వర్జింపదగిన వని యర్థము. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకము నందు శ్రుతి దుష్టాదులను అనిత్య దోషములని చెప్పుచు 'ధ్వన్యాత్మన్యేవ శృంగారే తే హేయాః....' అని యిదే పదమును వాడియున్నాడు. భామహుడు దోషయుక్తమైన కవిత్వము కుకవిత్వ మని అది సాక్షాన్మరణమే యని నిర్ణయించెను. దండి 'సుందరమైన శరీరము ఒక్క బొల్లి మచ్చతో చెడిపోవును. కావున కావ్యమున నెంత చిన్నదోషమునైన నుపేక్షింపరాదు' అని 'తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన' అని పలికెను. వామనుడుకూడ దోషహానము చేయవలయు ననియే తెలిపెను. కావుననే భోజుడు 'నిర్దోషం గుణవత్....' మున్నగు విధముగా దోష ప్రసంగముతోనే కావ్యలక్షణము నిర్దేశించెను. అనంతరుడైన మమ్మటుడు తన కావ్యప్రకాశమునందు 'తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి' అని అదోషత్వమునే ముందుగా పరిగణించుటకు భోజప్రభావమే కారణము కావచ్చును.

తర్వాత హేమచంద్రుడు తన కావ్యానుశాసనమందు 'అదోషౌ సగుణౌ సాలంకారౌ చ శబ్దార్థౌ కావ్యమ్' (1-11) అని అదోషత్వమునే ముందుగా పరిగణించెను. అగ్నిపురాణకర్త కావ్యలక్షణమునందు 'కావ్యం స్ఫురదలంకారం గుణవద్దోషవర్జితమ్' అని దోషప్రసంగమును చివరకు చేర్చుకొనెను. అగ్నిపురాణమునుండి కావ్యలక్షణమునందే అదోషత్వము అవశ్యాంగమైన దనుట యథార్థము. చివరకు పరిగణింపబడిన అంగము మొదటికి వచ్చుటకు భోజుడు కారణము.

సరస్వతీ కంఠాభరణమునందు పదదోషములు, వాక్యదోషములు, వాక్యార్థదోషములు – అని మూడు వర్గములుగా దోషములు విభక్తము లయినవి. ఇంతకు పూర్వుడైన వామనుడే దోషములను వర్గములుగా విభజించినవారిలో మొట్టమొదటివాడు; రెండవవాడు భోజుడు. వామనుడు పద – పదార్థ – వాక్య – వాక్యార్థదోషము లని నాలుగు వర్గములు పరిగణించెను. భోజుడు పదార్థవర్గమును పరిత్యజించి మిగిలిన మూడింటినే గ్రహించెను. ప్రతివర్గమునందు పదునారు దోషములను పరిగణించెను. చివరిదోషమునందలి అవాంతరభేదములతో కూడినయెడల ఒక్కొక వర్గమున ఇరువదినాలుగు దోషము లగును.

పదదోషములు : 1. అసాధువు 2. అప్రయుక్తము 3. కష్టము 4. అనర్థకము 5. అన్యార్థకము 6. అపుష్టార్థము 7. అసమర్థము 8. అప్రతీతము 9. క్లిష్టము 10. గూఢార్థము 11. నేయార్థము 12. సందిగ్ధము 13. విరుద్ధము 14. అప్రయోజకము 15. దేశ్యము 16. గ్రామ్యము. చివరి దోషము అసభ్యార్థము, అసభ్యార్థాంతరము, అసభ్యస్మృతిహేతువు; అశస్తార్థము, అశస్తార్థాంతరము, అశస్తస్మృతిహేతువు; ఘృణావదర్థము, ఘృణావదర్థాంతరము, ఘృణావత్స్మృతిహేతువు–అని తొమ్మిది విధములు.

వాక్యదోషములు : 1. శబ్దహీనము 2. క్రమభ్రష్టము 3 విసంధి 4. పునరుక్తిమంతము 5. వ్యాకీర్ణము 6. వాక్యసంకీర్ణము 7. అపదము 8. వాక్యగర్భితము 9. భిన్నలింగము 10 భిన్నవచనము 11 న్యూనోపమము 12 అధికోపమము 13. భగ్నచ్ఛందము 14. భగ్నయతి 15. అశరీరము 16. అరీతిమంతము. చివరి దోషము శిథిలము, విషమము, కఠోరము; అప్రసన్నము, నేయము, గ్రామ్యము; అసమస్తము, అనిర్వ్యూఢము, అనలంకారము – అని తొమ్మిది విధములు.

వాక్యార్థదోషములు : 1. అపార్థము 2 వ్యర్థము 3. ఏకార్థము 4. ససంశయము 5. అపక్రమము 6. ఖిన్నము 7. అతిమాత్రము 8. పరుషము 9. విరసము

10. హీనోపమము 11. అధికోపమము 12. అసదృశోపమము 13. అప్రసిద్ధోపమము 14. విరలంకారము 15. అశ్లీలము 16. విరుద్ధము. చివరిదోషము దేశవిరోధము, కాలవిరోధము, లోకవిరోధము; యుక్తివిరుద్ధము, ఔచిత్యవిరుద్ధము, ప్రతిజ్ఞా విరుద్ధము; ధర్మశాస్త్రవిరోధము, అర్థశాస్త్రవిరోధము, కామశాస్త్రవిరోధము — అని తొమ్మిది విధములు.

అగ్నిపురాణము అసాధువు, అప్రయుక్తము, ఛాందసత్వము, గూఢార్థము, విపర్యస్తార్థము, సంశయితార్థము, కష్టత్వము, గ్రామ్యత - అన్న దోషములను పరిగణించినది. ఛాందసత్వమే భోజుని అప్రతీతము. విపర్యస్తార్థమే అన్యార్థకము. గ్రామ్యత్వమును అగ్నిపురాణము వచనాత్, స్మరణాత్, సామ్యాత్ – అని మూడు విధములు చేయగా భోజుడు అశ్లీలము, అమంగళము, ఘృణావంతము అన్న మూడు ప్రాతిపదికలమీద వచనాత్, స్మరణాత్, సామ్యాత్ – లక్షణములుగా మూడేసి భేదములు పరిగణించెను. ఇచ్చట భోజు డగ్నిపురాణము నాధారము చేసికొని గ్రామ్య భేదములను పెంచి వ్రాసినట్లు స్పష్టము. క్రియాభ్రంశము, విసంధి, పునరుక్తత, వ్యస్తసంబంధిత, విరుద్ధత — అన్న అగ్నిపురాణదోషములను అశరీరము, విసంధి, పునరుక్తిమంతము — అని గ్రహించెను. వ్యస్తసంబంధితయే వ్యాకీర్ణ, వాక్యసంకీర్ణము లయ్యెను. విరుద్ధత పేరున కన్పే నిలిచినను ప్రత్యక్షానుమానాగమప్రమాణములను మూడింటి నాధారము చేసికొని తొమ్మిది భేదములు పొందినది. అనర్థక, క్లిష్ట, నేయార్థములు భామహవామనాకరములు. అపుష్టార్థము, అసమర్థము, దేశ్యము – రుద్రటాకరములు. అరీతిమంతమ్ము భోజకల్పితము. గుణవిపర్యయము దోష మగుననుట కిది జ్ఞాపకము. శబ్దప్రధాన విపర్యయములు – 1. శ్లేష × శైథిల్యము 2. సమత × విషమత 3. సౌకుమార్యము × కఠోరత. అర్థప్రధాన విపర్యయములు – 1. ప్రసాదము × అప్రసన్నము 2 అర్థవ్యక్తి × నేయార్థము 3. కాంతి × గ్రామ్యము ఉభయప్రధాన విపర్యయములు – 1. ఓజస్సు × అసమస్తము 2. మాధుర్యము × అనిర్వ్యూఢము 3. ఔదార్యము × అనలంకారము.

దండి కూడ విపర్యయమువలని దోషములను తెల్పెను. శైథిల్యము విషయమున తక్క, తక్కిన అన్నియెడల భోజప్రణాళిక భిన్నముగా నున్నది. భోజుని అపార్థ, వ్యర్థ, ఏకార్థ, అపక్రమ దోషములకు భామహుడు దోహదము చేసెను. భిన్న, పరుష దోషములు భోజకల్పితములు. అతిమాత్రము, విరలంకారము, విరసము రుద్రటుని నుండి గృహీతములు. రుద్రటుడు అప్రస్తుత రసమును విరసముగా

పరిగణించుటతోపాటు ప్రకృత రసమునకు అతివృద్ధినికూడ విరసదోషముగానే పరిగణించెను. భోజుడు అప్రస్తుత రసత్వమునే విరసముగా గ్రహించెను.

ఇక్కడ ఇంకొక విషయమును చూడవలయును. అనుమాన విరోధమునందు ఔచిత్యవిరోధము నొక ప్రభేదముగా పరిగణించెను. విజమునకు దోషములన్నియు విరోధము నాశ్రయించుకొనియో, అనౌచిత్యము నాశ్రయించుకొనియో పుట్టుచున్నవి. ఆ విరోధము పరిహృతమైనయెడల, అనౌచిత్యము తొలగినయెడల దోషము తొలగిపోవును. కావుననే దోషములను నిత్యదోషము లని, అనిత్యదోషము లని విభజించుట కానవగును. నిజమునకే దోషముకూడ నిత్యదోషము కాదు. పాత్రాద్యౌచిత్యముచేత దోషముకూడ గుణమే యగును.

పై వివి చూచినట్లు గుణవిపర్యయము దోషమైనట్లు, దోషవిపర్యయము గుణమగునా ? ఈ ప్రశ్న యొకటి తలయెత్తక తప్పదు. భరతుడు నాట్యశాస్త్రమునందు 'నాటకాశ్రయములయిన యీ దోషములను పండితులు తెలిసికొనవలయును. వీనికి విపర్యస్తములయిన గుణములు కావ్యములందు కీర్తితములు' అని పలికెను. (ఏతే దోషాస్తు విజ్ఞేయాః..... విపర్యస్తా గుణాః). వామనుడుకూడ 'గుణవిపర్యయాత్మానో దోషాః' అని వచించెను. పై నిర్వచనములనుబట్టి గుణవిపర్యయమే దోషమని, దోషవిపర్యయమే గుణమని అనిపించును. కొన్నియెడల అట్లగుట సత్యమేకాని, అది సార్వత్రికము కాదు. కావ్యమునందు గుణదోషముల ప్రవృత్తిని గుర్తించినప్పుడే వాని లక్షణము బోధపడును.

అగ్నిపురాణము 'ఉద్వేగజనకో దోషః సభ్యానా'మ్మని సభ్యులకు ఉద్విగ్నతను కలిగించునట్టి దోషమని నిర్ణయించెను. 'యః కావ్యే మహతీం ఛాయా మనుగృహ్ణాత్యసౌ గుణః' అని కావ్యమునందు గొప్ప సౌందర్యమును గలిగించునది గుణమని స్పష్టముచేసెను. ఇంతేకాక 'న చ వాచ్యం గుణో దోషాభావ ఏవ భవిష్యతి । గుణాః శ్లేషాదయో దోషా గూఢార్థాద్యాః పృథక్కృతాః' అని సందేహనివృత్తిని గావించినది. దోషము లేకపోవుటయే గుణమని చెప్పరాదు. శ్లేషాదులు గుణములు గూఢార్థాదులు దోషములు. ఇవి భిన్నములు. ఇట్లనుటచేత గుణములును దోషములును స్వతంత్రము లన్న విషయము స్పష్టమైనది.

దండి 'దోషా విపత్తయే తత్ర గుణాః సంపత్తయే తథా' అని 'దోషములు విపత్తికి, గుణములు సంపత్తికి' అని తెల్పెను. వామనుడు 'కావ్యశోభాయాః కర్తారో

హేతవ స్త్యాగాయ దోషా జ్ఞాతవ్యాః' అని 'కావ్యసౌందర్య విపత్తికి కారణములు దోషములు, వానిని విడిచిపెట్టుటకై తెలిసికొనవలయును' అని చెప్పెను. అనంతరులుకూడ ముఖ్యార్థహతిని కలిగించునని, అభిమతార్థప్రతీతి కవరోధమగునని, రసోత్పత్తి ప్రతిబంధకమని, కావ్యాపకర్ష హేతువని దోషమునుగూర్చి తెల్పిరి. భోజుడు దోషము హేయమని చెప్పెనే కాని, దోషమువలని నష్టమును కంఠోక్తిగా చెప్పుట కానరాదు.

నాట్యశాస్త్ర కర్త పది గుణములను పరిగణించెను. అవి యివి__

'శ్లేషః ప్రసాదః సమాధి స్సమతా
మాధుర్య మోజః పదసౌకుమార్యమ్
అర్థస్య చ వ్యక్తి రుదారతాచ
కాంతిశ్చ కావ్యస్య గుణా దశైతే'

భామహుడు మాధుర్యము, ప్రసాదము, ఓజస్సు - అన్న మూడు గుణములను మాత్రమే తెలిపెను. దండికూడ భరతుడు చెప్పిన పదిగుణములనే పేర్కొనెను.

'శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి రుదారత్వ మోజః కాంతి సమాధయః'

వామనుడుకూడ పైనున్న పదిగుణములనే పరిగణించెను. 'విశిష్టా పదరచనా రీతిః విశేషో గుణాత్మా' అని వానికి విశిష్టతను సంపాదించెను. విశిష్టమైన పదరచనకు రీతి యనిపేరు. గుణములను కలిగియుండుటయే విశిష్టత. 'కావ్యాత్మ రీతి' యని పరిగణించిన వామనుడు గుణములను అవశ్యాంగములుగా పరిగణించుచున్నాడనుట స్పష్టము. అంతేకాక వీనిని శబ్దగుణములని అర్థగుణములని కూడ విభజించెను గుణములకు ఒకవైపు రసముతోను, మరొకవైపు పాకముతోను ముడివేసెను. అంతేకాక 'కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః' కావ్యశోభను కలిగించు ధర్మములు గుణములని, 'తదతిశయహేతవస్త్వలంకారాః' ఆశోభ అతిశయించుటకు హేతువులు అలంకారములని, గుణములకు అలంకారములకు నడుమనున్న భేదమును తెల్పెను. గుణములు నిత్యములని అవి లేనియెడల కావ్యమునకు శోభ కలుగదనికూడ నిర్ణయించెను. అలంకారములకంటె గుణములకే ప్రాధాన్యమొసగెను.

ఆనందవర్ధనుడు మాధుర్యము, ప్రసాదము, ఓజస్సు - అన్న మూడింటిని రసగుణములుగాను; శ్లేషాదులను శబ్దార్థగుణములుగాను పరిగణించెను. అభినవగుప్తుడు గుణములను, అలంకారములను కూడ చిత్రకర్మతో పోల్చి 'చిత్రకర్మ ప్రతిమ మలంకార గుణవివేశనమ్' అని వక్కాణించెను. అయినప్పటికిని అర్థగుణము నకు రసాభివ్యక్తి హేతుత్వము కలదని, 'వదనస్యేవ చంద్రః' అన్నట్లు వస్త్వంతర గ్రహణము అలంకారమని తెల్పెను. గుణశూన్యము కావ్యము కాదని, అలంకారము లేకపోయినను కావ్యము కావచ్చునని గుణప్రాధాన్యము నుగ్గడించెను.

భోజదేవుడు గుణవివేచనా ప్రారంభమునందే 'అలంకృత మపి శ్రవ్యం న కావ్యం గుణవర్జితమ్ । గుణయోగ స్తయోర్ముఖ్యో గుణాలంకార యోగయోః' (1-59) అని గుణాలంకార యోగములలో గుణయోగము యొక్క ప్రాధాన్యమును వెల్లడించెను. గుణ మెందువలన ముఖ్యమైనదో సరస్వతీ కంఠాభరణమునందు కంఠోక్తముగా ప్రసక్తము కాలేదు. లక్షణలక్ష్యములనుబట్టి యూహించుకొనవలసినదే. భోజదేవుడు గుణములను బాహ్యగుణములు, అభ్యంతరగుణములు, వైశేషికగుణములు-అని మూడు వర్గములుగా విభజించెను. ఇవియే శబ్ద అర్థ-దోషగుణము లని కూడ వాడుక నొందినవి. ఇవి మరల ఒక్కొక్కటి యిరువది నాలుగు విధములు.

బాహ్యగుణములు : 1. శ్లేషము 2. ప్రసాదము 3. సమత 4. మాధుర్యము 5. సౌకుమార్యము 6. అర్థవ్యక్తి 7. కాంతి 8 ఉదారత్వము 9. ఉదాత్తత 10. ఓజస్సు 11. ఔర్జిత్యము 12. ప్రేయస్సు 13. సుశబ్దత 14. సమాధి 15. సూక్ష్మత 16. గాంభీర్యము 17. విస్తరము 18. సంక్షేపము 19. సమ్మితత్వము 20. భావికత్వము 21. గతి 22. రీతి 23. ఉక్తి 24. ప్రౌఢి.

అగ్నిపురాణకర్త శబ్దగుణములుగా శ్లేషము, గాంభీర్యము, సుకుమారత, ఉదారత – అనువానిని; అర్థగుణములుగా మాధుర్యము, ప్రౌఢి – అనువానిని; ఉభయగుణముగా ప్రసాదమును తెల్పెను. భోజాని గుణములలో ఏడు పురాణోక్తములే. భరతుడును దండియు చెప్పిన పది గుణములు కాక మిగిలినవానికి ఆకరములను అన్వేషింతము. గాంభీర్యము, ప్రౌఢి అగ్నిపురాణాకరములు.

ఔర్జిత్యము – గాఢబంధముండుట. ఇదేలక్షణమును వామనుడు 'గాఢ బంధత్వ మోజః' అని ఓజోగుణమునకు చెప్పెను. భోజుడు దండి ననుసరించి 'ఓజః సమాస

భూయస్త్వమ్' అని నిర్ణయించెను. కావున వామనుని లక్షణమును గ్రహించి 'ఔర్జిత్యము' అను గుణమును తాను స్వయముగా కల్పించెను.

ప్రేయస్సు - చాటూక్తియందుండెడి ప్రియతరాఖ్యానము. దండి ప్రేయోఽలంకారమునకు 'ప్రేయః ప్రియతరాఖ్యానమ్' అని లక్షణము చెప్పెను. భోజుడు దీని నలంకారముగా కాక గుణముగా నిర్ణయించు నభిప్రాయముతో ఇచ్చట చేర్చెను.

సుశబ్దత - 'వ్యుత్పత్తిః సుప్తిఙామ్' నామవాచక క్రియావాచకముల వ్యుత్పత్తి యే సుశబ్దత. వ్యాకరణానురూపములయ్యును, ప్రహతములుకాక నవనవోన్మేషయుతములయిన శబ్దముల నుపయోగించు నేర్పు సుశబ్దత. కావుననే భోజుడు దీనిని కావ్యగుణములలో చేర్చెను.

సూక్ష్మత - 'అంతస్సంజల్పరూపత్వం శబ్దానామ్' అని లక్షణము. ఇది భోజుని సృష్టియే. అంతస్సంవాదిత్వము గల పదములు మహోత్తమ భావమును సంగ్రహముగా చెప్పగలిగియుండును. పైకి నిర్విశిష్టముగా తోచినప్పటికి భావుకుని భావనకు పుష్టిని కూర్చు గుణముకలది సౌక్ష్మ్యగుణము.

విస్తరము - 'వ్యాసేనోక్తిః' విస్తరించి చెప్పుట యని యర్థము. వామనుడు 'అర్థస్య ప్రౌఢి రోజః' అని సూత్రించి 'పదార్థే వాక్యవచనం వాక్యార్థేచ పదాభిధా, ప్రౌఢి ర్వ్యాస సమాసౌ చ సాభిప్రాయత్వ మస్య చ' అని వివరించెను. 'పదార్థే వాక్యవచనం వ్యాసః' అన్నది ఒక భాగము. పదముయొక్క అర్థమును చెప్పుటకు ఒక వాక్యమునే చెప్పుట వ్యాసము. ఇచ్చటి వ్యాసశబ్దమునే గ్రహించి భోజదేవుడు 'వ్యాసేనోక్తిః' అని నిర్వచించెను. తక్కువ విషయమును విస్తరించి చెప్పుటకూడ ప్రౌఢియే. కావుననే భోజదేవుడు విస్తరగుణమును కల్పించెను.

సంక్షేపము - 'సమాసేనాభిధానమ్' సంగ్రహించి చెప్పుట యని యర్థము. ఇది పై విస్తరమునకు విపర్యయమయ్యు గుణమే యగుచున్నది. 'వాక్యార్థే చ పదాభిధా సమాసః' అని వామనుడు వాక్యార్థమును పదముచేత చెప్పుట సమాసముగా నిర్ణయించెను. ఇట్లు చెప్పుట ప్రౌఢియే. కావుననే భోజదేవుడు దీనినికూడ గుణవర్గమునందు పరిగణించెను.

సమ్మితత్వము - 'యావదర్థ పదత్వమ్' అర్థమునకు తగినంతమాత్రమే పదముండుట యని యర్థము. 'శబ్దార్థౌ సహితౌ' అన్నప్పుడే యీ సమ్మితత్వము

సంఖ్యావిత్రము. కాళిదాసు 'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే' అన్నప్పుడు సమ్మితత్వము అంతర్నిహితమై యున్నది. త్రాసునందలి సిబ్బెలు సమానముగా తూగినట్లు శబ్దమును అర్థమును హెచ్చుతగ్గులు లేకుండ తూగుటయే యిది. దీనిని గుర్తించి గుణముగా పరిగణించు శ్రేయము భోజునికి దక్కినది.

భావికత్వము - 'భావతో వాక్యవృత్తిః' భావవివశత్వముతో వచించుట యని యర్థము. గుణములు రసాంగములు_ ఆయా రసములకు భావములకు తగినట్లుగా వాక్యవృత్తి యుండుటయే భావికత్వము. దీనిని భోజుదేవుడే కల్పించెను.

గతి - 'క్రమో యః స్యాదారోహావరోహయోః' ఆరోహావరోహములక్రమ మని యర్థము. వామనుడు 'ఆరోహావరోహనిమిత్తం సమాధి రాఖ్యాయతే' అని సూత్రించి 'ఆరోహావరోహ క్రమః సమాధిః' అని వృత్తి వ్రాసెను. భోజు డీ లక్షణమునే గ్రహించి క్రొత్తపేరు పెట్టెను. వామనుని శబ్దగుణమైన సమాధియే 'గతి'యై సరస్వతీ కంఠాభరణమునందు స్థితి కల్పించుకొన్నది.

రీతి – 'ఉపక్రమస్య నిర్వాహః' మొదలుపెట్టిన రీతి (పద్ధతి)ని కొనసాగించుట యని యర్థము. వామనుడు 'మార్గాభేదః సమతా' అని సూత్రించి వృత్తియందు 'యేన మార్గేణోపక్రమః తస్య అత్యాగః ఇత్యర్థః' అని స్పష్టముచేసెను. ఇచ్చటి ఉపక్రమ పదమునే గ్రహించి భోజుడు రీతిగుణమును క్రొత్తగా నిర్మించెను.

ఉక్తి – 'విశిష్టా భణితిః' విశిష్టమయిన వచోభంగి యని యర్థము. చెప్పవలసిన విషయమును స్పష్టముగా వాచ్యముచేయుట సాధారణభంగి. అది నిత్య వ్యవహారమువందును, కావ్యవ్యవహారమునందును వినవచ్చునదే. ఇట్లుకాక ఒక విశిష్టతతో కూడిన భంగియే ఉక్తి యగును. కుంతకుని వక్రోక్తినే భోజరాజు ఉక్తి యనుపేర గుణములలో చేర్చెను. 'వక్రోక్తిరేవ వైదగ్ధ్యభంగీభణితి రిత్యుచ్యతే' అన్న కుంతకుని నుండి వైదగ్ధ్యభంగీ భణితిని గ్రహించి 'విశిష్టాభణితిః' అని భోజుడు మార్చెను.

ప్రౌఢి - 'ఉక్తేః ప్రౌఢః పరీపాకః'. ఉక్తియొక్క ప్రౌఢమైన పరిపక్వత యని యర్థము. ఇచ్చటి పాక శబ్దము సాహిత్యశాస్త్ర ప్రసిద్ధమైన సంజ్ఞ. వాక్య పరిపాకమునకు ప్రౌఢి యనిపేరు. ఈ ప్రౌఢిని నారికేళ సహకార మృద్వీకా పాకములలో దేనికేని అన్వయింపవచ్చును. పాకము సమర్థముగా నుండుటయే ప్రౌఢి.

వామనుడు అర్థగుణమైన ఓజస్సును తెల్పుచు ప్రౌఢి శబ్దమును వాడెను. దానికిని దీనికిని సంబంధము లేదు. ఇది భోజుని స్వతంత్ర సృష్టి.

వామనుడు తాను మొదటచెప్పిన పది గుణములనే శబ్దగుణములుగా, అర్థగుణములుగా వేరువేరుగా పరిగణించెను. భోజుడు తాను శబ్దగుణములుగా చూపిన యిరువది నాలుగింటినే వాక్యార్థగుణములుగా క్రొత్త నిర్వచనములతో క్రొత్త లక్ష్యములతో ప్రదర్శించెను.

శ్లేష – 'సంవిధానే సుసూత్రతా' సంవిధానమునందలి సుసూత్రత యని యర్థము. సంవిధాన మనగా కార్యనిర్వహణ విధాన మని భావము. వామనుడు 'ఘటనా శ్లేషః' అని సూత్రించి క్రమకౌటిల్యానుల్బణత్వోపపత్తియోగో ఘటనా' అని వివరించెను. అదే భావమును కంఠాభరణము వ్యక్తముచేయుచున్నది. లక్షణ రూపము మారినను గుణము క్రొత్తది కాదు.

ప్రసాదము – 'ప్రాకట్య మర్థస్య' అర్థమునకు ప్రకటత్వము కలుగుట యని యర్థము. వామనుడు 'అర్థవైమల్యం ప్రసాదః' అని సూత్రించెను. స్వచ్ఛత్వము ప్రకటత్వముకంటె భిన్నము. భోజుడు వృత్తియందు చెప్పినదానినిబట్టి 'అనుక్తస్య ప్రాకట్య మర్థస్య' అనికూడ గ్రహింపవలయును. వాచ్యము కాకపోయినప్పటికి ఇతర వర్ణననుబట్టి ప్రకట మగుటయే ప్రసాదలక్షణము. ఇది భోజుని సృష్టి.

సమత, సౌకుమార్యము, అర్థవ్యక్తి, కాంతి వామనుని లక్షణముల ననుసరించినవి.

భోజుని ఉదారత, ఉదాత్తత అన్న గుణములకు దండి ఉదాత్తాలంకారము ఆకరము. దండి 'ఆశయస్య విభూతేర్వా యన్మహత్త్వ మనుత్తమమ్ । ఉదాత్తం నామ తం ప్రాహు రలంకారం మనీషిణః' అని లక్షణము తెల్పెను. 'విభూతేర్మహత్త్వమ్' వేరుచేసి భోజుడు 'భూత్యుత్కర్షః ఉదారతా' అని ఉదారతను గుణముగా ప్రతిష్ఠించెను; 'ఆశయస్య మహత్త్వమ్' వేరుచేసి 'ఆశయస్య య ఉత్కర్ష స్తదుదాత్తత్వ మిష్యతే' అని ఉదాత్తతకు గుణప్రతిపత్తి కల్పించెను.

మాధుర్యము – 'క్రోధాదా వప్యతీవ్రతా' క్రోధము మున్నగువానియందు కూడ తీవ్రత్వము లేకపోవుట యని యర్థము. వామనుని మాధుర్యమునకు 'ఉక్తివైచిత్ర్యము' లక్షణము. కావున ఈ రెండింటికిని పోలిక లేదు. నాట్యశాస్త్రము 'సర్వా

వస్థా విశేషేషు దీప్తేషు లలితేషు చ । అనుల్బణత్వం చేష్టాయాం మాధుర్య మితి కీర్తితమ్' అని తెల్పినది. తీవ్రమైన దశయందుకాని, మృదువైన దశయందుకాని చేష్టారూపమున నుద్రేకమును చూపకుండుట మాధుర్యమని భావము. భోజుడు నాట్యశాస్త్ర ప్రభావముతో మాధుర్యమును కల్పించియుండును.

ఓజస్సు – 'స్వార్థ్యవసాయస్య విశేషోఽర్థేషు' కార్యములందు తన నిశ్చయముయొక్క విశేషమని యర్థము. సాధారమయిన స్వాత్మవిశ్వాసమునకే ఓజస్సు అనిపేరు. ఇది భోజకల్పితము.

ఔర్జిత్యము – 'రూఢాహంకార మౌర్జిత్యమ్' రూఢమైన అహంకారమే ఔర్జిత్యమని యర్థము. భామహుడు 'ఊర్జస్వి' యన్న యలంకారమునందు రూఢాహంకారమునే పొందుపరచెను. లక్షణము సుస్పష్టముగాలేదు. ఉదాహరణమిది – 'పార్థుని కొరకు తిరిగి వచ్చితివా? కర్ణుడు రెండుసార్లు ప్రయోగించునా? శల్యా! అని పాము తొలగింపబడినది.' నాగాస్త్రమును పార్థునిపైకి విడువగా అది గురితప్పినది. తిరిగి కర్ణుని చేరుకొన్నది. ఒకే యస్త్రమును రెండుమారులు ప్రయోగించుట కర్ణుని అహంకారమునకు ఆఘాతమే. కావుననే అతడు దానిని స్వీకరింపలేదు. ఈ యలంకారమే భోజుని ఔర్జిత్య గుణమునకు ఆకరమై యుండవచ్చును. దండి కావ్యాదర్శమునందు 'ఊర్జస్వి రూఢాహంకారమ్' అని యిదె లక్షణమును తెల్పెను.

ప్రేయస్సు - 'అర్థేష్వభీష్టతా' అర్థములయందలి అభీష్టత యని యర్థము. భామహుని ప్రేయోలంకారమే యిచ్చట ప్రేయోగుణమయినది. భామహుని లక్ష్యమిది – 'అద్య యా మమ గోవింద జాతా త్వయి గృహాగతే కాలేనైషా భవేత్ప్రీతిస్తవైవాగమనాత్పునః'. నీవు మాయింటికి వచ్చుటచేత ఈనాడు నాకు కలిగిన ప్రీతి మరల నీ యాగమనముచేత నాకు కలుగునుగాక – అని ప్రీతిప్రాప్తియందలి అభీష్టతయే యిందు వర్ణితము.

సుశబ్దత - 'అదారుణార్థ పర్యాయో దారుణేషు' దారుణములందు అదారుణార్థ పర్యాయములను వాడుట యని యర్థము. వామనుడు 'అపారుష్యం సౌకుమార్యమ్' అని సౌకుమార్యమును పేర్కొనెను. భోజుడు 'సుశబ్దత' పేరుతో అదే గుణమును పేర్కొనెను.

సమాధి – 'వ్యాజావలంబనమ్'. మిష యాధారముగా చేసికొనుట యని యర్థము. సమముగా ఆధానము చేయుట సమాధి. ఒక నెపమును కప్పుకొని ఒక పని నిర్వర్తించినట్లు చెప్పిన సమాధి యగును. ఇది భోజుని సృష్టి.

గాంభీర్యము, విస్తరము, సంక్షేపము, సమ్మితత్వము, భావికత్వము, గతి, రీతి, ఉక్తి, ప్రౌఢి - పూర్తిగా భోజకల్పితములు.

ఇప్పుడింక గుణములలో మూడవవర్గమైన వైశేషికగుణములను చూతము. భామహాద్యాలంకారికులు దోషప్రకరణమునందే కొన్ని దోషములు గుణములగుటను ప్రస్తావించి లక్ష్యములు ప్రదర్శించిరి భోజుడు వానిగురించి అచ్చట చెప్పకుండ, గుణవివేచన యందు విపులముగా చర్చించెను. దోషములే గుణములైనప్పుడు వైశేషిక గుణము లగును. పదదోషములు 24, వాక్యదోషములు 24, వాక్యార్థ దోషములు 24. వాని నన్నింటివి దోషదూరములను గావించి, యిచ్చట వైశేషిక గుణములుగా ప్రదర్శింపట జరిగినది. దోషములు దోషములైనప్పుడు హేయములు. కాని కవి తన ప్రతిభచేత, కౌశలముచేత దోషములనుకూడ గుణములుగా మార్చుకొని కావ్యసౌందర్యము ఇనుమడింపజేయగలుగును. పాత్రవిశేషమునుబట్టి, అవస్థా విశేషమునుబట్టి, స్థానకాల దేశాదికమునుబట్టి, అనుకృతినిబట్టి, మరి యెన్నో విధములుగా దోషములు నిర్దోషము లగును. భోజునివలె మరి యెవ్వరు నింత విస్తృతముగా దోషగుణములను గురించి తెలుపలేదు. భామహుడు, దండి, వామనుడు, రుద్రటుడు మున్నగువారి నుండి తన కుపయోగపడు లక్షణములను, కొన్నియెడల లక్షణశ్లోకములను, ఉదాహరణ పద్యములను కూడ ధారాళముగా గ్రహించెను. అయినప్పటికి భోజుడు ప్రదర్శించిన నిర్మాణమార్మికత్వము శ్లాఘనీయము. లక్షణ శ్లోకము (వాక్యము), లక్ష్యము, వృత్తి – అ గ్రంథమంతయు ముప్పేటగా అల్లుకొని యున్నవి. ఇక్కడ ప్రదర్శితములైనన్ని ప్రాకృత పద్యములు మరి యే అలంకారగ్రంథము నందును కానరావు. అకరములు తెలియని సంస్కృత ప్రాకృత పద్యము లెన్నో యిచ్చట నిక్షిప్తములై రక్షితములై యున్నవి. దండి వామనుల గ్రంథములలో పాదమో, పాదాంశమో యుండగా - భోజుడు పూర్తి పద్యమునే సాధారణముగా ప్రదర్శించును. వారి గ్రంథములనుబట్టి తానే పూర్తి పద్యములను రచించెనో! మూలగ్రంథములనుండి పూర్తిపద్యములను తా నుద్ధరించెనో! ఆ గ్రంథములు పెక్కులు అలబ్ధములు.

సరస్వతీ కంఠాభరణము తానిచ్చిన నిర్వచనమున కనుగుణముగా దోషములను గుణములను వివేచన చేసిన పిమ్మట అలంకార వివేచనను ప్రారంభించినది. బాహ్యములు, అభ్యంతరములు, బాహ్యాభ్యంతరములు నైన అలంకారములను శబ్దా

లంకారములని, అర్థాలంకారములని, ఉభయాలంకారములని పరిగణించెను. అందు శబ్దాలంకార వివేచనకు ద్వితీయపరిచ్ఛేదము పూర్తిగా వినియుక్తమయినది.

'యే వ్యుత్పత్త్యాదినా శబ్ద మలంకర్తు మిహ క్షమాః
శబ్దాలంకారసంజ్ఞాస్తే జ్ఞేయా జాత్యాదయో బుధైః'

అని శబ్దాలంకార నిర్వచనమును భోజుడు ముందుగానే చెప్పెను. శబ్దము నలంకరించుటకు సమర్థములైనవి శబ్దాలంకారము లని భోజ నిర్దేశము. శబ్దాలంకార మన్న సమాసము 'శబ్దమూలమయిన అలంకారము' అన్న వ్యుత్పత్తితోనే పెక్కుర వ్యవహారము నందున్నది. ఇందువల్లనే శబ్దపరివృత్తిని సహింపనివి శబ్దాలంకారములని, శబ్దపరివృత్తిని సహించునవి అర్థాలంకారములని వివేచనచేయుట కొన్నియెడల జరిగినది. 'అన్వయ వ్యతిరేక భావము' ఇచ్చట అనుసంధిత మగుచున్నది. ఇందు అలంకారము శబ్దమూలమై మరిదేనినో అలంకరించుచున్నది. ఇందున్న అసంబద్ధతను గుర్తించి కొందరు 'ఆశ్రయాశ్రయీభావము' నాశ్రయించిరి. ఆశ్రయము శబ్దమైనపుడు అది శబ్దాలంకార మగును; అర్థమైనపుడు అర్థాలంకార మగును. ఇచ్చట అలంకారమే ఆశ్రయి. దీనినిబట్టియే 'యద్వైచిత్ర్యత్వము' పొడచూపినది. కవి దేనికై తన ప్రతిభను ప్రదర్శించునో అదియే అలంకార భూమి. వైచిత్ర్యమే అలంకారము. ఇట్లు అలంకారశబ్ద నిర్వచనము భిన్నభూమికలను ధరించినది.

భోజుని నిర్వచనము స్పష్టముగా విశిష్టముగా నున్నది. 'శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ' అని విద్యానాథుని నిర్ణయము. శబ్దార్థములే తనువైనప్పుడు అలంకారములు తనువుకాక మరి దేని నలంకరించును? ఈ విషయమును విస్పష్టమయిన దృష్టితో చూచి, సమగ్రముగా సమాలోచనముచేసి చక్కని నిర్ణయము తీసికొన్నవాడు భోజదేవుడు.

సరస్వతీ కంఠాభరణమునందు 1. జాతి 2. గతి 3. రీతి 4. వృత్తి 5. ఛాయ 6. ముద్ర 7. ఉక్తి 8. యుక్తి 9. భణితి 10. గుంఫన 11. శయ్య 12. పఠితి 13. యమకము 14. శ్లేషము 15. అనుప్రాసము 16. చిత్రము 17. వాకోవాక్యము 18. ప్రహేలిక 19. గూఢము 20. ప్రశ్నోత్తరము 21. అధ్యేయము 22. శ్రవ్యము 23. ప్రేక్ష్యము 24. అభినీతి– అని యిరువదినాలుగు శబ్దాలంకార భేదములు నిరూపితము లయినవి.

భరతుడు నాట్యశాస్త్రమునందు 'యమకము' నొక్కదానినే పేర్కొనెను. అదియే పది ప్రభేదములతో ప్రదర్శింపబడినది. భామహుడు అనుప్రాసను యమకమునకు జోడించెను. 'సౌశబ్ద్యము' అనుపేర మరొక శబ్దాలంకారమును పేర్కొని 'అతిశేతే హ్యలంకార మన్యం వ్యంజనచారుతా' అని వ్యంజనచారుత్వమే యితరాలంకారముల నతిశయించునని ప్రకటించెను. అంతేకాక రూపకాదులను బాహ్యాలంకారము లని, సౌశబ్ద్యమునే అంతరాలంకార మని ప్రకటించెను. (భోజుని వర్గీకరణము దీనికి విరుద్ధము). మొత్తముమీద భామహుడు శబ్దాలంకారములను మూడింటిని మాత్రమే పరిగణించె ననుట స్పష్టము. దండి సౌశబ్ద్యమునుగురించి ప్రస్తావింపలేదు. అనుప్రాస, యమకము, చిత్రము అన్న మూడింటిని శబ్దాలంకారములుగా పరిగణించెను. ఉద్భటుడు పునరుక్తవదాభాస మన్న శబ్దాలంకారమును చేర్చెను. శ్లేషను శబ్దాలంకారముగా కూడ పరిగణించెను. పూర్వులం దింత పరిమితముగా నున్న శబ్దాలంకారములు భోజుని సృష్టిలో పరిణతములై సంఖ్యను పెంచుకొన్నవి.

భోజుడు చూపిన శబ్దాలంకారముల పేరులు కొన్ని సాహిత్యశాస్త్రమందు పరిచితములే. యమకము, శ్లేషము, అనుప్రాసము, చిత్రము – అన్నవి పైని ప్రసక్తములయిన శబ్దాలంకారములే. జాతి స్వభావోక్తికి పర్యాయముగా కొందరి కిష్టము. రీతి, వృత్తి కావ్యాంగములుగా ప్రసిద్ధములు. గతి, ఉక్తి గుణములుగా ఇందే చెప్పబడినవి; ఉక్తి నిర్వచనమున భణితి ప్రయుక్తము. పదచ్ఛాయ, పాదచ్ఛాయ మున్నగు విధముగా అన్యకవుల అనుకరణమును చెప్పునప్పుడు ఛాయాశబ్దమునకు ప్రయోగమున్నది. పద్యమునందు కవి తన పేరునుగాని, వృత్తము పేరునుగాని, కృతిభర్త పేరునుగాని యిముడ్చును. ఇది ముద్రాలంకార మనిపించుకొనుచున్నది. శయ్య పదముల అన్యోన్యమైత్రికి సంజ్ఞ. కాని యిచ్చట జాత్యాది పదములు భిన్నార్థములలో, విశిష్టముగా ఉపయుక్తము లయినవి. ఇప్పు డొక్కొక యలంకార విశేషమును పరిశీలింతము.

1. జాతి – ఇది భాషౌచిత్యము నాధారము చేసికొన్నది. శుద్ధ, సాధారణీ, మిశ్ర, సంకీర్ణ, అనన్యగామిని అని ఆరువిధములు. శుద్ధ సంస్కృత, ప్రాకృత, మాగధ, పైశాచీ, శౌరసేన్యపభ్రంశములుగా ఆరుభేదములు కలిగి సంస్కృత ప్రాకృతాది భాషల కేకరూపత యున్నది సాధారణి. ఇది అనంత భేదములను కలిగి యుండవచ్చునని తెల్పి, సంస్కృతప్రాకృతములకును, సంస్కృత పైశాచికముల కును లక్ష్యములు ప్రదర్శించెను. భిన్నభాషలను ఒకే పద్యమునందు నరసింహా

రూపకమువలె వాడిన మిశ్ర. భిన్నభాషలను తిలతండులములవలె కలిపి వాడిన సంకీర్ణ. సగము సంస్కృతములో తెల్పి మిగిలిన సగమును ప్రాకృతములో పూరకముగా చెప్పినయెడల అనన్వగామిని. అపశబ్దములతో కూడిన భాష అపభ్రష్ట. ఇది అను కరణమందు జాతిభేదముగా అలంకారమగును. ఈ సందర్భముననే గ్రంథకర్త భిన్నరచనలకు, భిన్నదేశీయులకు, భిన్నావస్థలకు ఇష్టములయిన యోగ్యములయిన భాషలను నిర్ణయించెను.

2. గతి – అర్థౌచిత్యాదులనుబట్టి పద్యగద్య మిశ్రమైన కావ్యప్రక్రియ గత్యలంకార మగును. ఆదిశబ్దముచేత రూపౌచిత్యము, పాత్రౌచిత్యము, విషయౌచిత్యము మున్నగు వానినికూడ గ్రహింపవలయును. ఒక విషయమును పద్యమునందు తెల్పినపుడే శబ్దములు పొందికగానుండి అందము నొందును. ఒక సంభాషణము గద్యమునందే పొందికగానుండి శబ్దములకు సౌందర్యము సంధానించును. కొన్ని యెడల చంపువే యింపుగా నుండి శబ్దములకు సొంపులు దిద్దును. కావుననే 'యథా మతి యథాశక్తి యథౌచిత్యం యథారుచి। కవేః పాత్రస్య చైతస్య ప్రయోగ ఉప పద్యతే' అని భోజుడు నిర్ణయించెను.

'గమనము' అన్న అర్థమునుబట్టి భోజుడు గత్యలంకారమును 1. ద్రుత 2. విలంబిత 3. మధ్య 4. ద్రుతమధ్య 5. ద్రుతవిలంబిత 6. మధ్యవిలంబిత – అని ఆరువిధములుగా పరిగణించెను. కొన్ని కావ్య ఛందస్సులు కొన్ని గతుల యందే నడచును. కావున ఛందౌచిత్యము నాధారము చేసికొనియే యీ విభాగము సాగినది. గద్యమునందు, చంపువునందుకూడ గతిని గమనింపవచ్చును. కవి ప్రతిభా కుతూహలములే గతికి హేతువులు. సందర్భమును పురస్కరించుకొని గ్రంథకర్త వృత్తజాతి భేదములను, గద్యభేదములనుకూడ వ్రాసెను.

3. రీతి – కావ్యాంగముగా ప్రసిద్ధమయిన రీతినే భోజుడు శబ్దాలంకారముగా పరిగణించుచున్నాడు. 'విశిష్టాపదరచనా రీతిః' అన్న వామనుని నిర్వచనము భోజునికి సమ్మతమే. వైదర్భి, గౌడీయ, పాంచాలి – అని మూడు రీతులనే పేర్కొనెను. భోజుడు రుద్రటుని నుండి 'లాటీయ'ను గ్రహించి అవంతి, మాగధి – అని మరి రెండు తాను కల్పించెను. వామనుడు చూపిన నిర్వచనములనే తన ప్రణాళిక కను కూలముగా సవరించి ప్రదర్శించెను. మిగిలినవాని నిర్వచనములను తాను కల్పించెను.

4. వృత్తి – కావ్యాంగముగా ప్రసిద్ధమయిన వృత్తినే భోజుడు శబ్దాలంకారముగా పరిగణించుచున్నాడు. మనస్సుయొక్క వికాసమునందును, విక్షేపమునందును, సంకోచమునందును, విస్తరమునందును వర్తింపజేయునది వృత్తి అని భోజుని నిర్వచనము. 'వర్తయతే ఇతి వృత్తిః' అన్న వ్యుత్పత్తిని గ్రహించినట్లు స్పష్టము. భరతుడు రసోచితమైన అర్థవ్యవహారమును వృత్తియని తెల్పి కైశికి, ఆరభటి, భారతి, సాత్త్వతి అని నాలుగు భేదములను తెలుపగా భోజుడు మధ్యమారభటి, మధ్యమ కైశికి అని మరి రెంటిని చేర్చెను. సుకుమారార్థ సందర్భము కలది కైశికి. ప్రౌఢార్థసందర్భము కలది ఆరభటి. సుకుమారార్థము కలిగి కోమలప్రౌఢసందర్భముకలది భారతి. ప్రౌఢార్థము కలిగి కోమల ప్రౌఢసందర్భము గలది సాత్త్వతి. సుకుమారార్థము కలిగి ప్రౌఢసందర్భము కలది, ప్రౌఢార్థము కలిగి సుకుమార సందర్భము కలది – ఏమి కావలయును? ఈ ప్రశ్నకు సమాధానముగానే మధ్యమకైశికీ, మధ్యమారభటీ వృత్తులు కల్పితము లయినవి. 'అర్థసందర్భ'మని నిర్వచనమునందు భోజుడే చెప్పుచుండుటచేత, 'అయినచో అర్థాలంకారములు కావలయును కాని శబ్దాలంకారము లగుట యెట్లు?' అని ఒక ప్రశ్న. అర్థము వేరు. సందర్భము వేరు. శబ్దరచనకే సందర్భమనిపేరు. ఆయా యర్థము లాయా సందర్భముల నందగింపజేయుటచేతనే వృత్తి శబ్దాలంకార మగుచున్నది.

5 ఛాయ – 'అన్యోక్తీనా మనుకృతి శ్ఛాయా' అని నిర్వచనము. అనుకరణౌచిత్యమే దీని కాధారభూమి. లోకోక్తులనగా సామెతలని, జాతీయము లని అర్థము. అట్టి లోకోక్తులను కావ్యమునం దనుకరించిన లోకోక్తిచ్ఛాయ యగును. అనంతంకాలమున లోకోక్తియే యలంకారముగా ప్రతిష్ఠనొందినది. ఛేకు లనగా పండితులు. పాండిత్య సంపన్నమైన ఉక్తి ఛేకోక్తి. దానిని కావ్యమునం దనుకరించిన ఛేకోక్తిచ్ఛాయ యగును. అనంతరకాలమున ఛేకోక్తికూడ ప్రత్యేకముగా అలంకారముగా ప్రతిష్ఠ నొందినది. ఇంక మిగిలినవి అర్భకోక్తి, ఉన్మత్తోక్తి, పోటోక్తి, మత్తోక్తి అనువాని కనుకరణములు. ఇవికూడ తరువాతికాలమున స్వభావోక్తిగా సమారూఢము లయినవి.

6. ముద్ర – 'సాభిప్రాయస్య వాక్యే యద్వచసో వినివేశనమ్' అని నిర్వచనము. వాక్యమునందు సాభిప్రాయమైన వాక్కును వినివేశముచేయుట అని అర్థము. కవినామాది వినివేశమునకు ముద్ర యన్నపేరు ప్రసిద్ధముగా నున్నదే. అనంతరకాలమున అది ముద్రాలంకారముగా రూఢమయినది. భోజుడుకూడ అదే యభిప్రాయ

ముతో 'ముద్ర' అని వాడెను. కాని యిచ్చట కవినామాదికము కాక సాభిప్రాయ వచనము వివివిష్టము కావలయునని చెప్పుట విశేషము. ముద్రాలంకారముకూడ పద, వాక్య, విభక్తి, వచన, సముచ్చయ, సంవృత్తిభేదములచేత ఆరువిధములు. ఇచ్చట ముద్రాలంకారము ధ్వనిభేదములనే వెల్లడించుచున్నదని రత్నేశ్వరుడు తన వ్యాఖ్యయందు తెల్పెను. భోజుడే తనవృత్తియందు 'గౌణవృత్తివ్యపాశ్రయేణ' 'సాభిప్రాయ సంవృతికరణాత్' మున్నగు విధముగా ధ్వని సంబంధమును తెలియ జేసెను. అయినప్పటికి వింతటి యభిప్రాయము వాక్యగర్భమునం దిమిడింపబడి తదస్తిత్వవిలయములైన పదవాక్యాదులకు సౌందర్యమును నందించుచున్నది కావున శబ్దాలంకారమే యని భోజహృదయము.

7. ఉక్తి - దీనికి 'వాక్కు' అని మాత్రమే యర్థము స్వభావోక్తి, వక్రోక్తి, గూఢోక్తి, ప్రౌఢోక్తి మొదలయిన యలంకారములలోని శబ్ద మిదే. భోజుడు విధి, నిషేధము, అధికారము, వికల్పము, నియమము, పరిసంఖ్య- అన్నవి ప్రాతిపదికలుగా ఉక్తిని ఆరువిధములుగా పరిగణించెను. విధి, నియమ, పరిసంఖ్యలు మీమాంసా శాస్త్రమునుండి గృహీతములు. ప్రతిషేధము భరతుని షట్త్రింశల్లక్షణములనుండి యిచ్చట నిషేధముగా చేరినది. అనంతరకాలమున విధి, ప్రతిషేధము, వికల్పము, పరిసంఖ్య - అన్నవి స్వతంత్రముగా అలంకారము లయినవి.

8. యుక్తి – 'యోజయతీతి యుక్తిః' అన్న వ్యుత్పత్తినిబట్టి కలుపునది యుక్తి యగుచున్నది. యోగములేనివానికి యోగము కల్పించుట యిచ్చట ఉద్దిష్టము. పదయుక్తి, పదార్థయుక్తి, వాక్యయుక్తి, వాక్యార్థయుక్తి, ప్రకరణవిషయ యుక్తి, ప్రబంధవిషయయుక్తి - అని ఆరు విధములు. పదయుక్తియందు యోగ రూఢి పరంపర, పర్యాయపరంపర, హేతుపరంపర, అంగాంగిభావపరంపర - అని నాలుగంగములు తెలుపబడినవి. పదార్థయుక్తియందు విరుద్ధజాతియోజన, విరుద్ధ క్రియాయోజన, విరుద్ధగుణయోజన, విరుద్ధద్రవ్యయోజన - అని నాలుగంగములు తెలుపబడినవి. వాక్యయుక్తియందు వాక్యగర్భము, వాక్యనిగర్భము, వాక్యసంవృత్తి, వాక్యసముచ్చయము - అని నాలుగంగములు గలవు. వాక్యార్థయుక్తియందు క్రియా సముచ్చయము, క్రియాభ్యాసము, క్రియాసమభిహారము, యత్తదుపాదానము - అని నాలుగంగములు కలవు ప్రకరణప్రబంధయుక్తులకు అంగములు తెలుపబడలేదు.

9. భణితి – సాధారణముగా ఉక్తి అన్నయర్థమునందే భణితి అని వాడుట ప్రచురము. సంగీతమునందుకూడ భణితిశబ్దము వినిపించును. భోజుడు 'ఉక్తి ప్రకారో భణితిః' అని నిర్వచించెను. వచనభంగికి అనగా భంగ్యంతరమైన ఉక్తికే భణితి యని పేరు. ఇది సంభవభణితి, అసంభవభణితి, విశేషభణితి, సంవృతి భణితి, ఆశ్చర్యభణితి, కల్పనాభణితి – అని ఆరువిధములు. అసంభవమును సంభవముగా చెప్పిన మొదటి దగును. అసంభవమును కల్పనము జోడించి అసంభవమని చెప్పిన రెండవ దగును. విశేషసందర్భమునుబట్టి నిషిద్ధమును విహితము చేసిన మూడవదగును. విస్తృతవర్ణన చేయవలసినచోట సంవృతిచేసిన నాలుగవ దగును. విరుద్ధ కథనమున్నయెడల ఐదవదగును. లేనిదానిని కల్పించుకొని పల్కినయెడల ఆరవది యగును. ఇవన్నియు ఉక్తి వక్రతనే సూచించుచున్నవి.

10. గుంఫన – వాక్యమునందు శబ్దార్థముల సమ్యగ్రచన యని నిర్వచనము. రచన యనగా కూర్పు. ఇది శబ్దగుంఫన, అర్థగుంఫన, క్రమగుంఫన, పర్యాయ గుంఫన, పదగుంఫన, వాక్యగుంఫన –అని ఆరువిధములు. అన్నింటియందు ఆయా విశేషములను కూర్చుటలోని నేర్పువల్లనే అలంకారత్వము సిద్ధించుచున్నది.

11. శయ్య - పదార్థముల ఘటనయందలి సంబంధ మని నిర్వచనము. ప్రక్రాంతము, అప్రక్రాంతము, అతిక్రాంతము, పదము, వాక్యము, ప్రకీర్ణము –అని ఆరుభేదములు. ప్రకరణానుగమైన ఘటనను నిబద్ధముచేయుట ప్రక్రాంతఘటనా శయ్య. ప్రకరణముతో సంబంధము లేనిది అప్రక్రాంతము. ఎప్పుడో జరిగిపో యినది అతిక్రాంతము. భిన్నములయిన అక్షరముల ననుసంధించుట పదఘటనా శయ్య. శాస్త్రవాక్యముతో ఏ సంబంధమును లేని ప్రకృతార్థమునకు సంబంధమును సంఘటించుట వాక్యఘటనాశయ్య. ఒకచోట నుండుటకు వీలుకాని, ఒకకాలమున నుండుటకు వీలుకానివాని నొకచోట కల్పనాత్మకముగా చేర్చి పలుకుట ప్రకీర్ణఘటనా శయ్య. శయ్య భూత భవిష్యద్వర్తమాన సంఘటనలను కావ్యమునందు పొందు పరిచెడి రీతిని మొదటి మూడు భేదములందును తెల్పుచున్నది. పదఘటనాశయ్య భిన్నవ్యక్తులు భిన్నముగా పలికిన అక్షరములతో పదమును సాధించి సంఘటనోచిత సమన్వయము సాధించుటను తెల్పుచున్నది. అది కొంత చిత్రకవితారీతిలో అంత ర్భవించునదేయైనను సంభాషణాదులలో సముపాదేయమై చమత్కారావహమగును. దృశ్యకావ్యములందు పదఘటనాశయ్య కవకాశము ఎక్కువ. సామాన్య వ్యవహార

మును శాస్త్రవాక్యముతో సమర్థించుట ఒక చమత్కారము. కావుననే వాక్యఘటనా శయ్యయై అలంకారస్థానము నందుకొన్నది.

12. పఠితి – 'పాఠ ఏవ పఠితిః' పఠనమునకే పఠితి యనిపేరు. ఇది కాకువు, స్వరము, పదచ్ఛేదము, పదభేదము, అభినయము, కాంతి – అనువానితో కూడి ఆరుభేదములగును. ఇందలి కాకువు, స్వరము, పదచ్ఛేదము భరతుని నాలం బనముగా చేసికొన్నవి. అభినయము రుద్రటాకరము ఒక యర్థమునందున్న వాక్యము కాకుభేదముచేత అర్థాంతరము నిచ్చునట్లు చదివిన కాకుపఠితి యగును. స్వరము హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని మూడువిధములు. దీర్ఘమును ప్లుత ముగా కాని, హ్రస్వమును దీర్ఘముగా కాని మార్చి చదువుటచేత అర్థాంతరము కలి గినయెడల స్వరపఠితి యగును. వాక్యమునం దొకచోట పదచ్ఛేదము చేయవలసి యుండగా, మరియొకచోట చేయుటచేత అర్థాంతరము కలిగినయెడల పదచ్ఛేదపఠితి యగును. ఇది సభంగశ్లేషకూడ కావచ్చును. పదచ్ఛేద మందు పదము పదము గానే ఛేదింపబడును. సభంగశ్లేషయందు పదాంశములుకూడ ఛిన్నములు కావచ్చును, ఇచ్చట అట్టి యవకాశములేదు. పైగా శ్లేషయందు అనేకపదములు భిన్నములు కావచ్చును. పఠితియందు వాక్యాన్వయమునకు వీలుగా ఏదో యొక మాటకడనే విరుచుట జరుగును. ఈ భేదములనుబట్టియే పదచ్ఛేదపఠితి ప్రత్యేకతను పొందు చున్నది. నాలుగవది పదభేదపఠితి. పదచ్ఛేదమునందలి భేదమువల్ల పదభేదము కలిగి అర్థాంతరము నొసగినయెడల పదభేదపఠితి యగును. గ్రంథకర్తయే 'ఇయం శ్లేషోపసర్జనాత్ పదభేదపఠితిః' అని తెలిపెను. అనగా ఇందు శ్లేషయున్న దని అంగీకరించుటయే. అయినప్పటికిని పఠితికే ప్రధానత్వముండుటచేత పదభేద పఠితి యని పరిగణించుచున్నాడు.

తరువాతిది అభినయపఠితి. అభినయ యుక్తముగా చదివినప్పుడే కొన్ని పదముల యర్థము స్పష్టమగును; అట్లుకానియెడల స్పష్టముకాదు. అప్పుడు అస్పష్టత యన్న దోషము కలుగును. ఇంతలు, అంతలు – మున్నగు మాటలు అభినయసాపేక్షకములు. ఇందే 'అపదేశ' మన్న అవాంతరభేదమును భోజుడు చెప్పుచున్నాడు. 'అపదేశము' అనగా మాట పుచ్చుకొనుట యని యర్థము. అస్మ చ్ఛబ్దమునకు బదులుగా ఏతచ్ఛబ్దముగాని తత్తుల్యముగా 'ఇతః' మొదలయినవానిని గాని వాడుట అపదేశము. ఇట్టియెడల అభినయమే భావగ్రహణమునకు సహకరించును.

చివరిది కాంతి ప్రకృతి. భిన్నపదములందలి వర్ణములు వినిమయమునొంది అర్థాంతరమునకు సహకరించినప్పు డిది యగును. వినిమయమువల్ల కలిగి ఉజ్జ్వలత్వమే దీని కీపేరు పెట్టుచున్నది.

కొందరు పద, పాద, పద్యార్ధ, పాదత్రయ, భాషాభేదముచేత పూర్వపద్యమును మార్చుచేయుటకే ప్రకృతి యని పేరుపెట్టిరి. భోజుడు పదభేదమునందే విభక్తి భేదమునుకూడ చేర్చెను. కావున, ఇదికూడ ఆరు భేదములను పొందిన ట్లయినది. ఈ భేదములు చిత్రకవితా విభాగమునకు చెంది చమత్కారజనకము లగుచున్నవి.

13. యమకము – 'విభిన్నమైన అర్థముకలిగి, ఒకే విధమైన రూపముగల వర్ణసమూహముయొక్క ఆవృత్తి' యని లక్షణము. నాట్యశాస్త్రమునందే యమకము పదిభేదములతో ప్రసక్తమయినది. దండి, వామనుడు మున్నగువారు యమకభేదములను బాగుగానే ప్రదర్శించిరి. యమకము అవ్యపేత వ్యపేతభేదముచేత రెండు విధములు. స్థానయమకము, అస్థానయమకము అని మరల రెండువిధములు. పాదముల నియమమునుబట్టి మరల వైవిధ్యము. స్థూలసూక్ష్మములని, స్వభేదాన్యభేదములని మరల వింగడింపు గలదు. ఇన్ని భేదములు నిర్దిష్టములైనప్పటికి అవ్యపేతయమకము, వ్యపేతయమకము, అస్థానయమకము, పాదయమకము, సముద్గయమకము, మహాయమకము – అన్న యారింటిని ప్రధానభేదములుగా పరిగణింపవచ్చును. ఒక్కొక్క అవాంతరభేదమునకు ఒక శ్లోకముచొప్పున అరువదియొక్క శ్లోకములను ఈ ఘట్టమునందు భోజు డుదాహరించెను. వీనినిబట్టి భోజుని విశ్లేషణ విశిష్టతను, యమక నిష్ఠమైన ఆసక్తిని గమనింపవచ్చును.

14. శ్లేష – 'ఏకరూపమైన వాక్యముచేత రెండర్థములను తంత్రముతో చెప్పుట' అని లక్షణము. దండి శ్లేషాలంకారమును పేర్కొని అభిన్నపదశ్లేష (అభంగశ్లేష) యని భిన్నపదశ్లేష (సభంగశ్లేష) యని రెండు విధములుగా పరిగణించెను. శ్లేష యితరాలంకారములకు అంగభూతముగా వర్తించునని తెల్పి ఉదాహరణములు ప్రదర్శించెను. రుద్రటుడు శబ్దాలంకారములలో శ్లేషను పరిగణించెను. అర్థాలంకారములందుకూడ పరిగణించెను. ఉద్భటుడుకూడ అట్లేచేసెను. రుద్రటుడు ప్రకృతి, ప్రత్యయము, విభక్తి, వచనము, పదము, భాష, వర్ణము, లింగము – అన్న యెనిమిదంశములనుబట్టి శ్లేషను విభాగించెను. భోజుడు లింగమును ప్రకృతి శ్లేషయందును, వర్ణమును పదశ్లేషయందును అంతర్భవింపజేసి శబ్ద : షడ్వాశిక

ఖ్యానము 9. క్రియాభీక్ష్ణ్యము – మున్నగువానినిబట్టి నామము పునరుక్తము కావచ్చును. అప్పుడది దోషము కాక అలంకార మగును.

లాటానుప్రాసము 1. వ్యస్తము 2. సమస్తము 3. సమస్తవ్యస్తము 4. వ్యస్తసమస్తము 5. చక్రవాళము 6. గర్భము – అని ఆరు విధములు. మొత్తముమీద అనుప్రాస ప్రసంగమునందు తొంబదినాలుగు శ్లోకములు ఉదాహరణములుగా చూపబడినవి. 'అనుప్రాసలేశమైన నివేశితమైనయెడల ఉపమాద్యలంకారములు లేకపోయినప్పటికిని కావ్యపద్ధతి శోభించును. కుంకుమముచేత సర్వాంగీణముగా అంగరాగము సమకూర్పబడినయెడల, కర్ణాభరణాదులు లేకపోయినప్పటికిని కాంత శోభించుచునే యుండును' అని భోజుడు అనుప్రాసాలంకారముపట్ల తనకున్న ఆసక్తిని బయటపెట్టెను.

16. చిత్రము – దండి చిత్రాలంకారమునందు స్వరము, స్థానము, వర్ణము – అన్న ఆశ్రయములను మూడింటిని తెల్పెను. మరల వానిని ఏకస్వర, ద్విస్వర, త్రిస్వరాది భేదములుగా వింగడించెను. అట్లే స్థానవర్ణములనుకూడ వింగడించెను. భోజుడు పై మూడింటికి ఆకారము, గతి, బంధము – అని మూడింటిని చేర్చి ఆరు భేదములు పరిగణించెను. దండి చిత్రాలంకారమునందు చేర్పకయే ఈ మూడింటిని గూర్చి ముందే చెప్పెను. దండి నుండి గ్రహించినప్పటికి భోజుడు అనేక ప్రభేదములతో చిత్రాలంకారమును చిత్రించెను.

వర్ణచిత్రమున చతుర్వ్యంజనము, త్రివ్యంజనము, ద్వివ్యంజనము, ఏకవ్యంజనము, సర్వవ్యంజనము మొదలయిన విధముగా ఎనిమిది భేదములు లక్ష్యసమేతముగా చూపబడినవి.

స్థానచిత్రమునందు నిష్కంఠ్యము, నిస్తాలవ్యము, నిర్దంత్యము, నిరోష్ఠ్యము మొదలయిన విధముగా తొమ్మిది భేదములు సోదాహరణముగా చూపబడినవి.

ఆకారచిత్రమునందు అష్టదళము, చతుర్దళము, షోడశపత్రము, చక్రము, నామాంకము మొదలయిన విధముగా ఎనిమిది భేదములు చూపబడినవి.

గతిచిత్రమునందు గతప్రత్యాగతము, తదక్షరగతము, శ్లోకాంతరగతము, భాషాంతరగతము మొదలయిన విధముగా పదిభేదములు చూపబడినవి.

బంధచిత్రమునందు ద్విచతుష్కచక్రబంధము, ద్విశృంగాటకబంధము, వివిధితబంధము, శరయంత్రబంధము మొదలయినవి ఇరువది భేదములుగలవు.

17. వాకోవాక్యము – 'ఉక్తిప్రత్యుక్తిమద్వాక్యమ్' ఇరువురి నడుమ జరిగిన సంభాషణ మని యర్థము. ఇది 1. ఋజూక్తి (గ్రామ, ఉపనాగరిక) 2. వక్రోక్తి (నిర్వ్యూఢ, అనిర్వ్యూఢ) 3. వైయాత్యోక్తి (స్వాభావికి, నైమిత్తికి) 4. గూఢోక్తి (ముఖ్య, గౌణి) 5. ప్రశ్నోత్తరోక్తి (అభిధీయమానహృద్య, ప్రతీయమానహృద్య) 6. చిత్రోక్తి (చిత్ర, విచిత్ర) అని ఆరు విధములు. ఒక్కొక్కటి మరల రెండేసి అవాంతరభేదముల నొందినది. ఋజూక్తియందలి మొదటి భేదమునందు ఋజుత్వము మాత్రమే యున్నది. రెండవభేదమునందు కొంతగా కాకువు తోడ్పడినది. అయినప్పటికిని ఋజూక్తియే. వక్రోక్తియందు కాకువు చేతగాని, శ్లేషచేతగాని వక్రత సాధింపబడును. ఆ వక్రత చివరంట నున్నయెడల నిర్వ్యూఢ యగును; నడుమనే ఆగినయెడల అనిర్వ్యూఢ యగును. రుద్రటుడు వక్రోక్తిని ప్రత్యేకముగా ఒక యలంకారముగానే పరిగణించెను. దానికి శ్లేష వక్రోక్తి, కాకువక్రోక్తి యని రెండు భేదములు పరిగణించెను. అందుండి శ్లేష వక్రోక్తిని లక్ష్యశ్లోకముతోపాటుగా భోజుడు గ్రహించి వాకోవాక్యభేదముగా వియమించెను. భోజుడు కాకువక్రతను తగుమాత్రము ఋజూక్తియం దంగీకరించినట్లు చూచితిమి. రెండవభేదముకూడ శ్లేషవక్రోక్తియే ఇందలి వక్రత పరిమితము. వైయాత్యోక్తియందు కొంటెతనముగాని సిగ్గిడితనముగాని పనిచేయును. స్వభావ సిద్ధమైన వైయాత్యమువల్ల స్వాభావికి అన్నభేదము, ఏదో కారణముచేత తాత్కాలికముగా ఏర్పడిన వైయాత్యమువల్ల నైమిత్తికి అన్న భేదము కలుగును. గూఢోక్తియందు గూఢత్వమే ముఖ్యము. ఇరువురు మాటలాడునప్పుడు ఇరువురికి తెలియవలయును; తదన్యుల విషయమువనే గూఢత్వము. అక్షరలోపాదికమువల్ల సాధింపబడినది ముఖ్య. పూర్వప్రసంగము తెలియకపోవుటవల్ల అనంతర ప్రసంగము గూఢమైనయెడల గౌణి. అనంతరకాలమున గూఢోక్తి ప్రత్యేకమైన అలంకారముగా ప్రతిష్ఠ నార్జించుకొన్నది. ప్రశ్నోత్తరోక్తియందు వాచ్యార్థముచేతనే సమాధానము పృచ్ఛకునికి హృద్యమైనయెడల మొదటిభేదము. ప్రతీయమానార్థము చేత హృద్యమైనయెడల రెండవభేదము. అనంతరకాలమునందలి ఉత్తరాలంకారమునకు ప్రశ్నోత్తరోక్తియే మూలధాతువు. చిత్రోక్తియందు స్వసంకల్పితములైన ఉక్తిప్రత్యుక్తులచేతనే సాధ్యము సిద్ధించినట్లు పలికిన మొదటి భేదము. ఉక్తిప్రత్యుక్తులు చేష్టారూప పరిణామమునొంది చమత్కారము కలిగించిన రెండవభేద మగును. అన్నిభేదములలోను చమత్కార మున్నప్పుడే అలంకారత్వము.

18. ప్రహేళిక - 'ప్రశ్నోత్తర ప్రవహ్లాదికం చ వాక్కేలిః' అని సరస్వతీదేవి కావ్యపురుషునితో పలికినట్లు రాజశేఖరుడు కావ్యమీమాంస యందు తెలిపెను. వాత్స్యాయనుడు అక్షరముష్టికాదులను చతుష్షష్టి కళలయందు చేర్చి నాగరకులు చతుష్షష్టికళాప్రవీణులు కావలె నని ఆదేశించెను. బిందుచ్యుతి, బిందుమతి మొదలయినవి వినోదగోష్ఠులలో విస్తరించినవి. భోజుడు వినోదగోష్ఠులందు వినియోగపడుచు ప్రకీర్ణములై యున్న వాక్కేళులను ప్రహేలికాలంకారమునందు అంతర్భావింపజేసెను. ప్రహేళిక పొడుపుకథవంటిది. ఇదికూడ 1. చ్యుతాక్షర 2. దత్తాక్షర 3. చ్యుతదత్తాక్షర 4. అక్షరముష్టి 5. బిందుమతి 6. అర్థవతి – అని ఆరు విధములు. క్రీడాగోష్ఠి వినోదములందును, జనసంకులప్రదేశములందు తజ్ఞులు రహస్యాలాపములు జరుపుటకును, ఇతరులకు వ్యామోహమును కలిగించుటకును ప్రహేళిక ఉపయోగపడునవి భోజుడు ప్రయోజనమును కూడ చెప్పెను. ప్రహేళిక బుద్ధిసూక్ష్మతకు, సద్యః స్ఫూర్తికి, సమస్యాపరిష్కార శక్తికి పరీక్షావేదిక.

19. గూఢము – గోపనము నాశ్రయించినదే గూఢము. క్రియ, కారకము, సంబంధము, పాదము, అభిప్రాయము, వస్తువు–అనువానిని దాచిపెట్టుటచేత సమస్యయేర్పడును పరిశీలనచేసి దాగియున్న వానిని తెలిసికొన్నప్పుడు భావము స్పష్టమగును; సమస్య పరిష్కారము నొందును. ఇదికూడ వినోదకేళికి సంబంధించినదే. గూఢోక్తికిని దీనికిని సంబంధములేదు.

20. ప్రశ్నోత్తరము - విదగ్ధగోష్ఠులందలి క్రీడావినోదమే యిదికూడ. రాజశేఖరుడు వాక్కేళిగా పరిగణించినవానిలో ఇదియొకటి. సమస్యారూపమయిన ప్రశ్నకు ప్రశ్ననుండి సాధించుటచేత గాని, అన్యవిధముగాని పరిష్కారరూపమైన సమాధానము చెప్పుటయే ప్రశ్నోత్తరము. ఇదికూడ అంతః ప్రశ్నము, బహిః ప్రశ్నము, బహిరంతఃప్రశ్నము, జాతిప్రశ్నము, పృష్టప్రశ్నము, ఉత్తరప్రశ్నము– అని ఆరు ప్రభేదములను కలిగియున్నది. వాకోవాక్యమునందలి ప్రశ్నోత్తరోక్తికిని దీనికిని సంబంధము లేదు.

21. అధ్యేయము – 'విధియందును విషేధమునందును వ్యుత్పత్తికి కారణమయినది' అని నిర్వచనము. అధ్యయనయోగ్య మయినది అన్న వ్యుత్పత్త్యర్థమే స్వరూప నిరూపణ సమర్థము. 'అధ్యయన మెందులకు,' అన్న ప్రశ్నకు సమాధానము భోజుని నిర్వచనము; అనగా భోజుడు ప్రయోజనము నాధారము చేసికొనెను కాని వస్తుస్థితి నాధారము చేసికొనలేదు. పై వ్యుత్పత్తి యనుమాటకూడ విశిష్టముగా

ప్రయుక్తము. కేవలము 'బహుజ్ఞత' యన్న యర్థమునకాక 'ఉచితానుచిత వివేకో వ్యుత్పత్తిః' అన్న రాజశేఖరుని యర్థమునే భోజుడు గ్రహించెను. గ్రంథాధ్యయనమునకు ప్రయోజనము ఉచితానుచిత వివేకము. దీనినికూడ కావ్యము, శాస్త్రము, ఇతిహాసము, కావ్యశాస్త్రము, కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసము – అని ఆరు విధములుగా పరిగణించెను. కావ్యాదిపదములు ప్రసిద్ధములు. సర్గబంధాది నియమము గలవి. కావ్యమునందు కావ్యత్వముగల సంఘటన కావ్యాలంకారము; ఉక్తిప్రధానత్వము కావ్యత్వము. కావ్యమునందు శాస్త్రవిషయము సంఘటితమగును. అది శాస్త్రాలంకారము; శబ్దప్రాధాన్యము శాస్త్రత్వము. కావ్యమునందు ఇతిహాసము సంఘటితమగును. ఇది ఇతిహాసాలంకారము; అతీతార్థప్రాధాన్యము ఇతిహాసత్వము. శాస్త్రమునుకూడ కావ్యభణితిలో చెప్పిన కావ్యశాస్త్రము; ఇతిహాసమునట్లు చెప్పగా కావ్యేతిహాసము. ఇతిహాసమునందు శాస్త్రప్రసంగముచేసిన శాస్త్రేతిహాసము. కావ్యాది వాఙ్మయము శ్రవ్యము; అనగా అధ్యేయ మనియే భావము. సాహిత్యమునందు ఆయా ప్రభేదములు ప్రవేశించి అలంకారము లగును.

22. శ్రవ్యము : 'తత్కావ్యమాహు ర్యన్నేక్ష్యతే నాభినీయతే' అని నిర్వచనము. చూడబడనిది, అభినయింపబడనిది శ్రవ్యమనబడునని తాత్పర్యము. శ్రవణము, ఈక్షణము, అభినయము – ఇవి దృశ్యకావ్యవిషయములు. శ్రవణయోగ్యము శ్రవ్యము; ఈక్షణ యోగ్యము ప్రేక్ష్యము; అభినయోగ్యము అభినేయము. దృశ్యకావ్యములందు ఈ మూడు తత్తత్సన్నివేశములందు అలంకారములై శబ్దమునకు సౌందర్యమును సంధానించును. ప్రేక్ష్యము, అభినయము. ఈ వరుసలోనే చూపబడినవి.

శ్రవ్యము 1. ఆశీస్సు 2. నమస్క్రియ 3. వస్తునిర్దేశము 4. నాంది 5. ఆక్షిప్తిక 6. ధ్రువ – అని ఆరు భేదములను కలిగియున్నది. ఇవన్నియు సంగీతసముపేతములు. కావుననే 'శ్రవణయో రేవ సుఖదం భవేత్' అని శ్రవణసుఖమునే ప్రయోజనముగా చెప్పెను.

23. ప్రేక్ష్యము – 'ఆంగికైక నిర్వర్త్యమ్'. ఆంగికాభినయమాత్రముచేత ప్రదర్శితము లగునవి మాత్రమే ప్రేక్ష్యములు. నర్తకు లాంగికాభినయముమాత్రమే చేయుదురు; గాయకులు తత్ప్రేరకమయిన గీతమును పాడుదురు – ఆంగికాభినయమే గీతము నలంకరించుచున్నది. కావున, ఈ సన్నివేశము వాగలంకారమగుచున్నది.

ప్రేక్షణము 1. లాస్యము 2. తాండవము 3. ఛలికము 4. శంప 5. హల్లీసకము 6. రాసము – అని ఆరు విధములు.

24. అభినయము : ఇదికూడ దృశ్యకావ్య విషయమే. 1. ఆంగికము 2. వాచికము 3. సాత్త్వికము 4. ఆహార్యకము 5. సామాన్యము 6. చిత్రము – అని ఆరు భేదములు కలిగియున్నది. తత్తదభినయాశ్రయమైన వాగ్రచనము అభినయముచేత భూషితమగుటచేతనే వాగలంకారత్వము సిద్ధించుచున్నది.

భోజుడు చూపిన శబ్దాలంకారములను ఇరువది నాలుగింటిని పరామృశించుట యైనది. 'ఇవి యన్నియు అలంకారములా? అలంకారము లని అంగీకరించినప్పటికి శబ్దాలంకారము లెట్లు కాగలవు?' అన్న ప్రశ్నలు పండితలోకమునందు లేకపోలేదు. భోజహృదయాంభోజము మృదులము; మధుర మకరందతుందిలము. భోజధిషణ సర్వగ్రాహకము; శ్రమైక గ్రాహ్యము. పై పంక్తులలో అలంకారముల అలంకారత్వ ప్రదర్శనమునకు ప్రయత్నము సాగినది. శబ్దాలంకారము లనుటలోని సామంజస్యము సహేతుము సమర్థింపబడినది.

వామనుడు 'కావ్యం గ్రాహ్యమలంకారాత్ । సౌందర్య మలంకారః । స దోష గుణాలంకార హానాదానాభ్యామ్' అని మూడు సూత్రములలో అలంకారశబ్దార్థమును విశదీకరించెను. సౌందర్యమే అలంకారమని, అది దోషములను తొలగించుటవల్లను, గుణాలంకారములను కలిగించుటవల్లను లభ్యమగునని, అలంకారమువల్లనే కావ్యము గ్రాహ్యమగుచున్నదని భావము. ఈ దృష్టి భోజునికి పుష్టినిచ్చినది. ఇంతకుముందే దండి 'కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే' అని కావ్యమునకు శోభను కలిగించు ధర్మము లన్నియు అలంకారములే యని చాటి యున్నాడు.

భోజుడు కావ్యాంగములయిన రీతి, వృత్తి, భాష, ఛందస్సు, దృశ్యము, శ్రవ్యము, అభినయము, చిత్రము, ప్రశ్నోత్తరము మొదలయిన వాని నన్నింటిని శబ్దాలంకారములుగా సంగ్రహించి సమన్వయదృష్టి సాధించెను. ఇది యింతవరకు ప్రథమ ద్వితీయ పరిచ్ఛేద ప్రసంగము.

# సరస్వతీ కంఠాభరణము

## ప్రథమ సంపుటి

## విషయసూచిక

## ద్వితీయ పరిచ్ఛేదము

# సరస్వతీ కంఠాభరణము

## ప్రథమ పరిచ్ఛేదము

### మంగళాచరణము

1. ధ్వని ర్వర్ణాః పదం వాక్య మిత్యాస్పద చతుష్టయమ్
యస్యాః సూక్ష్మాదిభేదేన వాగ్దేవీం తా ముపాస్మహే.

అర్థము : ధ్వని, వర్ణములు, పదము, వాక్యము— అను నాలుగధిష్ఠానములను గలిగిన వాగ్దేవిని సూక్ష్మాది భేదముచేత నుపాసింతుము.

వ్యాఖ్య : గ్రంథకర్తయైన భోజదేవుడు శిష్టాచారము ననుసరించి యిష్టదేవతను స్తుతించుచున్నాడు. ప్రారంభించుచున్న గ్రంథమునకు అవిఘ్న పరిసమాప్తి నభిలషించి యిట్లు చేయుట శిష్టాచారము. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి'అని ఆర్యోక్తి. ఇష్ట దేవతా నమస్కరణము మంగళారంభము. 'ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్.' గ్రంథకర్త తాను నమస్కరించుట మాత్రమే కాక బహువచనసారస్యము చేత నమస్కార ఫలమునకు పాఠకులను భాగస్వాములను చేయుచున్నాడు. ఇది ఆశీర్వచనము. ఇంక వస్తు నిర్దేశము. సరస్వతీ స్వరూపము నావిష్కరించుటయే గ్రంథ విషయము. ధ్వని, వర్ణములు, పదము, వాక్యము – ఈ నాలుగును సరస్వతి కధిష్ఠానములు. ధ్వని యనగా ఉచ్చారణ మని యర్థము. 'ధ్వననమేవ ధ్వనిః'. ప్రవాహరూపమైన వాక్కునందు అల్ప ప్రమాణములుగా విరూపింపబడునవి వర్ణములు. 'వర్ణ్యన్తే నిరూప్యన్తే ఇతి వర్ణాః'. ఇవి అర్థభేదకములే కాని అర్థబోధకములు కావు. కావుననే బహువచనము ప్రయుక్తము. విభక్తి ప్రత్యయమును కాని, క్రియా ప్రత్యయమును కాని కలిగి అర్థవంత మగునది పదము. యోగ్యతాకాంక్షాసత్తి యుక్త పద సముదాయము వాక్యము. వీని నధిష్ఠానములుగా గల వాగ్దేవి నుపాసింతుము. ఎట్లు ? సూక్ష్మాదిభేదముచేత. వాక్కు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ – అని నాలుగు విధములు. పరావాక్కునకే సూక్ష్మవాక్కు అని నామాంతరము. పరావాక్కు మూలాధార చక్రమున నుండును. ఇది నిర్వికారము. తక్కినవి తద్వికారములు. పశ్యంతి నాభియందు, మధ్యమ హృదయమందు, వైఖరి

కంఠమునం దుండును. వీనిలో మొదటి మూడును ఉచ్చారణ స్థితి నొందవు. వైఖరీ వాక్కు వక్తచేత నుచ్చరింపబడి శ్రోతకు శ్రవణగోచర మగుచున్నది. ధ్వని తరంగములు కర్ణకుహర మూలమున హృదయమునందలి మధ్యమా వాక్కును స్పందింప జేయును. అప్పుడు మాత్రమే అర్థావగమనము కలుగును. భాషారూపమున వ్యాపహృత మగునది వైఖరి; అర్థావగతికి తోడ్పడునది లిప్యాది సంకేతాత్మకమైనది మధ్యమ. ఈ రెండింటిని మాత్రమే క్రమముగా ప్రత్యక్షముగా, పరోక్షముగా సామాన్యలోకము వినియోగించుకొనును. సారస్వతోపాసకులకు చతుర్ముఖమైన సరస్వతీ స్వరూపము స్వముపాస్యము.

ధ్వని ఉచ్చారణము; ధ్వని స్ఫోటము; ధ్వని వ్యంగ్యము. శబ్దార్థ స్వరూపమైన సాహిత్యమునందు ధ్వని కున్న మహత్త్వమునుబట్టియే ప్రాథమ్యము.

## కావ్య లక్షణము

శ్లో॥ నిర్దోషం గుణవత్ కావ్య మలంకారై రలంకృతమ్
రసాన్వితం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతిం చ విన్దతి.

**అర్థము** : నిర్దోషము, గుణవంతము, అలంకారములచేత నలంకృతము, రసాన్వితము నైన కావ్యమును రచించినవాడై కవి కీర్తిని ప్రీతిని పొందును.

**వ్యాఖ్య** : దోషములు లేనిది, గుణములు కలది, అలంకారములతో నలంకరింపబడినది, రసములచేత ఆస్వదనీయమైనది కావ్యము ఇంతవరకు కావ్యలక్షణము. ఇటువంటి కావ్యమును రచించినవాడు మాత్రమే కవి యనిపించుకొనును. ఇటువంటి కవి కీర్తిని ప్రీతిని పొందగలుగును. ఇవి రెండును కావ్యమునకు ప్రయోజనములు. ప్రీతి యనగా ఆనంద మనియే భావము. సహృదయుడైన పాఠకుడు కావ్యాస్వాదనసమయమున పొందెడి యానందమునే, కవికూడ కావ్యరచనాకాలమున పొందును. అంతే కాక, కావ్యరచన ముగిసిన తర్వాత తాను పాఠకుడుగానే ప్రవర్తించి కావ్యానందము నొందును. కీర్తి యనగా ప్రసిద్ధి. లోకమునందు కావ్యకర్తగా ప్రసిద్ధిని సంపాదించుకొనుట యని భావము. 'కీర్తిం స్వర్గఫలా మాహుః' అని యందురు. కావున కీర్తి వలన స్వర్గము లభించును. ప్రత్యక్షముగా ప్రీతియు, కీర్తియు కలుగును; పరిణామ ఫలముగా పరోక్షముగా స్వర్గము కలుగును. ఇందు కవి, కావ్యము, ప్రయోజనము— అను మూడు విషయములను గ్రంథకర్త నిబంధించెను.

## దోష వివేచన

3. దోషాః పదానాం వాక్యానాం వాక్యార్థానాం చ షోడశ
హేయాః కావ్యే కవీంద్రైర్యే తానేవాదౌ ప్రచక్ష్మహే.

**అర్థము :** పదముల యొక్కయు, వాక్యముల యొక్కయు, వాక్యార్థముల యొక్కయు దోషములు పదునారేసి కలవు. అవి కవీంద్రులు కావ్యమునందు పరిహరింపవలసినవి. కాపున వానినే ముందుగా చెప్పుదుము.

**వ్యాఖ్య :** అభిమత ప్రతీతి కవరోధకములుగా నుండునవి దోషములు. వీని వలన ముఖ్యార్థమునకు బాధ కలుగును. కాపుననే వీనిని హేయములుగా పరిగణించుట జరిగినది. సుందరమైన శరీరము మీద బొల్లిమచ్చ యొకటి యున్నను సౌందర్యము క్షతి నొందును. అట్లే కావ్యమునందు దోషమొక్కటి యున్నను కావ్యత్వమునకు హాని కలుగును. కాపుననే గ్రంథకర్త కావ్యలక్షణమునందు 'నిర్దోష' మను పదే ముందుగా పరిగణించెను. తదనురూపముగా దోషములనే ముందుగా పరిగణించుచున్నాడు.

పదదోషములు, వాక్యదోషములు, వాక్యార్థదోషములు – అని మూడు వర్గములుగా దోషములు విభక్తము లయినవి. ఒక్కొక వర్గమునందు పదునారు చొప్పున, మొత్తము నలుపది యెనిమిది దోషములను గ్రంథకర్త సోదాహరణముగా నిరూపించుచున్నాడు.

## పద దోషములు

4. అసాధు చాప్రయుక్తం చ కష్టం చానర్థకం చ యత్
అన్యార్థక మపుష్టార్థ మసమర్థం తథైవ చ.

5. అప్రతీత మథ క్లిష్టం గూఢం నేయార్థ మేవ చ
సందిగ్ధం చ విరుద్ధం చ ప్రోక్తం యచ్చాప్రయోజకమ్.

6. దేశ్యం గ్రామ్య మితి స్పష్టా దోషాః స్యుః పదసంశ్రయాః
అథైషాం లక్షణం సమ్యక్ సోదాహరణ ముచ్యతే.

అర్థము : 1. అసాధువు 2. అప్రయుక్తము 3. కష్టము 4. అనర్థకము 5. అన్యార్థకము 6. అపుష్టార్థము 7. అసమర్థము 8. అప్రతీతము 9. క్లిష్టము 10. గూఢార్థము 11. నేయార్థము 12. సందిగ్ధము 13. విరుద్ధము 14. అప్రయోజకము 15. దేశ్యము 16. గ్రామ్యము — ఈ పదునారును పదదోషములు. ఇంక వీని లక్షణము సోదాహరణముగా సక్రమముగా చెప్పబడుచున్నది.

[ అ సా ధు వు ]

7. శబ్దశాస్త్ర విరుద్ధం యత్తదసాధు ప్రచక్షతే.
యథా—
'భూరి భరాక్రాన్త బాధతి స్కన్ధ ఏవ తే,
తథా న బాధతే స్కన్ధో యథా బాధతి బాధతే.' 1

అత్ర బాధతే రాత్మనేపదిత్వాద్ 'బాధతే' ఇతి స్యాత్, న పునర్ 'బాధతి' ఇతి.

అర్థము : శబ్దశాస్త్ర విరుద్ధ మగు ప్రయోగమును అసాధు దోష మని యందురు.

'భూరి భార భరాక్రాంతుడా! నీ భుజము బాధ పెట్టుచున్నదా?' అని పల్లకిలో నున్న రాజు ప్రశ్నింపగా, పల్లకిని మోయు బోయీ 'నీ "బాధతి" బాధపెట్టు చున్నంతగా భుజము బాధపెట్టుట లేదు.' అని బదులు పలికెను— ఇది ఉదాహరణము.

ఇక్కడ ఆత్మనేపదిత్వము వల్ల 'బాధతే' అని యగును. అంతేకాని 'బాధతి' యని కాదు.

వ్యాఖ్య : శబ్దశాస్త్రమనగా వ్యాకరణమని యర్థము. వ్యాకరణ శాస్త్రమునకు విరుద్ధముగా నున్న ప్రయోగము అసాధు దోషముగా పరిగణింపబడును.

సంస్కృత ధాతువులు పరస్మైపదులు, ఆత్మనేపదులు, ఉభయపదులు — అని మూడు విధములు. పరస్మైపది ధాతువులకు చేరు పురుష ప్రత్యయములు ఆత్మనేపదిధాతువులకు చేరవు. అనగా పరస్మైపదులకు పరస్మైపది ప్రత్యయములును, ఆత్మనేపదులకు ఆత్మనేపది ప్రత్యయములును మాత్రమే చేరును. ఒకదానికి మరొ

కటి చేరుట దోషము. ఉభయపదిధాతువులకు పరస్మైపది ప్రత్యయములతో ఒక విధముగాను,ఆత్మనేపది ప్రత్యయములతో ఒక విధముగాను-రెండేసి రూపము లుండును. 'బాధ్' ఆత్మనేపది ధాతువు కావున 'బాధతే' అని కావలయును. పై శ్లోకమునందు పరస్మైపది ప్రత్యయమును చేర్చి 'బాధతి' అని దుష్టరూపము ప్రయోగించుట జరిగినది. ఇది వ్యాకరణ విరుద్ధము; కావున అసాధువు.

[తెలుగునందు ఉదాహరణము నిట్లు మార్చుకొనిన సులభముగా బోధపడును. 'నీ భుజము భాదపెట్టుచున్నదా?' 'నీ భాద బాధపెట్టినంత భుజము బాధపెట్టుట లేదు.' ఇచ్చట 'బాధ' యనుటకు బదులుగా 'భాద' యనుట అసాధువు.]

## [ అప్రయుక్తము ]

కవిభి ర్న ప్రయుక్తం య దప్రయుక్తం త దుచ్యతే.

యథా—

'కామచీకమథాః కేఽమిూ త్వా మజిహ్వాయకీయిషన్
స సన్తి కిం వచన్తీమే కమ్భుః శమ్భం ఘరిష్యతి' 2

అత్ర అచీకమథాః, అజిహ్వాయకీయిషన్, సన్తి, వచన్తి, ఘరిష్యతి, కమ్భుః, శమ్భమ్ - ఇతి శబ్దానుశాసన సిద్ధా న్యపి కవిభి ర్న ప్రయుజ్యన్తే.

అర్థము : కవులచేత ప్రయుక్తము కాని దానిని అప్రయుక్తమని యందురు. ఇది లక్షణము. ఏ నాయికను ప్రేమించితివి? వీరెవరు? నిన్ను పొందుట కిష్టపడిరి. అతడు నిద్రించుచున్నాడు. వీరేమి పలుకుచున్నారు? మేఘము జలాశయమును సేచనము చేయగలదు — అని యుదాహరణములు.

ఇచ్చట ప్రేమించితివి అన్న యర్థమున 'అచీకమథాః'; పొందుట కిష్టపడిరన్న యర్థమున 'అజిహ్వాయకీయిషన్'; నిద్రించుచున్నాడన్న యర్థమున 'సన్తి'; పలుకుచున్నా రన్న యర్థమున 'వచన్తి'; సేచనము చేయగల దన్న యర్థమున 'ఘరిష్యతి'; మేఘ మన్న యర్థమున 'కమ్భుః'; జలాశయ మన్న యర్థమున 'శమ్భమ్' అన్న పదము లుపయుక్తము లయినవి. వ్యాకరణ నియమములను బటి

పై రూపములు సిద్ధించును. కాని, కవులు వానిని ప్రయోగింపరు. అందువలన ఆ శబ్దము లన్నియు అప్రయుక్తదోషము పాలయినవి.

వ్యాఖ్య:- లోకమున నున్నంత మాత్రమున ఏ పదమునకును ప్రయోగార్హత కలుగదు; అట్లే వ్యాకరణ లక్షణముచేత సాధింపబడినప్పటికిని ప్రయోగార్హత కలుగదు. దోషము లేకుండ నుండవలె నన్న వ్యాకరణ సమ్మతముగా నుండి కవి ప్రయుక్తమైనది కావలయును. పైని చూపినపదములను కృత్రిమముగా వ్యాకరణ నియమముల చేత నిష్పన్నము చేయవచ్చును. కాని, వానిని పూర్వకవు లెవ్వరును ప్రయోగింప లేదు. ప్రకృత గ్రంథకర్త ఉదాహరణ నిమిత్తముగా వీనిని ప్రదర్శించుచున్నాడు.

ణిజంతమైన కమి ధాతువునకు లుఙ్ చఙ్ ప్రత్యయములు రాగా ద్విర్వచన సన్నంతత్వము నొంది, దీర్ఘము ణిలోపము కలుగగా 'అచీకమథాః' అను రూప మేర్పడును. హ్వాయక శబ్దమునకు క్యచ్, తరువాత సన్, తరువాత లఙ్ ప్రత్యయము రాగా 'అజిహ్వాయకీయిషన్' అను రూపమేర్పడును. 'షస సస్తి స్వప్నే' అను ధాతువును బట్టి 'సస్తి' అను రూపము సంగ్రహింపబడినది. కం, శం శబ్దములు జలవాచకములు; వీనికి మతుబర్థమున 'బ' ప్రత్యయము రాగా కంబ, శంబ రూపము లేర్పడును 'హృ' ధాతువునకు 'హరిష్యతి' యైనట్లు 'ఘృ' ధాతువునకు 'ఘరిష్యతి' అనియు, 'వదన్తి' యనునట్లుగానే 'వచన్తి' అనియు రూపము లుదాహృతము లైనవి.

ఇతర ధాతువుల సామ్యమునుబట్టి, వ్యాకరణ నియమములనుబట్టి పై రూపములు సాధువులే యనిపించును. కాని, పూర్వ కవిప్రయోగములు లేకుండుటచేత, అవి ప్రయోగార్హములు కాజాలవు: అనగా సాధువులు కావనియే అర్థము. అందుచేతనే, అట్టివి 'అప్రయుక్తము' అను దోషమునకు లక్ష్యము లయినవి.

[ కష్టము ]

8. పదం శ్రుతే ఽసుఖదం కష్ట మిత్యభిశబ్దితమ్.

యథా—

'స్పష్టార్థి జలదో యత్ర యత్ర మూర్ధ్ని ద్ధృష్టి చాతకః

*నీపః ప్రోత్ఫుల్లి కాలోఽయం చక్రి హృదయం మమ' 3

............................

'ప్రోత్ఫుల్లి నీపః కాలోఽయం'— అని నిర్ణయసాగర ముద్రణ.

అత్ర వర్వర్ష్యాదీని క్రియాపదాని శ్రుత్యసుఖదానిశ్రూయన్తే.

**అర్థము** : శ్రుతిసుఖము కాని పదమును కష్టము అని యందురు. ఇది లక్షణము. ఎచ్చట మేఘుడు మరల మరల వర్షించుచున్నాడో, ఎచ్చట చాతకము మిక్కిలి ప్రాగల్భ్యమును చూపుచున్నదో, (ఎచ్చట) కడిమి పుష్పములుగా పూచుచున్నదో (అచ్చట) ఈ కాలము హృదయమును ఛేదించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'వర్వర్ష్టి' మొదలయిన క్రియాపదములు చెవులకు కష్టమును కలిగించునవై వినిపించుచున్నవి. ఇట్టి పదములను వాడుట కష్ట మన్న దోష మగును.

**వ్యాఖ్య** : 'వృష్' ధాతువునకు యఙ్లుగంతరూపము వర్వర్ష్టి. ధృష్ ధాతురూపము దర్ధర్ష్టి, ఫుల్ల్ ధాతురూపము పోఫుల్లి, 'కృతీ ఛేదనే' అను ధాతువునకు యఙ్లుగంత రూపము చర్కర్తి. అతిశయార్థమునందు గాని, పునఃపునరావృత్తియందు గాని యీ రూపములు వచ్చును. కాని, యివి యన్నియు నుచ్చరించుటకు కష్టము కలిగించును. వినుటకు నైతము కష్టము కలిగించును. శ్రుతికి అసుఖమును కలిగించునట్టివి కావున, ఇట్టి పదములు 'కష్టము' అను దోషమునకు భాజనము లయినవి.

[ అ న ర్థ క ము ]

పాదపూరణ మాత్రార్థ మనర్థక ముదాహృతమ్.

యథా—

'బిభర్తి యశ్చ దేహార్ధే ప్రియాం మిన్దుం హి మూర్ధని
స వై దేవః ఖలు త్వాం తు పునాతు మదనాన్తకః' 4

అత్ర చ, హి, వై, ఖలు, తు - ఇత్యేతాని పదాని పాదానేవ పూరయన్తి.

**అర్థము** : పాదపూరణమునకు మాత్రమే ప్రయోగింపబడుట అనర్థకము. ఇది లక్షణము. శరీరార్థమునందు ప్రియురాలిని, మూర్ధమునందు చంద్రుని ధరించుచున్న మదనాంతకుడైన ఆ దేవుడు నిన్ను పవిత్రీకరించును గాక — అని యుదాహరణము.

ఇచ్చట చ, ఫా, వై, ఖలు, తు — అన్న పదములు పాదములను మాత్రమే పూరించుచున్నవి.

వ్యాఖ్య : ఉదాహరణ శ్లోకమునందు కేవలము పాదపూరణముకొరకు చ, హి, వై, ఖలు, తు – అను నవ్యయములు వాడుకొనబడినవి. ఇవి అర్థ పుష్టి కెంతమాత్రమును సహకరించుట లేదు. అర్థములేని వన్న భావముతోనే యిట్టి పదములు 'అనర్థకము' అను దోషమునకు అంకితములైనవి.

[ అ న్యా ర్థ క ము ]

9. రూఢిచ్యుతం పదం యత్తు తదన్యార్థమితి శ్రుతమ్.

యథా—

'విభజన్తే న యే భూప మాలభన్తే న తే శ్రియమ్

ఆవహన్తి న తే దుఃఖం ప్రస్మరన్తి న యే ప్రియామ్' 5

అత్ర విభజతే ర్వణ్టనే, ఆలభతే ర్మారణే, ఆవహతేః కరణే, ప్రస్మరతే ర్విస్మరణే రూఢిః. న తు విశేషసేవాయాం, అభితోలాభే, సమన్తా ద్వహనే, ప్రకృష్టస్మరణే చేతి.

అర్థము : రూఢిని విడనాడి ప్రయోగించిన పదము అన్యార్థకము. ఇది లక్షణము. ఎవరు రాజును విభజింపరో వారికి సంపద అలభింపదు. ఎవరు ప్రియురాలిని ప్రస్మరింపరో వారు దుఃఖము నావహింపరు – అని యుదాహరణము.

విభజించుట యనగా పంచుట యని, ఆలభించుట యనగా చంపుట యని, ఆవహించుట యనగా చేయుట యని, ప్రస్మరించుట యనగా మరచిపోవుట యని ప్రసిద్ధములైన యర్థములు. విశేషసేవ యని, అన్ని యెడల లాభమని, సమగ్రముగా వహించుట యని, ప్రకృష్టముగా స్మరించుట యని రూఢి లేదు.

వ్యాఖ్య : రూఢి యనగా లోకప్రసిద్ధి. పదముల కూడికచేత నేర్పడిన యర్థము యౌగికార్థము. పెక్కు పదములు యౌగికమైన యర్థమును కలిగియు, ఒకే వస్తువునకు వాచకములుగా వ్యవహరించును. 'పంకజము' అని యనగా 'బురద యందు పుట్టినది' అని యౌగికార్థము. రూఢ్యర్థము పద్మము బురదయందు పుట్టిన

యితరవస్తువుల కది సంకేతము కాదు; అనగా ఆయా వస్తువులయందు రూఢిలేదని భావము. ఇట్లు రూఢి లేనిచోట ఒక పదము నుపయోగించిన యెడల అన్యార్థమన్న దోషమగును.

ధాతువులకును, ధాతు నిష్పన్నములగు పదములకును పూర్వమందు చేరునవి ఉపసర్గములు. 'ధాత్వర్థం బాధతే కశ్చిత్ ౹ కశ్చిత్త మనువర్తతే౹ తమేవ విశినష్ట్యన్య ౹ ఉపసర్గ గతి స్త్రిధా' అని యందురు. ఒకానొక ఉపసర్గ ధాత్వర్థమును బాధించును; మరొకటి ధాత్వర్థము ననుసరించును; ఇంకొకటి ధాత్వర్థమునకు విశేషతను సమకూర్చును; ఉపసర్గ మూడు విధములుగా ప్రవర్తించును — అని యర్థము.

ఉదాహరణమునందు వి, ఆ, ప్ర అని మూడు ఉపసర్గ లున్నవి. 'వి' కి సాధారణముగా 'విశేషముగా' అన్న యర్థము కలుగును; కొన్ని యెడల 'ఎడబాటు' అన్న యర్థముకూడ కలుగును. పై శ్లోకమున 'విభజన్తే' అనుచోట కవి విశేషార్థమున వాడెను. కాని 'భజ్' ధాతువుతో కూడినపు డా యర్థమున దానికి రూఢి లేదు. 'విభజింతురు' అనగా 'వేరువేరుగా పంచుదురు' అన్న యర్థము మాత్రమే యేర్పడును. 'ఆ' అను నుపసర్గకు అభిముఖముగా, సమగ్రముగా మున్నగు నర్థములు కలుగును. కాని 'లభ్' ధాతువునకు పూర్వమందుపయోగింపబడినపుడు ధాత్వర్థమునే మార్చి 'చంపుట' యన్న యర్థమును కలిగించును. అట్లే 'వహ్' ధాతువుతో కూడినపుడు "నిర్వహించుట" యన్న యర్థమునే కలిగించును గాని 'సమగ్రముగా మోయుట' యన్న యర్థము నీయదు. 'ప్ర' యన్నది 'ప్రకృష్టమైన' అన్న యర్థమున సాధారణముగా ఉపయుక్తమగును. కాని 'ప్రస్మరన్తి' అన్నప్పుడు విరుద్ధార్థకమై 'ఎక్కువగా స్మరింతురు' అన్న యర్థమును గాక 'మరచిపోవుదురు' అన్న యర్థమును కలిగించును.

కావున, ఒక పదమును తదంశముల అర్థమును బట్టియే కాక రూఢిని బట్టి కూడ ఉపయోగించుట ఆవశ్యకము. అట్లు కానినాడు అన్యార్థమన్న దోషమునకు అర్పితము కావలసి వచ్చును.

ఉదాహరణ శ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి నుండి గ్రహింపబడినది.

## [ అపుష్టార్థము ]

యత్తు తుచ్ఛాభిధేయం స్యా దపుష్టార్థం తదుచ్యతే.

యథా—

‘శతార్ధ పంచాంశభుజో ద్వాదశార్ధార్ధ లోచనః

వింశత్యర్ధార్ధ మూర్ధా నః పునాతు మదనాన్తకః’ 6

అత్ర దశబాహుః, త్రిలోచనః, పంచవక్త్ర ఇతి తుచ్ఛమేవా భిధేయ మతుచ్ఛపదై రుక్త మితి అపుష్టార్థమ్.

**‘అర్థము** : అల్పపదములచేత చెప్పదగిన దానిని (=తుచ్ఛాభిధేయమును) అధిక పదములచేత చెప్పుట అపుష్టార్థము. ఇది లక్షణము. శతార్ధ పంచాంశభుజుడు, ద్వాదశార్ధార్ధలోచనుడు, వింశత్యర్ధార్ధ మూర్ధుడునగు మదనాంతకుడు (శివుడు) మిమ్ము లను పవిత్రీకరించుమగాక — అని యుదాహరణము.

ఇక్కడ దశబాహుడు, త్రిలోచనుడు, పంచవక్త్రుడు – అను చిన్న పదము లతో చెప్పదగిన యర్థమును పెద్దపెద్ద సమాసములతో చెప్పుట జరిగినది. కావుననే అపుష్టార్థము.

**వ్యాఖ్య** : అధిక పదముల నుపయోగించుటచేత అర్థమున కేమియు పుష్టి చేకూరుట లేదు. అందువల్లనే అపుష్టార్థ మన్నపేరు సార్థక మగుచున్నది. శతార్ధ పంచాంశభుజుడు — నూటిలో సగము ఏబది, అందులో అయిదవ వంతు పది – పది భుజములు కలవాడని యర్థము. ద్వాదశార్ధార్ధలోచనుడు – పంద్రెండులో సగము ఆరు, దానిలో సగము మూడు=మూడు కన్నులు గలవాడని యర్థము. వింశత్యర్ధార్ధ మూర్ధుడు—వింశతి అనగా ఇరువది, దానిలో సగము పది, దానిలో సగము అయిదు- అయిదు మొగములు గలవా డని యర్థము. సంక్షిప్తముగా చెప్పుటకు తగినచోట, విస్తరించి చెప్పుట దోషము. దానికి ‘అపుష్టార్థము’ అని పేరు.

## [అసమర్థము]

10. అసంగతం పదం యత్తదసమర్థ మితి స్మృతమ్.

యథా—

'జలం జలధరే క్షారమయం వర్షతి వారిధిః
ఇదం బృంహితమశ్వానాం కకుద్మానేష హ్రేషతే' 7

అత్ర జలధరో మేఘః, వారిధిః సముద్రః బృంహితం గజానామ్, హ్రేషిత మశ్వానా మితి లోకప్రసిద్ధమ్. తదిహ సముద్ర, మేఘ, అశ్వ, వృషభ విషయతయా ప్రయుజ్యమాన మసంగతార్థత్వా దవాచక మిత్యసమర్థమ్.

**అర్థము** : అసంగతమైన పదములు వాడుట అసమర్థము. ఇది లక్షణము. జలధరమునందు జలము క్షారమయము; వారిధి వర్షించుచున్నది; ఇది అశ్వముల బృంహితము; ఈ యెద్దు హ్రేష చేయుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట జలధర మనగా మేఘ మనియు, వారిధి యనగా సముద్రమనియు, ఏనుగుల ఘీంకారమునకు బృంహితమనియు, గుఱ్ఱముల సకిలింపునకు హ్రేషిత మనియు లోకప్రసిద్ధమైన వ్యవహారము. ప్రకృతోదాహరణమునందు సముద్రార్థమున జలధరము, మేఘార్థమున వారిధి, హ్రేషార్థమున బృంహితము, రవార్థమున (రంకె వేయుట) హ్రేష ప్రయోగింపబడినవి. ఈ అర్థములు సరిపడవు. ఇట్లు సంగతములు కాని అర్థములందు ప్రయోగింపబడిన పదము లగుటచేతనే 'అసమర్థము' అన్నదోషమునకు లోనైనవి.

**వ్యాఖ్య** : అన్యార్థమునందు యౌగికార్థము కంటె రూఢ్యర్థమునకు ప్రాబల్యము తెలుపబడినది. కావుననే పదాంశముల యర్థము సరిపోయినను రూఢి లేని యెడల అన్యార్థదోష మగునని చెప్పబడినది. అసమర్థమందు యౌగికార్థము కంటె యోగరూఢికి ప్రాబల్యము కలదు. అనగా యౌగికార్థమును సరిపడవలయును; రూఢ్యర్థమును సరిపడవలయును. అట్లు కానియెడల 'అసమర్థము' అన్న దోషమగును.

## [ అప్రతీతము ]

అప్రతీతం యదుద్దిష్టం ప్రసిద్ధం శాస్త్ర ఏవ యత్.

యథా.–

'కిం భాషితేన బహునా రూపస్కన్ధస్య స న్తి మే న గుణాః
గుణానాన్తరీయకం చ ప్రేమేతి న తేఽ స్త్యుపాలంభః' 8

అత్ర రూపస్కన్ధ నాంతరీయక శబ్దయోః శాస్త్రప్రసిద్ధత్వా దన్యత్రాప్రతీయమానయోః ప్రయోగా దప్రతీతమ్.

**అర్థము** : శాస్త్రమునందు మాత్రమే ప్రసిద్ధమైన పదమును వాడుట 'అప్ర సిద్ధము' అన్న దోషమగును. ఇది లక్షణము. పెక్కు మాటలతో పని యేమి ? రూప స్కంధుడ నైన నాకు గుణములు లేవు. గుణనాంతరీయకము ప్రేమ. ఇది నీకు ఉపాలంభము కాదు—అని ఉదాహరణము.

ఇక్కడి రూపస్కంధ, నాంతరీయక శబ్దములు శాస్త్రప్రసిద్ధములు: తక్కిన వ్యవహారమునందు వీనికి ప్రసిద్ధి లేదు. ఇట్టి వీని నుపయోగించుటచేత అప్రతీతము అను దోషము కలుగును.

**వ్యాఖ్య** : శాస్త్రమునందు మాత్రమే ప్రసిద్ధమైన పదమును శాస్త్రమునం దుపయోగింపవచ్చును; ఇతర వ్యవహారమునం దుపయోగించినయెడల అర్థము ప్రతీతము కాదు; అనగా అభీష్టమైన అర్థము స్ఫురింపదు. కావుననే దీనికి అప్ర తీతము అన్నపేరు సార్థక మగుచున్నది.

ఉదాహరణమున రూపస్కంధు డను పద మున్నది. ఇది 'సౌగతసమయము' నకు చెందినది. రూపము, వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము – అనునవి పంచస్కంధములు. ఈ రూపస్కంధు డను పదము పంచేంద్రియములు, పంచ విషయములు, విజ్ఞప్తి – అను పదునొక్కయంశములను స్ఫురింపజేయును. ఇదంతయు సౌగతసమయప్రసిద్ధము. ఇట్లే గుణనాంతరీయక మనునది. అంతరీయక మనగా వ్యాపక మని యర్థము. 'గుణనాంతరీయకము' గుణములచేత వ్యాప్తము కాని దని యర్థము. ఇదియు శాస్త్రసిద్ధ మగుటచేత లోకవ్యవహారమునందు అర్థస్ఫూర్తిని కలిగింపదు.

అప్రయుక్తమునందు వ్యాకరణసిద్ధమగు రూపమే అయినను కవుల ప్రయో గములందు లేకుండుటచేత దోషముగా పరిగణింపబడినది. అప్రతీతమునందు శాస్త్ర వ్యవహారమున ప్రసిద్ధపదమే యైనను సాహిత్యమునందు అర్థస్ఫోరకము కాక పోవుటచేత దోషముగా పరిగణింపబడినది.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తినుండి గ్రహింపబడినది.

## [ క్లిష్టము ]

11 దూరే యస్యార్థసంవిత్తిః క్లిష్టం నేష్టం హి తత్సతామ్.

యథా -

'విజితాత్మభవద్వేషి గురుపాదహతో జనః

హిమాపహామిత్రధరై ర్వ్యాప్తం వ్యోమాభినన్దతి' 9

అత్ర విනා గరుత్మతా జిత ఇంద్ర స్తస్యాత్మభవోఽర్జున స్తస్య ద్వేషీకర్ణ స్తస్య గురుః సూర్య స్తత్పాదై రభిహతో లోక ఆకాశ మభినన్దతి. కీదృశమ్? హిమాపహో వహ్ని స్తస్యామిత్రో జలం తద్ధారయన్తి యే మేఘా స్తైర్వ్యాప్తమితి వ్యవహితార్థ ప్రత్యయం క్లిష్ట మేతత్.

అర్థము : అర్థస్ఫురణము దూరముగా వ్యాపించియుండు నెడల క్లిష్ట మను దోష మగును; అది పండితుల కిష్టము కాదు. ఇది లక్షణము. విజితాత్మ భవద్వేషి గురుపాదహతమైన జనము హిమాపహామిత్రధర వ్యాప్తమైన వ్యోమము నభినందించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇక్కడ 'వి' యనగా గరుత్మంతునిచేత 'జితః' ఓడింపబడినవాడు—ఇంద్రుడు. అతని ఆత్మభవుడు అర్జునుడు. అతనికి (ద్వేషి) శత్రువు కర్ణుడు. అతనికి (గురుడు) తండ్రి సూర్యుడు. అతని (పాదములు) కిరణములచేత తాపము నొందినది లోకము. హిమాపహుడు (మంచును తొలగించువాడు) అనగా అగ్ని. అతనికి శత్రువు జలము. దానిని ధరించియుండునవి మేఘములు. వానిచేత వ్యాపింపబడినది (వ్యోమము) ఆకాశము. సూర్యునిచేత తాపమునొందిన లోకము మేఘవ్యాప్తమైన ఆకాశము నభినందించుచున్నదని భావము. ఇట్లు వరుసల నదుకుకొనుచు వచ్చి, అన్వయమును సుదూరము సాగదీయుటచేత ఇది క్లిష్టమను దోషముగా పరిగణింపబడుచున్నది.

ఉదాహరణము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ గూ ఢా ర్థ ము ]

గూఢార్థ మప్రసిద్ధార్థం ప్రయోగం బ్రువతే బుధాః.

యథా—

'సహస్రగో రివానీకం భవతో దుస్సహం పరైః
హరే రివ తవాభాన్తి నాన్యే తేజాంసి తేజసి' 10

సహస్రగు శబ్దేన సహస్రాక్ష ఉక్తః. న చ గోశబ్ద స్యాక్ష్ణి భూయసీ ప్రసిద్ధిః, హరిశ్శబ్దేన చ సహస్రాంశుః సోఽపి న తేన నామ్నా బహుభిరుచ్యత ఇతి గూఢత్వమ్.

అర్థము : అప్రసిద్ధమైన అర్థమునందు ప్రయోగించిన పదమును బుధులు గూఢార్థమని యందురు. ఇది లక్షణము. నీ సైన్యము (సహస్రగుని) ఇంద్రుని సైన్యమువలె శత్రులకు దుస్సహమైనది. (హరి) సూర్యుని తేజమునందువలె నీ తేజమునందు ఇతరతేజములు వెలవెల బోవుచున్నవి. ఇది ఉదాహరణము.

ఇక్కడ సహస్రగు శబ్దముచేత సహస్రాక్షుడు చెప్పబడెను. కాని గోశబ్దమునకు అక్షి యన్న అర్థమున అధికమైన ప్రసిద్ధి లేదు. హరి శబ్దముచేత సహస్రాంశుడు చెప్పబడెను. అతడుకూడ ఆ పేరుతో పెక్కురచేత పిలువబడడు. ఇదియే గూఢత్వము.

వ్యాఖ్య : ఒకే పదమునకు అనేకార్థము లుండవచ్చును. అందొకటి రెండర్థములు మిక్కిలి ప్రసిద్ధములై యుండవచ్చును; తక్కినవాని కంతటి ప్రసిద్ధి లేకపోవచ్చును. ఉన్న యర్థమే అయినప్పటికిని, ప్రసిద్ధము కాకపోవుటచేత పదమును విన్నవెంటనే స్ఫురింపదు. అందువల్లనే యిది గూఢార్థమన్న దోషమున కంకితమైనది.

'గౌః శరాక్షి పయః స్వర్గ పశుభేద వచస్సు చ' అని గోశబ్దమునకు బాణము, కన్ను, నీరు, స్వర్గము, ఆవు, మాట – అని నానార్థములు కలవు. అయినప్పటికిని 'కన్ను' అన్న యర్థమునందు నెక్కువగా వాడుక లేనందు వల్ల 'సహస్రగుః' అని

యన్నప్పుడు 'వేయి గోవులు కలవాడు' అన్న యర్థము స్ఫురించినట్టు 'వేయి కన్నులు కలవాడు' అన్న యర్థము స్ఫురింపదు. 'హరిః కృష్ణేచ సింహేచ భేకార్క భుజగేషు చ' అని హరి శబ్దమునకు విష్ణువు, సింహము, కప్ప, సూర్యుడు, పాము - అని నానార్థములు కలవు. అయినప్పటికిని 'సూర్యుడు' అన్న యర్థమున వాడుక తక్కువ. కావున వెంటనే స్ఫురింపదు. అందువల్లనే యిట్టి పదములు గూడార్థ దోషమున కాస్పదము లైనవి.

ఈ శ్లోకపూర్వార్ధము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తియం దున్నది.

[ నే యా ర్థ ము ]

12. స్వసంకేత ప్రక్లృప్తార్థం నేయార్థం మితి కథ్యతే.

యథా -

'ముఖాంశవ స్త మాస్థాయ విముక్త పశుపంక్తి నా
పంక్త్యనేకజనా మధ తుకా జిత ఉలూకజిత్' 11

అత్ర పంక్తిశబ్దేన దశసంఖ్యా, అనేకజనా మేత్యనేన చక్రమ్, తద్ధ ఇత్యనేన రథ స్తాభ్యాం దశరథ స్తస్యతుక్ బాలకో లక్ష్మణ స్తేన జిత ఉలూకజి దింద్రజిత్ కిం కృత్వా? ముఖాంశవ న్త మాస్థాయ హనుమ న్తమ్. కిం భూతేన? విముక్త పశుపంక్తినా విముక్తేషు పంక్తినా. అత్ర పశుశబ్దేన గోశబ్దో లక్ష్యతే తే నేషవ స్తదిదం స్వ సంకేత కల్పితార్థం నేయార్థ ముచ్యతే.

**అర్థము** : స్వసంకేతము చేత కల్పించుకొన్న యర్థమునందు ప్రయోగించిన పదమును నేయార్థమని యందురు. ఇది లక్షణము. పంక్త్యనేకజ నామధరుని కుమారుని (లక్ష్మణుని) చేత ముఖాంశవంతుని (హనుమంతుని) నధిష్ఠించి విముక్త పశుపంక్తి (విడువబడిన బాణసమూహము) చేత ఉలూక జిత్తు (ఇంద్రజిత్తు) ఓడింపబడెను — అని ఉదాహరణము.

ఇక్కడ 'పంక్తి' శబ్దముచేత 'దశ' శబ్దము సాధింపబడినది. 'అనేకజ' శబ్దముచేత 'ద్విజ' శబ్దమును తద్ద్వారమున నామరూపమున చక్రవాకమును సాధితములు. దానికి ఏకదేశము చక్రము. కావున 'అనేకజనామ' యను రూపమునకు

'చక్రము' అన్న యర్థము సాధింపబడినది. 'ధ' అని యనుటచేత చక్రములను ధరించియుండు 'రథము' సాధింపబడినది. ఈ రెండింటిని కలుపగా 'దశరథ' యైనది. 'తుక్' అని యనగా బాలకుడు; అనగా లక్ష్మణుడు. అతనిచేత ఓడింప బడినవాడు ఉలూకజితుడు; అనగా ఇంద్రజితుడు. ఏమి చేసి? ముఖమునందలి ఒక యంశము ముఖాంశము, అనగా హనువు. హనువులు కలవాడు హనుమంతుడు. అతని నధిష్ఠించి. ఎట్లు? విడువబడిన పశువుల సమూహముచేత, అనగా ఇషువుల (బాణముల) సమూహముచేత. ఇచ్చట పశుశబ్దముచేత గోశబ్దము లక్షింపబడినది. గోశబ్దమునకు 'పశుభేదము' అన్న యర్థమే కాక 'శరము' అన్న యర్థము కూడ కలదు. పశుశబ్దముచేత గోశబ్దమును, దానిచేత శరమును కల్పించుకొనుట యిచ్చట జరిగినది. ఇట్లు స్వసంకేతమునందు కల్పించుకొన్న యర్థము నేయార్థము.

వ్యాఖ్య : ఒక శబ్దమునకు రెండు మూడర్థము లుండవచ్చును. అట్టియెడల అందలి యొక యర్థమును గ్రహించి దానికి వాచకమైన మరొకపదమును వాడినచో నేయార్థమగును. నిజమున కాపదమున కీ యర్థముండదు. బలాత్కారముగా ఈ యర్థమును లాగుట జరుగును. 'శరము' అని యనగా బాణము, జలము, కాశము (రెల్లు) అన్న యర్థములు కలవు. 'బాణము' అన్న పదమునకు 'శరము' అన్న యర్థము కలుగును. కాని జలము, కాశము — అన్న యర్థములు కలుగవు. ఇట్టి యెడల బాణశబ్దముచేత శరమును భావించి, తచ్ఛబ్దముచేత ఇతరార్థములను గ్రహించుచో నేయార్థమగును.

పశు శబ్దమునకు గోవన్న యర్థమున్నది. గోశబ్దమునకు బాణము, కిరణము, స్వర్గము మొదలైన యర్థము లున్నవి. కాని పశుశబ్దముచేత బాణాదులు ప్రతీయ మానములు కావు. అట్లు కానివానిని గ్రహించి ఆ యాయర్థముల నంటగట్టుట యిచ్చట జరుగుచున్నది. దశరథ శబ్దమునకు పంక్తిరథశబ్దము ప్రయోగములం దున్నది. ఇచ్చట రథశబ్దమును గూడ వేరుగా సాధించుట జరిగినది. 'అనేకజము' అని యనగా 'ద్విజము' అని యర్థము; అనగా 'పక్షి' యని యర్థము. పక్షిపేరు చక్రవాకము. ఇందు కొంతభాగము చక్రము. చక్రములను ధరించి యుండునది రథము. ఇట్లే ఒకదానినుండి మరొక స్వసంకేతితార్థమును సాధించుకొని అను సంధించుటచేత 'దశరథ' శబ్దమునకు కలుగవలసిన యర్థము కలిగినది. ఇట్లే ముఖమునందలి అంశము హనువు. నేత్రము, వక్త్రము, దంతము, ఫాలము—

ఇట్టి దేదయినను సుఖాంశమే. అయినను హనువునందే సంకేతమును స్వయముగా కల్పించుకొనుట యిచ్చట జరిగినది. కావుననే పైవి నేయార్థదోషమునకు లక్ష్యము లయినవి.

## [ సందిగ్ధము ]

న యత్పదం నిశ్చయకృత్ సందిగ్ధ మితి తద్విదుః

యథా–

'నీలలోహితమూర్తి ర్యో దహత్యన్తే జగత్త్రియమ్,
స ఏవ హి మహాదేవ స్త్రిషు లోకేషు పూజ్యతే'
అత్ర వహ్ని రర్కః శివో వేతి న నిశ్చీయతే.

అర్థము : నిశ్చయకరము కాని పదమును ప్రయోగించిన సందిగ్ధ మగును. ఇది లక్షణము. అంత సమయమునందు మూడు లోకములను దగ్ధముచేయు నీల లోహితమూర్తియైన మహాదేవుడే మూడు లోకములందును పూజింపబడుచున్నాడు– అని ఉదాహరణము.

ఇచ్చట అగ్నియో, సూర్యుడో, శివుడో నిశ్చయముగా లేదు.

వ్యాఖ్య : మహాదేవుడు విశేష్యము. నీలలోహితమూర్తి విశేషణము. జగత్త్రియదహనము ప్రసక్తధర్మము. 'వ్రతానా ముత్తమవ్రతమ్' అని యేవ్రతమున కావ్రతమునే ఉత్తమముగా భావించుట సహజము. అట్లే 'మహాదేవుడు' అని అన్న ప్పుడు తన కిష్టమైన హరి హర బ్రహ్మేంద్ర వినాయక కార్తికేయ ప్రభృతులలో నెవ్వరైనను కావచ్చును. విశేషణము నీలలోహితమూర్తి. నీలత్వమును లోహితత్వమును గలిగిన శరీర వర్ణము గలవాడు, నలువును, ఎరుపును గలవాడు. ఈ విశేషణము వలన పై అసంఖ్యాకదేవతావర్గమునుండి కొందరను తొలగింపవచ్చును. అయినను అగ్ని, సూర్యుడు, శివుడు–అను ముగురికి నీలలోహితమూర్తి యన్న విశేషణము సమముగానే అన్వయించును. 'జగత్త్రియ దహనము' అన్న ధర్మము ప్రసక్తమైనది. అదియును ముగ్గురికి సమానమే. కావున మహాదేవ శబ్దము ఎవరిని సంకేతించు చున్నదో నిశ్చయము కాకున్నది. ఇట్లు నిశ్చయించుటకు వీలులేని పదములను

ప్రయోగించుట వలన సందేహము కలుగును. ఇది దోషము. కావుననే దీనికి సందిగ్ధ మను పేరు సార్థక మగుచున్నది.

[నిజమునకు మహాదేవ, నీలలోహిత శబ్దములు శివునియందు రూఢములు. లయకారిత్వము కూడ శివునియందే ప్రతిష్ఠితము. కావున దీనిని సందిగ్ధమున కుదాహరణముగా పేర్కొనుట సరిపడదు. వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తియందు చూపిన యుదాహరణము గ్రహింతము. 'స మహాత్మా భాగ్యవశాన్ మహాపద ముపాగతః' ఆ మహాత్ముడు భాగ్యవశమున మహాపదమును పొందెను– అని యర్థము. ఇచ్చట భాగ్యమనగా అదృష్టమని, మహాపదము అని యనగా గొప్ప పదవి అని యర్థములు. కాని ఆ మహాత్ముడు విధివశమున మహాపదను పొందెను– అనికూడ ఆ వాక్యమునకు అర్థము కలుగును. ఇచ్చట భాగ్యము దురదృష్టము; మహాపద యనగా గొప్పయాపద. ఇంతకును పక్త దేని నుద్దేశించెనో స్పష్టము కానందున, ఇది సందిగ్ధ మను దోష మగుచున్నది.]

[ వి ప రీ త ము ]

13. విపరీతం విరుద్ధార్థ ప్రకల్పన మిహోచ్యతే.

యథా –

'అనుత్తమానుభావస్య పరై రపిహితౌజసః
అకార్య సుహృదోఽ స్మాక మపూర్వాః స్తవకీర్తయః' 13

అత్ర అనుత్తమా ఇత్యనేన యథోత్కృష్ట స్తథాపకృష్టోఽపి. అపిహిత ఇత్యనేన యథా నాచ్ఛాదితం తథాచ్ఛాదిత ముక్తి. అకార్య సుహృదిత్యనేన యథా కార్య మన్తరేణ సుహృదేవ మకార్యే–యః సుహృత్సోఽప్యుచ్యతే. అపూర్వాః కీర్తయ ఇత్యనేన యథాద్భుతాః కీర్తయ ఏవ మకీర్తయోఽప్యుచ్యన్తే.

**అర్థము** : విరుద్ధార్థమును కల్పించు పదమును ప్రయోగించుట 'విపరీతము' అనబడును. ఇది లక్షణము. అనుత్తమానుభావుడవు, పరాపిహిత తేజుడవు, మాకు అకార్యమిత్రుడవు నైన నీ కీర్తులు అపూర్వములు – అని ఉదాహరణము.

ఇచ్చట 'అనుత్తమ' మన్న విశేషణము ఉత్కృష్టమని చెప్పినట్లే అపకృష్ట మని కూడ చెప్పును. 'అపిహిత' మన్నది అనాచ్ఛాదిత మని, ఆచ్ఛాదితమని రెండర్థములను తెల్పును. 'అకార్యమిత్రు' డన్నప్పుడు ప్రయోజన మేమియు నపే క్షింపని మిత్రుడని, చెడ్డపనులయందు మాత్రమే మిత్రుడని రెండర్థములు కలుగును. 'అపూర్వకీర్తు' లని యన్నప్పుడు అద్భుతమైన కీర్తులనియు అకీర్తులనియు రెండర్థ ములు కలుగును.

వ్యాఖ్య · ఇది ప్రశంసాపరమైన శ్లోకము. మహోత్తమానుభావుడవు, శత్రువుల చేత కప్పబడని తేజము గలవాడవు, నిర్వ్యాజమిత్రుడవు నైన నీ కీర్తులు అద్భుతములు — అన్న యర్థమే యుద్దిష్టము. కాని, శ్లోకమునందు ప్రయుక్తములైన అనుత్తమాది పదములచేత ప్రసక్తమైన ప్రశంసనముతోపాటు అప్రసక్తమగు అభి శంసనమునకు నైత మవకాశము కలుగుచున్నది. 'న + ఉత్తమః' అని యన్న ప్పుడు ఉత్తమముకానిది, అనగా హీనమని యర్థము. ఇది నఞ్ తత్పురుషము. 'ఉత్తమః న విద్యతే యస్మాత్ సః అనుత్తమః' అని యన్నప్పుడు నఞ్ బహువ్రీహి యగును. దేనికంటె ఉత్తమములేదో అది అనుత్తమము, అనగా సర్వోత్తమ మని యర్థము. ఈ రెండును పరస్పర విరుద్ధార్థములు. 'ధా' ధాతువునకు 'అపి' అన్న ఉపసర్గ చేరును. దాని భూతకాలిక క్రియాజన్య విశేషణ రూపము 'అపిహితమ్'. ఇచ్చట 'అ' వైకల్పికముగా లోపించును. కావున 'అపిహిత'మని యన్నప్పుడు ఆచ్ఛాదిత మని, అనాచ్ఛాదిత మని రెండర్థములు కలుగును. ఒకచోటి అవర్ణము 'అపి' యన్న ఉపసర్గకు చెందినది; రెండవచోటిది నఞర్థ బోధకము. 'అకార్యేషు మిత్రమ్' అన్నప్పుడు చెడ్డపనులయందు మాత్రమే మిత్రుడన్న యర్థము వచ్చును. 'కార్యం ప్రయోజనం నాపేక్షతే' స్వప్రయోజనము నపేక్షింపని మిత్రుడని యర్థము. ఇట్లే 'అపూర్వకీర్తులు' అన్న పదము కూడ రెండు విరుద్ధార్థములను కలిగించును. ఇట్లు ఉద్దిష్టార్థమునకు విపరీతమైన యర్థమును కల్పించు పదములను ప్రయోగించుట చేతనే, యిది విపరీత మన్న దోషముగా పరిగణనము నొందినది. [దోషసంఖ్యా నమునందు 'విరుద్ధము' అని తెలుపబడినది]

### [ అ ప్ర యో జ క ము ]

అప్రయోజక మిత్యాహు రవిశేష విధాయకమ్.

యథా—

‘తమాలశ్యామలం క్షార మత్యచ్ఛ మతిఫేనిలమ్
వాలేన లంఘయామాస హనూమా నేష సాగరమ్’ 14

అత్ర తమాల శ్యామల మిత్యాదీని సాగరవిశేషణాని తాని న హనూమతో లంఘనే౽తిశయం సూచయన్తి.

**అర్థము** : విశేషమును విధింపలేని పదమును ప్రయోగించినచో అప్రయోజకమని యందురు. ఇది లక్షణము. చీకటి చెట్లవలె నల్లనిది, ఉప్పనిది, అతిస్వచ్ఛమైనది, మిక్కిలి నురుగు కలది యైన సముద్రమును ఈ హనుమంతుడు వాలముతో దాటెను— అని యుదాహరణము.

ఇక్కడ ‘చీకటి చెట్లవలె నల్లనిది’ మొదలయినవి సముద్రమునకు విశేషణములుగా వాడబడినవి. వీనివలన హనుమంతుడు సముద్రమును దాటుటలో గల గొప్పదనము సూచిత మగుట లేదు.

**వ్యాఖ్య** : విశేషణము లెప్పుడును విశేష్యముయొక్క విశేషములనే తెల్పును. ఇక్కడకూడ ‘తమాలశ్యామలం, క్షారం’ మున్నగునవి సముద్రముయొక్క విశేషములనే తెల్పుచున్నవి. కాని ప్రకృతవిషయము హనుమంతుడు సముద్రమును దాటుట. ఈ వర్ణనమున హనుమంతుని కతిశయము కలుగవలయును. దాటుటకు శక్యముకాని సముద్రమును దాటె నన్నచో ఉద్దిష్టప్రయోజనము సిద్ధించును. పైనున్న విశేషణములవల్ల లంఘనాసాధ్యమైన సముద్రమును హనుమంతుడు లంఘించె నన్న భావమునకు పుష్టి చేకూరుటలేదు. ప్రయోజనమును చేకూర్పలేని పదముల ప్రయోగమును బట్టియే ఇది అప్రయోజకమన్న దోషముగా పరిగణింపబడు చున్నది.

## [ దేశ్యము ]

14. తద్దేశ్య మితి నిర్దిష్టం య దవ్యుత్పత్తిమత్ పదమ్.

యథా—

‘గల్లా లావణ్యతల్లా త్తే లడహా మడహా భుజా
నేత్రే తే వోసట్ట కన్దోట్ట మోట్టాయిత సఖీ నఖీ’ 15

అత్ర గల్లాదయః శబ్దా అవ్యుత్పత్తిమన్తో దేశ్యా దృశ్యన్తే.

**అర్థము** ; అవ్యుత్పన్నమయిన పదమును ప్రయోగించిన 'దేశ్య' మను దోషముగా నిర్ణయింతురు. ఇది లక్షణము. నీ చెంపలు అందాల కొలకులు; భుజములు మనోహరములును కృశములును, కన్నులు వికసించిన నల్లగలువల విలాసములకు నెచ్చెలులు — అని ఉదాహరణము.

ఇచ్చట అవ్యుత్పత్తి మంతములైన గల్లాదిశబ్దములు దేశ్యములుగా కనబడుచున్నవి.

**వ్యాఖ్య** : దేశీయుల వ్యవహారమునందు పుట్టి, ప్రతిష్ఠనొందిన పదములను దేశ్యములుగా పరిగణింతురు. అందు కొన్నింటికి ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి వ్యుత్పత్త్యర్థమును తెల్పుటకు వీలుండును; కొన్నింటికి అట్లు విభాగము చేయుటకు వీలుకాదు; వ్యవహార రూఢమైన యర్థమే కాని వ్యుత్పత్త్యర్థ ముండదు. ఇచ్చట ఇట్లు విభాగము చేయుటకు వీలు కాక, వ్యుత్పత్త్యర్థమును చెప్పుటకు వీలులేని పదమునే దేశ్యముగా పరిగణించుట జరిగినది. అట్టి పదమును ప్రయోగించుటచేత దేశ్య మను దోషము కలుగును.

పై శ్లోకమునందు గల్ల శబ్దము కలదు. కొందరు దీనిని గండ శబ్దవికృతిగా తలతురు. కాని సంస్కృత శబ్దముగా దీని కనేక ప్రయోగములు కలవు. ఒకటి కావచ్చును. గండ శబ్దమునకు వికృతిగా దేశభాషయందు వ్యవహారప్రాచుర్యమునొంది, తిరిగి రూపాంతరముతో సంస్కృతములో ప్రవేశించి యుండవచ్చును. 'వచ్చు' నని యూహను తెల్పుటయే కాని, తేల్చిచెప్పుట కవకాశము లేదు. ఇట్లే తల్ల, లడహ, మడహ, వోసట్ట, కన్దోట్ట, మోట్టాయిత శబ్దములకును వ్యుత్పత్తి గోచరము కాదు. అనగా, ఇవి అవ్యుత్పన్నము లని యర్థము. ఇట్లు అవ్యుత్పన్నములైన పదములను ప్రయోగించుట 'దేశ్యము' అను దోషమును కలిగించును.

[సంస్కృతభాషయం దిట్టి పదములను వాడుట దోషము. దేశభాషలందు పెక్కుపదము లవ్యుత్పన్నములు. అందువలన అచ్చట అవ్యుత్పన్నత దోషముగా లెక్కకు రాదు.]

గల్లము = చెక్కిలి; తల్లము = కొలను: లడహము = మనోహరము; మడహము = కృశము; వోసట్టము = వికసితము; కన్దోట్టము = నల్లగలువ;

మోట్టాయితము = విలాసము॥ ఇవి దేశ్యములయిన ఆ పదములకు వ్యవహారమున నున్న యర్థములు.

[ గ్రామ్యము ]

అశ్లీలామంగల ఘృణావదర్థం గ్రామ్య ముచ్యతే.

15. అత్రాశ్లీల మసభ్యార్థ మసభ్యార్థాన్తరం చ యత్
అసభ్య స్మృతిహేతుశ్చ త్రివిధం పరిపఠ్యతే.

తేష్వసభ్యార్థం యథా -

'ఛత్రాకార శిరాః శిరాలస రసస్థూల ప్రకాణ్డో మహా
న్మధ్యే భానుసుతా త్రిభసింధు విపులాభోగో వటః పాతు వః
కామ్యైక్యే వికటప్రసారిత మహాజంఘం మహీసుప్తయో
ర్యైః ఖండేన్దు కిరీట కైటభజితోః కాటప్రియం కర్షతి' 16

అత్రైతచ్ఛత్రాకార శిరాః కాట ఇత్యాదే రసభ్యార్థత్వా దసభ్యార్థమ్.

అర్థము: అశ్లీలము, అమంగళము, అసహ్యము నైన యర్థమును కలిది గ్రామ్య మనబడును.

ఇచ్చట అసభ్యార్థము, అసభ్యార్థాంతరము, అసభ్యస్మృతి హేతువు - అని అశ్లీలము మూడువిధములు.

అసభ్యార్థమునకు లక్ష్యము - నేలపైని విశ్రమించు శివకేశవుల శరీర సంగమమున వికటముగా చాపిన మహాజంఘలను కలిగిన కటిసౌభాగ్యమును తులకింపజేయుచు గొడుగువంటి ఆకారముగల అగ్రభాగమును, శిరాలము సరసము స్థూలము నైన ప్రకాండమును గలిగి యమునా గంగా మధ్య దేశముననున్న మహావట వృక్షము మిమ్ములను కాపాడును గాక!

ఛత్రాకార శిరము, కాటము మొదలయిన పదముల అసభ్యార్థత్వమువల్ల అసభ్యార్థము.

వ్యాఖ్య : గ్రామ్యమును రచయిత మరల మూడు విధములుగా విభాగించు చున్నాడు. అశ్లీలార్థము, అమంగళార్థము, అసహ్యార్థము అనునవి ఆ భేదములు.

ఇందు మొదటిదైన అశ్లీలార్థము అసభ్యార్థము, అసభ్యార్థాంతరము, అసభ్య స్మృతిహేతువు అని మూడు విధములు.

శ్రీః యస్యాస్తి తత్ శ్లీలమ్. శ్రీ అనగా శోభ. శోభను కలది శ్రీలము; అదే శ్లీలము. న శ్లీలమ్ అశ్లీలమ్. శ్లీలముకానిది అశ్లీలము. శోభాకరము కాని దని యర్థము. సభాయాం సాధు రితి సభ్యమ్. సభయందు సాధువైనది సభ్యము. సభావ్యవహారార్హమైన దని యర్థము. అట్లు కానిది అసభ్యము. అశ్లీల మన్నను అసభ్యమన్నను తాత్పర్య మొక్కటే. కాని శాస్త్రమునందు ప్రకృతము, అప్రకృతము, ఏకదేశస్థితము నై అది పైని చెప్పినట్లు మూడు విధము లగుచున్నది.

ప్రకృతము అసభ్యార్థము. పైని చూపిన లక్ష్యమువందు రెండు నదులకు మధ్య నున్న వటవృక్షము చెప్పబడినది. ఒక నది యమున — నల్లగా నుండును; రెండవది గంగ — తెల్లగా నుండును. విష్ణువు నల్లనివాడు, శివుడు తెల్లనివాడు. ఆ నదులు నేలపైని నిద్రించుచు వికటముగా చాపిన శివ విష్ణువుల కాళ్ళవలె నున్నవి. భాను సుతాభ్రసింధువులకు వ్యత్యస్త క్రమములో ఖండేందుకిరీట కైటభజితులు చెప్పబడిరి. దీనివిబట్టి వారి కాళ్ళైక్యము చేత ఒక్కొక్కరి కొక్కొక్క కాలే కనిపించుచున్న దనవలయును. కాళ్ళను నదులుగా పోల్చి తన్మధ్యమైన వటమును కాటశ్రీగా నిరూ పించుట జరిగినది. కాటశ్రీ యనగా కటిశోభ అని స్థూలమైన యర్థము. కాళ్ళు చాచుకొనుట, కటిశోభ — అను విషయములు అసభ్యములు.

ఇంక వటమున కుపయోగించిన విశేషణము లు ఛత్రాకారశిరము, శిరాల పరిన ష్ఠూలప్రకాండము అనునవి పైవర్ణన కనుకూలముగా పురుష గుహ్యావయవ స్ఫోరక ములై యున్నవి. కావుననే యిది అసభ్యార్థమున కు లక్ష్యమైనది.

అసభ్యార్థాన్తరం యథా —

'విద్యా మభ్యసతో రాత్రా వేతి యా భవతః ప్రియా
వనితా గుహ్యకేశానాం కథం తే పేలబంధనమ్' 17

తదేతద్ యా భవతఃప్రియా గుహ్యకేశానాం పేలబంధన శబ్దానా మసభ్యార్థాన్తరత్వా దసభ్యార్థాన్తరమ్

అర్థము: అసభ్యార్థాంతరమునకు ఉదాహరణము. రాత్రియందు విద్య నభ్యసించుచున్న నీకడకు నీయొక్క ప్రియురాలు వచ్చును. ఆమెయక్షేశ్వరుల వనిత. ఇంక నీకు ధనము తక్కువగుట యెట్లు ? (పుష్కలముగా ధనము లభించు నని భావము.)

ఇచ్చట 'యా భవతః ప్రియా' 'గుహ్యకేశానామ్' 'పేలబంధనమ్' అను శబ్దములకు అసభ్యమైన అర్థాంతర ముండుట చేత ఇది అసభ్యార్థాంతరము.

వ్యాఖ్య : ప్రకృతమైన యర్థము సభ్యమై, అప్రకృతమైన యర్థము అసభ్యమైనపుడు అసభ్యార్థాంతర మను దోష మగును.

'యా భవతః ప్రియా' ఎవతె నీయొక్క ప్రియురాలో అని ప్రకృతార్థము. కాని 'యాభవతః ప్రియా' అని యన్నప్పుడు 'యాభో మైథునం తద్వతః ప్రియా' అని అర్థాంతరము కలుగును. యాభము అని యనగా మైథున మని యర్థము; అది కలవాడు యాభవంతుడు. అతని ప్రియ 'యాభవతః ప్రియా'. ఇది అసభ్యమైన అర్థాంతరము.

వనితా గుహ్యకేశానామ్' గుహ్యక ప్రభువులయొక్క వనిత అని ప్రకృతార్థము. 'వనితా గుహ్యమ్' అని యన్నచో 'యోని' యని యర్థము. 'తస్య కేశానామ్' దానియొక్క కేశములకు అని యసభ్యమైన యర్థము. ఇది యర్థాంతరము.

'పేలబంధనమ్'అని యన్నప్పుడు 'వబయో రభేదః' అనుదాను బట్టి 'పేలవం ధనమ్' అని యగును. పేలవ మనగా అల్పమైన యని, ధనమ్మనగా సంపద యని ప్రకృతార్థము. కాని 'పేల' శబ్దమునకు వృషణ మన్న యర్థము గలదు. బంధనమ్మనగా కట్టియుంచుట. 'ఇంక వృషణబంధన మెట్లు?' అన్న అసభ్యమైన యర్థాంతరము కలుగుచున్నది. కావుననే యిది అసభ్యార్థాంతరమునకు లక్ష్యమైనది.

అసభ్యస్మృతిహేతు ర్యథా —

'ఉత్కమ్పయసి మాం చూత పికవాక్కాటవేన కిమ్
కృతః కృకాటికాయాం తే పాదః ప్రాణేన యాస్యతా'

తదిదం కాటవ కృకాటికా పదయో రసభ్యస్మృతిహేతుత్వా దసభ్య స్మృతిహేతుతా.

అర్థము : అసభ్యస్మృతి హేతువున కుదాహరణము. చూతమా! కోకిల వాక్కుల కటుత్వముచేత నన్నేల కంపింపజేసెదవు? పోవుచున్న ప్రాణముతో నేను నీ గొంతుక పైని పాదమూనితిని గదా !

ఇచ్చట కాటవ కృకాటికా పదములు అసభ్యస్మృతిహేతుత్వమువల్ల అసభ్య స్మృతిహేతు వన్న దోషము కలుగుచున్నది.

వ్యాఖ్య : పదమునందలి అంశమాత్రముచేత అసభ్యార్థము స్ఫురించిన యెడల అసభ్యస్మృతిహేతు వగును. ఇచ్చట అర్థాంతరము చివరంట నన్వయము నొందదు. పదాంశముచేత అసభ్యార్థ స్మృతిమాత్రమే కలుగును.

'పికవాక్కాటవేన' అన్నచోట 'కటుత్వ'మనుటకు బదులుగా 'కాటవ'శబ్దము ప్రయుక్తమైనది. వ్యాకరణమును బట్టియు, అర్థమును బట్టియు దోషము లేదు. కాని తొలి రెండక్షరములును వినబడినంతనే 'కాట' శబ్దస్ఫురణము కలుగును. 'కట సంబంధమైన' అన్న అర్థాంతరము స్మరణకు వచ్చును. ఇది యింత మాత్రమే. తరువాతి పదములతో దీని కన్వయము లేదు. ఈపాటి అసభ్యార్థస్మరణము కూడ దూష్యమే. కావుననే దీనిని దోషముగా పరిగణించుట జరిగినది.

అట్లే 'కృకాటికా' శబ్దమునకు 'గొంతుక' యన్నది ప్రకృతార్థము. ఆద్యక్షరమును విడువగా 'కాటికా' యన్న శబ్దము వినిపించును. 'కాట' శబ్దమునకే 'ఇక' ప్రత్యయము రాగా 'కాటికా'అని యగును. 'కాట ఏవ కాటికా'. కాటమన్నను 'కాటిక' యన్నను అర్థమొక్కటే. కటి సంబంధమైనది—మొల యన్న అసభ్యార్థము స్మరణకు వచ్చును. కావుననే యిది దోషము.

16. లోకేషు య దశ్లీలార్థ మశ్లీలార్థాన్తరం చ యత్
అశ్లీల స్మృతిహేతు శ్చామంగలార్థం త్రిధైవ తత్

అర్థము : అమంగళార్థ మను గ్రామ్యవిభాగము అశ్లీలార్థము, అశ్లీలార్థాంతరము, అశ్లీలస్మృతి హేతువు అని తిరిగి మూడు విధములుగా నుండును.

తేష్వశ్లీలార్థం యథా -

'ఖేటకే భక్తసూపస్య వలభ్యాః పత్తనస్య చ
అతృప్తోఽహం మరిష్యామి హే హలే భాషితస్య చ' 19
అత్ర మరిష్యా మీతి పద మశ్లీలార్థమ్.

అర్థము : అమంగళార్థమునం దొక విభాగమైన అశ్లీలార్థమున కుదాహరణము. సూపాన్నమునకు, వలభిపట్టణమునకు 'హే హలే' యనెడి పలుకునకు తృప్తి పొందని నేను గ్రామమునందు చచ్చిపోవుదును.

ఇచ్చట 'చచ్చిపోవుదును' అని యనుట అశ్లీలార్థము.

వ్యాఖ్య : మంగళము అని యనగా శుభ మని యర్థము. అశుభము అమంగళము. అది ప్రకృతమైనపుడు అశ్లీలామంగళార్థ మగును.

ప్రకృతోదాహరణమునందు 'మరిష్యామి' అను పదము 'చచ్చిపోవుదును' అని భవిష్యదర్థమునందు ప్రయోగింపబడినది. పట్టణమునందు సౌఖ్యము సమృద్ధిగా నున్నది. సౌందర్యము సంపన్నమై యున్నది. స్వాదువైన పప్పన్నము లభించును; అనగా భోజనసమృద్ధి కలదని భావము. 'హే' యని 'హలే' యని ('ఓసీ' యని 'సఖీ' యని) రమణీమణు లొకరినొకరు పిలుచుకొనుచుందురు. అటువంటి పిలుపులతో, అటువంటి రమణీమణులతో నిండినది వలభి పట్టణము. పట్టణమునందలి సౌఖ్యనిధానములను చూచి చూచి, అనుభవించి అనుభవించి, అప్పటికిని తృప్తితీరనివాడై 'చచ్చిపోవుదును' అనుచున్నాడు. గ్రామజీవితమునం దిష్టములేనివాడై పట్టణజీవితమునందు తనివి తీరనివాడై వక్త యీ విధముగా పలుకుచున్నాడు. ఇది వలభి

పట్టణము యొక్క అపార సౌఖ్యమయ జీవితమునే ఆవిష్కరించును. అయినను 'చచ్చిపోవుదును' అన్నమాట అశస్తార్థమునే వెల్లడించుచున్నది.

అశస్తార్థాన్తరం యథా –
'ప్రవాసయతి యా కాన్తం వసన్తే గృహసంస్థితమ్
వినా శపథదానేన పిశాచీ సా న చాంగనా' 20

అత్ర ప్రవాసయతి, సంస్థితం, వినాశపథదానేన, పిశాచీ పదానా మశస్తార్థాన్తరత్వమ్.

**అర్థము** : అమంగళార్థమున ద్వితీయవిభాగమైన అశస్తార్థాంతరమునకు ఉదాహరణము. ఇంటియందున్న భర్తను వసంతకాలమునందు శపథమువంటి నిర్బంధ మేమియు లేకుండగనే ప్రవాసమునకు పంపించెడిది స్త్రీ కాదు – పిశాచియే. (పిశాచి వంటి దని భావము;)

ఇచ్చట ప్రవాసయతి, సంస్థితం, వినాశపథదానేన, పిశాచీ – అను పదములకు అశస్తార్థాంతరత్వము కలదు.

**వ్యాఖ్య** : ప్రకృతమైన యర్థము సరియైన దైయుండి, అప్రకృతమైన యర్థము అమంగళకర మైనచో అశస్తార్థాంతరము అన్న దోష మగును.

ఇచ్చట అశస్తార్థము శ్లేషజన్యము. ప్రవాసమని యనగా దేశాంతరవాసమని ప్రకృతార్థము. ఉచ్చాటన మని అర్థాంతరము. 'గృహసంస్థితం కాంతమ్' గృహమునందు సుఖముగా నున్న భర్తను అని ప్రకృతార్థము; ఇంటియందు ఆవేశించి యున్న భూతమును అని అర్థాంతరము. 'వినా శపథదానేన' శపథదానము లేకుండ అని ప్రకృతార్థము; వినాశపథమును కల్పించుటచేత అని అర్థాంతరము; 'పిశాచి' అనగా పిశాచమువంటిదని, దారుణ కర్మ చేయునదని ప్రకృతార్థము. 'పిశిత మశ్నాతీతి పిశాచీ' అన్న వ్యుత్పత్తిని బట్టి మాంసభక్షకురాలు అన్న యర్థాంతరము కలుగును.

ఇచ్చటి అర్థాంతరము లన్నియు అమంగళకరములు. కావుననే, యిది అశస్తార్థాంతర మన్న దోషమునకు లక్ష్యమైనది.

అశ్లీల స్మృతిహేతు ర్యథా -

'మారీచోఽయం మునిర్యస్య కృత్యాః కాలాంతకాలయే
పత్న్యాం సంక్రందనాదీనాం సుతానా మాప్తయేఽభవన్' 21

అత్ర మారీచ, కృత్యా, కాలాన్తక, సంక్రందన పదానా మశ్లీలార్థస్మృతిహేతుత్వమ్.

**అర్థము:** అమంగళార్థమునందు తృతీయ విభాగమైన అశ్లీలస్మృతిహేతువున కుదాహరణము. ఈయన మరీచినందనుడైన కశ్యపుడు. ఈశ్వరాలయమునందు ఈయన చేసిన పూజలు ఆరాధనలు మున్నగునవి భార్యయందు ఇంద్రాది నందనులను పొందుటకు తగియున్నవి.

ఇచ్చట మారీచ, కృత్యా, కాలాంతక, సంక్రందన పదములకు అశ్లీలార్థ స్మృతిహేతుత్వము కలదు.

**వ్యాఖ్య :** ఇచ్చట పదైకదేశముచేతనే అశ్లీలార్థము స్మరణకు వచ్చును. చివరంట అర్థాంతర మన్వితము కావలసిన యవసరము లేదు.

'మారీచః' అని యన్నప్పుడు ప్రకృతార్థము కశ్యపుడు. ఇందు ఏకదేశమైన 'మారీ' మారకవ్యాధి యన్న యర్థాంతరమును స్మరింపజేయును. 'కృత్యాః' అన్నది 'పూజాః' మున్నగు విశేష్యమునకు విశేషణముగా ప్రయుక్తమైనది. ఇది ప్రకృతార్థము. 'కృత్యా' అను ఏకవచనపద స్ఫురణముచేత మారకశక్తి స్మృతికి వచ్చుచున్నది. 'కాలస్య అంతకః' అన్న యర్థమున ఈశ్వరుడు; ఇది ప్రకృతార్థము; యముని నాశనము గావించినవాడని యర్థము. 'కాలే అంతకః' తత్ క్షణమే అంతము నొందించువా డన్నది అప్రకృతార్థము. సంక్రందను డనగా ఇంద్రుడు. ఇది ప్రకృతము. ఇందు ఏకదేశము 'క్రందన' రోదనార్థకము. ఇది అప్రకృతము.

ఇట్లు అమంగళకరములైన అర్థాంతరములు పదైకదేశములచేత స్మరింపబడుట కారణముగా దీనిని అశ్లీలస్మృతిహేతు వను దోషముగా పరిగణింతురు.

17\. పద మర్థం ఘృణావ న్తం యదాహార్థాన్తరం చ యద్
ఘృణావత్ స్మృతిహేతు ర్యత్తద్ ఘృణావదిహ త్రిధా.

అర్థము : ఏవగింపును గలిగించు నర్థముగల పదము ఘృణావంతము. అది ఘృణావదర్థము, ఘృణావదర్థాంతరము, ఘృణావత్ స్మృతి హేతువు—అని మూడు విధములుగా నుండును.

తేషు ఘృణావదర్థం యథా –

'పర్దతే హ్రాదతే స్తన్యం వమత్యేష స్తనంధయః
ముహూరుత్కాలతి నిష్ఠీవత్యా త్తగర్భా పునర్వ్యధూః' 22

పర్దతే, హ్రాదతే, వమతి, నిష్ఠీవతీతి శబ్దానాం ఘృణావదర్థత్వమ్.

అర్థము : వానియందు ఘృణావదర్థమున కుదాహరణము. పాలు త్రాగెడి పిల్లవాడు గాలిని విడుచుచున్నాడు, విరేచనములు చేసికొనుచున్నాడు. పాలను క్రక్కు-కొనుచున్నాడు; తిరిగి గర్భవతి అయిన ఆ యువతి మాటిమాటికి త్రేన్చుచున్నది, ఉమియుచున్నది.

ఇచ్చట పర్దతే, హ్రాదతే, వమతి, నిష్ఠీవతి అను శబ్దములకు ఘృణావదర్థత్వము కలదు.

వ్యాఖ్య : త్రేన్చుట, ఉమియుట యన్నవి అసహ్యతను కలిగించును. పిల్లవాడు పాలను క్రక్కుకొనుట మొదలయినవి కూడ జుగుప్సను కలిగించునవే. గర్భవతియొక్క స్తన్యమును త్రాగరాదు. తత్ స్తన్యము జీర్ణము కాకపోవుటచేత పిల్లవానికి సహజముగా కలుగు వ్యాధిలక్షణములే యిందు వర్ణితములు. ఇవి యెంత సహజములైనను చూచువారికి రోతను కలిగించును. కావుననే ఘృణావదర్థ మను దోషమునకు లక్ష్యమైనవి.

ఘృణావదర్థాన్తరం యథా –

'బాష్పక్లిన్నా విమౌ గండౌ విపూయాపాండరౌ తవ
ప్రియోఽగ్రే విష్ఠితః పుత్రి స్మితవర్చోభి రర్చతి' 23

అత్ర క్లిన్న,గండ, విపూయా, విష్ఠిత, వర్చః పదానాం ఘృణావదర్థాన్తరత్వమ్.

అర్థము : ఘృణావదర్థాంతరమున కుదాహరణము. కుమారీ ! కన్నీటితో తడిసినవై మురళుగడ్డివలె తెల్లనివైన నీ కపోలములను (చూచుచు) నీ యెదుటనే కూర్చుండి నీ ప్రియుడు స్మితకాంతులతో అర్చించుచున్నాడు.

ఇచ్చట క్లిన్న, గండ, విపూయా, విష్ఠిత, వర్చః పదములకు ఘృణావద ర్థాంతరత్వము కలదు.

వ్యాఖ్య : ప్రకృతార్థమే జుగుప్సాకరమై యున్నచో మొదటి భేదమయిన ఘృణావదర్థ మగును. ప్రకృతార్థము సాధువేయైయుండి అప్రకృతార్థము జుగుప్సా కరమై యున్నచో ద్వితీయ భేదమయిన యీ ఘృణావదర్థాంతర మగును. ఇచ్చటి అర్థాంతరము శ్లేషసాధ్యము.

గండము అని యనగా కపోలము అని ప్రకృతార్థము; పుండ్లని అప్రకృతా ర్థము. బాష్పక్లిన్నములు అని యనగా కన్నీటితో తడిసిన వని ప్రకృతము; వేడిచేత మెత్తబడిన వని అప్రకృతము. విపూయ మనగా ముంజగడ్డి యని ప్రకృతము: వి + పూయ + అపాండరా అని యనగా విశేషమైన రసిచేత మిక్కిలి తెల్లబడినవని అప్రకృతము.

'విష్ఠితః' అని యనగా విశిష్టరూపమున నున్నవా డని ప్రకృతము. 'విష్ఠా సంజాతా అస్య' పురీష మీతని నుండి పుట్టిన దని అప్రకృతము. 'వర్చః' అని యనగా తేజస్సని ప్రకృతము; పురీష మని అప్రకృతము.

ఇట్లు చివరంట ప్రకృతార్థముతో అప్రకృతమైన అసహ్యార్థము కూడ అన్వ యము కలిగియే యున్నది. కావుననే దీనిని ఘృణావదర్థాంతరమునకు లక్ష్యముగా గ్రహించుట జరిగినది.

ఘృణావత్ స్మృతిహేతుర్యథా -

'ప్రత్యాయ్యోద్గారవన్తో రూఢాఘాని మదనేషు వ్రణాని నః
హృదయం క్లేదయన్త్యేతే పురీషణ్డా మహాద్రుమాః' 24

అత్ర రూఢ, వ్రణ, క్లేద, పురీషణ్డ పదానాం ఘృణావత్ స్మృతి హేతుత్వమ్.

అర్థము : ఘృణావత్ స్మృతి హేతువున కుదాహరణము. పరస్పరాను రక్తులమైన మాకు మన్మథబాణముల ధ్వనులు ప్రసిద్ధములు; పట్టణమునందు గుంపుగా నున్న యీ మహావృక్షములు హృదయము నార్ద్రము గావించుచున్నవి.

ఇచ్చట రూఢ, వ్రణ, క్లేద, పురీషండ పదములకు ఘృణావత్స్మృతి హేతుత్వము కలదు.

వ్యాఖ్య : ఇచ్చట పదైకదేశము చేతనే అసహ్యార్థము స్మరణకు వచ్చును. చివరంట అర్థాంతర మన్వయము నొందవలసిన యవసరము లేదు.

'వ్రణాని' అన్న పదమునకు 'రూఢాని' యన్నది విశేషణము. ఈ రెండింటిని కలుపగా 'మొనతేలిన కురుపులు' అన్న అర్థాంతరము స్ఫురించును. 'క్లేదయన్తి' అన్నప్పుడు తడితడిగా చేయుచున్న వన్న యర్థము కలుగును. 'పురీ' 'షండ' అన్న పదములు సమసించి 'పురీషండ' అని కాగా అందేకదేశమైన 'పురీషం' విష్ఠార్థకమై రోత జనింపజేయును. ఇట్లు పదైకదేశములచేత ఘృణావంతమైన యర్థము స్మరణకు వచ్చుచుండుటవల్ల, ఇది ఘృణావత్స్మృతి హేతువునకు లక్ష్యమైనది.

ఇంతటితో పదదోషములు సమాప్తములు. ఇప్పుడింక వాక్యదోషములను భోజదేవుడు ప్రదర్శించుచున్నాడు.

## వా క్య దో ష ము లు

18. శబ్దహీనం క్రమభ్రష్టం విసంధి పునరుక్తిమత్
వ్యాకీర్ణం వాక్యసంకీర్ణ మపదం వాక్య గర్భితమ్.

19. ద్వే భిన్న లింగవచనే ద్వే చ న్యూనాధికోపమే
భగ్న చ్ఛందో యతీ చ ద్వే అశరీరం మరీతిమత్.

20. వాక్యస్యైతే మహాదోషాః షోడశైవ ప్రకీర్తితాః
అథైషాం లక్ష్మ సంక్షేపాత్ ససిదర్శన ముచ్యతే.

అర్థము : వాక్యదోషములు పదునారు. అవి 1. శబ్దహీనము 2. క్రమభ్రష్టము 3. విసంధి 4. పునరుక్తిమంతము 5. వ్యాకీర్ణము 6. వాక్య సంకీర్ణము

7. అపదము 8. వాక్యగర్భితము 9. భిన్నలింగము 10. భిన్నవచనము 11. న్యూనోపమము 12. అధికోపమము 13. భగ్నచ్ఛందము 14. భగ్నయతి 15. అశరీరము 16. అరీతిమంతము.

ఇంక సంక్షేపముగా వీనికి లక్షణములును, లక్ష్యములును చెప్పబడుచున్నవి.

[ శ బ్ద హీ న ము ]

21. ఉచ్యతే శబ్దహీనం తద్వాక్యం యదపశబ్దవత్.

యథా-

'నీరంధ్రం గమితవతి క్షయం పృషత్కై-
ర్భూతానా మధిపతినా శిలావితానే
గాణ్డీవీ కనకశిలానిభం భుజాభ్యా
మాజఘ్నే విషమ విలోచనస్య వక్షః' 25

అత్ర గమితవతీతి క్తవతోః కర్మణి, ఆజఘ్న ఇతి ఆత్మనే పదస్యాస్వాంగ కర్మణి ప్రయోగా దపశబ్దౌ. తౌ చ శిలావితాన ప్రత్యక్షవక్షః సంబంధాద్ వాక్యదోషౌ జాయమానౌ అసాధునామ్నః పదదోషాద్ భిద్యేతే.

**అర్థము :** అపశబ్దములను కలిగియున్న వాక్యము శబ్దహీన మనబడును. ఇది దోషము. భూతాధిపతిచేత బాణములచేత శిలాసమూహము క్షయమును పొందింపబడినది కాగా గాండీవి విషమవిలోచనుని (శివుని) యొక్క దట్టమైన వక్షమును తన రెండు చేతులతోను బాదెను. ఇది లక్ష్యము.

ఇచ్చట 'గమితవతి' యని కర్మార్థకమున క్తవతు ప్రత్యయమును, 'ఆజఘ్నే' యని అస్వాంగకర్మార్థకమున ఆత్మనేపదిని వాడుట దోషములు. అవి అపశబ్దములు. అవి శిలావితాన ప్రత్యక్షవక్షస్సంబంధము వల్ల వాక్య దోషము లగుచు అసాధు వన్న పదదోషముకంటె భేదించుచున్నవి.

వ్యాఖ్య : ఇచ్చటి యుదాహరణము సంస్కృత వ్యాకరణ విశేషముల నాధారము చేసికొని ప్రవర్తిల్లిన్నది. శ్లోకమునందు 'గమితవతి' యను సప్తమీ విభక్త్యంతమైన శబ్దము కలదు. 'శిలావితానే క్షయం గమితవతి' అన్న అన్వయము చేత 'శిలాసమూహము క్షయము పొందింపబడగా' అన్న యర్థము కలుగును. కాబట్టి యిచ్చటి క్తవతు ప్రత్యయము కర్మార్థమునం దయ్యెననుట స్పష్టము. వ్యాకరణ సంప్రదాయమునుబట్టి 'కర్తరి కృత్' కర్త్రర్థముననే యీప్రత్యయము రావలయును. అట్లు కాక, కర్మార్థమునందు వచ్చుటచేత ఇది దోషము.

'అజఘ్నే' అనుచోట 'హన్' ధాతువు; 'ఆఙ్' ఉపసర్గ. ఇది అకర్మకమైనపుడు మాత్రమే ఆత్మనేపదిగా ప్రయుక్తమగును. 'స్వాంగకర్మకాచ్చ' అని యను చేత స్వాంగము కర్మమైనప్పుడుకూడ ఆత్మనేపదిగా ప్రయోగించుట కవకాశ కలదు. ప్రకృత లక్ష్యమునందు క్రియ అకర్మకము కాదు – సకర్మకము. ఇ యెడల స్వాంగము కర్మమైన ఆత్మనేపదిని వాడవచ్చును. అదియు నిక్కడ కుదురదు. ఇచ్చటి కర్మము విషమలోచనుని యొక్క వక్షము. కావున 'అజఘ్నే' అన్న ఆత్మనేపది ప్రయోగము దుష్టము.

ఇప్పు డింకొక ప్రశ్న యున్నది. 'గమితవతి' అనునదియు 'అజఘ్నే' అనునదియు పదదోషములు కారాదా? వాక్యదోషములుగా పరిగణించుట యేల? దానికి సమాధాన మిది. 'గమితవతి' అను పదము దుష్టము కాదు. కర్త్రర్థమున నైనచో ఇది సాధువే. ఇతర పదములతో అన్వయమును పొందునప్పుడు ఇది కర్మార్థకముగా ప్రయుక్తమయ్యె నని తేలును. అప్పుడిది దోషమగును. కావుననే, యీదోషము పదగతము కాక వాక్యగతము కావలసి వచ్చినది. 'అజఘ్నే' అన్నదికూడ అకర్మకమునందును, స్వాంగకర్మకమునందును సాధువే. 'గాండీవీ విషమవిలోచనస్య వక్షః అజఘ్నే' అని యనుటచేత పై వానికి భిన్నమై వాక్యదోష మగుచున్నది.

ఉదాహరణ శ్లోకము భారవి కిరాతార్జునీయము నందలిది.

[ క్రమ భ్రష్టము ]

క్రమ భ్రష్టం భవే దార్థః శాబ్దో వా యత్ర తత్క్రమః.

యథా –

'తురంగ మథ మాతంగం ప్రయచ్ఛాస్మై మదాలసమ్
కాన్తి ప్రతాపౌ భవతః సూర్యా చంద్రమసోః సమౌ' 26

అత్ర మాతంగ మథ తురంగ మితి వక్తవ్యే తురంగ మథ మాతంగ మిత్యర్థః. కాన్తి ప్రతాపౌ చోక్త్వా, సూర్యాచంద్రమసౌ సమావితి శాబ్దః క్రమభ్రంశో లక్ష్యతే.

అర్థము : అర్థక్రమము కాని శబ్దక్రమము కాని భ్రష్టమైనపుడు ఆ వాక్యము క్రమభ్రష్ట మన్న దోషమునకు లోనగును. (మూలమునందు లక్షణ వాక్యము సక్రమముగా లేదు. 'యత్ర తత్క్రమః' అనుటకు బదులుగా 'యద్ గతక్రమః' అని సవరించుకొనుట సమంజసము.)

మదాలసమైన తురంగమును, లేదా మాతంగము నీతని కిమ్ము. నీయొక్క కాంతి ప్రతాపములు సూర్యచంద్రులతో సమానములు — ఇది ఉదాహరణము.

ఇక్కడ ఏనుగును కాని గుఱ్ఱమును కాని అని చెప్పవలసి యుండగా, గుఱ్ఱమును కాని ఏనుగును కాని అనియనుట ఆర్థిక క్రమభ్రష్టదోషము. కాంతి ప్రతాపములను చెప్పి సూర్యచంద్రులతో సమాన మని చెప్పుటయందు శాబ్దిక క్రమభ్రష్ట దోషము లక్షిత మగుచున్నది.

వ్యాఖ్య : క్రమభ్రష్టము రెండు విధములు. 1. ఆర్థము 2. శాబ్దము. అర్థ సంబంధమైనది ఆర్థము; అదే ఆర్థికము. శబ్ద సంబంధమైనది శాబ్దము; అదే శాబ్దికము.

ఉదాహరణమందలి మొదటి వాక్యము ఆర్థిక క్రమభ్రష్టదోషమునకు లక్ష్యము. తురంగముకంటె విలువైనది మాతంగము; కావున తురంగమునే దానము చేయలేని వాడు మాతంగమును దానము చేయుట మాటమాత్రమునకైనను జరుగదు. కావున దానస్వభావము కలవాడు తన సామర్థ్యమునుబట్టి అతిమూల్య వస్తువు నీయలేనప్పుడు అంతకంటె అల్పమూల్య వస్తువు నిచ్చుట కిష్టపడును. కావుననే 'ఏనుగు నిమ్ము' అని చెప్పినను దాతృసమర్థత అంతటిది కాదని గుర్తించి 'పోనిమ్ము, గుఱ్ఱము నిమ్ము' అని అంతకంటె తక్కువైన దానిని చెప్పుట జరుగవచ్చును. ఇట్లు 'మాతంగము తురంగము' అను క్రమమున చెప్పవలసిన దానిని త్రిప్పి చెప్పుటచేత ఆర్థిక క్రమభ్రష్టదోషము కలుగుచున్నది. ఈ దోషము శబ్దక్రమమును కాక సందర్భము నాశ్రయించుకొని యున్నది.

రెండవ వాక్యము శాబ్దిక క్రమభ్రష్టదోషమునకు లక్ష్యము. సీతయొక్క కాంతి ప్రతాపములు సూర్యాచంద్రమస్సమానములు; కాంతి ప్రతాపములను బట్టి చంద్ర సూర్య లని యుండవలయును. చంద్రుడు కాంతి గలవాడు; సూర్యుడు తీవ్రత కలవాడు. కావున ధర్మవాచకముల క్రమమునుబట్టి ధర్మివాచకముల క్రమము నుండ వలయును. అట్లు కాకపోవుటచేత క్రమము భ్రష్టమైనది. ఇచ్చట శబ్దముల క్రమ భంగముచేత ఈ దోషము కలిగినది. కావుననే, యిది శాబ్దిక క్రమభ్రష్ట దోషమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణ శ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

## [ విసంధి ]

22. విసంహితో విరూపో వా యస్య సంధి ర్విసంధి తత్.

యథా -

'మేఘానిలేన అమునా ఏతస్మిన్నద్రికాననే

మంజర్యుద్గమగర్భాసౌ తర్వాల్యుర్వీ విధూయతే' 27

అత్ర మేఘానిలేన అమునా ఏతస్మిన్నసంహితయా వివక్షామీ త్యభిసంధానం విసంధిః. మంజర్యుద్గమ గర్భాసౌ ఇత్యాదౌ తు విరూప సంధానం విసంధిః.

అర్థము : విసంధి కాని విరూపసంధి కాని కలది విసంధి యగును. ఈ మేఘవాయువు చేత ఈ పర్వతారణ్యము నందలి పూలగుత్తులను ప్రసవించు గర్భము గల యీ చెట్ల సమూహముతోడి భూమి కంపింపజేయబడుచున్నది — ఇది లక్ష్యము.

ఇక్కడ 'మేఘానిలేన — అమునా — ఏతస్మిన్' అనువానిని అసంహితతో వివక్షింతు నన్న అభిసంధానము విసంధి. 'మంజర్యుద్గమగర్భాసౌ' మొదలయిన వాని యందు విరూపసంధానము విసంధి.

వ్యాఖ్య : 'సంధానం సంధిః' చక్కగా కలసి యుండుటకే సంధి యనిపేరు. 'వి' అన్న ఉపసర్గ విగతత్వమునుగాని విరూపత్వమునుగాని సూచించును. ఇచ్చట విసంధిదోషము పై రెండర్థములను కలుపుకొని సంధి లేకపోవుటను, విరూపమైన

సంధిని కలిగియుండుటను గూడ సూచించును. మొదటి దానిని 'విసంహిత' యని రెండవదానిని 'విరూపసంధి' యని స్పష్టతకొరకు పిలువవచ్చును.

'సంహితైకపదే నిత్యా'. ఏకపదమునందు సంధి నిత్యము. దీనినిబట్టి పెర చోట్ల వికల్పమని తెలుచున్నది. కాబట్టి ప్రయోక్త వాక్యమునందలి వేర్వేరు పదము లకు సంధి చేయక విడువ వచ్చును. వ్యాకరణమే యిచ్చుచున్న యీ అవకాశమును వినియోగించు కొనదలచి ప్రకృత గ్రంథకర్త మేఘానిలేన + అమునా + ఏతస్మిన్ అనుచోట చేయవలసిన సంధులను చేయకుండ ప్రకృతి భావముతోనే ప్రయోగించెను.

ఇంక ఉత్తరార్ధము విరూపసంధి కుదాహరణము. ఇందు 'మంజరీ + ఉద్గమ గర్భా + అసౌ'అను పదములు సంధి నొందినవి. అట్లే 'తరు + ఆలీ + ఉర్వీ' అనునవియు సంధించినవి. ఇవన్నియు వ్యాకరణ సమ్మతములైన సంధులే.

పూర్వార్ధమందలి విసంహితకును వ్యాకరణ సమ్మతి యున్నదని చెప్పు కొంటిమి. ఉత్తరార్ధమందలి సంధులును వ్యాకరణ సమ్మతములే. మరి దోష మెక్కడ? వ్యాకరణ సమ్మతమే యైనప్పటికిని శ్రుతి సుఖము కానిది భోజదేవుని యుద్దేశమున దోషమే. మొదటిదైన విసంహిత వల్ల అనుస్యూతి, ధారాళత దెబ్బ తినుచుండగా రెండవదైన విరూపసంధివల్ల శబ్దములు వికృతములై కటుత్వము నొందుచున్నవి. కావున శాస్త్రనియమము ననుసరించుట యవసరమైనట్లే శ్రుతిసుఖగత్వమును పాటించుటకూడ అవసరమే. అట్లు కానిది దుష్టమనియే నిష్కర్ష.

ఈ శ్లోకపూర్వార్ధము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

[ పునరుక్తిమంతము ]

పదం పదార్థశ్చాభిన్నౌ యత్ర తత్ పునరుక్తిమత్.

యథా —

'ఉత్కా ఉన్మనయన్త్యేతే గంభీరాః స్తనయిత్నవః
అంభోధరాస్తడిత్వన్తో గంభీరాః స్తనయిత్నవః' 28

అత్రోత్కా ఉన్మనయన్తీత్యర్థపునరుక్తమ్. గంభీరాః స్తన యిత్నవ ఇతి శబ్దపునరుక్తమ్.

అర్థము ; పదము కాని అర్థము కాని అభిన్నముగా ప్రయుక్తమైనచో, అది పునరుక్తిమంత మన్న వాక్యదోష మగును. తడిత్వంతములు, గంభీరములు, స్తనయిత్నువులు నైన యీ యంభోధరములు గంభీరములును, స్తనయిత్నువులునై ఉత్కంఠితుల నున్మనస్కులను చేయుచున్నవి. ఇది లక్ష్యము.

ఇక్కడ ఉత్కంఠితులను ఉన్మనస్కులను చేయుచున్నవనుట అర్థపునరుక్తము. గంభీరములు, స్తనయిత్నువులు ననుట శబ్ద పునరుక్తము.

వ్యాఖ్య : పునరుక్తము శబ్దపునరుక్తమని, అర్థపునరుక్తమని రెండు విధములు. ఒకే శబ్దము తిరిగి అభిన్నముగా ప్రయుక్తమైన యెడల అది శబ్ద పునరుక్త మగును. ఒకే అర్థము తిరిగి ప్రయుక్తమైన యెడల అది అర్థపునరుక్త మగును.

లక్ష్యశ్లోకము నందలి ఉత్కాన్, ఉన్మనయతి అను రెండు పదములు నొకే యర్థమును తెలుపును; అనగా ఉత్కంఠితుల నుత్కంఠితులను గావించు నన్నదియే యర్థము. పదము భిన్నముగా నుపయోగింప బడినది. ఇచ్చట పదభేదమే కాని అర్థ భేదము లేదు. కావుననే, యిది అర్థపునరుక్తమునకు లక్ష్యము.

గంభీరాః, స్తనయిత్నవః అను పదములు రెండేసిసార్లు ప్రయుక్తము లయినవి. భిన్నము లయిన అర్థముల నొకవిధముగా సాధింప వచ్చును. అయినను పదములు అభిన్నము లగుటచేత ఇచ్చట శబ్దపునరుక్త దోషము కలదు.

ఇచ్చట 'స్తనయిత్నువులు' అన్నది విశేష్యము; 'అంభోధరములు' విశేషణములలో నొకటి. అప్పుడు — జలములను ధరించునవియు, మెరుపులను కలవియు, దట్టముగా నున్నవియు నైనమేఘములు గంభీరముగా గర్జించుచున్నవై ఉత్కంఠితుల నున్మనస్కులను గావించుచున్నవి — అన్న యర్థమును చెప్పవచ్చును. కావున, పై పదములలో శబ్దపునరుక్తియే కాని అర్థపునరుక్తి లేదు.

ఇంకొక విషయము. లక్షణవాక్యమునందు 'అభిన్నముగా ప్రయుక్త మగుట' అను దశమును గుర్తించు కొనుట యావశ్యకము. ఒకే పదము పునరుక్త మైనప్పటికిని, తాత్పర్య భేదమును కలిగియున్నయెడల అది లాటానుప్రాస మన్న యలంకార మగును. అట్లే సారూప్యము భిన్నపదముల కలయిక చేత నేర్పడిన యెడల అది యమకాలంకార మగును. కావున, పదము కాని పదార్థము కాని అభిన్నముగా ప్రయుక్త మయినప్పుడే పునరుక్తిమంత మన్న వాక్యదోషము కలుగును.

ఈ యుదాహరణము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ వ్యాకీర్ణము ]

23. వ్యాకీర్ణం తన్మిథో యస్మిన్విభక్తీనా మసంగతిః.

ఉదాహరణ:

'దణ్డే చుంబతి పద్మిన్యా హంసః కర్కశకణ్టకే
ముఖం వల్గురవం కుర్వంస్తుణ్డేనాంగాని ఘట్టయన్' 29

అత్ర కర్కశకణ్టకే దణ్డేఽఙ్గాని ఘట్టయన్ హంసః పద్మిన్యా ముఖం చుంబతీతి వక్తవ్యే యథానిర్దిష్టరూపే విఘట్టిత విభక్తిక యుక్తత్వా ద్వ్యాకీర్ణమ్.

అర్థము: విభక్తులకు పరస్పరము అసంగతి యున్నయెడల అది వ్యాకీర్ణమన్న దోషమగును. కర్కశ కంటకమైన దండమునందు అంగములను కొట్టుకొనుచు, వల్గురవము చేయుచు హంస తన ముక్కు (తుండము)తో పద్మినీ ముఖమును ముద్దుపెట్టుచున్నది. ఇది లక్ష్యము.

ఇచ్చట కర్కశకంటకమైన దండమునందు అంగములను కొట్టుకొనుచు హంస పద్మినియొక్క ముఖమును చుంబించుచున్నదని చెప్పవలసియుండగా పైని చూపిన రూపమున విఘటిత విభక్తికములతో కూడియుండుట వల్ల వ్యాకీర్ణమగుచున్నది.

వ్యాఖ్య: సాధారణముగా సంస్కృతము నందు ఒకే విభక్తియందున్న పదములు విశేషణ విశేష్య సంబంధమును కలిగియుండును. ఆధార విభక్తి ఆధేయ విభక్తి నాకాంక్షించును. అప్పుడే అన్వయముఖమైన అర్థప్రతీతి సుఖముగా కలుగును. అటుకానియెడల, పదములు సుగమములై యున్నను భావము సుగమము కాదు. పరస్పర సంగతములు కాని భిన్నవిభక్తులను క్రమము లేకుండ కలబోసినట్లు వాడిన వ్యాకీర్ణ దోషమగును.

పై లక్ష్యశ్లోకమునందు 'దండే' అన్నది మొదటిమాట. ఇది సప్తమ్యంతమైనది; అధికరణకారకము; అనగా ఇది ఆధారము, ఆధేయము యొక్క ఆకాంక్ష

కలుగగా పైనున్నది 'చుంబతి' యన్న క్రియాపదము. కావున, ఇది ఆకాంక్షను రూపము కాదు. తరువాత నున్న 'పద్మిన్యాః' అను సంబంధబోధకము తదను రూపము. అట్లే 'కర్కశకంటకే' యనునది 'దండే' యను దానికి విశేషణము. ఇట్లు పదములు చెల్లాచెదురుగా నుపయోగింపబడుటచేత ఇది వ్యాకీర్ణ మనిపించు కొనును. దీనివల్ల అర్థబోధకు బాధ కలుగుచుండుటచేత ఇది దోషముగా పరిగణింపబడుచున్నది.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

[ సంకీర్ణము ]

వాక్యాంతరపదై ర్మిశ్రం సంకీర్ణ మితి తద్విదుః.

యథా -

'కాఅం ఖాఅఇ ఖుహిఓ కూరం ఫేల్లఇ ణిబ్భరర రుట్ఠో

సుణఅం గేణ్హఇ కణ్ఠే హక్కఇఅ ణత్తిఅం థేరో 30

[ఛాయా -

కాకం ఖాదతి క్షుధితః కూరం ఫేల్లతి నిర్భరం రుష్టః

శ్వానం గృహ్ణాతి కంఠే హక్కాయతి నప్తారం స్థవిరః]

అత్ర కాకం భీషతే, కూరం ఖాదతి, కంఠే నప్తారం గృహ్ణాతి, శ్వానం భీషయతే ఇత్యాదౌ వక్తవ్యే యథోక్తపదవిన్యాసః సంకీర్యతే.

**అర్థము :** ఒక వాక్యమునందలి పదములు వాక్యాంతరమునందలి పదములతో మిశ్రణము చెందినయెడల సంకీర్ణమన్న వాక్యదోష మగును. ఆకలిగొన్నవాడు కాకిని తినును. మిక్కిలి కోపించినవాడు అన్నమును విసరివేయును. కుక్కను కంఠము పట్టుకొనును. ముసలివాడు మనుమని భయపెట్టును — ఇది ఉదాహరణము.

ఇచ్చట కాకిని తోలును, అన్నమును తినును, మనుమని మెడను పట్టుకొనును (కౌగిలించుకొనును), కుక్కను భయపెట్టును — అనువిధముగా చెప్పవలసియుండగా పైని చూపిన రూపమున పదవిన్యాస ముండుటవల్ల సంకీర్ణమగును.

[ అపదము ]

24. విభిన్నప్రకృతిస్థాది పదయుక్త్యపదం విదుః.

యథా —

'ఆఉజ్జిఅ పీడిఅప్ప జహా కుక్కులి ణామ మజ్ఝ భత్తాలే

పేక్ఖన్తహా లాఉలకణ్ణిఆహా హా కస్స కన్దేమి' 31

[ఛాయా :

'ఆవర్జ్య పీడయతి యథా కుర్కురో నామ మమ భర్తా

ప్రేక్షన్తో రాజకుల కర్మకరా అహాహా కస్య క్రన్దామి']

తదేతత్ ప్రకృతిస్థ కోమల కఠోరాణాం నాగరోపనాగరాణాం గ్రామ్యాణాం వా పదానాం యుక్తేరపదమ్.

అర్థము : విభిన్నములయిన ప్రకృతిస్థాది పదముల నొకచోటనే చేర్చి చెప్పుట అపద మన్న వాక్యదోష మగును. నా భర్త కుక్కవలె క్రమ్ముకొని రాజ భటులు చూచుచుండగనే నన్ను బాధించుచుండును. ఇంక నెవరికి మొర పెట్టుకొందును? ఇది ఉదాహరణము.

ప్రకృతిస్థ కోమల కఠోర పదములయొక్కయు, నాగరోపనాగర గ్రామ్య పదములయొక్కయు సంయోజనమునకు అపదము అని పేరు.

వ్యాఖ్య : ప్రకృతిస్థములు, కోమలములు, కఠోరములు, నాగరములు, ఉపనాగరములు, గ్రామ్యములు — అని పదములు ఆరు విధములు. ఇట్లు విభిన్నము లయిన పదముల నొకే వాక్యమునందు చేర్చుట దోషము.

అనేక దీర్ఘస్వరములు గల పదములు ప్రకృతిస్థములు. దీర్ఘస్వరములు లేనిదియు, ఒకటో రెండో దీర్ఘ స్వరములను పరిమితముగా కలదియు కోమలము. అల్పస్వరములతో, దీర్ఘస్వరములతో, సంయుక్తములతో కూడుకొన్నది కఠోరము. నగరములలో మాత్రమే వాడుక పొందుచు తక్కినచోట్ల అప్రసిద్ధములుగా నున్న

పదములు నాగరములు. నాగరములకంటె ఎక్కువ వాడుక గలవి ఉపనాగరములు. దేశీయుల వ్యవహారమునందు ప్రసిద్ధములైనవి గ్రామ్యములు.

ఉదాహృత ప్రాకృత పద్యమునందు – ఆఉజ్జల అనునది ప్రకృతిస్థము; పిట్టిఅప్ కఠోరము; జహ కోమలము; మజ్ఝ ఉపనాగరము; ఖత్తాలే కఠోరము; కుక్కులి గ్రామ్యము; పేక్ఖన్తహ కఠోరము; రాఉలకణ్ణిఆహ గ్రామ్యము; హ కోమలము; కస్స ఉపనాగరము; కన్దేమి గ్రామ్యము.

ఒకే సన్నివేశమునందు, ఒకే వక్త వాడుకయందు ఒకే విధమగు పదముల కూడిక యుండుట యుచితము. అట్లు కాక భిన్నముగా నుంచుట అనౌచిత్యము. ప్రకృత లక్ష్యమునందు పెక్కు విధములయిన పదముల యోగము 'అపదము' అన్న దోషమునకు హేతువైనది.

[తెలుగున నైనచో గ్రాంథిక వ్యావహారికములను గాని, శిష్ట శిష్టేతర వ్యావహారికములను గాని కలియగలుపుట అపద మగును.]

### [ వా క్య గ ర్భి త ము ]

వాక్యాంతర సగర్భం యత్తదాహు ర్వాక్యగర్భితమ్.

యథా –

'యోగ్యో యస్తే పుత్త్రః సోఽయం దశవదన లక్ష్మణేన మయా
రక్షైనం యది శక్తి ర్మృత్యువశం నీయతే వివశః' 32

అత్ర యోగ్యో యస్తే పుత్త్రో లక్ష్మణేన మయా మృత్యువశం నీయత ఇతి వాక్యస్య రక్షైనం యది శక్తి రితి వాక్యాన్తరేణ సగర్భత్వాద్ గర్భితమ్.

అర్థము : ఒక వాక్యమును రెండుగా విరిచి మధ్య భాగమునందు మరొక వాక్యము చొరబడినచో వాక్యగర్భిత మన్న దోషమగును. ఓ రావణా! యోగ్యుడైన ఆ నీపుత్రుడు వివశుడై లక్ష్మణుడనైన నాచేత – శక్తి యున్నచో రక్షించుకొనుము – మృత్యువశమునకు కొనిపోబడుచున్నాడు. ఇది ఉదాహరణము.

వ్యాఖ్య : వ్యాకీర్ణ సంకీర్ణ దోషములందు పదములు నియతస్థానముల నుండక పోవుటయే లక్షణము. వ్యాకీర్ణమునందు ఒకే వాక్యమునందలి పదములు చెల్లాచెదరుగా నుండును. సంకీర్ణమునందు ఒక వాక్యము నందలి పదములు మరొక వాక్యము నందలి పదములకు సన్నిహితములై అనుద్దిష్టమైన అన్వయమును పొందును. ప్రకృతమైన వాక్య గర్భితమునందు రెండు వాక్యములు స్పష్టముగా నుండును. మొదటి వాక్యము పెద్దది; రెండవది చిన్నది. మొదటి వాక్యము రెండు ముక్కలు కాగా, ఆ రెండుముక్కలకును నడుమ రెండవ వాక్యము పూర్తిగా ఇమిడి పోవును. మొదటి వాక్యమునందే రెండవది గర్భితమై యుండును. కావుననే దీనికి వాక్యగర్భిత మన్న పేరు సార్థక మగుచున్నది.

ఓ రావణా! యోగ్యుడైన ఆ నీపుత్రుడు వివశుడై లక్ష్మణుడనైన నాచేత మృత్యువశమునకు కొనిపోబడుచున్నాడు — ఇది ఒకవాక్యము. 'శక్తి యున్నచో రక్షించు కొనుము — ఇది మరొక వాక్యము. రెండవవాక్యము మొదటి వాక్యము యొక్క గర్భమునం దిమిడియున్నది. కావుననే, యిది వాక్య గర్భితము.

ఉద్దిష్టార్థప్రతీతికి పదక్రమము సహకరించును. కొన్నియెడల పదక్రమము కొంత మారినను అర్థప్రతీతి కవరోధము కలుగదు. అట్టియెడల ఆమార్పు దోషము కాదు. కావున వ్యాకీర్ణాదులందు అర్థప్రతీతి కవరోధము కలుగుట కాని, అన్యార్థ ప్రతీతి కలుగుట కాని యుండవలయును. అప్పుడే వానిని దోషములుగా పరిగణించుట సమంజసము.

[ భిన్నలింగము - భిన్నవచనము ]

25. యత్రోపమా భిన్నలింగా భిన్నలింగం తదుచ్యతే
భవేత్తద్భిన్నవచనం యద్భిన్నవచనోపమమ్.

యథా —

'అవిగాహ్యోఽసి నారీణా మనన్యవచసా మపి
విషమోపల భిన్నోర్మి రాపగేవో త్తితీర్షతః' 33

అత్రాపగేవ త్వ మవిగాహ్యోఽసీతి లింగభేదః. నారీణా ముత్తితీర్షత ఇతి లింగభేదో వచనభేదశ్చ. తదిదం ద్వయో రేకమే వోదాహరణమ్.

అర్థము : ఉపమానము ఉపమేయముకంటె భిన్నలింగమునం దున్నచో భిన్నలింగమన్న దోషమగును; ఉపమాన మొకవచనమునం దుండగా ఉపమేయము మరొక వచనమునం దున్నచో భిన్నవచనమన్నదోషమగును. దాటవలయునన్న కోరిక గలవానికి విషమోపలభిన్నోర్మియైన ఆపగవలె అనన్యవచస్కలయిన స్త్రీలకును నీవు అవి గాహ్యుడవు—ఇది ఉదాహరణము.

ఇక్కడ ఆపగవలె నీవు అవిగాహ్యుడ వనుట లింగభేదము. స్త్రీలకు దాట గోరువానికి ననుట లింగభేదమును వచనభేదమును రెండింటికి నొక్కటే యుదాహరణము.

వ్యాఖ్య : ఔపమ్యమును ప్రదర్శించునపుడు ఉపమానోపమేయములు సమాన వచనములును సమాన లింగములు నై యుండుట లక్షణము. అట్లు కాకుండుట దోషము. ఉపమేయ మొకలింగమున నుండగా ఉపమానము మరొక లింగమున నున్నచో భిన్నలింగమన్న దోషమగును. పై యుదాహరణమందు 'నదివలె నీవు మునుగరానివాడవు' అన్న యర్థము గలదు. ఇచ్చట 'నీవు' (అధ్యాహృతము) అన్నది ఉపమేయము. 'నది' ఉపమానము. 'అవిగాహ్యః' పుంలింగశబ్దము. 'ఆపగా' స్త్రీలింగ శబ్దము. 'అవిగాహనమ్' సమానధర్మము. 'ఇవ' ఉపమా వాచకము. ఇచ్చట భిన్నలింగములందు ఉపమానోపమేయములను వాడుటచేత భిన్నలింగమన్న దోషము.

'ఉత్తితీర్షతః' అనగా 'దాటగోరువానికి' అని యర్థము. ఉపమానము పుంలింగము, ఏకవచనము. 'నారీణామ్' అనగా 'స్త్రీలకు' అని యర్థము. ఉపమేయము స్త్రీలింగము, బహువచనము. ఇచ్చట ఉపమానోపమేయములు లింగమునందును వచనమునందును కూడ భిన్నములై యున్నవి.

## [ భిన్నలింగము ]

అథ భిన్నలింగస్యైవ యథా —

'వాపీవ విమలం వ్యోమ హంసీవ ధవలః శశీ
శశిలేఖేవ హంసోఽయం హంసాలి రివ తే యశః' 34

అర్థము : భిన్నలింగమున కుదాహరణము. బావివలె ఆకాశము స్వచ్ఛము. ఆడుహంసవలె చంద్రుడు తెల్లనివాడు. ఈ హంస చంద్రలేఖవలె నున్నది. నీయశము హంసావళివలె నున్నది.

వ్యాఖ్య : ప్రత్యేకముగా భిన్నలింగమునకే యిందు నాలుగు లక్ష్యములు ప్రదర్శింపబడినవి. 1. వ్యోమ నపుంసకము; వాపీ స్త్రీలింగము. 2. శశీ పుంలింగము; హాసీ స్త్రీలింగము. 3. హంసః పుంలింగము; శశిలేఖా స్త్రీలింగము. 4. యశః నపుంసకము; హంసాలీ స్త్రీలింగము.

సంస్కృతమున లింగము శబ్దాశ్రయమై యుండును. ఒకే యర్థమును దెల్పు శబ్దములు భిన్నలింగములం దుండవచ్చును. స్పష్టతకు 'పిచ్చివాడు రాక్షసివలె పట్టుకొనెను' 'అది బకాసురునివలె తినును' మొదలయిన వానిని తెలుగునందు భిన్నలింగమున కుదాహరణములుగా గ్రహింపవచ్చును.

[ భి న్న వ చ న ము ]

భిన్నవచనస్యైవ యథా —

'సరాంసీవామలం వ్యోమ కాశా ఇవ సితః శశీ
శశీవ ధవలా హంసా హంసీవ ధవలా దిశః' 35

అర్థము : భిన్నవచనమున కుదాహరణము. ఆకాశము సరస్సులవలె స్వచ్ఛము. చంద్రుడు రెల్లుపువ్వులవలె తెల్లనివాడు. హంసలు చంద్రునివలె తెల్లనివి. దిక్కులు ఆడుహంసవలె తెల్లనివి.

వ్యాఖ్య : ప్రత్యేకముగా భిన్నవచనమునకే యిందు నాలుగు లక్ష్యములు ప్రదర్శింపబడినవి. 1. వ్యోమ ఏకవచనము; సరాంసి బహువచనము. 2. శశీ ఏకవచనము; కాశాః బహువచనము. 3. హంసాః బహువచనము; శశీ ఏకవచనము. 4. దిశః బహువచనము; హంసీ ఏకవచనము.

పై యన్నిచోట్ల ఉపమానోపమేయములకు వచనభేదము కలదు. ఇట్లుండుట భిన్నవచన మన్న వాక్యదోషము.

[ న్యూ నో ప మ ము ]

26. న్యూనోపమా మిహా న్యూన ముపమాన విశేషణైః.

యథా —

'సంహాఅ చక్కవాఅజుఆ వికసిఅకమలా ముణాలసంఛణ్ణా
బావీ బహూ వ్వ రోఅణవిలిత్తథణ ఆ సుహావే ఇ' 36

[ఛాయా -
సంహాత చక్రవాకయుగా వికసితకమలా మృణాలసంఛన్నా
వాపీ వధూరివ గోచనా విలిప్తస్తనీ సుఖయతి]

అత్ర నేత్ర బాహూపమా పదానాం వధూవిశేషణత్వే నానుక్తత్వా దిదం న్యూనోపమమ్.

**అర్థము :** ఉపమాన విశేషణములచేత అల్పమైనది న్యూనోపమము. ఇది లక్షణము. కూడియున్న చక్రవాకముల జంటను గలదియు, వికసించిన పద్మములను గలదియు, తామరతూడులను గలదియు నైన బావి గోరోచనముతో పూత పూయబడిన స్తనములు గల యువతివలె సుఖమును కలిగించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇక్కడ వధూ విశేషణముగా నేత్రములు బాహువులు ననెడి ఉపమాపదములను చెప్పకపోవుటచేత న్యూనోపమము.

**వ్యాఖ్య :** ఉపమేయమున కున్న విశేషణముల కనుగుణములైన విశేషణములను ఉపమానమునకు వాడినప్పుడే ఔపమ్యము సమాంతరముగా నుండును. అట్లు కాకున్నచో న్యూనోపమ మన్న వాక్యదోషమగును.

ఉదాహృత పద్యమునందు వాపి ఉపమేయము; సంహత చక్రవాకయుగ, వికసిత కమల, మృణాలసంఛన్న అను మూడు విశేషణము లున్నవి. వధువు ఉపమానము; రోచనావిలిప్తస్తని అను నొక్క విశేషణము మాత్రమే యున్నది. 'సుఖయతి' అన్నది సమానధర్మము. 'ఇవ' ఉపమావాచకము.

కవులు సంప్రదాయమునుబట్టి చక్రవాకములను స్తనములతోను, కమలములను నేత్రములతోను, తామరతూడులను బహువులతోను పోల్చుచుందురు. ఇచ్చట ఉపమానమైన వధూశబ్దమునకు వాడిన విశేషణము స్తన శబ్దమును మాత్రమే గ్రహించినది. నేత్ర బాహుపదములు గ్రహింపబడలేదు. అందువల్ల ఉపమేయ విశేషణములకంటె ఉపమాన విశేషణములు సంఖ్యలో అల్పములైనవి. కావుననే యిది న్యూనోపమ మన్న వాక్యదోషమునకు లక్ష్యమైనది.

అ ధి కో ప మ ము ]

అధికం యత్ప్వనస్తైః స్యాత్తమాహు రధికోపమమ్.

యథా —

'అహిణవ మణహార విరఇఅ వలఅహూసా విహాఇ ణవవహూఆ
కున్దలఏవ్వ సముప్ఫుల్ల గుచ్ఛ పరిణిత్త భమరగణా' 37

[ఛాయా —

అభినవ మనోహార విరచిత వలయవిభూషా విభాతి నవవధూః
కున్దలతేవ సముత్ఫుల్ల గుచ్ఛ పరిణీయమాన భ్రమరగణా]

ఇదం భ్రమరగణ స్యోపమాన విశేషణస్యాధిక్యా దధికోప మానమ్.

అర్థము :– ఉపమాన విశేషణములచేత అధికమైనది అధికోపమము. ఇది లక్షణము. బాగుగా వికసించిన పుష్ప గుచ్ఛములచేత ఆకర్షింపబడుచున్న తుమ్మెదల గుణములను గల కుందలతవలె మనోహరముగా క్రొత్తగా చేయబడిన వలయాకార ములచేత క్రొత్త పెండ్లికూతురు భాసిల్లుచున్నది. ఇది లక్ష్యము.

ఉపమాన విశేషణమైన భ్రమరగణముయొక్క ఆధిక్యముచేత ఇది అధికోప మానము.

వ్యాఖ్య :– ఇది పైని చెప్పిన న్యూనోపమమునకు విరుద్ధము. ఇచ్చట ఉపమాన విశేషణము లధిక సంఖ్యలో నుండును.

ఉదాహృత పద్యమునందు నవవధువు ఉపమేయము; అభినవ మనోహర విరచిత వలయ విభూష విశేషణము. కుందలత ఉపమానము; సముత్ఫుల్ల గుచ్ఛ పరిణీయమాన భ్రమరగణ విశేషణము. సంఖ్యయే పరిగణితమైన యెడల రెండింట నొక్కొక్క విశేషణమే యుండుటచే సమత్వమున్నట్లే. సంఖ్యాసమత్వము కాక పదార్థాంతరత్వ మిచ్చట అపేక్షితము. కుందలతకు సముత్ఫుల్ల గుచ్ఛములుండుట విశేషము. ఏ తత్తుల్యమైన విశేషము ఉపమేయమైన నవవధువున కుపయుక్తము

కాలేదు. దీనిచేత ఉపమాన విశేషణమున కాధిక్యము కలిగినది. కావుననే యిది అధికోపమ మన్న వాక్యదోషముగా పరిగణిత మగుచున్నది.

[ భ గ్న చ్ఛ ం ద ము ]

27. భగ్నచ్ఛంద ఇతి ప్రాహు ర్యచ్ఛందోభంగవద్ వచః.

యథా -

'యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః

తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' 38

అత్ర పంచమ వర్ణస్య లఘోః స్థానే గురోః కరణాచ్ఛందో భంగః.

అర్థము : ఛందోభంగము కలిగిన వాక్యమును (పద్యమును) భగ్నచ్ఛంద మన్న వాక్యదోషముగా పరిగణింతురు. ఇది లక్షణము. పంచజనములును, ఆకాశమును ప్రతిష్ఠితమై యున్నవానిని తెలిసికొని ధీరుడైన బ్రాహ్మణుడు ప్రకృష్టమైన జ్ఞానమును ప్రత్యక్షీకరించుకొనవలయును. ఇది ఉదాహరణము.

ఇచ్చట పంచమవర్ణమైన లఘువు స్థానమున గురువును వాడుటవల్ల ఛందోభంగము.

వ్యాఖ్య పద్యమునకు ఛందము ప్రధానము. ఛందము గురులఘువులస్థితిని బట్టి యుండును. పద్యగతికి ఛందమే అధారము. ఛందము భంగమైనపుడు పద్యగతియు భంగమగును. కావున ఛందోభంగమువల్ల భగ్నచ్ఛంద మన్న దోష మేర్పడును.

ఉదాహృత పద్యము అనుష్టుప్పు. దీనికే శ్లోకమని నామాంతరము. 'పంచమం లఘు సర్వత్ర। సప్తమం ద్విచతుర్థయోః। షష్ఠం గురుం విజానీయా। చ్ఛేషా స్త్వనియతా మతాః' అని లక్షణము. అన్ని పాదములందును పంచమాక్షరము లఘువు. రెండవ నాల్గవ పాదము లందు సప్తమాక్షరము లఘువు. అన్ని పాదము లందును ఆరవయక్షరము గురువు. ఇది సామాన్య నియమము. ఇట్లులేని వన్నియు అనియతములు — అనిభావము.

ఉదాహృత పద్యము మొదటిపాదమున ఐదవ యక్షరముగా 'పం' అని యున్నది. ఇది గురువు కావున ఛందోభంగ మేర్పడినది. అట్లే మూడవ పాదము నందు 'రో' అని గురువున్నది. ఇచ్చటను ఛందము తప్పినది. కావుననే యిది భగ్నచ్ఛందమునకు లక్ష్యమైనది.

ఈ శ్లోకము బృహదారణ్యకోపనిషత్తు నందలిది.

[ భ గ్న య తి ]

అస్థానే విరతి ర్యస్య తత్తు భగ్నయతీష్యతే.

యథా —

'బ్రహ్మేంద్రోపేంద్రాది గీర్వాణ వంద్యో
భక్తానాం భూయాచ్ఛ్రియై చంద్రచూడః
స్త్రీణాం సంగీతం సమాకర్ణయన్ కే
తూనాదస్తాంభోదం సదధ్యాస్త ఈశః' 39

అత్ర చతుర్థస్థానే యతౌ కర్తవ్యాయాం తదన్యత్ర యతికర ణాద్ భగ్నయతీదమ్.

అర్థము : స్థానముకాని స్థానమున విరతి యున్నయెడల భగ్నయతి యన్న దోషమగును. స్త్రీలయొక్క సంగీతమును వినుచు ధ్వజస్తంభముచేత విక్షిప్తమైన మేఘముగల ఉన్నత సభాహర్మ్యమునందు అధ్యక్షించియున్న బ్రహ్మేంద్రోపేంద్రాది గీర్వాణ వంద్యుడు చంద్రచూడుడు నైన ఈశ్వరుడు భక్తులకు శ్రీని గూర్చును గాక, ఇది ఉదాహరణము.

ఇచ్చట చతుర్థస్థానమున యతిని వేయవలసియుండగా మరొక స్థానమున వేయుటచేత ఇది భగ్నయతి యన్న దోషము.

వ్యాఖ్య : ప్రతిపద్యమునకు యతి నియతముగా నుండును. సంస్కృతమున 'యతి' అనగా కేవలము 'విరతి' అనియే యర్థము. ప్రాతపదము అంతమైపోయి యతిస్థానము నుండి క్రొత్తపదము ప్రారంభము కావలయును. అట్లున్నప్పుడే పద్యము శ్రవణసుఖమై హృద్యమై యుండును.

ఉదాహృత పద్యము శాలినీ వృత్తము. 'వేదచ్ఛేదా శాలినీ మోఽథ తౌ గౌ' అని లక్షణము. మగణము, రెండు తగణములు, రెండు గురువులు కలది శాలిని. వేదములు నాలుగు. కావున 'వేదచ్ఛేదా' అని యనగా నాలుగవ యక్షరము విరతి యని యర్థము. పై పద్యమునందు నాలుగవ యక్షరముపై విరతి యేపాదమునందును లేదు. ఒక్కపాదమునందు తప్పినను యతి తప్పినట్లే. స్పష్టతకొరకు అన్నిపాదము లందును యతి తప్పిన పద్యమునే ఉదాహరించుట జరిగినది.

లక్షణమునందు స్థానముకాని స్థానమున విరతి యున్నయెడల భగ్నయతి యగునని చెప్పుకొంటిమి. నిజమునకు మరొకచోట విరతి యున్నదా ? లేదా ? అన్నది విచార్యముకాదు. ఉండవలసినచోట విరతి లేకుండుటచేతనే భగ్నయతి యగును.

తెలుగునందు యతికి విరతి యను పదమును పైతము వాడుదురు. కాని, పదము ముగిసి క్రొత్తపదము ప్రారంభము కావలయునన్న లక్షణము తెలుగునందు లేదు. యతిస్థానమున పాదాద్యక్షరముతో సాజాత్యముగల యక్షరమున్న చాలును. అట్లు లేకున్న దోషము. 'భావమునందుఁ దోఁచిన భయంకరదృశ్యములన్ భరింపగా' అన్న ఉత్పలమాలా పద్యపాద మున్న దనుకొందము. పదవ యక్షరము యతి స్థానముగా నుండవలయును. మొదటి యక్షరము 'భా' అని యుండగా పదవస్థాన మున 'యం' అని యున్నది. దానికి సుందర వర్ణము 'భ'. అయినప్పటికిని యతి నియతస్థానమున లేకపోవుటచేత ఇచ్చట భగ్నయతి యన్న దోషము పట్టినది.

[ఇంకొక్క విషయము. సంస్కృతమునందు ప్రాసనియమము లేదు. తెలుగున వృత్తములకును, కందాది పద్యములకును ప్రాసనియతి యున్నది. కావున ప్రాస భంగమైన యెడల 'భగ్నప్రాసము' అన్న దోషమును అంగీకరింప వలసి వచ్చును. సంస్కృతమున లేకుండుటచేత భోజదేవునికి తన్నిరూపణావశ్యకము లేదు. తెలుగున నుండుటచేత మనము దానిని గూడ నిరూపించుకొనుట యవసరము. 'సిరి తా వచ్చిన వచ్చును, సలలితముగ నారికేళసలిలము భంగిన్' అను పద్యార్ధము నందు మొదటి పాదమున 'ర' వర్ణము ప్రాసముకాగా ద్వితీయపాదమున 'ల' వర్ణము ప్రాసమైనది. అనగా ప్రాస తప్పిన దని యర్థము. ఇది భగ్నప్రాసమున కుదా హరణము.]

[ అ శ రీ ర ము ]

28. క్రియాపద విహీనం య దశరీరం తదుచ్యతే.

యథా -

'సేనసుఆరుద్ధద్ధం ముద్ధాణాబద్ధ భుద్ధససిలేఖమ్
సీసపరిట్ఠిఅ గంగం సంజ్ఝా పణఅం పమహాణాహామ్. 40

[ఛాయా -
శైలసుతారుద్ధార్ధం మూర్ధాబద్ధ భుగ్న శశిలేఖమ్
శీర్ష పరిష్ఠితగంగం సంధ్యాప్రణతం ప్రమథనాథమ్]
క్రియాపదాభావా దశరీర మిదమ్.

అర్థము : క్రియాపద విహీనముగా నుండుటచేత అశరీర మన్న దోషము కలుగును. పార్వతిచేత అడ్డగింపబడిన అర్ధభాగము గలవానిని, ఔదలను నిలుపబడి కలతపడిన చంద్రలేఖను గలవానిని, తలమీద గంగను గలవానిని, సంధ్యకు ప్రణమిల్లిన వానిని, ప్రమథనాథుని — ఇది ఉదాహరణము.

ఇచ్చట క్రియాపదము లేకుండుటచేత ఇది అశరీరము.

**వ్యాఖ్య :** వాక్యమునందు ఉద్దేశ్యము, విధేయము - అని రెండంశము లుండును. వాచ్యములు కానప్పుడు అధ్యాహృతములుగా నైన నుండును. అట్లు కానియెడల విషయము సుబోధము కాదు.

సాధారణముగా ఉద్దేశ్యము నామవాచక సర్వనామ విశేషణాదులతో కూడియుండును. విధేయము క్రియను గాని, విశేషణమునుగాని, భావార్థకాదులనుగాని కలిగియుండును.

ప్రకృతము క్రియాపద మనుట ఉపలక్షణము. దీనిచేత విధేయము కాదగిన విశేషణాదులను సైతము గ్రహించుట యవసరము. ఉదాహరణమునందు 'ప్రమథనాథుని' అని ద్వితీయావిభక్త్యంతమైన విశేష్యమున్నది; తక్కిన వన్నియు దాని విశేషణములు. 'కర్మణి ద్వితీయా' అని యనుటచేత ఇవన్నియు కర్మమును తద్విశేషణములను తెలియజేయును. క్రియాపదము పద్యమునందు నిబద్ధము కాలేదు.

కావున, పై మాటలకు వాక్యత్వమే సంగతము కాదు. అందుచేతనే ఇది అశరీర మన్న వాక్యదోషముగా పరిగణితమైనది.

[ అ రీ తి మ ం త ము ]

గుణానాం దృశ్యతే యత్ర శ్లేషాదీనాం విపర్యయః
29. అరీతిమ దితి ప్రాహు స్తత్త్రిధైవ ప్రచక్షతే

శబ్దార్థోభయ యోగస్య ప్రాధాన్యాత్ ప్రథమం త్రిధా
30. భూత్వా శ్లేషాది యోగేన పున స్త్రేధోపజాయతే.

**అర్థము** : శ్లేషాదిగుణములకు విపర్యయము కనిపించునెడల దానిని అరీతిమంతము అను దోషముగా పరిగణింతురు. అది శబ్దము, అర్థము, శబ్దార్థోభయము అనువాని నాశ్రయించుకొని మూడు విధములగును. అది శ్లేషాది యోగముచేత మరల మూడు విధము లగును.

అత్ర యః శ్లేష సమతా సౌకుమార్య విపర్యయః
31. శబ్దప్రధాన మాహు స్త మరీతి మతిదూషణమ్.

**అర్థము** : శ్లేష సమతా సౌకుమార్యము లన్న గుణములకు విపర్యయము లైన వానిని శబ్ద ప్రధానమైన అరీతిమంత మను దోషముగా పరిగణింతురు.

వ్యాఖ్య : ఇప్పుడు చెప్పబోవునవి వాక్యదోషములలో చివరిదైన అరీతిమంతములోని అంతర్విభాగములు. గుణములు విపర్యస్తము లగుటచేత దోషము లేర్పడును. గుణము భగ్నమైనప్పుడు రీతికూడ భగ్నమగును కావున గుణభంగము చేత ఏర్పడిన దోషముల నన్నింటిని సమాహారరూపముగా 'అరీతిమంతము' అని పేర్కొనుట జరిగినది. శ్లేష, సమత, సౌకుమార్యము — అను గుణములు విపర్యస్తము లైనపుడు శబ్దప్రధానమైన అరీతిమద్దోషమేర్పడును అది మరల మూడు విధములు – 1. శిథిలము 2. విషమము 3. కఠోరము.

తత్ర —
విపర్యయేణ శ్లేషస్య సందర్భః శిథిలో భవేత్.
యథా -

'అలీయం మాలతీమాల లోలాలికలిలా మనః
నిర్మూలయతి మే మూలా త్తమాల మలినే వనే' 41

అత్ర భిన్నానా మపి పదానా మేకపదతా ప్రతిభాసహేతు రనతి కోమలో బంధవిశేషః శ్లేషః. తద్విపర్యయేణ శబ్దప్రధానోఽయం శ్లేషవిపర్యయః

**అర్థము** : శ్లేషవిపర్యయముచేత సందర్భము శిథిల మగును. సఖీః చలించుచున్న తుమ్మెదలుగల యీ మాలతీమాల తమాలమలినమైన వనమునందు నా మనసును మొదలంట కదలించుచున్నది. ఇది ఉదాహరణము.

పదములు భిన్నములైనను ఏకపదము వలె ప్రతిభాసింపజేయునది, అతి కోమలము కానిది అయిన బంధవిశేషము శ్లేషము. తద్విపర్యయముచేత ఇది శబ్ద ప్రధానమై శ్లేషవిపర్యయ మగును.

**వ్యాఖ్య** : అనేకపదము లున్నప్పటికిని సంధివలన ఏకపదమువలె భాసించుటయు, మొత్తము రచనము అతికోమలముగా లేకుండుటయు శ్లేషగుణ లక్షణములు. దానికి విపర్యయము ప్రకృతమైన అరీతిమంతము. ఏకపదమువలె ప్రతిభాసింపక పోవుట, అతికోమలముగా నుండుట శ్లేష విపర్యయ లక్షణములు. పై రెండు లక్షణముల వల్లనే యింతు బంధము శిథిలమైనది.

ఉదాహృత శ్లోకమునందు మొత్తము రచనమున కనీస మెనిమిది పదములు కనవచ్చుచున్నవి. కావున ఏకపదప్రతిభాసత్వము లేదన్నది తేలినది. దంత్యలకారము లలితవర్ణము. అది ముహుర్ముహురుపాత్త మగుటవలన రచనాబంధము అత్యంత కోమలమై పోయినది. అనతికోమలముగా నుండదగిన శ్లేషబంధమున కిది విపర్యయము. కావుననే యీ లక్ష్యము శ్లేషవిపర్యయమునకు సరిపడినది.

శ్లేషగుణము శబ్దప్రధానము. వేర్వేరు పదము లొకదానితో నొకటి యదుకుకొని ఏకపదముగా నవిపించుట అచ్చటి లక్షణము. కావున, తద్విపర్యయము కూడ శబ్దప్రధానముగానే యుండును. ఇచ్చట పదము లొకదానితో నొకటి గాఢబంధము కలిగియుండక శిథిలబంధముతో నుండి వేర్వేరుగా కనిపించును.

32. భవేత్స ఏవ విషమః సమతాయా విపర్యయాత్.

యథా —

'కోకిలాలాపవాచాలో మామేతి మలయానిలః

ఉచ్ఛలచ్ఛీకరాచ్ఛాచ్ఛ నిర్ఝరాంభః కణోక్షితః' 42

అత్ర పూర్వార్ధస్య మృదు బంధత్వా దుత్తరార్ధస్య చ గాఢ బంధత్వాత్ సమబంధేషు విషమ మితి విషమో నామ శబ్దప్రధానః సమతావిపర్యయో దోషః.

అర్థము : సమతా గుణముయొక్క విపర్యయమువల్ల విషమ మన్నదోషము కలుగును. పైకి లేచుచున్న తుంపురులు గలిగి మిక్కిలి స్వచ్ఛమైన ప్రవాహము యొక్క నీటికణములచేత తడుపబడిన మలయానిలము కోకిలాలాపరూపమున పలుకుచు నన్ను పొందుచున్నది. ఇది ఉదాహరణము.

ఇక్కడ పూర్వార్ధముయొక్క మృదుబంధత్వమువల్ల, ఉత్తరార్ధముయొక్క గాఢ బంధత్వమువల్ల సమబంధములందు విషమత కలిగినది. కావుననే, యిది సమతా విపర్యయమై విషమమన్న శబ్దప్రధానమైన దోష మగుచున్నది.

వ్యాఖ్య : వర్ణములు మృదువులు, మధ్యమములు, కఠోరములు నని మూడు విధములు. ఆయావర్ణములచేత మృదుబంధము, మధ్యమబంధము, కఠోర బంధము అని రచన మూడు విధములుగా నుండును. ఈ రచన ఒక సందర్భమున నొకే బంధమున నుండును. అట్లుండుట సమత. దానికి విపర్యయము, అనగా, ఒకే సందర్భమున భిన్నబంధము లందుండుట విషమ మగును.

ఉదాహృత పద్యమున పూర్వభాగము మృదుబంధము కలిగి యున్నది. ఉత్తరభాగము ద్విత్వసంయుక్తాక్షర బహుళమై కఠోరమైన గాఢబంధమున నున్నది. ఇట్లు రెండు బంధములు నొకే సన్నివేశమున నుండుటచే సమత చెడిపోయినది; అనగా విషమత్వము ప్రాప్తించిన దని యర్థము. కావుననే యిది విషమమన్న శబ్ద ప్రధాన దోషమయినది.

ఈ యుదాహరణము దండి కావ్యాదర్శము నందలిది.

సౌకుమార్య విపర్యాసాత్ కఠోర ఉపజాయతే.

యథా —

'అసిత ర్తితుగద్రిచ్ఛిత్స్వః క్షితాంపతి రద్విదృక్
అమిద్భిః శుభ్రదృగ్ దృష్టైర్ద్విషో జేఘ్నీయిషీష్ట వః' 53

అత్రాతికఠోరత్వా దసౌకుమార్యం సుప్రతీతమేవ.

అర్థము : సౌకుమార్యముయొక్క విపర్యయమువల్ల కఠోరము అన్న దోషము పుట్టును. అగ్నిపుత్రుడును, పర్వతచ్ఛేదకుడును, స్వర్గవాసుల కధినాథుడును, అద్వినేత్రుడును, (ద్వాదశ నేత్రుడును) అగు కుమారస్వామి అస్నిగ్ధములైన ధవళ నేత్ర విలోకనములతో మీ శత్రువులను నశింపజేయునుగాక" ఇది ఉదాహరణము.

ఇక్కడ అతి కఠోరత్వమువల్ల అసౌకుమార్యము సుస్పష్టము.

వ్యాఖ్య : మృదువర్ణ రచనాబంధము సౌకుమార్య మన్న గుణమగును. దానికి విపరీత మగునది కఠోరము. ఇచ్చట రచనాబంధము కఠోరాక్షరములతో కూడి యుండును. ఉదాహృత పద్యమునందలి పదములు వ్యస్తముగా మృదువులై యున్నను సంధి నొందిన పిమ్మట కఠోరములై శ్రవణకటుత్వమున కాకరములైనవి.

ఉదాహృత పద్యమునందు 'అసిత + ఋతి' అను పదములు 'అసితర్తి' అనియై 'కృష్ణవర్త్మ' అను పదముతో సమానార్థకమై 'అగ్ని' కి బోధకమైనవి. 'తుక్' అనగా అపత్యము. 'అసితర్తితుక్' అనియనగా 'అగ్నిపుత్రుడు' అని యర్థము. 'అద్రిచ్ఛిద్' పర్వతభంజకుడు. క్రౌంచపర్వతభేదన ముద్దిష్టము. 'స్వః క్షితాంపతిః' స్వర్గములో నుండువారికి నాథుడు. 'అద్విదృక్' ద్వినేత్రుడు కానివాడు; ఆరు మొగము లుండుటచేత పంద్రెండు కనులు గలవాడని భావము. 'అముద్భిః' అస్నిగ్ధములైన' 'దృష్టైః' చూపులతో 'జేఘ్నీయిషీష్ట' అత్యంతము వధించునుగాక— అని యర్థములు.

ఇచ్చట కాఠిన్యము రచనాశ్రితము, కావుననే దీనిని అరీతిమంతము అన్న వాక్యదోషమునం దంతర్భాగమైన కఠోరముగా పరిగణించుట జరిగినది. పదాశ్రిత మైన 'కష్టము' అన్న దోషముకంటె ఇది భిన్నమని గుర్తుంచుకొనుట యవసరము. ఉదాహరణము భామహుని కావ్యాలంకారము నుండి స్వీకృతము.

33. యా తు కాన్తి ప్రసాదార్థవ్యక్తీనా మన్యథా గతిః
అర్థప్రధానః ప్రోక్తః స వాక్యే గుణవిపర్యయః

అర్థము : కాంతి, ప్రసాదము, అర్థవ్యక్తి అనుగుణములు విపర్యయము లైనపుడు 'అరీతిమంతము' అన్న వాక్యదోష మేర్పడును. ఈ గుణము లర్థప్రధానము లగుటచేత తద్విపర్యస్తములైన దోషములు కూడ అర్థప్రధానములే యగును.

34. అప్రసన్నం భవేద్వాక్యం ప్రసాదస్య విపర్యయాత్.

యథా -

'అనంగకమలం చక్రే మయమానా మరాలికా

యస్యానత్యర్జునాబ్జన్మ సదృక్షాంకో వలక్షగుః' 44

అత్ర శబ్దానా మనతిప్రసిద్ధత్వా దనతిప్రసన్నత్వ మితి సోఽయ మర్థ ప్రధానః ప్రసాదవిపర్యయో దోషః.

అర్థము : ప్రసాదగుణముయొక్క విపర్యయమువల్ల అప్రసన్నము అను దోషము కలుగును.పోవుచున్న ఆడుహంస ఆకాశము నలంకరించెను. తెల్లగలువయు తత్సదృశ కళంకము గల చంద్రుడును దానికి కాకపోయిరి _ ఇది ఉదాహరణము.

ఇచ్చట శబ్దములకు అనతిప్రసిద్ధత్వమువల్ల అప్రసన్నత్వ మన్న దోషము. ఇది ప్రసాదమునకు విపర్యయము; అర్థప్రధానము. (మూలవివరణమందు 'అనతి ప్రసన్నత్వ మితి' అని కాక 'అప్రసన్నత్వ మితి' అని యుండుట సమంజసము).

వ్యాఖ్య : అర్థప్రధానములైన గుణములు ప్రసాదము, అర్థవ్యక్తి, కాంతి యనునవి. వీనికి విపర్యయము కలిగినప్పుడు క్రమముగా అప్రసన్నము, నేయార్థము, గ్రామ్యము అని అర్థప్రధానములు గుణవిపర్యయములునైన వాక్యదోషములు కలుగును. ఇవన్నియు అరీతిమంతముసం దంతర్భాగములు.

శ్రవణమాత్రముననే అర్థము స్పష్టగోచర మగుట ప్రసాదగుణలక్షణము. ఇందలి పదములు ప్రసిద్ధములై యుండి ఝడితిస్ఫూర్తిని కలుగజేయును. అట్లు కాకుండుట అప్రసన్నమన్న దోషమునకు లక్షణము.

ఉదాహృత పద్యమున ఆకాశార్థమున 'అనంగక' శబ్దము వాడబడినది. పోవుచున్న యన్న యర్థమున 'మయమానా' యని, తెల్లగలువ యన్న యర్థమున 'అర్జునాబ్జన్మ' యని, చంద్రుడన్న యర్థమున 'వలక్షగుః' అని వాడబడినవి. ఇవి ఆయాయర్థములందు ప్రసిద్ధములు కాకపోవుటచే పద్యస్ఫూర్తికి సహకరింపవు.

అనగా ప్రసాదగుణము భగ్నమైన దనియే భావము. కావుననే యీ పద్యము 'అప్రసన్నము' అను దోషమున కుదాహరణమైనది.

వాక్యం భవతి నేయార్థ మర్థవ్యక్తే ర్విపర్యయాత్.

యథా -

'మహీ మహావరాహేణ లోహితా దుద్ధృతోదధేః
ఇతీయత్యేవ నిర్దిష్టే నేయా లౌహిత్యహేతవః' 45

తదిదం నిగద్యేనైవ వ్యాఖ్యాత మిత్యర్థ ప్రధానోఽయ మర్థ వ్యక్తి విపర్యయః.

అర్థము : అర్థవ్యక్తి యొక్క విపర్యయమువల్ల నేయార్థ మన్న దోషము కలుగును. మహావరాహముచేత ఎఱ్ఱని సముద్రమునుండి భూమి ఉద్ధరింప బడినది అని యీ మాత్రము నిర్దేశింపగా ఎఱ్ఱదనమునకు హేతువులు నేయములగును. ఇది ఉదాహరణము. (నిజమునకు పూర్వార్ధమునందే ఉదాహరణము పూర్తియైనది. ఉత్తరార్ధము లక్ష్యలక్షణ సమన్వయమును బోధించుచున్నది.)

ఉదాహరణమందే యిది వ్యాఖ్యాతమైనది. ఇది అర్థప్రధానము; అర్థవ్యక్తి విపర్యయము.

వ్యాఖ్య : విశేషణ విశేష్యభావమున కభిమతార్థ ప్రతిపాదకములైన పదములను వాడుటచేత సంపూర్ణవాక్యము సమగ్రభావమును వ్యక్తముచేయును. ఇది అర్థవ్యక్తి. దీనికి విపర్యస్తమైనది నేయార్థము. నేయార్థ మనగా కృతకముగా కల్పింపబడిన అర్థముమ కలదని భావము.

ఉదాహృతపద్యమునందు 'ఎఱ్ఱనిసముద్రమునుండి' అన్న యర్థము కనుపట్టును. సముద్రము ఎఱ్ఱనగుట యెందువల్లనో చెప్పబడలేదు. దానికి హేతువుల నన్వేషింపవలయును. లేనియెడల సముద్ర మెఱ్ఱగా నుండుట లోకవిరుద్ధము కావలసి వచ్చును. కావున మహావరాహము శత్రుసంహారము చేయగా తద్రక్తముచేత సముద్రమెఱ్ఱబడెనన్న కల్పనను జోడించుకొనవలయును. దీనిని నిర్వహించు పదములు పద్యమున లేవు. అందువల్ల నిది నేయార్థము అన్న దోషముగా పరిగణితమగుచున్నది. పై కల్పన లేనియెడల ఉదాహృత వాక్యము సమగ్రభావ బోధక

సమర్థము కాదు. అనగా అర్థవ్యక్తి లేదని యర్థము. కావుననే యిది నేయార్థమన్న అర్థదోషమున కుదాహరణమైనది.

ఈ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

35. కాన్తే ర్విపర్యయా ద్వాక్యం గ్రామ్య మిత్యపదిశ్యతే.

యథా -

'విరహే తే విషీద న్తం నిషీద న్తం తవా న్తికే

కన్యే కామయమానం మాం త్వం న కామయసే కథమ్' 46

ఇద ముక్తే ర్గ్రామ్యతయా కాన్తిహీన మిత్యర్థప్రధానోఽయం కాన్తి విపర్యయో దోషః.

అర్థము : కాంతియొక్క విపర్యయమువల్ల వాక్యము గ్రామ్య మనిపిలువబడును. ఓ కన్యా! విరహము నందు నీకై విచారించుచు నీ సమీపమున కూర్చుండి నిన్ను కామించుచున్న నన్ను నీవు కామింపవేల? ఇది ఉదాహరణము.

ఇట్లు పలుకుటలోని గ్రామ్యతచేత కాంతిహీన మన్న అర్థప్రధానమైన దోషము కలుగును. ఇది కాంతికి విపర్యయము. (దోషముపేరు లక్షణ వాక్యము నందు గ్రామ్యమని చెప్పి వివరణ వాక్యమునందు కాంతిహీనమని చెప్పుట జరిగినది. గ్రామ్యమవి యనుటయే సమంజసము.)

వ్యాఖ్య : రసమునకు దీప్తియే కాంతి యన్నగుణము. రసపోషకములైన అర్థములను నిబంధించుటచేత కాంతి కలుగును. అట్లు కాకుండిన గ్రామ్యమగును. రసపోషణానుకూలము కాని ప్రసంగము విరస మగును. అదియే గ్రామ్య మన్న కాంతివిపర్యయమైన అర్థదోషము.

ఉదాహృత పద్యమునందు 'కామించుచున్న నన్ను నీవు కామింపవేల?' అను ప్రసంగము రసపోషణకు కాక రసభంగమునకే సహకరించు చున్నది. సుకుమార ప్రసంగము కావలసినచోట విరసప్రసంగము చేయుటచేత అచట కాంతిగుణము తప్పిపోయినది. కావుననే యిది గ్రామ్యమైనది.

ఈ శ్లోకమునందలి ఉత్తరార్ధము దండి కావ్యాదర్శము నందలిది.

ఓజో మాధుర్య మౌదార్యం న ప్రకర్షాయ జాయతే.

36. యస్మిం స్తమాహు రుభయప్రధానం తద్విపర్యయాత్
వాక్యే యః ఖండయన్ రీతిం భవత్యోజో విపర్యయః
అసమ స్త మితి ప్రాహు ర్దోషం తమిహ తద్విదః.

యథా —

'స్మరః ఖరః ఖలః కాన్తః కాయః కోపధనః కృశః
చ్యుతో మానోఽధికో రాగో మోహో జాతోఽసవో
గతాః' 47

అత్ర సత్యమ స్త పదాభిధానే సత్యపి చార్థసౌకుమార్యే శ్లేషాది గుణసామగ్ర్య భావా న్న వైదర్భీ రీతిః. నాపి యథోక్తలక్షణా భావాద్ గాడీయాదయ ఇతి. ఖణ్డితరీతిత్వా దయ మోజోవిపర్యయః శబ్దార్థప్రధానో గుణవిపర్యయో దోషో భవతి. యదాహ—

37. ఇత్యాది బంధపారుష్యం శైథిల్యం చ నియచ్ఛతి
అతో నైన మనుప్రాసం దాక్షిణాత్యాః ప్రయుంజతే.

అర్థము : ఓజస్సు, మాధుర్యము, ఔదార్యము అను గుణములు విపర్యయములైనపుడు ఉత్కర్షను కలిగింపవు. అవి ఉభయప్రధానములైన దోషములగును. వాక్యమునందలి రీతిని ఖండించుచు ఓజోవిపర్యయము 'అసమ స్తము' అను దోషముగా విజ్ఞులచేత వ్యవహృత మగును.

మన్మథుడు తీక్ష్ణుడు; కాంతుడు ఖలుడును కోపధనుడును; శరీరము కృశించినది; మానము జారిపోయినది; ప్రేమ యధికమైనది; మోహము పుట్టినది; ప్రాణములు పోయినవి — ఇది ఉదాహరణము.

ఇచ్చట అసమ స్త పదములనే వాడినప్పటికిని, అర్థసౌకుమార్యమున్నప్పటికిని శ్లేషాదిగుణసామగ్రి లేకపోవుటచేత ఇది వైదర్భీ రీతి కాదు. ఆయా లక్షణములు

లేనందువల్ల గౌడీయాదులును కాదు. ఖండిత రీతిత్వమువల్ల ఇది ఓజోవిపర్యయము శబ్దార్థప్రధానమునైన గుణవిపర్యయ దోషమగుచున్నది. అందువల్లనే యిట్లు చెప్ప బడినది —

ఇత్యాదులు బంధపారుష్యమును శైథిల్యమును కలిగించును. అందువల్లనే దాక్షిణాత్యు లీ యనుప్రాసమును ప్రయోగింపరు.

వ్యాఖ్య : గుణవత్పద రచన రీతి యనబడును. ప్రకృత దోషములు గుణవిప ర్యయములగుటచేత గుణముతో పాటుగనే రీతిని గూడ భగ్నము చేయును. ఓజస్సు, మాధుర్యము, ఔదార్యము అను గుణములు శబ్దార్థోభయ ప్రధానములు. కావున, తద్విపర్యయములైన దోషములు కూడ శబ్దార్థోభయ ప్రధానము లగుట స్వాభావికమే.

'ఓజః సమాసభూయస్త్వమ్' అని లక్షణము. సమాసము లధికముగా నుండిన ఓజోగుణ మగును. తద్విపర్యయము సమాసములు లేకుండుట. కావుననే 'అసమస్తము' అన్నది ఓజో విపర్యయమైన దోషముగా పరిగణితమైనది.

ఉదాహృతపద్యమునందు 'కోపధనః' అను చిన్నసమాసము తప్ప తక్కిన వన్నియు విడిపదములే. కావుననే అసమస్తదోషమున కుదాహరణమైనది.

రచయితయే ఒక విధముగా శంకించుకొనెను — ఇచ్చట సమాసములు లేవు గనుక ఓజోగుణము లేదు. వేరువేరు పదము లుండుటయే మాధుర్య లక్షణము. కఠోరము లయిన అక్షరములు లేకుండుట సౌకుమార్యము. కావున ఆ గుణములున్న వనియు, తదనుకూలమైన వైదర్భీరీతి యున్నదనియు ననరాదా? అని ప్రశ్నించుకొని శ్లేషాది సామగ్రి లేకపోవుటచేత అట్లనరా దని నిర్ణయించెను. ఇచ్చట రీతి భగ్న మైనది. గుణమునకును విరుద్ధత యేర్పడినది. కావున దీనిని దోషముగానే అంగీక రింపవలయునన్నది నిష్కర్ష.

ఇంక తన నిష్కర్షకు ప్రోద్బలకముగా ఆలంకారిక వచనమును గూడ ప్రదర్శించుచున్నాడు. 'స్మరః ఖరః' మొదలుగా నున్న పద్యమునందు బంధము శిథిలమైన మాట వాస్తవమే. రీతియు భగ్నమైనది. కాని శబ్దాలంకారమైన అను ప్రాసమున్నది కదా! అది ప్రయోగార్హమే కదా! అనువారికి సమాధానముగా 'దాక్షిణాత్యు లీ యనుప్రాసము నాదరింపరు' అని చెప్పెను. ఆయన భావ

మిది — రీతి లేనివాక్యము నిర్జీవము; శవప్రాయము. దాని కెన్నియలంకారములు గూర్చినను హేయములే కాని ఉపాదేయములు కావు. రీతి యున్నప్పుడే అలంకారములకును పరిగణనము కల్గును; అప్పుడే అవి చమత్కారావహములు కాగలవు. కావుననే అనుప్రాసమును నిర్జీవవాక్యమునందు ప్రయోగింప రని దాక్షిణాత్యుల అభిరుచిని రచయిత సమర్థించెను.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

38. మాధుర్య వ్యత్యయో యస్తు జాయతే రీతిఖండనాత్
త దనిర్వాహ మిత్యుక్తం కావ్య సర్వస్వ వేదిభిః.
యథా —
'నఖినాం చ నదీనాం చ శృంగిణాం శస్త్రపాణినామ్
విశ్వాసో నైవ కర్తవ్యః స్త్రీషు రాజకులేషు చ' 48

అత్ర నఖినాం చ నదీనాం చేతి షష్ఠ్యన్తా చ్చకారేణ రీతే రుపక్రాన్తే శృంగిణాం శస్త్రపాణినా మితి చకారానిర్వాహాత్ స్త్రీషు రాజకులేషు చేతి షష్ఠీపరిత్యాగా దమధురార్థత్వాచ్చ మాధుర్య విపర్యయనామాయం శబ్ద ప్రధానో గుణవిపర్యయో దోషః యదాహ—

39. మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః
యేన మాద్యన్తి ధీమన్తో మధునేవ మధువ్రతాః

40. యయా కయాచిచ్ఛ్రుత్యా యత్సమాన మనుభూయతే
తద్రూపా హి పదాసత్తిః సానుప్రాసా రసావహా.

అర్థము: రీతిఖండనమువల్ల జనించిన మాధుర్యవ్యత్యయమును రసవేత్తలు అనిర్వాహ మన్న దోషముగా పేర్కొందురు. గోళ్ళు గలవానిని, నదులను, కొమ్ములు గలవానిని, శస్త్రపాణులను, స్త్రీలను, రాజవంశస్థులను విశ్వసించుట తగదు. ఇది ఉదాహరణము

ఇచ్చట 'నఖినాం చ నదీనాం చ' అని షష్ఠీవిభక్త్యంతములపై చకారమును వాడుటచేత రీతి మొదలు కాగా 'శృంగిణాం శస్త్రపాణినా' మని చకారమును విడుచుట

వల్లను 'స్త్రీషు రాజకులేషు చ' అని షష్ఠీవిభక్తిని విడిచి పెట్టుట వల్లను అమధురార్థత్వము చేతను (రీతిభగ్నమై) మాధుర్య విపర్యయ మను పేరుగల శబ్దార్థప్రధానమైన గుణవిపర్యయ దోషము కలుగుచున్నది. (లక్షణవాక్యమునందు అనిర్వ్యూఢము అని పేరుచెప్పి వివరణవాక్యమునందు మాధుర్య విపర్యయమునే పేరుగా చెప్పుట చెప్పుటలోని విపర్యయము మాత్రమే. 'అనిర్వ్యూఢము' అనునదియే దోష నామము).

ఇట్లు చెప్పబడినది — మధురము రసవంతము. వాక్కునందును వస్తువునందునుగూడ రసమున్నది. తేనెచేత తుమ్మెదలు పరవశించునట్లు సరసులు మాధుర్యముచేత (దానిచేత) పరవశింతురు. ఏదో యొక శబ్దశ్రుతిచేత తత్సమాన మనుభవమునకు వచ్చును. ఆవిధమైన పదముల పొందికయే అను ప్రాసము. అది రసావహము.

వ్యాఖ్య : మాధుర్యగుణము శబ్దార్థోభయ ప్రధానము. శబ్దమాధుర్యము పృథక్పదములచేత కలుగును. అర్థమాధుర్యము వస్తువు నాశ్రయించుకొనియుండును. 'శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః। తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి'. శృంగారమే మిక్కిలి ఆనందమును కలిగించు మధురమైన రసము. తన్మయమైన అనగా శృంగారమైన కావ్యము నాశ్రయించుకొని మాధుర్యము వెలయును. అట్లే విప్రలంభ శృంగారము నందుకూడ కొన్నియెడల మాధుర్యము మిక్కిలి యుత్కర్ష వహించి యుండును.

మాధుర్యము వ్యత్యస్తమయినయెడల అనిర్వ్యూఢము అన్నదోషముకలుగును. ఉదాహరణమునందు 'నళినాం చ నదీనాం చ' అన్నచోట ఒక రీతియున్నది. షష్ఠీ విభక్త్యంతములయిన విడిపదముల మీద సముచ్చయార్థకమైన చ వర్ణము చేరినది. ఇది యిట్లు చివరంట నిర్వహింపబడలేదు. కావుననే, రీతి భగ్నమైనది. చివరి రెండు పదములను షష్ఠ్యంతములుగా కాక సప్తమ్యంతములుగా 'స్త్రీషు, రాజకులేషు' అని ప్రయోగించుట జరిగినది. ఒకే అర్థప్రకారమునందు భిన్నకారకములను వాడుటచేత కూడ రీతి భగ్నమైనది. సప్తమ్యంతములైన యీ రెండు పదములలో కడపటిదానికి మాత్రమే సముచ్చయార్థకమును చేర్చుట సౌందర్యభంజకముగా నున్నది. మొదలు పెట్టబడిన రీతి చివరంట నిర్వహింపబడ లేదు. కావుననే అనిర్వ్యూఢ మన్న పేరు ఈ దోషమునకు అన్వర్థకముగానున్నది.

పూర్వాలంకారికులను ప్రమాణముగా చూపుట తన నిర్ణయమునకు బలమున చేకూర్చుకొనుటకే. పదశ్రవణముచేతనే అర్థానుభూతి కలుగును. అట్లు అనుభూతిని కలిగించు పదములపొందిక రసావహమై యుండును. అది దూష్యము కాదు. కేవలము సజాతీయాక్షరములను పునఃపునరావృత్తిచేయుటచేత అనుప్రాసమగును. అది అర్థానుభూతిని కలిగింపకపోయినచో రసావహము కాదు. అట్టిది దూష్యము. కావుననే అనిర్వ్యూఢము గుణవిపర్యయమైన శబ్దార్థోభయాశ్రయమైన దోషముగా నిరూపింపబడినది.

41. యస్తు రీతే రనిర్వ్యూహా దౌదార్యస్య విపర్యయః
వాక్యం తదనలంకార మలంకార విదో విదుః.

యథా —

'దీర్ఘపుచ్ఛ శ్చతుష్పాదః కకుద్మాం ల్లంబ కంబలః
గో రపత్యం బలీవర్ద స్తృణ మత్తి ముఖేన సః' 49

తదిద మపుష్టార్థత్వా దనుత్కృష్ట విశేషణ మనుదారం నిరలంకార మాచక్షతే సోఽయ మౌదార్య విపర్యయో నామ శబ్దార్థ ప్రధానో గుణ విపర్యయో దోషః. యదాహ —

42. శ్లాఘ్యై ర్విశేషణై రుక్త ముదారం వాక్య మిష్యతే
యథా లీలాంబుజ క్రీడాసరో హేమాంగదాదయః.

43. ఉత్కర్షవాన్ గుణః కశ్చి దుక్తే ర్యస్మిన్ ప్రతీయతే
తదుదారాహ్వయం తేన సనాథా కావ్యపద్ధతిః.

అర్థము :- రీతిని నిర్వహింపక పోవుటవల్ల కలిగిన ఔదార్యవిపర్యయమైన వాక్యమును 'అనలంకార' మని అలంకారవిదులు పేర్కొందురు. ఇది దోషము. పొడవైన తోక గలది, నాలుగు కాళ్ళు గలది, మూపుగలది, వ్రేలాడుచున్న కంబళి గలది, గోవునకు సంతానమైన యెద్దు నోటితో గడ్డి తినుచున్నది. ఇది ఉదాహరణము.

అపుష్టార్థత్వముఎల్ల అనుత్కృష్ట విశేషణము అనుదారము, నిరలంకారము నని యనబడును; ఇది ఔదార్యవిపర్యయమనెడి శబ్దార్థప్రధానము, గుణవిపర్యయము నైన దోషము. (ఇచ్చటకూడ ఔదార్యవిపర్యయము పేరుగా తెలుపబడినది. లక్షణ వాక్యమునందున్న 'అలంకారము' అనునదియే దోషనామము).

ఇట్లు చెప్పబడినది – శ్లాఘ్యములైన విశేషణములతో చెప్పబడిన వాక్యము ఉదారము. లీలాంబుజము, క్రీడాసరస్సు, హేమాంగదము మొదలైనవి ఔదార్యమున కుదాహరణములు.

శబ్దమున కుత్కర్షను గలిగించు ఒకానొక గుణము వాక్యమునందు ద్యోతిత మగును. దానినే 'ఉదార' మని యందురు. దానిచేత కావ్యపద్ధతి సనాథమై యుండును.

వ్యాఖ్య : శ్లాఘ్యవిశేషణములతో కూడియుండుట ఔదార్యము. అట్లుకాని విశేషణము లెన్ని యున్నను అర్థమునకు పుష్టిని కూర్పవు. అట్టివి అలంకారము లను కాజాలవు. కావుననే ఔదార్యగుణవిపర్యయమును అనలంకార మన్న దోష ముగా పరిగణింతురు.

ఉదాహృత పద్యమునందు 'బలీవర్దము'అను విశేష్యమునకు అయిదు విశేషణ ములు వాడబడినవి. అన్నియు శుష్కములే. అర్థపుష్టి కెంతమాత్రమును సహక రింపని వీనిని శ్లాఘ్యవిశేషణములని యనుటకు వీలులేదు. కావుననే ఇచ్చట ఔదా ర్యము భగ్నమయినది. రీతియు నష్టమయినది. అందువల్లనే యిది అనలంకారము నకు ఉదాహరణమైనది. ప్రతిపాదింపబడిన విషయముకూడ అనుదారమే. కావుననే యిది శబ్దార్థోభయ దోషము.

## వాక్యార్థదోషములు

44. అపార్థం వ్యర్థ మేకార్థం ససంశయ మపక్రమమ్
ఖిన్నం చైవాతిమాత్రం చ పరుషం విరసం తథా.

45. హీనోపమం భవేచ్చాన్య దధికోపమ మేవ చ
అసదృక్షోపమం చాన్య దప్రసిద్ధోపమం తథా.

46. నిరలంకార మశ్లీలం విరుద్ధ మితి షోడశ
ఉక్తా వాక్యార్థ జా దోషా స్తేషాం వక్ష్యామి లక్షణమ్.

అర్థము : వాక్యార్థదోషములు పదునారు. అవి 1. అపార్థము 2. వ్యర్థము 3. ఏకార్థము 4. ససంశయము 5. అపక్రమము 6. ఖిన్నము 7. అతిమాత్రము 8. పరుషము 9. విరసము 10. హీనోపమము 11. అధికోపమము 12. అసదృశోపమము 13. అప్రసిద్ధోపమము 14. నిరలంకారము 15. అశ్లీలము 16. విరుద్ధము వాని లక్షణమును చెప్పుదును.

[ అపార్థము ]

47. సముదాయార్థ శూన్యం య త్తదపార్థం వచః స్మృతమ్.

యథా :—
'జరద్గవః కంబల పాదుకాభ్యాం
ద్వారి స్థితో గాయతి మంగలాని
తం బ్రాహ్మణీ పృచ్ఛతి పుత్రకామా
రాజన్ రుమాయాం లశునస్య కోఽర్థః' 50
అత్ర సముదాయార్థః కోఽపి నా స్తీత్యపార్థ మిదమ్.

అర్థము : వాక్యమునకు సాముదాయికమైన యర్థమేమియు లేనిచో అది 'అపార్థము' అను దోషమగును. ముసలియెద్దు కంబళితో పాదుకలతో ద్వారమునందు నిలిచి మంగళములను పాడుచున్నది. అతనిని పుత్రార్థినియైన బ్రాహ్మణ వనిత 'ఓ రాజా! రుమయందు ఉల్లిపాయకు ప్రయోజనమేమి?' అని ప్రశ్నించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట సముదాయార్థ మేమియు లేదు. అందువల్ల నిది అపార్థము.

వ్యాఖ్య : వాక్య మనగా యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తిగల పదముల సముదాయ మని యర్థము. యోగ్యత యనగా అనురూపత. నీటిచే దహించుచున్నాడు; నిప్పుచే తడుపుచున్నాడు – అను వాక్యములందు యోగ్యత లేదు. దహించుటకు నిప్పు సమర్థము; తడుపుటకు నీరు అనురూపము. తొలివాక్యమున అనురూపమైన

'నిప్పుచే' అని యనక 'నీటిచే' అని యనుటచేత యోగ్యత భగ్నమయినది. తరువాతి వాక్యమున నట్లే యోగ్యమైన 'నీటిచే' అనికాక 'నిప్పుచే' అని యనుటచేత యోగ్యత భగ్నమయినది. ఇట్లు యోగ్యత లేకపోవుటచేతనే అపార్థమన్న వాక్యార్థదోషము కలుగును.

ఉదాహృతశ్లోకమునందు 'ముసలియెద్దు మంగళములు పాడుచున్నది' అన్నప్పుడు ఉద్దేశ్యమునకు విధేయమునకు అనురూప్యము లేదు. ముసలియెద్దును 'రాజా' అని సంబోధించుట అర్థహీనము. అడిగిన ప్రశ్నయు నటువంటిదే. మొత్తము మీద వాక్యమున కంతటికిని సమన్వయరూపమైన అర్థము లేదు. అందువల్లనే దీనికి 'అపార్థ' మన్నపేరు సార్థక మగుచున్నది.

ఉదాహరణ శ్లోకము జైమిని సూత్రవృత్తి నుండి గ్రహింపబడినది.

## [ వ్యర్థము ]

వ్యర్థ మాహుర్గతార్థం యద్యచ్చ స్యాన్నిష్ప్రయోజకమ్.

యథా –

'ఆహిషాతాం రఘువ్యాఘ్రౌ శరభంగాశ్రమం తతః

స్వాం మహాఋక్షిత్తనుం వహ్నౌ దృష్ట్వా తౌ రామలక్ష్మణౌ' 51

అత్రాహిషాతాం దృష్ట్వేత్యేతాభ్యామేవ తావితి, రఘువ్యాఘ్రౌ విత్యనేనైవ రామ లక్ష్మణా వితి, తను మిత్యనేనైవ స్వామితి, అహౌషీదిత్యనేనైవ వహ్నా వితి, గమ్యత ఇతి గతార్థత్వమ్. న చ శరభంగాశ్రమ గమనం తనుహోమో వా ప్రకృతః కథా శరీరోపయోగీతి నిష్ప్రయోజకత్వమ్. అతోఽయం వ్యర్థనామా వాక్యస్య మహావాక్యస్య చ దోషో భవతి. ఆర్థ్యా చ వృత్త్యా లబ్ధస్య శాస్త్రేతిహాసాదౌ శబ్దవృత్త్యాభణన మపౌనరుక్త్యాయేత్యర్థపునరుక్తే ర్భిద్యతే.

**అర్థము** : గతార్థము, నిష్ప్రయోజనము నైనదానిని వ్యర్థమని యందురు

రఘువ్యాఘ్రములు శరభంగాశ్రమమునకు వెళ్ళెను. అంతట వారిని రామలక్ష్మణులను చూచి, తన శరీరము నగ్నియందు ఆహుతి గావించెను. ఇది ఉదాహరణము.

ఇక్కడ 'వెళ్ళెను' 'చూచి'అని యనుటవల్ల 'వారిరువురిని' అని 'రఘువ్యాఘ్రములు'అని యనుటవల్ల రామలక్ష్మణులని, శరీరము నని యనుటచేతనే తనదని, ఆహుతిచేసెననియనుటవల్ల నే అగ్నియందని స్ఫురించుచుండుటయే గతార్థత్వము. శరభంగాశ్రమ గమనమును, తనుహోమమును సుందరి కథాశరీరమున కుపయోగింపక పోవుట విప్రయోజకత్వము. అందువల్ల నే, యిది వ్యర్థమను పేర వాక్యదోషమును మహావాక్యదోషమునుగూడ అగుచున్నది. అర్థముచేత కాని, వృత్తిచేత కాని లభించిన దానిని కాప్తైత్రిహసాదుల్వదు శబ్దవృత్తిచేత చెప్పుట పునరుక్తి లేకుండుటకే యని అనుటవల్ల ఇది అర్థపునరుక్తి కంటె భిన్నము.

వ్యాఖ్య: పై శ్లోకమునందు 'రఘువ్యాఘ్రౌ'అని చెప్పుటవల్ల రామలక్ష్మణులు (ద్వివచనము) అనియే స్ఫురించుచున్నది. అట్టియెడల మరల రామలక్ష్మణులని స్వశబ్దముచేత చెప్పుట వ్యర్థము. 'శరీరమును' అని యన్నప్పుడు ఏకవచనప్రయోగముబట్టి స్వీయశరీరము నని స్పష్టము. దానిని మరల చెప్పుట వ్యర్థము. 'ఆహుతి చేసెను' అని యన్నప్పుడు 'అగ్నియందు' అనియే యర్థము. ఆహుతికర్మకు అగ్నికి అవినాభావసంబంధము. అట్టియెడల మరల చెప్పుట వ్యర్థము. ఇట్టివి వాక్యమునకు సంబంధించిన దోషములు.

శరభంగాశ్రమగమనము కాని, శరభంగతనుహోమము కాని ప్రబంధార్థమును పోషింపదు. రామాయణకథాపుష్టికి దోహదము చేయదు. మహావాక్య మనగా కావ్యమని యర్థము. ప్రకృతవిషయము కావ్యమునకు ప్రయోజనకరము కాకపోవుటచేత, ఇది మహావాక్యదోషముకూడ అగుచున్నది.

[ ఏ కా ర్థ ము ]

48. ఉక్త్యభిన్నార్థ మేకార్థమ్.

యథా —

'ప్రసాధితస్యాథ మురద్విషోఽభూ
దన్యైవ లక్ష్మీరితి యుక్తమేతమ్
వపుష్యశేషేఽఖిలలోకకాన్తా
సానన్యకాంతా హ్యురసీతరా తు.'

ఇత్యుక్తై కార్థ మేవాహ —

'కపాట విస్తీర్ణ మనోరమోరః
స్థలస్థిత శ్రీ లలనస్య తస్య
ఆలింగితాశేషజనా బభూవ
సర్వాంగసంగిన్యపరైవ లక్ష్మీః' 53

అనయోః శ్లోకయోః అభిన్నార్థ మేకం వాక్యం మహావాక్యే దుష్యతి.

**అర్థము :** చెప్పబడిన యర్థముకంటె భిన్నమైన యర్థము కానిది ఏకార్థము. అలంకరింపబడిన విష్ణునకు అది మరొక లక్ష్మి యయ్యెను. సమగ్రమైన శరీరమునందు సర్వలోకకాంత; మరి వక్షఃస్థలమునందు అనన్యకాంతయైన యింకొకతె. ఇది ప్రథమ పద్యము. కవాటమువలె విశాలమై మనోరమమైన వక్షఃస్థలమందు లక్ష్మిని కలిగియున్న విష్ణునకు అది అశేషజనాలింగితయు, సర్వాంగసంగినియు నైన మరొక లక్ష్మి యయ్యెను. ఇది ద్వితీయ పద్యము.

ఈ రెండు శ్లోకములందలి అభిన్నార్థమైన యేకవాక్యము మహావాక్యమందు దోష మగుచున్నది.

**వ్యాఖ్య :** మొదటి శ్లోకమునందు చెప్పిన భావమునే రెండవ శ్లోకమునందును చెప్పుట జరిగినది. చెప్పుటలో భేదమున్నది. ఉపయోగించిన మాటలలో భేదమున్నది. కాని, కల్పనమందు భేదము లేదు. ఏ శ్లోకమున కాశ్లోకము రమణీయమే, ఉపాదేయమే. కాని, కావ్యమునందు ఒకే భావముతో రెండు శ్లోకములను చెప్పుటచేత ఏకార్థ మన్న దోషము కలుగును. విష్ణునికి సర్వావయవముల నలంకరించిరి. ఆ అలంకారశోభ అఖిలలోకకాంతయై మరొక లక్ష్మివలె నున్నది. అఖిలలోకకాంత యనగా సర్వలోకముల నాకర్షించునదని యర్థము. రెండవపద్యమునందు 'ఆలింగితాశేషజనా' అన్నప్పుడు మాటలలో భేదమే కాని అర్థమునందు భేదము లేదు. వక్షమునందున్న లక్ష్మి యొకతె కాగా అలంకారశోభ మరొకలక్ష్మివలె నున్నదనుటయే కల్పనలోని కామనీయకము. ఇదియే పునరుక్త మగుటచేత ఏకార్థమన్న దోషమైనది.

ఉదాహరణ శ్లోకములు మాఘుని శిశుపాలవధమునందలివి.

## [ స సం శ య ము ]

సందిగ్ధార్థం ససంశయమ్.

యథా -

'మనోరథప్రియాలోక రసలోలేక్షణే సఖి
ఆరాద్ వృత్తిరియం మాతా న క్షమా ద్రష్టుమీదృశమ్.' 54

అత్రారాత్ప్రభృతి శబ్దానా ముభయార్థత్వా న్మాతా ద్రక్ష్యతి నవేతి సందిగ్ధమ్.

**అర్థము :** సందేహమును కలిగించు నర్థము గలది ససంశయము. కోరిన ప్రియుని చూచెడి యానందమున చంచలములైన లోచనములు గల నెచ్చెలీ! అమ్మ (దూరముగా) దగ్గరగా నున్నది. ఇటువంటిదానిని చూటజాలదు_ఇది ఉదాహరణము.

ఇచ్చట 'ఆరాత్' మొదలయిన మాటల ఉభయార్థముచేత 'చూచునా?' 'చూడదా?' అన్న సందేహము కలుగును.

**వ్యాఖ్య :** చెప్పదలచుకొన్న విషయము స్పష్టము కాక 'ఇదా?' 'అదా?' అని సంశయమున కాశ్రయమైనయెడల ససంశయ మన్న దోష మగును. ఇచ్చట యీ సంశయము వాక్యగతములైన పదముల అనేకార్థత్వమువల్లనే కలుగును.

అనేకార్థములు గల పదములు అనేకముగా నున్నవమాట తథ్యము. అన్నిచోట్ల 'ససంశయము' అన్న దోషము కలుగవలసిన యవసరము లేదు. సందర్భము, ఇతర పదముల సాహచర్యము మొదలైన వానినిబట్టి అర్థనిర్ణయము జరుగును. అట్టియెడల ఈ దోషము తలయెత్తదు.

ప్రకృతోదాహరణమున నాయిక మాటిమాటికిని తన మనఃప్రియుని చూచుకొని యానందించుచున్నది. 'తల్లి దూరముగా నున్నది కావున ఈవిధమైన చేష్టను చూడజాలకున్నది' అని యొక అర్థము. దీనినిబట్టి 'దగ్గరగానే యున్నయెడల నీ అపేక్షను తెలిసికొని ముచ్చటపడి మీ యిర్వురకును వివాహము గావించెడిది' అన్న భావము వ్యంజిత మగుచున్నది. 'ఆరాత్' అన్న పదమునకు 'దూరముగా' అన్న యర్థముతోపాటు 'దగ్గరగా' అన్న అర్థముకూడ నున్నది. 'ఆరాద్దూర సమీపయోః'.

కావున 'దగ్గరగా' అన్న యర్థమును గ్రహించినపుడు 'మీ అమ్మ దగ్గరనే యున్నది. ఇటువంటి పనిని చూచి సహింపదు' అన్న యర్థము కలుగును. దీనిని బట్టి 'మీ అమ్మకు తెలియకుండ ఇంతవరకు చూచితివి గాని యిప్పుడింక చూచుట సాగదు. ఇట్లు నీవు చేయుచున్న పనిని చూచినచో మీ అమ్మ తప్పక నిన్ను శిక్షించును' అన్న యర్థము వ్యంజిత మగును.

ఇట్లు విరుద్ధార్థములు కలుగుటకు 'ఆరాత్' అన్న పదము కారణ మగుచున్నది. దీని ననుసరించి 'ద్రష్టుం న క్షమా' అను మాటలకు సందర్భానుసారముగా రెండువిధములయిన అర్థములు కలుగుచున్నవి. మొత్తముమీద తల్లి 'ఒప్పుకొనునా?' 'ఒప్పుకొనక తప్పుపట్టునా?' అన్న సందేహము అట్లే యుండిపోయినది. కావుననే యిది సంశయ మన్న దోషమున కుదాహరణమైనది.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ అ ప క్ర మ ము ]

వాక్యం యత్తు క్రమభ్రష్టం తదపక్రమ ముచ్యతే.

యథా –

'కారావిఊణ ఖఉరం
గామఉలో మజ్జిఓ అ జిమిఓ అ
ణక్ఖత్తిత్తిహి వారే
జోయిసిఅం పుచ్ఛిఉం చలిఓ 55

[ఛాయా –

కారయిత్వా క్షౌరం గ్రామప్రధానో మజ్జితశ్చ భుక్తవాంశ్చ
నక్షత్ర తిథివారాన్ జ్యౌతిషికం ప్రష్టుం చలితః]

అత్ర క్షురకర్మణోఽనన్తరం నక్షత్రాది ప్రశ్నా దిద మపక్రమమ్.

**అర్థము :** క్రమభ్రష్టమైన వాక్యమును అపక్రమ మని యందురు. గ్రామాధికారి క్షౌరము చేయించుకొని, స్నానము చేసి, నక్షత్ర తిథివారముల నడుగుటకై జ్యౌతిషుని కడకు వెళ్లెను. ఇది ఉదాహరణము.

ఇక్కడ క్షురకర్మకు పిమ్మట నక్షత్రాది ప్రశ్నచెప్పుటచేత ఇది అపక్రమము.

**వ్యాఖ్య :** ముందు చేయవలసిన పనిని ముందుగను, తరువాత చేయవలసిన పనిని తరువాతను చేయుట క్రమము. అట్లు కాకపోవుట అపక్రమము. సాంప్రదాయికులు నక్షత్రము, తిథి, వారము తెలిసికొని అనుకూల సమయమునందే క్షురకర్మ చేయించుకొందురు. ఇది లోకపద్ధతి. ప్రకృతోదాహరణమున ముందుగా క్షురకర్మ చేయించుకొనుట జరిగిపోయినది. దాని ననుసరించి మజ్జనభోజనాదులును నిర్వర్తింపబడినవి. ఆ పిమ్మట జ్యౌతిషికుని కడకు వెళ్ళి తిథివారాదులను గురించి ప్రశ్నించుట జరిగినది.

ప్రశ్నించి తిథివారాదులను తెలిసికొనుట ముందు జరుగవలయును; క్షౌరము చేయించుకొనుట తరువాత జరుగవలయును. ఆ క్రమము వెనుక ముందు లగుటచేత ఇది అపక్రమము.

[ ఖిన్నము ]

49\. జాత్యాదియుక్తౌ వనిర్వ్యూఢం ఖిన్న మాహు ర్మహాధియః.

యథా –

'వేవాహిఊణ బహూఆ
సాసురఅం దోలిఆఇ ణిజ్జన్తీ
రోఅఇ దిఅరో తం సం
ఠవేఇ పాసేణ వచ్చన్తో' 56

[ఛాయా –
వివాహ్యా వధూః శ్వాశురకం దోలికయా నీయమానా
రోదితి దేవర స్తాం సంస్థాపయతి పార్శ్వేన వ్రజన్.]

అత్ర ప్రక్రాన్తస్య నవ పరిణయవతీ స్వరూప భణనస్యాని ర్వ్యూఢత్వాత్ ఖిన్నత్వమ్.

**అర్థము :** జాతి మున్నగువానిని చెప్పునపుడు చివరంట నిర్వహణ సాగని యెడల ఖిన్న మని పండితు లందురు. పెండ్లి చేసికొని నూతన వధువు అత్తవారింటి

దోలికపై వెళ్లుచు ఏడ్చుచున్నది. ప్రక్కనే వెళ్లుచున్న ఆమె మరది యోదార్చు చున్నాడు — ఇది ఉదాహరణము.

ఇచ్చట మొదలుపెట్టిన నూతన పరిణయవతీ స్వరూపకథనము చివరంట నిర్వహింపబడక పోవుటవల్ల భిన్నత్వము.

వ్యాఖ్య : ద్రవ్య గుణ క్రియాదులను స్వభావసుందరముగా తెలుపుటకే స్వభావోక్తి యని పేరు. దానినే జాతి యనియు వ్యవహరింతురు. లక్షణవాక్యము నందలి 'జాత్యాది' అన్న ఆదిశబ్దప్రయోగముచేత ఉపమారూపకాద్యలంకారములను కూడ గ్రహింప వచ్చును.

స్వభావోక్తి గాని, ఉపమగాని, రూపకముగాని, యిట్టిదే యింకేదయిన గాని మొదలుపెట్టబడి చివరంట నిర్వహింపబడకపోయినచో భిన్నత్వ మన్న దోషము కలుగును. నిజమున కీ దోషము నిర్వహణమందలి అసమర్థతనే వెల్లడించును.

ప్రకృతోదాహరణమునందు క్రొత్తపెండ్లికూతురు పుట్టిల్లు వీడుచున్నప్పుడు కలిగిన దుఃఖముచేత కన్నీరు పెట్టుకొనుట వర్ణింపబడినది. ఇది స్వభావరమ్యముగా నున్నది. ఇంతవరకు జాతి నిర్వహింపబడినది. ప్రక్కనే వచ్చుచున్న మరది ఆమె నోదార్చుచున్నాడనుట స్వభావ విరుద్ధము. అంతేకాక, నవవధూ స్వభావచిత్రణముతో మొదలుపెట్టిన రచన ఆమె మరదిని వర్ణించుటలోనికి మరలినది. అనగా, నిర్వహణ సడలిపోయిన దని యర్థము. కావుననే, యిది భిన్నత్వ దోషమున కుదాహరణ మైనది.

## [ అతిమాత్రము ]

యత్సర్వలోకాతీతార్థ మతిమాత్రం తదుచ్యతే.

యథా -

'భృంగేణ కలికాకోశ స్తథా భృశ మపీడ్యత
వవర్ష విపినోత్సంగే గోష్పదప్రం యథా మధు' 57

అత్ర కలికాకోశే గోష్పదప్ర మధువర్షస్యాసంభవా దతిమాత్రత్వమ్.

**అర్థము** : లోకాతీతమైన యర్థమును చెప్పినయెడల 'అతిమాత్రము' అన్న దోషముగా పరిగణింతురు. తుమ్మెద కలికాకోశమును మిక్కిలి పీడింపగా విపినోత్సంగమునందు గోష్పదప్రమాణముగా మధువు వర్షించెను. ఇది ఉదాహరణము.

ఇక్కడ కలికాకోశమునందు గోష్పదప్రమాణము గల మధువు వర్షించుట అసంభవ మగుటచేత అతిమాత్రము.

**వ్యాఖ్య** : ఏదయిన నొక విషయమును లోకమునందు లేనంత విపరీతముగా చెప్పినయెడల అతిమాత్ర మన్న దోష మగును. ఇచ్చట విషయము లోకవిరుద్ధము కాదు; లోకమునం దున్నదియే. దానిని అతిప్రమాణములో చెప్పుటచేత లోకాతీత మగుచున్నది. లోకాతీతమైన దానిని లోకస్థమైనట్లు ప్రమాణమునుబట్టి చెప్పుటచేత అతిమాత్రము అన్న పేరు అర్థవంత మగుచున్నది.

పువ్వులలో తేనె యుండును. ఆ తేనెను తుమ్మెదలు త్రాగును. కొంత తేనె పైకి చిందినను చిందవచ్చును. ఇంతవరకు లోకమునం దున్నదే; కాని పువ్వునందు గోష్పదప్రమాణముగల తేనె యుండుట లోకవిరుద్ధము. పువ్వెంత పెద్దదయినను, అంతటి తేనె యుండదు. ఇక్కడి పరిమాణము లోకము నతిశయించి యున్నది, కావుననే అతిమాత్ర మన్న దోషమైనది.

కలికాకోశము అన్ని యనగా మొగ్గయొక్క గర్భము అని యర్థము. మొగ్గయందు తేనె యుండుననుట లోకవిరుద్ధము. ఇది మరొక దోషము. ప్రకృతోదాహరణమున అతిమాత్ర మన్న దోషము మాత్రమే కాక లోకవిరుద్ధ మన్న దోషము కూడ నున్నది.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకారసూత్రవృత్తినుండి గ్రహింపబడినది.

## [ పరుషము ]

50. యత్తు క్రూరార్థమత్యర్థం పరుషం తు తదుచ్యతే.

యథా -

'ఖాహి విసం పిఅ ముత్తం
ణిజ్జసు మారీఅ పడఉదే వజ్జమ్
దన్తక్ఖణ్డిఅ థణఆ
ఖవిఊణ సుఅం సవఇ మాఆ' 58

[ఛాయా -

ఖాద విషం పిబ మూత్రం
నీయస్వ మార్యా పతతు తే వజ్రమ్
దన్తఖండిత స్తనీ
క్షిప్త్వా సుతం శపతి మాతా.]

అత్ర ఖాద విష మిత్యాదీనాం క్రూరార్థానా మభిధానాత్ పారుష్యమ్.

**అర్థము** : అతితరమైన క్రూరార్థము గలది పరుష మనబడును. పాలు త్రాగుచు స్తనమును కొరికిన కొడుకును నేలమీద విడిచిపెట్టి 'నీవు విషము తినః నీవు మూత్రము త్రాగః నిన్ను మారి యెత్తుకొనిపోనుః నీమీద పిడుగు పడః' అని తల్లి తిట్టుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'విషముతిన' మొదలైన క్రూరార్థములను చెప్పుటవల్ల పారుష్యము.

**వ్యాఖ్య** : పాలు త్రాగుచు స్తనము కొరకుట సామాన్యవిషయము; శిశు సహజ లక్షణము. తల్లి బిడ్డల నల్లారుముద్దుగా చూచుకొనునే కాని పల్లెత్తి పరుష వాక్కు పలుకదు; ఇతరులు పలికిన సహింపదు. అట్టి వాత్సల్యముండవలసిన చోట దారుణములైన వాక్కులు పలుకుట కూడదు. ఇచ్చట 'విషము తిన' మొదలయినవి క్రూరార్థములైనందువల్లనే పరుష మన్న దోషముగా పరిణమించినది.

## [ విరసము ]

అప్రస్తుతరసం యత్ స్యాత్ విరసం తన్నిగద్యతే.

యథా —

'తవ వనవాసోఽనుచితః
పితృమరణ శుచం జహీహి కిం తపసా
సఫలయ యౌవన మేతత్
సమ మనుర క్తేన సుతను మయా'[1] 59

అత్ర పితృమరణ సంతప్తాయాః సంభోగప్రవ ర్తన మప్రకృత రసత్వాద్విరసమ్.

అర్థము : అప్రస్తుతరసమును విరసము అని యందురు. ఓ సుందరీ! పితృ మరణ శోకమును విడిచిపెట్టుము. తపస్సువల్ల లాభమేమి? ఈ వనవాసము నీ కుచితము కాదు. సమానురాగము గల నాతో కూడి యీ యౌవనమును సఫలము గావించుకొమ్ము. ఇది ఉదాహరణము.

ఇక్కడ పితృమరణ దుఃఖితయొక్క సంభోగప్రవ ర్తనము అప్రకృతరస త్వము. కావుననే యిది విరసము.

వ్యాఖ్య : కొన్ని రసములు పరస్పరానుకూలములై యుండును; కొన్ని పరస్పర విరుద్ధములై యుండును. అనుకూలరసములైనను, ఒకటి అంగి (ప్రధాన) రసము కాగా తక్కినవి అంగరసము లగును. విరుద్ధ రసముల నొక్కచోట చేర్చుట అనౌచిత్యము. 'అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్। ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్పరా' అని ఆలంకారికోక్తి. అనౌచిత్యము కాక రసభంగకారణము మరొకటి లేదు. ప్రసిద్ధమైన ఔచిత్యబంధమే ప్రకృష్టమైన రసోపనిషత్తు - అని యర్థము. కావున, ఔచిత్యము చెడుట యనగా రసము చెడుట యనియే అర్థము.

ఒక రసమును నిర్వహించుచు నడుమ నింకొక రసమును ప్రవేశపెట్టుట విరస మనిపించుకొనును. ప్రకృత లక్ష్యమునందు ప్రధానరసము కరుణము. నాయ కుడు చేయు శృంగారప్రసంగము తద్విరుద్ధము. విరుద్ధరసముల నొకచోట చెప్పుట చేత ఇది విరసము.

ఉదాహరణ శ్లోకము రుద్రటుని కావ్యాలంకార సంగ్రహము నుండి గ్రహింప బడినది.

[హీనోపమము]

51. హీనం యత్రోపమానం స్యాత్తత్తు హీనోపమం స్మృతమ్.

యథా -

'క్వచిదగ్రే ప్రసరతా క్వచిదాప్లుత్య నిఘ్నతా
శునేవ సారంగకులం త్వయా భిన్నం ద్విషత్కులమ్.' 60

అత్ర శౌర్యశాలినః శునోపమితత్వాద్ధీనోపమ మిదమ్.

అర్థము : ఉపమానము హీనమైనప్పుడు హీనోపమము అని యందురు. ఒకమాటు ముందునకు సాగుచు, ఒకమాటు దుమికి కొట్టుచు కుక్క లేళ్ళసమూహమునువలె నీవు నీ శత్రువుల సమూహమును చెదరగొట్టితివి. ఇది ఉదాహరణము.

ఇచ్చట శౌర్యవంతునకు శ్వానముతో ఔపమ్యము చెప్పుటవల్ల ఇది హీనోపమము.

వ్యాఖ్య : హీనమనగా నీచమని, అప్రశస్తమని యర్థము. ఉపమానము నీచమైనపుడు హీనోపమ మన్న దోషమేర్పడును. సాదృశ్య మున్నంతమాత్రమున నీచజాతికి చెందిన వస్తువు నుపమానముగా గ్రహించినయెడల సౌందర్యము భాసింపదు. 'సౌందర్య మలంకారః' అని యనుటచేత సుందరమైనప్పుడే అలంకారమగును; అట్లుకానిది అలంకారము కాదు.

శౌర్యవంతుడు ఉపమేయము. ముందునకు సాగుట, దుమికి కొట్టుట, చెదరగొట్టుట సమానధర్మములు. వలె ఉపమావాచకము. ఉపమానముగా కుక్క చెప్పబడినది. ఇది హీనము. అందువల్లనే యిది హీనోపమమున కుదాహరణమైనది.

[అధికోపమము]

తదేవ యస్మిన్నధికం తద్భవే దధికోపమమ్.

యథా –

'అయం పద్మాసనాసీన శ్చక్రవాకో విరాజతే
యుగాదౌ భగవాన్ బ్రహ్మా వినిర్మిత్సు రివ ప్రజాః' 61

అత్ర చక్రవాకస్య జగత్స్రష్టా బ్రహ్మణోపమితత్వా దధికోపమ మిదమ్.

**అర్థము** : ఉపమానము అధికమైన యెడల అది అధికోపమ మగును. పద్మాసనము నాసీనమై యున్న యీ చక్రవాకము యుగాదియందు ప్రజలను నిర్మించు కోరికతోనున్న భగవంతుడైన బ్రహ్మవలె విరాజిల్లుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట చక్రవాకమునకు జగత్స్రష్టయైన బ్రహ్మతో ఔపమ్యము చెప్పుటవల్ల ఇది అధికోపమము.

**వ్యాఖ్య** : అధిక మనగా ఉన్నత మని, ప్రశస్తమని యర్థము. పద్మముపై నుండుటయన్న సామాన్యధర్మమునుబట్టి చక్రవాకమును సృష్టికర్తయైన బ్రహ్మతో పోల్చుట సౌందర్యమును కలిగింపదు. కావుననే, యిది అధికోపమ మన్న దోషమైనది.

ఈ శ్లోకము రుద్రటుని గ్రంథమునకు నమిసాధువు రచించిన వృత్తియందలిది.

[ అసదృశోపమము ]

51. య దతుల్యోపమానం తద్వాదంత్య సదృశోపమమ్.

యథా—

'ణమహ హారం రోసాణల ణిద్దద్ధముద్ధ మమ్మహ సరీరమ్
విత్థఅణి అంబణిగ్గఅ గంగాసోత్తం వ హిమవన్తమ్.' 62

[ఛాయా -

నమత హరం రోషానల నిర్దగ్ధ ముగ్ధమన్మథ శరీరమ్
విస్తృత నితంబ నిర్గత గంగాస్రోతస మివ హిమవన్తమ్.]

అత్ర కోపానల నిర్దగ్ధ ముగ్ధ మన్మథ శరీరస్య హారస్య నితంబ నిర్గత స్రోతసా హిమవద్గిరిణా సహాసాదృశ్యా దిద మసదృశోపమమ్.

**అర్థము** : ఉపమానము తుల్యముకాని యెడల దానిని అసదృశోపమ మని యందురు. విస్తృత నితంబ నిర్గత గంగా ప్రవాహుడైన హిమవంతునికి వలె రోషానల నిర్దగ్ధ ముగ్ధ మన్మథ శరీరుడైన హరునికి నమస్కరింపుడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట కోపానల నిర్దగ్ధముగ్ధ మన్మథ శరీరుడైన హరునికి నితంబ నిర్గత ప్రవాహుడైన హిమవద్గిరితోడి అసాదృశ్యమువల్ల ఇది అసదృశోపమము.

**వ్యాఖ్య** : తుల్య మనగా సదృశ మని యర్థము. ఉపమానోపమేయములు సమానధర్మమును కలిగి యున్నప్పుడే ఔపమ్యము చెల్లును. కొన్నియెడల సమాన ధర్మము లేకపోయినను సదృశధర్మమైన నుండవలయును. ఉపమానోపమేయముల యొక్క విశేషణములకు బింబ ప్రతిబింబభావ మున్నయెడల ఆ రెండింటికి సదృశత్వము నంగీకరింప వచ్చును. అట్లు కానప్పుడు అసదృశోపమ మన్న దోషము కలుగును.

ప్రకృత లక్ష్యమునందు శివుడు ఉపమేయము. హిమవంతుడు ఉపమానము. కోమలమైన మన్మథ శరీరమును రోషానలముచేత దహించినవాడు శివుడు. విశాలములైన నేత్రములనుండి గంగాప్రవాహములను వెలువరించువాడు హిమవంతుడు. ఉభయ ధర్మములకును సామ్యము కాని సాదృశ్యము కాని లేదు. కావుననే, యిది అసదృశోపమ మన్న దోషమున కుదాహరణమైనది.

## [ అ ప్ర సి ద్ధో ప మ ము ]

అప్రసిద్ధోపమానం య ద్ప్రసిద్ధోపమం హి తత్.

యథా –

'కుముద మివ ముఖం తస్యా
గౌరివ మహిమః శశీవ కావ్య మిదమ్
శర దివ విభాతి తరుణీ
వికసిత ఫుల్లకోత్కరా సేయమ్'

అత్ర కుముదముఖయో ర్గోమహిషయోః కావ్య శశినోశ్చ ప్రతీయమానే శర త్తరుణ్యోశ్చ విధీయమానే సాదృశ్యే ఉపమానోప మేయ స్యాప్రసిద్ధత్వా దప్రసిద్ధోపమ మిదమ్.

**అర్థము** : ఉపమానము ప్రసిద్ధము కానియెడల దానిని అప్రసిద్ధోపమ మని యందురు. ఆమె ముఖము కలువ వలె నున్నది; ఎద్దు దున్నవలె నున్నది; ఈ కావ్యము చంద్రునివలె నున్నది; ఈ తరుణి వికసితపులకోత్కరయై శర త్తువలె భాసించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట కుముద ముఖములకు, గో మహిషములకు, కావ్యచంద్రులకు సాదృశ్యము ప్రతీయమానము కాగా శరద్యువతులకు సాదృశ్యము విధీయమాన మగుచున్నది. అయినను, ఉపమానోపమేయముల అప్రసిద్ధత్వమువల్ల ఇది అప్రసిద్ధోపమము.

**వ్యాఖ్య** : ప్రసిద్ధ మని యనగా కవుల ప్రయోగములందు ప్రశ స్తిని గాంచినదని యర్థము. కవి సమయములనుబట్టి కూడ కొన్నింటికి ప్రసిద్ధి కలుగ వచ్చును. కవి సమయములనుబట్టి కాని, కవుల ప్రయోగములను బట్టికాని ఆయా యుపమేయములకు ఉపమానములుగా ప్రసిద్ధిని పొందనివి అప్రసిద్ధములు. అటువంటి అప్రసిద్ధముల నుపమానములుగా వాడినచో అప్రసిద్ధోపమ మన్న దోషము కలుగును.

ముఖమును కమలముతో పోల్చుట ప్రసిద్ధము. ఇచ్చట కలువతో పోల్చుట జరిగినది. ఇది అప్రసిద్ధము. ఇట్లే తక్కినవియు.

వేర్వేరు ధర్మములనుబట్టి యిచ్చట ఉపమానోపమేయములకు సాధర్మ్యము కలదు. ముఖమునకును కలువకును సౌకుమార్యమునుబట్టి సాదృశ్యము కలదు. ఎద్దునకును మహిషమునకును బలమునుబట్టి సాదృశ్యము కలదు. కావ్యమునకును చంద్రునకును ఆనందదాయకత్వమునుబట్టి సాదృశ్యము కలదు. ఇచ్చటి సాదృశ్యములు ప్రతీయమానములే కాని వాచ్యములు కాలేదు. సాదృశ్యమున్నప్పటికిని ఉపమానములు కవిప్రయోగారూఢములు కాకపోవుటచేత, ఇది అప్రసిద్ధోపమ మన్న దోష మగుచున్నది.

శరత్తునకును యువతికిని సాధర్మ్యమున్నది. ఆ ధర్మము పూర్వోదాహృతులందువలె ప్రతీయమానము కాక విధీయమానమైనది. వికసించిన మొగ్గలయొక్క

సముదాయము గలది శరత్తు; స్పష్టమైన పులకల యొక్క సముదాయము గలది యువతి. ఇట్లు సాధర్మ్య మింత చక్కగా సరిపడినప్పటికిని కవిప్రయోగారూఢము కాకపోవుటచేత దీనినిగూడ అప్రసిద్ధోపమదోషముగానే పరిగణించుట జరుగుచున్నది.

[ నిరలంకారము ]

53. య దలంకారహీనం తన్నిరలంకార ముచ్యతే.

యథా –

'కోలా ఖణన్తి మోత్థం
గిద్ధా ఖాఅన్తి మఉఅ మంసాఇం
ఉలుఆ హణన్తి కాఏ
కాఆ ఉలుఏ వి వాఅన్తి' 64

[ఛాయా –

కోలాః ఖనన్తి ముస్తాన్
గృధ్రాః ఖాదన్తి మృతకమాంసాని
ఉలూకా ఘ్నన్తి కాకాన్
కాకా ఉలూకా నపి వాయన్తి.]

అత్ర కోలాదేః స్వరూపాద్యనభిధానా జ్జాత్యాద్యలంకారాసంభవే నిరలంకారో నామాయం వాక్యార్థదోషః. సవిశేషణాద్ గోరపత్య మిత్యాదేర్వాక్యదోషాద్ భిద్యతే.

అర్థము : అలంకారహీనమైనది నిరలంకార మనబడును. పందులు ముస్తెలను త్రవ్వుచున్నవి; గ్రద్దలు శవమాంసములను తినుచున్నవి; గుడ్లగూబలు కాకులను చంపుచున్నవి; కాకులు గుడ్లగూబలనుగూడ తినుచున్నవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట పందులు మున్నగువాని యొక్క స్వరూపాదులను వర్ణింపక పోవుటవల్ల జాత్యాద్యలంకారములు సంభవములు కావు. కావుననే, యిది నిరలంకార

మన్న వాక్యార్థ దోషమగుచున్నది. సవిశేషణ మయిన 'గోరపత్యమ్' మొదలయిన వాక్యదోషముతో భేదించుచున్నది.

వ్యాఖ్య : ఉదాహృత పద్యమునందు కోలాదుల చేష్టలున్నవి. 'ద్రవ్య గుణ క్రియాదులను వర్ణించుటచేత జాత్యలంకార మగును; కావున, ఇచ్చట జాత్యలంకారము లేదా?' అన్నచో లేదనియే సమాధానము. అలంకార మేదియైనను కవిప్రతిభామాత్ర ప్రకాశమానము. అట్లు కానిది అలంకారము కాదు. అందువల్ల, ఉదాహరణమునందు జాతియే కాదు; ఇతర యేయలంకారమును లేదు. అందువల్లనే యిది నిరలంకార దోషమున కుదాహరణమైనది.

వాక్యదోషములో [1]అనలంకార మన్న దోషము కలదు. ఇది నిరలంకారము. ఇది అర్థదోషము. విశేషణములు శ్లాఘ్యములు కాకపోవుటచేత అనలంకార మన్న దోషము కలుగును. ఇచ్చట విశేషణముల ప్రసక్తి లేదు. కావున ఇది భిన్నమని రచయితయే గుర్తు చేయుచున్నాడు.

## [ అశ్లీలము ]

అశ్లీల మితి నిర్దిష్ట మశ్లీలార్థ ప్రతీతి కృత్

యథా -

'ఉద్యతస్య పరం హన్తుం స్తబ్ధస్య వివరైషిణః
పతనం జాయతేఽవశ్యం కృచ్ఛ్రేణ పునరున్నతిః' 65

అత్రోద్యతస్య పరం హన్తుమితి సంభోగారంభవిషయా, స్తబ్ధస్య వివరైషిణ ఇతి వరాంగవిషయా, పతనం జాయతేఽవశ్య మితి రేతోవిసర్గ విషయా, కృచ్ఛ్రేణ పునరున్నతి రితి నష్టరాగప్రత్యాన యనవిషయా అశ్లీల వాక్యార్థవిషయా ప్రతీతిర్భవతి.

అర్థము : అశ్లీలార్థమును స్ఫురింపజేయు దానిని అశ్లీల మని యందురు. ఇతరుని చంపుటకు లేచినవానికి, జడుడైనవానికి, లోపములను వెదకువానికి తప్పక పతనము కలుగును; తిరిగి ఉన్నతి కలుగుట కష్టము. ఇది ఉదాహరణము.

1. ఉదాహరణశ్లోకము – 49

ఇచ్చట 'ఉద్యతస్య పరం హన్తుమ్' అన్నప్పుడు సంభోగారంభవిషయ ప్రతీతియు, 'స్తబ్ధస్య వివరైషిణః' అన్నప్పుడు నాయకాంగ విషయప్రతీతియు, 'పతనం జాయతేఽవశ్యమ్' అన్నప్పుడు వీర్యస్ఖలన ప్రతీతియు, 'కృచ్ఛ్రేణ పున రున్నతిః' అన్నప్పుడు పునరుత్థాపన ప్రతీతియు గల్గవు. మొత్తముమీద అశ్లీల వాక్యార్థ విషయప్రతీతివల్ల ఇది అశ్లీలము.

[ విరుద్ధము ]

54. విరుద్ధం నామ తద్యత్ర విరోధ స్త్రివిధో భవేత్
ప్రత్యక్షేణానుమానేన తద్వదాగమవర్త్మనా.

55. యో దేశకాలలోకాది ప్రతీపః కోఽపి దృశ్యతే
తమాహ మనన్తి ప్రత్యక్షవిరోధం శుద్ధబుద్ధయః.

అర్థము : విరోధ మున్నయెడల విరుద్ధ మను దోషముగా పరిగణింతురు. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము—అనువానిచే విరుద్ధము మూడువిధములుగా నగును. దేశము, కాలము, లోకము మొదలయినవానికి విరుద్ధమైనదానిని "ప్రత్యక్ష విరోధము" అని పండితులు పల్కుదురు.

తత్ర దేశవిరోధో యథా —
'సురాష్ట్రేష్వస్తి నగరీ మథురా నామ విశ్రుతా
అక్షోట నారికేరాఢ్యా యదుపాన్తాద్రిభూమయః' 66

అత్ర సురాష్ట్రేషు మథురా నాస్తి తత్పర్యన్తాది భూమిషు చాక్షోట నారికేరాణా మభావాత్. దేశోఽద్రి వనరాష్ట్రాది రిత్యయం దేశకృతః ప్రత్యక్ష విరోధః.

అర్థము : ప్రత్యక్షవిరోధమునందు దేశవిరోధమున కుదాహరణము. సురాష్ట్రమందు మధుర అను ప్రసిద్ధమైన నగరము కలదు. దాని పరిసర పర్వత భూములు అక్షోటములతో నారికేళములతో ప్రసిద్ధములు.

ఇచ్చట సురాష్ట్రదేశమునందు మధుర లేదు. తత్పర్యంత భూములందు అక్షోటములును నారికేళములును లేవు. దేశము అని యనగా పర్వతారణ్య రాష్ట్రాదు లని యర్థము. ఇది దేశకృతమైన ప్రత్యక్షవిరోధము.

కాలవిరోధో యథా —

'పద్మినీ నక్త మున్నిద్రా స్ఫుటత్యహ్ని కుముద్వతీ
మధు రుత్ఫుల్లనిచులో నిదాఘో౽మేఘదుర్దినః' 67

అత్ర పద్మిన్యా నక్తం కుముద్వత్యా అహ్ని మధౌ నిచులానా మున్నిద్రత్వాద్యభావా న్నిదాఘస్య చామేఘదుర్దినత్వాత్. కాలో నక్తం దినర్తవ ఇతి కాలకృతో౽యం ప్రత్యక్షవిరోధః.

**అర్థము** : కాలవిరోధమున కుదాహరణము. పద్మిని రాత్రి వికసించి యున్నది. పగటిపూట కలువ వికసించినది. వసంతమునందు రెల్లు పూచినది. గ్రీష్మము మేఘములు లేకపోయినను వర్షించినది.

ఇచ్చట పద్మము రాత్రివేళ, రెల్లు వసంతమున పూచుటయు, గ్రీష్మము అమేఘదుర్దిన మగుటయు — వీనివల్ల కాలకృతమైన ప్రత్యక్ష విరోధము. కాలము అని యనగా రాత్రి, పగలు, ఋతువు మున్నగునవి.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

లోకవిరోధో యథా —

'ఆధూత కేసరో హస్తీ తీక్ష్ణశృంగ స్తురంగమః
గురుసారో౽య మేరండో నిస్సారః ఖదిరద్రుమః' 68

అత్ర హస్తి హయైరండ ఖదిరాణాం కేసరాది సద్భావస్య ప్రత్యక్షేణానుపలంభాత్. జంగమ స్థావరో లోక ఇతిలోకకృతో౽యం ప్రత్యక్షవిరోధః.

**అర్థము** : లోకవిరోధమున కుదాహరణము. ఏనుగు బాగుగా కదలించిన కేసరములను కలిగియున్నది. గుఱ్ఱము వాడియైన కొమ్ములను కలిగి యున్నది. ఈ యాముదపుచెట్టు చేవదేరి యున్నది. మద్దిచెట్టు నిస్సారమైనది.

ఇచ్చట ఏనుగు, గుఱ్ఱము, ఆముదపుచెట్టు, మద్దిచెట్టు - మున్నగువానికి కేసరములు మొదలగునవి (క్రొమ్ములు, చేవ, నిస్సారత) ఉండుట లోకమునందు ప్రత్యక్షముగా లభ్యము కాదు. అందువల్ల, ఇది లోకకృతమైన ప్రత్యక్ష విరోధము. జంగమములును స్థావరములును లోక మనబడును.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

56. యుక్త్యౌచిత్య ప్రతిజ్ఞాదికృతో యస్త్విహ కశ్చన
అనుమాన విరోధః స కవిముఖ్యై ర్నిగద్యతే.

అర్థము : యుక్తి, ఔచిత్యము, ప్రతిజ్ఞ మున్నగువానికి విరుద్ధమైనదానిని అనుమాన విరోధముగా మహాకవులు పరిగణింతురు.

తత్ర యుక్తి విరుద్ధం యథా –
'సురహిమహుపాణ లంపడ
భమరంగణాబద్ధ మణ్డలీబంధమ్
కస్స మణం ణాణన్దఇ
కుమ్మిపుట్ఠట్ఠిఅం కమలమ్' 69

[ఛాయా –
సురభి మధుపానలంపట భ్రమర గణాబద్ధ మండలీ బంధమ్
కస్య మనో నానందయతి కూర్మపృష్ఠస్థితం కమలమ్.]

అత్ర కూర్మపృష్ఠే కమలోద్గతే రయుక్తియుక్తత్వాద్ యుక్తి విరుద్ధ మిదమ్.

అర్థము : యుక్తివిరుద్ధమున కుదాహరణము. సువాసనలతో కూడిన తేనెను త్రాగుట కాసక్తములైన తుమ్మెదల సమూహముచేత చుట్టుకొనబడి తాబేటి వీపుపై మొలచిన పద్మ మెవని మనస్సునకు ఆనందదాయకము కాకుండును ?

ఇచ్చట తాబేటివీపుపై ని పద్మము మొలచిన దన్న అయుక్తి యుక్తత్వము వల్ల యుక్తి విరుద్ధము.

వ్యాఖ్య : అనుమాన మనగా ఊహ యని యర్థము. యుక్తి యనగా హేతు హేతుమద్భావము. ప్రత్యక్షము కాకపోయినను, హేతుహేతుమద్భావముచేత నొకవిషయమును నిశ్చయింపవచ్చును. అట్లు నిశ్చయించుటకు సహకరించునది యుక్తి.

ప్రకృతోదాహరణమున పద్మము చొట్టును తుమ్మెదలు చేరుటలో అయుక్తి యేమియు లేదు. పద్మము పంకజము; బురదయందు పుట్టవలసిన పద్మము తాబేటి వీపుపైని పుట్టినదనుట తర్కసంగతము కాదు. అటువంటి విశిష్టపద్మమున్నయెడల ఆ విశిష్టతను వెల్లడించుట ఆవశ్యకము. అట్లు వెల్లడింపక పోవుటచేత యుక్తిలేక పోయినది. అందువల్లనే యుక్తివిరుద్ధ మన్న దోషమునకు పాత్రమైనది.

లోకవిరోధమునందు వ్యక్తి విశేషప్రదర్శనము జరిగినది. 'ఈ యాముదపు చెట్టు' మొదలగు నిర్దేశమువల్ల విశిష్టములనే భావించుట స్పష్టము. యుక్తి విరోధమునందు అట్టి విశేష నిర్దేశము లేదు. రెండింటికిని భిన్నత్వ మీ విషయమును బట్టియే.

ఔచిత్యవిరుద్ధం యథా —

'పట్టంసు ఉత్తరిజ్జేణ పామరో పామరీప పరిపుసఇ
అఇగరు అకూరకుంభీభరేణ సేఉల్లిఅం వఅణమ్' 70

[ఛాయా —

పట్టాంశుకోత్తరీయేణ పామర్యాః ప్రోఞ్ఛతి
అతిగురుక కూర కుంభీభరేణ స్వేదార్ద్రితం వదనమ్.]

అత్ర పామరీస్య పట్టాంశుకోత్తరీయాభరణానౌచిత్యా దౌచిత్య విరుద్ధ మిదమ్.

అర్థము : ఔచిత్యవిరుద్ధమున కుదాహరణము. అతిభారము కలిగిన భోజన కుంభమును మోసికొనివచ్చుటచేత చెమట పట్టి తడిసిన పామరీ వదనమును పామరుడు పట్టు కండువాతో తుడుచుచున్నాడు.

ఇక్కడ పామరుడు పట్టాంశుకోత్తరీయమును ధరించి యుండుట యన్న అనౌచిత్యమువల్ల ఔచిత్యవిరుద్ధము.

వ్యాఖ్య : ఏది యెట్లుండవలయునో అది యట్లుండుట ఔచిత్యము; అట్లు కాకుండుట అనౌచిత్యము.

ప్రకృతోదాహరణమునందు పామరునికి పట్టుబట్టలు కట్టబెట్టుట అనౌచిత్యము. 'పామరుడైనను పట్టుకండువా యెప్పుడైనను ధరింపరాదా?' అను ప్రశ్న రావచ్చును. ఇచ్చట పామరవనిత అన్నము మోసికొని వెళ్ళుట అన్న, సందర్భమును బట్టి పామరుడు నిత్యకృత్యములలో నిమగ్నుడై యున్నసమయమే కాని, యిది విశిష్ట సమయము కాదన్నది స్పష్టము. పట్టుబట్ట పామరవేషమున కుచితము కాదు. అందువల్లనే, యిది ఔచిత్యవిరుద్ధ మన్న దోషమున కుదాహరణమైనది.

ప్రతిజ్ఞావిరుద్ధం యథా —
'యావజ్జీవ మహం మౌనీ
బ్రహ్మచారీ చ మే పితా
మాతా చ మమ వంధ్యాసీత్
స్మరాభోఽనుపమో భవాన్' 71

అత్ర స్వయం వక్తురేవ యావజ్జీవ మహం మౌనీత్యాది పదానా ముక్త్యా ప్రతిజ్ఞావిరోధాత్ ప్రతిజ్ఞావిరుద్ధ మిదమ్.

**అర్థము** : ప్రతిజ్ఞా విరుద్ధమున కుదాహరణము. నేను జీవిత మంతయు మౌనిని; నా తండ్రి బ్రహ్మచారి; నా తల్లి వంధ్య; నీవు అనుపమానుడవు స్మరాభుడవు.

ఇచ్చట స్వయముగా వక్తయే 'నేను జీవితమంతయు మౌనిని' మన్నను మాటలను పలుకుటచేత ప్రతిజ్ఞా విరోధము. అందువల్లనే యిది ప్రతిజ్ఞా విరుద్ధము.

వ్యాఖ్య : ప్రతిజ్ఞ యనగా సత్యప్రతిపాదన మని కాని కర్తవ్యదీక్ష యని కాని అర్థము. ఆ ప్రతిజ్ఞకు విరుద్ధమైనది ప్రతిజ్ఞావిరుద్ధము.

వక్తయే 'నేను జీవితమంతయు మౌనిని' అని చెప్పుట ప్రతిజ్ఞావిరుద్ధము. తనది సత్యప్రతిపాదనయే యైనచో తాను మాటలాడుటకే వీలులేదు. మాటలాడిన వాడు మౌని యనిపించుకొనడు. తండ్రి బ్రహ్మచారియైనను, తల్లి గొడ్రాలయినను తనయు డుండుటకే వీలులేదు కావున పై ప్రతిపాదనములు కూడ సత్యములు

క్లైవు. తాను తనయు డగుటచేతనే మీది ప్రతిపాదనలకు విరుద్ధత యేర్పడుచున్నది. అట్లే 'నీవు అనుపమానుడవు' అని చెప్పుచునే తద్విరుద్ధముగా 'మన్మథతుల్యుడవు' అని చెప్పుట ప్రతిజ్ఞాభంగమే యగును. కావుననే, యిది ప్రతిజ్ఞా విరుద్ధమున కుదాహరణ మైనది.

57. ధర్మార్థకామ శాస్త్రాదివిరోధః కోఽపి యో భవేత్
తమాగమవిరోధాఖ్యం దోష మాచక్షతే బుధాః.

**అర్థము** : ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామశాస్త్రము — మున్నగు దేనితో నైనను విరోధము కలిగినయెడల దానిని ఆగమవిరోధ మన్నదోషముగా పండితులు పరిగణింతురు.

తేషు ధర్మశాస్త్రవిరోధో యథా -
'అసా వనుపనీతోఽపి వేదా నధిజగే గురోః
స్వభావశుద్ధస్స్ఫటికో న సంస్కార మపేక్షతే' 72

అత్రానుపనీతస్య వేదాధ్యయనానధికారా ద్ధర్మశాస్త్ర విరోధః.

**అర్థము** : ఆగమవిరోధమునం దొకభాగమైన ధర్మశాస్త్ర విరోధమున కుదాహరణము. ఉపనీతుడు కాకపోయినప్పటికిని గురువువల్ల నీతడు వేదముల నభ్యసించెను. స్వభావశుద్ధమైన స్ఫటికము సంస్కారము నపేక్షింపదు.

ఇచ్చట అనుపనీతునకు వేదాధ్యయనమునం దధికారము లేనందువల్ల ధర్మశాస్త్ర విరోధము.

ఇది దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

అర్థశాస్త్రవిరోధో యథా -
కామోపభోగసాకల్యఫలో రాజ్ఞాం మహీజయః
అహంకారేణ జీయన్తే ద్విషన్తః కిం నయశ్రియా? 73

అత్ర మహీజయస్య ఫలత్వేన కామోపభోగానా మర్థశాస్త్రకారై రననుమతత్వా చ్ఛత్రుజయే చాహంకారస్యా హేతుత్వా దర్థశాస్త్రవిరోధః.

అర్థము : అర్థశాస్త్రవిరోధమున కుదాహరణము. రాజులు భూమిని జయించుట సర్వకామోపభోగముల ననుభవించుటకే. అహంకారముచేతనే శత్రువులు జయింపబడుదురు. ఇంక నీతిసౌభాగ్యముచేత నేమి లాభము ?

ఇచ్చట మహీజయమునకు ఫలముగా కామోపభోగముల నర్థశాస్త్రకారు లను మతింపక పోవుటవల్లను, శత్రువులను జయించుటకు అహంకారము సాధనము కాక పోవుటవల్లను ఇది అర్థశాస్త్రవిరోధము.

ఉదాహరణము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి నుండి గ్రహింప బడినది.

కామశాస్త్రవిరోధో యథా —

'తవోత్తరోష్ఠే బింబోష్ఠి దశనాంకో విరాజతే

పూర్ణసప్తస్వరః సోఽయం భిన్నగ్రామః ప్రవర్తతే' 74

అత్రోత్తరోష్ఠే దశనాంకస్య కామశాస్త్రకారై రననుజ్ఞానాత్ కామశాస్త్రవిరోధః భిన్నగ్రామాణాం చ పూర్ణసప్తస్వరానుపపత్తేః కలావిరోధేఽపి తదంశత్వాత్ కామశాస్త్రవిరోధ ఏవ.

అర్థము : కామశాస్త్ర విరోధమున కుదాహరణము. ఓ బింబోష్ఠీ ! నీ పై పెదవిపై దంతక్షతము ప్రకాశించుచున్నది. ఈ భిన్నగ్రామము పూర్ణముగా సప్త స్వరములను కలిగి ప్రవర్తించుచున్నది

ఇచ్చట పై పెదవిమీద దంతక్షతము చేయుటను కామశాస్త్రకారులు సమ్మతింపక పోవుటవల్ల కామశాస్త్ర విరోధము. భిన్నగ్రామములకు సప్తస్వరములను పూర్ణముగా ఉపపన్నములు కావు. ఇది కళావిరోధము. అయినను తదంశత్వముచేత ఇదియు కామశాస్త్రవిరోధమే.

... వ్యాఖ్యా... కామశాస్త్రమునందు చుంబన దంతక్షతములకు త్యాజ్యములైన అవయవములలో పై పెదవి యొకటి. ఇచ్చట పై పెదవియందు దంతక్షతమును చెప్పుట కామశాస్త్ర విరోధము.

సంగీత శాస్త్రమునందు భిన్నగ్రామములైన రాగములందు సప్తస్వరముల సమవాయము సంపన్నము కాదని యున్నది. భిన్నగ్రామరాగమునందు నాలుగో, అయిదో స్వరములు మేళనము నొందవచ్చును గాని, ఏడును మేళనము నొందుట జరుగదు. ప్రకృతోదాహరణమునందు సప్తస్వరములను సంపూర్ణముగా నున్నట్లు చెప్పుట కళావిరోధము.

కళావిరోధమును వేరుగా పరిగణింపక యిందే చేర్చుటకు గ్రంథకర్తయే కారణము చెప్పెను. కామశాస్త్రమునందే చతుష్షష్టి కళలును అంతర్భవించును. అందు చేతనే కళావిరోధముకూడ కామశాస్త్రవిరోధమే యగుట సంభవించినది.

58. ఏవం పదానాం వాక్యానాం వాక్యార్థానాం చ యః కవిః
దోషాన్ హేయతయా వేత్తి స కావ్యం కర్తు మర్హతి.

అర్థము : ఈ విధముగా పదముల యొక్కయు, వాక్యముల యొక్కయు, వాక్యార్థముల యొక్కయు దోషములను విడిచిపెట్టవలసిన వానినిగా ఎరిగిన కవి కావ్యనిర్మాణమునకు అర్హుడగును.

## గుణవివేచన

59. అలంకృత మపి శ్రవ్యం న కావ్యం గుణవర్జితమ్
గుణయోగ స్తయో ర్ముఖ్యో గుణాలంకార యోగయోః.

అర్థము : అలంకారములచేత నలంకరింపబడినప్పటికిని గుణములు లేని కావ్యము శ్రవ్యము కాదు. గుణయోగము, అలంకారయోగము — అనువానిలో గుణయోగము ముఖ్యము.

60. త్రివిధాశ్చ గుణాః కావ్యే భవన్తి కవిసమ్మతాః
బాహ్యాశ్చాభ్యన్తరాశ్చైవ యే చ వైశేషికా ఇతి.

అర్థము : బాహ్యములు, అభ్యంతరములు, వైశేషికములు—అని మూడు విధములైన గుణములు కవిసమ్మతములై కావ్యమునందు నెలకొనును.

61. బాహ్యాః శబ్దగుణా స్తేషు చాభ్యంత స్తరా స్త్వసంశ్రయాః
వైశేషికా స్తు తే నూనం దోషత్వేఽపి హి యే గుణాః

అర్థము : శబ్దాశ్రయములైనవి బాహ్యగుణములు; అర్థాశ్రయములైనవి అభ్యంతర గుణములు; దోషమున్నప్పటికిని గుణములుగా ప్రవర్తించునవి వైశేషిక గుణములు.

వ్యాఖ్య : కావ్యశోభాకారకములు గుణములనియు, తద్వృద్ధికరము లలంకారము లనియు ఆలంకారిక వచనము. గుణములు రసాశ్రయము లనియు, రీతులు పదాశ్రయము లనియు పూర్వుల కథనము. కొందరు మూడు గుణములనే చెప్పగా, కొందరు పది గుణములను చెప్పిరి. భోజదేవుడు శబ్దాశ్రయములైన గుణములనే యిరువది నాలుగింటిని దెలిపెను. పేర్లును, లక్షణములును కొన్ని పాతవే యైనను ప్రణాళిక యంతయు స్వతంత్రము.

## బాహ్య గుణములు

62. చతుర్వింశతి రాఖ్యాతా స్తేషు యే శబ్దసంశ్రయాః
తే తావ దభిధీయ న్తే నామలక్షణయోగతః.

63. శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి స్తథా కాన్తి రుదారత్వ ముదాత్తతా.

64. ఓజ స్తథాన్యదౌర్జిత్యం ప్రేయా నథ సుశబ్దతా
తద్వత్ సమాధిః సౌక్ష్మ్యం చ గాంభీర్య మథ విస్తరః.

65. సంక్షేపం సమ్మితత్వం చ భావికత్వం గతి స్తథా
రీతి రుక్తి స్తథా ప్రౌఢి రథైషాం లక్ష్యలక్షణే.

అర్థము : అందు శబ్దసంశ్రయములైన బాహ్యగుణములు ఇరువది నాలుగు పరిగణింప బడినవి. ఇప్పుడు వాని నామములును, లక్షణములును చెప్పబడు చున్నవి.

1. శ్లేషము 2. ప్రసాదము 3. సమత 4. మాధుర్యము 5. సౌకుమార్యము 6. అర్థవ్యక్తి 7. కాంతి 8. ఉదారత్వము 9. ఉదాత్తత 10. ఓజస్సు 11. ఔర్జిత్యము 12. ప్రేయస్సు 13. సుశబ్దత 14. సమాధి 15. సూక్ష్మత 16. గాంభీర్యము 17. విస్తరము 18. సంక్షేపము 19. సమ్మితత్వము 20. భావికత్వము 21. గతి 22. రీతి 23. ఉక్తి 24. ప్రౌఢి – ఇంక వీని లక్షణములును లక్ష్యములును చెప్పబడును.

## [ శ్లేషము ]

66. గుణః సుశ్లిష్టపదతా శ్లేష ఇత్యభిధీయతే.

యథా -

'ఉభౌ యది వ్యోమ్ని పృథక్ప్రవాహా
వాకాశ గంగా పయసః పతేతామ్
తదోపమీయేత తమాల నీల
మాముక్త ముక్తాలత మస్య వక్షః' 75

అత్ర భిన్నానా మపి పదానా మేకపదతా ప్రతిభాసహేతుత్వేన సందర్భస్య సుశ్లిష్టత్వా దయం శ్లేషో నామ శబ్దగుణః.

అర్థము : ఒకదానితో నొకటి కలసిన పదములను కలిగియున్న శ్లేషగుణముగా పిలువబడును. ఇది లక్షణము. ఆకాశగంగా జలములు రెండు భిన్నప్రవాహములై ఆకాశమునందు రెండువైపులను పడినట్లయిన, తమాల నీలమై ముత్యాలహారమును ధరించియున్న యీతని వక్షఃస్థలమును పోల్పవచ్చును. ఇది ఉదాహరణము.

ఇచ్చట వేరువేరు పదములే యైనప్పటికిని ఒకే పదమువలె కన్పట్టుటచేతను, రచనకు సుశ్లిష్టత్వము (బిగింపు) కలుగుటచేతను, ఇది శ్లేషము అనెడి శబ్దగుణము.

వ్యాఖ్య : మూలశ్లోకమునందు 'ప్రవాహౌ + ఆకాశ' అని యున్నప్పుడు ఆవాదేశముచేత 'ప్రవాహావాకాశ' యైనది. 'తదా + ఉపమీయేత' గుణసంధి కాగా, 'తదోపమీయేత' అని యైనది. 'నీలమ్ + ఆముక్త' 'లతమ్ + అన్య' అనుచోట్ల సన్నికర్షవల్ల 'నీలమాముక్త' 'లతమన్య' అని సుశ్లిష్టత కలిగినది. ప్రారంభము నందే 'య్యదివ్యోమ్ని' అన్న యన్నప్పుడు 'ది' తరువాతిసంయుక్తాక్షరమువల్ల గురువైనది; అనగా ఊనికనొందినదని యర్థము. ఏపదము కాపదము భిన్నముగా నున్నచో రచనకు (సందర్భమునకు) శిథిలత యేర్పడును. అట్లుకాక ఒక పదము సంధివశమునగాని, ఉచ్చారణవశమునగాని తరువాతి పదముతో సన్నికర్షను పొందినయెడల ఒక ప్రవాహగుణ మేర్పడును. అట్లుండుటయే శ్లేషగుణము. అది రచనకు సౌందర్యమును సమకూర్చును.

ఉదాహరణ శ్లోకము మాఘుని శిశుపాలవధము నందలిది.

## [ ప్ర సా ద ము ]

ప్రసిద్ధార్థపదత్వం యత్స ప్రసాదో నిగద్యతే.

యథా —

'గాహన్తాం మహిషా నిపానసలిలం శృంగై ర్ముహుస్తాడితం
ఛాయాబద్ధకదంబకం మృగకులం రోమంథ మభ్యస్య తు
విశ్రబ్ధైః క్రియతాం వరాహపతిభి ర్ముస్తాక్షతిః పల్వలే
విశ్రామం లభతా మిదం చ శిథిలజ్యాబన్ధ మస్మద్ధనుః.' 76

అత్ర 'గాహన్తాం మహిషా నిపానసలిలమ్' ఇత్యాది ప్రసిద్ధార పదోపాదానాత్ ప్రసాదః.

అర్థము : ప్రసిద్ధములైన అర్థములను గల పదములను కలిగియున్న ప్రసాదగుణముగా పిలువబడును. ఇది లక్షణము. త్రాగెడినీటిని కొమ్ములతో మాటిమాటికి కొట్టుచు మహిషములు కలచివేయునుగాక! కడిమిచెట్ల నీడలందు లేళ్ళ సమూహము నెమరువేయుట నలవరించుకొనునుగాక! కుంటయందలి ముస్తెలను వరాహ

ప్రతువులు ధైర్యముతో నాటనము చేయుదుగాక? సడలిన నారిని గల యీ మావిల్లు విశ్రాంతిని పొందుదుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట 'గాహంతాం మహిషా నిపానసలిలం' మొదలగునవి ప్రసిద్ధార్థములను గల పదములను వాడుటచేత ప్రసాదము.

వ్యాఖ్య :- ఇచ్చట అర్థమనగా విషయమని భావము. ప్రసిద్ధవిషయములను తెలుపు పదములను గలది ప్రసాదగుణము. విషయము ప్రసిద్ధమై యుండుట, పదములు యుదితి భావస్ఫోరకములై యుండుట యిచ్చట అపేక్షితములు.

ప్రకృతోదాహరణమునందు మహిష హరిణ వరాహముల స్వభావములు సుందరముగా వర్ణితములైనవి. భయసమయమునందు మహిషాదులు ప్రాణ రక్షణ పరాయణములై యుండుట స్వాభావికము. వేటకు వెళ్ళిన రాజు తన వింటికి విశ్రాంతి నిచ్చుటచేత భయము తొలగినది. ఇట్టియెడల మహిషములు నీటిని కలచివేయును; హరిణములు చెట్లనీడలలో నెమరువేయును; వరాహములు ముస్తలను కబళించును. ఇవి వీని సహజచర్యలు; ప్రసిద్ధములు.

రాజు తన్నుద్దేశించి తాను 'అస్మద్ధనుః' అని బహువచనమ్మును వాడుకొనుట కూడ స్వభావసుందరముగానే యున్నది. ఇతరులు గౌరవవాచకమును వాడవలయు నని అపేక్షించుటయే కాక, తమ్ము తాము గౌరవవాచకములతో తెలుపుకొనుట అభి జాతుల లక్షణము. అదికూడ ఇచ్చట ద్యోతితమగుచున్నది. రాజు విల్లు విశ్రాంతిని గొనునంతవరకే ఆయా మృగముల కాధైర్యము. రాజు మరల నారిని బిగించి వింటి నెత్తిపట్టి వేట కుద్యుక్తుడెనచో ఆయా మృగముల కాధైర్యము నిలువదు. ఇవి చెల్లాచెదరగుటయో, ప్రాణార్పణము గావించుటయో తప్పదు. దీనివల్ల రాజు పరా క్రమ శౌర్యాదులుకూడ ద్యోతితములగుచున్నది. ఇట్లు ప్రసిద్ధార్థములు సద్యఃస్ఫురితము లగుటచేతనే యిది ప్రసాద గుణమున కుదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలము నందలిది.

[ సమత ]

67. బంధవైషమ్యరహితా ప్రస్ఫుటోన్మిశ్ర వర్ణ బంధవిధిం ప్రతి
అవైషమ్యేణ భణనం సమతా సాభిధీయతే.
యథా -

'యచ్చంద్ర కోటి కర కోరక భార భాజి
బభ్రామ బభ్రుణి జటాపటలే హరస్య
తద్వః పునాతు హిమశైల శిలా నికుంజ
ఝాంకార డంబర విరావి సురాపగాంభః' 77

అత్రోపక్రమా దాసమాప్తి స్ఫుటబంధస్య నిర్వాహాత్ సమత్వమ్.

అర్థము : మృదువులు, ప్రస్ఫుటములు, ఉన్మిశ్రములు అయిన వర్ణముల బంధవిధికి వైషమ్యము కలుగకుండునట్లు చెప్పుట సమత యనబడును. ఇది లక్షణము. చంద్రకిరణము లను మొగ్గలభారమును వహించిన జేగురురంగు గల హరజటా సమూహమునందు సంచరించియున్న ఆ మందాకినీ నదీజలము హిమవత్పర్వత శిలా నికుంజములలో ఝూంకార డంబరములతో ధ్వనిచేయుచు మిమ్ములను కాపాడునుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట ఉపక్రమము నుండి సమాప్తి పర్యంతము స్ఫుటబంధము నిర్వహింప బడుటచేత సమతాగుణ మున్నది.

వ్యాఖ్య : వర్ణములు మృదువులు, ప్రస్ఫుటములు, ఉన్మిశ్రములు — అని మూడు విధములుగా విభక్తములు. హ్రస్వస్వరములును, అనునాసికములును దంత్యములును మృదువర్ణములు. దీర్ఘస్వరములును, ట ఠ డ ఢ ర శ ష హ వర్ణములును, అదంత్య సంయుక్తములును ప్రస్ఫుటములు. మిగిలిన హల్లులును, దంత్యసంయుక్తములను ఉన్మిశ్రములు.

మొదటినుండి చివరవరకు మృదువులనే వాడిన సమత యగును. అట్లే ప్రస్ఫుట వర్ణములను మాత్రమే వాడినను సమత యగును. ఉన్మిశ్రములను వాడినను సమత నిర్వహింపబడినట్లే యగును. అట్లు కాక మృదువర్ణములతో మొదలు పెట్టి నడుమ ప్రస్ఫుటములను గాని, ఉన్మిశ్రములను గాని కలిపిన యెడల సమత భగ్నమగును. అప్పు డది విషమమనెడి దోషముగా పరిణమించును.

ఇచ్చట 'అవైషమ్యేణ భణనమ్' అన్నది గమనార్హము. పై వర్ణము లొక ధ్వనితో నొకటి కలిసినను సాముదాయికమైన రీతికి విరుద్ధము కాక పోయినచో

దోషము కాదనియే తాత్పర్యము. ప్రకృతోదాహరణమునందు దీర్ఘాక్షరములును సంయుక్తాక్షరములును ఆదినుండి అంతమువరకు ఒకే పద్ధతిలో పంపకము నొంది యున్నవి. అందుచేతనే దీనిని సమత యనెడి శబ్దగుణముగా గ్రహించుట జరిగినది.

[ మా ధు ర్య ము ]

68. యా పృథక్పదతా వాక్యే తన్మాధుర్య మితి స్మృతమ్.

యథా -

'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః' 78

అత్ర పదేషు సంహితాభావాత్ పృథక్పదత్వేన మాధుర్యమ్.

అర్థము : వాక్యమునందలి పదములు విడివిడిగా నున్నయెడల, అది మాధుర్యగుణ మనబడును. ఇది లక్షణము. తొలకరి నీటిబిందువులు క్షణముసేపు ఆమె కనురెప్పలపై నిలిచి, అధరములను తాడనము చేసి, పయోధరముల యౌన్నత్యమునుండి పడుటచేత చూర్ణితములై, ఆమె వళులలోనికి జారి, చాల సేపటికి నాభిని చేరుకొన్నవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట పదములయందు సంహితలేకపోవుటచేత పృథక్పదత్వము; అందు వల్ల మాధుర్యగుణము.

వ్యాఖ్య: పృథక్పదత్వ మనగా పదములు విడివిడిగా నుండుటయని భావము. ఏ పదమున కాపదమే విడిగా నుండుట యపేక్షితము. సంధివశమున గాని, ఉచ్చారణవశమునగాని మీది పదముతో కలియకుండుటచేత మాధుర్యగుణము కలుగును.

ఉదాహృత శ్లోకమునందు ద్వితీయ పాదమంతయు నొకటే సమాసము. అట్లే ప్రథమపాదము చివరను చతుర్థపాదము చివర చిన్నసమాసము లున్నవి. తక్కిన అన్నియెడలను పదములు విడివిడిగా నుండి అర్థానుగుణముగా నున్నవి, 'అవృత్తి

ర్మధ్యవృత్తిర్వా మాధుర్యే ఘటనా తథా' అన్న ఆలంకారిక వచనము నిచ్చట అను సంధించుకొనుట యవసరము. అసమాసముగా కాని, పరిమిత సమాసముగా కాని యున్నప్పటికిని ఆ రచన మాధుర్యమున కొప్పి యుండును. అల్ప సమాసము లుండుట అభ్యంతరము కా దనుకొన్నప్పుడు మాత్రమే పై శ్లోకము ఉదాహరణముగా తగియుండును. కావున భోజదేవున కల్పసమాసము లుండుట అంగీకారమే యనదగును.

పూర్వపదమునందలి తుదివర్ణము పరపదమునందలి తొలి వర్ణముతో సంహిత నొందుట యిచ్చట నెంతమాత్రమును తగదు. ఉదాహృత శ్లోకమునందు అట్టి స్థల మొక్కటియు లేదు. కావుననే యిది మాధుర్యగుణమున కుదాహరణమైనది.

ఉదాహృత శ్లోకము కాళిదాసుని కుమార సంభవము నందలిది.

## [ సౌ కు మా ర్య ము ]

అనిష్ఠురాక్షరప్రాయం సౌకుమార్య మితి స్మృతమ్.

యథా —

'మణ్డలీకృత్య బర్హాణి కంఠై ర్మధురగీతిభిః
కలాపినః ప్రనృత్యన్తి కాలే జీమూతమాలిని' 79

అత్ర సర్వకోమలత్వేఽసతి శ్లేషవిపర్యయదోష శైథిల్యాభావాద్ బాహుల్యా ద్వర్ణానా మనైష్ఠుర్యాత్ సౌకుమార్యమ్.

అర్థము : నిష్ఠురములు అనగా కఠోరము లని యర్థము; శ్రుతికటువు లని భావము. నిష్ఠురాక్షరములు లేనిది అనిష్ఠురాక్షరము; తత్ప్రాయమైనది సుకుమారత. ఇది లక్షణము. మేఘమాలలు గల కాలమునందు పింఛములను గుండ్రముగా చేసి, మధురగీతులుగల కంఠములతో నెమళ్లు నృత్యము చేయుచున్నవి. ఇది ఉదాహరణము.

ఇక్కడ సర్వకోమలత్వము లేకపోయినప్పటికిని శ్లేషవిపర్యయదోషమైన శైథిల్యము లేకపోవుటవల్లను అనిష్ఠురములైన వర్ణముల యాధిక్యమువల్లను సౌకుమార్య మగును.

వ్యాఖ్య : మృదువర్ణములకే కోమల వర్ణములు, లలితవర్ణములు అని నామాంతరములు. తద్భిన్నములు పరుషవర్ణములు. వీనికి కఠోరవర్ణములు, నిష్ఠుర వర్ణములు అని నామాంతరములు.

లక్షణ వచనమునందు 'అనిష్ఠురాక్షరప్రాయ'మని యున్నది. 'నిష్ఠురాక్షరము కానిది' అని యనగా 'కోమలాక్షరము' అనియే తాత్పర్యము. లోకవ్యవహారము నందును కోమలత్వమునకే సుకుమారత్వ మన్నది నామాంతరము. కావున కోమలా క్షర ప్రాయమైన రచనయందు సౌకుమార్య మన్న గుణముండు నని యర్థము. 'ప్రాయ' మని యనుటచేత నూటికి నూరుపాళ్లను కోమలాక్షరములే యుండవలెనని యావశ్యకతకు సడలింపుకానవచ్చును. కొలదిగా నిష్ఠురవర్ణము లున్నప్పటికిని కోమల వర్ణాధిక్యమువల్ల గుణము సౌకుమార్యమే యగును.

ఉదాహృత శ్లోకమునందు 'ణ్డ, త్య, ర్వా, ర్మ, ప్ర, త్య' అను సంయుక్తా క్షరము లున్నవి. దీర్ఘవర్ణములును బహుళముగానే యున్నవి. అందువల్ల రచన సర్వ కోమలముగా నున్న దనుటకు వీలులేదు. అంతేకాక యీ వర్ణములవలనే రచన శైథిల్యము పాలుగాక సౌష్ఠవమును కలిగియున్నది. అట్లు కానియెడల శ్లేషవిపర్యయ మైన శైథిల్యదోషము సంక్రమించెడిది. నిష్ఠురవర్ణములు కొలదిగా నున్నను, మొత్తము రచన శైథిల్యము లేక శ్రుతికటుత్వము లేక యుండుటచేత ఇచ్చట సౌకుమార్య మను గుణమున్నది.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ అర్థవ్యక్తి ]

69. యత్ర సంపూర్ణ వాక్యత్వ మర్థవ్యక్తిం వదన్తి తామ్.

యథా –

'వాగర్థా విన సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ' 80

అత్ర వాక్యపరిపూర్ణత యార్థసమర్పకత్వా దర్థవ్యక్తిః.

అర్థము : సంపూర్ణ వాక్యత్వ మున్నయెడల దానిని అర్థవ్యక్తి యని యందురు. ఇది లక్షణము. శబ్దార్థలాభము కొరకు శబ్దార్థములవలె కలిసియున్న జగ త్పితరులైన పార్వతీపరమేశ్వరులకు నమస్కరించుచున్నాను. ఇది ఉదాహరణము.

ఇక్కడ వాక్యపరిపూర్ణత్వముచేత అర్థసమర్పకత్వమువల్ల అర్థవ్యక్తి.

వ్యాఖ్య : సంపూర్ణ వాక్యమై యుండి అపేక్షితమైన యర్థమును సమగ్రముగా వ్యక్తము చేయునెడల, అది అర్థవ్యక్తి యన్న శబ్దాశ్రయగుణ మగునని భావము.

ప్రకృతోదాహరణమునందు 'నమస్కరించుచున్నాను' అన్నది క్రియాపదము. ఉత్తమ పురుషైకవచనములో నుండుటచే 'నేను' అన్నది కర్త యని స్పష్టమగుచున్నది. 'ఎవరికి?' అను ప్రశ్నకు సమాధానము 'పార్వతీపరమేశ్వరులకు' అని. 'ఎటువంటి పార్వతీపరమేశ్వరులు?' అను ప్రశ్నకు 'జగత్పితరులు' అన్నది సమాధానము. 'మాతా చ పితా చ పితరౌ' అని ఏకదేశవృత్తి. ఒకే శబ్దముచేత ఉభయ బోధ జరుగుచున్నది. 'ఇంక నెటువంటివారు?' అని ప్రశ్నింపగా 'శబ్దార్థములవలె కలిసియున్నవారు' అని సమాధానము. ఇచ్చట కవికుల గురువు 'వాగర్థౌ' అని 'వాక్' శబ్దమును ప్రయోగించెను. ఇది స్త్రీలింగ శబ్దము. 'అర్థః' పుంలింగశబ్దము. వాగర్థములు అవినాభావ సంబంబంధము గలవి. అనగా ఒకదానిని విడిచి ఒకటి యుండవని యర్థము. 'పార్వతీ పరమేశ్వరులు' కూడ ఇట్లే అవినాభావసంబంధము గలవా రన్నది వ్యంగ్యము. 'ఎందులకు?' అను ప్రశ్నకు 'వాగర్థలాభముకొరకు' అని సమాధానము. వాగర్థసాదృశ్యముండుటచేత వాగర్థదాన సమర్థకత్వము వ్యంజిత మగుచున్నది. కర్తృ క్రియా కర్మ సమగ్రత్వముండుట మాత్రమే కాక అపేక్షితమైన అర్థసర్వస్వమును వ్యక్తము చేయుచుండుటచేత, ఇది అర్థవ్యక్తికి ఉదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము కాళిదాసుని రఘువంశము నందలిది.

## [ కాంతి ]

యదుజ్జ్వలత్వం బన్ధస్య కావ్యే సా కాన్తి రుచ్యతే.

యథా -

'నిరానన్దః కౌన్దే మధుని విధురో బాలవకులే
న సాలే సాలంబో లవమపి లవంగే న రమతే
ప్రియంగౌ నాసంగం రచయతి న చూతే విచరతి
స్మరంల్లక్ష్మీలీలాకమలే మధుపానం మధుకరః'　　81

అత్ర బంధస్య ఛాయావత్త్వేనౌజ్జ్వల్యం తదేవ చ కాన్తి రుచ్యతే.

అర్థము : కావ్యమునందలి రచనాబంధముయొక్క ఉజ్జ్వలత్వమునకు 'కాంతి' యని పేరు. ఇది లక్షణము. మధుకరము లక్ష్మీలీలాకమల మధుపానమును స్మరించు చున్నది వసంతకాలమునందు కుందమునందు నిరానందమయ్యెను; బాలవకుళము నందు విధురమయ్యెను; సాలమునందు ఆలంబము కొంచదయ్యెను; లవంగమునందు లిప్తమైనను రక్షింపదయ్యెను; ప్రియంగువునందు ఆసంగమును రచింపదయ్యెను; చూతమునందు పంచరింపదయ్యెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట బంధముయొక్క ఛాయావత్త్వము ఔజ్జ్వల్యము. అదియే కాంతి యనబడును.

వ్యాఖ్య : ఉజ్జ్వలత్వమును కలిగియుండుటయే కాంతికి లక్షణము. ఉజ్జ్వలత్వమునకు వివరణ మిదమిత్థముగా లేదు. శబ్దప్రయోగములోని నూతనత్వముచేతను, సాజాత్యముగల వర్ణముల సమీపావృత్తి చేతను రచన కుజ్జ్వలత్వము కలుగును.

ప్రకృతోదాహరణమునందు 'కుందే' అని యనుటకు బదులుగా 'కౌందే' యని, 'అనిష్టః' మున్నగువిధముగా అనుటకు బదులుగా 'విధురః' అని చెప్పుట రచనాగత నూతనత్వమునకు నిదర్శనములు. ఇట్లే తక్కిన చోట్లను. ప్రహతము లైన పదములను గాక అభినవములైన పదములను వాడుట యిచ్చటి లక్షణము.

నంద, కౌంద; మధు, విధు; సాల, సాలమ్బ; లవ, లవంగ; ప్రియంగు, వాసంగం — మున్నగువిధముగా నున్న వర్ణావృత్తి ఛాయారూపమున నుజ్జ్వలతను కలిగించుట యిచ్చటి లక్షణము.

అప్రహతపదప్రయోగము, సజాతీయవర్ణావృత్తి — యీరెండును నొక్క చోట నుండినయెడల రచన కుజ్జ్వలత్వము చేకూరును. అదియే కాంతి.

ఉదాహరణము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి నుండి గ్రహింప బడినది.

## [ ఔదార్యము ]

70. వికటాక్షర బన్ధత్వ మార్యై రౌదార్య ముచ్యతే.

యథా —

'ఆరోహత్యవనీరుహం ప్రవిశతి శ్వభ్రం నగైః స్పర్ధతే
స్వం వ్యాలేఢి విచేష్టతే క్షితితలే కుంజోదరే లీయతే
అన్తర్భ్రామ్యతి కోటరస్య విలసత్యాలంబతే వీరుధః
కిం తద్యన్న కరోతి మారుతవశం యాతః కృశానుర్వనే. 82

అత్ర వికటాక్షరబన్ధత్వే నృత్యద్భిరివ పదై ర్యాద్వాక్యరచనా సా ఉదారతా.

**అర్థము** : వికటాక్షరములబంధము నార్యులు ఔదార్యమని పేర్కొందురు. ఇది లక్షణము. వృక్షము నెక్కుచున్నది; లోయలో ప్రవేశించుచున్నది; పర్వతములతో పోటీ పడుచున్నది; తన్ను తాను నాకుకొని భూమిపైని చైతన్యము తప్పి పడుచున్నది; పొదలో లీనమగుచున్నది; తొఱ్ఱలో చేరి సుడి తిరుగుచున్నది; లతల నాలంబనము చేసికొనుచున్నది; అరణ్యమునందు మారుతవశమైన అగ్ని చేయని దేముండును? ఇది ఉదాహరణము.

ఇచ్చట వికటాక్షర బంధత్వమునందలి నర్తించుచున్నట్లుగా నున్న పదముల తోడి వాక్యరచనయే ఉదారత యగును.

**వ్యాఖ్య** : వికటాక్షరము లనగా విశాలములైన యక్షరము లని యర్థము. విశాలముగా నుండుటయే ఉదారముగా నుండుట. వికటములని యనగా వంకర టింకరయైనవన్న యర్థముకూడ నున్నది. ఈ రెండు లక్షణములు నిచ్చట నావశ్యకములే. అక్షరములు కొన్ని ఔన్నత్యమును సూచించును; కొన్ని నిమ్నత్వమును సూచించును; కొన్ని మధ్యస్థములై యుండును. హ్రస్వముల కంటె దీర్ఘములు ఆయాస్థితులను స్పష్టతరముగా సూచించును. ఇఈలు నిమ్న స్వరములు; ఎఏఐఒఓఔలు ఉన్నతస్వరములు; అఆఉఊలు మధ్యస్థములు. ఈ స్వరములను అర్థానుకూలముగా మేళనము చేయుటచేత వికటబంధ మేర్పడును. దీర్ఘముల నధికముగా నుపయోగించుటచేత ఔన్నత్య నిమ్నత్వాదులు స్పష్టములై విశాలములై కానవచ్చును.

ఉదాహృత పద్యమునందు 'ఆరోహత్యవనీరుహమ్' అనుచోట 'ఆ' మధ్యమస్థితిని 'రో' ఔన్నత్యమును 'హ' మధ్యమస్థితిని 'త్య' నిమ్నస్థితికి (పడుచుండగా నడుమనే పట్టియుంచిన స్థితిని) — ఈ విధముగా వేర్వేరు స్థితులను అక్షర నివేశనము

చేతనే ప్రదర్శించుట జరుగుచున్నది. ఈ విభిన్నస్థితులను సూచించెడి యక్షరములే వికటాక్షరములు. వికటాక్షరముల కూర్పు కలిగిన పదముల గమనము నర్తనము చేయుచున్నట్లుగా నుండును. సాధారణమైన పదచాలనము సమగతిలో నుండును. నాట్యమునందు కొన్నియెడల పాదప్రసారము, కొన్నియెడల పాదకుంచనము, కొన్నియెడల శీఘ్రగతి, కొన్నియెడల మందగతి - యీ విధముగా భిన్నత్వ ముండును. రచనయందును భిన్నస్థితులను దెల్పు పదము లిట్లు ప్రయుక్తములై ఆరోహణావరోహణములను, ఆకుంచన ప్రసారములను అనుకరించినయెడల దానిని ఔదార్యమని యందురు. ప్రకృతోదాహరణమునందు అగ్నిప్రసారమునందలి ఆయా భిన్నభిన్నస్థితులు చివరంట స్పష్టముగా నిరూపితము లగుచున్నవి. కావుననే, యిది ఉదారత కుదాహరణమైనది.

[ ఉ దా త్త త ]

శ్లాఘ్యై ర్విశేషణై ర్యోగో యస్తు సా స్యాదుదాత్తతా.

యథా —

'శ్రుత్వాయం సహసాగతం నిజపురా త్త్రాసేన నిర్గచ్ఛతాం
శత్రూణా మవరోధనై ర్గలలవ ప్రస్యన్ద తిమ్యానత్స్వటాః
శుభ్రే సద్మని పల్లవిన్యుపవనే వాప్యాం నవాంభోరుహి
క్రీడాద్రా చ సశాద్వలే వివలితగ్రీవై ర్వ్యముక్తా దృశః' 83

అత్ర శుభ్రే పల్లవిని నవాంభోరుహీత్యాది శ్లాఘ్యవిశేషణోపాదానా దుదాత్తతా.

అర్థము : శ్లాఘ్యములైన విశేషణములతో కూడియున్నయెడల, అది ఉదాత్తత యగును. ఇది లక్షణము. ఈత డాకస్మికముగా వచ్చుట విని, భయముతో నిజపురములను విడిచిపెట్టు విరోధుల యంతఃపురకాంతలు శుభ్రమైన సదనమునందును, చిగురించిన యుపవనమునందును, నవాంభోరుహములతోడి దిగుడుబావియందును, శాద్వలములతోడి క్రీడాపర్వతమునందును వెనుదిరిగిన మెడలతో అశ్రుజల లవము కారుచున్నట్లు చెమ్మగొన్న చూపులను మరలించుకొనిరి. ఇది ఉదాహరణము.

ఇచ్చట శుభ్రమైన, చిగురించిన, నవాంభోరుహముల తోడి — మొదలయిన శ్లాఘ్యములయిన విశేషణముల యుపయోగముచేత, ఇది ఉదాత్తత.

వ్యాఖ్య : ఉత్కర్షను కలిగి యుండుటయే ఉదాత్తత. ఉదాత్తతయే శ్లాఘ్యత. లోకవ్యవహారమునందు సైతము ఉదాత్తత కలవానికే శ్లాఘ్యత లభించును. ఇచ్చట శ్లాఘ్యములైన విశేషణముల కూడికచేత విశేష్యములు విశిష్టములై రాణించుటచేత ఉదాత్తత కలుగుచున్నది. విశేష్యములయొక్క విశేషమును తెలుపునవియే విశేషణములు; అవి శ్లాఘ్యములుకూడ నయినచో విశేష్యముల కెంతో యుత్కర్ష లభించును. అదియే యుదాత్తత.

ప్రకృత పద్యమునందు శత్రుపురముల సౌందర్యము వర్ణితమైనది. ఒకరాజు దండెత్తుకొని వెళ్ళి, ఆకస్మికముగా ఆ పురముల నాక్రమించు కొనెను. ఆ వార్త వినుటతోడనే తత్పురవాసులు ప్రాణరక్షణకై కకావికలుగా పారిపోయిరి. రాజులును పారిపోవుచున్నారు. అంతఃపురస్త్రీలును పారిపోవుట తప్పదు. వారి కన్నులు చెమ్మగిల్లినవి; పారిపోవుటకు సన్నద్ధలయిరి. కాని తలలను వెనుకకు త్రిప్పి యింకను చూచుచున్నారు. ఇట్టి ప్రాణాపాయదశలో కూడ వారినింతగా ఆకర్షించుచున్నవి — అచ్చటి భవనము, ఉపవనము, దిగుడుబావి, క్రీడాపర్వతము. అంతటి ఆకర్షణ కలిగించుటకు అవి సవిశేషము లగుటయే కారణము. అదియేదో విధమైన హర్మ్యము కాదు; శుభ్రమైన హర్మ్యము. అచ్చటిది చిగురించియున్న ఉపవనము; నవాంభోరుహములతోడి దిగుడుబావి; పచ్చగడ్డి పరుచుకొనియున్న క్రీడాపర్వతము. విశేషణముల యోగముచేత వీని లోభనీయత అమేయ మగుచున్నది. అందువల్లనే ప్రాణాపాయస్థితిలో సైతము శత్రురాజకాంతలు విడువలేక విడిచిరనుట. ఇట్టి శ్లాఘ్యవిశేషణము లుండుటచేతనే యీ శ్లోకము ఉదాత్తత కుదాహరణమైనది.

[ ఓజస్సు ]

71. ఓజః సమాసభూయస్త్వమ్.

యథా —

'జయతి భుజగరజ్జుగ్రన్థి నిష్పీడితేన్దు
ప్రసవ దమృత నివృత్తప్రేమభావైః కపాలైః
విరచిత నుతిబన్ధో మూర్ధ్ని సద్యః పురారేః
పరిణత బహుకల్ప బ్రహ్మణాం బ్రహ్మఘోషః' 84

అత్ర భుజగరజ్జు గ్రంథీత్యాదినా సమాసభూయస్త్వా దోజః.

**అర్థము :** సమాసబహుళముగా నుండుట ఓజోగుణము. ఇది లక్షణము. భుజగ రజ్జువుల ముడి బిగియుటవలన నొత్తుకొనబడిన చంద్రునినుండి స్రవించిన అమృతముచేత పొందిన ప్రేమభావముగల అనేక కల్ప పరిణతములైన బ్రహ్మల కపాలములు వెనువెంటనే ఈశ్వరునికై రచించిన స్తోత్రరూపమయిన బ్రహ్మ ఘోషము వర్ధిల్లునుగాక। ఇది ఉదాహరణము.

ఇచ్చట భుజగరజ్జుగ్రంథి మొదలయిన సమాసాధిక్యమువల్ల ఓజస్సు.

**వ్యాఖ్య :** ఇందు 'భుజగరజ్జుగ్రంథి నిష్పీడితేందు స్రవ దమృత నివృత్త ప్రేమభావైః' 'విరచిత నుతి బన్ధః' 'పరిణత బహుకల్పబ్రహ్మణామ్' 'బ్రహ్మ ఘోషః' అను సమాసములు గలవు. సమాసాధిక్యమే ఓజోగుణ లక్షణము.

ఇచ్చట మొదటి సుదీర్ఘసమాసము లోకోత్తరమైన పరమచమత్కారితను, పరమేశ్వర మహిమోదాత్తతను వ్యక్తము చేయుటకు సమర్థమైయున్నది. భావసౌష్ఠవమును ప్రతిపాదింపగల సమాసములకూర్పు ప్రకృతపద్యమున నున్నది. అందువల్లనే ఓజోగుణమున కిది ఉదాహరణమైనది.

## [ ఔర్జిత్యము ]

ఔర్జిత్యం గాఢబన్ధతా.

యథా -

'అస్మిన్నీషద్వలిత వితతస్తోక విచ్ఛిన్నభుగ్నః
కించిల్లీలోపచిత వితతః పుంజితశ్చోచ్ఛ్రితశ్చ
ధూమోత్పీడ స్తరుణ మహిషస్కన్ధనీలో దవాగ్నేః
స్వైరం సర్పన్ సృజతి గగనే గత్వరాన్ నభ్రభంగాన్.' 85

అత్ర గాఢ బన్ధస్య స్పష్టమేవ ప్రతిభానా దౌర్జిత్యమ్.

**అర్థము :** గాఢబంధము కలిగి యుండుటకే ఔర్జిత్య మనిపేరు. ఇది లక్షణము. దావాగ్ని ధూమము కొంచెముగా ముడి తిరిగి, విస్తరించుకొని, కొంచె

ముగా చెదరి, చుట్టచుట్టుకొని కొంచెము విలాసమును సంతరించుకొని వ్యాపించి గుమిగూడి, పైకిలేచి కారెనుబోతు మూపువలె నల్లనై, స్వచ్ఛందముగ సంచరించుచు ఆకాశమునందు కదలుచిన్న మేఘశకలములను సృజించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట గాఢబంధము స్పష్టముగానే కనిపించుచుండుటవల్ల ఔర్జిత్యము.

వ్యాఖ్య : ఊర్జితత్వ మనగా శక్తిశాలిత్వమని యర్థము. రచనయందు శబ్దసంబంధమైన శక్తియుండుటయే ఔర్జిత్యము. అది గాఢబంధమువల్లనే సంక్రమించును.

ప్రకృతోదాహరణమునందు 'అస్మిన్నీషద్, ఈషద్వలితస్తోక, విచ్ఛిన్న, భుగ్నః, కించిల్లీలా' – మొదలయినచోట్ల నున్న వ్యాకరణ కార్యములవల్ల ఉచ్చారణమునకు ఒక ద్రఢిమ యేర్పడుచున్నది. శ్లేషగుణమునందు స్వరసంధులవల్ల ఒక ధారాళత యేర్పడును. ఇచ్చట ఆవిధమైన ధారాళతకు స్థానము లేదు. కావుననే ఔర్జిత్యము దానికి భిన్నము. ఔర్జిత్యమునందు విసర్గ సంధులవల్లను సంయుక్తాక్షరములవల్లను ఒత్తి పలుకవలసిన యవసరము కలుగును. అదియే దార్ఢ్యమును కలిగించును. ఉదాహృతపద్యమునందలి నాలుగు పాదములందును పైని చెప్పిన వర్ణము లుండి గాఢబంధముండుటచేత, ఇది ఔర్జిత్యమునకు లక్ష్యమైనది.

## [ ప్రేయస్సు ]

ప్రేయః ప్రియతరాఖ్యానం చాటూక్తౌ యద్విధీయతే.

యథా –

'సౌజన్యాంబునిధే బుధప్రియ గుణప్రాకార ధర్మద్రుమ
ప్రారోహ ప్రతిపన్న వత్సల మహాత్యాగిన్ వివేకాశ్రయ
లక్ష్మ్యావాస మనస్విని మనసిజ వ్యాపారదీక్షా గురో
శ్రీమన్ ముంజ కిమిత్యముంజముపస్ప్రష్టుం దృశా నార్హసి' 86

అత్ర సౌజన్యాంబునిధ ఇత్యాదీనాం ప్రియార్థానాం పదానాముపాదానం ప్రేయః.

అర్థము : పరప్రశంసా సందర్భమున ప్రియతరముగా పలుకుటయే ప్రేయస్సు అనబడును. ఇది లక్షణము. సౌజన్యసాగరా! బుధప్రియా! గుణములే ప్రాకారమైనవాడా! ధర్మద్రుమాంకురా! శరణాగత వత్సలా! మహాత్యాగీ! వివేకమున కాశ్రయమైనవాడా! లక్ష్మికి నివాసస్థానమైనవాడా! మనస్వినులకు మన్మథ వ్యాపార దీక్షాగురువైనవాడా! శ్రీమంతుడా! ముంజప్రభూ! ఈ జనుని చూపుతో నైనను స్పృశింపజాలవా? ఇది ఉదాహరణము.

ఇచ్చట 'సౌజన్యాంబునిధే' మొదలయిన ప్రియార్థములయిన పదముల యుపాదానమువల్ల, ఇది ప్రేయోగుణము.

వ్యాఖ్య : పరప్రశంసయందు ప్రియార్థ మెట్లు నుండనే యుండును. అంత కంటె ప్రకర్ష నపేక్షించుటచేతనే లక్షణవాక్యమునందు 'ప్రియతరాఖ్యానమ్' అని చెప్పుట జరిగినది.

ఉదాహృత పద్యమునందు ముంజప్రభుప్రశస్తి కలదు. అతడు సుజనత్వము నకు సముద్రము; అనగా అపారమైన సౌజన్యము కలవాడని యర్థము. పండితులవే ప్రియమిత్రులనుగా కలవాడనియు, పండితుల కిష్టమైనవాడనియు బుధప్రియ శబ్దము నకు రెండర్థములు గలవు. అట్లే గుణప్రాకారాదిపదములవల్ల ముంజప్రభుని పర మోత్కర్ష ప్రశస్త మగుచున్నది. కావుననే యిది ప్రేయోగుణమున కుదాహరణ మైనది.

## [ సుశబ్దత ]

72. వ్యుత్పత్తిః సుప్తిఙాం యా తు ప్రోచ్యతే సా సుశబ్దతా.

యథా -

'తస్యాజీవని రస్తు మాతరంవ మాజీవస్య మాజీవతో
భూయాద్వా జననిః కిమంబ జనుషా జంతోర్వృథా జన్మనః
యః స్త్వామేవ న వన్దతే న యజతే నోపైతి నాలోకతే
నోపస్తౌతి న మన్యతే న మనుతే నాధ్యేతి న ధ్యాయతి' 87

అత్ర 'అజీవనిః' అజననిః' ఇత్యాదీనాం సుబన్తానాం 'వన్దతే, యజతే' ఇత్యాదీనాం తిఙన్తానాం చ వ్యుత్పత్తిః సుశబ్దతా.

**అర్థము** : సుబంతములయొక్కయు, తిఙంతములయొక్కయు వ్యుత్పత్తిని సుశబ్దత అని యందురు. ఇది లక్షణము. జీవునకు జీవించియుండగా అవమానము కలుగరాదు. అమ్మా! అట్టివానికి జీవనమే లేకుండునుగాక! లేదా పుట్టుకయే కలుగకుండునుగాక; అమ్మా! నీకు నమస్కరింపక, నిన్ను పూజింపక, నిన్ను పొందక, నిన్నుచూడక, నీకు స్తోత్రము చేయక, నిన్ను భావింపక, నీ మంత్రములు పఠింపక, నిన్ను గురించి అధ్యయనము చేయక, నిన్ను ధ్యానింపక యుండువాని వ్యర్థ జన్మము చేత నేమి లాభము? ఇది ఉదాహరణము.

ఇక్కడ 'అజీవనిః, అజననిః' మున్నగు సుబంతములయొక్కయు, 'వన్దతే, యజతే' మున్నగు తిఙన్తములయొక్కయు వ్యుత్పత్తియే సుశబ్దత.

వ్యాఖ్య: విశిష్టా ఉత్పత్తిః వ్యుత్పత్తి. విశిష్టమైన ఉత్పత్తినే వ్యుత్పత్తి అని యందురు. మూలరూపములను, ఆయా యర్థవిశేషములను సక్రమముగా తెలిసికొని సరియైన విధముగా నుపయోగించినయెడల సుశబ్దత యన్న శబ్దగుణ మగును.

తిఙంతము లనగా క్రియాపదము లని యర్థము; సుబంతము లనగా క్రియేతరపదము లని యర్థము. నామవాచకములు, సర్వనామములు, విశేషణములు సుబంతపదముచే గ్రాహ్యములు. పదసామగ్రియందు నిపాతములు, అవ్యయములు అనునవి కూడ కలవు. వానికి మూలరూపము, ప్రత్యయము అన్న విభాగము లేదు. అందువల్లనే ముఖ్యములయిన సుప్తిఙంతములే లక్షణమునందు గ్రహింపబడినవి.

ఉదాహృత శ్లోకమునందలి అజీవనిః, అజననిః, అవమా, జన్తుః – మున్నగు ప్రయోగములు రచయితయొక్క సుబంత పదవ్యుత్పత్తికి సూచకములు. వన్దతే, యజతే, ఉపైతి, ఆలోకతే, ఉపస్తౌతి – మున్నగు ప్రయోగములు రచయిత యొక్క క్రియాపద వ్యుత్పత్తికి సూచకములు. వ్యాకరణ సాధువులైన పదముల నుపయోగించుటయే సుశబ్దత. కేవలము ప్రహతములైన పదములను గాక అభినవములను గూడ తన వ్యుత్పత్తికి నిదర్శనముగా రచయిత వాడినప్పుడే అది గుణముగా పరిగణింపబడును. ప్రకృతోదాహరణమున 'అజీవని' ప్రభృతు లట్టివి. కావుననే, యిచ్చట సుశబ్దతాగుణ మున్నది.

[ స మా ధి ]

సమాధిః సోఽన్యధర్మాణాం యదన్యత్రాధిరోపణమ్.

యథా —

'ప్రతీచ్ఛత్యాశోకీం కిసలయపరావృత్తి మధరః
కపోలః పాండుత్వా దవతరతి తాలీపరిణతిమ్
పరిమ్లానప్రాయా మనువదతి దృష్టిః కమలినీ
మితీయం మాధుర్యం స్పృశతి చ తనుత్వం చ భజతే' 88

అత్ర ప్రతీచ్ఛతి, అవతరతి, అనువదతి — ఇత్యాది చేతనక్రియా ధర్మాణా మచేతనేష్వధరాదిషూపచారేణాధ్యారోపణం సమాధిః.

అర్థము : అన్యధర్మములను తదన్యములందు ఆరోపించుటనే సమాధి యందురు. ఇది లక్షణము. అధరము అశోకకిసలయ పరావృత్తిని ప్రతీక్షించు చున్నది. కపోలము పాలిపోవుటవల్ల తాళీపత్ర పరిణతికి దిగుచున్నది. దృష్టి పరిమ్లానప్రాయమైన పద్మినిని అనువదించుచున్నది. ఈ విధముగా ఈమె మధురత్వమును స్పృశించుచున్నది; తనుత్వమును భజించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట ప్రతీక్షించుచున్నది, దిగుచున్నది, అనువదించుచున్నది—మొదలయిన చేతనక్రియాధర్మములను అచేతనములైన అధరాదులందు ఔపచారికముగా అధ్యారోపించుటచేత సమాధి యగును.

వ్యాఖ్య : సమ్యగాధాన మారోపణం సమాధిః'. చక్కగా ఆధానము, అనగా ఆరోపణము చేయుట సమాధి యని వ్యుత్పత్త్యర్థము. ఒకదాని ధర్మములను మరొకదానియందు ఆరోపించి చెప్పినచో సమాధి యగును.

ప్రకృతోదాహరణమునందు ఒక వియోగిని వర్ణింపబడినది. ఆమె యొక్క వివిధాంగములను వర్ణనచేసి, ఆమె మాధుర్య తనుత్వములను పొందినట్లు చెప్పుట జరిగినది. వియోగిని చైతన్యవతియే. తదవయవములకు చేతనత్వము లేదు; కావున, అవి అచేతనములే. ఇచ్చట అచేతనములైన అధరాదులను వర్ణించుపట్టున చేతన

ధర్మములయిన నిరీక్షించుట, అవతరించుట, అనువదించుట మున్నగునవి ఆరోపితము లైనవి.

అధరము అశోక కిసలయ పరావృత్తిని ప్రతీక్షించుచున్నది. ఎఱ్ఱదనమును కోల్పోయిన దనుటయే పర్ణితాంశము. కాని దానిని ఔపచారికముగా చెప్పుట జరిగినది. కపోలములు పాలిపోయిన వనుటకు తాళీపత్రపరిణతికి దిగుచున్న వన్నప్పుడు చేతన ధర్మ మారోపితమైనది. ఆమె దృష్టి (నేత్రము) పద్మము వంటిది. ఆమె వియోగకాతరయైనప్పుడు కూడ పద్మసాదృశ్యమట్లే యున్నది. కాని, యిప్పటి పద్మము వాడిపోయినటువంటిది. వాడిన పద్మమును కన్ను అనుకరించుచున్నదనుట చేత చేతనధర్మమైన అనుకరణము ఆరోపితమైనది. చివరిపాదమున 'ఇయం మాధుర్యం స్పృశతి' అన్నదానిలో నైతము అధ్యారోపణ మున్నది. ఆమెకు స్పృశించుట యన్న లక్షణ మున్నదనుటలో సందేహము లేదు. కాని, మాధుర్యము స్పర్శకు అందునది కాదు. మధురత్వము జిహ్వేంద్రియముచేత గ్రహింపదగినది. దానిని స్పర్శకు అందునట్లుగా చెప్పుట ఔపచారికము. అనగా, అన్యధర్మమును తదన్యము నందు ఆరోపించుటయే. కావుననే యీ పద్యము సమాధికి ఉదాహరణమైనది.

[ సూక్ష్మత ]

73. అన్తఃసంజల్పరూపత్వం శబ్దానాం సౌక్ష్మ్య ముచ్యతే.

యథా—

'కేవలం దధతి కర్తృవాచినః
ప్రత్యయా నిహ న జాతు కర్మణి
ధాతవః సృజతి సంహృ శాస్తయః
స్తౌతి రత్ర విపరీతకారకః.' 89

అత్ర శ్రుతావగత వాక్యార్థస్య సృజతి, సంహరతి, శాస్తి, స్తూయతే — ఇతి శబ్దానా మన్తః సంజల్ప రూపేణ సూక్ష్మతయా సూక్ష్మత్వమ్.

అర్థము : శబ్దముల అంతస్సంవాదరూపమును సౌక్ష్మ్యమని యందురు. ఇది లక్షణము. కర్తృవాచకములు మాత్రమే ప్రత్యయములను దాల్చును; కర్మార్థ

మున్నగ మెన్నడును దాల్పవు. సృజతి సంహృ శాస్తి ఆ ధాతువులు; ఇచ్చట స్తౌతి విపరీతకారకము. ఇది ఉదాహరణము.

ఇచ్చట విని గ్రహింపబడిన వాక్యార్థమునకు సృజతి, సంహరతి, శాస్తి, స్తూయతే — అను శబ్దములయొక్క అంతస్సంజల్పరూపముచేత సూక్ష్మత యేర్పడును. అందువల్లనే సూక్ష్మత్వ మన్న గుణము కలుగును.

వ్యాఖ్య : అంతః సంజల్ప మని యనగా పరస్పర సంవాద మనియే భావము. కొన్ని శబ్దములనుబట్టి మరికొన్ని శబ్దములకు సంక్రమించెడి విశేషార్థ స్ఫురణమున కిది సూచకము. అంతస్సంవాదమువల్ల సంక్షిప్తత్వముతోపాటు నిగూఢత్వముకూడ కలుగును. వటబీజము సూక్ష్మమయ్యును మహావృక్షమునకు మూల మైనట్లు, ఇచ్చటి సూక్ష్మత మహాభావమునకు మూలమగును. భావుకుడు అంతస్సంవాదముగల శబ్దముల యాధారమున విస్తృతమైన భావము నవగతము గావించు కొన గల్గును.

ఉదాహృతశ్లోకమున 'కర్తృవాచకములు ప్రత్యయములను దాల్చును గాని కర్మవాచకములు ప్రత్యయములను దాల్పవు'అని ప్రతిపాదనచేసి మూడు ధాతువులను తెల్పుట కాన నగును. ఉన్నది యున్నట్లుగా నిది 'సమస్య' యనిపించునే కాని స్పష్టముగా నేమియు నవగతము కాదు, కీలకము తెలిసినప్పుడు తేలికగా నర్థ మగుటయే కాక భావప్రస్తారమునకు నైత మెంతో సహకరించును. ఇది భగవత్స్తుతి పరము. మూడవపాదమునందు చెప్పిన ధాతువులు కర్త్రర్థమునందు మాత్రమే యుప యోగపడును. ఎప్పుడు? భగవంతుడు విషయమైనప్పుడు. భగవాన్ సృజతి— భగవాన్ సంహరతి — భగవాన్ శాస్తి అను రూపములు కలుగును. భగవంతుడు సృజించును — భగవంతుడు సంహరించును — భగవంతుడు శాసించును అని యర్థము. ఈ ధాతువులకు భగవచ్ఛబ్దము కర్మవాచక మెన్నడును కాదని నిషేధము కలదు. 'భగవన్తం సృజతి' మొదలయిన ప్రయోగము లుండవని యర్థము. దీనినిబట్టి భగవంతుడు అనాదిమధ్యాంతుడన్న భావము స్ఫూర్త మగుచున్నది. భగవంతుడే సృష్టికర్త; తనకు సృష్టికర్త లేడు. భగవంతుడే సంహారకుడు; తనకు సంహారకుడు లేడు. భగ వంతుడే శాసకుడు; తనకు శాసకుడు లేడు — అన్న భావము తీగ సాగుచున్నది.

'స్తౌతి శ్రుతి విపరీతకారకః'. పైని చెప్పిన ధాతువులు కర్త్రర్థమున నుండగా స్తౌతి విపరీతకారకమై యుండును, అనగా కర్మార్థమున నుండునని భావము,

ఇచ్చట భగవచ్ఛబ్దము కర్మార్థకముకాగా 'భగవన్తం స్తౌతి'అని యగును. భగవంతుని స్తోత్రముచేయు నని యర్థము. కర్త్రర్థకమే యైనయెడల 'భగవాన్ స్తౌతి' భగవంతుడు స్తోత్రము చేయును – అని యగును. కాని, యిది నిషిద్ధము. భగవంతుడు సర్వవంద్యుడు. సర్వస్తోత్రగానములకు భగవంతుడే లక్ష్యము. భగవంతుడు మరెవ్వరిని స్తోత్రము చేయడు.

అంతస్సంవాదముగల శబ్దములవల్ల అనేక భావములు ప్రస్తారము నొందుచుండుటచేతనే దీనికి 'సౌక్ష్మ్యము' అన్న పేరు తగియున్నది.

ఉదాహరణ శ్లోకము మాఘుని శిశుపాలవధము నందలిది.

[ గాంభీర్యము ]

ధ్వనిమత్తా తు గాంభీర్యమ్.

యథా –

'మౌలౌ ధారయ పుణ్డరీక మమితం తన్వాత్మనో విక్రమం
చక్రాంకం వహ పాదయుగ్మమవనీం దోష్ణా సమభ్యుద్ధర
లక్ష్మీం భ్రూనికటే నివేశయ భవ జ్యాయాన్ దివౌకస్పతే
ర్విశ్వాన్తఃకరణైక చోర తదపి జ్ఞాతం హరిః ఖల్వసి' 90

అత్ర నాభ్యాం పుణ్డరీకధారణం పరిమితవిక్రమత్వం చక్రాంకితకరత్వం వసుధోద్ధారణం వక్షఃస్థల నివేశిత లక్ష్మీకత్వ మింద్రావరజత్వం చ ధ్వనయతీతి గాంభీర్యమ్.

అర్థము : ధ్వనిని కలిగియుండుట గాంభీర్య మనబడును. ఇది లక్షణము. విశ్వాంతఃకరణైకచోర! కమలమును శిరసున ధరింపుము. నీ విక్రమము నమితముగా విస్తరింప జేయుము. పాదయుగళమున చక్రచిహ్నమును వహింపుము. లక్ష్మిని రొమ్ముమీది సమీపమున నిల్పుకొనుము. ఇంద్రునికి నీవు జ్యేష్ఠుడ వగుము. నీవు విష్ణుడవే కదా! అదియును తెలియును. ఇది ఉదాహరణము.

ఇచ్చట నాభియందు పుండరీకము ధరించుట, పరిమిత విక్రమత్వము, చక్రాంకితకతత్వము, కోరచేత వసుధ నుద్ధరించుట, వక్షఃస్థలమునందు లక్ష్మిని నిలుపుకొని యుండుట, ఇంద్రుని కనుజుడై యుండుట – అనువానిని ధ్వనించుటచేత గాంభీర్యము.

వ్యాఖ్య : 'ధ్వనన మేవ ధ్వనిః.' ధ్వనించుటయే ధ్వని. ధ్వనించుట యనగా వాచ్యార్థముకంటె భిన్నమయిన వ్యంగ్యార్థమును వెల్లడించుట యని యర్థము. వాచ్యార్థమువకు మించిన యర్థమును వెల్లడించెడి పదసముదాయము గాంభీర్యమును గలిగియుండును.

ప్రకృత పద్యమునందు 'నీవు విష్ణుడవుకదా: అది తెలియును' అని యున్నది. ఇదొక రాజప్రశంసాపద్యము. రాజు విష్ణువనుట యథార్థము కాదు. ఇద్దరును భిన్న వ్యక్తులు. ఏకత్వమును స్థిరపరుప వలయునన్న అందులకు తగిన లక్షణములను ప్రదర్శింపవలయును. ఆ భావముతోనే 'కమలమును శిరసున ధరింపుము' మొదలయిన విధముగా చెప్పుట జరిగినది. విష్ణువునకు పద్మధారణ లక్షణ మున్నది. కావుననే ప్రకృతరాజునకు పద్మధారణత్వము ప్రబోధింపబడినది, ఇచ్చట మరల భేద మున్నది. ప్రకృతనాయకుడు శిరమున పద్మమును ధరింపవలయును; విష్ణువు నాభియందు పద్మమును ధరించెను. ఇట్లే విక్రమత్వము ఉభయుల కున్నవి. విష్ణున కున్న విక్రమత్వము మూడడుగుల ప్రమాణము మాత్రమే కలది. రాజును అమితవిక్రమమును పొందుమనుటచేత భిన్నతయే వ్యంజితమగుచున్నది. అతడు చక్రాయుధమును చేతియందు ధరించెను; ఇతడు చక్రవర్తి చిహ్నమును పాదయుగ్మమునందు ధరింపవలయును. అతడు కోరలమీద భూమిని పైకెత్తెను; ఇతడు ఒక్కచేతితో ఎత్తవలయును. అతడు లక్ష్మిని గుండెలపైని కూర్చుండబెట్టుకొనెను; ఇతడైశ్వర్యమును భ్రూవికటమున నిలుపుకొనవలయును. అత డింద్రునికి తమ్ముడు; ఇతడింద్రుని కంటె మిన్న కావలయును. అత డధోక్షజుడు; అనగా ఇంద్రియజన్యము లైనవానిని అధఃకరించినవాడు. ఇతడు విశ్వముయొక్క అంతఃకరణము నపహరించినవాడు, అనగా మనోజ్ఞత్వము కలవాడని భావము.

ఇట్లు హరికంటె భిన్నములయిన లక్షణములు గలవానిని 'నీవు హరివే' యనుట సంగతము కాదు. సంగతము కాదు కనుకనే వ్యంగ్యము నాశ్రయింపవలసి వచ్చుచున్నది. అట్లుచేయగా స్థూలరూపమున పద్మధారణాది విష్ణులక్షణములను

పొందుమన్నట్లుగా ఉన్నదేకాని విరోధరూపమూలమైన శబ్దధ్వనిచేత 'హరికంటె నధికుడవు నీవు' అన్న భావమే అభివ్యక్త మగుచున్నది.

'నీవు హరివి' అన్నమాట యాధారముగా హరిలక్షణ సాదృశ్యము, తద్విరోధము, తదాధిక్యము వ్యజ్యమానము లగుచున్నవి. ఇట్లు ధ్వనించుపదములను కలిగి యుండుటవల్లనే యీ పద్యము గాంభీర్యమన్న గుణమున కుదాహరణ మైనది.

[ వి స్తర ము ]

వ్యాసేనోక్తిస్తు విస్తరః.

యథా -

'జనః పుణ్యైర్యాయా జ్జలధి జలభావం జలముచ
స్తథావస్థం చైనం నిదధతు శుభైః శుక్తి వదనే
తత స్తాం శ్రేయోభిః పరిణతి మవాప్నోతు యథా
రుచం తన్వన్ పీనస్తని హృది తవాయం విలుఠతి' 91

అత్ర కథ మహం త్వత్కుచతటే విలుఠామీత్యభిప్రాయస్య విస్తరేణ ప్రకాశితత్వా దయం విస్తరః.

అర్థము : విస్తరించి చెప్పినయెడల విస్తర మగును. ఇది లక్షణము. పీనస్తనీ! నీ హృదయమునందు అభిరుచిని పెంచుకొని దొరలుచున్నట్లు ఈ మనుష్యుడు పూర్వపుణ్యములచేత సముద్రజలభావమును పొందవచ్చును: శుభములచేత జలదావస్థను పొందవచ్చును; శుక్తివదనమునందు శ్రేయములచేత ఆ పరిణతిని పొందవచ్చును. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'నేను నీ కుచతటమున నెట్లు దొరలుదును?' అను భావమును విస్తరించి ప్రకాశింపజేయుటవల్ల ఇది విస్తరము.

వ్యాఖ్య : ఒక యభిప్రాయమునకు దీప్తిని గాని చమత్కారమును గాని కలిగించుటకై విస్తరించి చెప్పుటకే విస్తర మనిపేరు.

ప్రకృతపద్యమునందు ప్రేయసీ కుచతట శయనము ఫలముగా వర్ణింపబడినది. ఇట్టి మహత్తరఫలము లభింపవలయునన్న మహత్తరపుణ్యమును చేసికొని యుండ వలయును. ఈ భావమునే సుందరముగా విస్తరించి చెప్పుట యిచ్చట గలదు.

సముద్రజలముగా నగుటకు అనేకజన్మలపుణ్యము కారణము. అంతకంటె నధికపుణ్యమున్నప్పుడే జలదస్థితి కలుగును. జలదము పయఃపానము చేయుటకు మాత్రమే కాక ఆహారోత్పత్తికి, విశ్వతాపోపశాంతికి సహకరించును. కావున జలస్థితి కంటె జలదస్థితి గొప్పది. జలము నిమ్నభూములలో సంచరింపగా జలదము ఉన్నతవ్యోమమునందు సంచరించును. కావుననే అధికపుణ్యము కావలయును. అట్లే ముత్యపుచిప్పయందు పడి ముత్యముగా నగుట మరింత గొప్పవిషయము. కావున మరింత పుణ్యము కావలయును. ఆ ముత్యముకూడ హారమునందు కూర్పబడి ప్రేయసి కంఠమున నలంకరింపబడి తత్కుచతటమున శయనించియుండుట యన్న మరింత పుణ్యము కావలయును. కావున అన్నింటికంటె గొప్ప స్థితి ప్రేయసీకుచతట శయనము. నాయకుడు తన కట్టి పుణ్యమున్నట్లే సంభావించుకొనుచు, అట్టి భాగ్యము నపేక్షించుచున్నాడు. ఈ చివరి యభిప్రాయమే యభీష్టము. కాని, దానికి దీప్తి కలుగుటకై యితరములను చేర్చి పెంచి వ్రాయుట జరిగినది. కావుననే యీపద్యము విస్తరగుణమునకు లక్ష్యమైనది.

[ సంక్షేపము ]

74. సమాసేనాభిధానం యత్స సంక్షేప ఉదాహృతః

యథా –

'స మారుతి సమానీత మహౌషధి హృతవ్యథః
లంకాస్త్రీణాం పునశ్చక్రే విలాపాచార్యకం శరైః.' 92

అత్ర కథావిస్తర ప్రతిపాద్య స్యార్థస్య ప్రకృత సంగ్రామరస విచ్ఛేదాశంకయా శ్లోకార్థమాత్రేణోక్తత్వాత్ సంక్షేపః.

అర్థము : విస్తృతమైన విషయమును సంక్షేపించి చెప్పుటనే సంక్షేప మని యందురు. ఇది లక్షణము. అతడు మారుతి సమానీత మహౌషధి హృతవ్యథుడై

బాణములచేత లంకాస్త్రీలకు మరల విలాసాచార్యకత్వమును నిర్వహించెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట కథావిస్తరమునందు ప్రతిపాద్యమగు నంశమును ప్రకృత సంగ్రామ సంబంధమైన రసమునకు విచ్ఛేదము కలుగునన్న యభిప్రాయముచేత శ్లోకార్ధ మాత్రముచేతనే చెప్పుటవల్ల, ఇది సంక్షేపము.

వ్యాఖ్య : విస్తృతముగా నున్న కథాభాగమును ప్రకృత సన్నివేశౌచిత్యమును పురస్కరించుకొని చేసిన సంక్షిప్తతకే సంక్షేప మనిపేరు. ఆ యౌచిత్యమున్నప్పుడే అది గుణము.

ఇంతకు పూర్వము చెప్పుకొన్న విస్తరమునకు ఇది విరుద్ధము. పరస్పర విరుద్ధములైనను, ఈ రెండును గుణములే. చిన్న విషయమునే ఆవశ్యకానుసారముగా విస్తరింపజేసి చెప్పుటచేత వ్యాప్తి మాత్రమే కాక దీప్తి కూడ కలుగవలయును. అట్లు కలిగినప్పుడే అది గుణమగును. అట్లే ఆవశ్యకానుసారముగా విస్తృతమైన కథనే సంక్షేపించి, ప్రకృత సన్నివేశౌచిత్యపోషకముగా చెప్పినయెడల నిర్వహణము సరసముగా నుండును. అట్లయినప్పుడే యీ సంగ్రహించుట గుణమగును.

ప్రకృతోదాహరణమునందు ఇంద్రజిల్లక్ష్మణ సంగ్రామసన్నివేశము వర్ణితము. రామాయణకథను బట్టి ఇంద్రజిద్బాణప్రయోగముచేత లక్ష్మణుడు మూర్ఛపోవుట, శ్రీరాముడు వ్యథచెందుట, వానరసైన్యము కలతనొందుట, హనుమంతుడు సంజీవనిని కొనివచ్చుట, లక్ష్మణుడు మూర్ఛదేరుట, మరల యుద్ధముచేయుట – యిన్ని విషయములు విస్తృతముగా వర్ణితములై యున్నవి. ఈ విషయములన్నింటిని విపులముగా నిర్వహించుటచేత యుద్ధసంబంధమైన వీరరసమున కవరోధ మేర్పడును. ప్రకృత రసము సముచితముగా పరిపుష్టము కాదు. కావుననే ప్రకృతోదాహరణము నందు ఆయా ఘట్టము లన్నియు ఒక్క సమాసముచేతనే సమాప్తము లైనవి. 'మారుతిచేత తీసికొని రాబడిన మహౌషధిచేత హరింపబడిన వ్యథకలవాడు' అని లక్ష్మణునికి విశేషణముగా సమాస రూపమున చెప్పుట కథాన్వయమున కవాంతరము రాకుండ, ప్రకృతసంగ్రామ ప్రసంగమునకు వ్యవధానము కలుగకుండ తోడ్పడినది. కావుననే, ప్రకృత సన్నివేశ సముచితమై రసపోషకమైన యీ సంక్షిప్తత సంక్షేప మన్న గుణముగా ఉదాహృతమైనది.

ఉదాహరణము కాళిదాసుని రఘువంశము నందలిది.

## [ స మ్మి త త్వ ము ]

యావదర్థ పదత్వం చ సంమితత్వ ముదాహృతమ్.

యథా –

'కేచిద్వస్తుని నో వాచి కేచిద్వాచి న వస్తుని
వాచి వస్తుని చాప్యన్యే నాన్యే వాచి న వస్తుని' 93

అత్రార్థస్య పదానాం చ తులావిధృతవత్తుల్యత్వేన సంమితత్వమ్.

అర్థము : ఎంత యర్థమో అంత పదమే యుండుటను సమ్మితత్వ మని యందురు. ఇది లక్షణము. కొందరు వస్తువునందు, మాటయందు కారు; కొందరు మాటయందు, వస్తువునందు కారు; కొందరు మాటయందును వస్తువునందును; కొందరు మాటయందును కారు, వస్తువునందును కారు. ఇది ఉదాహరణము.

ఇచ్చట అర్థమునకును పదములకును త్రాసునందలి సిబ్బెలకు వలె తుల్యత్వ ముండుటచేత సమ్మితత్వము.

వ్యాఖ్య : ప్రకృతార్థమును గ్రహించుటకు ఎన్ని పదములుండిన చాలునో, అన్ని పదములు మాత్రమే యున్న రచనయందు సమ్మితత్వ మన్న గుణ ముండునని భావము. ఇదియు, ఒక రకముగా సంక్షిప్తతయే. కవిత్వమే అల్పపదముల నన ల్పార్థ రచన. కావుననే, కవి అనేకవిధములుగా సంక్షిప్తతను సాధించుటకు యత్నముచేయును. దానివలన, తన రచనకు జిగిని, బిగిని సంపాదించుకొనును.

వాక్యమునందు కర్త, క్రియ, కర్మ మున్నగువానిని అంశములుగా చెప్పు కొందుము. మరల వానికి విశేషణములుగా వ్యవహరించు పదములు కూడ తత్తత్ స్థానములందు నిల్చి అర్థ సమర్పకములగును. ఇట్లుండుట ఆవశ్యకమే. కాని, యిది సాధారణ ధర్మము.

విశేష ధర్మమును చూతము. కొన్నియెడల పదమును చెప్ప కుండగనే, తత్సందర్భమునుబట్టి అర్థము స్ఫురించును. 'ఎవరు వచ్చిరి?' అన్న ప్రశ్నకు 'నేను' అన్న సమాధానము వినవచ్చిన దనుకొందము. ఇది సమగ్రవాక్యము కాదు.

సందర్భమునుబట్టి 'నేను వచ్చితిని' అని సమాధానము రావలసియున్నది. అయినను శ్రోత ఆవిధముగానే గ్రహించును. అనగా 'వచ్చితిని' అన్న పదము ప్రయుక్తము కాకపోయినప్పటికిని భావమును స్ఫురింపజేయుచున్నది. ఇట్టి పదముల నధ్యాహృతము లనియందుము. ఇట్లు ప్రసక్తవిషయమును గ్రహించుటకు పదము లధ్యాహృతములు కావచ్చును. అట్లగుటచేత రచనకు బింకము వచ్చునే కాని తగ్గదు.

ప్రకృతోదాహరణమునందు 'కేచిత్' కర్తృవాచకముగా ఉపయుక్తము. దీనికి 'కొందరు' అని యర్థము. ఇది అనిర్దిష్టసర్వనామము; విశేషణము. దీనికి విశేష్యము చెప్పబడలేదు. సందర్భమునుబట్టి 'కవులు' అన్నది విశేష్యమని, అధ్యాహృతమని తలపవలయును. మొత్తముమీద క్రియాపద మెచ్చటను లేదు; తత్తుల్యమైన విధేయవిశేషణమేని లేదు. అందువల్ల 'అశరీర' మన్న దోషము కలుగవలయును. కాని, సందర్భమునుబట్టి 'సమర్థులు' అన్న విధేయవిశేషణము స్ఫురించుచున్నది. 'కేచిత్ కవయో వస్తుని, నోవాచి సమర్థాః'. ఇట్లే తక్కినచోట్లను. అప్పుడు ఉద్దిష్టమైన అర్థము పరిమిత పదములలోనే బింకముగా అభివ్యక్తమగును. కావుననే యీ పద్యము సమ్మితత్వమున కుదాహరణమైనది.

## [ భా వి క త్వ ము ]

75. భావతో వాక్యవృత్తి ర్యా భావికం తదుదాహృతమ్.

**యథా —**

'ఏహ్యేహి వత్స రఘునందన పూర్ణచంద్ర
చుంబామి మూర్ధని చిరం చ పరిష్వజే త్వామ్
ఆరోప్య వా హృది దివానిశ ముద్వహామి
వందేఽథవా చరణపుష్కరకద్వయం తే' 94

అత్ర హార్ష వశాదనౌచిత్యేనాపి 'వందేఽథవా చరణపుష్కరకద్వయ' మిత్యాదినా ముక్తత్వాద్ భావికత్వమ్.

**అర్థము :** భావమువల్ల కలిగిన వాక్యవృత్తికి భావిక మనిపేరు. ఇది లక్షణము. వత్సా! రఘునందనా! పూర్ణచంద్రా! రా రమ్ము. నీ శిరస్సున ముద్దు

పెట్టుకొందును. చాలసేపు నిన్ను కౌగిలించుకొందును. హృదయమున నెక్కించుకొని అహర్నిశము మోయుదును. పోనీ: నీ చరణ కమల యుగళమునకు మ్రొక్కుదును. ఇది ఉదాహరణము.

ఇచ్చట హర్షమువల్ల 'నీ చరణకమల యుగళమునకు మ్రొక్కుదును' మన్నగు విధముగా ననుట యనౌచిత్యమే యైనను, భావిక మను గుణమగును.

వ్యాఖ్య : హర్ష శోకాదులు భావములు. ఇవి వాసనావ్యాప్తి జన్యములు. హర్షాది భావములచేత అలలవలె అనేక వాక్యము లుత్పన్నము లగును. వానికి అన్యోన్య సంబంధ ముండిన నుండవచ్చును. లేకుండిన లేకుండవచ్చును. అయినను అవిరత వల్లవితము లగు నా వాక్యములవల్ల తద్భావ నిర్భరత్వము ప్రస్ఫుటముగా గోచరమగును. భావితమైన అంతఃకరణమునుండి వెలువడిన వాక్యసముదాయము కనుకనే భావిక మన్నపేరు తగియున్నది.

ప్రకృతోదాహరణమునందు హర్షాతిరేక నిర్భరవాత్సల్యము వర్ణింపబడినది. జనకుని తమ్ముడైన కుశధ్వజుడు 'వత్సా!' మన్నగు విధముగా రామచంద్రుని సంబోధించి, ఆహ్వానించి తన అభిలాషను వ్యక్తము చేసెను. పెద్దలు పిన్నలను మూర్కొనుట, కౌగిలించుకొనుట, యెత్తుకొనుట సహజములే; కాళ్ళకు నమస్కరించుట అసహజము. పిన్నలు పెద్దలకు నమస్కరింప వలయును; పెద్దలు పిన్నలను దీవింప వలయును. ఇది ధర్మము. ఇచ్చట పితృసముడైనరాజు యువకుడైన రామునకు నమస్కరింతు ననుట ధర్మవిరుద్ధము. కావున అనౌచిత్యము. అయినప్పటికిని హర్షనిర్భరమైన కుశధ్వజ హృదయమునుండి పొంగి నపొంగులే ఆ వాక్యములు. కావున వాత్సల్యాతిశయమును, హర్షపారవశ్యములను పరిగణించుటయే యిచ్చట కర్తవ్యము. కావుననే, యీ పద్యము భావికమున కుదాహరణమైనది.

ఈ శ్లోకము భవభూతి మహావీరచరితము నుండి గ్రహింపబడినది.

## [ గతి ]

గతిర్నామ క్రమో యః స్యా దిహారోహావరోహయోః,

యథా -

'వరాహః కల్యాణం వితరతు స వో యస్య శశభృత్
కలాకోటీకాంతం క్రమవిగలదభ్యుద్ధృతిభియా
మిథః సమ్మూర్ఛద్భి శ్చతురుదధి కల్లోల పటలై
రనామృష్టం దంష్ట్రాశిఖర మధిశేతే వసుమతీ' 95

అత్ర పూర్వార్ధే స్వరస్యారోహః దుత్తరార్ధేచావరోహాద్గతిః.

అర్థము : ఆరోహావరోహక్రమమునకు గతి యనిపేరు. ఇది లక్షణము. క్రమముగా తన అభ్యుదయమునుండి జారు నన్న భయముచేత భూదేవి పరస్పరము ముంచివేసికొను చతుస్సముద్ర తరంగ సమూహములచేత స్పృశింపబడని చంద్ర కళాగ్రమువలె ఆకర్షణీయమైన ఎవని దంష్ట్రాశిఖరము నందు పరుండియున్నదో ఆ వరాహమూర్తి మీకు కల్యాణమును కలిగించును గాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట పూర్వార్ధమునందు స్వరముయొక్క ఆరోహమువల్ల, ఉత్తరార్ధము నందు అవరోహము వల్ల గతి యన్న శబ్దగుణ మున్నది.

వ్యాఖ్య : ఎ ఏ ఐ, ఒ ఓ ఔ లు ఉన్నతస్వరములని, ఇఈలు నిమ్న స్వరములని, అ ఆ ఉ ఊ లు మధ్యస్థములని * యిదివరకు చెప్పుకొంటిమి. దీర్ఘములు విశాలము లగుటచేత ఔన్నత్యమునుగాని నిమ్నత్వమునుగాని కలిగించుట కవియే సమర్థము లగును.

నిమ్నములతో గాని, మధ్యస్థములతోగాని ప్రారంభమైన వాక్యము ఉన్నత స్వరములతో ముగిసిన అది ఆరోహణక్రమము. ఉన్నతస్వరములతో మొదలయిన వాక్యము మధ్యస్థములతోగాని, నిమ్నములతో గాని ముగియుట అవరోహణక్రమము.

మొదటిపాదమునందు 'వరాహ, 'కల్యాణ' మ్మను రెంటు పదములందును మధ్యస్థమై 'ఆ' కారమున్నది. 'స వో యస్య' అనుచోటి 'వో' ఉన్నతస్వరము. ద్వితీయపాదమునందలి 'కలాకోటీకాంత' మన్న పదమున ఆ, ఓ, ఈ, ఆ అన్న స్వరములున్నవి. ఇచ్చటి 'ఓ' ఉన్నతస్వరము. పాదాంతమునందలి ఆకారము మధ్యమ స్వరము. పద్యాంతము నందలి 'తీ' నిమ్నము. మధ్యస్థవర్ణముతో మొదల

* చూడుడు : ఉదాహరణ శ్లోకము 82 వ్యాఖ్య.

యిన శ్లోకము ఉన్నతవర్ణముల నొంది ఆరోహణక్రమమును, మరల్ల అచ్చటనుండి మధ్యమస్వరములను నిమ్నస్వరములను పొందుటచేత అవరోహణ క్రమము ననుసరించెను. పూర్వార్ధమున నారోహణ ముండగా, ఉత్తరార్ధమున అవరోహణ మున్నది.

*ఔదార్యమందు వికటాక్షర బంధ ముండుట లక్షణము. అచ్చట నిమ్న మధ్యమోన్నత స్వరములు ఒకదానివెంట నొకటి వచ్చుటచేత వికటత్వము కలుగును. అచ్చట పదములగతి నర్తనము చేయుచున్నట్లుగా నుండును. గతియందు స్వరములు క్రమానుసారముగా నుండును. అందువల్లనే ఆరోహణముగాని అవరోహణముగాని స్పష్టముగా విశిష్టమగును. ప్రకృతోదాహరణమున ఆరోహణక్రమ మధ్యమున ఆకారము (కలా), అవరోహణక్రమ మధ్యమున ఏకారమును (అధిశేతే) వచ్చినవి. అట్లు రాకుండిన బాగుండెడిది. అయినను ప్రాధాన్యమునుబట్టియే వివక్ష యుండును. గమక, ఇతరస్వరముల ఆరోహణావరోహణ గతులనుబట్టి ప్రకృతపద్యమును 'గతి'కి లక్ష్యముగా స్వీకరించుట జరిగినది.

[ రీతి ]

76. ఉపక్రమస్య నిర్వాహో రీతి రిత్యభిధీయతే.

యథా -

'గ్లానా నాసి గిరేః క్షతా న పయసా నార్తాసి న గ్లాయితా
న శ్వాసైః ఫణినోఽసి న త్వదనుగా నాయాసితా క్వాపి న
త్వం చేన్నప్రతిగచ్ఛతీ' తి ముహుః శ్రీశార్ఙ్గిణోః సస్పృహం
సా ప్రశ్నోత్తరయుగ్మకం త్రిరుభయో రాత్యాయతాం పాతు వః 96

అత్ర ప్రత్యేకపదానంతరం నఞో వినివేశాత్ క్రమాభేదో రీతిః.

అర్థము: ఉపక్రమించిన విధానమును నిర్వహించుటకే రీతియని పేరు. ఇది లక్షణము. 'కొండరాతిచేత గాయపడలేదు కదా?' 'లేదు.' 'జలముచేత ఆర్తిని

* చూడుడు : ఉదాహరణ శ్లోకము 82.

పొందలేదు కదా?' 'లేదు.' 'పాము బుసలచేత కమిలిపోలేదు కదా?. 'లేదు' — అనెడి స్వమందిరమునకు వెళ్లుచు మాటిమాటికి సాభిలాషముగా మాటలాడు కొనెడి లక్ష్మీ నారాయణుల విస్తారమైన ప్రశ్నోత్తర యుగ్మపంక్తి మిమ్ములను కాపాడునుగాక: ఇది ఉదాహరణము.

వ్యాఖ్య : మొదలుపెట్టిన పదసన్నివేశముతోనే సందర్భమును నిర్వహించుటకు రీతి యనిపేరు.

ప్రకృతోదాహరణమునందు లక్ష్మీనారాయణుల సంభాషణక్రమము వర్ణితమైనది. పాలసముద్రమునుండి యుద్భవించిన లక్ష్మిని తీసికొనిపోవుచు నారాయణుడు కుశలప్రశ్నలు వేయుట మొదలు పెట్టెను. మందర పర్వతమువల్ల గాయపడెనేమో యని, జలముచేత ఉక్కిరిబిక్కిరి యాయెనేమో యని, వాసుకి పూత్కారములచేత కమలెనేమోయని, చెలికత్తెలకు బాధకలిగెనేమో యని తెలిసికొనదలచెను. ఆమెచేత సమాధానము చెప్పించి దానిని వినుట యాతని యభిలాషము. అన్నింటికి నామె 'న' యని యొక్కటే సమాధానము. ఇది నూత్నవధూవరుల చిత్తవృత్తిని చక్కగా నిరూపించుచున్నది. ఈ విధముగా ప్రశ్నయు, సమాధానముగా 'న' కారమును ప్రయోగించుటయు మొదటిరెండు పాదములందు మాత్రమే గలదు; అనగా రీతిగుణము పూర్వార్ధమునందు మాత్రమే కలదని యర్థము. అతిమాత్రముగా రీతిని నిర్వహించుట మొగము మొత్తినట్లయి విసుగు కలిగించును. ప్రకృత లక్ష్యముచేత తగుమాత్రముగానే రీతి నిర్వహణము జరుగవలయు నన్న విషయము కూడ భంగ్యంతరముగా బోధింపబడుచున్నది.

[ ఉక్తి ]

విశిష్టా భణితిర్యా స్యాదుక్తిం తాం కవయో విదుః

యథా -

'కుశలం తస్యా జీవతి

కుశలం పృచ్ఛామి జీవతీత్యుక్తమ్

పునరపి తదేవ కథయసి

మృతాం ను కథయామి యా శ్వసితి.

అపి కుశలం తస్యా ఇతి పృష్టే కుశలమకుశలం వేతి వక్తవ్యే సోఽయం జీవతీత్యుక్తిభంగ్యా జీవితమాత్రశేషతా ప్రతిపాదిన ప్రకారః స కావ్యే శబ్దగుణేషూక్తి సంజ్ఞాం లభతే.

అర్థము : విశిష్టమయిన వచోభంగికి ఉక్తి యని పేరు. ఇది లక్షణము. 'ఆమె కుశలమేనా?' 'జీవించియున్నది.' 'కుశలము నడుగుచున్నాను'. 'జీవించి యున్నదని చెప్పితివి.' 'మరల అదేమాటను చెప్పుదువా?' 'ఊపిరాడుచుండగా చచ్చిపోయినదని చెప్పుదునా?' ఇది ఉదాహరణము.

ఇచ్చట 'ఆమె కుశలమేనా?' యని యడుగగా కుశలమని యో, అకుశలమని యో చెప్పవలసియుండగా 'జీవించియున్నది' మొదలైనవచోభంగిచేత జీవితమాత్రశేషత్వము ప్రతిపాదింపబడు చున్నది. ఇది కావ్యమునందలి శబ్దగుణములలో ఉక్తి యన్న సంజ్ఞను పొందును.

వ్యాఖ్య : సాధారణముగా ప్రశ్ననుబట్టియే సమాధానము ప్రవర్తించును. అట్లుగాక భిన్నముగా ప్రవర్తించుచున్నట్టి సమాధానము వైశిష్ట్య సాపేక్ష మని గ్రహింపవచ్చును.

ప్రకృత లక్ష్యమునందు 'కుశలమేనా?' యన్న ప్రశ్న యున్నది. దీనికి కుశలమే యని కాని 'ఏమి కుశలములే' యని కాని యిట్లేదో సమాధానము చెప్పుట సాధారణ విషయము. ఇట్లుకాక ఆ పదమునే పూర్తిగా విడిచిపెట్టి 'జీవతి' యన్ని యనుటచేత వక్త యుద్దేశించిన విశిష్టత యేదో యున్నట్లు స్ఫురించుచున్నది. ఆ విశిష్టతను వ్యక్తము చేయుట సూటిగా కాక భంగ్యంతరముగా జరుగుచున్నది. 'జీవతి' యని యనుటవల్ల 'జీవించియే యున్నది, కాని జీవకళ యేమాత్రమును లేదు. మృతప్రాయయై యున్నది' అనియే భావము. ఇట్లు విశిష్టమైన భణితి నాశ్ర యించుటచేతనే ప్రకృత పద్యము ఉక్తి యన్న శబ్దగుణమున కుదాహరణమైనది.

[ ప్రౌఢి ]

77\. ఉక్తేః ప్రౌఢః పరీపాకః ప్రోచ్యతే ప్రౌఢి సంజ్ఞయా.

యథా –

'అభ్యుద్ధృతా వసుమతీ దలితం రిపూరః
క్షిప్తక్రమం కబలితా బలిరాజ లక్ష్మీః
అత్రైక జన్మని కృతం యదనేన యూనా
జన్మత్రయే తదకరోత్పురుషః పురాణః 98

అత్ర ప్రకృతిస్థ కోమల కఠోరేభ్యో నాగరోపనాగర గ్రామ్యేభ్యోవా పదేభ్యోఽభ్యుద్ధృతాదీనాం గ్రామ్యాదీనా ముభయేషాంవా పదానా మావాపోద్వాపాభ్యాం సన్నివేశ చారుత్వేన యోఽయ మాభ్యాసికో నాలికేరపాకో మృద్వీకాపాక ఇత్యాది ర్వాక్యపరిపాకః సా ప్రౌఢి రిత్యుచ్యతే. తథాచైతద్వాక్యం నాలికేరపాక ఇత్యుచ్యతే. ఏవం సహకార పాక మృద్వీకాపాకే అప్యుదాహారణీయే ఇతి.

**అర్థము** : ఉక్తి యొక్క ప్రౌఢమైన పరిపాకమునే ప్రౌఢియని యందురు. ఇది లక్షణము. వసుమతి ఉద్ధరింపబడినది, శత్రువక్షము పగుల గొట్టబడినది, పదవేగక్రమమున బలిరాజ్యలక్ష్మి కబళింపబడినది. పురాణపురుషుడు మూడు జన్మలలో చేసిన యీ పనులు యువకుడైన వీనిచేత ఒక్క జన్మలో చేయబడినవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట ప్రకృతిస్థ కోమల కఠోరములవల్లను, నాగరోపనాగర గ్రామ్యముల వల్లను, అభ్యుద్ధృతాది పదములయొక్కయు గ్రామ్యాది పదములయొక్కయు రెండింటియొక్కయు ఆవాహనోద్వాపనములవల్లను సన్నివేశ మనోహరత్వము చేత ఆభ్యాసికమైన నారికేళపాకము మృద్వీకాపాకము మొదలయిన వాక్యపరిపాకము కలుగును. దానిని ప్రౌఢి యని యందురు. అట్లే యీ వాక్యము నారికేళ పాకమున నున్న దనబడును. ఇట్లే సహకార మృద్వీకా పాకములందు నుదాహరింపదగును.

**వ్యాఖ్య** : పరిపక్వతయే పరిపాకము. శబ్దరచనా పరిపక్వతనే ప్రౌఢి యని యందురు. 'యత్పదాని త్యజన్త్యేవ పరివృత్తి సహిష్ణుతామ్, తం శబ్దన్యాయ నిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే' అని ఆలంకారికోక్తి. పరివృత్తి సహిష్ణుతను త్యజించిన పదములను గలిగియుండిన రచన శబ్దపాకమని శబ్దన్యాయ నిష్ణాతులు

చెప్పుదురు. ఇది యర్థము. ఒక వాక్యమునం దుపయుక్తమైన యే పదమును గాని తొలగించి పర్యాయపదమును నిలుపుటకు వీలు కాకుండ నుండుటయే పరివృత్త్యసహిష్ణుత. ప్రతిపదమును సార్థకముగ సక్రమముగ నుపయోగించినపుడే యిట్లు పరివృత్తికి వీలు కాకుండ నుండును. ఇది అభ్యాసవశమున చేకూరెడి విద్య. 'పౌనః పున్యేన ప్రవృత్తి రభ్యాసః'. మాటిమాటికి ప్రవర్తించుటయే అభ్యాసము. కవిత్వరచనయం దభిలాష కలిగిన వ్యక్తి తద్వేత్తల కడ తగిన యుపదేశము నొంది, దానికనుగుణముగా రచన నలవాటు చేసికొనును. ఇట్లు చేయుటచేత రచనాపాకము సిద్ధించును. కేవలము పరివృత్తికి వీలు కాకపోవుటచేతనే పాకము సిద్ధించినట్లు కాదు. రచనయందు చారుత్వముకూడ సిద్ధింపవలయును. అప్పుడే దానిని పాకము అని యందురు.

భోజదేవుని యభిప్రాయమున నారికేళపాకము, సహకారపాకము, మృద్వీకాపాకము – అని పాకములు మూడు విధములు. బయట కఠినతరముగా నుండి అంతరంగము ఆస్వాదనీయమై యుండునది నారికేళపాకము. బయట మృదువై యుండి అంతరంగముకఠినమైయుండునది సహకారపాకము. సహకార మనగా మామిడిపండు. బయటను లోపలను సర్వమృదువై ఆస్వాదనీయమై యుండునది మృద్వీకాపాకము. మృద్వీక మనగా ద్రాక్షపండు.

కవి పై పాకములకు అనుకూలముగా ప్రకృతిస్థములైన వర్ణములను గాని, కోమలవర్ణములను గాని, కఠోరవర్ణములను గాని ప్రయోగించును. అట్లే గ్రామ్యపదములను గాని, నాగరపదములను గాని, ఉపనాగరపదములను గాని ఆశ్రయించును. ఇదంతయు అభ్యాసవశముననే జరుగుటచేత స్వాభావికమై మనోహరమై యుండును.

ప్రకృతోదాహరణమునందు నారికేళపాకము కలదు. వెలుపల గట్టిగా నుండి లోపల మెత్తగా నుండుట దీని లక్షణము. అభ్యుద్ధృతా, క్షిప్తక్రమఠ, లక్ష్మీః అత్రైక జన్మని, జన్మత్రయే, తదకరోత్పురుషః– అను పదములందలి సంయుక్తవర్ణములు. 'ఠం రిపూరః, షం పురాణః' అనుచోటి సన్నికర్ష కఠినతరవర్ణములకు ఆలంబమైనది. 'వసుమతీ, కబలితా' మున్నగునవి మృదువర్ణఘటితములే. అయినను కఠినవర్ణముల ప్రాచుర్యమునుబట్టి యిది నారికేళపాక మగుచున్నది. ఇట్లు ఒక పాకము ప్రౌఢముగా నంతరింపబడుటవల్లనే ప్రకృతశ్లోకము ప్రౌఢికిలక్ష్యమైనది.

ఇట్లే స్ఫటాకారపాకము నాశ్రయించుకొనియు ద్రాక్షాపాకము నాశ్రయించుకొనియు ప్రౌఢి యుండును. ఇది శబ్దగుణము.

## ఆ భ్యం త ర గు ణ ము లు

ఉక్తాః శబ్దగుణా వాక్యే చతుర్వింశతి రిత్యమీ
78. అర్థే తానేవ వాక్యార్థ గుణత్వేన ప్రచక్ష్మహే.

అర్థము : వాక్యమునందు శబ్దగుణములు ఇరువది నాలుగు ఇంతవరకు చెప్పబడినవి. ఇప్పుడు వానినే (శ్లేషము, ప్రసాదము, సమత మున్నగు నిరువది నాలుగింటిని) వాక్యార్థగుణములుగా చెప్పుదుము.

### [ శ్లే ష ము ]

తేషాం శ్లేష ఇతి ప్రోక్తః సంవిధానే సుసూత్రతా.

యథా —

'దృష్ట్వైకాసనసంస్థితే ప్రియతమే పశ్చా దుపేత్యాదరా
దేకస్యా నయనే నిమీల్య విహితక్రీడానుబంధచ్ఛలః
ఈషద్వక్రితకంధరః సపులకః ప్రేమోల్లసన్మానసా
మంతర్హాస లసత్కపోలఫలకాం ధూర్తోఽపరాం చుంబతి. 99

అత్రైకాసనసంస్థితయోః ప్రియతమయో ర్విలాసినా పేక్యకా నయననిమీలన కేలికర్మణా వంచితా అన్యా తు వదనచుంబనేన రంజితేతి సేయం సంవిధానేన సుసూత్ర శ్లేషో నామ వాక్యార్థగుణః.

అర్థము : సంవిధానమునందలి సుసూత్రతను శ్లేష మని యందురు. ఇది లక్షణము. నాయికతోపాటుగా తన ప్రియతమ ఏకాసనమునం దుండగా చూచి, ధూర్తుడు వెనుకగావచ్చి ఎంతోయాదరముతో కేళీచ్ఛలముతో ఒకామె(నాయిక యొక్క) రెండు కనులను మూసి, కొంచెము వంచిన మెడగలవాడై పులకరింపుగలవాడై

ప్రేమోల్లాసమానసయు మెరయుచున్న కపోలపులకములు గలదియు నగు రెండవ యామె(ప్రియతమ)ను చుంబించుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఒకే యాసనమునందున్న యిరువురు ప్రియతమలలో విలాసవంతుని చేత దాగుడుమూతలాట నెపముతో ఒకతె వంచింపబడినది; మరియొకతె వదనచుంబనముచేత రంజింపబడినది. అదియే సంవిధానమున సుసూత్రత, శ్లేష మను వ్యాక్యార్థగుణము.

వ్యాఖ్య : అర్థగుణములు ఇరువది నాలుగింటిలోను మొదటిది శ్లేషము. పేరు శబ్దగుణమైన శ్లేషముతో సమానమే యైనను లక్షణమునందు భేద మున్నదన్న సంగతిని గమనించుట యవసరము.

సంవిధాన మనగా కార్యనిర్వాహణవిధాన మని భావము; సుసూత్రత యనగా సుకరమైన యుపాయ మని యర్థము. కార్యనిర్వాహణ విధానమునందు సుకరమైన యుపాయము వర్ణిత మైనయెడల అదియే శ్లేషము.

ప్రకృతోదాహరణమున ధూర్తనాయకు డొకడు సహాసనస్థితలైన యిరువురు నాయికలలో ఒకతెను వినోదింపజేయుట కన్నట్లు కనులు మూసెను. అనంతర వ్యవహార మామెకు తెలియకుండుటకే నేత్రమీలనము జరిగినది. నిజమున కామె మోసగింపబడినది. రెండవయామె అతనికి ప్రియతమ. ఆమె కీ మోస మవగత మైనది. అందుచేతనే ప్రేమోల్లసన్మానస యైనది; లోలోపలనే నవ్వు నాపుకొనుట చేత కపోలములలోనికి మెరపును తెచ్చుకొన్నది. ఆమెను కొంచెముగా మెడవంచి ముద్దు పెట్టుకొనెను. తాను పూర్తిగా కదలినను, వంగినను వంచన బయట పడి పోవును. అట్లు కాకుండుటకే యీషద్వక్రితకంధరు డగుట. ప్రియతమతో తాను రంజనము నొందుటకు సుకరమైన యుపాయము నవలంబించుట యున్నది. కావుననే ప్రకృతశ్లోకము వాక్యార్థగుణమైన శ్లేషమున కుదాహరణమైనది.

ఈ శ్లోకము అమరుకమునుండి గ్రహింపబడినది.

## [ ప్ర సా ద ము ]

79. యత్తు ప్రాకట్య మర్థస్య ప్రసాదః సోఽభిధీయతే.

యథా—

'అయ ముదయతి ముద్రాభంజనః పద్మినీనా
ముదయగిరి వనాలీ బాల మందార పుష్పమ్
విరహవిధుర కోకద్వంద్వ బంధు ర్విభిన్దన్
కుపిత కపికపోల క్రోడతామ్ర స్తమాంసి' 100

అత్ర పద్మినీవికాసకరణే ఉదయశైలావతరణే కోకశోకహరణే తమోవిదారణే చానుక్తోఽపి సూర్యలక్షణోఽర్థః ప్రకట మువ లక్ష్యతే.

అర్థము : అర్థముయొక్క స్పష్టప్రకటత్వమునే ప్రసాద మని యందురు. ఇది లక్షణము. పద్మినులకు ముద్రాభంజనుడును, ఉదయగిరివనములకు బాల మందారపుష్పమును, విరహముచేత విడిపోయిన చక్రవాకదంపతులకు బంధువును, కోపించిన కపికపోలమువోలె ఎఱ్ఱనివాడు నైన యీతడు చీకట్లను భేదించుచు ఉద యించుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట పద్మినులకు వికాసము కలిగించుటయందు, ఉదయశైలముపైకి దిగుటయందు, చక్రవాకపక్షుల శోకమును తొలగించుటయందు, చీకటులను చీల్చుట యందు – చెప్పబడక పోయినను – సూర్యలక్షణమైన యర్థమే స్పష్టముగా బయట పడుచున్నది.

వ్యాఖ్య : చెప్పబడిన విషయమునుబట్టి చెప్పబడని వివక్షితార్థము స్పష్ట ముగా స్ఫురించినయెడల, దానిని ప్రసాద మన్న వాక్యార్థగుణముగా పరిగణింతురు.

ప్రకృతోదాహరణమునందు సూర్యశబ్దముకాని, తత్పర్యాయశబ్దముకాని ప్రయుక్తము కాలేదు. అయినప్పటికిని 'అయ ముదయతి' అనుదానికి 'సూర్య ఉద యతి' అనియే భావము. పద్మినీముద్రాభంజనత్వము పద్మినీవికసనమునే ప్రక టించును. ఉదయగిరి వనాలీ బాలమందారపుష్పత్వము ఉదయపర్వతావతరణమునే ప్రకటించును. విరహవిధురకోకద్వంద్వబంధుత్వము కోకశోకహరణమునే ప్రక టించును. కుపితకపికపోల క్రోడతామ్రత్వము ఉదయత్సూర్య కషాయవర్ణమునే ప్రక టించును. ఉక్తసామగ్రిచేత అనుక్తసామగ్రిపైతము ప్రకటిత మగుచుండుటవల్లనే ప్రకృత శ్లోకము ప్రసాదమున కుదాహరణ మైనది.

[ సమత ]

అవైషమ్యం క్రమవతాం సమత్వ మితి కీర్తితమ్

యథా—

'అగ్రే స్త్రీనఖపాటలం కురవకం శ్యామం ద్వయోర్భాగయో
ర్బాలాశోక ముపోఢరాగసుభగం భేదోన్ముఖం తిష్ఠతి
ఈషద్బద్ధరజఃకణాగ్రకపిశా చూతే నవా మంజరీ
ముగ్ధత్వస్యచ యౌవనస్యచ సఖే మధ్యేమధుశ్రీఃస్థితా' 101

అత్ర మధుశ్రియో మౌగ్ధ్య త్యాగ యౌవనారంభకృతానాం విశేషణానా మవైషమ్యాత్ సమతా.

అర్థము : క్రమవంతము లైనవానికి వైషమ్యము కలుగకుండునట్లు చెప్పుటయే సమత్వము. ఇది లక్షణము. కురవకము స్త్రీనఖమువలె ఎఱ్ఱనైన మొన కలిగి రెండు వైపులను శ్యామలముగా నున్నది. బాలాశోకము రాగమును పొందినదై సుభగమై వికసించుటకు సిద్ధముగా నున్నది. మామిడిచెట్టుమీది క్రొత్త పూగుత్తి ఈషద్బద్ధములైన పరాగకణములచేత అంచున కపిశవర్ణమును దాల్చియున్నది. ప్రకృతి వసంతశ్రీ బాల్యయౌవనముల నడుమ నున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట వసంతశ్రీయొక్క ముగ్ధత్వత్యాగము యౌవనప్రారంభము అను దశలను తెల్పు విశేషణములకు విషమత్వము లేకుండ చెప్పుటచేత సమత్వము.

వ్యాఖ్య : సమత్వము కానిది విషమత్వము. విషమత్వము లేకుండ చెప్పుట యనగా సమత్వముతో చెప్పుట యనియే భావము. తొలుత గ్రహించిన క్రమమునకు భిన్నము కాకుండునట్లు నిర్వహణ సాగుటయే సమతాగుణ లక్షణము.

వసంతశోభ స్త్రీగా రూపితమైనది. ఆమె ముగ్ధావస్థను దాటుచు యౌవనావస్థలో అడుగు పెట్టబోవుచున్నది. ఇట్టియెడల ఉభయసామాన్యలక్షణములు చిత్రితములు కావలయును. వసంతశోభ తనకు తానై వ్యక్తము కాదు; వసంతకాలమునందలి పువ్వుల నాశ్రయించుకొని వ్యక్తమగును. కావున బాల్యయౌవనమధ్యస్థమైన

వసంతశ్రీని వర్ణించుట యనగా తత్కాలమునందలి సుమములయొక్క బాల్య యౌవన మధ్యస్థమయిన స్థితిని చెప్పుట యనియే యర్థము. పుష్పజాతికి ముకుళస్థితి బాల్యము; వికాసస్థితి యౌవనము. ఈ రెండింటికి మధ్యస్థమైన దశ వికసనోన్ముఖత్వము. కురవకము, అశోకము, చూతమంజరి – వసంతమున వికాసము నొందునవి. వీని వికసనోన్ముఖత్వమునే ప్రకృతశ్లోకము వర్ణించుచున్నది. అందువల్లనే బాల్యయౌవనమధ్యస్థ మైన వసంతశ్రీకి అనురూపముగా కురవకాదులు కూడ వర్ణితము లై సమత్వసమర్థకము లైనవి. కావుననే ప్రకృతోదాహరణము సమతాగుణసంపన్నమైనది.

ఈ శ్లోకము కాళిదాసుని విక్రమోర్వశీయము నందలిది.

## [ మా ధు ర్య ము ]

80. మాధుర్య ముక్త మాచార్యైః క్రోధాదా వప్యతీవ్రతా.

యథా –

'భ్రూభేదే సహసోద్గతేఽపి వదనం నీతం పరాం నమ్రతా
మీషన్మాం ప్రతిభేదకారి హసితం నోక్తం వచో నిష్ఠురమ్
అంతర్బాష్పజడీకృతం ప్రభుతయా చక్షు ర్న విస్ఫారితం
కోపశ్చ ప్రకటీకృతో దయితయా ముక్తశ్చ నో ప్రశ్రయః' 102

అత్ర వాసవదత్తా లక్షణస్యార్థ స్య కోపేపి యోఽయం వినయావలంబనేన కోపచిహ్నానిహ్నవ స్తన్మాధుర్యమ్.

అర్థము : క్రోధాది తీవ్రభావము కలిగినప్పుడు సైతము తీవ్రతను ప్రదర్శింపకుండుటయే మాధుర్యము. ఇది లక్షణము. ఆకస్మికముగా బొమలు ముడి వడినప్పటికిని ముఖము మిక్కిలి వినయమును తెచ్చుకొన్నది; నావట్ల మర్మచ్ఛేదకమైన నవ్వు కొంచెముగా నవ్వినను నిష్ఠురమైన వాక్కును పలుకలేదు. లోలోపల కన్నీటితో జడీకృతమైన లోచనము అధికారముచేత విస్ఫారితము కాలేదు. ప్రియురాలిచేత కోపము ప్రకటీకృత మయినది; అయినను వినయము విడువబడలేదు. ఇది ఉదాహరణము.

ఇచ్చట వానవదత్తాలక్షణ మైన అర్థమునకు, కోపమునందును వినయము నవలంబించుటచేత, కోపచిహ్ననిహ్నవము జరిగినది. ఇదియే మాధుర్యము.

వ్యాఖ్య : శృంగారఘట్టమునందు గోత్రస్ఖలనాదికారణముచేత నాయకుని యెడల నాయిక కోపము నొందవచ్చును. వెనువెంటనే కొందరు నాయికలు బాహాట ముగా కోపమునే ప్రదర్శింతురు. కొందరు నాయికలు కోపమును కనిపింపనీయక, వినయమునే ప్రదర్శింతురు. ఇట్టియెడల దాచుకొనబడినకోపము, ప్రదర్శింపబడుచున్న వినయము - ఈ రెండు భావముల మిశ్రణము మధురముగా నుండును. కావుననే యీ గుణమును మాధుర్యము అని యందురు.

ప్రకృతపద్యమునందు నాయిక భ్రూభేదమును, భేదకారిహసితమును, అంతర్బాష్పజడీకృతమైన లోచనమును గోపనము గావించుకొన్నది. ఇవన్నియు కోపచిహ్నములే. వీనిని నిహ్నవించి నమ్రతను తెచ్చుకొనుట, కఠినోక్తిని పలుక కుండుట, కనులు పెద్దవి చేయకుండుట అను లక్షణములను ప్రదర్శించినది. ఇవన్నియు వినయచిహ్నములే. ఇట్లు రెండు రకములయిన భావములును మిశ్రణము చెందుటచేతనే యిది మాధుర్యమున కుదాహరణ మైనది.

ఈ శ్లోకము శ్రీహర్షుని రత్నావళి యందలిది.

[ సౌ కు మా ర్య ము ]

అవిష్ఠురత్వం యత్రాస్పదానాః సౌకుమార్యం తదుచ్యతే.

యథా —

'సద్యః పురీపరిసరేఽపి శిరీషమృద్వీ
సీతా జవాత్త్రిచతురాణి పదాని గత్వా
గన్తవ్యమస్తి కియదిత్యసకృద్బ్రువాణా
రామాశ్రుణః కృతవతీ ప్రథమావతారమ్' 103

అత్ర సీతాయాః పురీపరిసరేఽపి కియదస్తి గన్తవ్యమితి వచనం శ్రోత్రాపాతో రామస్య శిరీషమృదుతాసంగాపలోకనేనాశ్రుణోఽవతారః సౌకుమార్యమాహ.

అర్థము : అనిష్ఠురత్వమునే సౌకుమార్య మని యందురు. ఇది లక్షణము. శిరీషపుష్పము యొక్క మృదుత్వమువంటి మృదుత్వము గల సీత వేగముగా మూడు నాలుగడుగులు నడచి పట్టణపరిసరమునందే, అప్పుడే, వెళ్లవలసిన దూర మింకెంత యున్నదని మాటిమాటి కడుగుచున్నదై రామాశ్రు ప్రథమావతారము చేసిన దైనది. ఇది ఉదాహరణము.

ఇచ్చట నగరపరిసరమునందే గంతవ్య మెంత యున్నదన్న సీతావచనము విన్న రామునకు శిరీషమృదువులైన ఆమె యవయవములను గాంచుటచేత కన్నీళ్లు పొడమినవి. అదియే సౌకుమార్యము.

వ్యాఖ్య : నిష్ఠురత్వము లేకుండ నుండుటయే సౌకుమార్యము. మనస్సును కరగించు సన్నివేశమునందు మనసు కరగుటయే సౌకుమార్యము.

ప్రకృతోదాహరణమునందు సీతాసౌకుమార్యమును, తద్దర్శనమున రాముని చిత్తద్రుతిరూప మయిన అశ్రూదయమును వర్ణితము లైనవి. అడవుల కని పట్టు పట్టి వెంటవచ్చినది సీత. ఇంకను నగరమును పూర్తిగా వీడుటయే జరుగలేదు. అప్పుడే ఆమె బడలిపోయినది. మూడు నాలుగడుగుల కొకసారి "యింకెంత దూర మున్నది?" అని అడుగుచున్నది. ఈ సన్నివేశముచేత రాముని సుకుమారహృదయము ద్రవించినది; కన్నులలో అశ్రువులు పొటమరించినవి. ఇది రాముని హృదయసౌకుమార్యమును వెల్లడించుచున్నది. కావుననే, యీ శ్లోకము సౌకుమార్యమున కుదాహరణ మైనది.

ఈ శ్లోకము రాజశేఖరుని బాలరామాయణమునుండి గ్రహింపబడినది.

## [ అర్థవ్యక్తి ]

81. అర్థవ్యక్తిః స్వరూపస్య సాక్షాత్కథన ముచ్యతే.

యథా -

'పృష్ఠేషు శంఖశకల చ్ఛవిషు చ్ఛదానాం
రేఖాభి రంకిత మలక్తక లోహితాభిః
గోరోచనాహరిత బభ్రుబహిఃపలాశ'
మామోదతే కుముద మంభస పల్వలస్య. 104

అత్ర కుముదస్య స్వరూపస్య సాక్షాదివ ప్రతీయమానత్వేన యత్ స్ఫుటరూపాభిధాన మసా వర్థవ్యక్తిః.

అర్థము : స్వరూపముయొక్క సాక్షాత్కథనము అర్థవ్యక్తి యనబడును. ఇది లక్షణము. రేకులయొక్క పృష్ఠభాగములందు శంఖశకలచ్ఛవులు గలిగి, రక్తముక్కవలె ఎఱ్ఱనైన రేఖలతో అంకితమై, గోరోచన వర్ణమును, ఆకుపచ్చరంగును, బూడిదరంగును కల రక్షకపత్రములు కలిగిన కలువ కుంటనీటియందు వాసనల నీనుచున్నది.

ఇచ్చట కుముదస్వరూపము ప్రత్యక్షముగా నున్నట్లు ప్రతీయమాన మగుట చేత స్పష్టరూపాభిధానము జరుగుచున్నది. ఇదియే అర్థవ్యక్తి.

వ్యాఖ్య : స్వరూప మని యనగా స్వీయమైన రూప మని యర్థము. బహిరంగముగా కనిపించు రూపకము గాక కవి ప్రతిభైకగమ్యమై చమత్కారమైన రూపమే యిచ్చట ఉద్దిష్టము. కవి తన ప్రతిభచేత సాక్షాత్కరించుకొనిన వస్తుస్వరూపమును పాఠకునికి ప్రత్యక్షీకరింప జేయగలిగినపుడు అర్థవ్యక్తి యన్న గుణమగును.

ప్రకృతోదాహరణమునందు వికసింపనున్న కలువయొక్క స్వరూపము వర్ణితమైనది. అర్ధవికసిత పత్రములు ఎఱ్ఱని రేఖలను గలిగి యున్నవి. వాని సందులలోనుండి శంఖశకలములవలె తెల్లనికాంతి గల రేకులు గానవచ్చుచున్నవి. విచ్చుకొనని రక్షకపత్రములు గోరోచనాదివర్ణములలో నున్నవి. భిన్నవర్ణత్వమునకు వర్షాతపాదులు కారణము కావచ్చును. ఈ స్థితిలోనైతము, అనగా అర్ధవికసితస్థితిలోనైతము కుముదము వాసనలు చిమ్ముచున్నది. ఇట్లు పూర్తిరూపమును ప్రత్యక్షము గావించినట్లు వర్ణించుటచేతనే, యిది అర్థవ్యక్తికి ఉదాహరణమైనది.

ఈ లక్ష్యము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తినుండి గ్రహింపబడినది.

[ కాంతి ]

కాన్తి ర్దీప్త రసత్వం స్యాత్

యథా -

'మా గర్వ ముద్వహ కపోలతలే చకాస్తి
కాంత స్వహస్త లిఖితా మమ మంజరీతి
అన్యాపి కిం న సఖి భాజన మీదృశానాం
వైరీ న చేద్భవతి వేపథు రన్తరాయః.' 102

అత్ర నాయికాయాః సపత్న్యామీర్ష్యానుబంధేన ప్రతిపాదిత స్య ప్రియతమానురాగలక్షణస్య శృంగారస్య దీప్తరసత్వం కాన్తిః.

అర్థము : దీప్తరసత్వము కాంతి యగును. ఇది లక్షణము. సఖీ! నా కపోలతలమునందే కాంతుడు స్వయముగా రచించిన మంజరి ప్రకాశించు చున్నదని గర్వమొల్లదకుము. కంపము అంతరాయమై శత్రువుకాక యున్నయెడల ఇతర స్త్రీ మాత్రము ఇటువంటి వానికి పాత్రము కాకుండునా? ఇది ఉదాహరణము.

ఇక్కడ సవతి యందలి యీర్ష్యచేత నాయికచేత ప్రతిపాదింపబడిన ప్రియత మానురాగ లక్షణమైన శృంగారముయొక్క దీప్తరసత్వమే కాంతి.

వ్యాఖ్య : 'విభావానుభావ సంచారి సంయోగాద్రస నిష్పత్తిః' అని భరతుని రస సూత్రము. విభావానుభావ సంచారి భావముల సంయోగముచేత రసము నిష్పన్నమగును. తత్తద్భావముల సంయోగముచేత వాసనా రూపమైన స్థాయి రస త్వము నొందును. రసము దీప్తమగుటయే, పరమోత్కర్షను పొందుటమే దీప్త రసత్వము.

ఒక స్త్రీ తన ప్రియుడు తన కపోలములందు చేసిన మంజరీ రచనముచేత గర్వించి యున్నది. ఆ భాగ్యము తన సవతులలో నెవ్వరికిని దక్కక, తనకు మాత్రమే దక్కుట ఆ గర్వమునకు కారణము. ఆమె సవతి ఆ గర్వమును నిలువ నీయ లేదు. తీరికగా కూర్చుండి నీకు మకరికాపత్రరచన చేసినను నాయకుడు శృంగారభావాపన్నుడు కాలేదు. ఇతర స్త్రీలకును ఆతడు మకరికాపత్రరచన చేయుటకు సిద్ధపడును. కాని సాత్త్వికభావమైన వేపథు వుదయించుటచేత, ఆ రచనను చేయలేక పోవును. కావున భర్తమనస్సునందు సాత్త్వికభావము నుదయింపజేయగలవారు గర్వ పడవలయును గాని నీవు గర్వపడరాదు – అని ప్రకృతశ్లోక తాత్పర్యము.

ఇచ్చట శృంగారమునకు సాత్త్విక భావ వర్ణనముచేత దీప్తి కలుగుటచేత దీప్తరసత్వమున్నది. ఇదియే కాంతి. కావుననే యీ శ్లోకము కాంతియన్న వాక్యార్థ గుణమున కుదాహరణ మైనది.

ఈ లక్ష్యము ధనికుని దశరూపకావలోకము నందున్నది.

[ ఉదారత ]

భూత్యుత్కర్ష ఉదారతా.

యథా —

'ప్రాణానా మనిలేన వృత్తి రుచితా సత్కల్ప వృక్షే వనే
తోయే కాంచనపద్మరేణుకపిశే పుణ్యాభిషేక క్రియా
ధ్యానం రత్నశిలాగృహేషు విబుధస్త్రీ సన్నిధౌ సంయమో
యద్వాంఛన్తితపోభిరన్యమునయ స్తస్మిం స్తపస్యంత్యమీ' 106

అత్ర మారీచాశ్రమస్య సత్కల్పవృక్షాదిపదైర్వైభవోత్కర్షస్య ప్రతిపాదన ముదారతా.

అర్థము: వైభవము యొక్క ఉత్కర్షయే ఉదారత. ఇది లక్షణము. సత్కల్ప వృక్షములు గల వనమునందు ఉచితమైన ప్రాణానిలసంచారము; బంగారు పద్మముల పుప్పొడిచేత కపిశమైన జలమునందు పుణ్యాభిషేక కార్యము; రత్నశిలా గృహములందు ధ్యానము; దేవతాస్త్రీల సన్నిధానమునందు సంయమము — తపముల చేత ఇతరమునులు వేనిని వాంఛింతురో, వానియందు (ఆ సర్వకామితములను కలిగి యుండి) వీరు తపస్సు చేయుచున్నారు. ఇది ఉదాహరణము.

ఇచ్చట సత్కల్ప వృక్షాది పదములచేత మారీచాశ్రమముయొక్క వైభవోత్కర్షను ప్రతిపాదనము చేయుటయే ఉదారత.

వ్యాఖ్య: భూతి యనగా వైభవమని యర్థము; ఉత్కర్షయనగా ఔన్నత్యమని యర్థము. లోకాతీతమైన సంపదౌన్నత్యమును వర్ణించుటయే ఉదారత.

ప్రకృతోదాహరణమునందు మారీచాశ్రమము వర్ణితము. అందలిమునులు కల్పవృక్షవనమునందు తపస్సు చేయుదురు. కల్పవృక్షములు దేవజాతివి. వానిని పొంద వలయునన్న బహుకాల తపవఃపుణ్యము మాత్రమే సాధనము. బంగారుపద్మము లున్న సరస్సులలో వారు స్నానములు చేయుదురు. అట్టి సరస్సులు భోగ భూమియైన దేవలోకమునందు మాత్రమే యుండును. రత్నశిలాగృహములలో ధ్యానము చేయుట యన్నది కూడ వైభవ మహత్త్వమునే చాటుచున్నది. దేవతా స్త్రీలు తమ సన్నిధియందే యున్నారట। వారు సన్నిధి యందుండగానే తపస్వులు సంయమముతో తపస్సులు చేయుచున్నారట। తపస్సువలన సాధించు కొనదగిన భోగమ్ములును, కామితములును సన్నిధానములోనే యున్నవనుట సంపదౌన్నత్య మునకు సర్వావధి. కావుననే, యిది ఉదారతా గుణమున కుదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నందలిది.

[ ఉదాత్తత ]

82. ఆశయస్య య ఉత్కర్ష స్తదుదాత్తత్వ మిష్యతే.

యథా –

'పాత్రే పురోవర్తిని విశ్వనాథే
క్షోదీయసి క్ష్మావలయేఽపి దేయే
వ్రీడాస్మితం తస్య తదా తదాసీ
చ్చమత్కృతో యేన స ఏవ దేవః' 107

అత్ర సకల క్ష్మావలయ ప్రదానేఽపి జాతవ్రీడతయా బలే రాశయోత్కర్ష ప్రతిపాదనా దుదాత్తత్వమ్.

**అర్థము** : ఆశయముయొక్క ఉత్కర్ష ఉదాత్తత్వ మనబడును. ఇదిలక్షణము. పాత్రుడై విశ్వనాథుడైన విష్ణువు ముందు నిల్వగా, అల్పాల్పమైన భూమండలము దేయము కాగా అతనికి సిగ్గుచేత చిరునవ్వు కలిగెను. దానిచేత చమత్కృతుడైన యాతడే దేవుడు. ఇది ఉదాహరణము.

ఇచ్చటి సర్వ భూమండలమును దానము చేయుచున్నప్పటికిని సిగ్గునొందుట చేత బలియొక్క ఆశయోత్కర్ష ప్రతిపాదింపబడినది. కావుననే, యిది ఉదాత్తత్వము.

వ్యాఖ్య: ఉన్నతమైన ఆశయమును వర్ణించుటయే ఉదాత్తత్వము. బలి చక్రవర్తి కడకు వామనుడై విశ్వనాథుడు యాచనమునకు వచ్చెను. బలి సర్వభూమండలమును అతనికి ధారవోసెను. అయినప్పటికిని తాను తక్కువ చేయుచున్నట్లుగానే దాతయైన బలి తలపోసెను. అందువల్లనే తాను చేయు దానమువల్ల తనకే సిగ్గు కలిగెను.

విశ్వనాథుడనగా చతుర్దశభువనములకును ప్రభువని యర్థము. అట్టివాడు యాచకుడైనపుడు అతని అర్హతకు తగునట్లో, మించునట్లో దానము చేయవలయును. ఇది బలిచక్రవర్తియొక్క ఆశయము. కాని తాను అల్పాల్పమైన భూమండలమును మాత్రమే దానము చేయగల్గెను. ఆశయ మున్నతమైయుండి, ఆచరణమందు అసహాయు డగుటచేత బలి సిగ్గుచేత చిరునవ్వు నవ్వెను. ఈనవ్వు అతని ఉదారాశయమునకు ప్రతీకము. కావుననే యీ శ్లోకము ఉదాత్తత్వమున కుదాహరణమైనది.

[ ఓ జ స్సు ]

ఓజః స్వాధ్యవసాయస్య విశేషోఽర్థేషు యో భవేత్.

యథా –

'తాన్యేవ యది భూతాని త ఏవ యది శక్తయః
తతః పరశురామస్య న ప్రతీమః పరాభవమ్'. 108

అత్ర పరశురామో విజయత ఏ వేతస్మిన్నర్థే స్వాధ్యవసాయ ప్రతిపాదన మోజః.

అర్థము : స్వీయనిశ్చయముయొక్క అర్థవిశేషమునకు ఓజమని పేరు. ఇదియుదాహరణము. అవియే భూతములున్నయెడల, అవియే శక్తులున్నయెడల ఇంక పరశురాముని పరాభవమున్ను భావింపలేము. ఇది ఉదాహరణము.

ఇచ్చట పరశురాముడే గెలుచును' అన్న యీ విషయమున నిశ్చయము ప్రతిపాదింపబడినది. ఈ నిశ్చయ ప్రతిపాదనమే ఓజము.

వ్యాఖ్య. అధ్యవసాయ మనగా నిశ్చయమని యర్థము. స్వాధ్యవసాయ మనగా వక్తయొక్క నిశ్చయమని యర్థము. వక్త యొక్క నిశ్చయమును కలిగించు కొనుటకు అనేకకారణము లుండవచ్చును. అందలి విశిష్టమయిన కారణమునకు ఓజము అని పేరు.

ప్రకృతోదాహరణమునందు 'పరశురాము డజేయుడు' అన్నది వక్త చేసికొన్న నిశ్చయము. అట్లు నిశ్చయించుటకు హేతువు ఆతని కున్న అస్త్రశస్త్రాదులును, మంత్రతంత్రాదులును. అవన్నియు నాతనిని విడువకుండ నున్నంతకాలము పరశు రాముడు పరాభవమును పొందడు. వేయిచేతులుగల కార్తవీర్యార్జునుడుకూడ అతని పరశ్వాయుధమునకు బలియయ్యెను. పరశువు విశిష్టసాధనము. దానివల్లనే పరశు రాముడు అన్న పౌరుషనామము అతనికి లభించినది. కావున, అది యున్నంతవరకు పరశురామునకు అపజయము లేదన్నది వక్త నిశ్చయము. ఇట్లు వక్త తన నిశ్చయ మును ప్రతిపాదించుటచేతనే ప్రకృత శ్లోకము ఓజోగుణమున కుదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము భవభూతి మహావీరచరితమునుండి గ్రహింపబడినది.

[ ఔర్జిత్యము ]

83. రూఢాహంకార మౌర్జిత్యమ్.

యథా —

'ఉమా వధూర్భవాన్ దాతా యాచితార ఇమే వయమ్
వరః శంభు రలం హ్యేష త్వత్కులోద్భూతయే విధిః' 109

అత్రేమే వయ మిత్యాత్మాన్విత వ్రతచర్యాది సముత్థ ప్రౌఢా హంకారప్రతిపాదనా దౌర్జిత్యమ్.

అర్థము : రూఢమైన అహంకారమే ఔర్జిత్య మనబడును. ఇది లక్షణము. ఉమ వధువు; నీవు దాతవు; అడుగుచున్నవారమో ఈ మేము; వరుడు శంభుడు; నీకుల వైభవమునకు ఈ కార్యము చాలును. ఇది ఉదాహరణము

ఇచ్చట 'ఈ మేము' అనెడి ఆత్మాన్వితవ్రతచర్యాదులచేత పెరిగిన ప్రౌఢా హంకార ప్రతిపాదనమువల్ల, ఇది ఔర్జిత్య మగును.

వ్యాఖ్య : అభిమానమునకే అహంకారమని పేరు. ఇది వాసనారూపమున నుండి తాత్కాలిక నిమిత్తములచేత సూక్ష్మావస్థనుండి ద్వితీయావస్థయైన ఆవిర్భావ దశకు వచ్చును. ఈ ప్రకటావస్థయే రూఢాహంకారత్వము. ఇది నిగూఢముగా నున్నంతవరకు అభిమానము మాత్రమే. ఇది ప్రకాశము నొందినప్పుడే అహంకార మనిపించుకొనును. ఇట్లు ప్రకటింపబడిన అహంకారమే ఔర్జిత్యము.

ప్రకృతోదాహరణమునందు సప్తర్షులు హిమవంతునితో సంభాషించుట వర్ణింప బడినది. వారు ఈశ్వరునికొరకై ఉమను వధువుగా నడుగుటకై వచ్చిరి. ఆ వచ్చిన వారు ఇతరవిషయములతోపాటుగా తమ విశిష్టతను తెలుపుకొనిరి. 'ఈ మేము అడుగుచున్నాము' అనియనుట అహంకార ద్యోతకము. తమ తపశ్శక్తికి, మహత్త్వమునకు అలౌకికత్వమునకు, అనర్ఘత్వమునకు నిరూపకములుగా 'ఈ మేము' అన్న మాటలు ప్రయుక్తములు. ఇట్లు ప్రకటమైన అహంకారమును వర్ణించుటచేతనే, ఇది ఔర్జిత్యమున కుదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము కాళిదాసు కుమారసంభవము లోనిది.

## [ ప్రేయస్సు ]

ప్రేయ స్త్వర్థేష్వభీష్టతా.

యథా –

'రసవ దమృతం కః సందేహో మధూన్యపి నాన్యథా
మధుర మధికం చూతస్యాపి ప్రసన్నరసం ఫలమ్
సకృదపి పునర్మధ్యస్థః సన్ రసాంతరవిజ్ఞ నో
వదతు యదిహాన్యత్స్వాదు స్యాత్ప్రియాదశనచ్ఛదాత్.' 110

అత్రామృత ప్రభృతిభ్యః ప్రియాదశనచ్ఛద స్యాభీష్టతా ప్రతిపాదనం ప్రేయః.

అర్థము : అర్థముల యందలి అభీష్టతయే ప్రేయస్సు. ఇది లక్షణము. అమృతము రసవంతము. సందేహ మేమి? తేనెలు సైతము అన్యవిధములు కావు

ప్రసన్నరసమైన మామిడిపండు కూడ మిక్కిలి మధురమైనదే. ప్రేయసి యధరము కంటె తియ్యనైన వస్తువు మరేదైన నున్నయెడల రసాంతరవిదుడైన జనుడు మధ్య వర్తియై ఒకసారి చెప్పునుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట అమృతము మొదలయిన వానికంటె ప్రియాధరము యొక్క అభీష్టతను ప్రతిపాదించుట ప్రేయస్సు.

**వ్యాఖ్య** : ఐహికవస్తువు లందలి ప్రీతినే లోకవ్యవహారమున ప్రేయస్సు అని యందురు. పారలౌకికవస్తువు లందలి ప్రీతిని శ్రేయస్సు అని యందురు. ఇచ్చట కూడ ప్రీత్యాధిక్యమును ప్రతిపాదనము చేయుటయే విషయము. అనేకవస్తువు లందొక వస్తువు నెన్నికచేసి వక్త తన యభీష్టతను వెల్లడించుటచేత ప్రేయోగుణ మగును.

ప్రకృతోదాహరణమునందు అమృతము, మధువు, చూతఫలము, ప్రియాధరము – అను మధుర పదార్థములలో వక్త అత్యంత మధురమైనది ప్రియాధరమే యని తన యభీష్టతను అభివ్యక్తము చేయుటచేత, ఇది వాక్యార్థగుణమైన ప్రేయస్సున కుదాహరణ మైనది.

లక్ష్యశ్లోకము వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి నుండి గ్రహింపబడినది

[ సుశబ్దత ]

అదారుణార్థ పర్యాయో దారుణేషు సుశబ్దతా.

యథా –

'దేవవ్రతే వాంఛతి దీర్ఘనిద్రాం
ద్రోణేచ కర్ణేచ యశోఽవశేషే
లక్ష్మీశ సహాయస్య తవాద్య వత్స
వాత్సల్యవాన్ ద్రౌణి రయం సహాయః' 111

అత్ర ముమూర్షా మరణాదీనాం దారుణార్థానాం దీర్ఘనిద్రాం వాంఛతి యశోఽవశేష ఇత్యాదిభిః సుశబ్దైః పర్యాయేణ భణనం సుశబ్దతా. సాచ ముఖ్యార్థ వ్యతిక్రమస్య వాక్యార్థత్వా న్న శబ్దగుణః.

'దర్భాంకురేణ చరణః క్షత ఇత్యకాండే
తన్వీ స్థితా కతిచిదేవ పదాని గత్వా
ఆసీద్వివృత్తవదనా చ విమోచయన్తీ
శాఖాసు వల్కల మసక్త మపి ద్రుమాణామ్'. 112

అత్ర గమనే సతి ప్రియజనావలోకనాభిలాషిణ్యాః శకుంతలా యా దర్భాంకురచరణక్షతి వల్కలవ్యాసంగాది వ్యాజావలంబనం సమాధిః.

అర్థము : మిషను ఆధారముగా చేసికొనుటను సమాధి యని యందురు ఇది లక్షణము. తన్వి (శకుంతల) కొన్ని యడుగులు మాత్రమే నడచి దర్భాంకురముచేత పాదము గాయపడినట్లు అకారణముగానే ఆగిపోయినది. చిక్కుపడక పోయినను, నారచీర చెట్లకొమ్మలకు చిక్కుపడగా వదలించుకొనుచున్నట్లు మొగమును వెనుకకు త్రిప్పినది. ఇది ఉదాహరణము.

ఇచ్చట వెళ్ళుచుండగా ప్రియుని చూడవలయునన్న కోరికగల శకుంతల దర్భాంకురముచేత గాయపడుట, నారచీర చిక్కుపడుట మున్నగు నెపముల నవలంబించుటయే సమాధి.

వ్యాఖ్య : వ్యాజము అనగా నెపము అని యర్థము; అనగా మోసమనియే భావము. వ్యాజము నవలంబనము చేసికొని తనపనిని సమర్థించుకొనుట యిచ్చట నుండును. కావుననే దీనిని 'సమాధి' యనెడి వాక్యార్థగుణముగా పేర్కొందురు.

ఉదాహృత శ్లోకమునందు శకుంతలకు దుష్యంతునియందు గల అనురాగము వర్ణితమైనది. పరస్పరాలోకనము, పరస్పరభాషణము మొదలయినవి అనురాగమునకు ఆదిమసోపానములు. కాని ముగ్ధయగు కన్యకు త్రప, సాధ్వసము మొదలయిన చిత్తవృత్తులు సహజన్యములు. సిగ్గునొందెడి ముగ్ధ నాయకుని యెదుట నుండలేదు; అట్లని యాతనిని చూడకుండ నుండలేదు. కావుననే వ్యాజము నవలంబించుట అవసరమగుచున్నది. శకుంతల అచ్చటనుండి వెళ్ళవలసి యున్నది. వెళ్ళకుండనుండుట మర్యాద కాదు. వెళ్ళుటకు మనసొప్పుట లేదు. అందువల్లనే కాలికి ముల్లు గ్రుచ్చుకొన్నట్లు అభినయించి కొంతసేపు ఆగి రాజును చూచినది. తన చీరకొంగు చెట్ల

క్రొమ్మలకు చిక్కుపడగా తప్పించుకొనుచున్నట్లు అభినయించి కొంతసేపు ఆగినది. ఇవి నెపములే కాని నిజములు కావు. కావుననే, ఈ పద్యము సమాధికి ఉదాహరణ మైనది.

ఉదాహృతపద్యము కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలమునుండి గ్రహింప బడినది.

[ సౌక్ష్మ్యము ]

సౌక్ష్మ్య మిత్యుచ్యతే తత్తు యత్ సూక్ష్మార్థాభిదర్శనమ్.

యథా —

'అన్యోన్య సంవలిత మాంసల దన్తకాన్తి
సోల్లాసమావి రలసం వలితార్ధ తారమ్
లీలాగృహే ప్రతికలం కిలికించితేషు
వ్యావర్తమాన వినయం మిథునం చకాస్తి' 113

అత్రాన్యోన్య సంవలిత మాంసల దంతకాంతీత్యాది వాక్యే దంపత్యో రనురాగలక్షణస్యసూక్ష్మార్థస్య దర్శనాత్ సౌక్ష్మ్యమ్.

**అర్థము :** సూక్ష్మార్థమును స్పష్టముగా నిరూపించినయెడల సౌక్ష్మ్యమగును. ఇది లక్షణము. పరస్పరము నల్లుకొనిన అధికమైన దంతకాంతి కలదియు, ఉల్లాసముతో కూడియున్నదియు, అలసత్వము నొందినదియు, అర్ధఘూర్ణములైన కనుపాపలు కలదియు, పరిహరింపబడుచున్న వినయము కలదియు నగు మిథునము కిలికించితములచేత విలాసగృహమునందు ప్రతిక్షణమును ప్రకాశించుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'అన్యోన్య సంవలిత మాంసలదంతకాంతి' మున్నగువాక్యముచేత దంపతులయొక్క అనురాగలక్షణమైన సూక్ష్మార్థముయొక్క దర్శనముచేత, ఇది సౌక్ష్మ్యము.

**వ్యాఖ్య :** సూక్ష్మార్థము అని యనగా సర్వార్థ సార రూపమని యర్థము. ఏకాగ్రమ్ము, శీఘ్ర నిరూపణప్రవణము నైన యర్థమే సూక్ష్మార్థము. తదభివర్ణనమున నే సౌక్ష్మ్యమని పేరు.

ఉదాహరణ శ్లోకమునందు దంపతుల యనురాగ ప్రసంగము కలదు. ఇచ్చట దంతకాంతి మొదలయిన వర్ణనముచేత స్మితము, సల్లాపము, అధరాస్వాదనము మొదలగునవి సూచితము లగుచున్నవి. ఇట్లే సోల్లాస మనుటచేత హర్షము ఔత్సుక్యము మొదలయినవి వెల్లడి యగుచున్నవి. అలసమని యనుటచేత శ్రమము, అంగదౌర్బల్యము మొదలయినవి తెలియుచున్నవి. వలితార్ధతార మనుట చేత పారవశ్యము ప్రకటిత మగుచున్నది. కిలికించితమని యనుటచేత ప్రణయ కలహమును తత్సందర్భజన్యములయిన గర్వ భయ కంప బాష్పాదులును వ్యక్తము లగుచున్నవి. 'క్రోధాశ్రుహర్షభీత్యాదేః సంకరః కిలికించితమ్' అని దశరూపక లక్షణము. క్రోధము, బాష్పము, హర్షము, భయము మొదలయిన వాని మిశ్రణమే కిలికించితము. ఇందు మిథునము ఆలంబన విభావము. లీలాగృహము ఉద్దీపన విభావము. అధరాస్వాదము, అంగక్లమము, స్మితము, కంపము మొదలయినవి అనుభావములు. ఉల్లాసము, హర్షము, ఔత్సుక్యము, వినయాపనయము మొదలయినవి సంచారిభావములు. ఈ విధముగా రతిస్థాయికమైన సంభోగశృంగారము సారరూపముగా వర్ణిత మగుటచేత వాక్యార్థగుణమైన సౌక్ష్మ్యము అగుచున్నది.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

## [ గాంభీర్యము ]

85. శాస్త్రార్థ సవ్యపేక్షత్వం గాంభీర్య మభిధీయతే.

యథా -

'మైత్ర్యాది చిత్తపరికర్మవిదో విధాయ
క్లేశప్రహాణ మిహ లబ్ధసబీజయోగాః
ఖ్యాతించ సత్త్వపురుషాన్యత యాధిగమ్య
వాంఛన్తి తామపి సమాధి భృతో నిరోద్ధుమ్.' 115

అత్రమైత్ర్యాదిపదానాం శాస్త్రార్థ సవ్యపేక్షత్వా ద్గాంభీర్యమ్.

అర్థము : శాస్త్రార్థముయొక్క అపేక్షను గలిగియున్నయెడల గాంభీర్యమని యందురు. ఇది లక్షణము. మైత్ర్యాది చిత్తపరికర్మ విదులై క్లేశప్రహాణ

మును విధించి, సబీజయోగము నొందినవారై సత్త్వపురుషాన్యత్వముచేత ఖ్యాతిని పొందిన సమాధిభృతులు దానిని గూడ నిరోధింపగోరుదురు. ఇది ఉదాహరణము.

ఇచ్చట మైత్రి మున్నగు పదములకు శాస్త్రార్థముయొక్క ఆవశ్యకత్వము వల్ల, ఇది గాంభీర్యము.

వ్యాఖ్య : ప్రతి శాస్త్రమునందును దానికి మాత్రమే పరిమితము లయిన పారిభాషిక పదములు కొన్ని యుండును. ఆ పదములు ఇతర వ్యవహారమునందు కానవచ్చినను ప్రయోగవిధానము నందును, అర్థబోధకత్వమునందును భేదము కలుగును. కావున, సందర్భమునుబట్టి శాస్త్రార్థము అపేక్షిత మైనచోట అన్యార్థమును చెప్పుకొనరాదు. అట్లు చెప్పుకొనుటకు యత్నించినను సక్రమమైన అన్వయము సాధ్యము కాదు; ఉద్దిష్టార్థము గోచరము కాదు. ఇట్టియెడల శాస్త్రమునందు నిరూపిత మైన యర్థమునే చెప్పుకొనవలయును. అట్లు చెప్పుకొనవలసిన యావశ్యకము కలుగునట్లుగా రచనచేసిన యెడల, అది వాక్యార్థగుణమైన గాంభీర్య మగును.

ప్రకృతోదాహరణమునందు సాంఖ్యదర్శనానురూపము లయిన పదములు ప్రయుక్తము లయినవి. లోకవ్యవహారమున మైత్రి యనగా స్నేహమని యర్థము. క్లేశము అనగా కష్టమని యర్థము. యోగము అని యనగా కలిసియుండుట యని కాని, కలిసివచ్చుట యని కాని యర్థము. సత్త్వమునకు బలమని కాని మనసని కాని యర్థము. పురుషుడని యనగా మగవాడని యర్థము. ఈ లౌకికార్థములవల్ల పద్యము సుబోధకము కాదు. సాంఖ్యము ననుసరించి సాధకుల ప్రక్రియ యిందు వర్ణితమయినది. సాంఖ్యమును బట్టి మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష యను నాలుగును చిత్త సమ్మార్జనములు. అవిద్య, స్మితము (గర్వము), రాగము, ద్వేషము, అభినివేశము – అనునైదును క్లేశములు వ్యుత్థానహేతువుల చేత అనాస్కందనీయమైన చిత్తవృత్తి నిరోధము సబీజయోగము. సత్త్వమనగా ప్రధానమని, పురుషుడనగా చిద్రూపుడని యర్థము. ఇట్టివిధముగా శాస్త్రసంబంధమైన యర్థము చెప్పుకొనుట యిచ్చట ఆవశ్యకము. కావుననే, యిది గాంభీర్యమను వాక్యార్థగుణమున కుదాహరణమైనది.

[ విస్తరము ]

విస్తరోఽర్థవికాసః స్యాత్.

యథా –

'సంగ్రామాంగణ మాగతేన భవతా చాపే సమారోపితే
దేవాకర్ణయ యేన యేన సహసా యద్యత్సమాసాదితమ్
కోదండేన శరాః శరైరరిశిర స్తేనాపి భూమండలమ్
తేన త్వం భవతా చ కీర్తిరనఘా కీర్త్యాచ సప్తాబ్ధయః' 115

అత్ర విపక్షువధాత్ సప్తాబ్ధి వ్యాప్తిసీ కీర్తి ర్జితేత్యేతావ తోఽర్థస్య బహువిధం వికాసితత్వాద్విస్తరః.

అర్థము : అర్థవికాసమే విస్తర మగును. ఇది లక్షణము. దేవా! సంగ్రామ రంగమునకు వచ్చిన నీవు ధనుస్సు నెక్కుపెట్టుటతోడనే యేమేమి సాధింపబడినవో వినుము. కోదండముచేత బాణములును, బాణములచేత శత్రుశిరమును' శత్రుశిరము చేత భూమండలమును, భూమండలముచేత నీవును, నీచేత అనఘమైన కీర్తియు, కీర్తిచేత సప్తసముద్రములును సాధింపబడినవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట శత్రువధచేత సప్తసముద్రవ్యాపక మైనకీర్తి ఆర్జింపబడె నన్న యీ మాత్రమైన యర్థమునకు బహువిధమైన వికాసమును కలుగుజేయుటవల్ల' ఇది విస్తరము.

వ్యాఖ్య : ఒకే విషయమును సూక్ష్మాంశములతో వివరించి చెప్పినయెడల, అది విస్తరమన్న వాక్యార్థగుణ మగును.

ప్రకృతోదాహరణమునందు ఒక రాజు శత్రువిజయము చేసి విస్తారమైన కీర్తిని సంపాదించుట ప్రస్తావింపబడినది. ఇంత మాత్రమే చెప్పినను విషయమును విశదము గా చెప్పినట్లే యగును. కాని రచయిత మరింత సూక్ష్మముగా దీనిని పరిశీలించి ఒక క్రమమును గ్రహించి చమత్కారావహముగా తన కథనమును నిర్వహించెను. విల్లు బాణమును సంపాదించిన దని యనగా శరసంధానము జరిగెనని భావము. శరములు శత్రు శిరమును సంపాదించెనని యనగా శిరఃఖండనము చేసెనని భావము. శిరము భూమండలమును సంపాదించెనని యనగా శిరఃపాతము జరిగెనని భావము. భూమండలము నిన్ను సంపాదించెననగా తద్రాజ్యాధిపత్తు డయ్యెనని భావము. దాని వలన నతడు కీర్తిశాలి యయ్యెను. ఆకీర్తియు సర్వదిశలందును వ్యాపించినదయ్యెను. ఇంత విస్తృతముగా వర్ణించినను మొదట ఒక్క వాక్యములో ననుకొన్న భావము

కంటె మిక్కుటముగా నేమియు లేదు. ఇట్లు ఒకవిషయమును విస్తరింపజేసి చెప్పుట వల్లనే, యిది విస్తరమున కుదాహరణ మైనది.

[ సంక్షేపము ]

సంక్షేపస్తస్య సంవృతిః.

యథా –

'శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వాచై వావధార్యతామ్
ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్' 116

అత్ర శాస్త్రే విస్తరప్రతిపాదితస్య ధర్మస్య శ్లోకార్ధేనోక్తత్వా దయ మర్థసంకోచః సంక్షేపః.

అర్థము : అర్థము యొక్క సంకోచమునకే సంక్షేపమని పేరు. ఇది లక్షణము. ధర్మ సర్వస్వమును వినుము. విని అవధరింపుము. తనకు విరుద్ధములైన వానివి పరులయెడల చేయరాదు. ఇది ఉదాహరణము. (నిజమునకు ఉత్తరార్ధము మాత్రమే లక్ష్యము.)

ఇచ్చట శాస్త్రమునందున విస్తరముగా ప్రతిపాదింపబడిన ధర్మమునర్థ శ్లోకముచేత చెప్పుటవల్ల అర్థసంకోచము కలిగినది. ఈ అర్థసంకోచమే సంక్షేపము.

వ్యాఖ్య : ఉద్దిష్టమైన విషయమును సంగ్రహించి క్లుప్తముగా చెప్పుటకే సంక్షేపమని పేరు. ఇది విస్తరమన్న గుణమునకు సరిగా విరుద్ధమైనది.

తక్కువ పదములలో చెప్పదగినవాని నెక్కువ పదములలో చెప్పుట దోషము. అట్లే ఎక్కువ పదములలో చెప్పదగిన దానిని తక్కువ పదములలోనికి సంకుచింపజేయుటయు దోషమే. కాని సందర్భమును బట్టివిస్తరణము కాని, సంగ్రహణముకాని సౌందర్యపోషక మైనయెడల గుణముగానే పరిణమించును.

ప్రకృతోదాహరణమునందు ధర్మస్వరూపము సంగ్రహింపబడినది. 'నీకు కష్టములైన వానిని పరులకు చేయకుము' ఇది ధర్మసారము. ఎన్నో గ్రంథములలో

సిద్ధాంతరాద్ధాంతములతో, వాదోపవాదములతో, లక్ష్యలక్షణములతో గహనముగా చెప్పబడిన ధర్మస్వరూపము ఇచ్చట నగముశ్లోకములో చెప్పబడినది. ఈ విధమైన సంగ్రహణముండుట వల్లనే, యిది సంక్షేపమున కుదాహరణమైనది.

[ సమ్మితత్వము ]

86. శబ్దార్థా యత్ర తుల్యాస్తః సమ్మితత్వం తదుచ్యతే.

యథా -

'ఇందుర్మూర్ధ్ని శివస్య శైలసుహితుర్వక్రో నఖాంకః స్తనే
దేయాద్వోఽభ్యుదయం ద్వయం తదుపమా మాలంబమానం మిథః
సంవాదః ప్రణవేన యస్య దలతా కాయైకతాయాం తయో
రూర్ధ్వద్వార విచింతితేన చ హృది ధ్యాతః స్వరూపేణ'. 117

అత్ర ప్రణవలక్షణ స్యార్థస్య తుల్యత్వేన యథావ ద్విభజ్య వినివేశనం సంమితత్వమ్.

అర్థము : శబ్దార్థములు తుల్యముగా ప్రయుక్త మగునెడల దానిని సమ్మితత్వమని యందురు. ఇది లక్షణము. శివుని మూర్ధమున చంద్రుడు; పార్వతీ స్తనమున వక్రనఖాంకము. రెండును పరస్పరము ఉపమానత్వమును పొందుచున్నవి. ఆ యిరువురి శరీరైక్యమునందు వికసించుచున్న ఊర్ధ్వద్వారమునందు చింతింపబడుచున్న ఓంకారముతోను; హృదయమునందు ధ్యానింపబడుచున్న స్వరూపముతోను సంవాదముగల ఆ జంట మీకు అభ్యుదయమును గూర్చునుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట ప్రణవలక్షణమును, అర్థమును పై విధముగా విభజించి తుల్యత్వముతో ప్రయోగించుటయే సమ్మితత్వము.

వ్యాఖ్య : ఉద్దిష్టమైన శబ్దమునకు తుల్యమైన అర్థమును భావించి యుపయోగించుటయే వాక్యార్థగుణమైన సమ్మితత్వము.

ప్రకృతోదాహరణమునందు ప్రణవస్వరూపము చిత్రితమైనది. ప్రణవము పార్వతీపరమేశ్వర సంయోగాత్మకరూపము. ప్రణవచింతనమును మూర్ధము చేయును. ప్రణవధ్యానమును హృదయము చేయును. శివుని శిరస్సున నున్న చంద్రరేఖ ప్రణవ చింతనమునకు ప్రతీకము, పార్వతీ స్తనమున నున్న నఖ వక్రరేఖ ప్రణవ ధ్యానమునకు ప్రతీకము. ఇవి రెండును పరస్పరము సామ్యము నొందుచున్నవి. ఓంకార స్వరూపమును తత్స్వభావమును విభజించి తుల్యశబ్దార్థములతో ప్రతిష్ఠించుటచేత, ఈ పద్యము సమ్మితత్వమున కుదాహరణమైనది.

[ భా వి క త్వ ము ]

సాభిప్రాయో క్తివిన్యాసో భావికత్వం నిగద్యతే.

యథా –

'దృష్టిం హే ప్రతివేశిని క్షణమిహాప్యస్మద్గృహే దాస్యసి
ప్రాయేణాస్య శిశోః పితా న విరసాః కౌపీరపః పాస్యతి
ఏకాకిన్యపి యామి తద్వరమితః స్రోతస్తమాలాకులం
నీరంధ్రా స్తను మాలిఖన్తు జరఠచ్ఛేదా నలగ్రంథయః' 118

అత్ర తమాలమాలానలయిత సరిత్తీరకృతసంకేతాయాః కులటాయాః స్వతనౌ భావినాంపరపురుషనఖక్షతానాం నలగ్రంథ్యాలేఖ వ్యాజగోపనేన సాభిప్రాయభణనం భావికమ్.

అర్థము : సాభిప్రాయమైన ఉక్తివిన్యాసమును భావికత్వమని యందురు. ఇది లక్షణము. ఓ నేస్తురాలా! (పొరుగింటిస్త్రీ) ఒక క్షణము సేపు మాయింటివైపు గూడ నీ చూపును రానీ! ఈబిడ్డతండ్రి చప్పనైన నూతినీటిని త్రాగడు. ఒకతెనే యైనను చీకటిమ్రాకులతో చీకాకుగానున్న యేటికే పోవుచున్నాను. అదేమంచిది. పొత కొయ్యలు దట్టముగానుండి నా శరీరమునందు గీసికొననిమ్ము. ఇది ఉదాహరణము.

ఇచ్చట చీకటిమ్రాకుల నడుమనున్న సరిత్తీరమును సంకేతస్థలముగా చేసికొనియున్న కులట యికముందు తన శరీరముపై కనిపింపబోవు పరపురుషరచిత

నఖక్షతములను గడ్డికొయ్యల గీతలన్నమిషతో దాచుటచేత సాభిప్రాయోక్తి. ఈ సాభిప్రాయమైన ఉక్తియే భావికత్వము.

వ్యాఖ్య : బహిరంగముగా నున్న యభిప్రాయమును మాత్రమేకాక, వేరొక యభిప్రాయము నాంతరంగికముగా నుంచుకొని చెప్పినవాక్యమును భావికత్వమని యందురు.

ప్రకృతోదాహరణమునందు ఒకకులట పొరుగింటి స్త్రీతో ప్రసంగించుట వర్ణితము. ఆ సమయమున తనభర్త యింటియందే యుండియుండును. తనభర్త నూతి నీటిని త్రాగడు కావున భర్తకొరకే ఏటినీటికై తాను పోవుచున్నట్లు చెప్పుటచేత అత డభ్యంతరపెట్టుట కవకాశము లేదు. కాని తిరిగివచ్చిన పిమ్మట తన శరీరము మీద నఖక్షతములును, దంతక్షతములును కానవచ్చును. ఆ విషయమునకు పైతము ముందుగానే కల్పనము చేసి యుంచుట యవసరము. కావుననే, ఆ స్థలము చీకటి ప్రాకులతో నిండియున్నదని, త్రోవలో దట్టముగా గ్రుచ్చుకొను గడ్డికొయ్య లున్న వని చెప్పుచున్నది. గడ్డికొయ్యలు గ్రుచ్చుకొనుటవల్ల నైన గాయములే కాని నఖక్షతములు నఖక్షతములు కావని యనుటకు వీలు కల్పించుకొన్నది. ఇట్లు మనసులో నున్న యభిప్రాయము వేరై, పైకి వెల్లడియగు నభిప్రాయము వేరై యుండుట చేతనే, యిచ్చట సాభిప్రాయమైన ఉక్తివిన్యాస మున్నది. కావుననే, యిది భావికత్వమున కుదాహరణమైనది.

ఉదాహరణ శ్లోకము ధనంజయుని దశరూపకము నందలిది.

[ గతి ]

87. గతిః సా స్యా దవగమో యోఽర్థాంతరస్య తు.

యథా -

'శుభే కోఽయం వృద్ధో గృహపరివృఢః కిం తవ పితా
స మే భర్తా రాత్రౌ వ్యపగతదృగన్యచ్చ బధిరః
హుహుహుంహుం శ్రాంతోఽహం శిశయిషు రిహైవాపవరకే
క్వ యామిన్యాం యాసి స్వపిహి నను నిర్ధంశమశకే' 119

అత్ర ప్రశ్నా దర్థ మవగమ్య ఉత్తరా దర్థాంతరావగమో గతిః.

అర్థము : అర్థమువల్ల అర్థాంతరము తోచినయెడల, అది గతి యగును. ఇది లక్షణము. 'కల్యాణీ! ఈ వృద్ధు డెవరు?' 'ఇంటియజమానుడు.' 'మీ తండ్రియా?' 'కాదు; నా భర్త; రాత్రి కనులు కానరావు; చెవిటివాడు కూడ.' 'అయ్యాయ్యో! అలసి పోయితిని; ఇక్కడనే పండుకొనవలయునని యున్నది.' 'రాత్రివేళ ఎక్కడికి పోవుదువు? దోమలు కుట్టని లోపలిగదిలో పండుకొందువులే!' ఇది ఉదాహరణము.

ఇచ్చట ప్రశ్నవల్ల అర్థము గ్రహించి, సమాధానమువల్ల అర్థాంతరమును అవగాహనము చేసికొనుట గతి యన్న వాక్యార్థగుణము.

వ్యాఖ్య : వాక్యశృంఖలవల్ల అర్థాంతరము పొడచూపుట యిచ్చట విషయము.

భావికత్వమునందు సైతము అర్థాంతరము పొడచూపుట కలదు. కాని, అచ్చట అర్థాంతరమే ఉద్దిష్టము. ఆ యభిప్రాయమును మనసులో నుంచుకొనియే వక్త ప్రసంగించుట జరుగును. గతియందు ప్రశ్నోత్తర రూపమున కొంత సంభాషణ ముండును. మొదటి ప్రశ్నలలో అర్థము సూటిగానే యుండును, అర్థాంతర స్ఫురణ ముండదు. క్రమముగా సంభాషణము చిగురు తొడుగు సరికి అర్థాంతరము తల యెత్తును. ప్రశ్నోత్తర శృంఖలారూపమున నుండుట గతికి ముఖ్యము.

ప్రకృతోదాహరణమునందు ఒక బాటసారికి ఒక యువతికి జరిగినసంభాషణము ప్రదర్శితము. వృద్ధుడెవరు? నీ తండ్రియా? అను ప్రశ్నలపరకు అర్థాంతరమున కవకాశము లేదు. యువతి అతడు తన భర్తయని, రేజీకటియు బధిరత్వము నతనికి కలవని చెప్పినప్పటినుండి సంభాషణక్రమము అర్థాంతరమును పొదువుకొన్నది. ఇట్లు సంభాషణ గతినిబట్టి అర్థాంతరము కలుగుటచేత గతియన్న పేరు ఈ గుణమునకు సార్థకముగా నున్నది.

[ రీతి ]

రీతిః స్యా దయ స్త్వపార్థానా ముత్పత్త్యాది క్రియాక్రమః.

యథా—

'ప్రథమ మరుణచ్ఛాయ స్తావ త్తతః కనకప్రభ
స్తదను విరహోత్తామ్య త్తన్వీ కపోలతలద్యుతిః
ప్రభవతి పునర్ధ్వాంత ధ్వంసక్షమః క్షణదాముఖే
సరస బిసినీ కంద చ్ఛేదచ్ఛవి ర్మృగలాంఛనః. 120

అత్రోదయాదారభ్య చంద్రస్యోత్పత్త్యాదిక్రియాక్రమో రీతిః.

**అర్థము :** అర్థముల (వర్ణ్యముల) యొక్క ఉత్పత్త్యాది క్రియాక్రమమును వర్ణించునెడల రీతియని యందురు. ఇది లక్షణము. మొదట ఎఱ్ఱని రంగు కలిగి, ఆ పిమ్మట బంగారు రంగును కలిగి, ఆ పిమ్మట విరహతప్తయైన తన్వీకపోలకాంతి వంటి కాంతిని కలిగి, చీకట్లను ధ్వంసము చేయగల సామర్థ్యమును కలిగి, సరస మైన తామరదుంపను కోయగా ఏర్పడిన రంగువంటి రంగుతో నిశాముఖమున మృగ లాంఛనుడైన చంద్రుడు ఉదయించుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఉదయారంభము నుండి ఉత్పత్తిపర్యంతము క్రియాక్రమమును వర్ణిం చుట చేత, ఇది రీతి.

**వ్యాఖ్య :** క్రమమునకే రీతి యని పేరు. వర్ణ్యవిషయమును క్రమపరిణామ ముగా వర్ణించినయెడల రీతియన్న వాక్యార్థగుణ మగును.

ప్రకృతోదాహరణమున చంద్రోదయము వర్ణితము. చంద్రుడు తొలుత ఎఱ్ఱగా నుండును. క్రమముగా రంగులు మార్చుకొని మార్చుకొని తామరదుంపలోపలి రంగు వంటి రంగును పొందును. అప్పటికి మృగచిహ్నముకూడ స్పష్టముగా కానవచ్చును. ఈ దశల నన్నింటిని క్రమముగా వర్ణించుటచేతనే యీ శ్లోకము రీతికి ఉదాహరణ మైనది.

## [ ఉక్తి ]

88. ఉక్తిర్నామ యది స్వార్థో భంగ్యా భవ్యోఽభిధీయతే.

యథా -

'త్వమేవం సౌందర్యా స చ రుచిరతాయాం పరిచితః
కలానాం సీమానం పరమిహ యువామేవ భజథః
అపి ద్వంద్వం దిష్ట్యా తదితి సుభగే సంవదతి వా
మతః శేషం చేత్ స్యాజ్జితమిహ తదానీం గుణితయా' 121

అత్రాభీష్టస్య నాయక నాయికా సంగమస్య భంగ్యా భణన ముక్తిః.

అర్థము : ఉద్దిష్టము మనోహరము నైన యర్థము భంగ్యంతరముగా చెప్ప బడిన ఉక్తి యనబడును. ఇది లక్షణము. నీ విటువంటి అందగత్తెవు. అతడు మనోహరత్వమునందు ప్రసిద్ధుడు. కళలయొక్క పరమసీమను మీ యిరువురే భజించు చున్నారు. మీ యిరువురి జంట భాగ్యవశమున సదృశమై యున్నది. ఇంక మిగిలినది కూడనైనచో అప్పుడు గుణత్వముచేత ఈ లోకము జయింపబడినట్లే. ఇది ఉదాహరణము.

ఇచ్చట అభీష్టమైన నాయికానాయక సంగమమును మార్గాంతరమున చెప్పుటయే ఉక్తి.

వ్యాఖ్య : చెప్పదలచిన విషయమును భంగ్యంతరముగా సౌందర్య పోషకముగా చెప్పిన యెడల, దానిని ఉక్తియని యందురు. ఉక్తిచమత్కారమే ఉక్తి యని భావము.

నాయికానాయకుల యోగ్యతను గూర్చి ప్రస్తుతపద్యము ప్రసక్తము. 'మీ రిర్వురును పెండ్లి చేసికొనుడు' అని చెప్పుటయే ప్రకృతాంశము. అయినను దాని నట్లు చెప్పక మార్గాంతరమున చెప్పుట యిందు కాన నగును. మొదట 'నీవు' 'అతడు' అని వేరువేరుగానే పలికి, పిమ్మట 'మీ యిరువురు' అని కలిపి పలుకుట యొకనేర్పు. ఆ పిమ్మట 'మీ జంట' యని యనుట ఏకత్వమునకే నిరూపకము. ఈ విధమైన ప్రయోగముల చేతనే ఉద్దిష్టభావము ఉదారముగా వెల్లడి యగుచున్నది. చివరిపాదమున 'మిగిలినదికూడ నైనచో' అని యనుట పరమ ప్రయోజనమైన పరిణయమునకు ప్రోత్సహించుటయే. అయినను, ఆ మాటను వాడకుండ వ్యంజింప జేయుటయే జరిగినది. ఇట్లు భంగ్యంతరముగా మనోహరార్థమును చెప్పుట చేత ప్రకృత పద్యము ఉక్తికి ఉదాహరణ మైనది.

ఉదాహరణపద్యము భవభూతి మాలతీమాధవమునుండి గ్రహింప బడినది.

[ ప్రౌ ఢి ]

వివక్షితార్థ నిర్వాహః కావ్యే ప్రౌఢి రితి స్మృతా.

యథా -

'తద్వక్త్రేందు విలోకనాకులధియా ధాత్రా త్వదీయాంశ్రియః
నిక్షిప్య ప్రతిరాజకేషు విదుషాం లక్ష్మ్యా త్వమాపూరితః
తేనైతే నియతం దరిద్రతి గృహేష్వేషామియం దృశ్యతే
నైనా మాద్రియసేత్వమిచ్ఛసినుతాం త్వామేవ సా ధావతి'122

అత్ర త్వద్వక్త్ర విలోకనాకులేన ధాత్రా త్వదీయా లక్ష్మీః శత్రుషు నిక్షిప్య విదుషాం చ లక్ష్మీస్త్వయ్యారోపితా. అత స్త్వం విపక్షలక్ష్మీ మాద్రియసే సా చ త్వా మనుధావతి. యా చ విదుషాం లక్ష్మీ స్తయా త్వమాపూరిత స్తేన తే దరిద్రాః అతఏవ త్వమేనాం నాద్రియసే. ఇయం చ విద్వద్గేహేష్వేవ దృశ్యతే ఇత్యేతావతః ప్రభూతస్యార్థ స్యానేన వాక్యేన ప్రతిపాదితత్వా ద్వివక్షితార్థ నిర్వాహణం ప్రౌఢిః.

**అర్థము** : కావ్యమువందు వివక్షితార్థనిర్వహణమునే ప్రౌ ఢి యని యందురు. ఇది లక్షణము. నీ ముఖ చంద్రదర్శనముచేత కలతపడిన బుద్ధితో విధాత నీ లక్ష్మిని శత్రురాజులందుంచి, పండితలక్ష్మిచేత నిన్ను నింపి యున్నాడు. అందుచేతనే పండితులు నిత్యదరిద్రులై యున్నారు. వీరి యిండ్లయందు ఈమె కనబడుచున్నది. నీ వీమె నాదరింపవు. నీ వామెనే కోరుదువు. ఆమెయు నీ వెంటనే బడుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట నీ ముఖవిలోకనాకులుడైన ధాతచేత నీ లక్ష్మి విరోధులందు నిక్షిప్తమై పండితలక్ష్మి నీయందారోపిత మైనది. అందువల్లనే నీవు శత్రులక్ష్మి నాదరించు చున్నావు. అది కూడ నీ వెంట పడుచున్నది. ఇంక పండితలక్ష్మి చేత నీవు పూరింప బడితివి. అందువల్ల వారు దరిద్రులయిరి. అందుచేతనే నీవు దీని నాదరించుట లేదు.

ఇది విద్వద్గేహములందే కనబడుచున్నది —అన్న యింతటి అధికమైన యర్థమును ఈ వాక్యముచేత ప్రతిపాదించుటవల్ల వివక్షితార్థ నిర్వహణము జరిగినది. కావుననే ఇది ప్రౌఢి.

వ్యాఖ్య : కవి తానుద్దేశించిన విస్తృతమైన యర్థమును, స్వల్పవాక్యముతో సమర్థముగా అభివ్యక్తము చేయుటకే ప్రౌఢి యని పేరు. 'అల్పపదముల ననల్పార్థరచనయే ప్రౌఢి. ఇది వాక్యార్థగుణము.

ప్రకృతోదాహరణమునందు ఒకరాజు ప్రశంసింప బడుచున్నాడు. ఆతని సౌందర్యమును, శౌర్యమును, జయశీలమును, సంపదను, పండితపక్షపాతమును, దాతృత్వమును ప్రశంసించుట ఉద్దిష్టవిషయము. దీనిని, మార్గాంతరమున తక్కువ మాటలలో నిర్వహించుట యిచ్చట కాననగును. 'నీ ముఖవిలోకనాకులత్వము' అని యనుటచేతనే అతని అనుపమాన సౌందర్యము వ్యక్తమగుచున్నది. సృష్టికర్తయగు బ్రహ్మయే కలతపడినట్లు చెప్పుట తత్సౌందర్యము అనిదంపూర్వమని ధ్వనింప జేయుటయే. ఆ కలతపడిన బుద్ధివల్ల బ్రహ్మ పొరపాటు చేసెనట! ఈతనిని సృజించుటకై యేర్పరచుకొన్న 'లక్ష్మి' యను ద్రవ్యమును శత్రురాజులందు నిక్షేపించెను. ఆ లోపమును గుర్తించుకొని తత్పూరణమునకై పండితుల లక్ష్మిని తీసికొని ఆతనిని పూరించెను. పండితులు లక్ష్మిని కోలుపోవుటచేత దరిద్రులైరి. కావున రాజునకు పండితుల లక్ష్మియం దాసక్తి లేదు. కావుననే ఆ లక్ష్మి వారి గృహములకే పంపబడినది; అందేయున్నది. దీనివలన రాజుయొక్క పండితపక్షపాతమును దాతృత్వమును వెల్లడి యగుచున్నవి. రాజు తనదై తనకు చెందక, శత్రురాజులందున్న లక్ష్మియందు ఆసక్తి కలిగి యున్నాడు. ఆమెయు నాతని వెంటబడుచున్నది. దీనివల్ల రాజు శత్రువులను జయించుటయు వారి సంపదలను స్వాధీనము చేసికొనుటయు వెల్లడి యగుచున్నవి. ఇట్లు అనల్పమైన యర్థమును అల్పపదములలో నిమిడించి సమర్థముగా చెప్పుటచేత ఈ శ్లోకము ప్రౌఢికి ఉదాహరణమైనది.

ఇప్పుడింక రచయిత వైశేషిక గుణములను తెలుపుచున్నాడు.

## [ వైశేషిక గుణములు ]

89. పదాద్యాశ్రిత దోషాణాం యే చానుకరణాదిషు
గుణత్వాపత్తయే నిత్యం తేఽత్ర వోమగుణాః స్మృతాః

90. త్రివిధా అపి తే భూయశ్చతుర్వింశతిధా బుధైః
ప్రోక్తా యథా గుణత్వేన ప్రవిభజ్య తథోచ్యతే.

**అర్థము** : పదాద్యాశ్రిత దోషములకు అనుకరణాదులందు నిత్యముగా గుణమును కలిగించుటకై వచ్చువానిని దోషగుణములని యందురు. ఇవి మూడు విధములేయైనను గుణత్వమునుబట్టి విభజించి వానిని విబుధులు ఇరువదినాలుగు విధములుగా చెప్పుదురు.

**వ్యాఖ్య** : దోషములను పదము, వాక్యము, — అనువాని ఆశ్రయముచేత మూడు వర్గములుగా విభజించితిమి. అందు ఒక్కొక్క వర్గమును మరల పదునారు విభాగములు చేసితిమి. పద దోషములలో చివరిదైన గ్రామ్యము అశ్లీలార్థము, అసభ్యార్థము అమంగళార్థము అని మరల మూడువిధములు. కాబట్టి పద దోషములు మొదటి పదునైదును, చివరి తొమ్మిదియు కలియగా ఇరువది నాలుగగును.

వాక్య దోషములు పదునారు చెప్పుకొంటిమి. అందు చివరిదైన అరీతిమంతము మరల తొమ్మిది విధములుగా నగును. కావున మొత్తముమీద నివియు, ఇరువది నాలుగు విధములగును.

వాక్యార్థ దోషములు కూడ పదునారే. అందును చివరిదైన విరుద్ధము మరల తొమ్మిది విధములగును. మొత్తముమీద ఇవియు ఇరువది నాలుగే యగును.

గ్రంథకర్త గుణములను బాహ్యములు, ఆంతరములు, వైశేషికములు అని మూడు వర్గములుగా విభజించి, మరల ఒక్కొక్కటి ఇరువది నాలుగు విధములని పరిగణించెను. ప్రకృతము దోషములే గుణములుగా పరిగణింపబడుట విషయము. అట్టివానినే దోషగుణములని కాని వైశేషిక గుణములని కాని యందురు. గుణసంఖ్యానము నందుతన ప్రణాళిక కనుకూలముగా తక్కిన వానితో పాటుగా, వైశేషిక గుణములను కూడ ఇరువదినాలుగుగా పరిగణించెను. అందువల్లనే దోషసంఖ్యానము నందు ప్రత్యేక పరిగణనము లేని అవాంతరభేదములను గూడ గుణసంఖ్యానము నందు ప్రత్యేకముగా పరిగణించుట ఆవశ్యకమైనది.

[ అ సా ధు తా గు ణ ము ]

91. యా క్లిష్ట మ్లేచ్ఛితాదీనాం పదదోషేష్వసాధుతా
నిరూపితానుకరణే గుణత్వం సా ప్రపద్యతే.

యథా —

'ఉన్నమయ్య సకచగ్రహ మాస్యం
చుంబతి ప్రియతమే హఠవృత్త్యా
హుంహు ముంచ మమమేతి చ మందం
జల్పితం జయతి మానవతీనామ్' 123

అత్రతు హుంహు మమమేత్యసాధ్వోరపి క్లిష్టమ్లేచ్ఛితయో రనుకరణత్వాద్ గుణత్వమ్.

అర్థము : క్లిష్టమ్లేచ్ఛితాదులను పదదోషములలో అసాధుత యను దోషముగా పరిగణించుట జరిగినది. అది అనుకరణమందు గుణత్వమును పొందును. ఇది లక్షణము. ప్రియతముడు మొండితనముగా జుట్టు పట్టుకొని మొగమును పైకెత్తి ముద్దు పెట్టుకొనుచుండగా 'హుంహు' 'ముంచ' 'మమమ' అని పల్లగా ననెడి మానవతుల జల్పనము జయించును — ఇది ఉదాహరణము.

ఇచ్చట హుంహు, మ మ మ అను క్లిష్టమ్లేచ్ఛితములు అసాధువులే అయినప్పటికి అనుకరణమువల్ల గుణత్వము కలిగినది.

వ్యాఖ్య : 'లుప్తైకదేశం క్లిష్టమ్' పదమునందలి కొన్ని వర్ణములు లోపించినయెడల దానిని క్లిష్టమని యందురు. 'అవ్యక్తరూపం మ్లేచ్ఛితమ్' చెప్పదలచిన దానిని స్పష్టముగా చెప్పనియెడల దానిని మ్లేచ్ఛితమని యందురు. ఈ రెండును అసాధుత యన్న దోషముగా పరిగణింపబడును. అనుకరణమునందు వీనిని ప్రయోగించినచో అవి దోషభాజనములు కావు. పైగా స్వభావసుందరము లగుటచే గుణవంతము లగును. అసాధుత దోష మయ్యును అనుకరణమునందు సాధువగుటచేతనే వైశేషికగుణముగా గణన కెక్కినది.

ప్రకృతోదాహరణమునందు మానవతీచుంబనప్రసంగము కలదు. 'మానవతీ నామ్' అని యనుటచేత తాత్కాలికముగా ప్రియుని సన్నిధానమునందే వియోగము నందుచున్న స్త్రీలు భావింపబడుచున్నారు. భర్తకు విముఖముగా నుండుటచేతనే బలాత్కారముగా చుంబించుట సంభవించినది. అట్టియెడల ఆమె 'విడిచిపెట్టు' మని యడుగుట స్వాభావికము. కాని కృత్రిమికోపముచేత కలిగిన విముఖత్వ మగుటచేత ప్రియు డట్లుచేయుట తన కిష్టమే. ఇట్టియెడ వెలుపడు మాటలుఅరకొరగా,అస్పష్టములుగా నుండుటయే అందము. 'హూంహూం' అన్నప్పుడు తిరస్కారభావము ద్యోతిత మగును. కాని యిక్కడ రెండవయక్షరమున బిందువు లోపించి పోయినది. పద్రైక దేశమునకే ప్రయోగము కాబట్టి యిది క్లిష్టము. 'ముంచ' అనగా విడిచిపెట్టు మని యర్థము. ఇది స్పష్టముగానే యున్నది. 'మమమ' అన్న యక్షరములు అస్పష్టములు. 'ముంచ మామ్' నన్ను విడువుమన్న యర్థమున వాడబడినవో, 'ముంచ మా' నన్ను విడువవద్దు అన్న యర్థమున వాడబడినవో' 'ముంచ మమ' నాయొక్క అని చెప్పి యింకేమేని అనదలచినట్లు ప్రయుక్తములో చెప్పుటకు వీలుకాదు. ఈ విధమైన అవ్యక్తతవల్లనే యివి మ్లేచ్ఛితములుగా పరిగణింపబడును. ఈ రెండును మానవతుల విలాససందర్భము నందలివిగా అనుకరింపబడుటచేత గుణత్వమునే పొందుచున్నవి. అందువల్లనే ప్రకృతశ్లోకము అసాధుతాగుణమున కుదాహరణమైనది.

ఉదాహృతశ్లోకము సుభాషితావళియందు విజ్జిక రచనగా గుర్తింపబడినది.

## [ అప్రయుక్తగుణము ]

గుణత్వ మప్రయుక్తస్య తథానుకరణే భవేత్.

యథా -

'దివం పత్కాషిణో యాన్తి యేఽచీకమత భాషిణః
పత్కాషిణోఽపి నో యాన్తి యే వచన్తి ప్రయుంజతే' 124

అత్రాచీకమత వచన్తీత్యాది పదానాం కవిభి రప్రయుక్తానామప్యనుకరణత్వాద్ గుణత్వమ్.

అర్థము : అప్రయుక్తదోషమునకు అనుకరణమందు గుణత్వము కలుగును. ఇది లక్షణము. అచీకమతభాషులైన పత్కాషులు స్వర్గమునకు పోవుదురు. పత్కాషులయినను పచన్తి ప్రయోగించువారు పోరు. ఇది ఉదాహరణము.

ఇచ్చట కవులచేత అప్రయుక్తము లైనప్పటికిని అచీకమత, వచన్తి మొదలయిన పదములకు అనుకరణత్వమువల్ల గుణత్వము కలుగును.

వ్యాఖ్య : కవులచేత ప్రయుక్తము కానిదానిని అప్రయుక్తము అనియందురు. అది దోషమే. అనుకరణమునందు అప్రయుక్తపదములను వాడుట గుణమే యగును.

ప్రకృతోదాహరణమునందు పరిహాసకుశలు డొకడు అప్రయుక్తప్రయోక్తలను పరిహసించుట కానవచ్చును. 'పత్కాషిణః' అన్నది 'పాదములను త్రొక్కుకొనువారు' అను నర్థమున నూత్నకల్పనము. 'పాదం కషన్తీతి పత్కాషిణః' అని కల్పితము. పూర్వకవిప్రయోగారూఢము కాదు. 'అచీకమత' అన్నది కమిధాతువునకు ప్రథమపురుష బహువచనరూపముగా కల్పితము. 'ప్రేమించిరి' అన్నది యర్థము. 'వదన్తి' అన్న రూపము సామ్యమున వచన్తి, అను రూపము 'చెప్పుచున్నారు' అన్న యర్థమున కల్పితము. పై రూపములు పూర్వకవిప్రయోగారూఢములు కాక పోవుటచేత అప్రయుక్తము అన్న దోషమునకు పాత్రములు. కాని ప్రకృతోదాహరణమునందు అప్రయుక్తప్రయోక్తల ననుకరించుచు సమర్థుడగు వక్త వాడుటచేత స్వభావానుగుణత్వముచేత గుణత్వమునే పొందుచున్నవి. కావుననే ప్రకృతశ్లోకము అప్రయుక్తగుణమున కుదాహరణ మైనది.

[ కష్ట గుణము ]

92. యచ్ఛ్రుతే ర్నీరసం కష్టం తస్య దుర్వచకాదిషు
గుణత్వ మనుమన్యన్తే సానుప్రాసస్య సూరయః.

యథా —

'త్వాష్ట్రి స్త్వాష్ట్రిరి రాష్ట్రే నాదంష్ట్రిణో జనాః
ధార్తరాష్ట్రాః సురాష్ట్రే న మహారాష్ట్రే చ నోష్ట్రిణః' 125

అత్ర శ్రుతివిరసత్వాత్ కష్టత్వేఽపి దుర్వచకత్వాద్గుణత్వమ్.

అర్థము : చెవికి విరసముగా నున్న శబ్దమువల్ల కష్టమన్న దోషము కలుగును. కాని అదియే దూషణాది వాక్యములందు అనుప్రాసయుక్తమై గుణత్వము నొందునని పండితు లందురు. ఇది లక్షణము. రాక్షసులు రాక్షసవిరోధియైన యింద్రుని రాజ్యమున లేరు. భ్రాష్ట్రము (సెనగలు మొదలగువానిని తినెడిచోటు) నందు దంతహీనులయిన జనులు లేరు. సురాష్ట్రమునందు ధార్తరాష్ట్రులు లేరు. మహారాష్ట్రమునందు ఒంటెలను గలవారు లేరు. ఇది ఉదాహరణము.

ఇచ్చట శ్రుతివిరసత్వముచేత కష్టత్వమునందును దుర్వచకత్వమువల్ల గుణత్వము కలదు.

వ్యాఖ్య : దుర్వచనము అని యనగా పరుషప్రయత్నముగల వచనమని యర్థము. దుర్వచకుడు అని యనగా కృత్రిమభాషాభాషణము చేయువాడు. కృత్రిమ 'స్వభావుని యొక్క స్వభావచిత్రణమునందు శ్రుతివిరసములైన పదములు గుణత్వమునే సంధానించును. కటువులయిన ఆ శబ్దములు అనుప్రాసయుక్తము లయియున్న మరింత యందముగా నుండును.

'దుర్వచకాదిషు' అని ఆది శబ్దమును వాడుటచేత రౌద్రాదిరసములందు సైతము శ్రుతివిరసాక్షరప్రయోగము గుణమే యై రసపోషక మగును. సందర్భౌచిత్యమునుబట్టి దోషము సైతము గుణ మగునన్నది సారాంశము.

ప్రకృతోదాహరణమునందు షకార టకార రకార సంయోగము ముహుర్ముహురావృత్తమైనది. ఆ సంయుక్తాక్షరము శ్రుతిహితము కాదు. అయినను, దుర్భాషాభాషి వాగ్గతికి నిదర్శనముగా అది ప్రయుక్తము. అందువల్ల అది గుణమే. పైగా ముహుర్ముహురావృత్తివల్ల అనుప్రాససౌందర్యము కూడ అలవడినది. కావుననే ప్రకృతశ్లోకము కష్టగుణమున కుదాహరణ మైనది.

## [ అనర్థక గుణము ]

93. యత్పాదపూరణాద్యర్థ మనర్థక ముదాహృతమ్
గుణత్వ మనుమన్యన్తే తస్యాపి యమకాదిషు.
యథా —

'యోషితా మతితరాం నఖలూనం
గాత్ర ముజ్జ్వలతయా న ఖలూనమ్' 126

'బభౌ ముఖే నాప్రతిమేన కాచన
శ్రియాధికానాం ప్రతిమేనకా చ న' 127

అత్ర ఖలుశబ్దస్య చశబ్దస్య చ పాదపూరణమాత్రేఽపి ప్రయోజనే యమకత్వాద్ గుణత్వమ్.

అర్థము : పాదపూరణాదులకొరకు ప్రయోగింపబడిన పదము అనర్థకమను దోషముగా చెప్పబడినది. దానికి కూడ పండితులు యమకాదులందు గుణత్వము నంగీకరించుచున్నారు. ఇది లక్షణము. మిక్కిలిగా గోళ్లచేత చీల్పబడిన స్త్రీల శరీరము ఉజ్జ్వలత్వముచేత తక్కువది కాదు. ఇది మొదటి ఉదాహరణము. అప్రతిమమైన ముఖముచేత ఒకానొకస్త్రీ ప్రకాశించెను. భాగ్యాధికులయెడల మేనక (అట్లు) కాదు. ఇది రెండవ ఉదాహరణము.

ఇచ్చట 'ఖలు'శబ్దమునకును 'చ' శబ్దమునకును పాదపూరణము మాత్రమే ప్రయోజన మైనప్పటికిని యమకత్వమువల్ల గుణత్వము కలుగుచున్నది.

వ్యాఖ్య : అర్థరహితముగా ప్రయుక్తమైనది అనర్థకము. అట్లు ప్రయోగించుట దోషము. కాని అర్థరహితముగా ప్రయోగింపబడిన శబ్దమే యైనను యమకాద్యలంకారమునకు దోహదము చేసినయెడల గుణముగానే పరిగణింపబడును.

మొదటి ఉదాహరణమునందు, మొదటిపాదమునందలి 'నఖలూనం' అను వర్ణసముదాయమే ద్వితీయపాదమునందుకూడ వచ్చుటచేత యమకాలంకార మగును. మొదటిపాదమునందలి 'నఖ+లూనమ్' అనుదానికి 'గోళ్లచేత చీల్పబడినది' అని యర్థము. ద్వితీయపాదమునందలి 'న+ఖలు+ఊనమ్' అనుదానికి 'తక్కువది కాదు' అని యర్థము. 'ఖలు'శబ్దమునకు ఇచ్చట ప్రయోజనములేదు. అనగా నిరర్థకముగా ప్రయుక్త మయ్యెనని యర్థము. అట్టియెడల అనర్థక మన్న దోషముగా పరిగణింపబడవలయును కాని యమకమునకు వినియుక్తమగుటచేత గుణముగానే పరిగణనకు వచ్చినది.

రెండవ యుదాహరణమునందు మొదటిపాదమునందున్న 'ప్రతి మేన కా చ న' యన్న వాక్యాంశమంతయు ద్వితీయపాదమునందు ఆవృత్తమైనది. అందువల్ల యమకాలంకారము సిద్ధించినది. మొదటి పాదమునందలిది '(అ)ప్రతి మేన + కాచన' అని విభక్తమగును. రెండవ పాదమునందలిది 'ప్రతి + మేనకా చ + న' అని విభక్తమగును. ఇందున్న 'చ'శబ్దము అనర్థకము. అయినను యమక సహకారకమై సౌందర్యసంధాయక మగుటవల్ల గుణమే యగుచున్నది. కావుననే, యీ రెండును అనర్థక గుణమునకు ఉదాహరణములైనవి.

## [ అన్యార్థ గుణము ]

94. యత్తు రూఢిచ్యుతత్వేన ప్రోక్త మన్యార్థ సంజ్ఞితమ్
ప్రహేలికాదిషు ప్రాయోగుణత్వం తస్య యుజ్యతే

యథా -

'ఖాతయః కని కాలే తే స్ఫాతయః స్ఫార్థ్హవల్గవః
చంద్రే సాక్షాద్భవంత్యత్ర వాయవో మమధారిణః' 128

అత్ర ఖాతయ ఇత్యాదీనాం షుర్ఘురికాదా ధృజశ్చానవస్థానే న రూఢిః. గూఢార్థేతు ప్రహేలికాదా తన్న దుష్యతీతి తేషాం దోష గుణత్వమ్.

అర్థము :- రూఢినుండి జారుటచేత అన్యార్థమన్న దోషముగా పరిగణింప బడుదానికి ప్రహేలికాదులయందు సాధారణముగా గుణత్వము కలుగును. ఇది లక్షణము. ఓ కన్యా! అందమైన నీ పాదమునందు బద్ధములై మనోహరధ్వనుల నీనుచున్న మువ్వలు సాక్షాత్కరించుచున్నవి. నా ప్రాణములు అవశము లగుచున్నవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'ఖాతయః' మున్నగువానికి మువ్వలు మున్నగు నర్థమునందును 'ధృ'ధాతువునకు అనవస్థానమునందును రూఢి లేదు. గూఢార్థమునందును ప్రహేలిక మున్నగువానియందును దోషము కాదు. అందువల్లనే వానికి దోషగుణత్వము.

వ్యాఖ్య : మూలధాతువునుబట్టియు, ప్రత్యయమునుబట్టియు కొన్ని పదము లకు కొన్ని యర్థము లేర్పడును. ఇటువంటి వానిని యౌగికార్థములని యందురు. వ్యవహారరూఢములైనవానిని యోగరూఢములని యందురు.కొన్నింటికియౌగికార్థము సరిపడియు, వ్యవహారప్రసిద్ధియుండదు. అట్టివానినే రూఢిచ్యుతము లని యందురు. వీనిని ప్రయోగించుటవల్ల అన్యార్థమన్న దోషము కలుగును. అయినను సమస్యలు, పొడుపుకథలు చిక్కుప్రశ్నలు మున్నగు విద్యావినోదములందు రూఢిచ్యుతములను ప్రయోగించుటచేత గుణత్వమే కలుగును.

ప్రకృతోదాహరణమునందు 'ఖాతయః' అను శబ్దమునకు మువ్వలు అన్న యర్థమున రూఢి లేదు. గొయ్యి, గని, కందకము మొదలయిన యర్థములందు 'ఖాతి' శబ్దము గలదు. 'ఖన్' అను ధ్వన్యనుకరణమునుబట్టి 'ఖనన్తీతి ఖాతయః' అన్న వ్యుత్పత్తిని కల్పించి 'మువ్వలు' అన్న యర్థమును చెప్పుకొనుట జరిగినది. 'కని' యనగా 'కన్య' యన్న యర్థము కల్పింపబడినది. మూలధాతువునందు భేదము లేదు. ప్రత్యయము మారినది. ఈ రూపమునకు వాడుక లేదు. 'కాలః' అనగా పాద మని ప్రయోక్తయభిప్రాయము. 'కల్' ధాతువునకు గణించు, పొందు మున్నగు నర్థములు గలవు. 'కల్యతే అనేన ఇతి కాలః' అన్న వ్యుత్పత్తి 'పద్యతే అనేన ఇతి పాదః' అన్న సామ్యమున కల్పింపబడినది. 'దీనిచేత పొందబడును' అన్నదియే వ్యుత్పత్త్యర్థమైనప్పటికిని పాదశబ్దమునకు ప్రయోగరూఢి యున్నది. కాలశబ్దము కృత్రిమ కల్పనము. అయినను ప్రయోక్త దానినే ప్రయోగించెను. చంద్రశబ్దమునకు 'చందన మివ ఆహ్లాదయతి' అని వ్యుత్పత్తి. ఈ వ్యుత్పత్తివల్లనే శీతాంశుని చంద్రు డనుట జరుగుచున్నది. ప్రకృతవక్త దానిని తలక్రిందులు చేసి 'ఆహ్లాదకరమైన' అన్న యర్థములో చంద్రశబ్దమును వాడెను. 'ధృ' ధాతువునకు ధరించు, కలిగియుండు మున్నగు నర్థములు కలవు. 'అవశము లగు' అన్న యర్థమున 'ధరన్తీతి ధారిణః' అన్న వ్యుత్పత్తి కల్పితమైనది. ఇట్లు యోగసాధ్యములైనను రూఢిసిద్ధములు కాని యర్థములను తెల్పుటచేత ఈ పదములు అన్యార్థదోషమునకు పాల్పడుచున్న వనవలయును. కాని వక్త తనకు నచ్చిన కన్యను మెచ్చుకొనుచు గూఢార్థముతో చేసిన ప్రసంగ మగుటచే ఈ పదములు సందర్భసముచితములై గుణవంతము లగుచున్నవి. కావుననే, ఈ శ్లోకము అన్యార్థగుణమున కుదాహరణ మైనది.

[ అపుష్టార్థ గుణము ]

95. తుచ్ఛవాచ్య మపుష్టార్థ మితి యత్ ప్రాక్ప్రకాశితమ్
తస్య చ్ఛందోఽనురోధాదా గుణత్వ మవధార్యతే.

యథా —

'ద్విరష్టవర్షాకృతి మేన మర్థినా
ముశన్తి కల్పోపపదం మహీరుహమ్
య మింద్రశబ్దార్థనిషూదనం హరే
ర్హిరణ్యపూర్వం కశిపుం ప్రచక్షతే' 129

అత్ర ద్విరష్టవర్షాకృతి మితి కల్పోపపదం మహీరుహ మితి హిరణ్యపూర్వం కశిపు మిత్యస్య తుచ్ఛార్థత్వేఽపి చ్ఛందోఽనురోధాద్గుణత్వమ్.

అర్థము : తుచ్ఛవాచ్యము అపుష్టార్థముగా పూర్వము చెప్పబడినది. ఛందోనిర్బంధాదులవల్ల అదియు గుణత్వమును పొందును. ఇది లక్షణము. పదునారేండ్ల వయసు గల యాతనిని యాచకులు కల్పమహీరుహ మని కోరుచున్నారు; హరి యొక్క ఇంద్రశబ్దార్థనాశకునిగా హిరణ్యకశిపుని పేర్కొనుచున్నారు. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'ద్విరష్టవర్షాకృతి' యని 'కల్పోపపదం మహీరుహ' మ్మని 'హిరణ్య పూర్వం కశిపు' మ్మని యున్నవి తుచ్ఛార్థములందే యున్నను ఛందోనురోధమువల్ల గుణత్వము కలుగును.

వ్యాఖ్య : అల్పపదములతోడ చెప్పదగినదానిని అధికపదములతో చెప్పుట తుచ్ఛవాచ్యము. అదియే అపుష్టార్థదోషము. ఛందోనిర్బంధాది హేతువులవల్ల శబ్ద విస్తరము నాశ్రయించినయెడల అది గుణమే కాని దోషము కాదు. 'ఆదులవల్ల' అని యనుటచేత శబ్దవైచిత్రి మున్నగువానిని గూడ గ్రహింపవలసి యుండును.

'ద్విరష్టవర్షాకృతి' అని యనగా పదునారేండ్ల వయసుగలవా డని యర్థము. 'షోడశవర్షాకృతి' అను విధముగా ప్రయోగించుట సమంజసము. కాని ప్రశస్త

వృత్తమునందు ఈ సమాసము యథాతథముగా ఇమడదు. 'కల్పోపపదం మహీరుహమ్' అనుదానికి బదులుగా 'కల్పమహీరుహమ్' అని యనుట సమంజసము. దీనికీ వృత్తముగూడ అనుకూలమే. 'హిరణ్యకశిపుమ్' అని యనుటకు బదులుగా 'హిరణ్యపూర్వం కశిపుమ్' అని విస్తరించి చెప్పుట జరిగినది. దీనికిని ఛందోనిర్బంధమే కారణము. కొన్నియెడల ఛందోనిర్బంధమే కారణ మనుట సమంజసముగానే యుండును. కొన్నియెడల అది కవి అసమర్థతకు సూచకముగా పరిణమించును. 'కల్పోపపదం మహీరుహమ్' మున్నగుచోట్ల 'కల్ప' అనుదాని నుపపదముగా కలిగిన 'మహీరుహమ్' అని యనుటచేత కల్పశబ్దమునకు మిరింత ప్రాధాన్యమును కల్పించుట జరుగుచున్నది. అట్లే 'ద్విరష్ట' అని యనుటచేత అల్పిష్ఠమైన వయస్సు ద్యోతిత మగుచున్నది. షోడశశబ్దముచేత విషయకథనమే కాని అల్పిష్ఠత ద్యోతకము కాదు. ఛందోనురోధముతోపాటు శబ్దవైచిత్ర్యాదులు కూడ హేతువులుగా సమకూడినపుడే అపుష్టార్థము గుణము కాగలదు. ప్రకృతశ్లోకమున నీ లక్షణము లుండుట చేతనే అపుష్టార్థగుణమున కుదాహరణ మైనది.

[ అ స మ ర్థ గు ణ ము ]

96. ప్రతిపాదిత మాశా యదసమర్థ మవాచకమ్
తస్యాపి ఖలు మన్యన్తే గుణత్వమ్ సీత్కృతాదిషు.

యథా –

'ఆశు లంఘితవతీష్టకరాగ్రే
నీవి మర్ధముకులీకృత దృష్ట్యా
రక్తవైణిక కరాహత తంత్రీ
మండల క్వణిత చారు చుకూజే' 130

అత్ర కూజితస్య పక్షిణోఽన్యత్రావాచకత్వేఽపి కామశాస్త్రేఽనుమతత్వాద్గుణత్వమ్.

అర్థము : అవాచకమే అసమర్థ మని పూర్వము ప్రతిపాదింపబడినది. సీత్కృతాదులందు దానికి కూడ గుణత్వము నంగీకరించుచున్నారు. ఇది లక్షణము.

ప్రియుని కరాగ్రము వేగముగా పోకముడిని దాటుచుండగా నగము మూడుచుకొన్న చూపుతో అనురక్తుడైన వైణికుని చేతితో తాకబడిన తంత్రీమండలమునుండి పుట్టిన క్వణితమువలె మనోహరముగా (ఆమె) పలికెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట పక్షియొక్క కూజితమునకు మరొకచోట అవాచకత్వమే యైనను కామశాస్త్రానుమతత్వముచేత గుణత్వమే.

వ్యాఖ్య : వాచకము కానిదానిని వాచకముగా నుపయోగించుట అవాచకము. సంగతము కానిపదము నుపయోగించుట యని భావము. ఇది దోషము. కాని సీత్కారాదులందు ఇది కూడ గుణముగానే గ్రహింపబడును.

ప్రకృతోదాహరణమునందు 'చుకూజే' అన్న క్రియాపద ముపయుక్తమైనది దీనికి 'కూసెను' అని యర్థము. ఇది పక్షి చేయవలసిన పని. 'ఒకస్త్రీ వీణానాదము వలె మనోహరముగా కూసెను' అన్నచో అసంగతముగా నుండును. కాని సంభోగ సమయమున నాయికాగళమునం దుండి అనేకధ్వనులు వెలువడు నని, అవి కోకిలా కూజితముల వలె, పారావతారావముల వలె, మయూరకేంకారముల వలె, ఇంక విశ్లేషమైనో విధములుగా నుండునని కామశాస్త్రము చెప్పుచున్నది. కావున ప్రకృతసందర్భమునందు 'చుకూజే' అని వాడుటచేత 'పక్షివలె కూసెను' అన్న యర్థము కలిగి శాస్త్రానుకూలముగా నుండును. ఇది సౌందర్యసంధాయకమే కాని సౌందర్యభంజకము కాదు. అందువల్లనే ప్రకృతశ్లోకము అసమర్థగుణమున కుదాహరణమైనది.

ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

## [ అప్రతీత గుణము ]

97. శాస్త్రమాత్ర ప్రతీతత్వా దప్రతీతం యదుచ్యతే
గుణత్వం తస్య తద్విద్యసంభాషా విదుర్బుధాః.

**యథా** -

'సర్వకార్య శరీరేషు ముక్త్వాంగ స్కంధ పంచకమ్
సౌగతానా మివాత్మాన్యో నాస్తిమంత్రో మహీభృతామ్' 131

అత్రాంగస్కంధపంచక మిత్యస్య శాస్త్రమాత్రే ప్రసిద్ధస్యాపి తద్విద్యసంభాషాయాం గుణత్వమ్.

**అర్థము :** శాస్త్రములందు మాత్రమే ప్రతీతి గల శబ్దములను వాడినచో అప్రతీత మను దోషమగును ఆ యా శాస్త్రవేత్తల సంభాషణాదులందు అది గుణత్వము నొందును. ఇది లక్షణము. సౌగతులకు సర్వకార్యశరీరములందును అంగ స్కంధపంచకము తప్ప వేరుగా ఆత్మ లేనట్లు, రాజులకు (కార్యారంభాది పంచాంగ ములు తప్ప) వేరుగా మంత్రము లేదు. ఇది ఉదాహరణము.

ఇచ్చట అంగస్కంధ పంచకము అను శాస్త్రమాత్ర ప్రసిద్ధ మైనదానికికూడ తద్విద్యావంతుల సంభాషణమునందు గుణత్వము.

**వ్యాఖ్య :** శాస్త్రములందు మాత్రమే ప్రసిద్ధములైన పదములు దైనందిన వ్యవహారమున అర్థప్రతీతిని కలిగింపలేవు. కావుననే అప్రతీతము అను దోషముగా పరిగణింపబడుట జరిగినది. కాని శాస్త్రజ్ఞులైనవారు తమ ప్రసంగములలో శాస్త్రమాత్ర ప్రసిద్ధములనే వాడుకొన్నప్పటికిని అర్థప్రతీతికి అవరోధము కలుగదు. అందువలన దోషము తొలగిపోయి, సంభాషణ సహజత్వసంపోషకముగా పరిణమించి గుణమే యగును.

ప్రకృతోదాహరణమునందు 'సౌగతసమయ' ప్రసిద్ధము లైన పదములు ప్రయుక్తము లైనవి. అవి తత్సంప్రదాయజ్ఞులకు సుపరిచితములే కావున అర్థప్రతీతిని కలిగించును. కార్య మనగా విని యోగ్య మని యర్థము. వినియోగప్రకార సర్వస్వము నకు శరీర మని సంజ్ఞ. ఆత్మ యనగా సారభూతమైనది యని యర్థము. పురుష ద్రవ్య సంపద్ దేశ కాల విభాగములే పంచాంగములు. రూపము, సంజ్ఞ, సంస్కారము, వేదనా విజ్ఞానము — అనునవి పంచ స్కంధములు. మంత్రము అని యనగా ఆలోచన మని యర్థము. ఈ యర్థములు తెలిసినపుడు మొత్తము భావము స్పష్టముగానే అవగతమగుచున్నది. కావుననే తద్వేత్తల ప్రసంగమునందలి ప్రకృత శ్లోకము అప్రతీతగుణమున కుదాహరణమైనది. ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

## [ క్లిష్ట గుణము ]

98. అర్థప్రతీతికృద్దూరే క్లిష్టం నామ యదుచ్యతే
ఝటిత్యర్థప్రతీతౌ తద్గుణత్వ మనుగచ్ఛతి.

యథా -

'అథాత్మనః శబ్దగుణం గుణజ్ఞః
పదం విమానేన విగాహమానః
పితుః పదం మధ్యమ ముత్పతన్తి
కాంచీగుణస్థాన మనిందితాయాః, 132

అత్రాత్మనః పదం శబ్దగుణమితి పితుః పదం మధ్యమ మితి చాకాశవిషయాం కాంచీగుణస్థానం నితంబవిషయ మితి సర్వప్రసిద్ధే ర్ఝటిత్యేవ ప్రతీతిం కరోతీతి క్లిష్టస్యాస్య గుణత్వమ్.

అర్థము : దూరముగా అర్థప్రతీతి యున్నయెడల క్లిష్టమని యనబడును. వేగముగా అర్థప్రతీతి కలుగునెడల అదియు గుణత్వము నొందును. ఇది లక్షణము. అంతట గుణజ్ఞుడు శబ్దగుణమైన ఆత్మపదమును విమానముచేత దాటుచున్నవా డయ్యెను. (ఆమె) పితృస్థానమైన మధ్యమమున నెగురుచున్న దయ్యెను. అనిందిత (నాయిక) యొక్క కాంచీగుణస్థానము - ఇది ఉదాహరణము. [సౌకర్యముకొర కుదాహరణవాక్యములు సమాపకక్రియాంతములుగా అనూదితములు.]

ఇచ్చట ఆత్మస్థానము శబ్దగుణమని 'పితృపదము' మధ్యమము అన్నవి ఆకాశవిషయకములని, కాంచీగుణస్థాన మన్నది నితంబవిషయమని యెల్లరకును ప్రసిద్ధమై యుండుటవల్ల వెనువెంటనే అర్థప్రతీతిని కలిగించుచున్నది. అందువల్ల ఇది క్లిష్టమునకు గుణత్వము.

వ్యాఖ్య: దూరాన్వయమువల్ల అర్థప్రతీతికి అంతరాయము కలిగినయెడల క్లిష్టమన్న దోష మగును. అట్లు అంతరాయము లేకుండ అర్థప్రతీతి కలిగినయెడల దోషము పరిహృతమైపోయి గుణమగును.

దీనికి లక్ష్యములు మూడు ప్రదర్శితములు. పూర్వార్ధమునందు 'ఆత్మనఃపదం శబ్దగుణమ్' అని సన్నిహితముగా నుండవలసియుండగా 'పదం' ద్వితీయపాదమున వివిష్టమైనది. 'శబ్దగుణమ్' అను విశేషణము వల్ల 'ఆత్మనఃపదమ్' అనుదానికి 'ఆకాశము' అన్న యర్థము ప్రతీత మగుచున్నది. ఇట్లు క్లిష్టత తొలగిపోయి, 'విమానముచేత అకాశమును దాటుచున్నవాడు' అన్న యర్థము స్పష్టమగుచున్నది.

ఉత్తరార్ధమునందు రెండు లక్ష్యములు గలవు. 'పితుఃపదం మధ్యమముత్పత న్తీ' పితృస్థానమయిన మధ్యమమున కెగురుచున్నదై అని యర్థము. ఇచ్చట ఊర్వశి నాయిక. ఊర్వశికి పితృస్థానము దేవలోకము. అదియే మధ్యమ లోకము. వామనుడు త్రివిక్రముడై మూడడుగులు కొలిచినపుడు భూమి ఒక అడుగునకు ఆకాశ మింకొక యడుగునకు సరిపోయినవి. ఆ మధ్యనున్నదెల్ల మధ్యమమే. అనగా ఊర్ధ్వలోక మనియే భావము. ఇంక రెండవ లక్ష్యము. 'కాంచీగుణస్థాన మనిందితాయాః' అన్నది. కాంచిని ధరించు స్థానము నితంబము. ఇది ప్రసిద్ధవిషయమే. 'నితంబము' అని సూటిగా చెప్పకుండ 'కాంచీగుణస్థాన'మని చెప్పుట ఉక్తివక్రత.

ఆకాశము, నితంబము అన్న యర్థములను తెల్పుటకు వ్యంగ్యాంతరము నాశ్రయించుట యిచ్చట జరిగినది. ఇందువల్ల క్లిష్టమన్న దోషము కలుగవలసియున్నను, ఝటితిప్రతీతి యుండుటవల్ల ఆ దోషము పరిహృత మగుటయే కాక ఉక్తివక్రతచేత గుణముకూడ నగుచున్నది. కావుననే, యీ శ్లోకము క్లిష్టగుణమున కుదాహరణమైనది.

ఈ శ్లోకమున పూర్వార్ధము కాళిదాసుని రఘువంశమునుండియు, మూడవ పాదము విక్రమోర్వశీయమునుండియు గ్రహింపబడినవి.

[ గూ ఢా ర్థ గు ణ ము ]

99. అప్రసిద్ధార్థసంబంధం యద్గూఢార్థ మితి స్మృతమ్
తద్వ్యాఖ్యానాదిషు ప్రాయోగుణత్వేన తదిష్యతే.

యథా –

'అమ్హారిసా వి కఇణో కఇణో హాలిబుద్ధసాలి పముహా వి
మణ్డుక్క మక్కడా వి హుంహో న్తి హారిసప్పసింహా వి' 133

[ఛాయా –

'అస్మాదృశా అపి కవయః
కవయో హరివృద్ధశాలి ప్రముఖాఅపి
మండూక మర్కటా అపి ఖలు
భవన్తి హరిసర్పసింహాఅపి']

అత్ర మండూక మర్కట సర్ప సింహే ష్వప్రసిద్ధప్రయోగ త్వాద్ గూఢస్యాపి హరిశబ్దస్య స్వయం వ్యాఖ్యాతత్వాద్గుణత్వమ్.

**అర్థము** : అప్రసిద్ధార్థసంబంధము గల శబ్దమువల్ల గూఢార్థ మన్న దోష మేర్పడును. వ్యాఖ్యానాదులందు అదిగూడ గుణత్వమునే పొందును. ఇది లక్షణము. మావంటి వారమును కవులమే. హరి వృద్ధ శాలి ప్రముఖులును కవులే. మండూకము, మర్కటము, సర్పము, సింహముకూడ హరి శబ్దవాచ్యములే. ఇది ఉదాహరణము.

ఇచ్చట మండూక మర్కట సర్ప సింహములందు హరిశబ్దముయొక్క (అప)సిద్ధప్రయోగమువల్ల గూఢార్థమే అయినను స్వయముగా అది వ్యాఖ్యాత మగుటవల్ల గుణత్వము నొందుచున్నది.

**వ్యాఖ్య** : అప్రసిద్ధమైన యర్థము నుద్దేశించి ఒక శబ్దమును ప్రయోగింపగా ప్రసిద్ధార్థమే స్ఫురించి ఉద్దిష్టమైన అప్రసిద్ధార్థము స్ఫురింపక పోవుటవల్ల గూఢార్థము దోష మగుచున్నది. వ్యాఖ్యానమువల్ల కాని, కవి కల్పనమువల్ల కాని అప్రసిద్ధార్థ స్ఫురణమే కలిగినయెడల, దోషము పరిహృతమై అది గుణత్వము నొందును.

ప్రకృతోదాహరణమున హరిశబ్దమును ప్రయోగించుటవల్ల గూఢార్థ దోషము. హరి యనగా ప్రసిద్ధార్థము విష్ణువు. అప్రసిద్ధార్థములు, అనగా నిఘంటువునందుండి వాడుకయందు ప్రచారములో లేనివి కప్ప, కోతి మొదలయినవి. కవి తన కల్పనము చేత 'అల్పబుద్ధులమైన మేమును కవులమే, ప్రాజ్ఞులైన హరివృద్ధశాలిప్రముఖులును కవులే' యని చెప్పి 'హరికి కప్ప, కోతి మున్నగు నర్థములును కలవు. విష్ణు వన్న యర్థమును గలదు' అని నివర్శనముగా నుపయోగించుకొనుట జరిగినది. కల్పన నిర్బంధమువల్లనే అప్రసిద్ధార్థములు ఆవశ్యకము లగుచుండుటచేత ప్రకృతపద్యము గూఢార్థగుణమున కుదాహరణమైనది.

[ నేయార్థ గుణము ]

100. నేయార్థం యత్ స్వసంకేతక్లృప్తవాచ్యం నిరూపితమ్
ప్రహేలికాదిషు ప్రాజ్ఞై స్తద్గుణత్వేన గణ్యతే.

యథా —

మోరఉ క్లలావేణ వహఇ తహ ణామహ సరిణాఉ
ఉస్సీసా పాఅన్తిగఓ *అణుణ త్తిహిం జణుణాఉ' 144

[ఛాయా -
'మయూరః కలాపేన వహతి తస్య నామ్నః సదృశనామా
ఉచ్ఛీర్షాత్పాదాంతగతోఽనుసక్తం యథా నౌకా']

అత్ర మయూర బర్హ చంద్రక సంకేతేన కల్పితస్య చంద్ర నామ్నా నేయార్థత్వేఽపి ప్రహేలికాత్వాద్గుణత్వమ్.

అర్థము : స్వసంకేతకల్పితార్థము గలది నేయార్థముగా నిరూపింపబడినది. ఇది ప్రహేలికాదులందు గుణత్వముతో ప్రాజ్ఞులచేత గణింపబడుచున్నది. ఇది లక్షణము. నెమలిపురిచేత వహింపబడుచున్న వానితో సదృశనామము గలవాడు నౌక మాదిరిగా ఉచ్ఛీర్షమునుండి పాదాంతమువరకు ప్రతిరాత్రియు వెళ్లుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇక్కడ మయూర బర్హ చంద్రక సంకేతముచేత కల్పింపబడిన చంద్రనామమునకు నేయార్థత్వమే యైనను ప్రహేలికాత్వముచేత గుణత్వమే.

వ్యాఖ్య : స్వసంకేతముచేత కల్పింపబడిన కృత్రిమార్థమునకే నేయార్థమని పేరు. తాను కల్పించుకొనుటచేత వక్తకు అర్థము ప్రతీత మగుననుటలో సందేహము లేదు. కాని శ్రోతకు ఉద్దిష్టార్థము ప్రతీతము కాదు. అందువల్లనే ఇది దోషమైనది. అయినప్పటికిని సమస్య, పొడుపుకథ, చిక్కుప్రశ్న మొదలైన విద్యావినోదములందు నేయార్థముకూడ గుణమే యగును.

*. అణుణే త్తి అజిణణాఉ — పాఠాంతరము.

ప్రకృతోదాహరణమునందు చంద్రుడు నొకవరె ప్రతిరాత్రియు తూర్పునుండి పడమరకు వెళ్లుచున్నాడు— అన్నది తాత్పర్యము. చంద్రశబ్దమును చంద్రకశబ్దము నుండి సాధించుట జరిగినది. నెమలి మోయునది నెమలిపురి (బర్హము); అది మోయునది నెమలికన్ను (చంద్రకము); 'చంద్రక ఏవ చంద్రః' అని కవర్ణము నిరర్థక మన్నట్లు నిర్ణయించి చంద్రశబ్దమును సాధించుట జరిగినది. 'ప్రాక్శిరాః శయీత' అన్న వచనమునుబట్టి ఉచ్ఛీర్షమన్న పదమునకు 'తూర్పు' అన్న అర్థము సంకేతింపబడినది. దీనికి విరుద్ధముగా పాదాంత మన్న పదమునకు 'పడమర' సంకేతిత మైనది. ఇట్లు ఏదో యేదో దూరసంబంధముచేత సంకేతమును కల్పించుకొని వాడుటచేత ఇది నేయార్థ మగుచున్నది. కాని యిది పొడుపుకథగా ఉద్దేశింపబడుట చేత వినోదస్థానికమై గుణమే యగుచున్నది.

పాఠాంతరముగా 'అణుణేన్తి అజిణజాఉ' అని కనిపించుచున్నది. దీనికి, 'అనునయంత్యా మయా జ్ఞాతః' అన్నది సంస్కృతచ్ఛాయ. అప్పుడు ఈ ప్రసంగ మును ఖండితనాయికా ముఖోద్గతముగా స్వీకరింపవలసి యుండును. 'చంద్రుడు తూర్పునుండి పడమరకు వెళ్లెను. నిన్ను బతిమాలుచున్న నాకే విషయము తెలియును' అన్న భావము కలుగును.

వినోదస్థానికమైన యీ పద్యము నేయార్థగుణమున కుదాహరణము.

## [ సందిగ్ధ గుణము ]

101. యదనిశ్చయకృత్ ప్రయోక్తం సందిగ్ధం తద్గుణీభవేత్
భవేద్ద్వితేషావగమో యది ప్రకరణాదిభిః.

యథా —

మహీభృతః పుత్రవతోఽపి దృష్టి
స్తస్మిన్నపత్యే న జగామ తృప్తిమ్
స శార్ఙ్గచక్రాసిగదాబ్జపాణి
శ్శ్రేషుచ్ఛవిః పాతు జగన్తి శౌరిః 145

అత్ర తస్మిన్నపత్యే ఇత్యనిశ్చితస్యాపత్యవిశేషస్య సందిగ్ధత్వేఽపి గౌర్యామితి ప్రకరణేన గమ్యతే. మేఘచ్ఛవిరిత్యస్యచ నవశ్యామాది పదానుపాదానేఽపి శౌరిసంబద్ధత్వాన్నవమేఘచ్ఛవి రితి వా విశేషో నిశ్చీయత ఇతి తస్యాపి గుణత్వమ్.

అర్థము : నిశ్చయమునకు వీలులేకుండ చెప్పినచో సందిగ్ధ మన్న దోష మగును. ప్రకరణాదులచేత విశేషావగమను కలుగునెడల అది గుణవంతమే యగును: ఇది లక్షణము. పుత్రవంతు డైనప్పటికిని హిమవంతునిదృష్టి ఆ అపత్యము మునందు తృప్తిని పొందలేదు. శార్ఙ్గచక్రఖడ్గగదాబ్జపాణియు మేఘచ్ఛవియు నైన శౌరి జగములను కాపాడును గాక: ఇవి ఉదాహరణములు.

ఇచ్చట 'ఆ అపత్యమునందు' అని అనిశ్చితమైన అపత్యవిశేషమునకు సందిగ్ధత్వ మున్నప్పటికి ప్రకారణమునుబట్టి 'గౌరియందు' అని గమ్యమాన మగును. 'మేఘచ్ఛవి' అనుదానికి నవ, శ్యామ ప్రభృతిపదములను ముందు చేర్పక పోయిన, ప్పటికిని శౌరికి సంబంధించుటవల్ల నవమేఘచ్ఛవియో మేఘశ్యామచ్ఛవియో నిశ్చ యింపబడును. అందువల్ల వానికిగూడ గుణత్వమే.

వ్యాఖ్య : సందేహమునకు వీ లగునట్లుగా పదప్రయోగము చేయుటచేత సందిగ్ధ మన్న దోషము కలుగును. ఉద్దిష్టమైన యర్థము ప్రతీతము, కాకుండ అవ రోధము కలుగుటవల్లనే దోషము పుట్టుచున్నది. సందర్భమునుబట్టి ఉద్దిష్టార్థము స్పష్టమైనయెడల దోషము పరిహృత మగును; గుణముకూడ నగును.

ప్రకృత పద్యమునందు రెం డుదాహరణములు కలవు. మొదటిదానిలో 'పుత్ర వంతు డైనప్పటికి' అని చెప్పి 'అపి' శబ్దప్రయోగము చేయుటచేత పుత్రసంతానమును హార్చి హిమవంతుని దృష్టి ప్రసరింపలేదని స్పష్ట మగుచున్నది. పరిహారన్యాయమున పుత్రికాసంతానమునందు దృష్టి తృప్తిని పొందలే దని యర్థము. నిరవధికమైన అప్యాయతను కలిగియున్నాడని తాత్పర్యము. అపత్య మను పదము పుత్రపుత్రికా సామాన్యము. తొలుతటి 'పుత్రవంతు డైనప్పటికిని' అన్నదే పుత్రికాగ్రహణమునకు ప్రేరక మగుచున్నది. కావున సందిగ్ధత ల్రాగుచున్నది. రెండవ దానిలో శౌరికి విశేషణములు రెండు ప్రయుక్తములైనవి. శార్ఙ్గచక్రఖడ్గగదాపద్మపాణి అనునది యొకటి. మేఘచ్ఛవి యనునది యొకటి. ఇక్కడ మేఘ మనగా శారద మేఘమా?

శ్రావణమేఘమా? యన్న సందేహమున కవకాశమున్నది. శారదమేఘము దూదిపింజలవలె తెల్లతెల్లగా నుండును. శ్రావణమేఘము నల్లగా నుండును. శౌరి యనగా విష్ణు వని యర్థము. శౌరి విశేషణము అన్యపరిహారణమునకు సహకరించును. అప్పుడు విష్ణువే ఉద్దిష్టవ్యక్తి యగుటచే తద్వర్ణము నీలవర్ణముగా సుప్రసిద్ధ మగుటచే 'మేఘచ్ఛవి' యనుదానికి 'మేఘనీలచ్ఛవి' యన్న భావమే ప్రభావవంతముగా ప్రతీయమాన మగును. కావున సందిగ్ధతకు అవకాశము లేదు.

ఇట్లు సందిగ్ధతకు తావున్నను సందర్భమునుబట్టి స్పష్టతయు, నిశ్చయత్వము కలుగుచుండుటచేతనే యీ పద్యము సందిగ్ధగుణమున కుదాహరణ మైనది.

ఉదాహరణశ్లోకమునందలి పూర్వార్థము కాళిదాసుని కుమారసంభవమునుండి గ్రహింపబడినది.

## [ విరుద్ధ గుణము ]

102. యత్తద్విరుద్ధ మిత్యుక్తం విపరీతప్రకల్పనమ్
తథాభూతాభిధానేన గుణత్వం ప్రతిపద్యతే.

యథా -

'అభిధాయ తదా తదప్రియమ్
శిశుపాలోఽనుశయం పరంగతః
భవతోఽభిమనాః సమీహతే
సరుషః కర్తుముపేత్య మాననామ్' 156

అత్ర విపరీతార్థకల్పనం విరుద్ధత్వేఽపి సంధ్యర్థవిగ్రహార్థయోః స్ఫుటభిన్నార్థత్వే నాభిధానాద్గుణత్వమ్.

**అర్థము** : పూర్వోక్తమునకు విరుద్ధముగా కల్పనము చేసినయెడల దానిని విరుద్ధదోష మని యందురు ఆ విధముగా చెప్పవలసి చెప్పినపుడు అది గుణత్వమును పొందును. ఇది లక్షణము. అప్పుడప్రియమును పలికి, మిక్కిలి ద్వేషమును పొందిన శిశుపాలుడు నీయందు అభిమానము గలవాడై, యిచ్చటికి వచ్చి రోషముగల నీకు గౌరవమును చేయ నభిలషించుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట విపరీతార్థకల్పనము విరుద్ధత్వమే యైనప్పటికి సంధ్యర్థవిగ్రహార్థము లందొస్ఫుటమైన భిన్నార్థములతో పలుకుటవల్ల ఇది గుణత్వము.

వ్యాఖ్య : అప్రియము పలికినవాడు ద్వేషపూరితుడైనవాడు శత్రువునకు సమ్మానము చేయుట యనుట విరుద్ధము. సంధ్యర్థమునందు ఒక యర్థమును విగ్రహార్థమునందు మరొక యర్థమును కలుగునట్లుగా మాటలాడుట యవసరమే. ఆ యవసరమును పురస్కరించుకొని, శ్లేష నాశ్రయించి విపరీతములైన యర్థములను జోడించి చెప్పుట గుణమే కాని దోషము కాదు. అట్లు చెప్పగలుగుట కవిప్రతిభ ప్రకర్షను ప్రకాశింపజేయును.

శిశుపాలుని దూత కృష్ణునితో చేయు ప్రసంగ మిది. 'అనుశయమ్ము' అను పదమునకు ద్వేషము, పశ్చాత్తాపము అన్న విరుద్ధార్థము లున్నవి. అప్రియము లాడిన శిశుపాలుడు పశ్చాత్తాపము నొందినయెడల సమ్మానము చేయుటలో విరుద్ధత లేదు. ఇది సంధ్యనుకూలమైన వచనము. ద్వేషము నొందినవాడు సమ్మానము చేయుట యన్నది విరుద్ధము కాని యిచ్చటకూడ 'సమ్మానము' అను దానికి వ్యతిరేకలక్షణను బట్టి 'అవమానము' అని గ్రహింపవలసి యుండును. 'మాననాహననే మానే' కేశవ విఘంటువు. దీనినిబట్టి 'మానన'పదమునకు సమ్మాన మన్న యర్థము మాత్రమే కాక, సంహార మన్న యర్థముకూడ కలుగును. ఇది విగ్రహానుకూలమైన వచనము. అనగా, కలహమునకు కాలు ద్రవ్వుట యనియే యర్థము.

దూతవాక్యమునందు రెండు ధోరణులు నుండుటచే విరుద్ధ మన్న దోషము పరిహృతమై గుణముగా పరిణమించెను. కావుననే యిది విరుద్ధగుణమున కుదాహరణ మైనది.

ప్రకృతశ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

[ అ ప్ర యో జ క గు ణ ము ]

103. అప్రయోజక మిత్యుక్త మవిశేషవిధాయకమ్
స్వరూపమాత్రే న క్తవ్యే తస్యాపి గుణతేష్యతే.

యథా

తేజఃప్యాకాశ మసిశ్యామ ముత్పృత్య పరమర్షయః
సాగ్రం వర్ష సహస్రం స తేపే స్తేపే మహామనాః 137

అత్రాసిశ్యామ మిత్యాకాశం ప్రతి సాగ్రమిత్యనేన చ వర్ష సహస్రం ప్రతి విశేషానభిధానేఽపి దూరోత్పతన చిరతపశ్చరణయో రుపయోగ వివక్షాయాం గుణత్వమ్.

అర్థము : విశేషవిధాయకము కాని పదమును ప్రయోగించిన యెడల అప్రయోజన మగునని చెప్పబడినది. స్వరూపమాత్రమే వక్తవ్య మగుచుండగా అదియు గుణత్వమును పొందును. ఇదిలక్షణము. పరమ ఋషులు అసిశ్యామమైన ఆకాశము నందు ఎగిరి వచ్చిరి. మహాత్ముడు సమగ్రముగా వేయి యేండ్లు తపస్సు చేసెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట అసిశ్యామ మని ఆకాశమునకు, సమగ్రముగా నని వేయియేండ్లను దానికిని చేర్చుటవల్ల విశేషమును చెప్పకపోయి నప్పటికిని దూరోత్పతన చిరతపశ్చరణములకు ఉపయోగవివక్షయందు గుణత్వము.

వ్యాఖ్య విశేష్యము యొక్క విశేషమును తెల్పునది విశేషణము. అటువంటి విశేషణము ప్రకృతార్థమునకు పనికివచ్చు విశేషమును చెప్పవియెడల అప్రయోజకమన్న దోషము కలుగును. కేవలవస్తుస్థితిని దెల్పుటయందును, యథావద్వర్ణనమందును స్వభావసౌందర్యపోషణమువల గుణమే యగును కాని దోషము కాదు.

ప్రకృతోదాహరణపద్యమునందు రెండు లక్ష్యములు కలవు. మొదటిదానిలో ఆకాశమునకు అసిశ్యామమన్న విశేషణము ప్రయుక్తమైనది. దీనివల్ల ప్రకృతార్థమునకు ప్రకర్ష మేమియు లేదు. అందువల్ల దోషమే. ఐనప్పటికిని ఆకాశముయొక్క నీలవర్ణము దూరమారమునకు చిక్కబడి యుండును. 'అసిశ్యామము' ఖడ్గనైల్యము గలది యని యనుటచేత మిక్కిలి దూరము సూచిత మగుచున్నది. కావున, ఇది ప్రకృతోపయోగమైన గుణ మగుచున్నది. రెండవ లక్ష్యమునందు 'వర్షసహస్ర' మనుదానికి 'సాగ్ర' మనునది విశేషణము. 'పూర్తిగా వేయియేండ్లు' అని యర్థము. ఏమాత్రము తక్కువైనను వేయియేండ్లు అనుట సరిపడదు. అయినప్పటికిని

'పూర్తిగా వేయియేండ్లు' అని యనుటచేత కాలదీర్ఘత్వము సూచిత మగుచున్నది. కావుననే ప్రకృతపద్యము అప్రయోజకగుణమున కుదాహరణ మైనది.

ఉదాహరణశ్లోకమునందలి పూర్వార్థము కాళిదాసుని కుమారసంభవము నుండి గ్రహింపబడినది; ఉత్తరార్థము వ్యాసుని శ్రీమద్భాగవతమునుండి గ్రహింప బడినది.

[ దే శ్య గు ణ ము ]

104. య దవ్యుత్పత్తిమ ద్దేశ్యమితి పూర్వం నిరూపితమ్
మహాకవినిబద్ధం స త్తదప్యత్ర గుణీభవేత్.

యథా -

[1]'మండే మూర్ధండపిండీతగరతరలమః ప్రాపిరే యేన వేలా
మాలంబ్యోత్తాలతల్లస్ఫుటితపుటకినీబంధవో గంధవాహాః' 138

'పాతాల ప్రతిమల్ల గల్ల వివరప్రక్షిప్త సప్తార్ణవమ్' 139

'కిరంతః కావేరీ లడహ లహరీ శీకరకణాన్' 140

అత్ర తల్ల గల్ల లడహ లహరీప్రభృతీనా మవ్యుత్పత్తిమత్త్వేన దేశ్యత్వేఽపి మహాకవిభి రంగీకృతత్వాద్గుణత్వమ్.

అర్థము : వ్యుత్పత్తిలేని పదములను దేశ్యముగా పరిగణించుట జరిగినది. మహాకవులచేత నిబద్ధమయిన దేశ్యము కూడ గుణమగును. ఇది లక్షణము. గంధవాహములు జొంపములందు ఉద్దండములును సాంద్రములునై నందివర్ధనములను చలింపజేయునవై, గట్టు నాలంబనముగా చేసికొని ఉత్తాలమైన సరస్సనెడి పూలగంపకు బంధువులై యున్నవి. పాతాళ ప్రతి మానములైన కపోల రంధ్రములందు ప్రేరేపింప బడిన సప్తసముద్రములను గలది. కావేరీ మనోహర ప్రవాహశీకరకణములను వెదజల్లుచున్నవి. ఇవి ఉదాహరణములు.

ఇచ్చట తల్ల గల్ల లడహ లహరీ ప్రభృతిపదముల అవ్యుత్పత్తిమత్త్వము చేత దేశ్యత్వమే యైనటికిని మహాకవులచేత అంగీకరింపబడుటవల్ల గుణత్వము.

---

1. ఖండేషు — పాఠాంతరము

వ్యాఖ్య : వ్యుత్పత్తిని తెలుపుటకు వీలుకాని పదములను ప్రయోగించుట చేత దేశ్యమన్న దోషము కలుగును. మహాకవులు ఆయా పదముల నాదరించి వానిని తమ కావ్యములందు ప్రయోగించినచో, వాని దోషము పరిహృతమగును. అంతేకాక అనుప్రాసాదులకు సహకరించి సౌందర్యసంధాయకము లగుటచేత గుణవంతములుగానే పరిగణింపబడును.

సంస్కృత భాషయందు సంస్కృతేతర పదములను వాడుట దోషమని, మహాకవుల యంగీకారముచేత ఆ దోషము తొలగునని తాత్పర్యము. తెలుగు మున్నగు భాషలందు ప్రకృత విషయ సామ్యమును బట్టి ఆంధ్రేతరపదములను వాడుట దోషమనియు, మహాకవి ప్రయుక్తము లయినచో దోషము తొలగిపోయి, గుణమగుననియు సమర్థించుకొనవచ్చును. ఒకభాషయందు ఇతరభాషాపదములు ప్రయుక్తము లగుటకు తత్పదముల ప్రయోగ ప్రాచుర్యమే కారణము. ప్రయోగ ప్రాచుర్యమున్నప్పుడు అర్థప్రతీతి కంతరాయము కలుగదు. మహాకవులు తమ కావ్యములందు అట్టి పదములను సౌందర్య సంధాయకములుగా, రసనిర్వాహకములుగా వాడుకొందురు. వాడుటలోని ఔచిత్యముచేతనే అవి స్వీకారపాత్రము లగును.

ప్రకృతోదాహరణములు మూడు. మొదటి యుదాహరణమునందలి 'తల్ల' శబ్దము దేశ్యము. 'సరస్సు' అని యర్థము. సమాస మధ్యస్థమై రచనకు సౌష్ఠవమును సౌందర్యమును సమకూర్చినది. రెండవయుదాహరణము భవభూతి రచించిన మాలతీమాధవము నందలిది. ఇందున్న 'గల్ల' శబ్దము దేశ్యము. 'చెక్కిలి' యని యర్థము. 'ప్రతిమల్లగల్ల' మున్నగు విధముగా నుండి అనుప్రాససౌందర్యమున కాలంబనమైనది. మూడవయుదాహరణమునందలి 'లడహ' శబ్దము దేశ్యము. 'మనోహరము' అని యర్థము. 'లహరీ' శబ్దముగూడ దేశ్యమనియే భోజదేవుని నిష్కర్షమైనట్లు వృత్తినిబట్టి తెలియుచున్నది. దీనికి 'ప్రవాహము' అని యర్థము. 'లడహలహరీ' యన్నపుడు లవర్ణపౌనరుక్త్యముచేత అనుప్రాససౌందర్యము అనుభూతమగుచున్నది.

## [ గ్రామ్య గుణము ]

105. గ్రామ్యం ఘృణావదశ్లీలామంగలార్థం యదీరితమ్
తత్సంవీతేషు గుప్తేషు లక్షితేషు న దుష్యతి.

అర్థము : ఘృణావంతము (అసహ్యార్థము), అశ్లీలార్థము, అమంగళార్థము నైనదిగ్రామ్యమని యిదివరకు చెప్పబడినది. అది సంవీతములందును, గుప్తము లందును లక్షితము లందును దోషముకాదు. ఇది లక్షణము.

తత్ర సంవీతే యథా -

'తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం
యతాత్మనే రోచయితుం యతస్వ
యోషిత్సు తద్వీర్య నిషేక భూమిః
సైవ క్షమేత్యాత్మభువోపదిష్టమ్' 141

అత్ర తద్వీర్య నిషేకభూమి రిత్యశ్లీలస్యాపి సంవీతత్వాద్ గుణత్వమ్.

యదాహ -

'సంవీతస్య హి లోకేషు నదోషాన్వేషణం క్షమమ్
శివలింగస్య సంస్థానే కస్యాసభ్యత్వ భావనా.'

అర్థము : సంవీతికి ఉదాహరణము. హిమాద్రిపుత్రికయైన పార్వతిని నిగ్రహముగల శివునితో కలుపుటకు యత్నింపుము. స్త్రీలయందు అతని రేతస్సును వహింపగల స్థానముగా ఆమె మాత్రమే సమర్థురాలని బ్రహ్మచేత ఉపదేశింప బడినది.

ఇచ్చట 'అతని రేతస్సును వహింపగలస్థానము' అనునది అశ్లీలమే యైనప్పటికిని సంవీతత్వముచేత గుణత్వమే. 'సంవీతమునకు లోకమునందు దోషాన్వేషణము తగదు. శివలింగ సంస్థానమునందు అసభ్యభావన ఎవని కుండును?' అని పూర్వాచార్యుల వచనము.

వ్యాఖ్య : సంవీతము అని యనగా సాముదాయిక వ్యవహారము అనియే భావము. సాంప్రదాయిక వచనమునందు సాముదాయికమైన యర్థమును మాత్రమే గ్రహింపవలయును. అట్లుకాక ప్రతిపదార్థమును గ్రహించుటజరిగినచో కొన్నియెడల

అశ్లీలమన్న దోషము తోపవచ్చును. ప్రతిపదార్థముచేత అశ్లీలమే యైనప్పటికిని సాంప్రదాయికమైన సముదాయార్థముచేత అశ్లీలము తొలగి గుణత్వము కలుగును.

ప్రకృతోదాహరణమునందు 'తద్వీర్య నిషేకభూమిః' అనుచోట అసభ్యత కలదు. వీర్యము అని యనగా రేతస్సు; ప్రకృతార్థము కూడ నదియే. కాని సాముదాయికమైన యర్థము 'శివునికి భార్యయగుటకు యోగ్యురాలు పార్వతి' అని యనుటయే. అందువల్లనే అశ్లీలము పరిహృతమై గుణత్వము పరిగణనకు వచ్చుచున్నది. ఈ యుదాహరణశ్లోకము కాళిదాసుని కుమారసంభవమునుండి గ్రహింపబడినది.

పై లక్షణ శ్లోకమునందలి క్రమమును తప్పించి లక్ష్యములను ముందుగా అశ్లీల గుణమునకు చూపుట జరుగుచున్నది. ఇచ్చట సంవీతము, గుప్తము, లక్షితము అనువానికి క్రమానుసారముగానే లక్ష్యములు సంతరింపబడినవి. ఇది అసభ్యదోషము సంవీతిచేత గుణత్వమునొందుట కుదాహరణము.

ఇట్లు సంవీతియందు శివలింగాది పదములకు అసభ్యార్థభావన యెవ్వనికి నుండదని నిష్కర్షముగా తెలిపిన పూర్వాచార్యవచనమును తనవాదమున కువబలకముగా రచయిత ప్రదర్శించెను.

గుప్తే యథా –

'సుదుస్త్యజా యద్యపి జన్మభూమి
ర్గజై రసంబాధయాంబభూవే
స తేఽనునేయః సుభగోఽభిమానీ
భగిన్యయం నః ప్రథమాభి సంధిః' 142

అత్ర జన్మభూమి సంబాధ సుభగ భగినీ శబ్దానా మశ్లీలార్థాంతరత్వేఽపి ప్రథమార్థప్రభావభావ నాగుప్తత్వాద్గుణమ్.

యదాహ –

'వస్తు మాహాత్మ్యగుప్తస్య పదార్థస్య విభావనాత్
భగినీ భగవత్యాది నాసభ్యత్వేన భావ్యతే'

అర్థము : గుప్తమున కుదాహరణము. విడువరానిదే యైనను జన్మభూమి ఏనుగులచేత అసంబాధముగా విడువబడినది. అతడు నీకు అనునయింపదగినవాడు సుభగుడు; అభిమానవంతుడు. మాకు మొట్టమొదటి విషయము ఈ భగిని.

ఇచ్చట జన్మభూమి సంబాధ సుభగ భగినీ శబ్దములకు అర్థాంతరము అశ్లీలమైనప్పటికిని ప్రథమార్థప్రభావ భావనా గుప్తత్వముచేత గుణత్వము. వస్తు మాహాత్మ్యగుప్తమగు పదముయొక్క విభావన (విశిష్టభావన) వల్ల భగిని భగవతి మున్నగునవి అసభ్యములుగా భావింపబడవు — అని పూర్వాచార్యుల నిష్కర్షము.

వ్యాఖ్య గుప్తమన్నగా గూఢముగా ఉంచబడినదని యర్థము. అనగా అప్రసిద్ధమైన ధ్వనియే భావము. ఒక పదము లోకవ్యవహారమునుబట్టి ఒక యర్థమున రూఢమగును. అదియే ప్రసిద్ధమై ప్రతీతమగును. ప్రాతిపదిక ప్రత్యయాదులచేత ఏర్పడ్డ యౌగికార్థము అప్రసిద్ధముగానే యుండును. అట్లు అప్రసిద్ధముగానున్న యర్థమసభ్యమైనపుడు ఆ పదము గుప్తమనిపించుకొనును. అప్పుడిది గ్రామ్యదోషము కాక గుణముగానే పరిగణితమగును.

ప్రకృతోదాహరణమునందు మూడు లక్ష్యములు గలవు. మొదటి దాని యందు జన్మభూమి, సంబాధ పదములు గలవు. వీనికి ప్రసిద్ధార్థములు మాతృదేశము, కష్టము అనునవి. ఈ యర్థములందు అసభ్యత లేదు. కాని 'జన్మకు ఆశ్రయమైన స్థానము' అన్నవ్యుత్పత్తిచేత 'యోని' యన్నయసభ్యార్థాంతరము కలదు. సంబాధశబ్దమున కిదియే యర్థాంతరము కలదు. ఈ యర్థము లప్రసిద్ధములును, అప్రతీతములును అగుటచేత గుప్తములు.

తరువాతి లక్ష్యమునందు సుభగ శబ్దము కలదు. సౌందర్యవంతు డన్నది ప్రసిద్ధార్థము. 'అభిమాని' యన్నదానికి 'ఆత్మగౌరవము కలవాడు' అని యర్థము. తరువాతి లక్ష్యమునందు 'భగిని' యని కలదు. దీనికి సోదరి యని యర్థము. కాని వీనియందలి భగ, మాన శబ్దములను బట్టిఅసభ్యార్థము కలుగవచ్చును. అది అప్రసిద్ధము.

యౌగికమైన యర్థము గుప్తమై రూఢమైన యర్థము మాత్రమే ప్రతీయమానమైనచో గ్రామ్యదోషము తొలగిపోయి గుణ మేర్పడును. కావుననే ప్రకృత శ్లోకము గుప్తమున కుదాహరణమైనది.

లక్షితే యథా —

'బ్రహ్మాండకారణం యోఽప్సు నిదధే బీజమాత్మనః
ఉపస్థానం కరోమ్యేవ తస్మై శేషాహిశాయినే' 143

అత్ర బ్రహ్మాండోపస్థాన శబ్దయో రసభ్య స్మృతిహేతుత్వేఽపి అన్యత్ర లక్షితత్వాద్గుణత్వమ్.

అర్థము: లక్షితమున కుదాహరణము. బ్రహ్మాండ కారణమైన తనబీజమును నీళ్లయందు నిధానము చేసిన శేషసర్పశాయికి, నేను ఉపస్థానము చేయుదును.

ఇచ్చట బ్రహ్మాండోపస్థాన శబ్దములకు అసభ్య స్మృతిహేతుత్వమున్నప్పటికిని అవి యితరార్థమునందు లక్షితమగుటవల్ల గుణత్వమే.

వ్యాఖ్య: లాక్షణికమైనది లక్షితార్థము. ప్రసిద్ధమైన యర్థము కాక అప్రసిద్ధమై, లక్షణానురోధము చేతఏర్పడిన దనియే భావము. కొన్ని యెడల అసభ్యమైన లాక్షణికార్థమునకే ప్రసిద్ధి కలుగ వచ్చును. దానినిబట్టి కలిగెడి యౌగికార్థము కూడ అసభ్యార్థ స్మృతి హేతువు కావచ్చును. అయినప్పటికిని అసభ్యత లాక్షణికార్థమువల్ల ఏర్పడినదే కాని నైఘంటుకము కాదు; నిత్య వ్యవహార సిద్ధము కాదు. అందువల్ల లక్షితార్థము అసభ్యస్మృతి హేతుకమేయైనప్పటికిని సాముదాయికమైన యర్థమువల్ల ఇట్టిది గుణమే యగును.

ప్రకృతోదాహరణమునందు బ్రహ్మాండము ఉపస్థానము అను రెండు పదములు చర్చనీయములు. బ్రహ్మాండము అను పదమునకు 'విశ్వము' అనునది ప్రసిద్ధార్థము. 'బ్రహ్మ యొక్క అండము' అని విగ్రహమును చెప్పి 'అండ' పదమునకు అర్థాంతరము చెప్పవచ్చును. అండము అనగా గ్రుడ్డు అన్నది ప్రసిద్ధార్థము. 'వృషణము' అన్నది లక్షితార్థము. ఇది అశ్లీల స్మారకము. లక్షితమైన అసభ్యార్థము గుర్తువచ్చుచున్నప్పటికిని ప్రసిద్ధార్థమునందు అసభ్యత లేకపోవుటచేతను, సాముదాయికమైన యర్థమే ప్రకృత మగుటచేతను దోషము పరిహృతమై గుణ మగుచున్నది. 'ఉపస్థానము' అన్న పదమునకు 'సామీప్యము' అని కాని 'పరిచర్య' అని కాని సాముదాయికమైన యర్థము. ఇందలి మొదటి మూడక్షరములు స్త్రీ గుహ్యావయవమును లక్షించును. లోకమున లక్షితార్థమునకే ప్రసిద్ధి లభించినది. కావున అసభ్యార్థమే తొందరగా స్ఫురించును. అయినప్పటికిని అసభ్యార్థము లక్షితమే కాని వాచ్యము కాదు. కనుక, ఇట్టియెడల దోషము లేదని తాత్పర్యము. కావుననే ప్రకృతశ్లోకము అగ్రామ్య గుణమున కుదాహరణమైనది.

ఏవ మశస్తాదీనా మపి గుణత్వమ్. యథా –

'భద్రే మారి! ప్రశస్తంవద సదసి ముదా నృత్యకృత్యే ముహూర్తం
మృత్యో! రత్నైశ్చతుష్కం విరచయ రచయారాత్రికం కాలరాత్రి
చాముండే ముండమాలా ముపనయ వినయస్త్యాయతాం భైరవీర్ష్యా
మేవం దేవే భవానీం వదతి పరిజనవ్యాహృతి స్త్రాయతాంవః' 144

అత్ర మారీ కృత్యాదీనా మశస్తార్థానా మపి పదానాం సమస్త మంగలాయతనస్య భగవతో విశ్వేశ్వరస్య సంబంధేనో క్తత్వాద్ గుణత్వమ్.

అర్థము : ఈ విధముగానే అశస్తాదులకును గుణత్వము. ఉదాహరణము: భద్రా! మారీ! సభయందు ప్రశస్తముగా మాటాడుము. కృత్యా! క్షణము సేపు సంతోషముతో నృత్యము సేయుము. మృత్యువా! రత్నములతో వేదికను సిద్ధము చేయుము. కాళరాత్రీ! హారతి నేర్పాటు చేయుము. చాముండా! పునుకల దండను తీసికొని రమ్ము. భైరవీ! ఈర్ష్యాధిక్యమును తగ్గించుకొనుము — అని దేవుడు భవానికి చెప్పుచుండగా పలికిన పరిజనుల పలుకులు మిమ్ములను రక్షించుగాక!

ఇచ్చట మారి, కృత్య మున్నగుపదములు అమంగళకరములైన యర్థములను కలవే యైనప్పటికిని సమస్తమంగళములకు నెలవైన విశ్వేశ్వరదేవునికి సంబంధించునట్లుగా చెప్పబడుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : అశస్తము లనగా అమంగళకరము లని యర్థము. వేరువేరుగా ఆపదములు అశస్తములే యైనప్పటికిని సన్నివేశసంబంధమునుబట్టియు, సాముదాయికమైన తాత్పర్యమునుబట్టియు దోషము తొలగిపోగా గుణమునే పొదువు కొనును.

ప్రకృతోదాహరణమునందు శివపదన్యమును గూర్చిన ప్రసంగము వర్ణితము. శివుని పరిజనములోనివారు మారి, కృత్య, మృత్యువు, కాళరాత్రి, చాముండ, భైరవి

అనువారు. భవాని సర్వమంగళాపతి సమస్తకల్యాణనిలయుడు విశ్వేశ్వరుడు. తత్స ఖాలంకరణ సన్నాహ సందర్భమున పరిజనము పరస్పరము పిలుచుకొనుట, హెచ్చ రికలు చేసికొనుట స్వాభావికములు. సర్వమంగళాయతనులైన పార్వతీపరమేశ్వరుల యొక్క పరిజనముగా మార్యాదులను పేర్కొనుటచేత, సన్నివేశముకూడ మంగళ కరమే యగుటచేత అమంగళార్థము తొలగిపోయి గుణమునకే ప్రాధాన్యము కలుగు చున్నది. ఇది అశస్తార్థమునకు సంవీతివల్ల గుణము కలిగిన సన్నివేశము.

యథా వా -

'సత్పక్షా మధురగిరః ప్రసాధితాశా మదోద్ధతారంభా'
నిపతంతి ధార్తరాష్ట్రాః 'కాలవశాన్మేదినీపృష్ఠే' 145

అత్ర ధార్తరాష్ట్రాః కాలవశాన్మేదినీపృష్ఠే నిపతంతీత్యస్యా మంగలార్థాంతరత్వేఽపి 'హంసానహం ధార్తరాష్ట్రా నితివ్యపది శామి'ఇతి వక్ష్యమాణ వాక్యగుప్తత్వాద్ గుణత్వమ్.

అర్థము : ఇంకొక యుదాహరణము. సత్పక్షులు, మధురవాక్కులు, ప్రసాధితాశులు, మదోద్ధతారంభులునైన ధార్తరాష్ట్రులు కాలవశమున మేదినీపృష్ఠము నందు పడుచున్నారు.

ఇచ్చట 'ధార్తరాష్ట్రులు కాలవశమున మేదినీపృష్ఠమున పడుచున్నారు' అను దానికి అమంగళమైన అర్థాంతర మున్నప్పటికిని 'హంసలను ధార్తరాష్ట్రులని సంకే తించుచున్నా'నని రాబోవు వాక్యమున చెప్పుటచేత గుప్తత్వము. ఆ గుప్తత్వముచేత గుణత్వము.

వ్యాఖ్య : అర్థాంతరము అశస్తమైనయెడల గ్రామ్యభేద మగును. సన్నివేశ మునుబట్టి అర్థాంతరము గుప్తమై ప్రకృతార్థమే ప్రకృతార్థమే ప్రతీయమానమగు నెడల ఆ దోషము తొలగిపోవును. ప్రకృతోదాహరణమునందు అశస్తార్థాంతరము గోపనముచేత గుణమగుట నిరూపితమైనది.

ప్రకృతలక్ష్యశ్లోకము భట్టనారాయణుని వేణీసంహారము నందలిది. 'ధార్త రాష్ట్రు' శబ్దమునకు 'ధృతరాష్ట్ర నందనులైన కౌరవులు' అని ఒక యర్థము; 'ముక్కులును కాళ్లను నల్లగా నుండు హంసలు' అని మరొక యర్థము. నిజమునకు

మొదటిదే ప్రసిద్ధార్థము. అయినప్పటికి సూత్రధారుడు 'హంసలన్న యర్థమున నుప యోగించితి' నని చెప్పుకొనుటచేత ప్రసిద్ధార్థము గుప్తత్వమునొంది అప్రసిద్ధార్థము నకే ప్రకటత్వము కలుగుచున్నది. తొలుత అశ్లీలమైన అర్థాంతరమే స్ఫురించి నప్పటికిని సూత్రధార వివరణ వచనముచేత ఉద్దిష్టార్థమే ఉద్యోతిత మగుచున్నది. కావున అర్థాంతరగుప్తివల్ల అమంగళార్థము తొలగి, గుణత్వమే పరిగణింపబడువల్ల ఈ శ్లోకము లక్ష్యముగా తగియున్నది.

కౌరవార్థమున – సత్పక్షులు మంచి సాధనములు గలవారు; ప్రసాధితాశులు సాధించుకొన్నకోర్కులు గలవారు; మదోద్ధతారంభులు దర్పించి పనులు చేసెడివారు; పడుచున్నారు శత్రువులచేత సంహరింపబడుచున్నారు ॥అని యర్థము.

హంసార్థమున – సత్పక్షములు మంచి రెక్కలుగలవి; ప్రసాధితాశములు అలంకరింపబడిన దిక్కులుగలవి; మదోద్ధతారంభములు మధువు త్రాగుటచేత ఉద్ధతము లయిన పనులను గలవి; పడుచున్నవి ఆకాశమునుండి దిగుచున్నవి ॥అని యర్థము.

హంసార్థమున అమంగళత్వము లేనే లేదు కౌరవార్థమున అమంగళత్వ మున్నది. ఐనప్పటికిని గోపనముచేత అది అప్రాప్త మగుచున్నది.

యథా వా –

'కోఽభిప్రేతః సుసంస్థాన స్తస్యా ఇతి న నిశ్చయః
ఆశాపిశాచికైషా తు కుమారీ మాం వరిష్యతి' 136

అత్రాభిప్రేత సుసంస్థానాశా పిశాచికా కుమారీతి పదానా మశ్లీలస్మృతిహేతూనా మపి లోకై రన్యత్ర లక్షితత్వాద్గుణత్వమ్॥

అర్థము : ఇంకొక యుదాహరణము. ఆమెకు సుసంస్థానమైన అభిప్రాయ మేమో నిశ్చయము లేదు; కుమారి నన్ను ప్రేమింపగలదు; ఇది ఆశాపిశాచిక.

ఇచ్చట అభిప్రేతః, సుసంస్థానః, ఆశాపిశాచికా, కుమారీ – అన్న పదములు అశ్లీలస్మృతి హేతువులు. అయినప్పటికి వానికి అన్యార్థములు లక్షితము లగుటచేత గుణత్వము.

వ్యాఖ్య : పదైకదేశముచేత అమంగళార్థము స్మరణకు వచ్చునెడల అశ్లీలార్థస్మృతి హేతువన్న దోషము కలుగును. అప్పుడుకూడ అశ్లీలార్థములు లక్షి

తములే కాని, వాచ్యములు (రూఢములు) కానియెడల ఆ దోషము తొలగి పోవును.

ప్రకృతోదాహరణమునందు 'అభిప్రేతః' అనుచోట 'ప్రేతః' అమంగళార్థము నొసగును. ప్రేత మనగా శవ మని యర్థము. ఇది లక్షితార్థము. 'సుసంస్థానః' చక్కగా నెలకొన్న దనియే ప్రకృతార్థము. ఏకదేశమైన 'సంస్థానః' అను దానికి 'స్థాపనము' అన్న యర్థము కలుగును. 'ఆశాపిశాచికా' యన్నప్పుడు పిశాచికవలె దారుణమైన ఆశ యని యర్థము. కాని 'పిశాచికా' పదమునకు 'పిశితమశ్నాతి' అన్న వ్యుత్పత్తినిబట్టి 'మాంసభక్షకురాలు' అన్న లక్షితార్థము కలుగును. 'కుమారీ' అనగా 'యువతి' యని యర్థము. ఏకదేశమైన 'మారీ' మారకవ్యాధికి లక్షితము. ఇట్లు ఏకదేశములచేత అశస్తార్థములు కలుగుచున్నను, ఇవి లక్షితార్థములేకాని ప్రసిద్ధార్థములు కాకపోవుటచేత, దోషము తొలగి గుణమే కలుగునని తాత్పర్యము. కావుననే ప్రకృతశ్లోకము గ్రామ్యగుణమున కుదాహరణమైనది.

ఏవం ఘృణావదర్థాదీనా మపి గుణత్వమ్. తత్ర ఘృణావతో యథా —

'పద్మాన్యర్కాంశు నిష్ఠ్యూతాః పీత్వా పావకవిప్రుషః
భూయో వమ న్తీవ ముఖై రుద్గీర్ణారుణ రేణుభిః' 147

అత్ర —

'నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసుందర మన్యత్తు గ్రామ్యకక్ష్యాం విగాహతే'.

**అర్థము** : ఇట్లే ఘృణావదర్థాదులకును గుణత్వము కలుగును. అందు ఘృణావదర్థమున కుదాహరణము. పద్మములు సూర్యకిరణములచే నుమియబడిన అగ్నిబిందువులను త్రాగి క్రక్కబడిన అరుణరేణువులు గల ముఖములతో మాటిమాటికి వాంతి చేసికొనుచున్నట్లున్నవి.

ఇచ్చట నిష్ఠ్యూత, ఉద్గీర్ణ, వాంత ప్రభృతిపదములు గౌణవృత్తి నాశ్రయించుట మిక్కిలి సుందరముగా నున్నది. మరొకటి యైనచో గ్రామ్యమునందు గణింపబడెడిది.

వ్యాఖ్య : అసహ్యతను గలిగించు నర్థముగల పదము ఘృణావంతము. అది దోషము. అసహ్యకరమైన యర్థమునందు కాక అప్రధానమైన అన్యార్థమునం దుపయోగించినయెడల ఘృణావంత మన్న దోషము తొలగిపోవు నని భావము.

ఉదాహరణశ్లోకమునందు 'నిష్ఠ్యూతాః' (ఉమియబడినవి) 'వమన్తి' (క్రక్కుచున్నవి) 'ఉద్గీర్ణ' (క్రక్కబడిన) అను పదములు కలవు. ఇవి జుగుప్సాకరములు. ఇవి గౌణవృత్తి నాశ్రయించుటచేత అసహ్యములు కాకపోవుటయే కాక అందమును గూడ సంపాదించుకొన్నవి. గౌణవృత్తి యనగా స్వార్థమును విడిచిపెట్టి పరార్థము నాశ్రయించుట. ఉమియుట, క్రక్కుట మొదలయినవి ప్రాణిధర్మములు. ఇవి సూర్యపద్మాదుల కారోపితము లగుటచేతనే స్వార్థమును గోల్పోయి, అన్యార్థము నాశ్రయింపవలసి వచ్చుచున్నది. వెలువడిన, బయటవడిన, విడువబడిన మున్నగు పదములతో చెప్పవలసిన యర్థమును నిష్ఠ్యూతాది పదములచేత చెప్పుట ఉక్తివైచిత్రి. అది గౌణవృత్తిమూలమున నిచ్చట సిద్ధించినది. ఇట్లు కాక స్వార్థమునందే నిష్ఠ్యూతాది పదముల నుపయోగించుట జరిగినయెడల ఘృణావంత మన్న దోషము కలిగి గ్రామ్యకక్ష్యలోనికి చేరును. ప్రకృతోదాహరణము గౌణవృత్తి నాశ్రయించుటచేత గ్రామ్యగుణముగా పరిగణితమైనది.

ఘృణావదర్థాంతరస్య యథా –

'కామినీగండ నిష్యందబిందు రిందు ర్మతో మమ
అన్యథా కథ మేతస్య జగదుద్ద్యోతినీ ద్యుతిః' 148

అత్ర రాగాతిశయ హేతుభూతయోః కామినీకపోల చంద్రమసోః స్వరూపభావనా మాహాత్మ్యా న్నార్థాంతరభావనా గుప్తేతి గండ నిష్యందబిందు రిత్యస్య ఘృణావదర్థాంతరస్యాపి న దోషత్వమ్.

అర్థము : ఘృణావదర్థాంతరమున కుదాహరణము. చంద్రుడు కామినీగండ నిష్యందబిందు వని నా యభిప్రాయము. అట్లు కానియెడల, ప్రపంచమునంతటిని ప్రకాశింపజేసెడి కాంతి యీతని కెట్లు లభించును? ఇది ఉదాహరణము.

ఇచ్చట రాగాతిశయహేతుభూతములైన కామినీకపోల చంద్రబింబముల స్వరూపభావనా మాహాత్మ్యముచేత అర్థాంతరభావన గుప్తమైపోవును. అందువల్ల

'గండనిష్యందబిందు' వన్నదానికి అసభ్యమైన అర్థాంతర మున్నప్పటికి దోషము కాదు.

వ్యాఖ్య : ప్రకృతార్థము రమణీయమై యుండియు అప్రకృతార్థము జుగుప్సాకరమై యున్నచో ఘృణావదర్థాంతర మన్న దోషము కలుగునని చెప్పుకొంటిమి. గుణత్వముచేత అర్థాంతర మప్రధానమై రమణీయమైన ప్రకృతార్థమే ప్రతీయమానమగునప్పుడు దోషము తొలగిపోవును.

ప్రకృతోదాహరణమున చంద్రుడు కామినీగండనిష్యందబిందువుగా భావింపబడెను. గండ మన్న మాటకు కపోలమని, పుండు అని రెండర్థములు కలవు. కపోలము ప్రకృతార్థము. పుండు అప్రకృతార్థము. దీనినిబట్టి యైనచో 'చంద్రుడు స్త్రీ యొక్క పుండునుండి కారుచున్న చీము' అన్న జుగుప్సాకరమైన యర్థము కలుగును. కాని 'ప్రపంచము నంతట్టిని ప్రకాశింపజేయు కాంతి' చంద్రుని కున్నట్లు తరువాత చెప్పబడినది. పూర్వాపరములు ఔచిత్యవంతముగా అన్వయము నొందవలయు నన్న అప్రకృతమైన అసభ్యార్థము గుప్తము కావలయును; ప్రకటనము నొందుట కెంతమాత్రమును వీలు లేదు. ప్రకృతార్థమునందు కామినీకపోలములు లావణ్యనిధానములు. కావుననే అందుండి స్రవించునవి లావణ్యబిందువులే కాని అన్యములు కావు. చంద్రుడుకూడ లావణ్యబిందువే. కావుననే జగదుద్ద్యోతకమైన కాంతిని గలిగియున్నాడు – అన్నది తాత్పర్యము. ఇచ్చట అసహ్యమైన అప్రకృతార్థము గుప్తమైపోవుటచేత దోషము తొలగి గుణత్వము కలిగినది. కావుననే ఘృణావదర్థాంతర గుణమున కిది యుదాహరణ మైనది.

ఘృణావత్ స్మృతిహేతు ర్యథా –
'విపూయ రశనావ న్తః పలాశాషాఢధారిణః
బ్రహ్మవర్చస్వినో యాన్తి ద్విజపోగండకా ఇమే' 149

అత్ర విపూయ పలాశ బ్రహ్మవర్చస పోగండ శబ్దానాం ఘృణావత్ స్మృతిహేతుత్వే ఉప్యన్యత్ర లక్షితత్వా దదోషత్వమ్.

అర్థము : ఘృణావత్ స్మృతిహేతువున కుదాహరణము. ముంజగడ్డిని మొలత్రాళ్లగా ధరించినవారును, కింశుకదండములను ధరించినవారును, బ్రహ్మతేజస్సు గలవారును నైన యీ ద్విజబాలకులు వెళ్ళుచున్నారు.

ఇచ్చట విహూయ వలాశ బ్రహ్మవర్చస పోగండ శబ్దములకు **అసభ్యస్మృతి** హేతుత్వ మున్నప్పటికిని, వానికి ఇతరార్థములందు లక్షితత్వమువల్ల దోషము లేదు.

**వ్యాఖ్య :** పదైకదేశముచేతనే అసభ్యమైన అర్థము స్మరణకు వచ్చునెడల **వృథావత్స్మృతిహేతు** వన్న దోషము కలుగు నని చెప్పుకొంటిమి. అసభ్యార్థములు ప్రసిద్ధార్థములు కాక లక్షితార్థము లగుచో ఆ దోషము తొలగిపోవును.

ప్రకృతోదాహరణమునందు విహూయ మని యనగా ముంజగడ్డి యని ప్రకృతార్థము. వి + హూయము అని యనగా ఎక్కువగా రసి కలది యన్నది లక్షితార్థము. **వలాశము** అని యనగా మోదుగు అని ప్రసిద్ధార్థము. 'పల + అశము' అని యనగా మాంసాహారమని యౌగికార్థము. వర్చస్వులు అని యనగా వర్చస్సుకలవా రని యర్థము. వర్చస్సు అనగా తేజ మని ప్రకృతార్థము; పురీషమని లక్షితార్థము; **పోగండకులు** అని యనగాబాలకు లని ప్రకృతార్థము; కురూపులు అని లక్షితార్థము. లక్షితార్థమని యనగాశ్రితమైన యర్థ మనియే యర్థము. కావున అసహ్యార్థము లన్నియు లక్షితార్థము లగుటచేత వానిని పరిత్యజించి ప్రకృతములైన సభ్యార్థములనే గ్రహించు టనముచితము. అప్పుడు దోషము పరిహృతమై గుణమే ప్రతీతి నొందును. కావుననే ప్రకృతోదాహరణము అసహ్యస్మృతిహేతు గుణమునకుదాహరణమైనది.

[ ఆ శ్ర యౌ చి త్య ము ]

ఏవ మన్యదపి ద్రష్టవ్యమ్. అత్రైవ చ

106. కించి దాశ్రయసంబంధా ద్ధత్తే శోభా మసాధ్వపి
కాంతా విలోచన న్యస్తం మలీమస మివాంజనమ్.
తద్యథా –
'అంత్రప్రోత బృహత్కపాల నలకక్రూర క్వణత్కంకణ
ప్రాయప్రేంఖిత భూరిభూషణరవై రాఘోషయత్యంబరమ్
పీతచ్ఛర్దిత రక్తకర్దమ ఘనప్రాగ్భార ఘోరోల్లసద్
వ్యాలోల స్తనభార భైరవవపుర్దర్పోద్ధతం ధావతి' 150
అత్రాశ్రయస్య బీభత్స రసోచితత్వా దదోషత్వమ్.

అర్థము : ఈ విధముగానే యింకొకటి కూడ కనబడుచున్నది. కాంతాలోచనములకు పెట్టిన కాటుక మసియే యైనప్పటికిని శోభను గూర్చును. అట్లే అసాధువైనది కూడ ఆశ్రయసంబంధమునుబట్టి శోభను సమకూర్చును. ఇది లక్షణము. ప్రేగులకు కూర్చబడిన పెద్ద పుసుకలును, ఎముకలును క్రూరముగా ధ్వని చేయుచున్న కంకణప్రాయములు కాగా, చలించుచున్న అధికమైన భూషణముల రవములతో ఆకాశమునంతను ప్రతిధ్వనింప జేయుచున్నదై – త్రాగి వాంతి చేసికొనిన బుర్దవంటి రక్తమును కలిగి గొప్ప భారముతో ఘోరముగా మొరయుచు నూగులాడుచున్న స్తనభారముతోడి భయంకరశరీరము దర్పోద్ధతముగా పరుగెత్తుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఆశ్రయముయొక్క బీభత్సరసోచితత్వమువల్ల అదోషత్వము.

వ్యాఖ్య : గ్రామ్యమునందు అంతర్భాగమయిన ఘృణావదర్థమునకు సంవీతి, గుప్తత్వము, లక్షితత్వము అను మూడింటివల్ల గుణత్వము కలుగుట ముందుగా ప్రస్తావింపబడినది. ఆశ్రయసంబంధమునుబట్టి కూడ అసాధువు (దోషయుక్తమైనది) దోషపరిహారము కాగా గుణముగా పరిణమించును. ఇది ఘృణావదర్థ గుణత్వమునందు మరొక అంతర్భాగము.

ప్రకృతోదాహరణమున తాటకారూపము వర్ణితము. పుసుకలను, ఎముకలను అలంకారములుగా ధరించుట – రక్తమును త్రాగుట, వాంతిచేసికొనుట, అదంతయు ఊగులాడుచున్న స్తనములపైని బురదవలె నంటుకొని యుండుట – అసహ్యకరమైన విషయములు. ఇది తాటకావర్ణన మగుటచేత, బీభత్సరసోచిత మగుటచేత ప్రకృతసందర్భమునుబట్టి గుణమే కాని దోషము కాదు. ఆశ్రయౌచిత్యముచేత ప్రకృతశ్లోకము సౌందర్యసంధాయకమై గుణవంతమగుచున్నది.

ఉదాహరణశ్లోకము భవభూతి రచించిన మహావీరచరితమునుండి గ్రహింపబడినది. లక్షణశ్లోకము భామహకృతము.

[ సన్నివేశౌచిత్యము ]

107. సన్నివేశవశాత్ కించి ద్విరుద్ధ మపి శోభతే
నీలం పలాశ మాబద్ధ మంతరాలే స్రజామివ.
తద్యథా –

'అన్త్రైః కల్పిత మఙ్గల ప్రతిసరాః స్త్రీహస్త రక్తోత్పల
వ్యక్తోత్తంస భృతః పినహ్య సహసా హృత్పుండరీకస్రజః
ఏతాః శోణితపంక కుంకుమజుషః సంభూయ కాన్తైః పిబ
న్త్యస్థిస్నేహసురాః కపాలచషకైః ప్రీతాః పిశాచాఙ్గనాః' 151

అత్ర శృంగారిణో౽పి జగదపి శృంగారమయం పశ్యంతీతి బీభత్సరసే౽పి మాధవే నాన్త్రాదిపదానా మన్తరాలేషు నివేశితానాం మఙ్గలప్రతిసరాది పదానా మదోషః.

అర్థము : కూర్పునకు లొంగుటవల్ల కొంచెము విరుద్ధమైనది కూడ పూలమాలలో మధ్యలో కూర్పబడిన నల్లని ఆకువలె అందమునే చేకూర్చును. ఇది లక్షణము. పిశాచాంగనలు ప్రేగులే మంగళకరములయిన తోరములుగా, స్త్రీల హస్తములే అవతంస రక్తకమలములుగా, హృదయపుండరీకముల దండలే పుష్పమాలలుగా, శోణితపంకమే కుంకుమముగా ధరించి తమ భర్తలతో కూడుకొని యిష్టముతో మజ్జారసమద్యమును త్రాగుచున్నారు. ఇది ఉదాహరణము.

ఇచ్చట శృంగారులు లోకమును శృంగారమయముగా చూతురనుటకు నిదర్శనముగా బీభత్సరసమునందు పైతము మాధవునిచేత 'ప్రేగులు' మొదలయిన పదములకు నడుమ కూర్పబడిన 'మంగళకరములైన తోరములు' మొదలయిన పదములకు దోషము లేదు.

వ్యాఖ్య : సన్నివేశ మనగా రచన యనియే భావము. విజాతీయములైన పదముల కూర్పు విరుద్ధతనే చేకూర్చవలయును; కాని ఔచిత్యవశమయిన పదరచన వల్ల విరుద్ధత తొలగిపోయి, సౌందర్యము సంప్రాప్త మగును. కావుననే యిచ్చట పత్రపుష్పసమ్మిశ్రితమైన హారమును సాదృశ్యసందర్శనమునకు గ్రహించుట జరిగినది.

ప్రకృతోదాహరణమున పిశాచాంగనలు వర్ణింపబడిరి. శవముల ప్రేగులు, ఛిన్న హస్తములు, కోసి వేరుచేసిన గుండెలు, బురదగా నైన రక్తము — వారికి అలంకారములు. ఇవన్నియు జుగుప్సను కలిగించునవే. పిశాచాంగనల వినోదమునకు యోగ్యములే. ఆ పిశాచాంగనలను దర్శించి వర్ణించుచున్నవాడు మాధవుడు. ఇతడు

శృంగారోన్ముఖమైన ప్రవృత్తి గలవాడు. అందువల్ల పిశాచాంగనల జుగుప్సావహమైన వేషమునందు కూడ, మంగళాస్పదములయిన హస్తసూత్రకములు, కమలావతంసములు, కుంకుమధారణ మున్నగునవియే వర్ణితము లయినవి. అమంగళకరమైన పిశాచాంగనల అలంకరణమునందు మంగళకరమైన హస్తసూత్రాది వర్ణనము విజాతీయమే. అయినప్పటికిని వక్తయొక్క శృంగారాభిముఖ్యమున కిది పోషకమై ఔచిత్యమును ప్రతిష్ఠించుచున్నది. కావుననే యిచ్చట దోషము లేదు.

ఉదాహరణశ్లోకము భవభూతి రచించిన మాలతీమాధవమునుండి గ్రహింపబడినది. లక్షణశ్లోకము భామహాకృతము.

108. అశ్లీలాదే రమీ భేదా భిద్యన్తే యత్త్రిధా త్రిధా
భవన్తి నవ తేనైతే పూర్వోక్తా దశ పంచ చ.

109. చతుర్వింశతి రిత్యేషా ప్రోక్తా పదసమాశ్రయా
సమాసాత్ పూర్వనిర్దిష్టదోషాణాం గుణకల్పనే.

110. ఇత్యేతత్పదదోషాణా మదోషత్వ ముదీరితమ్
ఇదానీం వాక్యదోషాణాం గుణత్వ మభిధీయతే.

అర్థము : అశ్లీలము మొదలయిన వానికి మూడేసి భేదములు కలవు. అందువల్ల అవితొమ్మిది భేదములగును. పూర్వము చెప్పినవి పదునైదు. వీనిని,వానిని కలుపగా మొత్తముమీద పదసమాశ్రయదోషము ఇరువది నాలుగు విధములైనది. పూర్వము చెప్పిన పదదోషములకు అదోషత్వము నిరూపిత మైనది. ఇప్పుడింక వాక్యదోషములకు గుణత్వము చెప్పబడును.

[ శబ్దవిహీన గుణము ]

111. తత్ర శబ్దవిహీనస్య వివక్షావశతః క్వచిత్
నిసర్గసుందరత్వేన గుణత్వం పరికల్ప్యతే.

యథా —

ఆక్షిపన్త్యరవిందాని ముగ్ధే తవ ముఖచ్ఛవిమ్
కోశదండ సమగ్రాణాం కిమేషాం ఖలు దుష్కరమ్. 152

అత్ర 'నలోకావ్యయ నిష్ఠాఖలర్థతృనామ్' ఇతికర్తృ కర్మణో: షష్ఠీప్రతిషేధే కిమేషాం దుష్కర మిత్యపభాషణేఽపి సంబంధమాత్ర వివక్షాతో గుణత్వమ్.

యదాహ —

'ఇదం హి శాస్త్రమాహాత్మ్య దర్శనాలసచేతసామ్
అపభాషణవద్భాతి న చ సౌభాగ్య ముజ్ఝతి.

**అర్థము** . వివక్షావశమున కొన్నియెడల నిసర్గసుందరత్వముచేత శబ్దవిహీన మన్న దోషమునకు గుణత్వము కల్పింపబడును. ఇది లక్షణము. అమాయికురాలా! నీ ముఖకాంతిని అరవిందములు నిరసించుచున్నవి. కోశదండసమగ్రులు లగువారికి ఇది దుష్కరము కాదుకదా! ఇది ఉదాహరణము.

ఇచ్చట 'న లోకావ్యయ నిష్ఠా ఖలర్థతృనామ్' అని కర్తృకర్మలకు షష్ఠి ప్రతిషేధ ముండగా 'కిమేషాం దుష్కర'మ్మన్నది అపభాషణమే యైనప్పటికిని సంబంధమాత్ర వివక్షవల్ల గుణత్వమే.

శాస్త్రమాహాత్మ్యమును దర్శించుటయందు అలసచేతస్కులయిన వారికి అపభాషణమువలె అనిపించును గాని, ఇది సౌభాగ్యమును వీడదు— అని పూర్వుల అభిభాషణము.

**వ్యాఖ్య** : అపశబ్దము గల వాక్యమును శబ్దహీన మన్న దోషముగా పరిగణింతురని యిదివరకు చెప్పబడినది. సహజసుందరత్వముచేత ఆ దోషముకూడ గుణముగానే పరిణమించు నని యిచ్చట నిరూపిత మగుచున్నది.

వ్యాకరణమునుబట్టి ఖలర్థయోగమునందు షష్ఠీవిభక్తి ప్రతిషేధింపబడినది. కాని ప్రకృతప్రయోగమునందు 'కిమేషాం ఖలు దుష్కరమ్'అని షష్ఠీవిభక్త్యంతమైన 'ఏషామ్' ప్రయోగింపబడినది. వ్యాకరణము నిషేధించినదానినే ప్రయోగించుట జరిగినది. అపశబ్దమును ప్రయోగించుటచేత ఇచ్చట శబ్దవిహీన మన్నదోష మున్నదనవలయును. ఈ విధమైన దర్శనమునుబట్టి యిది నిజమే.

'శేషే షష్ఠీ' అను నియమమునుబట్టి, సంబంధమునందు షష్ఠి వచ్చునవి వ్యాకరణమే విధించుచున్నది. సంబంధము సామాన్య మని విశేష మని రెండు విధ

ములు. జన్యజనకాది సంబంధము విశేషసంబంధము. అట్లు కానిది సామాన్యసంబంధము. దీనినే శేష మని యందురు. 'న లోక....' మొదలుగా గలది విశేషసంబంధ విషయము. శేషసంబంధమునకు ఆ నిషేధము అన్వయింపదు. కావుననే యిచ్చట దోషము పరిహృత మయినది.

ప్రకృతోదాహరణమునందు 'కోశదండ సమగ్రాణామ్' అనుచోట శ్లేష యున్నది. అరవిందములకు అండకోశము, దండము అనువానివల్ల సమగ్రత కలదు. రాజులకు దుష్కరము లేదు. 'రత్నహారీ తు పార్థివః' మున్నగు విధముగా ఎచ్చట మేలున్నను వారు సొంతము చేసికొందురు. అరవిందములునట్లే కోశదండసమగ్రము లగుటచేత మేలయిన నీ ముఖకాంతిని అపహరించు చున్నవని భావము. ఇచ్చట భావము నిసర్గరమణీయ మైయున్నది. అరవిందములకు ముఖమునకు గల సాదృశ్య మును (సంబంధమును) సుందరముగా ఉక్తివైచిత్రి నాశ్రయించి వెల్లడించుచున్నది. కావుననే యిచ్చట అపశబ్దపరమైన దోషముకాక సహజమైన సౌందర్యమే పరిగణిత మగుచున్నది.

దీని కుపబలకముగా రచయిత పూర్వప్రమాణమునుకూడ ప్రదర్శించుచున్నాడు. శాస్త్రమాహాత్మ్యమును సక్రమముగా, సమగ్రముగా ఎరుగనివారు మాత్రమే యట్టి యెడల దోషమును దర్శింతురనియు, ఎరిగినవారు సౌందర్యమునే దర్శింతురనియు ప్రమాణవచనతాత్పర్యము. సౌందర్యము భగ్నము కానంతవరకు శబ్దవిహీనము కూడ దోషము కాదు. అది సౌందర్యపోషకముగూడ నైనచో గుణమేయగును.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శము నందలిది.

[ క్రమ భ్రష్ట గుణము ]

112. యత్నః సంబంధనిర్జ్ఞానహేతుః కోఽపి కృతో యది
క్రమలంఘనమప్యాహు ర్నదోషం సూరయో యథా.
'బంధుత్యాగ స్తనుత్యాగో దేశత్యాగ ఇతి త్రిషు
ఆద్యంతా వాయతక్లేశౌ మధ్యమః క్షణికజ్వరః' 153

ఆద్యంతౌ మధ్యమ ఇతి సంబంధనిర్జ్ఞానహేతో ర్విధానా న్న శాబ్దక్రమలంఘనం దోషః వక్తుశ్చ బంధుత్యాగ దేశత్యాగయో

తన్మాత్యాగాద్గరీయస్త్వే నాభిమతత్వా దిత్యర్థక్రమలంఘనస్యాపి గుణత్వమ్.

అర్థము : సంబంధనిర్ణయము కారణముగా ఏదయిన యత్నము జరిగిన యెడల, దానిని పండితులు క్రమలంఘన మున్నప్పటికిని దోషముగా వచింపరు. ఇది లక్షణము. బంధుత్యాగము, తనుత్యాగము, దేశత్యాగము అను మూడింటియందు ఆద్యంతము లాయతక్లేశములు; మధ్యమము క్షణికజ్వరము. ఇది ఉదాహరణము.

ఆద్యంతములు లని మధ్యమ మని సంబంధనిర్ణయహేతువును విధించుటవల్ల శాబ్దక్రమలంఘనము దోషము కాదు. వక్త బంధుత్యాగ దేశత్యాగములకంటె తను త్యాగమునే గొప్పదిగా అభిమతించుటవల్ల అర్థక్రమలంఘనమునకును గుణత్వమే.

వ్యాఖ్య : శబ్దక్రమము కాని అర్థక్రమము కాని భగ్నమైనయెడల క్రమ భ్రష్ట మన్న దోషమగును. సంబంధనిర్ణయము నుద్దేశించి ప్రయత్నపూర్వకముగా క్రమమును తప్పించినయెడల అది దోషము కాదు. వేర్వేరు వస్తువులను కాని, అభిప్రాయములను కాని సమీకరించుటలో సౌలభ్య మున్నప్పుడు క్రమమును పాటింప వలసిన నిర్బంధము లేదనియే తాత్పర్యము.

ప్రకృతోదాహరణమునందు మూడువిషయములు చెప్పబడినవి. బంధుత్యాగము మిక్కిలి కష్టకరము; తనుత్యాగము క్షణికమైన బాధను కలిగించును; దేశత్యాగ మును మిక్కిలి కష్టకరము — అని వరుస తప్పకుండ చెప్పినయెడల క్రమభ్రష్టము అన్న దోషము తప్పును. కాని వినుటకింపుగా నుండకపోవుటయే కాదు; అన్య దోషముకూడ చొరబడుట కవకాశము కలదు. ఈ యభిప్రాయముతోనే వక్త 'ఆ ద్యంతములు' మన్నగు విధముగా చెప్పుట జరిగినది. మధ్యమమును చివర చెప్పుట చేత క్రమము తప్పినమాట వాస్తవమే. కాని, చెప్పుటతో ఒక లాఘవము చేకూరి నది. ఆ లాఘవమును, నిర్ణయాత్మకమైన సమీకరణము నుద్దేశించియే క్రమము మార్చుట జరిగినది. కావున, ఇది గుణమే కాని దోషము కాదు.

ఇచ్చట అర్థక్రమముకూడ మారినది. ఇదియు వక్తకు అభిమత మగుటవల్ల, నిర్ధారణకు అవకాశము కల్గించు సౌకర్య ముండుటవల్ల గుణమే కాని దోషము కాదు.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

[విసంధి గుణము]

113. విరూపసంధి యత్పూర్వం విసంధి చ నిరూపితమ్
న చ దుర్వచకే ప్రాయః ప్రగృహ్యాదౌ చ దుష్యతి.

అర్థము : విరూపసంధి యని పూర్వము నిరూపితమైన దోషము సాధారణముగా దుర్వచకమునందును, ప్రగృహ్యాదులందును దోషము కాదు.

తత్ర దుర్వచకే విరూపసంధి ర్యథా –
'జయ న్తి వర్షాస్వితి భర్గమర్గయోః
సుదుర్వచా దుర్వచక ప్రయుక్తయః
అథేన్ద్రగోప్త్రేఖమపోగ్రభోగ్రరు
గ్ద్రుడ్భమాగ్రుబుఃమ్నుమ్నౌ సద్ర్యగేధినః' 154

అత్రోత్తరార్ధ స్య విరూపసంధిత్వేఽపి దుర్వచకత్వేన కలావిద్భి రాదృతత్వాద్గుణత్వమ్.

యదాహుః –
'శుక స్త్రీ బాల మూర్ఖాణాం ముఖసంస్కారసిద్ధయే
ప్రహాసాయ చ గోష్ఠీషు వాచ్యా దుర్వచకాదయః'

అర్థము : దుర్వచకమునందు విరూపసంధి గుణమగుట కుదాహరణము. 'ఓ పర్వతరాజపుత్రీ! తొలగిపోయిన ఉగ్రకాంతి యగు సూర్యునికి శత్రువైన మేఘము తోడి ఆకాశము తారాపతి విరహితమై యున్నది. నడువుము. అట్లగుచో సహచరుడవై మమ్ము అనుసరింపుము' – అని వర్షాసమయములందు శివపార్వతుల అనను కరణీయములైన దుర్వచకప్రయుక్తములు విలసిల్లునుగాక. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఉత్తరార్ధమున విరూపసంధిత్వమే అయినను దుర్వచకత్వముచేత కళావేత్తల యాదరమును పొందుటవల్ల గుణత్వమే యగును.

చిలుకలయొక్కయు స్త్రీలయొక్కయు బాలురయొక్కయు మూర్ఖులయొక్కయు స్పష్టోచ్చారణసిద్ధికొరకును, పరిహాసప్రసంగములందును గోష్ఠులలో దుర్వచకాదులు ప్రయోగార్హము లని పెద్దల యభిప్రాయము.

**వ్యాఖ్య :** దుర్వచకము అని యనగా ప్రయత్నపూర్వకమైన కృత్రిమ భాషణ మని యర్థము. విరూపసంధి యని యనగా పదస్వరూపమును మార్చి ఉచ్చారణక్లిష్టతను కలిగించు సంధి యని యర్థము. విరూపసంధి దోషమే యైనను దుర్వచకమునందు గుణత్వము నొందుట యిచ్చట నిరూపిత మగుచున్నది.

ప్రకృతోదాహరణశ్లోకమునందలి ఉత్తరార్ధమునందు విరూపసంధి మిక్కుటముగా ప్రయుక్తమైనది. దండాన్వయక్రమమున ఆ వాక్యము లివి. 'నగేడ్జే, అపోగ్రభోగ్రరుగ్రుట్ ఖం అభేట్. అబ్రుణ్ముఖిః భ్రమః' అని ఈశ్వరు డనగా పార్వతి 'సధ్ర్యగ్ ఏధి నః'అని యన్నది. నగ + ఈట్ + జా = నగేడ్జా. సంబోధమునందు నగేడ్జే, అప + ఉగ్రభ + ఉగ్రరుక్ + ద్రుట్ = అపోగ్రభోగ్రరుగ్రుట్. న + భా + ఈట్ = అభేట్. అప్ + రుట్ + ముఖి = అబ్రుణ్ముఖి. ఇట్లు సంధివశమున కృత్రిమముగా పదములను క్లిష్టములుగా మార్చుట యిచ్చట జరిగినది. ఇది పార్వతీ పరమేశ్వరుల పరిహాసప్రసంగము లోనిది. పరస్పరకుతూహల వశంవదులైన పార్వతీపరమేశ్వరుల సంభాషణ మగుటచేత ఇది చమత్కారవర్ధకమే కాని చమత్కారభంజకము కాదు.

పరిహాసప్రసంగములలో దుర్వచకాదులు వాచ్యములే యన్న పెద్దల యనుమతివిగూడ గ్రంథకర్త యిచ్చట ప్రదర్శించుట తన ప్రతిపాదనము పూర్వప్రతిష్ఠిత మని తెలుపుటకే.

ప్రగృహ్యాదా విగతసంధి ర్యథా –

'కమలే ఇవ లోచనే ఇమే
అనుబధ్నాతి విలాసపద్ధతిః
న ఇతోఽబ్ద బుతావృత ప్రియో
న బుచ స్త్వంన యజూంషి ఊహసే'



అత్ర విసంధేః ప్రగృహ్యాది హేతుకత్వాద్గుణత్వమ్. యదాహ –

'న సంహితాం వివక్షామీత్యసంధానం పదేషు యత్
తద్విసంధీతి నిర్దిష్టం న ప్రగృహ్యాది హేతుకమ్.'

అర్థము : ప్రగృహ్యాదులందు విసంధి దోషము కాదనుట కుదాహరణము. ఈ లోచనములను కమలములను వలె విలాసపద్ధతి ననుబంధించుచున్నది. అతఁడిప్పుడు మేఘ ఋతువునందు ప్రియావిరహుఁడు. నీవు ఋక్కుల నూహించుట లేదు యజుస్సుల నూహించుట లేదు. ఇది ఉదాహరణము.

ఇచ్చట విసంధికి ప్రగృహ్యాది హేతుకత్వముపల్ల గుణత్వము. నేను సంహితను చేయ నని పదములయందు సంధానము చేయకుండిన విసంధి యుక్తముగా నిర్దేశింపబడినది. ప్రగృహ్యాదికారణమువల్ల సంధి చేయకుండుట విసంధి కాదు – అని పెద్దల వచనము.

వ్యాఖ్య : సంస్కృతవ్యాకరణమునందు ప్రగృహ్య మనునది యొకసంజ్ఞ ప్రగృహ్యముగా పేర్కొనబడిన యచ్చు మీదియచ్చుతో సంధి నొందదు. 'ఈదూద్ద్వివచనం ప్రగృహ్యమ్' మున్నగువిధముగా కొన్నియెడల ప్రగృహ్యసంజ్ఞ విహితమై యున్నది. ద్వివచనమునందు కలుగు ఈ, ఊ, ఏ అనునవి ప్రగృహ్యములు. కావున వీనికి పరమందున్న అచ్చుతో సంధి జరుగదు.

ఉదాహరణశ్లోకమునందు పూర్వార్ధ మొకలక్ష్యము. కమలే, లోచనే, ఇమే - అను మూడు పదములును ద్వివచనమునం దున్నవి కావుననే చివరి 'ఏ' వర్ణము తరువాతి యచ్చులతో సంధి నొందలేదు. ఇచ్చటి 'ఏ' ప్రగృహ్య మగుటయే దీనికి హేతువు.

మూడవపాదము మరొక లక్ష్యము. ఇచ్చట ప్రగృహ్యసంజ్ఞ వర్తించు స్థానములు లేవు. అయినను ప్రకృతిభావము కలిగిన స్థానములు రెండు కలవు. 'సః+ఇతః' అని యున్నప్పుడు 'సః'యందలి విసర్గకు లోపము కలుగును. అప్పుడు 'స + ఇతః' అని యుండి గుణసంధికి స్థానముగా భ్రమ కలిగించును, కాని యిట్టియెడల ప్రకృతిభావము కలుగును. అనగా, ఉన్నది యున్నట్లుగానే యుండిపోవును. ఇట్టియెడల సంధి చేయుట దోషము కాని, సంధి చేయకుండుట దోషము కాదు. అబ్ద + ఋతౌ అని యున్నప్పుడును గుణసంధి కావలసిన స్థానమే. 'ఋత్యకః' అని అ ఇ ఉ ఋ లకు ఋ పరమైనపుడు వికల్పముగా ప్రకృతిభావము విధింపబడినది. అందువల్ల 'అబ్దర్తౌ' అని సంధియైన రూపము కాక 'అబ్దఋతౌ' అని ప్రకృతిభావముతోడి రూపము వాడుట దోషము కాదు.

నాలుగవ పాదము మరొక లక్ష్యము. 'న + ఋచః' అనుచోట పైని చెప్పు కొన్నట్లు ప్రకృతిభావమే కలిగినది. 'యజూంషి + ఊహసే' అని యన్నప్పుడు 'యజూంష్యూహసే' అని యణాదేశసంధి కావలయును. అయినప్పటికిని 'ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ' అను సూత్రమునుబట్టి పూర్వవర్ణములు దీర్ఘములైనచో హ్రస్వము లగును. హ్రస్వములైనచో అట్లే ప్రకృతిభావముతో నుండిపోవును. కావుననే 'యజూంషి ఊహసే' యన్నది ప్రకృతిభావమునకే యుదాహరణము కాని విసంధిదోషమున కుదాహరణము కాదు.

ప్రగృహ్యాదు లని ఆదిశబ్దమును ప్రయోగించుటచేత ప్రకృతిభావము కూడ గ్రహింపబడినది.

[ పునరుక్త గుణము ]

114. అనుకంపాద్యతిశయో యది కశ్చిద్వివక్ష్యతే
న దోషః పునరుక్తేఽపి ప్రత్యుతేయమలంక్రియా.

యథా –

'హన్యతే సా వరారోహా స్మరేణాకాండవైరిణా
హన్యతే చారుసర్వాంగీ హన్యతే మంజుభాషిణీ' 156

అత్ర హన్యతే హన్యత ఇతి శబ్దపునరుక్తం చారుసర్వాంగీ వరారోహేత్యర్థపునరుక్తం చోభయమప్యనుకంపాద్యతిశయవివక్షయా మదోష ఇతి గుణత్వమ్.

అర్థము : అనుకంపాద్యతిశయము ఎక్కడనేని వివక్షింపబడునెడల పునరుక్తము దోషము కాదు; పైగా అలంకారముకూడ నగును. ఇది లక్షణము. అకారణశత్రువైన మన్మథునిచేత ఆ వరవర్ణిని చంపబడుచున్నది; సర్వమనోహరాంగి చంపబడుచున్నది; మంజుభాషిణి చంపబడుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట హన్యతే హన్యతే అని శబ్దపునరుక్తి; చారుసర్వాంగి, వరారోహ అని అర్థపునరుక్తి. ఈ రెండును అనుకంపాద్యతిశయవివక్షయందు అదోషము అనగా గుణత్వము నొందునని భావము.

వ్యాఖ్య : చెప్పిన శబ్దమును గాని, అర్థమును గాని మరల చెప్పుట పునరుక్త మన్న దోష మగును. దయాదిభావముల అతిశయమును అభివ్యక్తముచేయ నెంచినపుడు శబ్దపునరుక్తి గాని అర్థపునరుక్తి గాని దోషము కాక గుణమే యగును. పునరుక్తియే అతిశయిత్వమునకు అభివ్యంజక మగుటవల్ల అది సౌందర్యసంధాయకమై అలంకార మగును.

ప్రకృతోదాహరణమున 'హన్యతే' అను క్రియాపదము మూడుసారులు ప్రయుక్తమైనది. దీనివల్ల ఆ స్త్రీయొక్క దయనీయస్థితి అతిశయితముగా వ్యక్తమగుచున్నది. వరారోహ, చారుసర్వాంగి మున్నగు సమానార్థకపదముల పునరుక్తి వలన ఆమె సౌందర్యాతిశయము వెల్లడి యగుచున్నది. ఇట్లు పునరుక్తివల్ల దయనీయత అధికముగా నావిష్కృత మగుటచేతనే యీ పద్య ముదాహరణమైనది.

ఉదాహరణపద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

[ వ్యాకీర్ణ గుణము ]

115. పదానాం వ్యుత్క్రమో యత్ర క్రమేణ వ్యుత్క్రమేణ వా
తద్ వ్యాకీర్ణం విదుస్తస్య న దోషః క్వాపి తద్యథా.

'జుగుప్సత స్మైనమదుష్టభావం
మైవం భవా నక్షతసాధువృత్తిః
ఇతీవ వాచో నిగృహీతకంఠైః
ప్రాణై ర్నిరుధ్యన్త మహర్షిసూనోః' 157

అత్ర 'మాస్మ జుగుప్సత' ఇతి వక్తవ్యే 'జుగుప్సత స్మైన మదుష్టభావం మైనమ్' ఇతి పదవ్యతిక్రమస్య 'వ్యస్తేఽపీచ్ఛన్తి కేచిత్' ఇతి. లజ్జుజోర్వ్యశేషణ లక్షణత్వాద్గుణత్వమ్.

అర్థము: క్రమముచేత కాని వ్యుత్క్రమముచేత కాని పదములకు వ్యుత్క్రమము కలిగినయెడల దానిని వ్యాకీర్ణ మని యందురు. కొన్నియెడల అది దోషము కాదు. ఇది లక్షణము. అదుష్టభావుడైన వీని నీ విధముగా నసహ్యించుకొనవద్దు. నీవు అక్షతసాధుప్రవర్తనము కలవాడవు అను మహర్షిపుత్రుని మాటలు నిగృహీత కంఠములయిన ప్రాణములచేత రుద్ధము లయినవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'మాస్మ జుగుప్సత' అని చెప్పవలసి యుండగా 'జుగుప్సతస్మైన మదుష్టభావం మైవమ్' అనెడి పదవ్యతిక్రమమునకు 'వ్యస్తమునందును కొందఱిష్ట పడుదురు' అన్న లజ్జుజ్ఞాల విశేషలక్షణత్వమువల్ల గుణత్వము.

**వ్యాఖ్య :** వ్యుత్క్రమము అని యనగా వ్యతిక్రమ మని యర్థము. ఉండవలసిన పదములు ఉండవలసిన క్రమములో నుండకుండుటకే వ్యుత్క్రమము అని పేరు. వ్యాకీర్ణముఅని యనగా విశేషముగా విస్తరించుకొని యుండుట యని యర్థము. ఒకచోట నుండవలసిన పదములు క్రమము మార్చుకొనుటయే కాక దూరదూరముగా చెదరి యుండుటకూడ ఇచ్చట భావింపబడుచున్నది. అందుచేతనే క్రమముచేత కాని వ్యుత్క్రమముచేత కాని దూరస్థములైన పదము లున్నచో అది వ్యాకీర్ణదోష మగునని నిర్ణయము. కాని, అదికూడ కొన్నియెడల, అనగా లక్షణసమ్మత మైనపుడు దోషము కాక గుణమే యగును.

ప్రకృతోదాహరణమునందు 'మాస్మ జుగుప్సత' అని యుండవలసిన పదక్రమము మారిపోయినది. 'జుగుప్సత స్మ' యని ముందుగా ప్రయుక్తమై 'మా' యన్న నిషేధార్థకము దూరముగా ప్రయుక్తమైనది. ఇట్లుండుట వ్యాకరణసమ్మతమగుటచేత, ఇది దోషము కాదు. సందర్భమునుబట్టి యిట్లు వ్యాహతమైన వాక్యముండుటయే యుచితము. కావుననే, యిది గుణమున కుదాహరణమైనది.

[ సంకీర్ణగుణము ]

116. పర్యాయేణ ద్వయో ర్యత్ర వాక్యం ప్రశ్నోత్తరాదిషు
సంకీర్ణం తన్న దోషాయ వాకోవాక్యవిదో విదుః.

యథా -

'బాలే నాథ విముంచ మానిని రుషం రోషాన్మయా కిం కృతం
ఖేదోఽస్మాసు న మేఽపరాధ్యతి భవాన్ సర్వేఽపరాధా మయి
తత్కిం రోదిషి గద్గదేనవచసా కస్యాగ్రతో రుద్యతే
నన్వేతన్మమ కా తవాస్మి దయితా నాస్మీత్యతో రుద్యతే' 158

అత్ర సంకీర్ణత్వేఽపి వాకోవాక్యత్వా న్న దోషః.

అర్థము : పర్యాయక్రమమున ఇర్వురి ప్రశ్నోత్తరరూపమయిన వాక్యము సంకీర్ణమయినను, అది దోషము కాదని వాకోవాక్యవిదు లెరుగుదురు. ఇది లక్షణము. 'బాలా!' 'నాథ!' 'మానినీ! రోషము విడిచిపెట్టుము.' 'రోషమువల్ల నేమయినది?' 'మాయందు దుఃఖము' 'నాపట్ల నీ వపరాధము చేయలేదా!' 'అన్ని యపరాధములును నాయందే యున్నవి. మరి, గద్గదమైన వాక్యములతో ఎందుల కేడ్చుచుంటివి!' 'ఎవనిముందర ఏడ్చితిని!' 'నాముందరనే' 'నేను నీకు ఏమవుదును!' 'ప్రియురాలవు' 'కాను. కనుకనే యేడ్చుచున్నాను.' ఇది ఉదాహరణము.

ఇచ్చట సంకీర్ణత్వ మున్నప్పటికిని వాకోవాక్యమువల్ల దోషము కాదు.

వ్యాఖ్య ఒక వాక్యమునందలి పదములు వాక్యాంతరమునందలి పదములతో సమ్మిశ్రణము చెందినయెడల సంకీర్ణ మన్న దోష మగునని చెప్పుకొంటిమి. వాకోవాక్యమునందు అట్లు సమ్మిశ్రణము కలిగినప్పటికిని దోషము కాదు. సంభాషణౌచిత్యమునుబట్టి గుణమే యగును. వాకోవాక్య మని యనగా సంభాషణ మని యర్థము.

సంభాషణమునందు కర్త కర్మ క్రియల క్రమము కానరాదు. అధ్యాహృతము లగు పదము లెక్కువగా నుండును. వాక్యము సమగ్రముగా లక్షితము కాదు. ఇట్లు వాక్యభాగములచేతనే పరస్పరము తమ యభిప్రాయములను ప్రకటించుకొనుట సంభాషణమునందు సాధ్యమే. సాధ్య మగుట యొక్కటియే కాదు; సంక్షిప్తతకు పైతము నుపాకరించును. కావున, ఇట్టిచోట్ల సంకీర్ణమన్న దోషము పట్టదు.

ప్రకృతోదాహరణమునందు రోషమునొందిన ప్రియురాలిని సాంత్వనపరుచుటకు ప్రియుడు చేయు ప్రయత్నమును, తత్సందర్భమున నిరువురకు నడుమ నడచిన ప్రసంగమును వర్ణితములు. 'రోషమువల్ల నేమయినది?' అన్న ప్రశ్నకు 'మాయందు దుఃఖము' అన్నది సమాధానము. నిజమునకు 'దోషమువల్ల మాయందు దుఃఖము కలిగినది' అని చెప్పినప్పుడు కాని సమాధానవాక్యము సర్వాంగసమన్వితము కాదు. ప్రశ్నమునం దున్న పదములు కొన్ని సమాధానమునందు పునరావృత్తములు కాక పోయినను భావగ్రహణసందర్భమున నూహింపబడును. కావుననే సంభాషణసౌష్ఠవము నాశించు వక్త వాని నన్నింటిని పునరావృత్తము చేయకుండుటయే సమంజసము. కావుననే యిది దోషగుణమున కుదాహరణమైనది.

ఉదాహరణశ్లోకము అమరుకమునుండి గ్రహింపబడినది.

[ అపద గుణము ]

117\. ప్రకృతిస్థాది భేదేన గ్రామ్యాదిభి రథాపి యా
అపదం తస్య చానుజ్ఞా భాషాచిత్రే విధీయతే.

యథా —

'హ త్తో జ్జో జ్జలదేఉ నైవ మదనః సాక్షాదయం భూతలే
తత్కిం దీసఇ సచ్ఛమా హాతవపుః కామః కిల శ్రూయతే
ఐదూప కిఅలేఉ భూతపతినా గౌరీ వివాహోత్సవే
ఐసేం సచ్ఛజిబొల్లు హస్తకటకః కిం దర్పణే నేక్ష్యతే' 159

అత్ర గ్రామ్యః ప్రష్టా నగర మాగతో రాజానం దృష్ట్వా గ్రామ్యైః ప్రకృతిస్థై రేవ వా పదైః ప్రాకృతేన పృచ్ఛతి — 'హ త్తో జ్జోజ్జలదేఉ' ఇతి. నాగరశ్చ తమనుజిఘృక్షురుపనాగరైః కోమలై ర్వా పదైః స వక్రోక్తి ప్రత్యాచష్టే — 'నైవ మదనః సాక్షాదయం భూతలే' ఇతి. అథ గ్రామ్యః ఆహితప్రతిభః పూర్వపదానురోధా దర్ధప్రాకృతేనైవ గ్రామ్యోపనాగరైః ప్రకృతిస్థకోమలై ర్వా పదై స్తము పాలభతే — 'తత్కిం దీసఇ సచ్ఛమా హాతవపుః కామః కిల శ్రూయతే' ఇతి. అథ నాగరో జ్ఞాతతత్ప్రావీణ్యః పాదానురోధాదేవ అర్ధప్రాకృతేన గ్రామ్యోపనాగరైః ప్రకృతిస్థకోమలకఠోరై ర్వా పదైః సమాధత్తే — 'ఐదూపకిఉలేఉ భూతపతినా గౌరీవివాహోత్సవే' ఇతి. అథ గ్రామ్యః శ్లోకసమాప్తేః పాదస్య తదుత్తరస్య చానురోధాత్ గ్రామ్యాణి ప్రకృతిస్థాని వా త్రిచతురాణి పదాని ప్రాకృతేనోక్త్వా పాదార్ధ ఏవ తిష్ఠతి — 'ఐసేం సచ్ఛజి బొల్లు' ఇతి. అథ నాగరో జితకాశీ గ్రామ్యోపనాగరనాగరైః ప్రకృతిస్థకోమలకఠోరై ర్వా పదైః శ్లోక ముత్తరం చ పూరయతి — 'హస్తకటకః కిం దర్పణే నేక్ష్యతే'

ఇతి. తత్ర చ ప్రాకృతానాం సర్వేషామపి గ్రామ్యత్వమ్. ప్రష్టుః సంస్కృతపదేషు వపు రిత్యుపనాగరం శేషాణి గ్రామ్యాణి. ప్రతి వక్తుశ్చ హస్త వివాహ గౌరీపదాని గ్రామ్యాణి, భూతిపతినేతి నాగరమ్, శేషాణ్యుపనాగరాణి. తదిదమీదృశి ప్రమేయే తథైవోపక్రమాదేత న్న దుష్యతి.

అర్థము : ప్రకృతిస్థాది భేదముచేతను గ్రామ్యాదులచేతను అపద మైనది. భాషాచిత్రమునందు అనుమతి నొందుచున్నది. ఇది లక్షణము. 'అతడేనా ఈ జన దర్శనీయుడు?' 'భూలోకమున నీతడు సాక్షాన్మదనుడుకదా!' 'ఏమీ! నిజముగా కనిపించునా! కామునకు శరీరము లేదని వింటినే!' 'భూతపతియైన శంకరునిచేత గౌరీ వివాహోత్సవమునందు ఏదో వ్యాజమున కృతదేహు డయ్యెను.' 'ఓహో! నీవు చెప్పినది సత్యమేనా!' 'ముంజేతి కంకణము నద్దములోఁ జూచుకొందువా! ఇది ఉదాహరణము.

ఇచ్చట నగరము వచ్చిన గ్రామీణుడు పృచ్ఛకుడు. అతడు రాజును చూచి 'హ తో జోజ్జలదేఉ' అని గ్రామ్యపదములతోడను ప్రకృతిస్థపదములతోడను ప్రాకృతమున నడుగును. నాగరకుడు అతనిని అనుగ్రహింపదలచినవాడై 'నైవ మదనః సాక్షాదయం భూతలే' అని ఉపనాగరపదములతోడను కోమలపదములతోడను వక్రోక్తిసహితముగా బదులు పలుకును. అప్పుడు ఆహితప్రతిభుడైన (శిక్షణచేత సంస్కారవంతుడైయున్న) గ్రామీణుడు 'తత్కిం దీసఇ నచ్చమా హతవపుః కామః కిల శ్రూయతే' అని పూర్వపదనిర్బంధమువల్ల అర్ధప్రాకృతమున (పూర్వభాగము ప్రాకృతము; ఉత్తరభాగము సంస్కృతము) గ్రామ్యోపనాగర పదములతోడను ప్రకృతిస్థకోమల పదములతోడను నాగరకుని మదలకించును. అప్పుడు నాగరుడు తత్త్వావీణ్యము నెరిగినవాడై 'ఐదూఏ కిఅలేఉ భూతపతినా గౌరీవివాహోత్సవే' అని పాదానురోధమువల్ల అర్ధప్రాకృతమున గ్రామ్యోపనాగర నాగరపదములుతోడను ప్రకృతిస్థ కోమల కఠోరపదములతోడను సమాధానము నొసగును. అప్పుడు గ్రామీణుడు శ్లోకసమాప్తి పాదముయొక్క తదుత్తరముయొక్క నిర్బంధమువల్ల 'ఐసేం నచ్చజి బొల్లు' అని గ్రామ్యములును ప్రకృతిస్థములునైన మూడు నాలుగు పదములతో ప్రాకృతమున పాదార్ధమును మాత్రమే పలికి నిలిచిపోవును. అప్పుడు జితకాశియైన నాగరుడు 'హస్తకటకః కిం దర్పణే నేక్ష్యతే' అని గ్రామ్యోపనాగర నాగర పదములతోడను ప్రకృతిస్థ కోమల కఠోరపదములతోడను శ్లోకమును సమాధానమును

గ్గూఢ సమాప్తము గావించును. అచ్చట ప్రాకృతపదముల కన్నింటికి గ్రామ్యత్వమ్ము వృచ్ఛకుని సంస్కృతపదములందు 'వపుః' అనునది మాత్రమే ఉపనాగరము. తక్కిన వన్నియు గ్రామ్యములు. ప్రతివక్త మాటలలో హస్త వివాహ గౌరీ పదములు గ్రామ్యములు; భూతిపతి యన్నది నాగరము; మిగిలినవి ఉపనాగరములు. ఈ విధమైన ప్రమేయము (సన్నివేశము)నందు, అటువంటి ప్రారంభ మున్నప్పుడు, ఇది దోషము కాదు.

వ్యాఖ్య : 'చిత్తం రంజయతీతి చిత్రమ్' చిత్తమును రంజింపజేయునది చిత్రము. భాషామూలమున చిత్తమును రంజింపజేయునది భాషాచిత్రము. గ్రామ్య నాగరోపనాగరములను గాని, ప్రకృతిస్థకోమలకఠోరములను గాని కలిపి చెప్పుటచేత అపద మన్న దోషము కలుగును. కాని భాషాచిత్రమునందు అది దోషము కాక సందర్భౌచిత్యమునుబట్టి చిత్తరంజకము గూడ నగును. ప్రకృతోదాహరణమునందు గ్రామ్యాదులను ప్రకృతిస్థాదులను సమ్మిశ్రణము చెందుటయే కాక సంస్కృతము లును సమ్మిశ్రణము చెందినవి. గ్రామీణవ్యక్తి ప్రాకృతమును, నాగరవ్యక్తి సంస్కృతమును వాడుట సహజమే. ఇచ్చట అంతటితో ఆగిపోలేదు గ్రామీణుడు కొంచెము శిక్షణ నొందినవాడగుటచేత ఆ సంస్కారబలమున కొంచెముగా సంస్కృత మును వాడగలడు. నాగరుడు గ్రామీణునియందు అనుగ్రహము కలవాడగుటచేత, ఆతనికి సన్నిహితమైన ప్రాకృతమును వాడుటకు యత్నము చేయును. పాత్రౌచిత్య మునుబట్టి భాషాసమ్మిశ్రణము సైతము చిత్తరంజకమై సారస్యమునే సంధానించు చున్నది. కావుననే, యీ శ్లోకము అపదగుణమున కుదాహరణ మైనది.

## [ వాక్యగర్భిత గుణము ]

118\. వాక్యాంతర సగర్భం యద్వాక్యం తద్వాక్యగర్భితమ్
రసాంతర తిరస్కారే తదిష్టం నేష్ట మన్యథా.

యథా —

'దిక్కాలాత్మసమైవ జాతిర్ విభక్తి చతురాశ్రమాటా మహీ సాధ్యతే
సిద్ధా సా చ వదంత ఏవ హి వయం రోమాంచితాః పశ్యత
విప్రాయ ప్రతిపాద్యతే కి ముపరం రామాయ తస్మై నమో
యస్మాదావిరభూత్ కథాద్భుత మిదం యత్రైవ చాస్తంగతమ్' 160

అత్ర 'యథోక్తా మహీ సాధ్యతే,సిద్ధా సా చ విప్రాయ ప్రతిపాద్యతే' ఇతి వక్తవ్యే, యేయం వీరాద్భుతరసప్రవృత్తేన 'వద స్త ఏవ హి వయం రోమాంచితాః పశ్యత' ఇతి వాక్యేన ప్రవృత్తవాక్యోక్తే రసమాప్తావేవ 'విప్రాయ' ఇత్యాది పదవిచ్ఛిత్తిః సా రసాంతర తిరస్కృతి రిత్యుచ్యతే. తయా చేదం వాక్యాంతరసగర్భమపి వాక్యం న దోషాయ భవతి.

అర్థము : వాక్యాంతరమును గర్భమునందు ధరించిన వాక్యమును వాక్య గర్భిత మని యందురు. అది రసాంతరమును తిరస్కరించునప్పు డిష్టమే యగును. అట్లు కానియెడల ఇష్టము కాదు ఇది లక్షణము. దిగ్గజఘటా విభక్తమై చతురస్రముగా నున్న భూమి జయింపబడుచున్నది. అది సిద్ధించినది. చెప్పుచుండగనే మేము రోమాంచితుల మగుచున్నాము. చూడుడు. విప్రునికి దానము చేయబడుచున్నది. ఇంతకంటె నేమున్నది: ఎవనివలన ఈ కథాద్భుతము పుట్టినదో, యెవనియందు అస్తమించినదో ఆ (పరశు) రామునకు నమస్కారము.

ఇచ్చట 'పైని చెప్పినటువంటి భూమి జయింపబడుచున్నది. అది సిద్ధించినది విప్రునికి దానము చేయబడుచున్నది' అని చెప్పవలసియుండగా 'చెప్పుచుండగనే మేము రోమాంచితుల మగుచున్నాము' అన్న వీరాద్భుతరసప్రవృత్తమైన వాక్యము చేత ప్రకృతవాక్యము పరిసమాప్తి నొందకుండగనే 'విప్రునికి' మున్నగు పదముల విచ్ఛిత్తి రసాంతరతిరస్కృతి యని యనబడుచున్నది. దానిచేత ఇది వాక్యాంతర సగర్భమే (వాక్యగర్భితమే) అయినప్పటికిని దోషము కాదు.

వ్యాఖ్య : రసాంతర మని యనగా అన్యరస మని యర్థము. అన్యరసమును తిరస్కరించుట యనగాఅభీష్టరసమును అవ్యాహతముగా పోషించుట యనియే భావము. ప్రకృతవాక్యము పరిసమాప్తము కాకుండగనే రెండుగా విరిగి, వాక్యాంతరమును తనయందు ధరించుట వాక్యగర్భితదోషము. కాని వాక్యార్థప్రతీతికి అంతరాయము లేకపోవుటయే కాక, ఉద్దిష్టరసమునకు పుష్టికూడ చేకూరునెడల వాక్యగర్భితము దోషము కాదు. అన్యరసతిరస్కారముచేత అభీష్టరసపురస్కారము జరుగుట చేత ఇది గుణమే యగునని తాత్పర్యము.

ప్రకృతోదాహరణమునందు పరశురాముని యుద్ధవీరత్వ దానవీరత్వములు వర్ణితములు. అభీష్టరసము వీరము. సర్వభూమండలమును సాధింపవలయు నన్న సంకల్పము కలిగినది. వెనువెంటనే అది సాధింపబడినది. ప్రయత్నవ్యవధానము కాని, కాలవ్యవధానము కాని లేదని యర్థము. అట్టిది పరశురాముని వీరత్వము. లోకోత్తరమైన యీ వీర్వతము అద్భుతావహము. ఇట్లు గెల్చిన యీ సర్వభూమండలము నొకానొక విప్రునికి హేలగా దానము చేసెను. ఈ దానవీరత్వముకూడ అద్భుతావహమే. కావుననే వక్త తాను చెప్పదలచుకొన్న విషయమును సాంతము చెప్పకుండగనే, నడుమ వీరాద్భుత రసనిష్పన్నమయిన తన హర్షనిర్భర రోమాంచ ప్రసంగమును చేయుచున్నాడు. ఇది వాక్యగర్భితమే. అయినను ప్రకృతరస పోషణ సమర్థమే యగుటచేత, ఇది దోషము కాక గుణమే యగుచున్నది.

ఉదాహరణశ్లోకము భట్టప్రభాకరుని రచనగా క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చ యందు ప్రదర్శింపబడినది.

[భిన్నలింగ భిన్నవచన గుణము]

119. యద్భిన్నలింగ మిత్యుక్తం విభిన్నవచనం చ యత్
ఉపమాదూషణం తన్న యత్రోద్వేగో న ధీమతామ్.

యథా –

అన్యదాభూషణం పుంసః శమో లజ్జేవ యోషితః
పరాక్రమః పరిభవే వైయాత్యం సురతేష్వివ 161

అత్ర 'పుంసో యోషిత ఇవ' ఇతి లింగభేదః 'పరిభవే సురతేష్వివ' ఇతి తు లింగభేదో వచనభేదశ్చ దృశ్యతే. న చైషామేవ పరస్పర ముపమానోపమేయభావవివక్షాయాం పర్యాయాంతరాభావా దన్యథాకర్తుం న శక్యత ఇతి సహృదయానుద్వేజకత్వా న్న దుష్యతీతి దోషస్యాపి గుణత్వమ్. తదిదం ద్వయో రప్యేక ముదాహరణమ్.

అర్థము పండితుల కుద్వేగమును కలిగింపనియెడల భిన్నలింగ మనియు భిన్నవచన మనియు చెప్పబడినవి ఉపమాదోషములు కావు. ఇది లక్షణము పరాభ

వమునందు పరాక్రమమును సురతములందు దిట్టతనమునువలె, ఇతరసమయమందు పురుషునకు శాంతమువలె స్త్రీకి సిగ్గు భూషణము. ఇది ఉదాహరణము.

ఇచ్చట 'పురుషునకు స్త్రీకివలె' 'శాంతము లజ్జవలె' 'పరాక్రమము దిట్టతనము వలె' అని లింగభేదము; 'పరాభవమునందు సురతములందు వలె' అని లింగభేదమును వచనభేదమును కనబడుచున్నది. వీనికి పరస్పరము ఉపమానోపమేయ భావవివక్షయందు పర్యాయాంతరము లేకపోవుటచేత మరొక విధముగా చేయుటకు వీలు లేదు. కావున నిది సహృదయులకు ఉద్వేజనము (కలతపెట్టునది) కాదు. అందువల్ల దోషము కాక గుణమే యగుచున్నది. ఇచ్చట రెండింటికి నొక్కటే యుదాహరణము.

వ్యాఖ్య : ఉపమానోపమేయములకు లింగభేద మున్నయెడల భిన్నలింగ మన్న దోషము కలుగును; వచనభేద మున్నయెడల భిన్నవచన మన్న దోషము కలుగును. కాని భిన్నలింగ భిన్నవచనములు సహృదయులను కలత పెట్టనియెడల వానిని దోషములుగా పరిగణింపవలసిన యవసరములే దని నిష్కర్షము.

ప్రకృతోదాహరణమున స్త్రీపురుషులనే ఉపమేయోపమానములుగా వివక్షించుట జరిగినది. ఇచ్చట లింగభేదము తప్పదు, మార్గాంతరము లేదు. పైగా ఉద్దిష్టమే యిది. కావున ఉద్వేగకరము కూడ కాదు. తక్కిన చోట్ల నున్న లింగభేదము సంస్కృతభాషాశ్రయము. 'శమః' పుంలింగశబ్దము; 'లజ్జా' స్త్రీలింగశబ్దము .'పరాక్రమః' పుంలింగము; 'వైయాత్యమ్' నపుంసకము. పై చోట్ల భిన్నలింగములకు ఔపమ్యము వివక్షితమైనది. 'పరిభవే' పుంలింగము, ఏకవచనము, సప్తమ్యంతము; 'సురతేషు' నపుంసకము, బహువచనము, సప్తమ్యంతము. కావున ఇచట భిన్నలింగములకును భిన్న వచనములకును ఔపమ్యము వివక్షితమైనది.

ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

అథ భిన్నలింగస్యైవ యథా –

'యస్య త్రివర్గశూన్యాని దినాన్యాయాంతి యాంతి చ
స లోహకార భస్త్రేవ శ్వసన్నపి న జీవతి' 162

అత్ర ప్రాగ్వదేవ పర్యాయాంతరాభావాత్ 'స లోహకార భస్త్రేవ' ఇతి లింగభేదస్య న దోషః.

అర్థము : ఇప్పుడు భిన్నలింగములకు మాత్రమే యుదాహరణము. త్రివర్గ శూన్యములై దినము లేవనికి వచ్చుచు పోవుచుండునో వాడు గాలి పీల్చుచున్నప్పటికిని కమ్మరితిత్తివలె జీవము కలవాడు కాడు.

ఇచ్చట పూర్వోదాహరణమునందు వలెనే పర్యాయాంతరము లేకపోవుటవల్ల 'స లోహకార భస్త్రేవ' అన్నలింగభేదము దోషము కాదు.

వ్యాఖ్య : ఉపమేయము 'స' (వాడు) – పుంలింగము, ఏకవచనము. ఉపమానము 'లోహకారభస్త్రి' (కమ్మరితిత్తి) – స్త్రీలింగము. ఏకవచనము. ఇచ్చట మరొక శబ్దము నుపయోగించుటకు వీలు లేదు. కావుననే ఉద్వేగకరము కాక సహృదయసమ్మతమైనది.

భిన్నవచన స్యైవ యథా—

'ప్రాజ్యప్రభావః ప్రభవో ధర్మస్యాస్తరజస్తమాః
ముక్తాత్మనః శివం నేమి రన్యేఽపి దదతాం జినాః' 163

అత్ర 'నేమి రన్యేఽపి' ఇతి వచనభేదదోషేఽపి 'దదతామ్' ఇతి క్రియాపదాదే ర్వచనశ్లేషమాహాత్మ్యాద్గుణత్వమ్. న చేదం వాచ్యం మ్రతేవాది ర్న విద్యతే ఇతి నోపమాత్వమ్. ఇవస్యాపి నాసము చ్చయార్థేన తుల్యధర్మాణాం తు 'ధర్మస్య ప్రభవః' ఇత్యాదిభి ర్వచనశ్లేషై ర్వివయాపహారాత్. యథా అగ్రతో ద్యోతకలోప ఉపమాయామ్- 'కోమల పాటలా తన్వి పల్లవశ్చాధరశ్చ తే' నన్వేషోఽపి శ్లేషః కస్మాన్న భవతి? ఉచ్యతే— 'యత్ర ద్వయోః సదృశయో రభిధానం స శ్లేషః. యత్ర సదృశాత్ సదృశప్రతిపత్తి స్తదుపమానమ్, యత్ర ద్వయోః సాదృశ్య మభిధీయతే ప్రతీయతే వా సోపమా' ఇతి ప్రబంధే నాగ్రతో వక్ష్యామః. ఉపలక్షణం చైతత్— యదుపమాయామేవ లింగవచనభేదో న దూషణమితి. తస్య సర్వాలంకార సాధారణత్వాత్ కేవలం సాదృశ్య మలంకార ఇతి దర్శనే ఉపమాయా ముదాహ్రియతే,

అర్థము: భిన్నవచనమున కుదాహరణము. ప్రసిద్ధప్రభావుడును, ధర్మమున కాలవాలమును, పోగొట్టబడిన రజస్తమోగుణములు కలవాడును ముక్తాత్ముడునైన నేమియు, ఇతర జినులును మనకు మంగళముల నిత్తురుగాక! దీనికి శ్లేష మూలమున మరొక యర్థము కలుగుచున్నది. అది యిది. ప్రసిద్ధమైన ప్రభలు కలవారును, ధర్మప్రభువులును, గతరజస్కులలో శ్రేష్ఠులును, ముక్తాత్ములు నైన యితర జినులును నేమియును మీకు మంగళము నిత్తురుగాక!

ఇచ్చట 'నేమి 'రన్యేఽపి' అని వచనభేద దోష మున్నప్పటికిని 'దదతామ్' అన్న క్రియాపదాదియైన వచనశ్లేషమాహాత్మ్యమువల్ల గుణత్వము. ఇచ్చట 'ఇవ' మొదలయిన పదము లేదు కొబట్టి ఉపమాత్వము లేదని యనరాదు. 'ఇవ'శబ్దమునకు 'అపి' శబ్దముచేత సముచ్చయార్థముచేత తుల్యధర్మములకు 'ధర్మస్య ప్రభవః' మున్నగు వచనశ్లేషలచేత విషయాపహారము జరుగుచున్నది. ఉపమయందు ద్యోతక-లోపమునకు 'తన్వీ! నీవల్ల పమును నధరమును కోమలాపాటలములు' అన్నది ఉదాహరణము. ఇది మాత్రము శ్లేష యేల కాదు? 'సదృశము లైన రెండింటిని చెప్పుట శ్లేష. సదృశమువల్ల సదృశప్రతిపత్తి జరిగినయెడల అది ఉపమానము, రెండింటికి సాదృశ్యము చెప్పబడుట కాని సూచింపబడుట కాని జరిగినయెడల అది ఉపమ' అని ప్రబంధముచేత ముందు వివరింపగలము. ఉపమయందు మాత్రమే లింగవచనభేదము దూష్యము కా దన్నది ఉపలక్షణము. దానికి సర్వాలంకార సాధారణత్వమువల్ల సాదృశ్యమే అలంకారమని ప్రదర్శించుటకు ఉపమయం దుదాహరింపబడినది.

వ్యాఖ్య: ప్రకృతోదాహరణము నందలి క్రియాపదము 'దదతామ్' (ఇత్తురు గాక అని యర్థము) లోట్రూపము, ప్రథమపురుషబహువచనము. కర్తృపద మేకవచన మైనయెడల సమన్వయము సమర్థనీయము కాదు. 'నేమిః' అనునది కర్తృపదము, ఏకవచనాంతము. ప్రాజ్యప్రభావః, ధర్మస్యప్రభవః, అస్తరజస్తమాః, ముక్తాత్మా – అన్న విశేషణము లేకవచనాంతములై కర్తృపదముతో నన్వయమును కలిగియున్నవి. 'దదతామ్' అన్న బహువచనాంతక్రియారూపము కర్తృపదమున కనురూపముగా లేదు. 'అన్యేఽపి జినాః' అన్నవికూడ కర్తృస్థానీయములే. 'నేమిః శివం దత్తామ్' అన్న యేకవచనరూపము 'అన్యేఽపి జినాః శివం దదతామ్' అన్న బహువచనరూపము సముచ్చితము లైనప్పుడు ఏకవచన బహువచనకర్తల కుభయ సామాన్యముగా బహువచనాంతక్రియయే యుండవలయును. అప్పుడు 'దదతామ్' అని యుండుట దోషము కాక గుణమే యగును.

పైని చెప్పినట్లు కాక 'జినాః' అనునదే ప్రధానకర్తృపదము కావచ్చును. అప్పుడు 'ప్రాజ్యప్రభాః, అస్తరజస్తమాః, ముక్తాత్మానః అన్యేఽపి జినాః వః శివం (దదతామ్) నేమిః దత్తామ్' అన్న అన్వయము కలుగును. ఇప్పుడుకూడ భిన్నవచనత్వము తప్ప లేదు. అయినప్పటికిని సందర్భమునుబట్టి క్రియావాచకమును సరియైనదానితో గ్రహింపవలయును. కావున, ఇచ్చట నిది భిన్నవచనము దోషము కా దనుటకే యుదాహృతమైనది.

భోజదేవుడు తన వృత్తియందు మరొక విషయము నెత్తుకొనుచున్నాడు. లక్ష్యముగా చూపిన పద్యమునందలి యలంకారము శ్లేషయా? ఉపమా? యన్నది ప్రశ్న. ఉపమయే యైనచో 'వలె' మున్నగు ఉపమావాచకము ఉండవలెను. అది లేదు. కావున ఔపమ్యము లేదని యనరాదు. లుప్తోపమయందు వాచకాదులకు లోపము సమ్మతమేకదా! కాని 'ధర్మస్య ప్రభవః' మున్నగుచోట్లు శ్లేష నాశ్లేషించుకొన్నవి. ధర్మమునకు ప్రభువులు' అని బహువచనార్థమై యుండగా 'ధర్మమునకు ఉత్పత్తి స్థానము' అని ఏకవచనార్థము. ఇట్లు విశేషణము లన్నియు రెండర్థములకు ననుకూలముగా విరుగుచున్నవి. కావున శ్లేషాలంకారమే ప్రాధాన్యము వహించుచున్న దనుట వాస్తవము.

ఇప్పు డింక మరొక ప్రశ్న తల యెత్తినది. ఇచ్చట నున్నది శ్లేషాలంకారమైనయెడల ఉపమాదోషముగా దీని నేల ఉదాహరింపవలయును? సాదృశ్యమే అలంకారబీజము. సాదృశ్యము సర్వాలంకార సాధారణము. కావున సాదృశ్యప్రధానమైన ఉపమాలంకార మని యనుట ఉపలక్షణము మాత్రమే. వచనభేదము, లింగభేదము – అన్నవి సాదృశ్య మున్న యెచ్చటనైనను దోషములే. శ్లేషాలంకారమును ఉపమా లక్ష్యముగా ప్రదర్శించుటచేత ఉపమకు చెప్పిన దోషములు సర్వాలంకార విషయమున దోషములే యన్న విషయమును జ్ఞాపనము చేయుటకే. అట్లే సహృదయులకు ఉద్వేజకత్వమును కలిగింపనియెడల, అవి దోషములు కాక గుణములే యగు నన్నదికూడ సర్వాలంకారవిషయమునను సమన్వయము నొందవలసిన సిద్ధాంతమే.

[ న్యూనోపమ గుణము ]

120. యత్రోపమానధర్మాః స్యు ర్న్యూనోపమేయేన సంమితాః
తన్న్యూనోపమ మిత్యాహు స్తత్ ప్రసిద్ధా న దుష్యతి.

యథా –

'స మారుతాకంపిత పీతవాసా
బిభ్రత్సలీలం శశిభాస మబ్జమ్
యదుప్రవీరః ప్రగృహీతశార్ఙ్గః
సేంద్రాయుధో మేఘ ఇవావభాసే' 164

అత్ర సేంద్రాయుధ ఇతి కార్ముకమాత్రస్యోపాదానం వాసః శంఖయో స్త్వనుపాదానా దూనోపమత్వమ్. తత్రేందుపీతద్యుత్యో రతి ప్రసిద్ధత్వా దదోషత్వమ్. యదాహ –

'సర్వం సర్వేణ సారూప్యం నాస్తి భావస్య కస్యచిత్
యథోపపత్తి కృతిభి రుపమానం ప్రయుజ్యతే'.
'అఖండమండలః క్వేందుః క్వ కాంతానన మద్యుతి
యత్కించిత్ కాంతిసామ్యాత్తు శశినైవోపమీయతే'.

అర్థము : ఉపమానధర్మములు ఉపమేయముతో సమ్మితములు కాని యెడల దానిని న్యూనోపమ మని యందురు. అది ప్రసిద్ధియందు దోషము కాదు. ఇది లక్షణము. వాయువుచేత కదలింపబడిన పచ్చని వస్త్రము కలవాడై చంద్రునివలె, భాసించు శంఖమును సలీలముగా ధరించినవాడై ధనుస్సును గ్రహించియున్న యదు ప్రవీరుడు ఇంద్రాయుధసహితమైన మేఘమువలె ప్రకాశించుచున్నాడు.

ఇచ్చట 'సేంద్రాయుధ' అని కార్ముకమాత్రమును గ్రహించి వస్త్రశంఖములను గ్రహింపక పోవుటవల్ల న్యూనోపమత్వము. చంద్రుడు, మెరపుతీగ – అను వీని యొక్క అతిప్రసిద్ధివల్ల అదోషత్వము.

ఏ భావమునకును సమగ్రమైన సారూప్య మెచ్చటను లేదు. లభించినంతవరకు కావ్యములందు ఉపమానము ప్రయోగింపబడును. అఖండమండలము కలిగిన చంద్రు డెక్కడ? కాంతిరహితమైన కాంతాముఖ మెక్కడ? ఏదో కొంచెము కాంతిసామ్యము వల్ల చంద్రునితో ఉపమింపబడుచున్నది – అని పెద్దల వచస్సు.

వ్యాఖ్య : ఉపమాదోషములలోనే న్యూనోపమ యొక్కటి. ఉపమానము, ఉపమేయము – అను రెండింటికి సమానధర్మము తుల్యముగా నున్నప్పుడే ఉపమా

లంకారము సముచితముగా నుండును. ప్రకృతోదాహరణమునందు ఉపమేయము యదుప్రవీరుడు; ఉపమానము మేఘము. యదుప్రవీరుడు పీతవస్త్రుడు, శంఖధారి, ప్రగృహీతశార్ఙ్గుడు. మేఘము ఇంద్రాయుధసహితము. ఉపమేయమున కున్న చివరి ధర్మము (కార్ముకధారణము)తో మాత్రమే ఉపమానమునకు సాధర్మ్యము కలదు. పీతవస్త్రశంఖధారణ తుల్యధర్మము ఉపమానమునకు ఉపాదానము కాలేదు. అనగా, పీతవస్త్రధారణ, శంఖధారణ అను రెండు ధర్మములచేత ఉపమానము న్యూనతను పొందుచున్నదనియర్థము. కావుననే, యిది న్యూనోపమ మయినది.

అయినప్పటికిని చంద్రుడు, మెరపుతీగ అనునవి ప్రసిద్ధములు. కవి కంఠోక్తిగా చెప్పకపోయినప్పటికిని 'మేఘము' (ఉపమానము) నకు చంద్రధారణ విద్యుద్ధారణ అను ధర్మములున్నట్లు ప్రసితిద్ధిచేతనే ప్రతీయమానమగును. ప్రసిద్ధివల్ల ప్రతీతి గనుక అనుపాదానత్వము నాధారము గావించుకొని న్యూనోపమ మన్న దోషముగా పరిగణింపవలసిన యావశ్యకము లేదు.

ఈ విషయమును పెద్దల వాక్యమును ప్రమాణముగా చూపి భోజదేవుడు బలపరుచుచున్నాడు. ఏ వస్తువును సృష్టిలో మరొక వస్తువుతో సర్వవిధముల సామ్యమును కలిగియుండదు. కావున, తావన్మాత్రమైన సామ్యముచేతనే సంతృప్తి వహించుట సహృదయ లక్షణము.

ఉదాహరణశ్లోకము రుద్రటుని కావ్యాలంకారమునకు నమిసాధువు రచించిన టీక యందలిది.

### [ అ ధి కో ప మ గు ణ ము ]

121. క్రమేణానేన కృతిభి ర్వేష్టవ్యా మధికోపమమ్
విశేషస్తూపమేయాంగ మనుమానాత్ ప్రతీయతే.

యథా -

'స పీతవాసాః ప్రగృహీత శార్ఙ్గో
మనోజ్ఞభీమం వపురాప కృష్ణః
శతహ్రదేంద్రాయుధవా న్నిశాయాం
సంసృజ్యమానః శశినేవ మేఘః' 165

అత్ర శశినో గ్రహణా దధికోపమత్వేఽప్యుపమానత్వేనా వివక్షితత్వాద్గుణత్వమ్. యది వోపమానే ధర్మోద్ఘాటనానుమానాత్ 'శంఖచక్రగదాధరో విష్ణుః' ఇతి ప్రసిద్ధేః శంఖోఽనుమేయః.

అర్థము : ఇదే క్రమమున అధికోపమము కూడ సహృదయసమ్మతము కాదగినది. విశేష మేమనగా ఉపమేయాంగము అనుమానముచేత ప్రతీయమాన మగును. ఇది లక్షణము. రాత్రివేళ మెరపుతీగతో, హరివింటితో కూడుకొని చంద్రుని చేత విడువబడిన మేఘమువలె కృష్ణుడు పచ్చనివస్త్రముగలవాడై ధనుస్సును ధరించిన వాడై మనోహరభయంకరమైన శరీరమును పొందెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట చంద్రుని గ్రహించుటవల్ల అధికోపమత్వమే అయినప్పటికిని ఉప మానత్వముచేత వివక్షితము కానందువల్ల గుణత్వమే యగును. ఉపమానమునందు ధర్మోద్ఘాటనము జరిగెనేని అనుమానమువల్ల శంఖచక్రగదాధరుడు అను ప్రసిద్ధిని బట్టి 'శంఖము' ఊహింపదగియున్నది.

వ్యాఖ్య : ఉపమానమునందు అధికధర్మమును చెప్పినయెడల అధికోపమ మన్న ఉపమాదోష మగును. ప్రకృతోదాహరణమునందు ఉపమేయము విష్ణువు; ఉపమానము మేఘము:విష్ణువుపీతవస్త్రధారణ, కార్ముకధారణ అనుధర్మములు గలవాడు. మేఘము శతహ్రదధారణ, ఇంద్రాయుధధారణ అను ధర్మములను కలిగి యున్నది. అదనముగాచంద్రునిచే విడువబడుట అను ధర్మమునుకూడ కలిగి యున్నది. కావున, ఇది అధికోపమ మన్న దోషము కావలయును.

ఉపమానమునకు చంద్రవియోగమువల్ల అధికముగా కలిగిన శోభ యేమియు లేదు. చెప్పినను చెప్పకున్న నొక్కటే. కావున ఇచ్చటి అధికధర్మము ఔపమ్యము నకు అవరోధము కాదు. 'ఉపమానమునందు అధికధర్మముచెప్పబడినదికదా! దోషము కాదా' అన్న ప్రశ్న కలుగవచ్చును. అప్పుడు ప్రసిద్ధి నాశ్రయింపవలయును. విష్ణువు శంఖచక్రములను గదాధనువులను ధరించియుండుట ప్రసిద్ధము. ఉపమానములందలి 'చంద్ర' పదముచేత తత్తుల్యధర్మము గల శంఖము నూహింపవలసి యుండును: చంద్రుడు వీడిన మేఘము శంఖము వీడిన విష్ణువుతో సామ్యము గలిగియున్నది. అనుమానము అనగా ఊహ యని యర్థము. అనుమేయము ఊహింపదగినది.

ఇట్లు అనుమేయమగా శంఖము ప్రతీయమాన మగుటచే ఉపమానోపమేయములకు ధర్మసామ్యము సక్రమముగా లభించినట్లే యైనది. కావున దీనియందు దోషము నెన్నుటకు వీలు లేదు. అలంకారసౌందర్యముచేత, ఇది గుణమే యగుచున్నది.

## [ఛందోభంగ గుణము]

122. యదా తీవ్ర ప్రయత్నేన సంయోగాదే రగౌరవమ్
నచ్ఛందో భంగ ఇత్యాహు స్తదా దోషాయ సూరయః.
యథా —
'జహా ణ్హాఉం ఓఇణ్ణో అబ్భ_స్తము ల్లాసి అమంసు అద్ధంతమ్
తహా అణ్హా అ సితుమం సచ్ఛే గోలాణ ఈ తూ హే' 166
[ఛాయ —
యథా స్నాతు మవతీర్ణే
ఆర్ద్రీ భూత ముల్లాసిత మంశు కార్ధాంతమ్
తథా చ స్నాతా భవసి
త్వం స్వచ్ఛే గోదానదీ తీర్థే]
అత్ర ద్వితీయైకాదశ త్రయోవింశతి వర్ణానాం సంయోగ పరత్వా ద్గురుత్వేఽపి ణ్హాల్హాది సంయోగస్య తీవ్ర ప్రయత్నోచ్చారణేన పూర్వ లఘుత్వే న ఛందోభంగ ఇతి గుణత్వమ్.

అర్థము: తీవ్రప్రయత్నముచేత సంయుక్త పూర్వవర్ణమునకు అగౌరవము (లఘుత్వము) కలుగునప్పుడు ఛందోభంగము దోషము కాదని పండితులందురు. ఇది లక్షణము. నీవు స్వచ్ఛమైన గోదావరీజలమునందు స్నానము చేయుటకై దిగి ఉల్లాసితమైన అంశుకార్ధాంతము ఆర్ద్రమగునట్లుగా స్నానము చేసితివి. ఇది ఉదాహరణము.

ఇచ్చట రెండవ, పదునొకండవ, యిరువదిమూడవ వర్ణములకు సంయోగము పరమందుండుటవల్ల గురుత్వమే అయినప్పటికిని ణ్హ ల్హ మున్నగు సంయోగమునకు తీవ్రప్రయత్నోచ్చారణముచేత పూర్వమందు లఘుత్వమే యుండును. ఛందోభంగము కాదు గనుక గుణత్వమే.

వ్యాఖ్య : ఛందోనియమమునుబట్టి గణములుండును. అట్లుకాక ఉండరాని చోట నేదయిన గణమున్నయెడల ఛందోభంగదోషము కలుగును. ఇది పరిహరణీయమే. కాని 'రహౌవ్యంజన సంయోగే' మున్నగు సూత్రములనుబట్టి వ్యంజనసంయుక్తములైన రహవర్ణములు తేలికగా ఉచ్చరింపబడుట కవకాశముకలదు. అట్లగుట చేత తత్పూర్వవర్ణము గురువుకావలసిన నిర్బంధములేదు. అట్టినిర్బంధము లేనప్పుడు గురువుగా నెంచి ఛందోభంగదోషము కలిగెనని తలచుట యుచితము కాదు.

ప్రకృతోదాహరణమునందు 'జహ్ణా' అని యున్న యగణ మగును. ఆర్య యందు తొలిగణముగా యగణము రాదు. ఇచ్చట వచ్చినది కావున ఛందోభంగము కలిగెనని యనిపించును. కాని ణవర్ణము హకారముతో సంయోగము చెందుటచేత, తేల్చికూడ పలుకవచ్చును. అట్లు పలికినయెడల సగణముగా పరిణమించును. ఇది సమ్మతమే. ఇట్లే 'ముల్హాసి' 'తహ అణ్హావా' అనుచోటకూడ 'లణ' లకు హవర్ణము తోడి సంయోగము కలదు. అవియును తేల్చిపలుకదగిన స్థానములే యగుటచేత ఛందోభంగదోషము తనంతట తానే తొలగిపోవుచున్నది.

[యతి భంగ గుణము]

123. వాక్య మస్థానవిరతి ప్రాగ్ భగ్నయతి సంజ్ఞయా
సముద్దిష్టం యదనునా గుణత్వం తస్య కల్ప్యతే.
యథా —

'శోభాంపుష్యత్యయ మభినవః సుందరీణాంప్రబోధః
కించిద్భావాలస మసరల ప్రేక్షితం కామినీనాం
కార్యాకార్యాణ్యయ మవికలాన్యాగమేనైవ పశ్య
న్వశ్యాముర్వీం వహతి నృప ఇత్యస్తిచాయంప్రయోగః' 167

అత్ర పాదత్రయే చతుర్థస్థానే యతౌ కర్తవ్యాయాం*పంచమ స్థానే కృతత్వాదపరత్ర చ పాదస్య మధ్యభాగే నివిష్టకేవల స్వరత్వా ద్యతిభంశేఽపి స్వరసంధికృతత్వా దవిభిన్ననామధాతుశరీరత్వాచ్చ

* ఉదాహరణమునుబట్టి యిది సరికాదు. వ్యాఖ్య చూడుడు

న దోషత్వమ్. యదాహ —

'స్వరసంధ్యకృతే ప్రాయో ధాతుభేదే తదిష్యతే
నామభేదే చ శేషేషు న తోష ఇతి సూరయః'.
'లుప్తే పదాంతే శేషస్య పదత్వం నిశ్చితం యథా
తథా సంధి వికారాంతం పదమేవేతి వర్ణ్యతే'.

**అర్థము** : స్థానముకాని స్థానమున విరతి యున్న వాక్యము యతిభంగము అన్నపేరున ముందు నిర్దేశింపబడినది; దాని కిప్పుడు గుణత్వము కల్పింపబడు చున్నది. ఇది లక్షణము. సుందరీమణుల యీ అభినవ ప్రబోధము, కామినీమణుల కించిద్భావాలసమైన వక్రప్రేక్షితము శోభను పోషించును. కార్యాకార్యములను అవి కలమైన అన్యాగమముచేత చూచుచు రాజు భూమిని వశీకరించుకొని వహించు చున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట మూడు పాదములందు చతుర్థస్థానమున యతిని వేయవలసియుండగా పంచమస్థానమున వేయుటవల్లను, పెరచోట పాదముయొక్క మధ్యభాగమునందు కేవలము స్వరమును నివిష్టము చేయుటవల్లను యతిభంగమే అయినప్పటికిని స్వర సంధి కృతత్వమువల్లను, అవిభిన్ననామధాతుశరీరత్వమువల్ల నుదోషత్వము లేదు.

స్వరసంధి కానప్పుడు ధాతుభేదమునందును నామభేదమునందును అది అభీష్టము. మిగిలినవానియందు దోషముకాదని పండితులందురు. పదాంతము లోపింపగా మిగిలినదానికి పదత్వము నిశ్చితమైనట్లుగా సంధివికారాంతము పదమైనట్లుగానే వర్ణింపబడును— అని పెద్దల నిర్ణయము.

**వ్యాఖ్య** : ఒక్కొక్క వృత్తమునకు ఒక్కొక్క విధముగా యతి యుండును. కొన్ని వృత్తములకు పాదమున నొక్కచోటనే యుండును; కొన్ని వృత్తములకు పాదమున రెండుమూడు చోట్ల నుండును. నియమానుసారముగా యతి లేకున్నయెడల యతిభంగమన్న దోషము కలుగును.

ప్రకృతోదాహరణము మందాక్రాంతవృత్తము. 'మందాక్రాంతాంబుధి రస నగైర్మోభనౌతౌగయుగ్మమ్' అనిలక్షణము. ఇందు మ,భ,న,త,త, గగములుండును. యతి నాలుగవ, ఆరవ, ఏడవ యక్షరములమీద నుండును. చివరిది పాదాంతమే.

పాదాంతమున విరుపు (యతి) సక్రమముగానే యున్నది. మొదటినుండి పదవ యక్షరము (4+6)మీద మైత్రము సక్రమముగానే యున్నది. ఇంక మొదటి మూడు పాదములందును నాలుగవ యక్షరముమీద నుండవలసిన విరుపు సక్రమముగా లేదు. మొదటిపాదమున నాలుగవ యక్షరముమీద, ఆరవయక్షరముమీద విరుపులు గలవు. రెండవ మూడవ పాదములందు ఆరవ యక్షరముమీద మాత్రమే విరుపు గలదు. కావున, ఈ మూడు పాదములందును రచయిత మొదటినుండి ఆరవదైన యక్షరము మీదనే యతిని వేసెనని యనవలయును. నాలుగవ పాదమున విధ్యనురూపముగా నాలుగవ యక్షరముమీదనే యతివేసెను. (రచయితవృత్తియందు 'చతుర్థస్థానే యతౌ కర్తవ్యాయాం పంచమస్థానే కృతత్వాత్....' మున్నగు విధముగా నున్నది. లక్ష్య మునుబట్టి 'పంచమస్థానే' యనుటకు బదులుగా 'షష్ఠస్థానే' యని యుండుట సమంజసము.)

ప్రకృతోదాహరణము పైనిచేసిన వ్యాఖ్యనుబట్టి యతిభంగ దోషమునకు పాలు కావలయును. కాని, యిచ్చట దానికి గుణత్వము కల్పింపబడుచున్నది. స్వర సంధి లేనప్పుడు ధాతువుకాని నామముకాని యతిస్థానమున విరుగకుండ నున్నచో యతిభంగమగుట సత్యమే కాని అది విరసము కానియెడల దోషము కాదు. ప్రథమ పాదమునందు 'శోభాంపుష్యతి + అయమ్' అనుచోట 'తి' అయిదవ స్థానమున నున్నది. ఇది ధాతుభాగము. కావున దోషమే కావలయును. కాని పైనున్న 'అయమ్' తోడి స్వరసంధివల్ల దోషము తొలగిపోవుచున్నది. రెండవ పాదమునందలి 'కించి ద్భావ+అలస' అన్న సమాసమును విభాగముచేయగా ఐదవస్థానమునందుక్రొత్త పదమే మొదలగుచున్నది. సంధికార్యమువల్ల వెనుకటి వర్ణముతో కలిసి దీర్ఘమైనది. ఇదియు విరసము కాకపోవుటచేత దోషము కాదు. 'కార్యాకార్యాణి+అయమ్' అన్న తృతీయపాదము తొలిసమాసమున నామాంశము యతిస్థానము నతిక్రమించినది. దోషమే అయినప్పటికిని స్వరసంధి నొందుటచేత విరసత్వమును తప్పించుకొన్నది. కావున గుణమేయైనది. చతుర్థపాదమున నృపః+ఇతి=నృపఇతి అనియైనది. పాద మధ్యమున అచ్చువచ్చుట దోషమే యైనప్పటికి విసర్గసంధి నిర్బంధమువల్ల వచ్చుట చేత ఇది దోషముకాక గుణమే యగుచున్నది.

నామాంశముకాని క్రియాంశముకాని యతిస్థానము నుల్లంఘించినయెడల దోషమగునని, అట్లు ఉల్లంఘించినప్పటికిని స్వరసంధి మున్నగువానివల్ల విరసత్వము తొలగినయెడల, అది దోషముకాక గుణమే యగునని నిష్కర్షము.

ఉదాహరణ పూర్వార్ధము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

[ అ శ రీ ర గు ణ ము ]

124. అశరీరం క్రియాహీనం క్రియాపేక్షా న యత్ర తు
యత్రాన్యాదే రపేక్షా వా న దోష స్తత్ర తద్యథా.
'కియన్మాత్రం జలం విప్ర జానుదఘ్నం నరాధిప
తథాపీయ మవస్థా తే నహి సర్వే భవాదృశాః' 168

అత్ర త్రిషు పాదేషు పదాని క్రియాపదం నాపేక్షన్తే. సాపేక్షంచాసమర్థం భవతి. చతుర్థేతునహీత్యాదిభిః సన్తీత్యపేక్ష్యతే నచైతావతా మీమాంసా మసామర్థ్యం భవతి. యదాహ—'యత్రాన్యత్ క్రియాపదం నాస్తి తత్రాస్తి భవతీతి పదం ప్రథమపురుషే ప్రయుజ్యతే' ఇతి.

అర్థము : క్రియాహీన మగు వాక్యము అశరీరము. క్రియాపేక్ష లేనియెడల 'అగును; ఉండును' మున్నగువాని అపేక్ష యున్నయెడల అది దోషము కాదు. ఇది లక్షణము. 'విప్రా! జల మెంతమాత్రము?' 'నరాధిప! మోకాళ్ల వరకు'. 'అంత మాత్రమునకే నీకీయవస్థయా?' 'అందరును భవాదృశులు కారు.' ఇది ఉదాహరణము.

ఇచ్చట మూడు పాదములందలి పదములును క్రియాపదమును అపేక్షించుట లేదు. సాపేక్షమయినది అసమర్థ మగును. నాలుగవ పాదమునందు 'నహి' మున్నగు వానివల్ల 'సన్తి' అని అపేక్షింపబడుచున్నది. ఇటువంటివాని అపేక్షవల్ల అసామర్థ్యము కలుగదు. ఎందులకనగా "ఎక్కడ ఇతరక్రియాపదము లేదో అక్కడ 'అస్తి, భవతి' అన్న పదము ప్రథమపురుషయందు ప్రయోగింపబడు" నని చెప్పిరి.

వ్యాఖ్య : అపేక్షితమయిన క్రియాపదము లేకుండుట అశరీర మన్న దోషము. క్రియాపదము లేకపోయినను వాక్యార్థము సమగ్రమైయున్నచో అచ్చట దోషము కాదు.

ఉదాహృతపద్యమునందు 'జల మెంతమాత్రము?' అని యన్నప్పుడు పరిమితినే యడుగుచున్న విషయము విశదముగానే యున్నది. మాత్రశబ్దముచేతనే తదాకాంక్ష పూరింపబడుచున్నది. రెండవ మూడవ వాక్యములయందు ఈపాటి అపేక్షయు లేదు. నాలుగవ వాక్యమునందు వ్యతిరేకబోధకమైన 'న'కార ముండుట చేత క్రియాపేక్ష యున్నదనుట వాస్తవము. కాని యిచ్చట 'సన్తి' యని అధ్యాహృతము చేసికొన్న సరిపోవును. దీనికి లాక్షణికుల సమ్మతి కూడ కలదు.

అపేక్ష యున్నచోట అపేక్షితపదము లేకున్నయెడల ఆ వాక్యమును అపుష్టార్థము అని యందురు. అప్పుడు మాత్రమే అశరీరదోషము కలుగును.

ఉదాహరణశ్లోకము భోజదేవుని శార్ఙ్గధరపద్ధతినుండి గ్రహింపబడినది.

## [ శైథిల్య గుణము ]

125. శ్లిష్ట మస్పృష్టశైథిల్యం శిథిలం తద్విపర్యయః
గౌడీయై రిష్యతే తత్తు బంధప్రాశస్త్యగౌరవాత్.

యథా —

'లీలా విలోల లలనా లలితాలక లాసకాః
విలుప్త మాలతీ మాలా జలకాలానిలా వపుః' 169

అత్ర శైథిల్యభేదోఽపి బంధప్రాశస్త్యేన గౌడై రాదృతత్వాద్ గుణత్వమ్.

అర్థము:- శైథిల్యస్పర్శ లేనిది శ్లిష్టము. దీనికి విరుద్ధము శిథిలము. ఇది దోషము. అయినను బంధగౌరవప్రాశస్త్యమువల్ల ఇది గౌడీయులకు సమ్మత మగుచున్నది. ఇది లక్షణము. విలాసములచేత చంచలముగా నున్న స్త్రీలను గంపి, మృదులములైన ముంగురులయందు క్రీడించునవి, లోపింపజేయబడినమాలతీమాలికను గలవియు నైన వర్షాకాలవాయువులు వీచుచున్నవి. ఇది ఉదాహరణము.

ఇచ్చట శైథిల్యదోష మున్నప్పటికిని బంధప్రాశస్త్యముచేతను గౌడీయుక్కఆదృతత్వమువల్లను గుణత్వము.

వ్యాఖ్య : సుశ్లిష్టములైన పదములను కలిగియుండుట శ్లేషగుణము. వేరు పదములే యైనప్పటికిని ఒకే పదమువలె కన్పట్టుటయే రచనాగతమైన సుశ్లిష్టత. దీనికి విరుద్ధమైనది శిథిలత.

ప్రకృతోదాహరణమునందు స్పష్టముగా ఐదు పదము లున్నవి. ఇట్లుండుటయే శిథిలత. ఇది దోషమే. అయినప్పటికిని లకారము అనేక పర్యాయములు పునరుక్తమగుటచేత రచన కాంతిమంతమై ఆకర్షణీయమైనది. గౌడీరీతియందు ఆసక్తిగలవారు ఇట్టి సానుప్రాసరచనయందు సాభిలాషు లగుదురు. కావున బంధప్రాశస్త్యగౌరవము చేత దోషము తొలగిపోవుటయే కాక గుణముకూడ కలిగినది.

## [ వైషమ్య గుణము ]

126. దోషః క్వాపి వైషమ్యేఽప్యర్థాలంకారకారణాత్
పౌరస్త్యై రాదృతత్వాచ్చ శబ్దాడంబరతోఽపి వా.
యథా —

'చందనప్రణయోద్గంధిర్మందో మలయమారుతః
స్పర్ధతేఽరుద్ధమద్ధైర్యో వరరామా ముఖానిలైః' 1

అత్ర సత్యపి వైషమ్యదోషే, శబ్దాలంకారగుణా దర్థాలంకారగుణాత్ పౌరస్త్యైరాదృతత్వాచ్చ గుణత్వమ్.

అర్థము : కొన్ని యెడల వైషమ్య మున్నప్పటికిని అర్థాలంకార కారణము వల్లను, ప్రాగ్దేశీయుల ఆదృతివల్లను, శబ్దాడంబరమువల్లను అది దోషము కాదు. ఇది లక్షణము. చందన వాసనావాసితుడై మందమలయమారుతుడు రుద్ధముకాని ధైర్యము కలవాడై రమణీముఖానిలములతో స్పర్ధించుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట వైషమ్య దోష మున్నప్పటికిని శబ్దాలంకార గుణమువల్లను, అర్థాలంకార గుణమువల్లను, ప్రాగ్దేశీయుల ఆదృతత్వమువల్లను గుణత్వము.

వ్యాఖ్య : సమత లేకుండుట వైషమ్యము. సమత యనగా మృదువర్ణములనుగాని, కఠోరవర్ణములనుగాని, మిశ్రవర్ణములనుగాని ఒకే రీతిగా వాడుట.

ప్రకృతోదాహరణమునందు 'స్పర్ధతే, అరుద్ధమద్దైన్యః' మున్నగుపదములు కఠోర వర్ణములను కలిగియున్నవి. 'మలయమారుతః; వరరామాముఖానిలైః' మున్నగు పదములు మృదువర్ణములను కలిగియున్నవి. మిగిలినవి మిశ్రవర్ణములను కలిగి యున్నవి. ఇట్లు ఏకరీతి లేని రచన యగుటచేతనే యిది వైషమ్యదోషమునకు పాలయినది.

అయినప్పటికిని చందన - మంద; మలయ - మారుత; రుద్ధ - మద్ధ మున్నగు నెడల నున్న శబ్దాలంకారమును, అర్థాశ్రితమైన ఉత్ప్రేక్షాలంకారమును గుణత్వమును కల్పించుటచేత దోషము తొలగిపోవుచున్నది. ఇంతేకాక ప్రాగ్దేశీయులకు భిన్నవర్ణ సమ్మిశ్రితమైన (లాటీ) రీతి అభీష్టమగుటచేత కూడ గుణముగానే యిది పరిగణింప దగియున్నది.

[కఠోరత్వ గుణము]

137. కఠోరమపి బధ్నన్తి దీప్తమిత్యపరే పునః
తేషాం మతేన తస్యాపి దూషణం నైవ విద్యతే.

యథా —

'న్యక్షేణ పక్షః క్షపిత క్షత్రియాణాం క్షణాదయమ్'

అత్ర కఠోరత్వేఽపి దీప్తత్వాద్గుణత్వమ్.

అర్థము : మరికొందరు దీప్తమని కఠోరవర్ణములతోడి రచన చేయుదురు. వారి మతమున దానికి దోషము లేదు. ఇది లక్షణము. పూర్తిగా ఈ క్షత్రియుల పక్షము క్షణములో నాశనమైనది. ఇది ఉదాహరణము.

ఇచ్చట కఠోరత్వ మున్నప్పటికిని దీప్తత్వమువల్ల గుణత్వము.

వ్యాఖ్య: కఠోరవర్ణముల కూర్పు సౌకుమార్యగుణమునకు విరుద్ధము కావున దానిని దోషముగానే పరిగణింపవలయును. కాని కొందరు దానిని 'దీప్తత్వము'గా భావింతురు. దీప్తత్వ మనగా కాంతియే. ఉజ్జ్వలమైన బంధముండుట కాంతి. ఉజ్జ్వల బంధ మనగా సాజాత్యముగల వర్ణముల సమీపావృత్తి యని స్థూలనిర్ణయము.

ప్రకృతోదాహరణమునందు క్షవర్ణము కఠినవర్ణము. కాని అదియే మాటిమాటికి ప్రయుక్తమై యమకసౌందర్యమును సమకూర్చినది; రచనమున కుజ్జ్వలబంధమును

కూర్చినది. కావుననే కొందరు దానిని కఠోరవర్ణనిబద్ధ మైనప్పటికిని దోషముగా పరిగణింపక, కాంతివలన, అనగా బంధనౌజ్జ్వల్యమువలన గుణముగానే గణింతురు. భోజదేవునకును దోషత్వము తొలగి గుణత్వము కలిగిన దనుటయే సమ్మతము.

[అప్రసన్న గుణము]

129. అవిద్వ దంగనా బాల ప్రసిద్ధార్థం ప్రసాదవత్
విపర్యయోఽస్యాప్రసన్నం చిత్రాదౌ త న్న దుష్యతి.

యథా —

యాశ్రితా పావనతయా యాతనాచ్ఛిద నీచయా
యాచనీయాధియామాయాయామాయాసం స్తుతా శ్రియా' 171

అత్రాప్రసాదదోషేఽపి చిత్రత్వాద్గుణత్వమ్.

అర్థము : అపండితులకు, అంగనలకు, బాలురకు సైతము ప్రసిద్ధముగా తెలియునది ప్రసాదవంతము. దీనికి విపర్యయము అప్రసన్నము. ఇది దోషము. చిత్రకవిత్వాదులందు ఇది దోషము కాదు. ఇది లక్షణము. పావనత్వముచేత ఆశ్రయింపబడినదియు, ఉన్నతమైన బుద్ధిచేత మాయయందలి ఆయాసమును (మాయా నాశమును) యాచింపదగినదియు, లక్ష్మిచేత సైతము సంస్తుతింపబడినదియు నరకాది కారణమైన యాతనను నాశము చేయును. ఇది ఉదాహరణము.

ఇచ్చట అప్రసాదదోష మున్నప్పటికిని చిత్రత్వమువల్ల గుణత్వము.

వ్యాఖ్య : ఝడితిస్ఫూర్తి కలుగునట్లుగా, సర్వప్రసిద్ధమైన యర్థము గలది ప్రసాదగుణము. దానికి విరుద్ధమైనది అప్రసన్నదోషము. ప్రకృతోదాహరణమునందు ప్రసన్నత లేదు. 'యా' పెక్కుమారు లావృత్తి చెందుటచేత పదవిభాగవిషయము నందే క్లిష్టత నాపాదించుచున్నది. అయినప్పటికిని 'అష్టదళ పద్మ బంధము'నకు అనువుగా ఈ శ్లోకము రచింపబడినది. అచ్చట కొన్ని వర్ణములకు పునఃపునరావృత్తి ఆవశ్యకము. అట్లుండియు, ధారాళముగా, లలితముగా, సుకుమారభావ సమన్వితమై పద్యము నుండుట విశేషము. కావుననే యిచ్చటి దోషము లేదని, పైగా గుణ మున్నదని చెప్పుట.

## [నేయార్థ గుణము]

129. అధ్యాహారాది గమ్యార్థ నేయార్థం ప్రాగుదాహృతమ్
స గమ్యతే ప్రసిద్ధ శ్చే న్న తద్దోషవ దిష్యతే.

యథా –

'మా భవన్తు మనలః పవనో వా
వారణో మదకలః పరశుర్వా
వాహినీజలభరః కులిశం వా
స్వస్తి తేఽస్తు లతయాసహ వృక్ష.' 172

అత్ర దహత్విత్యాదీనా మధ్యాహార్యతయా నేయ తేఽప్యతి ప్రసిద్ధ్యా ప్రతీయమానత్వాద్గుణత్వమ్.

అర్థము : అధ్యాహారాదులచేత అర్థము గమ్యమాన మగునెడల నేయార్థ మగునని తొలుత చెప్పబడినది. ప్రసిద్ధ మయినది. గమ్యమాన మగునెడల దానిని దోషవంతముగా పరిగణింపరు. ఇది లక్షణము. ఓ లతతోడి వృక్షమా! నిన్ను అగ్ని కాని గాలి కాని మదించినయేనుగు కాని గండ్రగొడ్డలి కాని నదీప్రవాహము కాని పిడుగు కాని – వలదు – నీకు శుభమగుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట 'దహతు' మున్నగు క్రియాపదముల అధ్యాహార్యతచేత నేయత్వమే యైనను, అతిప్రసిద్ధిచేత ప్రతీయమానము లగుచుండుటవల్ల గుణత్వమే.

వ్యాఖ్య : నేయార్థమునకు 'స్వసంకేతప్రక్లృప్తార్థము' లక్షణముగా చెప్పబడినది. అందు అధ్యాహారాదుల యవసరము లేదు. అధ్యాహారాదుల యవసరము కలది అశరీరము. 'క్రియాపదవిహీనం య దశరీరం తదుచ్యతే' అని లక్షణము. కావున ప్రకృతలక్షణమును, లక్ష్యమును గూడ నేయార్థగుణమునకు కాక, అశరీర గుణమున కన్వయించు ననుట సమంజసము. మూలమునందు కారికయు, వృత్తియు నేయార్థ మన్న శబ్దమునే యుపయోగించుట చింత్యము.

ప్రకృతోదాహరణమున వృక్షమునకు వీలయిన కష్టములన్నియు తొలగి పోవలయు ననియు, శుభము కలుగవలయు ననియు దీవించుట కలదు. శుభము

కలుగవలయునన్న విషయము సమగ్రముగా, స్పష్టముగా చెప్పబడినది. అరిష్టముల విషయమున కర్తృపదము లుపాత్తము లైనవి; క్రియాపదములు అధ్యాహార్యములు. 'మా భవన్త మనలః' అని యున్నప్పుడు క్రియాకాంక్ష యున్నది. తదనుగుణముగా 'దహతు' అను క్రియాపదమును వాడకున్న వాక్యము సమగ్రముకాదు. అయినప్పటికిని అనలమునకు దహనక్రియ స్వాభావికమును ప్రసిద్ధము నగుటచేత శ్రోతయే క్రియా పదము నూహించుకొన గలుగును. కావున అర్థప్రతీతికి అంతరాయము కలుగుట లేదు. అందుచేతనే యిచ్చట దోషము లేదని, గుణమే యున్నదని చెప్పుట జరిగినది. తక్కినచోట్ల కూడ నిట్లే. 'గాలి నిన్ను పడగొట్టకుండునుగాక! మదించిన యేనుగు నిన్ను పడగొట్టకుండునుగాక! గొడ్డలి నరకకుండునుగాక! వాహినీజలప్రవాహము కూలద్రోయకుండునుగాక! పిడుగు నిన్ను దహింపకుండునుగాక!' అను విధముగా క్రియాపదము లధ్యాహార్యము లగును.

నిజమునకు అతిప్రసిద్ధివలన క్రియాపదములు లోపించినను అర్థప్రతీతి కలుగుట దోషరహితత్వమునే నిరూపించును. మాంగల్యకాంక్షాసమయమున అమంగల పదములను వాడకుండుట యన్నది గుణము. పై యుదాహరణమునందు దోషము పరిహృత మగుటయే కాక గుణము సముపాత్తమైనది.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

## [గ్రామ్య గుణము]

130. అసభ్యార్థం మతం గ్రామ్యం తద్గ్రామ్యోక్త్యైవ దుష్యతి
విదగ్ధోక్త్యా తు తస్యాహు ర్గుణవత్త్వం మనీషిణః.

యథా —

'కామం కందర్ప చండాలో మయి వామాక్షి నిర్దయః
త్వయి నిర్మత్సరో దిష్ట్యా సోఽయ మస్మాస్వనుగ్రహః' 178

అత్ర గ్రామ్యత్వేఽపి గ్రామ్యార్థస్య విదగ్ధోక్త్యా తిరస్కృత త్వాద్ గుణత్వమ్.

అర్థము : అసభ్యార్థము గ్రామ్య మని సిద్ధాంతము. అది గ్రామ్యోక్తియందు మాత్రమే దూష్యము. విదగ్ధోక్తియందు పండితులు దానిని గుణవంతముగానే పరిగణింతురు. ఇది లక్షణము. ఓ వామాక్షీ! కందర్పచండాలుడు బొత్తిగా నాయందు నిర్దయుడై యున్నాడు. అదృష్టముచేత నీయందు నిర్మత్సరుడై యున్నాడు. ఇదియు మాపట్ల అనుగ్రహమే. ఇది ఉదాహరణము.

ఇచ్చట గ్రామ్యత్వమే అయినప్పటికిని విదగ్ధోక్తిచేత గ్రామ్యార్థమునకు తిరస్కృతత్వమువల్ల గుణత్వము.

వ్యాఖ్య : సభయందు వాడుటకు వీలు కానిది అసభ్యము. పండితులైన వారు తమ చాతుర్యమువల్ల అసభ్యార్థమును కూడ సభ్యముగానే మార్చి చెప్పగలుగుదురు. ఉక్తివైచిత్రివల్ల గ్రామ్యోక్తి కూడ గ్రామ్యత్వమును మరుగుపరిచి సభ్యోక్తిగానే సంభావిత మగును.

ప్రకృతోదాహరణమునందు విషయము గ్రామ్యకోటికి చెందినదే. అయినప్పటికిని వక్త విదగ్ధు డగుటచేత, దానికి సభ్యతను సమకూర్చుట జరిగినది. 'నేను నిన్ను ప్రేమించుచున్నాను; నీవు నన్నేల ప్రేమింపవు?' మున్నగువిధముగా ప్రసంగింపక భంగ్యంతరము నాశ్రయించుటయే యిచ్చట దోషపరిహారమునకు దోహదము చేసినది. అదియే ఉక్తివైచిత్రికి సహకరించి గుణవత్త్వమును సమకూర్చుచున్నది.

ఉదాహరణశ్లోకమునందలి మొదటి మూడు పాదములును దండికావ్యాదర్శము నుండి గ్రహింపబడినవి.

## [ఓజో విపర్యయ గుణము]

131. ఓజః సమాసభూయస్త్వం తద్దీప్తార్థేషు బధ్యతే
విపర్యయోఽస్యాసమస్తం తద్దీప్తం చే న్న దోషభాక్.
యథా -

'యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాండవీనాంచమూనాం
యో యః పాంచాలగోత్రే శిశు రధికవయా గర్భశయ్యాం గతో వా
యో య స్తత్కర్మసాక్షీ చరతి మయి రణే యశ్చ యశ్చ ప్రతీపః
క్రోధాంధ స్తస్యతస్యస్వయమిహజగతామంతకస్యాంతకోఽహమ్' 174

అత్రాసమ స్తత్వేఽపి ప్రౌఢబంధత్వాద్గుణత్వమ్.

అర్థము : సమాసభూయిష్ఠమై యుండుట ఓజస్సు. అది దీప్తార్థములందు నిబద్ధమై యుండును. దానికి విపర్యయముగా సమాసములు లేకుండ నున్నప్పటికిని దీ ప్తమై యున్నయెడల దోషదూషితము కాదు. ఇది లక్షణము. పాండవసైన్యము లందు ఎవడెవడు స్వీయభుజాబలాధిక్యమదముచేతశస్త్రము పట్టునో, పాంచాల వంశమునందు గర్భశయ్యాగతుడు కాని అధికవయస్కుడు కాని ఏ యే శిశువు కలడో, నేను రణమునందు సంచరించుచుండగా ఆ యా కర్మలకు సాక్షియై యెవడేవ డుండునో, యెవడెవడు నాకు విరోధియో, ఆ యెల్ల వానికిని, స్వయముగా జగ దంతకునకును క్రోధాంధుడ నైననేను అంతకుడ నయ్యెదను. ఇది ఉదాహరణము.

ఇచ్చట సమాసభూయ స్త్వము లేకపోయినప్పటికిని గాఢబంధత్వమువల్ల గుణత్వమే.

వ్యాఖ్య : వీరరౌద్రాదిరసములకు ఓజోగుణము అనుగుణముగా నుండును. సమాసబంధురమైన రచనాబంధమునే ఓజోగుణమని యందురు. సమాసబంధు రత్వమువల్ల రచనా బంధమునకు బిగు వేర్పడి తత్తద్రసపోషక మగును.

కొన్నియెడల రచన సమాసబంధురము కాకపోయినను, మార్గాంతరమున రచనకు బిగువు సాధింపబడినయెడల, అదియు రసానుగుణమై, రసపోషకమై ప్రవర్తించును. అట్టియెడల దోషలక్షణము తొలగిపోయి, గుణత్వము విలసిల్లును.

ప్రకృతోదాహరణమునందు 'స్వభుజగురుమదః' అన్నదొక్కటే కొంచెము పెద్ద సమాసము. తక్కినవన్నియు 'పాంచాలగోత్రే, అధికవయాః, గర్భశయ్యాః కర్మసాక్షీ' మున్నగువిధముగా రెండేసి పదముల పరిమాణము కలవి మాత్రమే. కావున సమాసబంధురత్వము కానరా దనియే నిర్ణయము. అయినప్పటికిని 'స్రగ్ధరా వృత్తము' అగుటచేతనే ఒక ఉజ్జ్వలమైన గతి యేర్పడినది. యత్తదర్థకములను రెండేసి చొప్పున వాడుట, హల్సంధివశమున నొక బింకమును పొందుట, ఔర్జిత్య మును గలిగియుండుట యను లక్షణములచేత రసపోషకమైన ఉజ్జ్వలత్వము చేకూరి నది. కావుననే యిది వైశేషికగుణముగా పరిగణింపబడుచున్నది.

ఉదాహరణశ్లోకము భట్టనారాయణుడు రచించిన వేణీసంహారమునుండి గ్రహింపబడినది.

[అనిర్వ్యూఢ గుణము]

132. సమస్త మసమస్తం వా న నిర్వహతి యద్వచః
తదనిర్వ్యూఢ మస్యాపి న దోషః క్వాపి తద్యథా.

యథా –

'ప్రసీద చండి త్యజ మన్యు మంజసా
జనస్తవాయం పురతః కృతాంజలిః
కిమర్థ ముత్కంపిత పీవర స్తన
ద్వయం త్వయా లుప్తవిలాస మాస్యతే' 175

అత్రాసమస్తరీత్యనిర్వాహా దనిర్వ్యూఢత్వేఽపి రసాంతర పరిగ్రహేణ రీత్యంతరపరిగ్రహాద్ గుణత్వమ్.

అర్థము : రచన సమస్తముగా కాని అసమస్తముగా కాని చివరంట నిర్వహింపబడుట రీతి. కొన్నియెడల అట్లు నిర్వహింపబడక పోయినప్పటికిని దోషము కాదు. ఇది లక్షణము. చండీ! ప్రసన్నురాల వగుము. వెంటనే కోపమును విడనాడుము. నీవాడు నీముందు అంజలి పట్టి యున్నాడిడిగో! ఉత్కంపిత పీవర స్తన ద్వయము నీచేత లుప్తవిలాసముగా నుంచబడిన దేల? ఇది ఉదాహరణము.

ఇచ్చట అసమస్తరీతి నిర్వహింపబడకపోవుటవల్ల అనిర్వ్యూఢత్వమే అయిన ప్పటికిని రసాంతరపరిగ్రహణముచేత రీత్యంతరపరిగ్రహణ మగుటవల్ల గుణత్వమే.

వ్యాఖ్య: సమాసబంధురముగా కాని, సమాసవిరహితముగా కాని, యెట్లయినను, రచన చేయవచ్చును. మొదలుపెట్టిన రీతిని చివరంట నిర్వహించుట అవసరము. అట్లు చేయకుండుట దోషము. కాని రసము మారినప్పుడు రీతి మారుట దోషము కాదు; పైగా రసానుగుణత్వముచేత గుణమే యగును.

ప్రకృతోదాహరణమున ప్రియుడు ప్రణయకుపిత నోదార్చుట విషయము. మొదటి రెండు పాదములందును విప్రలంభ శృంగారము చిత్రితము. రచన సమాస రహితముగా నిర్వహింపబడినది. తరువాతి రెండు పాదములందును సంభోగశృంగార సౌముఖ్యము చిత్రితము. రచన సమాసబంధురముగా నిర్వహింపబడినది. పూర్వార్ధము

నందు కర్తృపదము 'నీవు' అనునది; 'చండి' అను సంబుద్ధిని కలిగియున్నది. ఉత్తరార్ధమునందు 'స్తనద్వయమ్' కర్తృస్థానము నాక్రమించుకొన్నది. దాని కను గుణముగానే క్రియాపదము 'ఆస్యతే' అని ప్రయుక్తమయినది. ఈమార్పునకు హైతము రసము మారుటయే కారణము. రీతి నిర్వహణము ఏకరీతిగా లేకపోయినను, రసానుగుణముగా నుండుటచేత, ఇది గుణమే యని నిష్కర్షము.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకారసూత్రవృత్తిలోనిది.

## [అనలంకార గుణము]

133. అనలంకార మిత్యాహు రలంకారోజ్ఝితం వచః
పూర్వోత్తరానుసంధానే తస్య సాధుత్వ మిష్యతే.

యథా —

'నిశమ్య తాః శేషగవీ రభిధాతు మధోక్షజః
శిష్యాయ బృహతాం పత్యుః ప్రస్తావమదిశద్దృశా' 176

అస్యానలంకారత్వేఽపి పూర్వాపరానుసంధాన ప్రయోజన భూతత్వాద్గుణత్వమ్.

అర్థము : అలంకారవిరహితమైన వాక్యమును అనలంకారమని యందురు. పూర్వోత్తరములను అనుసంధించునపుడు దీనికి సాధుత్వము సమ్మతింపబడును. ఇది లక్షణము. శేషుని (బలరాముని) మాటలను విని కృష్ణుడు బృహస్పతిశిష్యునికి (ఉద్ధవునికి) కనుసైగతో మాటాడుట కవకాశమును సూచించెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట అనలంకారత్వమే అయినప్పటికిని పూర్వాపరానుసంధానభూతత్వము వల్ల గుణత్వము.

వ్యాఖ్య : నిరలంకారముగా కవితావాక్యమును చెప్పుట దోషము. దీనినిబట్టి కవిత్వమునందు అలంకారముల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. పూర్వసందర్భ మును తరువాతి సందర్భముతో, ముడిపెట్టినప్పుడు అలంకారవిరహితముగా వాడుట దోషము కాదు. తక్కిన అన్నియెడలను అలంకారయోజన ముండియే తీరవలయును.

ఉదాహరణశ్లోకము పూర్వాపరసందర్భముల ననుసంధించుటకే యేర్పడినది. అంతవరకు బలరాముడు ప్రసంగించెను. ఇంక ఉద్ధవుడు ప్రసంగింపవలయును. అందులకు కృష్ణుని సంకేతము అవసరము. కృష్ణుని సంకేతమునుబట్టి ఉద్ధవుడు ప్రసంగింపబోవుచున్నా డని చెప్పుటయే యిచ్చట పరమార్థము. ఆ పనిని సక్రమముగా నిర్వర్తించుటయే యీ శ్లోకమునకు సార్థక్యము. ఏ విధమైన అలంకారమునకు నిందు చోటు లేదు. అయినప్పటికిని, అనుసంధానకర్మచణ మగుటచేతనే యీ శ్లోకము అనలంకారగుణమున కుదాహరణ మైనది.

ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధము నందలిది.

134. వాక్యాశ్రయాణాం దోషాణాం గుణీభావోఽయ మీరితః
అథ వాక్యార్థదోషాణా మదోషః కథ్యతేఽధునా

**అర్థము** : ఇంతవరకు వాక్యాశ్రయములైన దోషములకు గుణీభావము తెలుపబడినది. ఇప్పు డింక వాక్యార్థదోషములకు అదోషత్వము తెలుపబడుచున్నది.

[అపార్థ గుణము]

135. సముదాయార్థశూన్యం య త్తదపార్థం ప్రచక్షతే
తన్మత్తోన్మత్తబాలానా ముక్తే రన్యత్ర దుష్యతి.

యథా –

'క్వాకార్యం శశలక్ష్మణః క్వ చ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణా ముపశాంతయే శ్రుత మహో కోపేఽపి కాంతం ముఖమ్
కిం వక్ష్యంత్యపకల్మషాః కృతధియో స్వప్నేఽపి సా దుర్లభా
చేతః స్వాస్థ్య ముపేహి కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి' 177

అత్ర సముదాయార్థశూన్యత్వే నాపార్థస్యాప్యున్మత్తవచనత్వాద్ గుణత్వమ్.

**అర్థము** : సముదాయార్థశూన్యమైన వాక్యమును అపార్థ మని యందురు. అది మత్తుల, ఉన్మత్తుల, బాలుర వాక్కులయందు దోషము కాదు. తక్కినచోట్ల దోషము. ఇది లక్షణము. అకార్య మెక్కడ? చంద్రవంశ మెక్కడ? ఆమె యొక్క సారి కనిపించిన బాగుండును. దోషముల కుపశాంతి కలిగించుటకే విద్య. అహో!

కోపమునందు కూడ ఆమె ముఖమెంతో అందముగా నుండును. పండితులును మాలిన్య రహితులును నన్నేమందురు? ఆమెకు రేఖామాత్రమే అన్యాదృశత్వము. చిత్తమా: నెమ్మదినొందుము. ఆమె యధరము నాస్వాదింపగల ధన్యతరుణు డెవడో కదా! ఇది ఉదాహరణము.

ఇచ్చట సముదాయార్థశూన్యత్వముచేత అపార్థమే అయినప్పటికిని, ఉన్మత్త వచన మగుటవల్ల గుణత్వమే.

**వ్యాఖ్య :** ఏ వాక్యమున కా వాక్యము అర్థవంతముగా నుండుటయే కాక, సాముదాయికముగా సమన్వితమైన యర్థముండుట అపేక్షితము. అప్పుడే అది భాష యనిపించుకొనును. కాని, మానసికస్థితి సక్రమముగా లేనివారును, బాలురును పరస్పర విరుద్ధవాక్యములను పలుకుదురు. అది వారి మనఃస్థితికి అనుగుణముగా నుండుట వల్ల, అట్లు పలుకుట గుణమే కాని దోషము కాదు.

ప్రకృతోదాహరణమునందలి వక్త చంద్ర వంశజుడు. పండితుడు; పండిత సంసర్గసంశోభితుడు. ఈ లక్షణముల కనుకూలముగా శాంతము వెల్లడి యగుచున్నది. అతడు ప్రియావిరహితుడు. ఆమె సౌందర్యరాశి; ఆమెను పోలినవారు లేరు. ఈ లక్షణముల కనుకూలముగా శృంగారము వెల్లడి యగుచున్నది. ఈ రెండు రసములును పరస్పర విరుద్ధములు. వక్త ప్రతిపాదమున పూర్వభాగమునందు శాంతానుకూలముగను, ఉత్తరభాగమునందు శృంగారానుకూలముగను ప్రసంగించును. ఈతడు ప్రియావిరహముచేత ఉన్మత్తుడగుటవల్ల ఈ విధమైన చాంచల్యము సమ్మతమే. సాముదాయికముగా శాంతము గాని శృంగారము కాని ప్రతీతము గాక ద్వైధీభావము వల్ల ఉన్మత్తతయే ప్రతీత మగుచున్నది. అదియే అభిలషణీయము. కావుననే అపార్థ గుణమున కీ శ్లోకము లక్ష్యమైయున్నది.

## [వ్యర్థ గుణము]

136. యదప్రయోజనం యచ్ఛగతార్థం వ్యర్థమేవ తత్
తస్యాపి క్వాపి నిర్దోషః ప్రయోగో దృశ్యతే యథా.
'గీతా విదుర వాక్యాని ధర్మాః శాంతనవేరితాః
న శ్రుతా భారతే యేన తస్య జన్మ నిరర్థకమ్' 178.

అత్ర గీతా విదురవాక్యాదీనాం కథాయా మప్రయోజకత్వే ఉపీతిహాసవ్యాజేన చతుర్వర్గ ప్రతిపాదన స్యారంభ ఏవ ప్రతిజ్ఞానాద్ గుణత్వమ్. తదిద మప్రయోజకమ్.

**అర్థము** : అప్రయోజన మైనదియు, గతార్థమైనదియు వ్యర్థమే. దానికి సైతము కొన్ని యెడల నిర్దోషమయిన ప్రయోగము కానవచ్చును. ఇది లక్షణము. భారతమునందలి గీతను, విదురవాక్యములను, భీష్మ ప్రోక్తములయిన ధర్మములను వినని వాని జన్మము నిష్ప్రయోజనము. ఇది ఉదాహరణము.

ఇచ్చట గీతా విదుర వాక్యాదికములకు కథయందు అప్రయోజకత్వమేయైనను, ఇతిహాసవ్యాజమున చతుర్వర్గప్రతిపాదనవిషయికమైన ప్రతిజ్ఞవల్ల గుణత్వమే. ఇది అప్రయోజనమునకు ఉదాహరణ.

**వ్యాఖ్య** : ప్రబంధార్థమును పరిపోషింపనేరని వర్ణనముకాని సంభాషణము కాని వ్యర్థమే. అట్లే పూర్వము చెప్పిన విషయమునే మరల చెప్పుట వ్యర్థమే. దీనిని బట్టి కావ్య నిర్మాత అవసరములేని యేవర్ణనమును గాని, సంభాషణమును గాని, విషయమును గాని, పాత్రమును గాని ప్రవేశపెట్టరాదన్న నియమము మార్గాంతరమున నిబంధింపబడుచున్నది.

ప్రకృతలక్ష్యము అప్రయోజన రూపమైన వ్యర్థదోషము గుణమగుటను ప్రదర్శించుచున్నది – గీతవల్లకాని, భీష్మధర్మోక్తులవల్లకాని, భారతకథయందు మేలు జరుగలేదు. ఆయావాక్యముల పరమార్థమును తత్తద్వ్యక్తులు సక్రమముగా గుర్తింపలేదు. అయినప్పు డాయాధర్మప్రసంగములను అప్రయోజకములనియే అనవలయును. అట్లయినప్పుడు వ్యర్థము అన్న దోషమునకు పాల్పడినట్లే. కాని, భారతము ఇతిహాసము. ఇతిహాసము చతుర్వర్గఫలప్రాప్తిని కలిగించును. ధర్మార్థకామ మోక్షములందు విచక్షణత్వమును కలిగించును. కావున కథాగతపాత్రముల విషయమునందు తత్ప్రసంగములు వ్యర్థము లైనప్పటికిని పాఠకులకు అవి సముపాదేయములే. పాఠకుల విషయమున వానికి వ్యర్థత్వము లేదు. అంతేగాక, వానిని కూర్చినప్పుడే ఇతిహాసకర్త తన కర్తవ్యమును సమగ్రముగా, సర్వాంగీణముగా నిర్వహించినవాడగును. అందువల్లనే ప్రకృతశ్లోకము వ్యర్థగుణమునకు లక్ష్యమైనది.

ఏవం గతార్థమపి యథా –
'హృత్కంఠ వక్త్ర శ్రోత్రేషు కస్య నావస్థితం తవ
శ్రీఖండ హార కర్పూర దంత పత్రప్రభం యశః' 179

అత్రైకేనైవోపమానేన శౌక్ల్యప్రతీతౌ శేషోపమాన పదానాం వ్యర్థత్వేఽపి యశసః స్మర్యమాణత్వ గీయమానత్వ స్తూయమానత్వ శ్రూయమాణత్వైర్హృదయాదిషు శ్రీఖండాదివదవస్థానస్య ప్రతీయమానత్వాద్గుణత్వమ్.

**అర్థము :** ఇట్లే గతార్థరూపమైన వ్యర్థదోషము గుణ మగుట కుదాహరణము. నీయొక్క చందన (ముక్తా) హార కర్పూర కుందపుష్ప సన్నిభమైన యశము ఎవని హృదయ, కంఠ, వక్త్ర, కర్ణములందు నెలకొనకుండ నున్నది?(సర్వత్ర నెలకొన్నదని భావము)

ఇచ్చట ఒక్క యుపమానముచేతనే తెల్లదనము వెల్లడి యగుచుండగా మిగిలిన యుపమానపదములకు వ్యర్థత్వమేయైనప్పటికిని స్మర్యమాణత్వము స్తూయమానత్వము శ్రూయమాణత్వము ననువానిచేత హృదయము మొదలయిన వానియందు ప్రతిష్ఠ నొందుట యన్నది ప్రతీయమాన మగుచుండుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : పూర్వము చెప్పిన విషయమునే మరల చెప్పినయెడల గతార్థమగును. ఇది వ్యర్థదోషమునందు ఒక విభాగము.

ప్రకృతోదాహరణమున ఒక రాజుయొక్క కీర్తి ప్రశంసింపబడినది. కీర్తి తెల్లగా నుండు ననుట కవి సంప్రదాయము. అందుచేత ప్రకృతకవి కీర్తిని చందనముతోను, ముత్యాలమాలతోను, కర్పూరముతోను, కుందపుష్పముతోను, పోల్చుచున్నాడు. వీని యన్నింటిచేతను రాజుకీర్తి స్వచ్ఛముగా తెల్లగా నున్నదనుటయే ఉద్దిష్టము. చందనముతో పోల్చినప్పుడే తెల్లదనము వెల్లడియైనది. ఇంక హారాదులు గతార్థములనే తెలుపుచున్నవి కాని క్రొత్తదనమును జతచేయవు. కావున, ఈ విధముగా ఇది వ్యర్థదోషమే.

ఇది యింతటితో సమాప్తి పొందలేదు. హృదయ కంఠ వక్త్ర కర్ణముల యందు నెలకొని యున్నదన్న భావము శోధింపబడినది. చందనాదులు నాలుగింటికి

హృదయాదులు నాలుగింటిని యథాసంఖ్యముగా చెప్పుటచేత హృదయాశ్రయమైన స్మరణము, కంఠాశ్రయమైన గాయనము. ముఖాశ్రయమైన స్తవనము, కర్ణాశ్రయమైన శ్రవణము సూచింపబడినవి. దీనివల్ల ఆ కీర్తి స్మరణాది ధర్మసంయుక్తమై యున్న దన్న విషయముకూడ వ్యజ్యమాన మగుచున్నది. ఇట్లు ఉపమానములను నాలుగింటిని వాడుటచేత స్మరణాదిధర్మములుకూడ వ్యంజితములగుట సంభవించినది. కావుననే గతార్థమును దోషముగా గాక యిచ్చట గుణముగానే పరిగణించి ప్రకృత శ్లోకమును లక్ష్యముగా ప్రదర్శించుట జరిగినది.

## [ఏకార్థ గుణము]

137. అవిశేషేణ పూర్వోక్తం యది భూయోఽపి కీర్త్యతే
తదేకార్థం రసాక్షిప్తచేతసాం తన్న దుష్యతి.

**యథా –**

అసారం సంసారం పరిముషితరత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణశరణం బాంధవజనమ్
అదర్పం కందర్పం జననయననిర్మాణ మఫలం
జగజ్జీర్ణారణ్యం కథమపి విధాతుం వ్యవసితః' 180

అత్ర 'అసారం సంసార' మిత్యుక్త్వా 'పరిముషితరత్నం త్రిభువనం నిరాలోకం లోకం' 'జగజ్జీర్ణారణ్య'మితి యదుక్తం తస్య విశేషానభిధాయకత్వేఽపి రసాక్షిప్తేన వక్త్రాభిహితత్వాద్గుణత్వమ్.

అర్థము : పూర్వము చెప్పబడిన దానినే మరల మరల కీర్తించినచో అది యేకార్థ మగును. రసాక్షిప్తచేతసులకు అది దోషము కాదు. ఇది లక్షణము. సంసారము నసారముగాను, మూడు లోకములను రత్నమును గోల్పోయినవానిగాను, లోకమును ప్రకాశహీనముగాను, బాంధవజనమును మరణము నాశ్రయించు నట్లుగాను, మన్మథుని దర్పహీనునిగాను, జననేత్రనిర్మాణమును ఫలరహితముగాను, ప్రపంచమును పాడుబడిన అరణ్యముగాను, చేయుటకు నీవేల సిద్ధపడితివి? ఇది ఉదాహరణము.

ఇచ్చట 'అసారం సంసార'మని చెప్పి 'పరిముషితరత్నం త్రిభువనం, నిరాలోకం లోకం, జగజ్జీర్ణారణ్య' మని చెప్పినందువలన విశేషముగా చెప్పుట యేమియు లేకపోయినప్పటికిని రసావేగముతో వక్తచేత చెప్పబడుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : చెప్పిన విషయమునే రూపాంతరమున మరల చెప్పుట యేకార్థము. ఇది దోషము. రసావిష్టుడైన వక్త చెప్పినప్పుడు సహృదయులకు ఏకార్థము గూడ గుణవంతముగానే తోచును. అనగా సహృదయహృదయ స్పందన సమర్థమై యుండునని భావము.

మాలతి సంసారమునకు సారము వంటి దనియు, మూడు లోకములందును రత్నము వంటిదనియు, లోకమునకు వెలుగు వంటిదనియు, బాంధవజనమునకు ఏకైకశరణమనియు, ఆమెవల్లనే కందర్పునకు దర్పము చెల్లుచున్నదనియు, జనులకు కన్నులున్న ఫల మామెను చూచుటయే యనియు, అమె లేనియెడల జగత్తంతయు ఆకులు రాలి పూలు వాడిన జీర్ణోద్యానమువలె నగుననియు మాధవుని రసాక్తహృదయభావము. ఇది సహృదయులకు రంజకముగానే యుండును.

'అసారము సంసారము, అపహృతరత్నము త్రిభువనము' మొదలుగా చెప్పిన మాటలలో అపేక్షితము, సారభూతము నైన వస్తువుయొక్క లేమియే వర్ణితమైనది. చివరంట నిది యొక్కటే తాత్పర్య మగుటచేత ఏకార్థ మన్న దోషము కావలయును. అయినప్పటికిని మాధవుని ప్రణయహృదయ మావిష్కృత మగుటచేతను, మాలతి అనర్ఘత్వము బహువిధములుగా అభిహిత మగుటచేతను,సహృదయహృదయావర్జక మగుటచేతను ప్రకృతశ్లోకము ఏకార్థగుణమున కుదాహరణమైనది.

ఉదాహరణశ్లోకము భవభూతి మాలతీమాధవము నందలిది.

## [సందిగ్ధ గుణము]

138. సంశయాయైవ సందిగ్ధం యది జాతు ప్రయుజ్యతే
స్యాదలంకార ఏవాసౌ న దోషస్తత్ర తద్యథా.
'కుత్తో లంభఇ పంథిఅ సత్థరఅం ఏత్థ గామణిఘరమ్మి
ఉణ్ణ అప ఓమాఁరే పేక్షి ఊణ జఇ వససి తా వససు' 181.
[ఛాయా —

'కుతో లభ్యతే పథిక ప్రస్తరక మత్ర గ్రామణీగృహే
ఉన్నతపయోధరాన్ ప్రేక్ష్య యది వససి తదా వస'

అత్ర కేనాపి పథికయూనా ప్రావృడారంభే గ్రామణీవధూః పీనోన్నత స్తనీ 'సత్థరఅ' మితి ప్రస్తరకవ్యాజేన శ్రస్తరతం యాచితా. తం ప్రత్యాచక్షాణేవ యథోక్తం బ్రూతే — 'కుతోఽత్ర గ్రామణీ గృహే ప్రస్తరకః, కుతో వా శ్రస్తం రతమ్. ఉన్నతౌ పయోధరావమను హృదయే నభసి వా పయోధరాన్ దృష్ట్వా యది వససి తదా వస' ఇతి తదేతస్య గోపనాయ ద్వ్యర్థైరేవ పదైః ప్రయుక్తమితి సందిగ్ధ స్యాప్యస్య గుణత్వమ్.

**అర్థము** : సంశయముకొఱకే సందిగ్ధము ప్రయోగింపబడి నట్లయిన, అది యలంకారమే యగును కాని దోషము కాదు. ఇది లక్షణము. ఓయి బాటసారీ, ఇచ్చట గ్రామణి యింటియందు నీకు ప్రస్తరక (శ్రస్తరత) మెట్లు లభించును. ఉన్నతపయోధరములను చూచి యుందువేని యుండుము. ఇది ఉదాహరణము.

ఇచ్చట వర్షారంభకాలమున ఒకానొక పథికయువకుడు పీనోన్నత స్తనయైన గ్రామాధికారికోడలిని చూచి ప్రస్తరకము (పరుపు) కావలెనన్న మిషతో శ్రస్తరతము (సంభోగము)ను యాచించెను. అప్పుడామె సమాధానము చెప్పుచున్నట్లుగా నిట్లు చెప్పెను — ఇక్కడ గ్రామణీగృహమున పరుపెట్లు లభించును? లేదా, సంభోగ మెట్లు లభించును? వక్షఃస్థలమున నున్న ఉన్నత స్తనములను చూచి, లేదా నభఃస్థల మున నున్న ఉన్నతమేఘములను చూచి, ఇచ్చట నుండదలచినచో నుండుము. ఇట్లు గోపనము కొరకే రెండర్థముల పదములు ప్రయుక్తమైనవి. అందుచేతనే సందిగ్ధము నకు నైతము గుణత్వము కలుగుచున్నది.

**వ్యాఖ్య** : వక్త యుద్దేశించిన యర్థము 'అదియా? ఇదియా?' యన్న సంశ యమును కలిగించినయెడల, అది సందిగ్ధదోషమగును అట్టి సంశయమును కలిగిం చుటయే వక్త యుద్దేశ్యమైనపుడు అది గుణమే కాని దోషము కాదు.

ప్రకృతోదాహరణమున బాటసారి 'సత్థరఅం' అనుదానిని యాచించెను. ప్రస్తరక శ్రస్తరత శబ్దములకు రెండింటికిని ప్రాకృతరూప మిదియే. కావున బాటసారి

ప్రస్తరకరము (పరుపు)నే యడిగెనో శస్తరతము (సంభోగము)నే యడిగెనో నిశ్చితముగా చెప్పుటకు వీలులేదు. కావుననే, 'మింట మబ్బులు పట్టియున్నవి గాన వర్షము కురియునన్న భయముచేత నిలువ దలచుకొన్న నిచ్చట నిలువుము. మాయింట పరుపు లెచ్చట నున్నవి?' అన్న భావముతోనే చెప్పినదో 'ఇది గ్రామాధికారి యిల్లు. ఈ యింట నీకు సంభోగ మెట్లు లభించును?. ఉన్నత స్తనములను చూచి సంతృప్తి పడుదువేని యిచ్చట నిలువుము' అన్న భావముతోనే చెప్పినదో స్పష్టముగా లేదు. సంశయాత్మకమైన యీ సమాధానము సంశయాత్మకమైన యా యువకుని యాచనమునకు తగినట్లున్నది. కావున ఇచ్చట సందిగ్ధ మున్నను దోషము కాక సంభాషణ చాతుర్యసంవర్ధక మగుటచేత గుణమే యగుచున్నది.

## [అపక్రమ గుణము]

39. వాక్యే ప్రబంధే చార్థానాం పౌర్వాపర్య విపర్యయః
దోషః సోఽపక్రమో నామ చిత్రహేతౌ న దుష్యతి.

యథా —

'పశ్చాత్పర్యస్య కిరణానుదీర్ణం చంద్రమండలమ్
ప్రాగేవ హరిణాక్షీణా ముదీర్ణో రాగసాగరః. 182.

అత్ర పౌర్వాపర్యవిపర్యయా దపక్రమదోషస్య చంద్రోదయం ప్రతి రాగోద్దీపనప్రకర్ష ప్రకాశనత్వా దదోషః.

**అర్థము** : వాక్యమునందును ప్రబంధమునందును అర్థముల పౌర్వాపర్యము వ్యత్యస్తమైనయెడల అది అపక్రమ మన్న దోష మగును. అది చిత్రహేతువునందు దోషము కాదు. ఇది లక్షణము. కిరణములను వెదజల్లి చంద్రమండలము తరువాత నుదయించెను. ముందే మృగాక్షుల అనురాగసాగరము పొంగెను. ఇది ఉదాహరణము.

ఇచ్చట పౌర్వాపర్యమువల్ల అపక్రమదోషము. అయినప్పటికిని చంద్రోదయముయొక్క రాగోద్దీపన ప్రకర్షప్రకాశనత్వమువల్ల దోషము కాదు.

**వ్యాఖ్య** : ముందు జరిగిన పనిని ముందు చెప్పుటయు, వెనుక జరిగిన పనిని వెనుక చెప్పుటయు సక్రమము. అట్లు కానిది అపక్రమము. అట్లే కారణము

ముందు పుట్టి కార్యము తరువాత పుట్టినట్లు చెప్పుట సక్రమము. అట్లు కాక కార్యమే ముందు పుట్టినట్లు చెప్పి కారణము తరువాత పుట్టినట్లు చెప్పినయెడల అపక్రమ మగును. అయినప్పటికిని చిత్తరంజకమైన హేతువున్నప్పుడు అపక్రమము దోషము కాక అలంకార మగును.

ప్రకృతోదాహరణమునందు సముద్రము పొంగినట్లును, చంద్రుడు తరువాత నుదయించినట్లును వర్ణింపబడినది. ప్రకృతియందు చంద్రోదయము కారణము. సముద్ర ముత్తరంగిత మగుట కార్యము కావున చంద్రు డుదయించిన పిమ్మటనే సముద్రము పొంగుచెత్తును. ఇచ్చట కవి కారణకార్యములను వ్యత్యస్తముగా నిరూపించెను. ఇచ్చట చంద్రుడు ప్రకృతియందలి చంద్రుడే కాని సాగరము మాత్రము ప్రకృతియందలి సాగరము కాదు. ఇది అనురాగసాగరము. చంద్రు డుదయింపక ముందేఅనురాగసాగరము పొంగులెత్తెననుటచేత చంద్రగతమైన రాగోద్దీపనాధిక్యమే వెల్లడి యగుచున్నది. ఉదయింపక పూర్వమే యింత కాగా, ఉదయించిన పిమ్మట మరెంత వృద్ధినొందునో యన్న సంభావన కిది యవకాశమును కల్పించుచున్నది. ఈ విపర్యాసమువల్ల విశిష్టతయే వెల్లడి యగుచున్నది. అందువల్లనే యిది గుణమే కాని దోషము కాదని నిశ్చయించుట జరుగుచున్నది.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ఖిన్న గుణము]

140. యస్మిన్ రీతే రనిర్వాహః ఖిన్నం తదభిధీయతే
న దోష స్తస్య తు క్వాపి యత్ర చ్ఛాయా న హీయతే.

యథా —

'అభినవ వధూరోషస్వాదుః కరీషతనూనపా
దసరల జనాశ్లేషక్రూర స్తుషారసమీరణః
గలిత విభవస్యాజ్ఞేవాద్య ద్యుతిర్మసృణా రవే
ర్విరహి వనితావక్త్రక్లైబ్యం బిభర్తి నిశాకరః' 188.

అత్రోపమానాని సామాన్యవచనైః సమస్యంత ఇతి ప్రక్రాంత రీతే రనిర్వాహేఽపి సమాసవ్యాఖ్యాపరత్వేనైవ ఇవ శబ్దతద్ధితయోః ప్రయోగే ప్రత్యుత చ్ఛాయోత్కర్ష ఇతి గుణత్వమ్.

**అర్థము** : రీతి చివరంట నిర్వహింపబడనియెడల, అది భిన్న మన్న దోష మగును. ఛాయకు నష్టము కలుగనియెడల దానికికూడ కొన్నియెడల దోషత్వము లేదు. ఇది లక్షణము. పిడకల పెగ నవవధూరోషమువలె ఇంపు గొల్పుచున్నది. మంచుతో తడిసిన చలిగాలి కపటచిత్తుని కౌగిలింతవలె క్రూరముగా నున్నది. సూర్యుని తేజము పేదవడిన భాగ్యవంతుని ఆజ్ఞవలె మృదువుగా నున్నది. చంద్రుడు విరహిణీ ముఖసామ్యమును పొందుచున్నాడు. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఉపమానములు సామాన్యవచనములతో సమసించుట యన్న రీతి ప్రారంభింపబడినది. అది తుది వరకు నిర్వహింపబడక పోయినప్పటికి సమాస వ్యాఖ్యాపరత్వముచేతనే "ఇవ" శబ్దముయొక్కయు, తద్ధితముయొక్కయు ప్రయోగమునందు ఛాయోత్కర్షము అన్న గుణము కలుగును.

**వ్యాఖ్య** : మొదలుపెట్టిన విధానమును చివరంట నిర్వహించుట రీతి యగును. దానికి విరుద్ధము భిన్నము. ఇది దోషము. అయినప్పటికిని రచనాచ్ఛాయకు సౌందర్యము తగ్గినయెడల్ల, దానికి దోషత్వము లేదు. ఇంక సౌందర్యముకూడ పెరుగుట జరిగినయెడల అది గుణమే యగును.

ప్రకృతోదాహరణమున 'అభినవవధూరోషస్వాదుః' 'అసరలజనాశ్లేషక్రూరః' అను రెండు చోట్లను సమానధర్మము సమస్తరూపమున నున్నది. అనగా స్వాదు, రోష శబ్దములు సమానధర్మబోధకములు; ఉపమానవాచకములతో సమసించి యున్నవి. అందువల్లనే ఉపమావాచకమైన 'ఇవ' శబ్దము లోపించినది. తరువాతి యుపమానము 'గలితవిభవస్య ఆజ్ఞా'. ఇచ్చట నిది వ్యస్తరూపమున నున్నది. అట్లే ఇవ శబ్దము కూడ ఉపాత్తమైనది. నాలుగవ యుపమానమునందు తద్ధితప్రయోగము చేత సమానత్వము ప్రతీయ మగుచున్నది. మొదటి రెండు ప్రయోగము లొక విధము గాను, మూడవది యింకొక విధముగాను, నాలుగవది మరొక విధముగాను ఉండుట చేత "భిన్నము" అన్న దోషము కావలయును. కాని యీ రీతి భిన్నత్వముచేత బంధమునకు సౌందర్యమే యినుమడించుచున్నది. ఈ సౌందర్యప్రకర్షమునుబట్టి దీనిని గుణముగానే పరిగణింపవలయును.

ప్రకృతోదాహరణశ్లోకము మాళవరుద్రుని రచనగా ఔచిత్యవిచారచర్చ యందు ప్రదర్శింపబడినది.

[ అతిమాత్ర గుణము ]

141. లోకాతీత ఇవార్థే యః సోఽతిమాత్ర ఇహేష్యతే
వార్తాదా తేన తుష్యన్తి విదగ్ధా నేతరే జనాః.

142. తచ్చ వార్తాభిధానేషు వర్ణనాస్వపి విద్యతే
కాంతం జగతి తత్కాంతం లౌకికార్థానుయాయి యత్.

143. లౌకికార్థ మతిక్రమ్య ప్రస్థానం యత్ప్రవర్తతే
తదత్యుక్తి రితి ప్రోక్తం గౌడానాం మనసో ముదే.

అర్థము : లోకాతీతమైనట్లుగా రచింపబడినచో దానిని అతిమాత్రము అని యందురు. వార్తాదులయందు నేర్పరులు దానికి సంతోషింతురు, ఇతరులు సంతోషపడరు. అది వార్తాకథనమందును వర్ణనమందును గూడ నుండును. లౌకికార్థము ననుసరించి లోకమున మనోహరమై యున్నదానిని 'కాంత'మని యందురు. లౌకికార్థము నతిక్రమించి(కవుల)ప్రస్థానమునందు ప్రవర్తించుదానికి 'అత్యుక్తి'యని యందురు. అత్యుక్తి గౌడుల మనస్సులకు మోదమును కలిగించును.

యథా —

'దేవధిష్ణ్యమివారాధ్య మద్య ప్రభృతి నో గృహమ్
యుష్మత్పాదరజఃపాతధౌతనిశ్శేషకల్మషమ్.' 184.

అత్రాతిమాత్రాఖ్యే దోషేఽపి వార్తాభిధానేఽభిధేయస్య కాంతిగుణస్యాభిజ్ఞానాద్ గుణత్వమ్.

అర్థము : అతిమాత్రదోషమునందు వార్తాభిధానగుణమున కుదాహరణము. మీ పాదధూళి పడుటచేత సర్వపాపములును తొలగిపోయిన మా గృహము నేటి నుండి దేవమందిరమువలె ఆరాధనీయ మైనది.

ఇచ్చట అతిమాత్ర మన్న దోష మున్నప్పటికిని వార్తాభిధానమునందు అభిధేయముయొక్క కాంతిగుణమును గుర్తించుటవల్ల గుణత్వము.

అర్థము : వార్తాభిధాన మని యనగా కుశలప్రశ్నము, ప్రియాలాపము మొదలయిన వని భావము. కొందరు వార్త యనగా ఇతిహాస మన్న యర్థము చెప్పుదురు. ఉదాహరణమునుబట్టి భోజదేవుడు ఇతిహాసార్థమును గ్రహించుట కిష్టపడడనుట స్పష్టము. ఇందున్న 'కాంతి' అర్థగుణము. అర్థసంబంధమైన ఔజ్జ్వల్యమునకే కాంతి యని పేరు. ప్రియాలాపరూపమైన ప్రసంగమునందు సామాన్యగృహమును దేవమందిర మనుట అతిమాత్రమే. అయినప్పటికిని కాంతిగుణమువల్ల, ప్రసంగమునకు ఉజ్జ్వలత్వము కలుగుటచేత, అది గుణమే కాని దోషము కాదు.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

యథా వా —

'అల్పనిర్మిత మాకాశ మనాలోచ్యైవ వేధసా
ఇదమేకం విధం భావి భవత్యాః స్తనజృంభణమ్.' 185.

అత్రాతిమాత్రత్వేఽపి వర్ణనార్హత్వాద్గుణత్వమ్.

అర్థము : మరొక యుదాహరణము. ఈవిధముగా కానున్న నీయొక్క స్తన విజృంభణమునుగురించి ఆలోచింపకయే బ్రహ్మ ఆకాశమును మిక్కిలి తక్కువగా నిర్మించెను.

ఇచ్చట అతిమాత్రత్వమే అయినప్పటికి వర్ణనార్హత్వమువల్ల గుణత్వము.

వ్యాఖ్య : అతిమాత్ర దోషమునందు వర్ణనాశ్రితగుణమున కుదాహరణముగా ఈ శ్లోకము ప్రవర్తించును. బాహువులమధ్య నున్న అవకాశము చాలనంతగా స్తనములు విజృంభించుచున్న వని వర్ణనార్థము. ఇట్లు చెప్పుటకు బదులుగా వక్త తన చాతుర్యముతో బ్రహ్మను పరిహసించుట యిందు కాననగును. ఇది అతిమాత్ర దోషమే. అయినప్పటికిని వర్ణనార్థగుణము యొక్క కాంతివల్ల, ఇది దోషము కాక గుణమే యగును. అనగా అతిమాత్రత్వమునకు బాధకము కాదని తాత్పర్యము.

అథానతిమాత్రం కీదృక్ ? ఉచ్యతే.

వార్తాయాం తావద్యథా –

'గృహాణి నామ తాన్యేవ తపోరాశి ర్భవాదృశః
సంభావయంతి యాన్యేవం పావనైః పాదపాంసుభిః' 186.

అథ వర్ణనాయాం యథా -

'అనయో రనవద్యాంగి స్తనయో ర్జృంభమాణయోః
అవకాశో న పర్యాప్త స్తవ బాహులతాంతరే' 187.

**అర్థము :** ఇంక అతి మాత్రము కాకుండ నుండుట యెట్టిది? చెప్పబడు చున్నది. వార్తయం దిట్లుండును. నీవంటి తపోరాశి యీ విధముగా పావనములైన పాదరజఃకణములచేత వేనిని సంభావించునో అవియే నిజమైన గృహములు. వర్ణనయం దిట్లుండును. ఓ స్వచ్ఛాంగీ! నీ బాహులతామధ్యమున పెరుగుచున్న స్తనములకు చాలినంత యెడము లేదు.

వ్యాఖ్య : వార్తాకథనమునందు అతిమాత్రత్వము లేకుండ చెప్పినను కాంతి గుణమునకు లోపము లేదు. 'గృహములు సార్థకములైన గృహములు' మున్నగు విధముగా చెప్పుట వాస్తవమును చెప్పుటయే. మానవవాసయోగ్యమయిన గృహమును దేవమందిర మనుట అత్యుక్తి. అట్లే వర్ణనమందు బ్రహ్మ ఆలోచనారాహిత్యమును, అసమర్థత్వమును తీసికొని వచ్చి ప్రసంగించుట అతిమాత్రత్వము. అట్లుగాక స్తనజృంభణమును, వ్యవధానము తగినంత లేకపోవుటను చెప్పుట వాస్తవమును చెప్పుటయే. విదగ్ధులు వాస్తవమును మాత్రమేగాక కవికల్పనాచాతురిని కూడ వాంఛింతురు. కావున వారు అతిమాత్రమునకు ఆనందింతురు. అర్థాశ్రయమైన కాంతి గుణము దోషమును కనిపింప నీయదు. అవిదగ్ధులు మాత్రమే వాస్తవమునో, వాస్తవసన్నిహితమునో వాంఛింతురు. వారి దృష్టి వస్తుప్రధానముగా నుండును. అంతకు మించినది. వారికి భారముగానే యనిపించును. భావుకుల దృష్టి భావప్రధానముగా నుండును. అందువల్లనే అతిమాత్ర మైనప్పటికిని, దానినిదోషముగా పరిగణింపక, కవి ప్రదర్శించిన కల్పన కామనీయకమునందే కాంక్షను నిల్పుకొందురు.

ఇచ్చటి ఉదాహరణశ్లోకములు దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినవి.

[పరుష గుణము]

144. పరుషం నిష్ఠురార్థం తు య దతీవ విగర్హితమ్
విరుద్ధలక్షణాద్యాసు తదు_క్తిషు న దుష్యతి.
యథా –
'హాలాహాలం విషం భుంక్ష్వ సఖి మా త(త్ర విశ్వసీః
యద్వా న దహ్యాసే కాష్ఠైః స్వల్పై_ర_స్త్వమితి మే మతిః' 188.
అ(త్ర పారుష్యేఽపి విరుద్ధలక్షణయార్థాంతరస్య లక్షితత్వాద్ గుణత్వమ్ .

అర్థము: నిష్ఠురమైన అర్థము కలది పరుషము. అది మిక్కిలి దూష్యము. విరుద్ధలక్షణమువల్ల త త్తదు క్తులయందు దూష్యము కాదు. ఇది లక్షణము. సఖీ! హాలాహలవిషము తినుము. అయినను దానిని కూడ నమ్మకుము. ఇంక స్వల్పమయిన కట్టెలు నిన్ను తగులబెట్టలే వని నా యభి(పాయము. ఇది ఉదాహరణము.

ఇచ్చట పారుష్య మున్నప్పటికిని విరుద్ధలక్షణచేత అర్థాంతరము లక్షిత మగుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : నిష్ఠురార్థమైనచో పరుషమన్న వాక్యార్థదోషము కలుగును. విరుద్ధలక్షణ యగుటచేత పైకి నిష్ఠురముగా ననిపించినను, తద్విరుద్ధమైన యర్థమే యుద్దిష్టమైనపుడు పరుషమన్న దోషము పరిహృతమగును.

(ప్రకృతోదాహరణమునందు కట్టెలు పేర్చుకొని మరణయత్నము సాగించు చున్న ఒక సఖిని చూచి పలుకుచున్న పలుకు లున్నవి. ఇచ్చట "విషము తినుము" అని యున్నవి. విరుద్ధలక్షణచేత 'మరణ(ప్రయత్నమునుండి విరమింపుము' అన్న యర్థ మునే బోధించును. కావున పైకి పరుషముగా అనిపించినను తాత్పర్యముచేత తద్వి రుద్ధమే (ప్రతీత మగుటవల్ల, ఇది దోషము కాదు.

[విరస గుణము]

145. అ(ప్రస్తుతరసం (ప్రాహుర్విరసం వస్తు సూరయః
అ(ప్రాధాన్యే తదేష్టవ్యం శిష్టైః స్యా(ద్రసవస్తునోః.
యథా –

'క్షిప్తో హస్తావలగ్నః ప్రసభమభిహతోఽప్యాదదానోంశుకాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్తశ్చరణనిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వః శరాగ్నిః'189

అత్ర కరుణే శృంగారస్యాప్రకృతత్వేఽపి శంభుప్రభావ వర్ణనాంగభూతత్వేన ద్వయోరప్యప్రాధాన్యాదవైరస్యేన గుణత్వమ్.

అర్థము : పండితులు అప్రస్తుతమైన రసముగల వస్తువును విరస మని యందురు. రసవస్తువులకు ప్రాధాన్యము లేనపుడు పండితుల కది సమ్మతమే. ఇది లక్షణము. సాశ్రునేత్రోత్పలలైన త్రిపురయువతుల కరగ్రహణము చేసి విదలింపబడి, చేలాంచలముల నంటి విసరికొట్టబడి, శిరోజములను పట్టుకొని గిరవాటు నొంది, పాదములమీద పడి తిరస్కరింపబడి, కౌగిలించుకొని నెట్టివేయబడి కాముకునివలె ఆర్ద్రాపరాధమైన శాంభవశరాగ్ని మీ పాపమును దహించునుగాక! ఇది ఉదాహరణము.

ఇచ్చట కరుణమునందు శృంగారమునకు అప్రకృతత్వమే అయినప్పటికిని శంభుప్రభావవర్ణనమునకు అంగభూతము లగుటచేత రెండింటికి నప్రాధాన్యమే. అందువల్ల వైరస్యము కలుగదు. కావున గుణత్వము.

వ్యాఖ్య : ప్రకృతరసమునకు విరుద్ధమైన రసమును పోషించినయెడల విరస మని యందురు. అది దోషము. అప్రధానము లయిన రెండు విరుద్ధరసములను వర్ణించినయెడల వైరస్యము కలుగదు. కావున, అది దోషము కాదు. అనగా, రెండు రసములును మరియొక రసమునకు అంగభూతములై యుంటుటచేత, అంగిరసమునకు ప్రాధాన్యమును కలిగించుటయందే అవి ప్రవర్తించు నని భావము.

ప్రకృతోదాహరణమునందు త్రిపురయువతుల కరుణావస్థ వర్ణితమైనది. తమ భర్తలు నశించి, తమ వైభవ మంతయు నశించి తాము మిక్కిలి దయనీయస్థితిలో నున్నారు. ఇట్టి సమయమున కవి విరుద్ధరసమైన శృంగారమును పోషించుట కానవచ్చును. శాంభవాగ్నికి కాముకలక్షణము నాపాదించుట కానవచ్చును. ఇది యింతటితో పర్యవసానము నొందుట లేదు, ఇట్లే యైనచో అప్రకృతరసపోషణముచేత

వైరస్యము కలుగుచున్నది, కావున విరసమన్న వాక్యార్థదోష మున్నదని చెప్పవలసి వచ్చెడిది. అటు కరుణరసము కాని, యిటు శృంగారరసము కాని తమంతట తాము నిలువక ప్రధానమైన శివమహత్త్వవర్ణనమున కంగములుగా పరిణామము చెందు చున్నవి. కావుననే ప్రకృతశ్లోకము విరసదోషమునకు లక్ష్యము కాక, గుణమునకు లక్ష్యమైనది.

ఉదాహరణశ్లోకము అమరుకమునుండి గ్రహింపబడినది.

## [హీనోపమ గుణము]

146. హీనం యత్రోపమానం స్యాదుపమేయం గుణాధికమ్
హీనోపమం తదస్యాహుః కవయః క్వాప్యదుష్టతామ్.

యథా —

'తతః కుముదనాథేన కామినీగండ పాండునా
నేత్రానందేన చంద్రేణ మాహేంద్రీ దిగలంకృతా'. 190.

అత్రోపమానస్య హీనతాయామపి రాగాతిశయహేతుత్వాద్ గుణత్వమ్.

అర్థము : ఉపమానము హీనమై ఉపమేయము గుణాధిక మైనయెడల హీనోపమ మని యందురు. కొన్నియెడల కవులు దానికిని అదుష్టత్వమును తెల్పుదురు. ఇది లక్షణము. అప్పుడు కుముదనాథుడును, కామినీగండపాండువును, నేత్రానందుడు నైన చంద్రునిచేత మహేంద్రదిశయైన తూర్పు అలంకరింపబడినది. ఇది ఉదాహరణము.

ఇచ్చట ఉపమానమునకు హీనత్వ మున్నప్పటికిని రాగాతిశయ హేతుత్వము వల్ల గుణత్వము.

వ్యాఖ్య : ఉపమానము హీనమై యున్నపుడు హీనోపమ మన్న దోషము కలుగును. కాని సన్నివేశమునుబట్టియు, వక్తనుబట్టియు, కొన్నియెడల హీనోపమ కూడ గుణవంతమే యగును.

ప్రకృతోదాహరణమునందు 'చంద్రుడు' ఉపమేయము, కామినీగండము (కపోలము) ఉపమానము, చంద్రుడు ఉన్నతకోటికి చెందినవాడు; కామినీకపోలము నిమ్నకోటికి చెందినది. అయినప్పటికిని, ప్రణయవివశుడైన వక్త పలుకునప్పుడు కామినీకపోలమే సర్వోత్తమస్థాయికమై యుండుట స్వాభావికము. వక్త్రౌచిత్యమును బట్టి, ప్రణయప్రకర్ష నిరూపణాభిలాషమునుబట్టి ప్రకృతశ్లోకమునందు దోషము తొలగిపోయి గుణమే వెలయుచున్నది. ఇచ్చట వక్తయొక్క అనురాగాతిశయమే ప్రాధాన్యము వహించుచున్నది.

ప్రకృతశ్లోకము మహాభారతము ద్రోణపర్వమునుండి గ్రహింపబడినది.

## [అధికోపమ గుణము]

147. యత్రోపమాన ముత్కృష్ట ముపమేయం నికృష్యతే
జ్ఞేయం తదధికౌపమ్య మస్యాపి క్వాప్యదోషతా

యథా –

'కాంత్యా చంద్రమసం ధామ్నా సూర్యం ధైర్యేణ చార్ణవమ్
రాజన్ననుకరోషి త్వం సౌభాగ్యేనాపి మన్మథమ్. 191.

అత్రాధికౌపమ్యేఽపి రాజ్ఞో లోకపాలాంశత్వేన శిష్టైః రాదృతత్వాద్గుణత్వమ్.

అర్థము : ఉపమాన మున్నతమై ఉపమేయము తక్కువదైనచో అధికౌపమ్య మను దోషమగును. అదియు కొన్నియెడల దోషము కాదు. ఇది లక్షణము. రాజా! నీవు కాంతిచేత చంద్రుని, తేజముచేత సూర్యుని, ధైర్యముచేత సముద్రుని, సౌందర్యముచేత మన్మథుని అనుకరించుచున్నావు. ఇది ఉదాహరణము.

ఇచ్చట అధికౌపమ్యమే అయినప్పటికిని రాజుయొక్క లోకపాలాంశత్వము చేత శిష్టులచేత ఆదరింపబడుటవల్ల గుణత్వమే.

వ్యాఖ్య : ఉపమేయమునకంటె ఉపమాన మున్నతముగా నుండుటయే ఉపమాలంకారమునందు స్వాభావికము. అయినప్పటికిని, ఉపమానోపమేయముల

కున్న అంతరము మరింత విడ్డూరముగా నుండి సహృదయుల సమ్మతికి దూర మైన ప్పుడు మాత్రమే దోషమగును.

ప్రకృతోదాహరణమునందు ఒకరాజు చంద్రసూర్యాదులతో పోల్చబడెను. రాజు మానవుడు. చంద్రసూర్యాదులు దివ్యలక్షణలక్షితులు. ఇట్లగుటచేత ఉపమేయ మగు 'రాజు' నికృష్టముగను, ఉపమానములగు చంద్రసూర్యాదులు ఉన్నతముగను కాన వచ్చును, కాబట్టి అధికోపమమన్న దోషమున్న దనిపించును. 'నావిష్ణుః పృథివీపతిః' మున్నగు సూక్తములనుబట్టి 'విష్ణువు కానివాడు రాజు కాడు' అనియు, రాజు సర్వ లోకపాలకుల అంశములను కలిగియుండు ననియు పెద్దల నిశ్చయము. ఇందువల్ల రాజునకు నికృష్టత్వము తొలగిపోవుచున్నది. అధికౌపమ్యదోషముకూడ తొలగిపోవు చున్నది. సహృదయసమ్మతిచేతనే యిచ్చటి దోషము పరిహృతమై గుణ మగు చున్నది.

మొదటి మూడు పాదములును దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినవి.

[అసదృశోపమ గుణము]

148. ఉపమానస్య వైషమ్యాద్భవే దసదృశోపమమ్
తస్యాభ్యనుజ్ఞా మిచ్ఛంతి వ్యతిరేకోపమాదిషు.

యథా –

'ప్రహితః ప్రధనాయ మాధవానహమాకారయితుంమహీభుజా
న పరేషు మహౌజస శ్ఛలాదపకుర్వంతి మలిమ్లుచా ఇవ. 192.

అస్యాసదృశోపమత్వేఽపి వ్యతిరేకోపపాదకత్వాద్ గుణత్వమ్.

**అర్థము** : ఉపమానముయొక్క వైషమ్యమువల్ల అసదృశోపమ మగును. ఇది దోషము. వ్యతిరేకోపమాదులందు దానిని పండితు లంగీకరింతురు. ఇది లక్ష ణము. నేను మహీపాలునిచేత మాధవులను (యాదవులను) యుద్ధమున కాహ్వ వించుటకై పంపబడితిని. ప్రతాపశాలులు దొంగలవలె మోసమువల్ల శత్రువుల కెగ్గు చేయరు. ఇది ఉదాహరణము.

ఇచ్చట అసదృశోపమత్వమే అయినప్పటికి వ్యతిరేకోపపాదకత్వమువల్ల గుణత్వమే.

వ్యాఖ్య : ఉపమేయమునకు విరుద్ధమైన యుపమానమువల్ల అసదృశోపమ మన్న దోషము కలుగును. వక్త విరుద్ధత్వమునే ఉద్దేశించినప్పుడు అది దోషము కాదు. అది అలంకారమే యగును.

ప్రకృతోదాహరణమునందు ఉపమేయము ప్రతాపశాలులు; ఉపమానము మలిమ్లుచులు. ప్రతాపశాలులు యుద్ధరంగమునందు నిలిచి శత్రువుల నెదుర్కొని జయము చేకొందురు. మలిమ్లుచు లనగా దొంగలు. పరాక్రమహీనులు. వీరు చాటుగా వచ్చి కపటులై ధనము దోచుకొందురు. కావున ఉపమానోపమేయములు పరస్పర విరుద్ధములు, ధర్మమునందు సదృశత్వము కాక విరుద్ధత్వ మున్నది. సదృశత్వము లేకపోవుటచేత అసదృశోపమ మన్న దోష మైనప్పటికిని, విరుద్ధత్వముచేత వ్యతిరేకోపమ మన్న యలంకార మగును. ఇది గుణమే కాని దోషము కాదు.

ప్రకృతోదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధము నందలిది.

### [అప్రసిద్ధోపమ గుణము]

149. యస్యోపమానం లోకేషు న ప్రసిద్ధం తదిష్యతే
అప్రసిద్ధోపమం నామ తత్ క్వచిన్నైవ దుష్యతి.

యథా —

'ఉద్గర్భహూణ రమణీ రమణోపమర్ద
భుగ్నోన్నత స్తన నివేశనిభం హిమాంశోః
బింబం కఠోరబిసకాండ కడారగౌరై
ర్విష్ణోః పదం ప్రథమ మగ్రకరై ర్వ్యనక్తి' 193.

అస్యాప్రసిద్ధోపమత్వేన దూషణత్వేఽపి ద్వయోరపి శృంగారోద్దీపకత్వసామ్యాద్గుణత్వమ్.

అర్థము : లోకమునందు ప్రసిద్ధము కాని యుపమానము నుపయోగించిన యెడల అప్రసిద్ధోపమ మగును. అది దోషము. అదియు కొన్నియెడల దోషత్వము నొందదు. ఇది లక్షణము, రమణోపమర్దనమువల్ల భుగ్నోన్నతమైన ఉద్గర్భహూణ

రమణీ స్తనమండలమువలె చంద్రమండలము కఠోరబిసకాండ గోరోచనగౌరములైన కాంతులతో విష్ణుపదమును వెల్లడించుచున్నది. ఇది ఉదాహరణము.

అప్రసిద్ధోపమత్వముచేత దూషణత్వము కలుగుచున్నప్పటికిని, రెండింటికిని శృంగారోద్దీపకత్వమునందు సామ్య ముండుటవల్ల గుణత్వమే.

వ్యాఖ్య : లోకమునందు ప్రసిద్ధమైన యుపమానమును వాడుటచే ఉపమే యముయొక్క విశిష్టత వెనువెంటనే వ్యక్త మగును. కవికల్పితమైన యుపమానము నందు కృత్రిమత్వము చోటు చేసికొనును. అందువలన సామ్యము తొందరగా సాక్షా త్కరింపదు. కావుననే, యిటువంటిదానిని, అప్రసిద్ధోపమ మన్న దోషముగా పరిగ ణించుట జరిగినది.

ప్రకృతోదాహరణమునందు గర్భవతియైన హూణయువతి యున్నత స్తనము ప్రియుని కౌగిలింతచేత ఒత్తుకొనబడి ఉన్నతిని కోల్పోయి పరుచుకొన్నది. ఇట్లున్న స్తనము ఉపమానమై చంద్రుడు ఉపమేయమగుట యిచ్చట కలదు. ఈ యుప మానము కవికల్పితమే కాని లోకమున సహజలభ్యము కాదు; ప్రసిద్ధమును కాదు. (నిజమున కిది అప్రసిద్ధమైన యుపమానము సంగతి యట్లుండగా, ప్రతీప మన్న అలంకార మగును.) కావుననే,అప్రసిద్ధమైన యుపమానమును కలిగి యుండుటవల్ల దోషజుష్టమైనది. కాని చంద్రోదయవర్ణనము మన్మథోద్దీపకమైనట్లే, రమణీయరమణీ పరిష్వంగకథనవర్ణనము కూడ మన్మథోద్దీపకమే. మన్మథోద్దీపకత్వ మన్న ధర్మము యొక్క సామ్యమువల్ల ఏవంవిధ స్తనమండల చంద్రమండలములకు ఉపమానోప మేయత్వము సహృదయులకు సౌందర్యసంధాయకమై సమ్మతమే యగును. కావుననే, అప్రసిద్ధోపమ గుణత్వమున కిది ఉదాహరణ మైనది.

ఉదాహరణశ్లోకము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తినుండి గ్రహింప బడినది.

[ నిరలంకార గుణము ]

150. నిరలంకార మిత్యాహు రలంకారోజ్ఝితం వచః
అర్థౌర్జిత్యేషు తస్యాపి క్వచిన్నిర్దోషతా మతా.

యథా -

'యాచ్ఞాం దైన్యపరాభవప్రణయినీం నేక్ష్వాకవః శిక్షితాః
సేవాసంపలితః కదా రఘుకులే మౌళౌ నిబద్ధోఽంజలిః
సర్వం తద్విహితం తథాప్యుదధినా నైవోపరోధః కృతః
పాణిః సంప్రతి మే హఠాత్ కిమపరం స్ప్రష్టుం ధను
ర్వాంఛతి'. 194.

అత్ర నిరలంకారత్వేఽపి అర్థౌర్జిత్యాద్గుణత్వమ్.

**అర్థము** : అలంకారవిరహితమైన వచనమును నిరలంకార మని యందురు. దానికికూడ అర్థౌర్జిత్యముగల సన్నివేశములందు కొన్నియెడల నిర్దోషత్వము సమ్మతము. ఇది లక్షణము. ఇక్ష్వాకువంశజులు దైన్యపరాభవప్రియమైన యాచనము నందు శిక్షితులు కారు. రఘువంశమునందు సేవాభావముతో శిరసున నంజలి కూర్ప బడిన దెప్పుడు? అయినప్పటికిని, అది యంతయు నిప్పుడు చేయబడినది. కాని సముద్రుడు దానికి అవరోధము తెలుపలేదు. ఇంక నాచేయి హఠాత్తుగా ధనువును స్పృశింపగోరుచున్నది. ఇది ఉదాహరణము.

ఇచ్చట నిరలంకార్వమే అయినప్పటికి అర్థౌర్జిత్యమువల్ల గుణత్వము.

**వ్యాఖ్య** : అర్థాలంకారసమన్వితము కాని వచనము నిరలంకారము. ఇది దోషము. కవిత్వమునందు అలంకారమున కున్న ప్రాధాన్యము నీదోషము నిరూపించు చున్నది.

ప్రకృతోదాహరణమునందు అర్థాలంకారముగా పేర్కొనదగిన దేదియు స్పష్టముగా లేదు. అందువలన ఇచ్చట నిరలంకార మన్న దోష మున్న దనవలెను. అయినప్పటికిని, ఇచ్చట భంగ్యంతరకథనము లేకపోలేదు. 'రఘువంశజులు యాచించుట కాని, దోసిలి యొగ్గుట కాని చేయరు. అయినను నేను చేసితిని. సముద్రు డడ్డు కొన లేదు.' అన్న భావము భంగ్యంతరము నాశ్రయించినది. అనగా చెప్పెడి రీతిలో కొంత వక్రత యున్నది. 'సముద్రు డడ్డుకొనలేదు'. అని యనుట 'తన కోరికను మన్నించి తన కనుకూలముగా ప్రవర్తింపలే' దనియనుటయే. కావున అర్థమునందలి యౌర్జితత్వముచేత, కథనమునందలి వక్రతచేత, ఇది దోషమును తొలగించుకొని గుణమే యగుచున్నది.

[అశ్లీల గుణము]

151. అసభ్యార్థం య దశ్లీలం తదర్థాంతరవాచి వా
తస్యేహ దృశ్యతే భూమ్నా ప్రయోగో నాపి దుష్యతి.
యథా –
'అద్యాపి తత్కనకకుండలఘృష్టగండ
మాస్యం స్మరామి విపరీతరతాభియోగే
ఆందోలన శ్రమజల స్ఫుటఘర్మబిందు
ముక్తాఫలప్రకరవిచ్ఛురితం ప్రియాయాః' 195.

అత్రాశ్లీలార్థేఽపి కవిభి రవిగీతత్వాద్గుణత్వమ్.

అర్థము : అసభ్యమైన యర్థము కాని, అసభ్యమైక యర్థాంతరము కాని యున్నయెడల అశ్లీల మన్న దోష మగును. దానికిని పెక్కు ప్రయోగములు కలవు. అక్కడ దోషత్వము లేదు. ఇది లక్షణము. పురుషాయితమునందలి పట్టుదలచేత, సరభసత్వముచేత కలిగిన స్ఫుటమైన శ్రమఘర్మబిందువు లనెడి ముత్యాలవల్ల శోభించుచు, స్వర్ణకుండలము లొరసికొను గండ భాగము గల ప్రియురాలి ముఖమును నేడుకూడ తలచుచున్నాను, ఇది ఉదాహరణము.

ఇచ్చట అశ్లీలార్థమే అయినప్పటికినికవులచేత స్తుతింపబడుటవల్ల గుణత్వము కలుగుచున్నది.

వ్యాఖ్య : ప్రకృతోదాహరణమునందు విపరీతరతి వర్ణితము. ఇది అసభ్యార్థము. గండాది పదములు అసభ్యార్థాంతరములు, అయినప్పటికిని కవులు కాని శాస్త్రజ్ఞులు కాని రతి వర్ణనవిషయమును హేయముగా కాని, అసభ్యముగా కాని భావింపలేదు. రతిని. విపరీతరతిని శృంగారోద్దీపనముఖ్యసాధనముగా సంభావించి వర్ణించిరి. కావున, కవిసహృదయసమ్మతివల్ల ఇది గుణత్వము నొందుచున్నది.

ఉదాహరణశ్లోకము బిల్హణుని చౌరపంచాశిక యందలిది.

152. దేశోఽద్రి వనరాష్ట్రాదిః కాలో రాత్రిందివ ర్తవః
నృత్యగీతప్రభృతయః కలాః కామార్థ సంశ్రయాః.

153. చరాచరాణాం భూతానాం ప్రవృత్తి ర్లోకసంజ్ఞితా
హేతువిద్యాత్మకో న్యాయః ససృృతిః శ్రుతి రాగమః.

అర్థము : కొండలు, అడవులు, రాజ్యము మొదలయినవి దేశము. రాత్రి, పగలు, ఋతువులు మున్నగునవి కాలము. కామార్థసంశ్రయములైన నృత్యము, గీతము మొదలయినవి కళలు. స్థావరజంగమముల ప్రవృత్తియే లోకము. హేతు విద్యతో కూడినది న్యాయము. శ్రుతి స్మృతులతో కూడినది ఆగమము.

154. తేషు తేష్వయథారూఢం యది కించిత్ప్రవర్తతే
కవేః ప్రమాదా ద్దేశాదివిరో ధీత్యేత దుచ్యతే.

155. విరోధః సకలోఽప్యేష కదాచిత్కవికౌశలాత్
ఉత్క్రమ్య దోషగణనాం గుణవీథిం విగాహతే.

అర్థము : కవియొక్క అజాగరూకతవల్ల ఆ యా వానియందు యథా స్థితికి భిన్నముగా నేదైన నున్నయెడల దేశవిరోధి మున్నగువిధముగా దోషముగా పేర్కొనబడును. కవియొక్క కౌశలమువల్ల ఒక్కొక్కప్పుడు సర్వవిరోధమును దోషగణనము నతిక్రమించి గుణముగానే పరిగణనము నొందును.

[దేశవిరుద్ధ గుణము]

తత్ర దేశవిరుద్ధస్య గుణీభావో యథా —

'తస్య రాజ్ఞః ప్రభావేణ తదుద్యానాని జజ్ఞిరే
ఆర్ద్రాంశుకప్రవాలానా మాస్పదం సురశాఖినామ్.' 197

అత్ర దేశవిరుద్ధత్వేఽపి తస్య రాజ్ఞః ప్రభావేణేతి కారణోప న్యాసాద్గుణత్వమ్.

అర్థము : దేశవిరోధి దోషము గుణ మగుట కుదాహరణము. ఆ రాజు ప్రభావముచేత ఆ యుద్యానవనములు ఆర్ద్రములైన వస్త్రములనే చిగురాకులుగా కలిగిన కల్పతరువుల కాస్పదముగా నయ్యెను.

ఇచ్చట దేశవిరుద్ధత్వ మున్నప్పటికిని, 'ఆ రాజు యొక్క ప్రభావముచేత' నని కారణము చెప్పుట జరుగుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : కల్పవృక్షములు నందనవనమున దేవలోకమునందు మాత్రమే యుండును. అవి భూలోక మందున్నట్లు చెప్పుట దేశవిరుద్ధము. అయినప్పటికిని రాజుయొక్క గొప్పదనమును చెప్పుటకై యిట్లు చెప్పుట జరిగినది. రాజుయొక్క మహావిభూతిమత్త్వము నిది స్పష్టీకరించుచున్నది. ఉదాత్తాలంకారముగా పరిణమించినది. చమత్కారసంవర్ధక మగుచుండుటచే దీనికి దోషత్వము తొలగిపోయి గుణత్వము కలుగుచున్నది.

ఉదాహరణము దండి కావ్యాదర్శము నందలిది.

[కాలవిరుద్ధ గుణము]

కాలవిరుద్ధస్య యథా —

'రాజ్ఞాం వినాశపిశున శ్చచార ఖరమారుతః
చుంబన్ కదంబకుసుమైః సహ సప్తచ్ఛదోద్గమాన్.' 197.

అత్ర కాలవిరుద్ధత్వేఽపి రాజ్ఞాం వినాశపిశున ఇత్యనిష్టసూచకోత్పాతరూపత్వాద్గుణత్వమ్.

అర్థము : కాలవిరోధిదోషము గుణ మగుట కుదాహరణము. రాజులకు వినాశసూచకమైన తీవ్రమారుతము కడిమిపూలతోపాటు సప్తపర్ణిపుష్పములను ముద్దు పెట్టుకొనుచు వీచెను.

ఇచ్చట కాలవిరుద్ధత్వ మున్నప్పటికిని 'రాజులకు వినాశసూచకమైన' అని అరిష్టసూచకోత్పాతమును తెలుపుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : రాజులు సాధారణముగా శరత్కాలమందు దండయాత్రలకు బయలుదేరుదురు. సప్తపర్ణి శరత్కాలమునందే పూచును. కాని కడిమిచెట్టు వర్షాకాలమునందు పూచును. వర్షాకాలమునందలి కదంబమును, శరత్కాలమునందలి సప్తపర్ణియు ఒకే కాలమునందు పూచినట్లు చెప్పుట కాలవిరుద్ధము. అయినప్పటికిని

శత్రురాజులకు హానిని సూచించు శకునముగా తీవ్రమారుతము వీచుట యిచ్చటి విషయము. అనగా అరిష్టమును సూచించెడి అపశకునమును వర్ణించుట యుద్దిష్టము. 'అకాలే ఫలపుష్పాణి దేశోపద్రవ కారణమ్' అని యనుటచేత కాలము కాని కాలమున కడిమి పూచినట్లు చెప్పుట అరిష్టసూచనమునకు బలము చేకూర్చుచున్నది. కావున, ఇది దోషము కాకపోవుటయే కాక వర్ణ్యమైన రాజమహిమాతిశయమును వ్యక్తము చేయుచుండుటచేత గుణమే యగుచున్నది. 'రాజ్ఞామ్' అని బహువచనము వాడి కవి తన కౌశలముచేత అరిష్టము శత్రురాజులకే యనియు, వర్ణ్యమానుడైన రాజు దండయాత్రకు బయలుదేరినంతటిలోనే శత్రుపరాభవసూచనలు గోచరించె ననియు ధ్వనింపజేయుచున్నాడు.

ఉదాహరణము దండి కావ్యాదర్శము నందలిది.

## [లోకవిరుద్ధ గుణము]

లోకవిరుద్ధస్య యథా —

'ఐందవాదర్చిషః కామీ శిశిరః హవ్యవాహనమ్
అబలావిరహక్లేశవిహ్వలో గణయత్యయమ్' 198.

అత్ర లోకవిరుద్ధత్వేఽపి కామిభిస్తథా సంవేద్యమానత్వాద్ గుణత్వమ్.

అర్థము : లోకవిరోధి దోషము గుణ మగుట కుదాహరణము. అబలా వియోగదుఃఖముచేత కలత నొందిన యీ కాముకుడు చంద్రసంబంధమైన అగ్ని కంటె హవ్యవాహనము (అగ్ని) చల్లగా నుండునని తలచుచున్నాడు.

ఇచ్చట లోకవిరుద్ధత్వ మున్నప్పటికిని కాముకులచేత ఆ విధముగా తలపబడుచుండుటవల్ల గుణత్వము.

వ్యాఖ్య : చంద్రుని వెన్నెల చల్లదనమును, హాయిని గలిగించును. ఇది లోకసామాన్యమున కున్న యనుభవము. చంద్రునియందు తాపము కాని, అగ్ని కాని యుండదు. కాని విరహముచేత దహ్యమాను డగుచున్న కాముకుడు చంద

మామను నిప్పులకుప్పగను, వెన్నెలను అగ్ని సముద్రముగను తలపోయును. ఇది లోకవిరుద్ధమే యైనను కాముకులకు స్వాభావికము. ఇట్లు చెప్పుటచేత చంద్రకిరణముల శృంగారోద్దీపనసామర్థ్యము వ్యక్త మగుచున్నది. కావున, లోకవిరోధిదోషము తొలగిపోయి గుణమునకే పరిగణన కలుగుచున్నది.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [యుక్తివిరుద్ధ గుణము]

యుక్తివిరుద్ధస్య యథా –

'స సంకోచ శ్చంద్రాదివ కుముదరాశే రశరణః
స సూర్యాత్ కోకానాం విరహ ఇవ లుప్తప్రతివిధిః
గుణేభ్య స్తే ఖేదప్రశమన కరేభ్యోఽపి యదయం
ఖలానా ముద్వేగ స్తదిద మమృతాదేవ మరణమ్. 199.

అత్ర యుక్తివిరుద్ధత్వేఽపి ఛేకోక్త్యా సంభావ్యమానోపమయా తథా ప్రతీతే ర్గుణత్వమ్.

అర్థము : యుక్తివిరోధి దోషము గుణ మగుట కుదాహరణము. చంద్రునివల్లనే కలువల సముదాయమునకు సంకోచమువలె రక్షణహీనము, సూర్యునివల్లనే చక్రవాకములకు విరహమువలె ప్రతీకారహీనమునై దుఃఖమును తొలగించు గుణములవల్లనే దుర్మార్గుల కుద్వేగము కలుగుట యన్నది అమృతమువల్లనే మరణము కలుగుట.

ఇచ్చట యుక్తివిరుద్ధత్వ మున్నప్పటికిని ఛేకోక్తిచేత, సంభావ్యమానమైన యుపమచేత ఆ విధమైన ప్రతీతివల్ల గుణత్వము.

వ్యాఖ్య : చంద్రునివల్ల కలువలు వికసించును. పగటిపూట చక్రవాకములు జంటకట్టి యుండును. గుణములచేత దుఃఖములు తొలగును; అమృతమువల్ల మరణము తొలగును. కాని ప్రకృతోదాహరణమునందు ఇవి యన్నియు విపరీతముగా విన్యస్తము లైనవి. కావున, యుక్తివిరోధము అన్న దోష మున్న దనవచ్చును. కాని దీనిని పలికినవారు ఛేకులు, అనగా మాటలాడుటయందు నిపుణత్వము కల

వారు. అట్టివారు అసంగతముగా మాటవాడుదు రనుట సంగతము కాదు. కావున పైకి కన్పించెడి అసమంజసత్వముకంటె అంతర్భూత మైయున్న సమంజసత్వమును గుర్తించుట ఆవశ్యకము. గుణవంతు డైనవాడు కష్టములు పొందరాదు; సుఖములు పొందవలయును. కాని దుర్మార్గులు గుణవంతుల గుణమైన సాధుత్వమునే లోకువగా గ్రహించి బాధించుట జరుగుచున్నది. సౌఖ్యకరములు కావలసిన గుణములే తద్విరుద్ధము లగుచున్నవి. చంద్రుడు కలువలను ముకుళింపజేయుట, సూర్యుడు చక్రవాకములను విడదీయుట, అమృతము మరణమును కలిగించుట – యిట్టి విరుద్ధధర్మమునే సూచించుచున్నవి. కావున విరుద్ధధర్మమునుబట్టి వీని కన్నింటికిని పోలిక సిద్ధించుచున్నది. ఈ విరుద్ధతవల్లనే ధర్మైక్యము లభించి నిదర్శనాలంకారము నిరూపిత మగుచున్నది. కావున, ప్రకృతోదాహరణము యుక్తివిరోధి దోషమును తొలగించుకొని గుణత్వము నొందుచున్నది.

## [ఔచిత్యవిరుద్ధ గుణము]

ఔచిత్యవిరుద్ధస్య యథా –

'శ్లే నాథనాథ దురుదాహరణాతపేన
సౌమ్యాపి నామ పరుషత్వ మభిప్రపన్నా
జజ్వాల తీక్ష్ణవిశదాః సహసోద్గిరంతీ
వాగర్చిష స్తపన కాంత శిలేవ సీతా.' 200.

అత్ర స్త్రీత్వా దౌచిత్య విరోధేఽపి తత్సమయోచితత్వాద్ గుణత్వమ్.

**అర్థము** : ఔచిత్యవిరోధి దోషము గుణ మగుట కుదాహరణము. ఓ ప్రభూ! సౌమ్యురాలయినప్పటికిని సీత దురుదాహరణాతపముచేత పరుషత్వమును పొందినదై తీక్ష్ణములును స్పష్టములునైన వాగగ్నుల నొక్కమాటుగా వెళ్ళగక్కుచు సూర్యకాంతశిలవలె జ్వలించెను.

ఇచ్చట స్త్రీత్వమువల్ల ఔచిత్య విరోధమే అయినప్పటికిని తత్సమయోచితత్వమువల్ల గుణత్వము.

వ్యాఖ్య : సౌమ్యురాలగు స్త్రీ పరుషత్వమును పొందుటయు, పరుషభాషణము చేయుటయు ఔచిత్య విరుద్ధము. అయినప్పటికిని, సీత యొక్క ఆత్మగౌరవము నీఘట్టము వ్యక్తము చేయుచున్నది. ఎదుటివారు పల్కు నిందా వాక్యములను సహించి యూరకుండుట సౌమ్యత్వ మనిపించుకొనదు. దైనందిన ప్రవర్తన మందు సౌకుమార్యమును కలిగియుండుట సౌమ్యత్వమే. అవసరమైనప్పుడు, అవమానమెదురైనప్పుడు ఆగ్రహమును చూపుటయు అగ్ని కురిపించుటయు అభిమానవంతుల లక్షణము. ఇట్టియెడల స్త్రీలుకూడ పరుషత్వము నాశ్రయింపకతప్పదు. పాత్రౌచిత్యమునుబట్టి దోషమున్నట్లు కన్పట్టినను, సమయౌచిత్యమునుబట్టి ఆతీవ్రత సమర్థనీయమేకాక సౌందర్య సంవర్ధకము కూడ నగుచున్నది.

[వచనవిరుద్ధ గుణము]

వచన విరుద్ధస్య యథా -

'పరదారాభిలాషో మే కథ మార్యస్య యుజ్యతే
పిబామి తరలం తస్యాః కదా ను రదనచ్ఛదమ్'. 201.

అత్ర వచన విరోధేఽపి వక్తు స్తథావిధావస్థత్వాద్గుణత్వమ్.

అర్థము : వచన(ఉక్తి)విరోధి దోషము గుణమగుట కుదాహరణము. ఆర్యుడనైన నాకు పరదారాభిలాష యోగ్యము కాదు; తరళ మగు నామె యధరము నెప్పు డాస్వాదింతునో కదా!

ఇచ్చట వచనవిరోధ మున్నప్పటికిని వక్తయొక్క ఆ విధమైన స్థితివల్ల గుణత్వము.

వ్యాఖ్య : పూర్వార్ధమునకును, ఉత్తరార్ధమునకును వైరుధ్యము స్పష్టముగా గోచరించుచున్నది. తనకు పరదారాభిలాష యోగ్యము కాదని సద్ధర్మమును వ్యక్తము చేసిన వ్యక్తి తరువాతి ప్రసంగమును కూడ తదనురూపముగానే చేయవలయును. ఇచ్చట తద్విరుద్ధముగా చేయుట జరిగినది. ఉక్తిసామంజస్యము చెడినది. కావుననే వచనవిరుద్ధ మన్న దోషమైనది. అయినప్పటికిని వక్త ప్రేమోన్మత్తు డగుట చేత స్థిరత్వమును కోల్పోయెను. అట్టివాడు అసంగతముగా మాటలాడుటయే ఔచిత్యము.

అది యాతని అవస్థ నావిష్కరించును. ప్రకృతోదాహరణమునందు వచనమున పూర్వాపరవిరోధ మున్నప్పటికిని అవస్థౌచిత్యమునుబట్టి గుణమే యున్న దనుట సమంజసము.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

## [ధర్మవిరుద్ధ గుణము]

ధర్మవిరోధస్య యథా —

'పంచానాం పాండుపుత్రాణాం పత్నీ పాంచాలకన్యకా
సతీనా మగ్రణీ స్త్వాసీద్దైవో హి విధి రీదృశః' 202.

అత్ర ధర్మవిరోధేఽపి దైవో విధిరిత్యనేనాభిహితత్వాద్గుణత్వమ్.

అర్థము : ధర్మవిరోధి దోషము గుణ మగుట కుదాహరణము. పాండుపుత్రుల కైదుగురికిని పత్నియైన పాంచాలకన్యక (ద్రౌపది) పతివ్రతలలో అగ్రగణ్యురాలు. దేవుడే యిటువంటివానికి విధాయకుడు.

ఇచ్చట ధర్మవిరోధ మున్నప్పటికిని 'దేవుడే విధాయకు' డని చెప్పుటవల్ల అదోషము.

వ్యాఖ్య : ఒకే భర్తయందు నిశ్చలబుద్ధి కలది పతివ్రత. ద్రౌపది పంచభర్తృక. ఆమెను పతివ్రత యనుటకే వీలు లేదు. కాని పతివ్రతలలో ఆమె అగ్రగణ్యురా లని ప్రకృతము ప్రతిపన్నమైనది. ఇది ధర్మవిరుద్ధము. అయినప్పటికిని 'దేవుడే విధాయకు' డని చెప్పుటచేత ఆమెకు ఐదుగురు భర్తలను చేకూర్చినవాడును పతివ్రతలలో ఉత్తమస్థానమును కల్పించినవాడును దేవుడే యగుచున్నాడు. అనగా వరపుత్రిక యగుటవల్ల ద్రౌపది యుత్తమపతివ్రతాత్వమును శంకించవలసిన పని లేదు. వరప్రసాదముగానే ఐదుగురు భర్తలను పొందినట్లు ఆగమమే సాక్ష్య మిచ్చుచున్నది. కావున దైవనిర్ణయమే యిచ్చట బలీయము. కావుననే ధర్మవిరోధిదోషము తొలగిపోయి విశిష్టధర్మమునకు దైవనిర్ణయమువలన విలువ పెరిగినది.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శములోనిది.

[అర్థశాస్త్రవిరుద్ధ గుణము]

అర్థ శాస్త్ర విరుద్ధస్య యథా –

'నీతి రాపది యద్గమ్యః పర స్తన్ మానినో హ్రియే
విధుర్విధుంతుదస్యేవ పూర్ణ స్తస్యోత్సవాయ సః' 203.

అత్రాపన్నః శత్రురభియాతవ్య ఇతి నీతిః, తచ్చ మానినో హ్రియే భవతీతి విరుద్ధమపి ఉద్ధతపురుషభాషితత్వా న్న దుష్యతీతి గుణత్వమ్.

అర్థము : అర్థశాస్త్ర విరోధిదోషము గుణమగుట కుదాహరణము. ఆపద యం దున్న శత్రువును ముట్టడింపవలయు నని రాజనీతి. కాని అది మానవంతునికి సిగ్గు కలిగించును. చంద్రుడు పూర్ణుడై యుండుటయే రాహువున కుత్సవమును కలిగించును.

ఇచ్చట 'ఆపన్నుడైన శత్రువు ముట్టడింప దగినవాడు' అన్నది నీతి. అది అభిమానవంతునకు లజ్జాస్పద మని యనుట విరుద్ధమే అయినప్పటికిని ఉద్ధతపురుష భాషిత మగుటవల్ల దోషత్వము నొందక గుణత్వమునే పొందును.

వ్యాఖ్య : శత్రు వాపదలో నున్నప్పుడు, అసహాయుడై యున్నప్పుడు, అనవధానుడై యున్నప్పుడు సులభముగా లొంగిపోవును. కావున అర్థశాస్త్రము 'ఆపన్నుడైన శత్రు డభియాతవ్యుడు' అని ఒక ఆపద్ధర్మమును తెల్పినది. కాని, దీనివలన పౌరుషవంతుని పౌరుషము వెల్లడి కాదు. పైగా విజయము పొందినవానికి పౌరుషహీను డన్న అప్రతిష్ఠకూడ కలుగును. శత్రువుకూడ సమృద్ధుడై యుండి, సర్వసన్నద్ధుడై యుండి తనతోడి యుద్ధమున నోడిపోయినప్పుడు అది వీరునికి అత్యంత గౌరవకారణము కాగలదు. ప్రకృతపద్యము రాజనీతివిరుద్ధమే అయినప్పటికిని వక్త పౌరుషమహత్త్వమును వ్యక్తీకరించుచున్నది. కాబట్టి యిది గుణమే కాని దోషము కాదు.

ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధము నందలిది.

[కామశాస్త్ర విరుద్ధ గుణము]

కామశాస్త్ర విరుద్ధస్య యథా –

'దోలాతి ప్రేరణత్రస్త వధూజన ముఖోద్గతమ్

కామినాం లయవైషమ్యాద్గేయం రాగ మవర్ధయత్. 204.

అత్ర త్రాసతో లయవైషమ్యేణ గేయస్య ♦ రాగహేతుత్వే ఽపి కామినీముఖోద్గీర్ణత్వాద్రాగవివర్ధనత్వేన గుణత్వమ్.

అర్థము : కామశాస్త్ర విరోధిదోషముగుణ మగుట కుదాహరణము. ఊయెల నుద్ధృతముగా నూపుటవల్ల భీతి నొందిన యువతులనోటినుండి వెలువడు గేయము లయవైషమ్యమువల్ల కాముకులకు రాగమును వృద్ధి పొందించెను.

ఇచ్చట భయపడుచున్న స్త్రీజనముయొక్క గేయమునకు రాగవిరుద్ధత్వమే యైనప్పటికిని కామినీముఖోద్గీర్ణత్వమువల్ల రాగవృద్ధిని కలిగించును. అందువల్ల గుణత్వము.

వ్యాఖ్య : ఉయ్యాల యూగుచు భయము నొందుచున్న యువతులు లయ బద్ధముగా పాడలేరు. లయ భగ్నమైనపుడు రాగముకూడ భగ్నమై పోవును. ఇది సంగీతకళా విషయము, నృత్యగీతాదికళలను కామార్థసంశ్రయము లని పేర్కొని యుండుటచేత పరిణామరూపముగా ఇది కామశాస్త్రవిషయ మగుచున్నది. ప్రకృత శ్లోకమునందు లయ భగ్నమైనప్పటికిని రాగము భగ్నము కాలేదని, వృద్ధి చెందినదని యనుట కామశాస్త్రవిరుద్ధము. కాముకు లుయ్యాల లూపుచుండగా కామిను లూగు చుండిరి. వారిని భయపెట్టుటలోనే కాముకులకు వినోదము కలదు. ఉద్ధృతి పెరిగిన కొలది కామినులకు భయము పెరుగును; కాముకులకు వినోదము పెరుగును. ఇచ్చటి వినోదము అనురాగాతిశయమునకు దోహదము చేయును. సంగీతశాస్త్రసంబంధియైన రాగము భగ్న మైనప్పటికిని, స్త్రీపురుషుల పరస్పరాకర్షణ రూపమైన యనురాగము లయలేని పాటవల్ల సైతము వృద్ధి పొందవచ్చును. రాగ శబ్దమునకు రెండర్థములను చెప్పుకొనుటవల్ల దోషము పరిహృత మగుచున్నది.

♦ విరుద్ధత్వేఽపి – అని యుండుట తగును.

శృంగారమున కుద్దీపనమును కలిగించు నీ సన్నివేశము గుణవంతమై, సహృదయ రంజక మగుచున్నది.

ఉదాహరణశ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

[అలంకార ప్రసంగము]

156. ఇత్థం గుణాశ్చ దోషాశ్చ కావ్యే దోషగుణాశ్చ యే
ఆఖ్యాతా స్తే స్ఫుటం సంప్రత్యలంకారాన్ ప్రచక్ష్మహే.

అర్థము : ఈ విధముగా కావ్యమునందలి గుణములును, దోషములును, దోషగుణములును స్పష్టముగా చెప్పబడినవి.ఇప్పుడింక అలంకారములను చెప్పుదుము.

157. యువతేరివ రూప మంగ కావ్యం
స్వదతే శుద్ధగుణం తదప్యతీవ
విహితప్రణయం నిరంతరాభిః
సదలంకార వికల్ప కల్పనాభిః

అర్థము : ఆహా! కావ్యము యువతియొక్క రూపమువలె, శుద్ధగుణమై యుండియు (గుణములు మాత్రమే కలిగియుండియు) ఆస్వాదింపబడును. అయిన ప్పటికిని మిక్కిలిగా నిరంతరమైన విశేషాలంకారముల కల్పనలయందు ప్రీతిని కలిగియుండును.

వ్యాఖ్య. ఇంతవరకును గుణదోషాది వివేచన చేసిన రచయిత యిప్పుడింక అలంకారములనుగూర్చి చెప్పుదు ననెను. 'కావ్యమునకు గుణములు చాలవా? అలంకారము లేల?' అని యెవరైన ప్రశ్నింపవచ్చును. అందుచేత తరువాతి పరిచ్ఛేదములో చెప్పబోయెడి అలంకారములకు పూర్వపీఠిక నిచ్చుటనే ముచ్చటించుచున్నాడు. కావ్యమును కాంతాసమ్మితముగా భావించుట ఆలంకారికుల పరిపాటి. కాంతకు గుణము లే విధముగా ఆంతరంగిక ధర్మములో కావ్యమునకు గుణము లా విధముగా ఆంతరంగికధర్మములే. శుద్ధగుణము గల కాంత ప్రశస్తిని గాంచునట్లే గుణవంతమైన

కావ్యముకూడ ప్రశస్తిని గాంచును. అయినప్పటికి బహిస్సౌందర్యపోషకములైన భూషణములపైని స్త్రీజనమునకు విపరీతమైన ప్రీతి కలదు కదా! అట్లే కావ్యముల కును అలంకారములపై అత్యధికమైన ప్రీతి కలదు. ఇది స్వాభావికమే.

128. యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యో
వపురివ యౌవనబంధ మంగనాయాః
అపి జనదయితాని దుర్భగత్వం
నియత మలంకరణాని సంశ్రయంతే.

అర్థము : కాంతయొక్క యౌవనబంధము గల శరీరము గుణములనుండి పతనము నొంది దుర్భగత్వము నొందినప్పటికిని జనప్రియములయిన భూషణము లాశ్రయించియే యుండును. అట్లే వాక్కు గుణములనుండి చ్యుతమై దుర్భగత్వము నొందినప్పటికిని జనప్రియము లయిన అలంకారము లాశ్రయించియే యుండును.

వ్యాఖ్య : గుణములు ముఖ్యములే యైనను, వానిని విడిచి కూడ వాక్యము లుండవచ్చును. అట్టియెడల ఆవాక్యము లాస్వాద్యమానములు కాకపోవచ్చును. అయినప్పటికిని అలంకారములచే భూషితము లైనయెడల ఆ వాక్యములు జనప్రియ ములై యొప్పును. కావున, కవులు అలంకారనివేశనమునందు తీసికొనవలసిన శ్రద్ధనుగూర్చి భోజదేవుడు ఈ రూపముగా జ్ఞాపనము చేయుచున్నాడు.

159. దీర్ఘాపాంగం నయనయుగలం భూషయత్యంజనశ్రీ
స్తుంగాభోగౌ ప్రభవతి కుచావర్చితుం హారయష్టిః
మధ్యే క్షామే వపుషి లభతే *స్థానకూర్పాసలక్ష్మీః
శ్రోణీబింబే గురుణి రశనాదామ శోభాం బిభర్తి.

అర్థము : అంజనశోభ విశాలకటాక్షములను గల నయనయుగళము నలం కరించినది. ఉన్నతములు గుండ్రములు నైన కుచములను నర్చించుటకు కంఠహారము

* స్థాయి – అనియుండుట తగును.

సమర్థమైయున్నది. శరీరమునందు కృశించిన మధ్యభాగము (నడుము) నందు అవిశ యందము (కూర్పాసశ్రీ) స్థాయిని పొందినది. పెద్దదయిన శ్రోణీబింబమునందు మొలనూలు శోభను వింపుచున్నది.

వ్యాఖ్య : కాంతాశరీరమునందలి వేర్వేరంగములు వేర్వేరు భూషణముల చేత అలంకరింపబడి శోభించును. అట్లే కావ్యశరీరముకూడ వేర్వేరు అలంకారములచే భూషితమై శోభించును. ఈ యభిప్రాయమును సూచించెడి యుద్దేశముతో ప్రకృత శ్లోకమును రచయిత యిచ్చట నుపయోగించుకొనుచున్నాడు.

ఇతి శ్రీమహారాజాధిరాజ భోజదేవేన విరచితే

సరస్వతీ కంఠాభరణనామ్ని అలంకారశాస్త్రే

గుణవివేచనో నామ

ప్రథమః పరిచ్ఛేదః



# సరస్వతీ కంఠాభరణము

## ద్వితీయ పరిచ్ఛేదము

### శబ్దాలంకార వివేచన

1. శబ్దార్థోభయసంజ్ఞాభి రలంకారాన్ కవీశ్వరాః
బాహ్యా నాభ్యన్తరాన్ బాహ్యాభ్యన్తరాంశ్చానుశాసతి.

అర్థము : కవీశ్వరులు బాహ్యములు, అభ్యంతరములు, బాహ్యాభ్యంతరములు నైనవానిని శబ్దాలంకారములని, అర్థాలంకారములని, ఉభయాలంకారములని అనుశాసించుచున్నారు.

2. యే వ్యుత్పత్త్యాదినా శబ్ద మలంకర్తుమిహ క్షమాః
శబ్దాలంకారసంజ్ఞాస్తే జ్ఞేయా జాత్యాదయో బుధైః

అర్థము : వ్యుత్పత్తి మున్నగువానిచేత శబ్దము నలంకరించుటకు సమర్థములగు జాతిమున్నగువానిని శబ్దాలంకారములుగా బుధులు గ్రహింపవలయును.

వ్యాఖ్య : బాహ్యములయిన అలంకారములు శబ్దాలంకారములు. వీనిచేత అలంకరింపబడునది శబ్దము. శబ్దమునకు సౌందర్యమును సమకూర్చుటయే వీని ప్రయోజనము. వ్యుత్పత్తి మున్నగునవి అందులకు సాధనములు. వ్యుత్పత్తి అనగా విశిష్టమైన యుత్పత్తి అని యర్థము. మున్నగునవి యని యనుటచేత హ్రస్వదీర్ఘాది సన్నివేశములను, గద్య పద్యాదిభేదములను – ఇంక నిటువంటి వానిని గ్రహింపవగును. బహిరంగమైన రూపమునకు సౌందర్యమును కల్పించునవి శబ్దాలంకారములని సారాంశము. వీనిని పండితులు గ్రహింపవలయును. కావ్యలక్షణమునందే 'అలంకారై రలంకృతమ్' అని నిక్షిప్తమై యున్నది. కావున అలంకారయోజనము అవశ్యధర్మమని, కవులును పండితులును వానిని గ్రహించుట ఆవశ్యకమని గ్రంథకర్త యభిప్రాయము.

3. జాతి ర్గతీ రీతి వృత్తిచ్ఛాయా ముద్రోక్తి యుక్తయః
భణితి ర్గుంఫనా శయ్యా పఠితి ర్యమకాని చ.

4. శ్లేషానుప్రాసచిత్రాణి వాకోవాక్యం ప్రహేలికా
గూఢప్రశ్నోత్తరాధ్యేయ శ్రవ్య ప్రేక్ష్యాభినీతయః

5. చతుర్వింశతి రిత్యుక్తాః శబ్దాలంకారజాతయః
అథాసాం లక్షణం సమ్యక్సోదాహరణ ముచ్యతే.

అర్థము : 1. జాతి 2. గతి 3. రీతి 4. వృత్తి 5. ఛాయ 6. ముద్ర 7. ఉక్తి 8. యుక్తి 9. భణితి 10. గుంఫన 11. శయ్య 12. పఠితి 13. యమకము 14. శ్లేషము 15. అనుప్రాసము 16. చిత్రము 17. వాకోవాక్యము 18. ప్రహేలిక 19. గూఢము 20. ప్రశ్నోత్తరము 21. అధ్యేయము 22. శ్రవ్యము 23. ప్రేక్ష్యము 24. అభినీతి – ఈ యిర్వదినాల్గును శబ్దాలంకారభేదములు. ఇంక వీనికి సరియైన లక్షణములును, ఉదాహరణములును చెప్పబడును.

## జాత్యలంకారము

6. తత్ర సంస్కృత మిత్యాదిర్భారతీ జాతి రిష్యతే
సా త్వౌచిత్యాదిభి ర్వాచా మలంకారాయ జాయతే.

అర్థము : అందు సంస్కృతభాషమున్నగునది జాతి యనిపించుకొనును. అది ఔచిత్యము మొదలయినవి కారణముగా వాక్కులకు అలంకారము (శబ్దాలంకారము) గా నగును.

వ్యాఖ్య : ఒకచోట సంస్కృతమును వాడవలయునా ? సంస్కృతేతరమును వాడవలయునా ? మిశ్రమును వాడవలయునా ? ఇటువంటి ప్రశ్న లుత్పన్నము లైనప్పుడు ఔచిత్యము మాత్రమే కవికి మార్గనిర్దేశకము కాగలదు. అట్లు ఔచిత్య సంపన్నమైనప్పుడే వాక్యము శోభించును. అప్పుడు మాత్రమే తద్భాషారచనమును శబ్దాలంకారముగా పరిగణించుట జరుగును. ఈ యౌచిత్యము అనేక విషయముల నాశ్రయించికొని యుండును. వానిని భోజదేవుడే కొంత సూచించుచున్నాడు.

7. సంస్కృతేనైవ కేఽప్యాహుః ప్రాకృతేనైవ కేచన
సాధారణ్యాదిభిః కేచిత్ కేచిన మ్లేచ్ఛభాషయా.

అర్థము: కొందరు సంస్కృతముతోనే మాటలాడుదురు; కొందరు ప్రాకృతముతోనే మాటలాడుదురు. కొందరు సాధారణి (మిశ్రభాష) మున్నగువానితో మాటలాడుదురు. కొందరు మ్లేచ్ఛభాషతో మాటలాడుదురు.

8. న మ్లేచ్ఛితవ్యం యజ్ఞాదౌ స్త్రీషు నాప్రాకృతం వదేత్
సంకీర్ణం నాభిజాతేషు నాప్రబుద్ధేషు సంస్కృతమ్.

అర్థము : యజ్ఞాదులందు మ్లేచ్ఛభాషను వాడరాదు. స్త్రీలయందు ప్రాకృతేతరమును పలుకరాదు. ఆభిజాత్యము గలవారియందు సంకీర్ణభాషను వాడరాదు. ప్రబుద్ధులు (విద్యావంతులు) కానివారియందు సంస్కృతమును పలుకరాదు.

వ్యాఖ్య : భాషణమని యన్నప్పుడు వక్తయు, శ్రోతయు, వక్తవ్యమగు విషయము నుండవలయును. ఇది సాధారణ నియమము. సమయము, స్థానము మొదలైనవి కూడ కొన్ని యెడల పరిగణనకు వచ్చును. ప్రకృతశ్లోకమున సమయౌచిత్యముపాత్రౌచిత్యము అనునవి తెలుపబడినవి. యజ్ఞసమయమునందు మ్లేచ్ఛభాషను వాడరాదు. ఇది సమయౌచిత్యము. తక్కినమూడును పాత్రౌచిత్యమును తెలుపుచున్నవి. యజ్ఞాదులందు మ్లేచ్ఛభాషను కవి కాని, కవి నిబద్ధపాత్రలు కాని వాడరాదు. అట్లే స్త్రీలు భాషించునపుడు ప్రాకృతమును మాత్రమే ప్రయోగించినట్లు కవి రచింపవలయును. ప్రాకృతేతరమును వారిచేత పలికింపరాదు. అట్లే ఉన్నత వంశీయులు మాటలాడుట సంకీర్ణభాషలో జరుగరాదు. విద్యావిహీనులు సంస్కృతమును మాటలాడుచున్నట్లు రచించినయెడల, అది అనౌచిత్యమగును. కావున, కవి తాను వాడవలసినభాషను పాత్రౌచిత్యము, సమయౌచిత్యము మున్నగువానినిబట్టి నిర్ణయించుకొనవలయును. ఇదేవిషయమును పురస్కరించుకొని కవి తరువాతి శ్లోకమున ఆయాభాషలకు ఆయాపాత్రలను స్పష్టముగా నిర్ణయించుచున్నాడు.

9. దేవాద్యాః సంస్కృతంప్రాహుః ప్రాకృతం కిన్నరాదయః
పైశాచాద్యం పిశాచాద్యా మాగధం హీనజాతయః.

అర్థము దేవప్రభృతులు సంస్కృతమును, కిన్నరాదులు ప్రాకృతమును, పిశాచప్రభృతులు పైశాచి మున్నగు భాషలను హీనజాతులకు చెందినవారు మాగధీభాషను పలుకుదురు.

10. సంస్కృతేనైవ కోఽప్యర్థః ప్రాకృతేనైవ వాపరః
శక్యో రచయితుం కశ్చిదపభ్రంశేన జాయతే.

11. పైశాచ్యా శౌరసేన్యాన్యో మాగధ్యాన్యో నిబధ్యతే
ద్విత్రాభిః కోఽపి భాషాభిః సర్వాభి రపి కశ్చన.

అర్థము : ఒకవిషయము సంస్కృతముననే వ్రాయుటకు వీలుగానుండును. మరొక విషయము ప్రాకృతముననే, యింకొకటి అపభ్రంశముననే వీలుగానుండును. పైశాచీ భాషలో నొకటి, శౌరసేనిలో మరొకటి, మాగధిలో నింకొకటి నిబంధింప బడును. రెండు మూడు భాషలలో వ్రాయుటకు ఒక విషయము వీలుగా నుండును. అన్నిభాషలలోను వ్రాయుటకు మరొక విషయము వీలుగా నుండును.

వ్యాఖ్య : విషయౌచిత్యమునుబట్టి ప్రయోగింపవలసిన భాషారూపము నిందు తెలుపుచున్నాడు. కొన్ని విషయములు కొన్నిభాషలయందు మాత్రమే ఔచిత్యసంపన్నములై సంశోభించును. అప్పుడుమాత్రమే తద్భాషారచనము వాగలంకారమై జాతియను భేదముగా పరిగణితమగును.

12. నాత్యన్తం సంస్కృతేనైవ నాత్యన్తం దేశభాషయా
కథాం గోష్ఠీషు కథయంల్లోకే బహుమతో భవేత్.

అర్థము : గోష్ఠులయందు పూర్తిగా సంస్కృతములోగాని, పూర్తిగా దేశభాషలోగాని కథను చెప్పక లోకమునందు కథకుడు సమ్మానితుడగును.

వ్యాఖ్య : కథాసందర్భమున పాత్రౌచిత్యమునుబట్టియు, విషయౌచిత్యమును బట్టియు, సమయౌచిత్యమునుబట్టియు కథకుడు భాషను మార్చుకొనవలయును. అట్లయినప్పుడు అది శ్రోతలను మిక్కిలిగా ఆకర్షించుకొనును. అట్టి కథకుడే సమ్మానితుడు కాగలడు.

13. శృణ్వన్తి లటభం లాటాః ప్రాకృతం సంస్కృతద్విషః
అపభ్రంశేన తుష్యన్తి స్వేన నాన్యేన గుర్జరాః.

అర్థము : సంస్కృతశత్రువులయిన లాటదేశీయులు మనోజ్ఞమైన ప్రాకృతమునే వినుదురు. గుర్జరదేశీయులు స్వీయమైన అపభ్రంశముచేతనే తుష్టినొందుదురు. అన్యభాషచేత తుష్టి నొందరు.

వ్యాఖ్య : ఇది దేశౌచిత్యమునకు సంబంధించినది. నన్నయభట్టారకుడు ఆంధ్రశబ్దచింతామణియందు "స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యన్తే వైకృతకావ్యని చాన్య దపహాయ" అని వచించెను. రసప్రలోభముకల సజ్జనులు స్వస్థాన వేషభాషలందు అభిమానము కలవారై అన్యము నుజ్జగించి వైకృత కావ్యములనే అభిమానింతురని యర్థము. భోజదేవుడుకూడ ఆ స్వస్థానవేషభాషాభిమానమును గూర్చియే యిచ్చట ప్రసంగించుచున్నాడు. స్థానిక భాషాభిమానముచేత ఒక్కొక్కదేశమువారు ఒక్కొక్కభాషనే అభిమానింతురు. ఇది సహజలక్షణము.

14. బ్రహ్మన్ విజ్ఞాపయామి త్వాం [1]స్వాధికారజిహాసయా

గౌడ స్త్యజతు వా గాథా మన్యో వాస్తు సరస్వతీ.

అర్థము : ఓబ్రహ్మ! నా పదవిని వదలవలెనన్న కోరికతో మనవిచేసికొనుచున్నాను. గౌడదేశీయుడు గాథనైన విడుచునుగాక! లేదా మరొకతెయైన సరస్వతి యగును గాక !

వ్యాఖ్య : ఈ శ్లోకము గౌడదేశీయులను ప్రాకృతభాషావిషయమున పరిహసించుచున్నది. గౌడదేశీయులు సహజముగా సంస్కృతప్రియులు; సంస్కృతపఠనమునందు సౌష్ఠవము కలవారు. అట్టివారు ప్రాకృతమందలి గాథలను పఠించుటయు, రచించుటయు మొదలుపెట్టినచో కృత్రిమత్వముచేత, అవి అశ్రావ్యములుగా పరిణమించును.

కల్పనాచతురుడైన కవి సరస్వతియే బ్రహ్మకు విజ్ఞప్తిచేయుచున్నట్లు ఈశ్లోకమును సంతరించెను. తా నధికారములో నుండగా తన యిష్టమునకు నియమమునకు తగినట్లుగా సాహిత్యముండవలయును. అది యింకొకరకముగానున్నయెడల తాను పదవిని వదలుకొనవలయును; తానే పదవిలో నుండవలయునన్న ఆ సాహిత్యమున్యైన విధముగా మారవలయును. ఈ విషయమును సరస్వతి బ్రహ్మకు విన్నవించినట్లు కల్పితమైనది.

ఈ శ్లోకము రాజశేఖరుని కావ్యమీమాంసనుండి గ్రహింపబడినది.

---

1. స్వాధికారాజ్జిహాసయా – పాఠాంతరము

15. కేఽభూవన్నాఢ్యరాజస్య రాజ్యే ప్రాకృతభాషిణః
కాలే శ్రీసాహసాంకస్య కే న సంస్కృతవాదినః.

అర్థము : ఆఢ్యరాజు అను ప్రసిద్ధిగల శాలివాహనుని రాజ్యమునందు ప్రాకృతభాషులు కానివారెవరు ? సాహసాంకుడు అను ప్రసిద్ధిగల విక్రమార్కుని కాలమునందు సంస్కృతభాషులు కానివారెవరు ?

వ్యాఖ్య : ఇది సమయౌచిత్యమునకు సంబంధించినది. రాజానుమతమే ధర్మము. ప్రాకృతభాష శాలివాహనున కిష్టమైనది. ప్రభునిష్టము ననుసరించి, తద్రాజ్యమునందలి ప్రజలుకూడ ప్రాకృతాభిమానులైన ప్రాకృతభాషు లయిరి. ఆకాలమున ప్రాకృతమునకు రాజసభాగౌరవము లభించినది. తదపేక్షకలవారు తదభిజ్ఞులు కాక తప్పదు. అట్లైయెరి. విక్రమార్కుడు సంస్కృతభాషాప్రియుడు. రాజానుమతమును బట్టి ప్రజలును సంస్కృతభాషులుగానే పరిణమించిరి. ఒక్కొక్క కాలమునందు ఒక్కొక్కభాషకు ఆదరమును వ్యాప్తియు లభింపవచ్చును.

16. గిరః శ్రవ్యా దివ్యాః ప్రకృతిమధురాః ప్రాకృతధురాః
సుభవ్యోఽపభ్రంశః సరసరచనం భూతవచనమ్
విదగ్ధానా మిష్టే మగధమథురావాసి భణితి
ర్నిబద్ధా యస్తేషాం స ఇహ కవిరాజో విజయతే.

అర్థము : దివ్యవాక్కులు శ్రవ్యములు; ప్రాకృతవాక్కులు ప్రకృతి మధురములు; అపభ్రంశము సుభవ్యము; భూతవాక్కులు సరసరచనములు; మగధమథురావాసుల వాక్కులు విదగ్ధుల కిష్టములు – ఇట్టి సర్వభాషలందును రచనము చేయగల సమర్థుడగు కవిరాజు వర్ధిల్లును.

వ్యాఖ్య : దివ్యవాక్కులు అని యనగా సంస్కృతభాషయని భావము. భూతవాక్కులు అని అనగా పైశాచికమనియు, మగధమథురావాసుల వాక్కులు అని యనగా శౌరసేని యనియు భావము. ఏదో యొకభాష నాశ్రయించి వ్రాయువానికంటె భావానుగుణముగా, వస్త్వనుగుణముగా, పాత్రానుగుణముగా వేర్వేరు భాషలలో వ్రాయుకవి ప్రశంసార్హుడు. 'సంస్కృతేనైవ కోఽప్యర్థః' మొదలయిన విధముగా చెప్పిన (10, 11) శ్లోకముల నిచ్చట అనుసంధించు కొనవలయును.

ఇట్లు బహుభాషలలో ప్రౌఢియగల శబ్దసంపద గలవాడే కవిరాజు కాగలడు. అట్టి వాడే సమానులలో అధికుడు కాగలడు.

## జా తి భే ద ము లు

17. శుద్ధా సాధారణీ మిశ్రా సంకీర్ణా నాన్యగామినీ
అపభ్రష్టేతి సాచార్యై ర్జాతిః షోఢా నిగద్యతే.

అర్థము : జాతియను శబ్దాలంకారము శుద్ధ, సాధారణి, మిశ్ర, సంకీర్ణ, అనన్యగామిని, అపభ్రష్ట-యని ఆరు విధములుగా ఆచార్యులచే పరిగణింపబడు చున్నది.

## [శుద్ధాజాతి-సంస్కృతము]

తాసూత్తమపాత్ర ప్రయోజ్యా సంస్కృతజాతిః శుద్ధాయథా-
'ఉన్నమితైకభ్రూలత మాసన మస్యాః పదాని రచయన్త్యాః
కంటకితేన ప్రథయతి మయ్యనురాగం కపోలేన' 1

అర్థము : వానియందు ఉత్తమపాత్ర ప్రయోగింపదగిన శుద్ధ సంస్కృత జాతి కుదాహరణము.

పదములను రచించుచున్న యీమెయొక్క ఉన్నమితభ్రూలతమైన యాననము పులకరించిన కపోలముచేత నాయందలి యనురాగమును ప్రకటించుచున్నది.

వ్యాఖ్య : జాతి సంస్కృతము, ప్రాకృతము, అపభ్రంశము మొదలయిన భేదములతో శబ్దాలంకారమై యొప్పును. పై ని చెప్పినట్లు ప్రతిభాషాజాతియు శుద్ధ, సంకీర్ణ మున్నగు విధముగా వేర్వేరు భేదములతో విలసిల్లును.

సంస్కృతమునకు మునిత్రయము నిరూపించిన నియమములు గలవు. అట్లే ప్రాకృతమునకు వాల్మీకి హేమచంద్రాదులు నిరూపించిన నియమములు గలవు. ఆయానియమముల ననుసరించి ఆయాభాషలు ప్రవర్తించును. అప్పుడు వానిని శుద్ధ సంస్కృత జాతి, శుద్ధప్రాకృత జాతి – మున్నగువిధముగా పరిగణింతురు.

ఇతర లక్షణము నాశ్రయించి స్వీయలక్షణ సంపాతము నొందినయెడల సాధారణి యని యందురు. ఇది క్షీర నీర న్యాయముగా నుంతును. రెండు భాషల

నొకచోటనే చేర్చి చెప్పినచో మిశ్రయగును. ఇది నరసింహరూపమువలె నుండును. భిన్నభాషారూపములను కలబోసినయెడల సంకీర్ణయగును. ఇది తిలతండుల న్యాయముగా నుండును. ప్రకృతిభావముతోనే యున్నప్పటికిని, భాషాంతర సంపర్కమున కవకాశము నీయనిచో అది అనన్యగామిని యనిపించుకొనును. సంస్కారచ్యుతమైనది అపభ్రష్ట యనిపించుకొనును.

పై వానిలో సంస్కృతజాతిలో శుద్ధ యనుభేదమునకు లక్ష్యము చూపబడినది. కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలమునుండి గ్రహింపబడినది.

పత్రలేఖన సన్నివేశమునందు పదములను రచించుచు, ఆలోచనాధీనమైన మనస్సుతో కనురెప్పలను కొంచెము పైకెత్తినది శకుంతల. తాను భావించువిషయమునుబట్టి ఆమె కపోలములు పులకరించినవి. ఆమె మనసులో దుష్యంతునిపట్లనున్న యనురాగము కపోలముల పులకరింపుచేత వెల్లడియగుచున్నది. చాటుననుండి దీని నంతటిని గమనించుచున్న దుష్యంతుడు శకుంతలకు తనయందు అనురాగము కలదన్న విషయమును దీనినిబట్టి ధ్రువీకరించుకొనుచున్నాడు.

సంస్కారవంతులు సంస్కారవంతమైన భాషనే ఉపయోగింతురు. అదియే యుచితము. ఇచ్చట ఉత్తమనాయకుడైన దుష్యంతునికై ప్రయోగింపబడిన భాష సంస్కృతము. నియమబద్ధమగుటచే శుద్ధ. కావుననే శుద్ధసంస్కృతజాతియను శబ్దాలంకారమునకు లక్ష్యమైనది.

[ ప్రా కృ తి క ]

మధ్యమపాత్రప్రయోజ్యా ప్రాకృతజాతిః శుద్ధా యథా-

'తుజ్ఝ ణ ఆణే హిఅఅం మమ ఉణ మఅణో అఆ అరత్తిం
ణిక్కివ తవేఇ వలిఅం తుహ జుత్తమనోరహాఇ అంగాఇ, 2

[ఛాయా -
'తవ న జానే హృదయం మమ పునర్మదనో దివా చ రాత్రించ
నిష్కృప తపతి బలవత్త్వయి యుక్తమనోరథాన్యంగాని']

అర్థము : మధ్యమపాత్ర ప్రయోగింపదగిన శుద్ధప్రాకృతజాతి కుదాహరణము.

నీ హృదయమును నే నెరుగను. నాహృదయము నీయందు గాఢమైయున్నది. ఓయి దయారహితుడా! నీయందు యుక్తమనోరథములయిన నా అంగములను రాత్రిందివములు మదనుడు తపింపజేయుచున్నాడు.

వ్యాఖ్య : రూపకమర్యాద ననుసరించి పురుషపాత్రలు ఉత్తమ మధ్యమాధమ భేదములను కలిగియుండును. స్త్రీ పాత్రలలో ఇట్టి భేదములను పరిగణింపక అన్నింటిని అధమములుగానే యెంచుట పరిపాటి కావుననే స్త్రీపాత్రలకు ప్రాకృతము నుపయోగించుట జరుగును. కొన్నియెడల పరివ్రాజిక, కుట్టిని మున్నగువారు సంస్కృతమునుగూడ నుపయోగింతురు.

భోజదేవుడు ప్రకృతసందర్భమున శకుంతలను మధ్యమపాత్రగా పరిగణించుచున్నాడు. అయినప్పటికిని ప్రాకృతమునే ప్రయోగించుచున్నాడు. ఈయన యభిప్రాయమునుబట్టి స్త్రీపాత్రలను యోగ్యతనుబట్టి మధ్యమములుగా కాని, అధమములుగా కాని పరిగణింపనగునని తేలుచున్నది. మధ్యమపాత్రలు ప్రాకృతమును వాడగా, అధమపాత్రలు మాగధికను వాడుదురు. ఈయన పాత్రలను ఆరువిధములుగా, మరింత సూక్ష్మముగా విభాగించుటచేత ఈ మార్పు కానవచ్చును.

ఉదాహరణ పద్యము కాళిదాసు రచించిన అభిజ్ఞానశాకుంతలమునందలిది. శకుంతల రచించిన ప్రేమలేఖయది. శకుంతల మధ్యమపాత్ర. కావుననే ప్రాకృతము నాశ్రయించినది. ఇది శుద్ధప్రాకృతజాతి యను శబ్దాలంకారమున కుదాహరణము.

[ మా గ ధి క ]

హీనపాత్రప్రయోజ్యా మాగధికా యథా -

'శద మాణశమంశభాలకే కుంభశశహశ్శ వశాహి శంచిదే
అణిశంచ పిఆమి శోణిదే వలిశశదం శమలే హువీఅది'    3

[ఛాయా -
'శతం మానుషమాంసభారకాః
కుంభసహస్రం వసాభిః సంచితమ్
అనిశం చ పిబామి శోణితం
వర్ష శతం సమరో భవిష్యతి']

అర్థము : హీనపాత్ర ప్రయోగింపదగు శుద్ధమాగధికాజాతి కుదాహరణము. మనుష్య మాంసముతో నిండినవి నూరుకుండలు, వసతోనిండినవి వేయికుండలు సంచితములైనవి. రక్తమును ప్రతిదినమును పానముచేయుదును. నూరేండ్లు సమరము కొనసాగును.

వ్యాఖ్య : ఉదాహరణ పద్యము భట్టనారాయణుని వేణీసంహారమునందలిది. అర్జున సైంధవుల యుద్ధసందర్భమున జరిగిన రక్తపాతమునకు సంతోషించుచు రాక్షసి యనుచున్న మాటలివి. రాక్షసి యగుటచేత నీచపాత్ర. ఇచ్చట ఉపయోగింపబడినది మాగధికాప్రాకృతము. ఇతర సాంకర్యము లేకపోవుటచేత శుద్ధ. కావుననే ఇది శుద్ధమాగధికాజాతి యను శబ్దాలంకారమున కుదాహరణ మైనది.

మాగధియందు 'షసోః శః' యని యనుటచే 'మానుష' 'మాణశ' యనియు 'మాంస' 'మంశ' యనియు 'సహస్ర' 'శహశ్శ' యనియు 'వసాభిః' 'వశాహి' యనియు 'సంచితమ్' 'శంచిదే' యనియు 'వర్ష' 'వలిశ' యనియు 'సమరః' 'శమలే' యనియు నయ్యెను. 'అత ఏత్ సౌ పుంసి మాగధ్యామ్' అని యనుటచే ప్రథమైక వచనమునందు 'ఏ' యను ప్రత్యయము చేరును. 'భారకః' యనుటకు 'భాలకే' యని 'సంచితమ్' అనుటకు 'శంచిదే' యని 'శోణితమ్' అనుటకు 'శోణిదే' యని 'సమరః' అనుటకు 'శమలే' యని యగుట దీనికి నిదర్శనము.

[ పైశాచి ]

నాత్యుత్తమపాత్రప్రయోజ్యా పైశాచీ శుద్ధా యథా-

'పనమత పనలపకుప్పితగోలీ చలనగ్గలగ్గపడిబింబమ్
దససు నఖదప్పనేసు ఏఆదసతనుధలం లుద్దమ్'

[ఛాయా -

'ప్రణమత ప్రణయప్రకుపిత గౌరీచరణాగ్ర లగ్నప్రతిబింబమ్
దశసు నఖదర్పణేష్వేకాదశ తనుధరం రుద్రమ్']

అర్థము : అనత్యుత్తమపాత్ర ప్రయోగింపదగిన శుద్ధపైశాచీజాతి కుదాహరణము.

ప్రణయ కుపితయైన గౌరీదేవియొక్క చరణాగ్రములందలి ప్రతిబింబముల రూపమున నఖదర్పణములందు పది మూర్తులును, ఎట్టఎదుట నొక మూర్తియునై యున్న ఏకాదశతనుధరుడైన రుద్రునకు ప్రణమిల్లుడు.

వ్యాఖ్య : ఉత్తమపాత్రకంటె తక్కువయై, మధ్యమపాత్రకంటె నున్నతమైన పాత్ర అనత్యుత్తమ పాత్ర.

ఏకాదశ రుద్రులనుట ప్రసిద్ధము. కవి తత్ప్రసిద్ధిని పురస్కరించుకొని ఉత్ప్రేక్షించుట ఉదాహరణ పద్యమునందు మధురముగా గోచరించును. ప్రణయ కుపితయైన గౌరీ పాదములపై ఈశ్వరుడు క్షమాయాచకుడై మోకరిల్లెను. అప్పుడు పాదనఖములందు ప్రతిఫలించిన పదిరూపులును, నిజముగా మోకరిల్లిన ఈశ్వరు రూపమును కలిసి పదునొకండు రూపులయినవి. రుద్రుడు సమగ్రరూపధారణచేసి ప్రణయకుపితయైన పార్వతిని శాంతింపజేయుచున్నాడని కవి సంభావనము.

ఉదాహరణ పద్యము పైశాచీప్రాకృతములో నిబద్ధమైనది. పైశాచియందు 'ణో నః' యనుటచేత 'ప్రణమత'కు 'పనమత' యని 'ప్రణయ'కు 'పనయ' యని 'చరణ'కు 'చలన' అని 'దర్పణేషు'కు 'దప్పనేసు' అని రూపములు కలిగినవి. 'శషోః సః' అని యనుటచే 'దశసు' రూపము 'దససు' అని 'దర్పణేషు' రూపము 'దప్పనేసు' అని 'ఏకాదశ' రూపము 'ఏఆలస' అని యయ్యెను.

[ శౌ ర సే ని ]

నాతిమధ్యమపాత్ర ప్రయోజ్యా శౌరసేనీ శుద్ధా యథా-

'తం సి మఏ చూఅంకుర దిణ్ణో కామస్స గహిదధణువాస్స
జువఇమణ మోహణసహో పంచబ్భహిఓ సరో హోహి' 5

[ఛాయా-
'త్వమసి మయా చూతాంకుర దత్తః కామస్య గృహీతధనుషః
యువతి మనో మోహన సహః పంచాభ్యధికః శరో భవ']

అర్థము : అనతి మధ్యమపాత్ర ప్రయోగింపదగిన శుద్ధ శౌరసేనీజాతి కుదాహరణము.

ఓ చూతాంకురమా! ధనుస్సును గ్రహించియున్న కామునకు నిన్ను దానము చేసితిని. యువతి మనోమోహన సామర్థ్యమును కలిగి, ఐదు శరములలో నాధిక్యమును పొందియుండుము.

వ్యాఖ్య : నీచపాత్రకంటె నున్నతము మధ్యమపాత్రకంటె నిమ్నము నైనది అనతి మధ్యమపాత్ర. ఉదాహృతపద్యము రాజాంతఃపుర పరిచారికచేత పలుకబడినది. స్త్రీని అధమపాత్రగానే పరిగణించుట నాట్యసంప్రదాయము. అవాంతరభేదములనుగూడ కల్పించి భోజదేవుడు అనతిమధ్యమపాత్రగా పరిగణించెను. ఇట్టి పాత్రలకు శౌరసేని యుచితము.

ఇది కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలమునందలిది. యుష్మచ్ఛబ్దమునకు తం, తుమం, తుం – అను రూపములు ప్రథమావిభక్తియందగును. 'తంసి' అనునది 'త్వమసి' నుండి యేర్పడినది. 'జా చ మఇ మఏ' అను సూత్రము చొప్పున 'మయా' యనునది 'మఏ' యైనది. 'క్తేన దిణ్ణాదయః' అను సూత్రము చొప్పున 'దత్తః' అనుటకు 'దిణ్ణో' అని యైనది. 'భువో హోహువో' అను సూత్రము చొప్పున 'భవ' అనుటకు 'హోహి' యైనది. 'గ్రహేర్ఘేప్పః' అనుటచే 'గృహీత' అనుటకు 'గహిద' యైనది. 'ఆదే ర్యో జః' అనుటచే 'యువతి' శబ్దము 'జువఇ' యైనది. 'నో ణః సర్వత్ర' యనుటచే 'ధనుషః' 'ధణుహస్స' యని 'మనోమోహన' 'మణమోహన' యని యైనవి.

[ఇంతవరకు చెప్పుకొన్నవన్నియు మాహారాష్ట్రి ప్రాకృతలక్షణములు. ఇదియే ప్రాకృతమనుపేర ప్రసిద్ధివహించినది. శౌరసేనీ ప్రాకృతలక్షణములు ప్రత్యేకముగా ఇందులేవు. భోజదేవుడు దీనిని శౌరసేని కుదాహరణముగా గుర్తించుట చింత్యము.]

[ అ ప భ్రం శ ]

నాతిహీనపాత్ర ప్రయోజ్యోఽపభ్రంశః శుద్ధో యథా–

'లఇ వప్పుల పిఅ దుద్ధం కత్తో అమ్హాణహాం ఛాసి
పుత్త హామమత్తే హాత్తో జఇ దహి జమ్మేవి జఅ ఆసి' 6

[ఛాయా –

'గృహాణాణుకంపాం పిబ దుగ్ధం కుతోఽస్మాకం తక్రమ్
పుత్రకమస్తకే హస్తో యది దధి జన్మన్యపి జాతమాసీత్']
ప్రాయికం చైతత్, తేన కవే రభిప్రాయ శక్త్యాదిభ్యః సర్వా
అపి సర్వప్రయోజ్యా భవన్తి. తా ఇమాః శుద్ధాః షడేవ.

అర్థము : అనతిహీనపాత్ర ప్రయోగింపదగిన శుద్ధాపభ్రంశ జాతి కుదాహరణము.

వత్సా! దయచేసి పాలుత్రాగు. మనకు మజ్జిగయెక్కడిది? జన్మమంతటిలోను పెరుగున్నయెడల కొడుకు నెత్తిని చేయి పెట్టినట్లే.

ఇది ప్రాయికము. దానిచేత కవియొక్క అభిప్రాయములకొరకు శక్త్యావిష్కరణము కొరకు అన్నియు నందరకును ప్రయోగింపదగియే యుండును. శుద్ధములైన విభాగములు జాతి యను శబ్దాలంకారమున కీ యారు మాత్రమే.

వ్యాఖ్య : అధమపాత్రకంటెకూడ కించిదల్పమైనది అనతిహీనపాత్ర. ఇచ్చటి స్త్రీ పరిచారికావృత్తిలో నున్నది యజమాని బిడ్డకు పాలు పట్టుటకు ప్రయత్నించుచున్నది. ఆ కుఱ్ఱవాడు అవి పాలు కావని, మజ్జిగయని, త్రాగనని అడ్డుచెప్పుచున్నాడు. అందువలన వానిని నమ్మించుటకై తమయింటియందు పెరుగు లేనే లేదనియు, మజ్జిగయుండుట కవకాశమే లేదనియు తెల్పి తన కొడుకుపై ఒట్టు వేసికొనుచున్నది. చిన్నచిన్న విషయములకు సైతము ఒట్టువేసికొనుట అల్పత్వ లక్షణము. పరిచారిక మాటలును, ప్రవృత్తియు హీనత్వమునకు సూచకములై యున్నవి. అనతిహీన మని యనగా అంతకంటె హీనము లేనిదనియే, అత్యంత హీనమనియే భావము.

ఉదాహరణము అపభ్రంశభాషాపద్యము. లఇ, ఛాస మొదలయిన రూపములు మాహారాష్ట్రి మున్నగు ప్రాకృతములందు కానరావు. ఇవి అపభ్రంశభాషా రూపములు. పిఅ, దుద్ధం, కత్తో, జఇ, దహి- మొదలయినవి ప్రాకృత సామాన్య రూపములు. అపభ్రంశమునందుకూడ అవి యట్లే యుండవచ్చును. 'అమ్హాణహాం' అన్నది అస్మచ్ఛబ్దముయొక్క షష్ఠీబహువచనరూపము. 'స్మ' అనునది 'మ్హ' అని మారుటయు, చివర 'హాం'చేరుటయు అపభ్రంశ భాషాలక్షణములు. ఇట్లే 'పుత్రక' రూపము ప్రథమాద్వితీయైకవచనము 'పుత్తహా' అని యుండుట అపభ్రంశము

నందు మాత్రమే జరుగును. 'అపభ్రంశే అకారస్య స్యమోః పరయోరుకారో భవతి' అనునది దీని కాకరము. ప్రకృత పద్యమునందు ప్రాతిపదికకే ఉకారము చేరినది.

మొత్తముమీద ఇంతవరకు చెప్పుకొన్న ఆరు విభాగములును శుద్ధములై జాతి యను శబ్దాలంకారమునకు ఆశ్రయములై యొప్పును.

వృత్తియందు భోజదేవుడు 'ప్రాయికం చైతత్' అని చెప్పిన విషయము గమనార్హము. రూపకాదులందు పాత్రౌచిత్యమునుబట్టి భిన్నభాషా ప్రయోగమునకు బహుళముగా వీలు లభించును. సర్గబంధము మొదలయిన కావ్యములందు సంస్కృతమునో, ప్రాకృతమునో, యేదోయొక భాషనే యుపయోగించుట గోచరించును. అంతేకాని భిన్నభిన్నభాషలను ప్రయోగించుట గోచరముకాదు. అయినను కవిశక్తినిబట్టి జాతి యన్న శబ్దాలంకారము నుపయోగించుటవల్ల వాచక సౌందర్యము తప్పక సిద్ధించును. ఇంతకును అలంకార యోజనము సౌందర్యాపేక్షతో నొనరించు శిల్పమేకాని అవశ్యము నిర్వహింపవలసిన లక్షణము కాదు. కావుననే భోజదేవుడు దీనిని ప్రాయికమని తెల్పుట జరిగినది.

## [ సాధారణీ జాతి ]

సాధారణ్యాదయః పున రనంతాః తాసు మధ్యమపాత్రభూమికా
స్థోత్తమపాత్ర ప్రయోజ్యా సంస్కృత ప్రాకృతయోః
సాధారణీ యథా -

'సరలే సాసాసరాగం
పరిహార రంభోరు ముంచ సంరంభమ్
విరసం విరహాయాసం
సోఢుం తవ చిత్త మసహం మే' 7

అర్థము : సాధారణి మున్నగునవి మరల ననంతములు. వానియందు మధ్యమపాత్ర భూమికయందున్న ఉత్తమపాత్ర ప్రయోగింపదగిన సంస్కృత ప్రాకృతముల సాధారణీజాతి కుదాహరణము.

సరళా: ఆకస్మికమైన క్రోధమును విడిచిపెట్టుము. రంభోరు: సంరంభమును మానుము. నీయొక్క విరసమయిన విరహాయాసమును సహించుటకు నా చిత్తము సమర్థము కాదు.

వ్యాఖ్య : శుద్ధాజాతి సంస్కృతాది భేదముచేత ఆరువిధములుమాత్రమే యగును. కాని సాధారణీజాతి అనేక భేదములను పొందును. సంస్కృతమునకు ప్రాకృతాది సాధారణ్యముచేత ఐదు, ప్రాకృతమునకు శౌరసేన్యాది సాధారణ్యముచేత నాలుగు, శౌరసేనికి పైశాచ్యాది సాధారణ్యముచేత మూడు, పైశాచికి మాగధ్యాది సాధారణ్యముచేత రెండు, మాగధికి అపభ్రంశ సాధారణ్యముచేత ఒకటి - యిట్లు పెక్కు భేదములు కలుగును. వీని నన్నింటిని గుర్తించుట క్లేశసాధ్యము. కావుననే గ్రంథకర్త దిఙ్మాత్రముగా ప్రదర్శించుట జరుగుచున్నది.

ఉత్తమపాత్ర సంస్కృతమును, మధ్యమపాత్ర ప్రాకృతమును మాటలాడును. మధ్యమపాత్రగా నటించుచున్న ఉత్తమపాత్ర పాత్రౌచిత్యమునుబట్టి ప్రాకృతమును, ఆత్మౌచిత్యమునుబట్టి సంస్కృతమును మాటలాడవలయును. ఇట్టియెడల కవి సంస్కృతమునే వాడినప్పటికిని, ప్రాకృతమునందుకూడ పరివర్తనము పొందని శబ్దములతోనే రచన సాగించినయెడల, అది ఉభయసామాన్యమై సాధారణి యగును. ఇందు రెండు భాషలును క్షీరనీర న్యాయమున కలిసియే యుండును.

ఉదాహరణమునందు 'సాహసరాగం పరిహర' అని యన్నప్పుడు 'సాహసముతో కూడిన యనురాగమును పరిహరింపుము' అన్న యర్థము సంస్కృతాన్వయముచేత నేర్పడును.'సహసా కృతం ఆకస్మికం రాగం క్రోధం పరిహర' అని ప్రాకృతభాషాన్వయముచేత ఏర్పడెడి యర్థము. ఇచ్చట శబ్దపరివృత్తి యెంత మాత్రమును లేదు. సంస్కృతమునందు 'అనురాగ' మన్న యర్థమే ప్రసిద్ధము. ప్రాకృతమునందు 'క్రోధ' మన్న యర్థమునకే ప్రసిద్ధి యెక్కువ. ఇట్లు రెండు భాషలకు తగినట్లు, ఉభయసాధారణముగా రచనముండుటచేతనే యిది శబ్దాలంకార మగుచున్నది.

నాత్యుత్తమ భూమికాస్థోత్తమపాత్ర ప్రయోజ్యా సంస్కృత
పైశాచ్యోః సాధారణీ యథా -

'చంపక కలికా కోమల
కాంతికలాపాథ దీపితానంగీ
ఇచ్ఛతి గజపతి గమనా
చపలాయతలోచనా లపితుమ్' 8

ఏవం సంస్కృతాపభ్రంశాది సాధారణ్యాః ప్రాకృతాది భాషాంతర సాధారణ్యశ్చ ద్రష్టవ్యాః.

అర్థము : అనత్యుత్తమ భూమికయందున్న ఉత్తమపాత్ర ప్రయోగింపదగిన సంస్కృత పైశాచీభాషల సాధారణికి ఉదాహరణము. సంపంగిమొగ్గవలె కోమల మైన కాంతియే అలంకారముగా నున్నదియు, ఉజ్జ్వలమయిన మన్మథుని గలదియు, గజపతియొక్క గమనమువంటి గమనముగలదియు, చంచలములును విశాలములు నయిన కన్నులు కలదియునైన యీమె పలుకనెంచుచున్నది.

ఇట్లే సంస్కృతాపభ్రంశాది సాధారణీజాతిభేదములును, ప్రాకృతాది భాషాంతర సాధారణీ జాతిభేదములును ద్రష్టవ్యములు.

వ్యాఖ్య : ప్రకృతపద్యము ఉత్తమపాత్ర అనత్యుత్తమపాత్రను ధరించి నప్పుడు పల్కినది. ఉత్తమపాత్రత్వముచేత సంస్కృతము; అనత్యుత్తమత్వము చేత పైశాచికము; ఈ రెండింటికి ననురూపమైయుండుటచేత, ఇది సాధారణి.

సంస్కృతముతో ప్రాకృతము కలిసినట్లే ప్రాకృతముతో పైశాచ్యాదిభాషలు సమీకృతములు కావచ్చును. అప్పుడు సాధారణి, మొదట చెప్పినట్లు, అనేక భేదములను పొందును. గ్రంథవిస్తరభీతిచేత గ్రంథకర్త ఆయాభేదములను గమ నించు పరిశ్రమను పాఠకులకే వదలుచున్నాడు.

[ మిశ్రా జాతి ]

వక్తృవిషయౌచిత్యాది ప్రయోజ్యా మిశ్రా యథా -

'జయతి జనతాభి వాంఛిత
ఫలప్రదః కల్పపాదపో గిరిశః
జఅ ఇఅ తమిల్లఅంతీ
గిరితనయా పణఇకప్పలఆ' 9

ఏవం భాషాంతరాణా మపి మిశ్రీభావో ద్రష్టవ్యః.

అర్థము : వక్తృవిషయౌచిత్యాది ప్రయోజ్యమైన మిశ్రకు ఉదాహరణము. జనులచేత కోరబడిన ఫలముల నిచ్చు కల్పవృక్షమయిన శంకరుడు వర్ధిల్లునుగాక ! ఆయనను అల్లుకొనియున్న ప్రణయకల్పలతయైన పార్వతీదేవియు వర్ధిల్లునుగాక !

ఈ విధముగానే యితరభాషల మిశ్రీభావముకూడ ద్రష్టవ్యము.

వ్యాఖ్య : మిశ్రజాతియందు రెండు భిన్నభాషలు నరసింహరూపమువలె నుండును. ఉదాహరణ శ్లోకమునందు పూర్వార్ధము సంస్కృతము; ఉత్తరార్ధము ప్రాకృతము. ఇట్లు వక్తనుబట్టికాని విషయమునుబట్టికాని భిన్నభాషల నాశ్రయించి పలుకుట జరుగవచ్చును. పూర్వార్ధమునందు ఈశ్వరస్తుతి యున్నది. ఇది పురుషప్రోక్తమై యుండును. కావున సంస్కృతఘటితమై యున్నది. ఉత్తరార్ధమునందు పార్వతీస్తుతి యున్నది. ఇది స్త్రీప్రోక్తమై యుండును. కావున ప్రాకృతఘటితమై యున్నది. ఇట్లు రెండు భాషలును ఒకే శ్లోకమునందు ప్రయుక్తమగుటచేత, ఇది మిశ్ర యగుచున్నది ఉత్తరార్ధమునకు 'జయతి చ తమాలింగంతీ గిరితనయా ప్రణయకల్పలతా' యనునది ఛాయ. ['జయతి చ తమాలీయమానా' అని పూర్వ ముద్రణములు ]

[ సంకీర్ణా జాతి ]

దుర్విదగ్ధాది పాత్రప్రయోజ్యా సంకీర్ణా యథా -

'అకట గుమటీ చంద్రజ్యోత్స్నా కలం కిల కోఇలో
లవఇ అ ముహుర్వ్యామ్యో వాయు ర్నివాలఏ వాఇ అ
అవి సహి అలా రక్తాశోక స్తవాపి మనోముదే
న కజ న కజం మానేనాద్య ప్రియం ప్రతిజాహుదా' 10

సోఽయం సంస్కృత మహారాష్ట్రాపభ్రంశయోః తిలతండులవత్ సంకీర్ణా జాతిః. ఏవం ప్రాకృతాపభ్రంశసంకరోఽపి ద్రష్టవ్యః.

అర్థము : దుర్విదగ్ధాది పాత్రలు ప్రయోగింపదగిన సంకీర్ణజాతికి ఉదాహరణము. చంద్రుని వెన్నెల సాశ్చర్యమనోజ్ఞము. కోకిల అవ్యక్తమనోహరముగా మాటిమాటికి కూయుచున్నది. దక్షిణవాయువు నిర్వంచకమై వీచుచున్నది. ఓ సఖీ! రక్తాశోకముకూడ నీకు మనోమోదము కలిగించుటకై పూచినది. ఈనాడు మానము నూనుట యెంతమాత్రము తగదు. ప్రీతిపురస్సరుల మగుదము.

ఇది సంస్కృతమునకు మహారాష్ట్రాపభ్రంశమునకు తిలతండులములవలె ఏర్పడిన సంకీర్ణాజాతి. ఈ విధముగానే ప్రాకృతాపభ్రంశ సంకరముకూడ ద్రష్టవ్యము.

వ్యాఖ్య : దుర్విదగ్ధు డని యనగా పండితంమన్యుడని యర్థము; తాను పండితుడు కాకపోయినప్పటికిని పండితుడైనట్లు తలచి గర్వించెడివాడని భావము. ప్రకృతోదాహరణమునందు నాయకుడు దుర్విదగ్ధుడు. ప్రణయకుపితయైన ప్రియురాలిని సాంత్వనపరుచుటకై చేయు ప్రసంగము వర్ణితము. సంస్కృతమును, మహారాష్ట్రప్రాకృతమును కలబోసి పలుకుట యిందు కనబడును. నువ్వులును బియ్యమును కలిసి పోయినప్పుడు, అవి కంటికి వేరువేరుగా కనిపించుచునే యుండును; విడదీయుట కష్టసాధ్యము.

అకటం = ఆశ్చర్యము; గుమటీ = మనోజ్ఞము; కోఇలో = కోకిల; లవఇ = కూయుచున్నది. అ = మరియు; నివాఅర = అవరోధము లేకుండ; వాఇ + అ = వీచుచున్నదికూడ; అవి = ఓ; అలా = వికసించినది (వచ్చినది); న కజ నకజం = కర్తవ్యముకాదు కర్తవ్యము కాదు; జాహుదా = పోవుదము.

ప్రాకృతపదములకు అర్థములు చూపబడినవి. మిగిలినవి సంస్కృతపదములు. ఇచ్చట నాగరకత్వము నారోపించుకొని, ఆడంబరమును ప్రదర్శించెడిపాత్ర వక్త యగుటచేతనే సంస్కృత మహారాష్ట్రిభాషలు తిలతండులములవలె కలిసినవి. కావుననే, యిది జాతి యన్న శబ్దాలంకారమునందు 'సంకీర్ణ' అన్న భేదమునకు లక్ష్యమగుచున్నది.

[ అ న న్య గా మి ని ]

క్రీడాగోష్ఠీ వినోదాద్యర్థానన్యగామి న్యసాధారణీ యథా-
'భీష్మ ప్రోక్తాని వాక్యాని విద్వద్వక్త్రేషు శేరతే
గోసే తివించిఅచ్ఛోలీ తల్ల తూహే వివల్లిదా' 11

అత్ర పూర్వార్థపదాని సంస్కృత ఏవ, ఉత్తరార్థపదాని ప్రాకృత ఏవ. సేయ మసాధారణ్యనన్యగామినీ చ జాతిరుచ్యతే. భాషాంతరాణాం పున సాధారణ్యం నాస్తి.

అర్థము : క్రీడాగోష్ఠి వినోదాదులయం దుపయోగపడెడి అనన్యగామిని యైన అసాధారణికి ఉదాహరణము. భీష్మప్రోక్తములయిన వాక్యములు పండితుల వక్త్రములందు శయనించియున్నవి. ప్రభాతకాలమున పద్మముల పుప్పొడి సరోవర జలమునందు వ్యాపించియున్నది.

ఇచ్చట పూర్వార్ధపదములు సంస్కృతమే; ఉత్తరార్ధపదములు ప్రాకృతమే. ఇది అసాధారణియై అనన్యగామిని యన్న జాతి యనబడును. భాషాంతరముల కింక అసాధారణ్యము లేదు.

వ్యాఖ్య : సాహిత్యక్రీడలందును, సారస్వతగోష్ఠులందును, విద్యావినోదము లందును భిన్నభాషలతో పద్యమును పూర్తిచేయుట జరుగుచుండును. ఇట్టియెడల భిన్నభాషలు సమీకృతములై నప్పటికిని దీనిని సాధారణీజాతికి చెందినట్లు పరిగణింపరాదు. కావుననే దీనిని 'అసాధారణి' యన్న విశేషణముతో గ్రంథకర్త సూచించుచున్నాడు ఇది 'అనన్యగామిని' యన్న జాతిభేదముగా వేరుగా పరిగణింప బడుచున్నది.

ఉదాహృత పద్యమునందలి పూర్వార్ధము సంస్కృతభాషామయము; ఉత్తరార్ధము ప్రాకృతభాషామయము. పూర్వోత్తరభాగములకు యథాతథముగా అన్వయము లేదు. ఏభాగమున కాభాగమే మిగిలిపోవును. కాని సరసులు పూర్వార్ధము నుపమేయముగా గ్రహించి, ఉత్తరార్ధము నుపమానముగా గ్రహింపవచ్చును. అట్లు గ్రహింపగా 'ప్రభాతకాలమున పద్మముల పుప్పొడి సరోవరజలమునందు వ్యాపించినట్లు భీష్మప్రోక్తములైన వాక్యములు పండితుల వక్త్రములందు శయనించి శోభించు చున్నవి' అన్న యర్థము లభించును. అనన్వితములయిన వాక్యములను సమన్విత ముగావించుట విద్యావినోదము భిన్నభాషావాక్యములకు ఉపమేయోపమానత్వమును సంధించుట సాహిత్యక్రీడ ఇదియు శబ్దసౌందర్య సంపాదకమే. కావుననే జాతి యన్న శబ్దాలంకారమగుచున్నది.

ఉత్తరార్ధమునందలి ప్రాకృతపదముల కర్థములు – గోసే=ప్రభాతమందు; తివింఛిరిచ్ఛోలే=పద్మరజస్సమూహము; తల్ల=సరోవరముయొక్క: తూహే= జలమునందు; వివల్లిదా = వ్యాపించినది.

సాధారణీభేదమునందువలె ప్రాకృతాదులతో శౌరసేన్యాదులు అనన్యగామిని యందు చేరుటకు వీలులేదు. అట్లుచేరినప్పుడు అవి సాధారణీజాతికే చెందును. ఇట్లు ఇతరభాషలందు వ్యాప్తిలేని దగుటచేతనే అనన్యగామిని యన్న నామము దీని కన్వర్థమగుచున్నది.

సాధారణియందు ఔచిత్యమునుబట్టి భిన్నభాషలు ప్రయుక్తములగును. అనన్యగామినియందు వినోదమే భిన్నభాషల ప్రయోగమునకు ఏకైకప్రయోజనము.

[ అపభ్రష్ట ]

అపభ్రష్టా యథా -

'ముద్ధే గహాణఅ గేణ్హాఉ
తం ధరి ముద్దం ణిఅ హత్థే
ణిచ్ఛఉ సుందరి
తుహాఉవరి మమ సుఅప్పహా అత్థి' 12

[ఛాయా -

'ముగ్ధే గ్రహాణకం గృహాణ
త్వం ధారయ ముద్రాం నిజే హస్తే
నిశ్చయః సుందరి
త్వోపరి మమ సుస్పృహాస్తి']

సేయ మపశబ్దప్రయోగతో ఽపభ్రష్టాఖ్యవిద్వద్భిః శ్రోత్రియాదైః ప్రయుజ్యత ఇత్యపభ్రష్టా జాతిః అస్యా అపి చానుకరణే సాధుత్వ మిష్యతే.

అర్థము : అపభ్రష్ట కుదాహరణము. ఓ ముద్దరాలా! రతమూల్యమును గ్రహింపుము. నాణెమును నీచేతియందే పట్టుకొనుము. సుందరీ! నిశ్చయముగా నీమీద నాకు సురతవాంఛ గలదు.

ఇది అపశబ్ద ప్రయోగమువల్ల అపభ్రష్టమైనప్పటికిని, అపండితులయిన శ్రోత్రియాదులచేత ప్రయోగింపబడుచున్నది. కావున, ఇది అపభ్రష్ట యన్న జాతి. దీనికికూడ అనుకరణమునందు సాధుత్వము సమ్మతమగుచున్నది.

వ్యాఖ్య : లక్షణవిరుద్ధమైనది అపభ్రష్టము. ఇచ్చటి అపభ్రష్టశబ్దము అపభ్రంశ మన్న భాషాభేదమునకు సూచకము కాదు. ఉదాహరణ పద్యము ప్రాకృత భాషా ఘటితము. ఇందు శబ్దగతములయిన వ్యాకరణ దోషములు, అర్థగతమైన

గ్రామ్యత్వ దోషము, వృత్తగతమైన ఛందోదోషముకూడ నున్నవి. అపభ్రష్టత్వము నకు ఒక దోషము చాలును. ఇన్ని దోషములతో అపభ్రష్టత్వమును గ్రంథకర్త నిబంధించుట స్పష్టత కొరకే.

దీనిని దోషప్రకరణములో చేర్చి, నిరసింపక యిచ్చట చెప్పుకొనుట యేందు లకు? ఈ ప్రశ్న రావచ్చును. ఈ పద్యము స్వతంత్రమైనప్పుడు దోషమే. అను కృతమైనప్పుడు సాధుత్వము నొందును. అప్పుడు హేయము కాక ఉపాదేయమే యగును.

వృత్తికొరకు కొంచెముగా వేదమును చదువుకొని జీవనోపాధిని సంపా దించుకొను శ్రోత్రియులు కొందరున్నారు. అట్టివారికి పాండిత్యము చక్కెదురు. అట్టి అపండితుడైన శ్రోత్రియుని అనుకరించునప్పుడు అనుకార్య గతదోషములు కూడ అనుకర్తవిషయమున అలంకారమే యగును. అనుకరణ సందర్భమును బట్టియు, అభినయ విశేషమును బట్టియు జాతియనెడి శబ్దాలంకార మందు అపభ్రష్ట ఒక భేద మగుచున్నది.

'నీమీద నాకు సురతవాంఛ గలదు' అని యనుట అర్థగతమైన అశ్లీలత్వ మును వెల్లడించుచున్నది. ఇచ్చట 'మీద' (ఉపరి) అని ప్రయోగించుట కారకమును తప్పుగా ప్రయోగించుట. ఇది వ్యాకరణదోషము. రెండవ పాదమునందు గణ భంగము కలిగినది. మూడవపాదమునందు ఒక గణము తక్కువయైనది. ఇట్లగుట ఛందోదోషము. ఇన్ని దోషములకు నిధానమైన వ్యక్తిని అనుకరించెడి నటుడు వీని నన్నింటిని విడువకుండ అనుకరించినయెడల సాఫల్యము పొందినట్లే. అట్లు వాచకమును రచింపవలసినవాడు కవి. ఇది శబ్దరచనకు చెందినదగుటచేతనే శబ్దా లంకారముగా పరిగణింపబడుచున్నది.

## గ త్య లం కా ర ము

18. పద్యం గద్యంచ మిశ్రం చ కావ్యం యత్సాగతిః స్మృతా
అర్థౌచిత్యాదిభిః సాపి వాగలంకార ఇష్యతే.

అర్థము : పద్యము గద్యము మిశ్రము నని కావ్యము మూడు విధములు దానినే (కావ్యభేదమునే) గతి యని తలంతురు. అర్థౌచిత్యము మొదలయినవాని చేత ఆ గతియే వాగలంకారముగా ఇష్టమగుచున్నది.

వ్యాఖ్య : కావ్యమును రూపమునుబట్టి పద్యకావ్యము, గద్యకావ్యము, మిశ్రకావ్యము నని మూడు విధములుగా పరిగణింతురు. మిశ్రకావ్యమునకే చంపూకావ్యమని నామాంతరము. 'పద్' ధాతువుపై 'య' ప్రత్యయము కలుగగా 'పద్య' రూపమేర్పడును. 'పద్యతే గచ్ఛతీతి పద్యమ్' అను వ్యుత్పత్తినిబట్టి గమనక్రియను కలది పద్యమని యర్థము. 'పాదేషు భవం పద్యమ్'అన్న వ్యుత్పత్తిని బట్టి పాదముల రూపములలో ఉద్భవించునది పద్యము. పాదనియమమును కలది పద్యమని భావము.

'గద్ వ్యక్తాయాం వాచి' అను ధాతువుపై 'య' ప్రత్యయము కలుగగా 'గద్యమ్' అని యేర్పడును. 'గద్యతే ఉచ్యతే ఇతి గద్యమ్' అన్న వ్యుత్పత్తిని బట్టి వచనక్రియను గలది గద్యమని యర్థము. పాదనియమాదులు లేనిది గద్యము.

పద్య గద్య మిశ్రమునకే మిశ్రమని పేరు. అర్థ మని యనగా విషయము. విషయము యొక్క, అనగా కావ్యవస్తువుయొక్క ఔచిత్యము మొదలయిన వానిని బట్టి కావ్యభేదము శబ్దాలంకారమై 'గతి' యని వ్యవహృత మగును.

19. కశ్చిద్గద్యేన పద్యేన కశ్చిన్మిశ్రేణ శక్యతే
కవితుం కశ్చన ద్వాభ్యాం కావ్యేఽర్థః కశ్చన త్రిభిః

అర్థము : కావ్యమునందు ఒకానొకవిషయము గద్యముతో రచించుటకు శక్యమగును; ఒకానొక విషయము పద్యముతో రచించుటకు శక్యమగును; ఒకానొక విషయము గద్యపద్యమిశ్రమైన చంపూరూపముతో రచించుటకు శక్యమగును. ఒకానొక యర్థము రెండు రూపములలోను, ఒకానొక యర్థము మూడురూపముల లోను రచించుటకు అనుకూలమై యుండును.

20. యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబంధేఽపి తాదృశః
గత్యాం గత్యామియం దేవీ విచిత్రా హి సరస్వతీ.

అర్థము : బాణుడు గద్యవిధానమునం దెటువంటివాడో పద్యబంధమునందు నటువంటివాడే. ఒక్కొక్క గతియందును సరస్వతీదేవి విచిత్రయై యుండును కదా!

వ్యాఖ్య : కాదంబరీ హర్షచరితలనుబట్టి బాణుడు గద్యకవిగానే ప్రసిద్ధుడు. అయినను పద్యరచనమునందుకూడ అతడు ప్రాగల్భ్యము కలవాడే. పద్యకాదంబరి

యను గ్రంథమే తత్ప్రాగల్భ్యమునకు నిదర్శనము. సరస్వతీదేవి గద్యగతియందు విచిత్రయై యున్నట్లే పద్యగతియందు విచిత్రయై యున్నది. 'విశేషం చిత్తం రంజయతీతి విచిత్రా' యని వ్యుత్పత్తి. విశేషముగా చిత్తమును రంజింపజేయునదని యర్థము. కొన్ని యర్థములకు గద్యరూపమున సారస్వతము చిత్తరంజకమై యొప్పును. కొన్నియర్థములకు పద్యరూపమున చిత్తరంజకమై యొప్పును. అట్లే కొన్ని యర్థములకు చంపూరూపమే చిత్తరంజకమగును.

21. యథామతి యథాశక్తి యథౌచిత్యం యథారుచి
కవేః పాత్రస్య చైతస్యాః ప్రయోగ ఉపపద్యతే.

అర్థము : కవియొక్కయు పాత్రయొక్కయు మితినిబట్టి, శక్తినిబట్టి, ఔచిత్యమునుబట్టి, రుచినిబట్టి గతియొక్క ప్రయోగము జరుగును.

వ్యాఖ్య : మతి యనగా వ్యుత్పత్తి యని యర్థము. శక్తియనగా ప్రతిభ యని యర్థము. కవి తనయొక్క వ్యుత్పత్తినిబట్టియు, తనకున్న ప్రతిభనుబట్టియు పద్యగద్యాది రూపమును వినియోగించుకొనును. పూర్వము చెప్పినట్లు అర్థౌచిత్యమును గమనింపవలయును. ఏవిషయ మేరూపములో యోగ్యముగా నుండునో గమనించి, దానినిబట్టి నిర్ణయము చేసికొనవలయును. రుచి యనగా అభీష్టమని, మనోనుకూలత యని యర్థములు. కవి అభీష్టమునుబట్టియు, పాత్ర మనోనుకూలతనుబట్టియు గతిని నిర్ణయించుకొనవలయును.

పద్యమా? గద్యమా? చంపువా? అనునది అర్థౌచిత్యమును బట్టియే కాక కవి వ్యుత్పత్తి ప్రతిభలను బట్టియు, పాత్ర సన్నివేశాది సముచితత్వమునుబట్టియు, పాత్ర మనోనురూపతనుబట్టియు నిర్ణయము కావలయునని సారాంశము. కావుననే లక్షణ శ్లోకమునందు (18) 'అర్థౌచిత్యాదిభిః' అని 'ఆది' శబ్దము వాడబడినది.

22. ద్రుతా విలంబితా మధ్యా సాథ ద్రుతవిలంబితా
ద్రుతమధ్యా చ విజ్ఞేయా తథా మధ్యవిలంబితా.

అర్థము : గతి యన్న శబ్దాలంకారము 1. ద్రుత 2. విలంబిత 3. మధ్య 4. ద్రుతవిలంబిత 5. ద్రుతమధ్య 6. మధ్యవిలంబిత యని ఆరు భేదములను కలిగి యుండును.

23. సా లఘూనాం గురూణాంచ బాహుల్యాల్పత్వమిశ్రణైః
పద్యే గద్యే చ మిశ్రే చ షట్ప్రకారోపజాయతే.

అర్థము : గతియన్న శబ్దాలంకారము పద్యమునందును గద్యమునందును, మిశ్రమునందును లఘువులయొక్కయు గురువులయొక్కయు బాహుల్యాల్పత్వ మిశ్రణములచేత ఆరు భేదములను కలిగియుండును.

వ్యాఖ్య : పద్య గద్య మిశ్రములు కావ్యభేదములు. అవి గతి యన్న శబ్దాలంకారమునకు ఆధారములు మాత్రమే దాని నాశ్రయించుకొని గురులఘు విని యోగముసుబట్టి గతి ప్రవర్తించును. పూర్వ (18) శ్లోకమునుబట్టి కావ్యభేదమునే 'గతి' యని పరిగణించినట్లు తోచును. ప్రకృత శ్లోకమువల్ల తదంతర్గతమైయున్న కూర్పునకే గతి యని పేరన్న విషయము విశదమగుచున్నది. ఇది ఆ కూర్పు లోని భేదమునుబట్టి ఆరు విధములుగా నగును. ద్రుత గతి, విలంబితగతి, మధ్య గతి – అన్న మూడును శుద్ధభేదములు. ద్రుతవిలంబితగతి, ద్రుతమధ్యగతి, మధ్యవిలంబితగతి – అనునవి సంకీర్ణభేదములు.

24. తత్ర వృత్తం చ జాతిం చ పద్యమాహురథోఽపృథక్
సమం చార్ధసమం చైతద్విషమం చ ప్రచక్షతే.

అర్థము : పద్యము వృత్తము, జాతి యను రెండు విధములు. వృత్తము మరల సమము, అర్ధసమము, విషమము – అని మూడు విధములు.

వ్యాఖ్య : అక్షరనియమము గల పద్యము వృత్తము మాత్రానియమము గల పద్యము జాతి. వృత్తము నాలుగు పాదములందు సమాన నియమము కలిగి యున్నచో సమవృత్తమగును. ప్రథమ తృతీయపాదము లొకవిధముగను, ద్వితీయ చతుర్థపాదములు మరొక విధముగను నున్నయెడల అర్ధసమవృత్తమగును. నాలుగు పాదములును భిన్నవిధములుగా నున్నయెడల విషమవృత్తమగును; కొన్నియెడల మూడుపాదములు సదృశములై ఒక పాదము భిన్నముగా నుండును.

ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, రథోద్ధత, శాలిని, తోటకము, మందాక్రాంత, శిఖరిణి మున్నగునవి సమవృత్తములు. వియోగిని, పుష్పితాగ్ర, వేగవతి మున్నగు నవి అర్ధసమవృత్తములు. ఉపజాతి, ఉద్గత మొదలయినవి విషమవృత్తములు.

ఆర్య, గీతి మొదలయినవి జాతికి చెందిన పద్యములు.

25. గద్య ముత్కలికాప్రాయం పద్యగంధీతి చ ద్విధా
ద్విధైవ గద్యపద్యాది భేదా న్మిశ్రమపీష్యతే.

అర్థము : గద్యము ఉత్కలికాప్రాయమని, పద్యగంధి యని రెండువిధములు. మిశ్రముకూడ గద్యపద్యాది భేదమువల్ల రెండు విధము అగును.

వ్యాఖ్య : పద్య భాగమువలె నడచునది పద్యగంధి. 'శ్రీరామా రఘురామ రామ యని సంసేవా పరాధీనులై భక్తులు సాగుచుండిరి' మున్నగు విధముగా నున్న వాక్యము పద్యగంధి. ఇందు శార్దూలవృత్తపాద మొకటి యథాతథముగా నిలిచినది. కొన్నియెడల పూర్తిపాదము నిలువకపోవచ్చును; కొన్నియెడల యతిమైత్రి లేకపోవచ్చును. అయినను గతినిబట్టియే ఇట్టి వచనమునకు 'పద్యగంధి' యన్న పేరు చెల్లును.

'కలిక' యనగా మొగ్గ యని యర్థము. 'ఉల్లసన్తీం కలికాం రుహారుహికాం పైత్రీతి ప్రాప్నోతీత్యులికాప్రాయ' మన్న వ్యుత్పత్తినిబట్టి మొగ్గతొడిగినట్లుగా మాటలను పేర్చుకొనుచు పోవుటయే ఉత్కలికాప్రాయ మనవచ్చును. 'అయ్యవసరంబున నతులతేజోవిరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భవరదాన గర్వంబునను దుర్వార పరిపంధిగర్వ నిర్వాపణాఖర్వ భుజావిజృంభణంబునను నిఖిలలోకపాలాదుల జయించి స్వవశంబొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండె'. ఇది ఉదాహరణము.

26. లలితం నిష్ఠురం చూర్ణ మావిద్ధం చేతి యోఽపరః
విశేషః స తు గద్యస్య రీతివృత్త్యో ర్భవిష్యతి.

అర్థము : లలితము, నిష్ఠురము, చూర్ణము, ఆవిద్ధము – అని గద్యమునకు చెప్పిన యితరవిశేషము రీతులయందును, వృత్తులయందును వ్యవహృతమగును.

వ్యాఖ్య : దండి గద్యవిశేషములుగా ఉత్కలికాప్రాయము, వృత్తగంధి యనువానితోపాటుగా చూర్ణకము, ముక్తకము అను వానినికూడ తెలిపెను. ఇట్లే లలితము, నిష్ఠురము, ఆవిద్ధము అను వానిని మరికొందరు ఆలంకారికులు పేర్కొనిరి. తదనంతరుడైన తాను వానిని గద్యభేదములుగా పరిగణింపకుండుటకు హేతువును భోజదేవుడు తానే యిట్లు చెప్పుకొనుచున్నాడు. ఇతరులు చెప్పిన లలితము,

నిష్ఠురము, చూర్ణము, ఆవిద్ధము అనువానిని గద్యభేదములుగా పరిగణింపవలసిన యవసరము లేదు. ఇవి సందర్భము (రచనా సంఘటనము) నాశ్రయించుకొని యుండును. కావున వీనిని రీతులను వృత్తులను పరిగణించునపుడు పేర్కొనుట యవసరము. కైశికీవృత్తి మున్నగువానియందు లలితమును, ఆరభటీవృత్తి మున్నగువానియందు నిష్ఠురమును, వైదర్భీరీతి మున్నగువానియందు చూర్ణమును, గౌడీరీతి మున్నగువానియందు ఆవిద్ధమును సహకరించును. సుకుమార సందర్భము లలితము. ఉద్ధతసందర్భము నిష్ఠురము. అనుల్లిఖిత సమాసము చూర్ణము. ఉద్భట సమాసము ఆవిద్ధము. పదరచనారీతిని, తదర్థవృత్తిని వ్యక్తము చేయుటచేతనే లలితాదులను భోజదేవుడు గద్యభేదములుగా పరిగణింపలేదు. లలితాదులు గద్య పద్యములు రెండింటియందును వ్యవహృతములగును.

తత్ర పద్యభేదేషు సమవృత్తే ద్రుతా గతి ర్యథా-

'అయి విజహీహి దృఢోపగూహనం
త్యజ నవసంగమభీరు వల్లభం
అరుణ కరోద్గమ ఏష వర్తతే
వరతను సంప్రవదన్తి కుక్కుటాః' 13

సేయం సమవృత్తే లఘుసంయుక్తాక్షర భూయస్త్వాద్ద్రుతా గతిః.

అర్థము : పద్యభేదములలో సమవృత్తమునందు ద్రుతగతికి ఉదాహరణము. ఓ నవసంగమభీరూ! దృఢ పరిష్వంగమును విడిచిపెట్టుము. వల్లభుని వదలుము. శోభనాంగీ! అదిగో! సూర్యకిరణములు వెలువడుచున్నవి. కుక్కుటములు కూయుచున్నవి.

సమవృత్తమునందు లఘువులయొక్కయు సంయుక్తాక్షరములయొక్కయు ఆధిక్యమువల్ల ఇది ద్రుతగతి.

వ్యాఖ్య : ఉదాహృత పద్యము సమవృత్తములలోనిది. జగతీ చ్ఛందస్సునకు చెందిన మాలతీవృత్తమిది. 'భవతి న జావథ మాలతీ జరౌ' అని లక్షణము. ప్రతిపాదమునందు 'న జ జ ర' యను నాల్గుగణములు వరుసగా నుండును. నాలుగు పాదములును సమానములుగా నుండుటచే ఇది సమవృత్తము.

లఘువు లధికసంఖ్యాకములై, సంయుక్తాక్షరములుకూడ అధిక సంఖ్యాకములై యున్నచో ద్రుతగతి యగునని లక్షణము. పై పద్యమునందు మొదటి పాదమున మొదటి నాలుగక్షరములును లఘువులు ఆరవ, యేడవ, తొమ్మిదవ, పదునొకండవ యక్షరములు లఘువులు. అనగా పండ్రెండ క్షరముల నిడివిగల పాదములో ఎనిమిదక్షరములు లఘువు లన్నమాట. గురువులు కాదగిన నాలుగక్షరములును దీర్ఘము లగుటవలన గురువులగుటకాక ద్విత్వసంయుక్తములు పరమగుట చేతనో బిందువిసర్గములను పొందియుండుటచేతనో గురువులగుటయే యెక్కువగా నున్నది. అందువల్లనే గమనమునకు ద్రుతత్వము కలుగుచున్నది. ఉదాహృత పద్యమునందలి నాలుగు పాదములందును పై లక్షణము స్పష్టము.

ఇది కుమారదాసు రచనగా ఔచిత్యవిచారచర్చయం దుదాహృతము.

సమవృత్తే విలంబతా యథా-

'ప్రణమ్య హేతు మీశ్వరం
మునిం కణాద మన్వతః
పదార్థ ధర్మ సంగ్రహః
ప్రవక్ష్యతే మహోదయః' 14

సేయం స్థానే స్థానే గుర్వక్షర యోగా ద్విలంబితా గతిః.

**అర్థము :** సమవృత్తమునందు విలంబితగతికి ఉదాహరణము. హేతువయిన ఈశ్వరునికి ప్రణమిల్లి, ఆపిమ్మట మునియైన కణాదునికి మొకరిల్లి మహోదయుడు పదార్థ ధర్మసంగ్రహమును ప్రవచించుచున్నాడు.

స్థానస్థానమునను గుర్వక్షర యోగమువల్ల ఇది విలంబితగతి.

**వ్యాఖ్య :** ఉదాహృతపద్యము సమవృత్తములలోనిది. అనుష్టుప్ఛందస్సునకు చెందిన ప్రమాణికావృత్తమిది. 'ప్రమాణికా జరౌ లగౌ' అని లక్షణము. ప్రతిపాదమునందు జగణము, రగణము, లఘువు, గురువు - వరుసగా నుండును. నాలుగు పాదములును సమానములుగా నుండుటచే ఇది సమవృత్తము.

గుర్వక్షరముల సంఖ్య యధికముగా నున్నయెడల విలంబిత గతి యగునని లక్షణము. పై పద్యమునందు లఘువు, గురువు, లఘువు, గురువు - ఈ క్రమ

ములో ప్రతిపాదమునకు ఎనిమిదేసి యక్షరములు గలవు. సరిస్థానములందు గురువు తప్పనిసరిగా నుండుటచే గమనము మందగింపక తప్పదు. కావుననే, యిది విలంబితగతికి ఉదాహరణమైనది.

తత్రైవ మధ్యా యథా-

'ఆసీద్దైత్యో హయగ్రీవః
సుహృద్వేశ్మసు యస్య తాః
వదన్తి స్మ బలం బాహ్వోః
సితచ్ఛత్ర స్మితాః శ్రియః' 15

సేయం నాతిలఘ్వక్షరత్వా న్మధ్యా గతిః.

అర్థము : సమవృత్తమునందు మధ్యగతికి ఉదాహరణము. స్నేహితుల యిండ్ల యందు సితచ్ఛత్రస్మితములైన సంపదలు ఎవని భుజబలమును ప్రశంసించు చుండెడివో, ఆహయగ్రీవు డను దైత్యుడుండెను.

అనతి లఘ్వక్షరములవల్ల ఇది మధ్యగతి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము అనుష్టుప్ఛందస్సునకు చెందిన శ్లోకము, 'శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం సర్వత్ర లఘు పంచమమ్। ద్విచతుః పాదయో ర్హ్రస్వం సప్తమం దీర్ఘ మన్యయోః' అని లక్షణము. శ్లోకమునందలి నాలుగుపాదములందును ఆరవ యక్షరము గురువై, ఐదవ యక్షరము లఘువై యుండవలయును. రెండవ నాలుగవ పాదములందు ఏడవ యక్షరము లఘువు. అన్యపాదములందు ఏడవ యక్షరము గురువు. స్పష్టముగా చెప్పిన నియమమునుబట్టి సరిపాదము లొక విధముగా, బేసిపాదము లొకవిధముగా నుండునని తెలుచున్నది. ఇట్లుండుటచేత దీనిని అర్ధ సమవృత్త మనవలయుననిపించును. కాని సాంప్రదాయికముగా దానిని సమవృత్తములలోనే పఠించుట జరుగుచున్నది. భోజదేవుడుకూడ సమవృత్తములలో పఠించుట సమంజసమన్న దృష్టితోనే 'తత్రైవ' (అక్కడనే) యని నిర్దేశించు చున్నాడు.

మాలతీ ప్రమాణికాది వృత్తములవలె శ్లోకము గణబద్ధము కాదు. ఇంతకు ముందు చెప్పిన లక్షణములతోపాటు ప్రతిపాదమునకు ఎనిమిదక్షరము లుండుట యొక్కటి చేర్చుకొనవలయును, అక్షర సంఖ్యానియమమునుబట్టి అన్ని పాదము

లును సమానములుగానే యుండును. ఇదియే దీనిని సమవృత్తములలో పరిగణిం చుటకు సమంజసమైన కారణము.

లఘువులయిన యక్షరములు ప్రచురముగా లేకపోవుటచేత మధ్యగతియగు నని లక్షణము. మొదటి పాదమున ఐదవయక్షర మొక్కటియే లఘువు. రెండవ పాదమున నాలుగు లఘువులు కలవు. మూడవపాదమున మూడు లఘువులు, నాలుగవపాదమున రెండు లఘువులు గలవు. ముప్పదిరెండక్షరములలో పదియక్షరములు మాత్రమే లఘువులు. గురువుల సంఖ్య రెట్టింపుకంటె నెక్కువగా నున్న దని యర్థము. అట్టియెడల 'దీనిని విలంబితగతి' యనక 'మధ్యగతి' యనుట యెట్లు? అన్న ప్రశ్న యుదయింపవచ్చును. ఇచ్చట గురువులు దీర్ఘత్వముచేతనే గురువులైనయెడల అట్లే యనవలయును. కాని అట్లుకాదు. సంయుక్తాక్షరములును ద్విత్వాక్షరములును పరమందుండుటచేతను, బిందువిసర్గములను పొందియుండుట చేతను గురువులుగా పరిణతములైన హ్రస్వములే ఉదాహరణమునందు మిక్కిలిగా నున్నవి. అందువల్ల గమనము దీర్ఘములవల్ల విలంబితమైనంతగా ఇప్పుడు కాదు. లఘువుల సంఖ్య తక్కువగానుండుటచే ద్రుతత్వముకూడ లేదు. కావుననే యిది మధ్యగతికి ఉదాహరణమైనది.

ఈ పద్యము భర్తృమేంఠుని రచనగా క్షేమేంద్రుని సువృత్తతిలకమునం దుదాహృతము.

ద్రుతవిలంబితా యథా-

'అవతు నః సవితు స్తురగావలీ
స్ఫురిత మధ్యగతారుణ నాయకా
సమభిలంఘిత* తుంగ పయోధరా
మరకతైకలతేవ నభః శ్రియః' 16

సేయం ద్రుతాయా విలంబితాయాశ్చ గతే రంత రానుప్రవేశా ద్ద్రుతవిలంబితా గతిః

అర్థము : సమవృత్తమునందు ద్రుతవిలంబిత గతికి ఉదాహరణము. ఆకాశలక్ష్మియొక్క మరకతలతనుబోలి స్పష్టముగా మధ్యభాగమున అరుణుని నాయ

* సమవిలంఘిత - పాఠాంతరము

క్షమణిగా కలిగి ఉత్తుంగపయోధరములను చక్కగా లంఘించిన సూర్యతురగావళి మిమ్ములను రక్షించునుగాక !

ద్రుత గతియు విలంబితగతియు ఒకదానివెంట నొకటిగా అనుప్రవేశము చేయుటవల్ల ఇది ద్రుత విలంబితగతి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము సమవృత్తములలోనిది. జగతీచ్ఛందస్సునకు చెందిన ద్రుతవిలంబిత వృత్తము. 'ద్రుత విలంబితమాహ నభౌ జరౌ' యని లక్షణము. ప్రతిపాదమునందు 'న, భ, జ, ర' గణములు వరుసగా నుండును. నాలుగు పాదములును సమానములుగా నుండుటచే ఇది సమవృత్తము.

ప్రతిపాదమునందును మొదటి మూడక్షరములును లఘువులు. నాలుగవ యక్షరము గురువు. తరువాతి రెండక్షరములును లఘువులు. మరల నొక గురువు; మరల రెండు లఘువులు; మరల గురువు లఘువు గురువు – ఈ క్రమములో సాగినది. పండ్రెండ క్షరముల నిడివి గలిగిన పాదములో ఎనిమిది లఘువు లున్నవి. కావున ద్రుతగతి. విసర్గతోనుండి, సంయుక్తాక్షరమునకు ముందుండి హ్రస్వములు గురువులై నప్పటికిని ద్రుతగతికే సహకరించును. దీర్ఘత్వముచేత గురువులైనవి మాత్రమే విలంబితగతికి సహకరించును. అట్టివి మొదటిపాదమునందు రెండును, రెండవపాదమున మూడును, తరువాతి పాదములందు రెండేసి చొప్పునను మాత్రమే కలవు. కావుననే ప్రధానముగా ద్రుతగతియే యైనను, విలంబితగతి అను ప్రవేశము చేయుటవల్ల ద్రుతవిలంబితగతి యనుపేర సంకీర్ణత నొందినది.

ఉదాహృతవృత్తము పేరుకూడ ద్రుతవిలంబితమే. దీనికీపేరు గతినిబట్టి యేర్పడిన దగుటచేత సార్థకముగా నున్నది.

ద్రుతమధ్యా యథా–

'అపి తురగసమీపా దుత్పతన్తం మయూరం
స స రుచిరకలాపం బాణలక్ష్యీచకార
సపది గతమనస్కశ్చిత్రమాల్యానుకీర్ణే
రతివిగలితబంధే కేశపాశే ప్రియాయాః' 17

నేయం ద్రుతాయా మధ్యాయాశ్చ గతేః రంతరానుప్రవేశా ద్ద్రుతమధ్యా గతిః.

అర్థము : సమవృత్తమునందు ద్రుత మధ్యగతికి ఉదాహరణము. తురగము నకు సమీపముననే యెగురుచున్నప్పటికిని చిత్రపుష్పమాలికలచేత అలంకరింపబడి, రతిసమయమున విగళిత బంధమైన ప్రియురాలి కేశపాశమునందు లగ్నమనస్కుడైన అతడు (దశరథుడు) మనోహరమైన పింఛముగల నెమలిని బాణమునకు లక్ష్యముసు గావింపలేదు

ద్రుతగతియు మధ్యగతియు ఒకదానివెంట నొకటిగా అనుప్రవేశముచేయుట వల్ల ద్రుతమధ్యగతి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము సమవృత్తములలోనిది. అతిశక్వరీఛందస్సునకు చెందిన మాలినీవృత్తము. 'న న మ య య యుతేయం మాలినీ భోగి లోకైః' అని లక్షణము. ప్రతిపాదమునందు 'న న మ య య' గణములు వరుసగా నుండును. ఎనిమిదవ యక్షరస్థానకు మీదట యతి. నాలుగు పాదములును సమానములుగా నుండుటచే సమవృత్తము.

ప్రతిపాదమునందును మొదట వరుసగా ఆరులఘువులు గలవు. తరువాత మూడు గురువులు గలవు. ఆపిమ్మట ఒక లఘువు, రెండు గురువులు, మరల నొక లఘువు రెండు గురువులు. మొదటి ఆరు లఘువులవల్ల ద్రుతగతికే ప్రాధాన్యము లభించును. కాని అచ్చటనుండి గురువుల యాధిక్యము పొడచూపును. కేవలదీర్ఘత్వమువల్లనైన గురువులేకాక బింద్వాది సంపర్కముచేతనైన గురువులు కూడ హెచ్చుగానే యున్నవి. కావుననే ఇది ద్రుత మధ్యగతికి ఉదాహరణమైనది.

ఉదాహృత పద్యము కాళిదాసుని రఘువంశము నందలిది.

మధ్య విలంబితా యథా-

'దుందుభయో దివి దధ్వను రుచ్చై
రుచ్ఛ్వసి రాః కపయశ్చ వవల్గుః
సిద్ధనికాయకరాబ్జ విముక్తం
మాల్య మథాంగదమూర్ధ్ని పపాత' 18

సేయం మధ్యాయా విలంబితాయాశ్చ గతే రంతరాను ప్రవేశా న్మధ్యవిలంబితా గతిః.

అర్థము : సమవృత్తమునందు మధ్యవిలంబితగతికి ఉదాహరణము. స్వర్గమునందు దుందుభులు బిగ్గరగా మ్రోగినవి. చేతులను పైకెత్తుకొని కోతులు గంతులు వేసినవి. సిద్ధసమూహ కరాబ్జములనుండి విడువబడిన పూలమాల అంగ ధుని తలపైని పడినది.

మధ్యగతియు విలంబితగతియు ఒకదానివెంట నొకటిగా అనుప్రవేశము చేయుటవల్ల ఇది మధ్యవిలంబితగతి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము సమవృత్తములలోనిది. త్రిష్టుప్ ఛందస్సునకు చెందిన దోధకవృత్తము. 'దోధక మిచ్ఛతి భత్రితయాద్గౌ' అని లక్షణము. ప్రతిపాదమునందు మూడు భగణములును రెండు గురువులును వరుసగా నుండును. నాలుగు పాదములును సమానములుగా నుండుటచేత సమవృత్తము.

ఒక గురువు రెండు లఘువులు చొప్పున మూడుమారులు వచ్చిన పిమ్మట రెండు గురువులతో పాదము ముగియుచున్నది. మొదటి మూడు భగణములును మధ్యగతిని కలిగించుచుండగా చివరి రెండు గురువులును గతిని మందగింపజేయు చున్నవి. కావుననే యిది మధ్యవిలంబితగతికి ఉదాహరణమైనది.

ఏవ మర్ధసమ విషమయో ర్మాత్రాచ్ఛందఃసు గద్యమిశ్రయో ర్లఘుగురూన్ మిశ్రవర్ణవిన్యాసవిశేషభూయస్త్వేన ద్రుతాది గతయో ఽవగన్తవ్యాః.

అర్థము : ఈవిధముగానే అర్ధసమవృత్తములందును, విషమవృత్తములందును, మాత్రాబద్ధములయిన జాతులందును, గద్యరచనమందును, మిశ్రరచనమందును లఘు గురుమిశ్రవర్ణవిన్యాస విశేషాధిక్యముచేత ద్రుతాదిగతులను గుర్తింపవలయును.

తత్ర విషమవృత్తచ్ఛందసి ద్రుతా యథా-

'అథ వాసవస్య వచనేన
రుచిరవదన స్త్రిలోచనమ్
క్లాంతిరహిత మభిరాధయితుం
విధివ త్తపాంసి విదధే ధనంజయః'

**అర్థము :** విషమవృత్తచ్ఛందస్సునందు ద్రుతగతికి ఉదాహరణము. అనంతరము వాసవుని వచనమునుబట్టి రుచిరపదనుడైన ధనంజయుడు క్లాంతిరహితుడైన త్రిలోచనుని ప్రసన్నుని గావించుకొనుటకై నియమపూర్వకముగా తపముల నాచరించెను.

**వ్యాఖ్య :** ఉదాహరణపద్యము విషమవృత్తములలోనిది. మొదటిపాదమునందు స, జ, స గణములు నొక లఘువు నున్నవి. ఇది పది యక్షరముల ప్రమాణముగల పంక్తిచ్ఛందమునకు చెందినది. రెండవపాదముకూడ పంక్తిచ్ఛందమునకు చెందినదే. న స జ గణములు నొక గురువు నున్నవి. మూడవపాదమునందు భ న జగణములు నొక లగము నున్నవి. ఇది పదునొకండక్షరముగల త్రిష్టుప్ఛందమునకు చెందినది. నాలుగవపాదమునందు స జ స జ గణములు నొక గురువు నున్నవి. ఇది పదమూడక్షరముల ప్రమాణముగల అతిజగతీ ఛ్ఛందమునకు చెందినది, ఏ పాదమున కా పాఠము వేరుగా నుండుటచేతనే ఇది విషమవృత్తముగా పరిగణింపబడినది. దీనికి 'ఉద్గత' అని పేరు. 'ప్రథమే సజౌ యది సలౌ చ। స స జ గురుకాణ్యనంతరమ్। యద్యథ భనజలగాః స్యురథో। స జ సా జగౌ చ భవతీయ ముద్గతా' అని లక్షణము.

ఇందు మొదటిపాదమునందలి పది యక్షరములలో ఏడు లఘువులు గలవు. అట్లే రెండవపాదము నందలి పదియక్షరములలో ఏడు లఘువులు గలవు. మూడవపాదమునందలి పదునొకయక్షరములలో ఎనిమిది లఘువులు గలవు. నాలుగవపాదమునందలి పదుమూడక్షరములలో ఎనిమిది లఘువులు గలవు. ఇట్లు లఘ్వక్షరములు ప్రచురముగా నుండుటచేతనే ఇది ద్రుతగతికి ఉదాహరణమైనది.

ఉదాహృతపద్యము భారవి కిరాతార్జునీయమునుండి గ్రహింపబడినది.

అర్ధసమచ్ఛందసి విలంబితా యథా–

'విహితాం ప్రియయా మనఃప్రియా
మథ నిశ్చిత్య గిరం గరీయసీమ్
ఉపపత్తిమదూర్జితాశ్రయం
నృప మూచే వచనం వృకోదరః'

అర్థము : అర్థసమవృత్తమునందు విలంబితగతికి ఉదాహరణము. ప్రియురాలయిన ద్రౌపది చెప్పిన మాటను గొప్పదిగను మనః ప్రియముగను నిశ్చయించుకొని వృకోదరుఁడు ధర్మరాజుతో యుక్తియుక్తము నాధారసంపన్నమునైన వాక్యము పలికెను.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము అర్ధసమవృత్తములలోనిది. మొదటిపాదమునందు స స జ గణములు నొకగురువు నున్నవి. పది యక్షరముల ప్రమాణముగల పంక్తిచ్ఛందమునకు చెందిన దిది. రెండవపాదమునందు స భ ర గణములు నొక లగము నున్నవి. ఇది పదునొకయక్షరముల ప్రమాణము గల త్రిష్టుప్ఛందమునకు చెందినది. పూర్వార్ధమువలెనే ఉత్తరార్ధముకూడ నున్నది. కావుననే దీనికి అర్ధసమవృత్త మన్న పరిగణనము అన్వర్థమగుచున్నది. ఈ వృత్తముపేరు వియోగిని. 'విషమే స స జా గురు స్సమే। స భ రా లోఽథ గురు ర్వియోగినీ' అని లక్షణము.

మొదటిపాదమునందు నాలుగు, రెండవ పాదమునందు ఐదున్నీగురువులున్నవి. ఇట్లే ఉత్తరార్ధమునందుకూడ నున్నవి. గుర్వక్షరముల ప్రాచుర్యమువల్ల గతి మందగించును. కావుననే, యిది విలంబిత గతికి ఉదాహరణమైనది.

ఈపద్యము భారవి కిరాతార్జునీయమునుండి గ్రహింపబడినది.

ఉత్కలికాప్రాయగద్యే ద్రుతా మధ్యా చ యథా-

'వ్యపగత ఘనపటల మమలజలనిధి
సదృశ మంబరతలం విలోక్యతే'
'అంజన చూర్ణపుంజశ్యామం శార్వరం తమః స్త్యాయతే' 21

అర్థము : ఉత్కలికాప్రాయ గద్యమునందు ద్రుతగతికిని, మధ్యగతికిని ఉదాహరణములు. స్వచ్ఛమయిన సముద్రముతో సదృశమయిన, తొలగింపబడిన జలద సముదాయముగల ఆకాశము అవలోకింపబడుచున్నది. అంజన చూర్ణపుంజమువలె శ్యామమైన నిశాసంబంధమైన చీకటి చిక్కబడుచున్నది.

వ్యాఖ్య : శబ్దములకూర్పు మొగ్గతొడిగినట్లుగా నున్న యెడల ఉత్కలికాప్రాయ మన్న గద్యభేదముగా లక్షణము చెప్పుకొంటిమి. ఇచ్చటి లక్ష్యములు

రెండును ఉత్కలికాప్రాయ మన్న గద్యభేదమునే నిరూపించుచున్నవి. మొదటి లక్ష్యమునందు వరుసగా లఘువుల్నే పోహళించుటచేత ఇది ద్రుతగతి.

రెండవ లక్ష్యమునందు పదునేడక్షరముల పంక్తిలో ఆరు మాత్రమే లఘువులు కలవు. గురువులలో ఐదు మాత్రమే దీర్ఘములు. కావుననే లఘువుల సంఖ్య తక్కువగానే యున్నప్పటికిని విలంబితగతిని పొందక, యిది మధ్యగతిని పొందుట జరిగినది.

పద్యగంధిగద్యే వృత్తగంధో మధ్యా, జాతి గంధో ద్రుతా

యథా —

'పాతాల తాలుతల వాసిషు దానవేషు'

'హర ఇవ జితమన్మథో గుహ ఇవాప్రతిహత శక్తిః' 22

అర్థము: పద్యగంధి గద్యమునకు రెండు లక్ష్యములు. వృత్తగంధియందు మధ్యగతికి, జాతిగంధియందు ద్రుతగతికి ఉదాహరణములు 'పాతాళతాలు తలమునందు వసించుచున్న దానవులయందు'; 'ఈశ్వరునివలె జితమన్మథుడు కుమారస్వామివలె అప్రతిహతమైన శక్తికలవాడు'

వ్యాఖ్య : దండి ప్రభృతులు గద్యభేదమును వృత్తగంధియని యనగా భోజదేవుడు పద్యగంధియనియనెను. ఇట్లనుటచేత పద్యమును సామాన్యవాచకముగా గ్రహించి వృత్తమును జాతిని తదంతర్విభాగములుగా గ్రహించుటకు వీలయినది. కావుననే పద్యగంధిని వృత్తగంధి యనియు జాతిగంధి యనియు రెండురకములుగా నిరూపించుటకు వీలయినది. ఈ రెండింటియందు ద్రుతాది గతిభేదముల నన్నింటిని ప్రదర్శింపవచ్చును. ఉదాహరణమునకుగాను వృత్తగంధియందు మధ్యగతిని, జాతిగంధియందు ద్రుతగతిని మాత్రమే రచయిత ప్రదర్శించుచున్నాడు.

మొదటి యుదాహరణమందు త, భ, జ, జ గణములు నొక లగము నున్నవి. ఇది గద్యమునందు కొంతభాగము. దీని నింతవరకు చూడగా వసంత తిలకావృత్తపాదమగును. 'ఉక్తా వసంతతిలకా తభజాఃజగౌగః' అని లక్షణము.

పదునాలుగక్షరముల ప్రమాణముగల పంక్తిలో ఏడు లఘువులు కలవు అనతిలఘువర్ణముల యునికిని బట్టి యిది మధ్యగతి యైనది. ఈ యుదాహరణము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తినుండి గ్రహింపబడినది.

రెండవ లక్ష్యము బాణుని కాదంబరి నుండి గ్రహింపబడినది. 'హర ఇవ' మున్నగు విధముగా నాలుగేసి మాత్రల ప్రమాణముగల గణముల కూర్పు వినిపించును. జాతి యందలి ఆర్య, గీతి, ఉపగీతి మున్నగువాని గమనమునే యిది కలిగి యున్నది. గమనమును బట్టి మాత్రమే జాతితో సాదృశ్యము కాని తక్కిన ఛందో లక్షణములు దీనికి పట్టవు. అట్లు పట్టవలసిన యవసరములేదు అట్లు పట్టినయెడల ఇది పద్యమే యగును కాని గద్యము కాదుకదా! ఇందు లఘ్వక్షరములు అధిక సంఖ్యాకములై యుండుటవల్ల ఇది ద్రుతగతికి ఉదాహరణమైనది.

గద్యాదౌ మిశ్రేగ గద్యపద్యయోర్ద్రుతమధ్యా యథా—

'హ న్త! పుణ్యవానస్మి, యదహమత్కితోపనత దర్శనోల్లాసిత నయనయానయా—

అవిరల మివ దామ్నా పౌండరీకేణ నద్ధః
స్నపిత ఇవ చ దుగ్ధస్రోతసాం నిర్ఝరేణ
కబలిత ఇవ కృత్స్నచక్షుసా స్ఫారితేన
ప్రసభ మమృతవర్షేణేవ సాన్ద్రేణ సిక్తః' 23

అర్థము : గద్యముతో మొదలైన మిశ్రకావ్యమునందు గద్యపద్యములలో ద్రుతమధ్యగతికి ఉదాహరణము. ఆహా! పుణ్యవంతుడనైతిని. ఎందువల్లననగా, అనుకొనకుండ లభించిన దర్శనముచేత ఉల్లాసమునొందిన కన్నులుగల యీమెచేత పద్మమాలికచేత అంతటను కట్టబడినట్లుగా, దుగ్ధస్రవంతి ప్రవాహముచేత స్నాతుడనైనట్లుగా, విశాలములయిన నేత్రములచేత కబళింపబడినట్లుగా, దట్టమైన అమృత వర్షముచేత హఠాత్తుగా తడుపబడినట్లుగా నయితిని.

వ్యాఖ్య : గద్యపద్య మిశ్రము మిశ్రము. పద్యముతో ప్రారంభమై గద్యమును కలుపుకొనవచ్చును. గద్యముతో ప్రారంభమై పద్యమును కలుపుకొనవచ్చును. పద్యముతో ప్రారంభమైన వాక్యము గద్యముతో ముగియవచ్చును. అట్లే గద్యముతో ప్రారంభమై పద్యముతో ముగియవచ్చును. ప్రకృతోదాహరణము గద్యముతో ప్రారంభమై పద్యముతో ముగియుచున్నది. వాక్యముకూడ అట్లే యగుచున్నది.

ఇచ్చటి గద్యము ఉత్కలికాప్రాయము. మొదట మధ్యగతియు పిదప ద్రుత గతియు కానవగును. కావుననే ద్రుతమధ్యగతికి ఉదాహరణము. పద్యము మాలినీ వృత్తము. ఇదియు ద్రుతమధ్యగతినే కలిగియున్నది.

పద్యాదౌ మిశ్రే ద్రుతవిలంబితా యథా—

'అసౌ విద్యాధారః శిశురపి వినిర్గత్య భవనా
దిహాయాతః సంప్రత్యవికల శరచ్చంద్ర మధురః
యదాలోకస్థానే భవతి పుర మున్మాదతరలైః
కటాక్షై ర్నారీణాం కువలయిత వాతాయన మివ'

అత్ర బాలసుహృదా మకరందేన సహ విద్యా మాన్వీక్షికీ మధీతే స ఏష మాధవో నామ' 24

అర్థము : పద్యాదియైన మిశ్రమునందు ద్రుతవిలంబితగతికి ఉదాహరణము. అతడు శిశువేయైనను విద్యాధారుడు. భవనమునుండి అవికల శరచ్చంద్రమధురుడైన ఆతడిటు వచ్చినాడు. అతడు కనిపించుచోటు స్త్రీల యున్మాద తరళములైన కటాక్షములతో పురము కువలయములు కూర్చిన వాతాయనముపలె నగుచున్నది. ఇక్కడ బాలమిత్రుడైన మకరందునితోకూడి ఆన్వీక్షికీ విద్య నధ్యయనము చేయుచున్నాడు. అతడే యీ మాధవుడనువాడు.

వ్యాఖ్య : ప్రకృతోదాహరణము భవభూతి రచించిన మాలతీమాధవము నుండి గ్రహింపబడినది. ఇది కామందకి వాక్యము. ఆ పద్యమునందు 'అసౌ విద్యాధారః' అని మొదలుపెట్టిన వాక్యము వచనమునందలి 'స ఏష మాధవో నామ' అనుటతో ముగిసినది. కావున పద్యగద్యములను కలిపి ఒకే వాక్యముగానే గ్రహింపవలయును.

పద్యము శిఖరిణీవృత్తము; సమవృత్తములలోనిది. పదునేడక్షరముల ప్రమాణముగల అత్యష్టిచ్ఛందమునకు చెందినది. ప్రతిపాదమున య మ న స భ గణములు నొక లగము నుండును. 'రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ' అని లక్షణము',

ప్రతిపాదమునందు తొమ్మిది లఘువులున్నవి. ఎనిమిదక్షరములు గురువులు. కావుననే యిది ద్రుత విలంబితగతిని కలిగియున్నది. వచనమునందుకూడ లఘువులను గురువులును దరిదాపుగా సమానముగానే యుండుటచేత ద్రుతవిలంబిత గతియే యున్నది. ఇచ్చటి వచనము ఉత్కలికా ప్రాయము. బాలసుహృదా-మకరందేన సహః విద్యామ్‌-ఆన్వీక్షికీమ్, స-ఏష-మాధవః॥ అను జంటలలో పూర్వపదములు విశేషణములై పరపదములకు ప్రభవస్థానము లగుచున్నవి. ఇట్లు కూర్పునొందుటయే మొగ్గతొడుగుట. ఇదియే ఉత్కలికాప్రాయత్వము.

## రీ త్య లం కా ర ము

27. వైదర్భ్యాది కృతః పంథాః కావ్యే మార్గ ఇతి స్మృతః
రీఙ్ గతావితి ధాతోః సావ్యుత్పత్త్యా రీతి రుచ్యతే.

అర్థము : కావ్యమునందు విదర్భదేశస్థులు మున్నగువారు వేసిన బాట 'మార్గము' అని స్మరింపబడినది. 'రీఙ్ గతౌ' అన్న ధాతువవలని వ్యుత్పత్తిని బట్టి అది రీతి యనబడు చున్నది.

వ్యాఖ్య : దండి మున్నగువారు మార్గమని పిలిచిన దానినే వామనాదులు రీతి యని పేర్కొనిరి. దండి నిర్దేశము ప్రకారము విదర్భదేశస్థులచే వేయబడిన మార్గము వైదర్భమార్గము. అనగా ఈ నామము తత్తద్దేశప్రజలతో సంబంధమును కలిగియున్నదన్నమాట. వామనుడు తత్సంబంధము నంగీకరించెను. కాని 'రీతియే కావ్యాత్మ' యని దానికి సమున్నతస్థానమును కల్పించెను.

భోజదేవుడు రీతి యన్న పదము నంగీకరించినప్పటికిని దాని కంతటి సమున్నతస్థానము నంగీకరించుటలేదు. కావుననే శబ్దాలంకారములలో జాతి, గతి వలెనే రీతి కూడ ఒక యలంకారముగా పరిగణించుచున్నాడు.

28. వైదర్భీ సాథ పాంచాలీ గౌడీయావంతికా తథా
లాటీయా మాగధీ చేతి షోఢా రీతి ర్నిగద్యతే.

అర్థము : 1. వైదర్భి 2. పాంచాలి 3. గౌడీయ 4. ఆవంతిక 5. లాటీయ 6. మాగధి-అని రీతి ఆరువిధములుగా చెప్పబడుచున్నది.

## వైదర్భీరీతి లక్షణము

29. తత్రాసమాసా నిఃశేష శ్లేషాదిగుణగుంఫితా
విపంచీస్వరసౌభాగ్యా వైదర్భీరీతి రిష్యతే.

అర్థము : అందు సమాసములు లేనిదియు, శ్లేషాది సర్వగుణములతోను నిండినదియు, విపంచీస్వర సౌభాగ్యము కలదియు వైదర్భీరీతి యనబడును.

వ్యాఖ్య : వైదర్భీరీతికి లక్షణమిది. ఇందు సమాసము లుండరాదు. శ్లేషాది గుణములు భోజదేవునిచేత ఇరువదినాలుగు పరిగణితములైనవి. తత్సర్వగుణముల తోను నిండియుండవలయును. విపంచియనగా వీణ యని యర్థము. విపంచీ స్వరము లని యనగా శ్రోతృమనోరంజకములయిన షడ్జాది స్వరములని యర్థము. వీణను వినుచున్నప్పుడు సమకాలమున ఆనందము కలుగుటయే కాక తత్స్పందన సంజాత మాధుర్యముచే మరికొంతకాలము ఆ యానందము నిలిచియుండును. అదియే విపంచీ స్వరసౌభాగ్యము. అట్టి సౌభాగ్యమును కలిగించునది వైదర్భీరీతి. ఉదాహరణము తరువాత ప్రదర్శింపబడును.

## [పాంచాలీరీతి లక్షణము]

30. సమస్త పంచషపదా మోజః కాంతి వివర్జితామ్
మధురాం సుకుమారాం చ పాంచాలీం కవయో విదుః.

అర్థము : సమసించిన ఐదారు పదములు గలదియు, ఓజస్సు కాంతి యను గుణములను విడిచినదియు, మధురము సుకుమారము నైనదియు నైన పాంచాలిని కవులెరుగుదురు.

వ్యాఖ్య : ఇది పాంచాలీ రీతికి లక్షణము. ఇందు ఐదుపదములో ఆరుపద ములో కలిసిన సమాసము లుండవలయును. ఓజోగుణము కాని, కాంతి గుణము కాని యుండరాదు. తద్విరుద్ధములయిన మాధుర్యము, సౌకుమార్యము అనుగుణము లుండవలయును.

[గౌడీయారీతి లక్షణము]

31. సమస్తాత్యుద్భటపదా మోజః కాంతిగుణాన్వితామ్
గౌడీయేతి విజానన్తి రీతిం రీతి విచక్షణాః.

అర్థము : సమసించిన యుద్భటములైన పదములను గలదియు, ఓజోగుణముతోను కాంతిగుణముతోను కూడినదియు గౌడీయారీతి యని రీతివిచక్షణులు ఎరుగుదురు.

వ్యాఖ్య : ఇది గౌడీయారీతికి లక్షణము. ఇందు ఉద్భటములైన సమాసపదము లుండవలయును. ఉద్భటము లనుటచేత సుదీర్ఘములును సుకుమారేతరములునైన సమాసము లని భావము. అట్లుండుటయే ఓజః కాంతి గుణముల కనుగుణము.

[ఆవంతికారీతి లక్షణము]

32. అంతరాలే తు పాంచాలీ వైదర్భ్యో ర్యావతిష్ఠతే
సావంతికా సమస్తైః స్యాద్ద్విత్రై స్త్రిచతురైః పదైః.

అర్థము : పాంచాలీ వైదర్భీరీతులకు నడుమ నుండునది ఆవంతిక. ఇది రెండు మూడు పదముల సమాసములవల్ల గాని, మూడు నాలుగుపదముల సమాసములవల్ల గాని యేర్పడును.

వ్యాఖ్య : ఇది ఆవంతికా రీతికి లక్షణము. ఇందు వైదర్భీలక్షణములు కొంతవరకు పాంచాలీ లక్షణములు కొంతవరకు నుండును. వైదర్భీరీతిలో సమాసములే యుండరాదు. పాంచాలిలో ఐదారుపదముల నిడివి గల సమాసము లుండవచ్చును. ఆవంతిక యందు రెండు మూడు పదములో మూడు నాలుగు పదములో కలిసిన సమాసము లుండవచ్చును. అనగా అల్పప్రమాణముగల సమాసములతో నేర్పడునది ఆవంతిక యని భావము.

[లాటీయారీతి లక్షణము]

33. సమస్తరీతి వ్యామిశ్రా లాటీయా రీతి రుచ్యతే.
అర్థము : రీతులన్నింటితోను కలిసియుండునది లాటీయారీతి యనబడును.

వ్యాఖ్య : ఇది లాటీయారీతికి లక్షణము. పైని చెప్పిన రీతులలో వైదర్భి, పాంచాలి, గౌడీయ అనునవి శుద్ధరీతులు. ఆమూడురీతులను వ్యామిశ్రణము చెందుట చేత ఏర్పడునది లాటీయారీతి. ఒకే వాక్యము (వాక్యసముదాయము) నందు కొంత వైదర్భీ లక్షణము, కొంత పాంచాలీలక్షణము, కొంత గౌడీయాలక్షణము నున్నచో దానిని లాటీయారీతి యని యనవలయును.

[ మా గ ధీ రీ తి ల క్ష ణ ము ]

పూర్వరీతే రనిర్వాహే ఖండరీతి స్తు మాగధీ.

అర్థము పూర్వరీతి నిర్వహింపబడక యేర్పడిన ఖండరీతి మాగధి.

వ్యాఖ్య : ఇది మాగధీరీతి లక్షణము. ఏదోరీతిని మొదలుపెట్టి తుదివరకు నిర్వహింపక నడుమ విడిచి పెట్టినయెడల ఖండరీతి యగును. అదియే మాగధీ రీతి. లాటీయయందుకూడ మొదట పెట్టిన రీతినే చివరంట నిర్వహించుట జరుగదు. కొంతవరకు ఒకరీతిని పాటించి దానిని విడుచుటయే జరుగును. అయినప్పటికి ఆ విడిచినచోటునుండి మరొకరీతి మొదలగును. ఇట్లు స్పష్టముగా రెండు మూడు రీతులు కలిసిపోయినప్పుడు, లాటీయారీతి యేర్పడును. మాగధియందు తొలుత మొదటపెట్టిన రీతి ఖండితమగుటయేకాని యేరీతియు దానిని స్పష్టముగా అనుసరింపదు. అప్పుడు మాత్రమే అది మాగధీ రీతిగా పరిగణింపబడును.

[ వై ద ర్భి - ఉ దా హ ర ణ ము ]

తాసు వైదర్భి యథా—

'మనీషితాః సన్తి గృహేషు దేవతా
స్తపః క్వ వత్సే క్వ చ తావకం వపుః
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః' 25

సేయ మసమ స్తపదా సమగ్రశ్లేషాదిగుణవతీ వైదర్భీరీతిః.

అర్థము : పై రీతులయందు వైదర్భికి ఉదాహరణ. ఇంటియందు కోరిన దేవతలు కలరు. వత్సా! తప మెక్కడ? నీ వపు వెక్కడ? శిరీషపుష్పము పేలవమైన భ్రమరపాదమును సహింపగల్గునుగాని పక్షిపాదమును సహింపలేదు.

ఇది సమానపదములు లేనిదియు శ్లేషాది సర్వగుణములు కలదియునైన వైదర్భీరీతి.

వ్యాఖ్య: ఉదాహృతపద్యము కాళిదాసుని కుమారసంభవమునుండి గ్రహింప బడినది. ఈ పద్యమునందు 'శిరీషపుష్ప' మన్న దొక్కటియే సమస్తపదము. తక్కిన వన్నియు వ్యస్త పదములే. కావున 'అసమస్తపద' యను లక్షణము సరి పోయినది. ఇంత శ్లేషాది గుణవత్త్వమును చూతము. 'సంవిధానే సుసూత్రతా' అన్నది శ్లేష యన్న అర్థగుణమునకు లక్షణము. చెప్పెడి విషయమును యుక్తి యుక్తముగా చెప్పుట యిచ్చటి సుసూత్రత. దేవతా ప్రీతికొరకో అభీష్టమును సాధించుకొరకో తపస్సు చేయవలయును. ఎటులైనను మనస్సునకు నచ్చిన దేవ తలు ఇంటియందే యున్నారు. అట్టి యెడల అడవులకు పోవలసిన యవసరము లేదు. ఇక పార్వతి శరీరము సుకుమారము; తపస్సు తీవ్రము. తీవ్రమగు తపస్సును సుకుమారమగు శరీరము భరించుట కష్టము. మొదటి యుక్తి వేరు. దానిచేత పల్లవితమైనదే రెండవయుక్తి. ఆ రెండవయుక్తికి సమర్థనము తరువాతి రెండు పాదములును. ఇట్లు యుక్తియుక్తముగా చెప్పుట శ్లేషగుణము. 'పదం సహేత....' మొదలయిన ప్రసంగము ప్రసాదగుణమునకు లక్ష్యము. ఎచ్చటను నిష్ఠురాక్షర ముల ప్రయోగము లేకుండుటచేత సౌకుమార్యము. నిషేధమునందును ప్రసన్నతను వీడకుండుట మాధుర్యము. ఇట్లు అనేక గుణసమంచితమగుటచేత ఇది వైదర్భీరీతి.

## [ పాంచాలి - ఉదాహరణము ]

పాంచాలీ యథా-

'గాత్రావిఘూర్ణదలితాంగద జర్జరాణాం
గండస్థలీ లులితకుండల తాడితానామ్
క్షోభస్ఫుటన్ముకుట కోటి విఘట్టితానాం
నాదోఽభవజ్ఝణఝణాముఖరో మణీనామ్' 26

సేయ మోజః కాంత్యభావా దాశ్లిష్టశ్లథ పురాణచ్ఛాయా మాధుర్య సౌకుమార్యవతీ సమస్తపంచపదా పాంచాలీరీతిః.

**అర్థము** : పాంచాలీరీతికి ఉదాహరణము. శరీరముల ఘూర్ణనచేత దళితము లయిన బాహుపురులయందలి జర్జరిత మణులయొక్కయు, గండస్థలులయందు వ్రేలు

మున్న కుండలములందలి తాడిత మణులయొక్క, క్షోభస్ఫుటత్కిరీట కోటియందలి విఘట్టిత మణులయొక్కయు ఝణఝణమను ప్రతిధ్వనులతోడి నాదము పుట్టెను.

ఇది ఓజః కాంతి గుణములు లేకుండుటవల్ల శైథిల్యమును పురాణచ్ఛాయను మాధుర్యమును సౌకుమార్యమును కలిగి, ఐదారు సమస్తపదములతోనున్న పాంచాలీ రీతి.

వ్యాఖ్య : ఉదాహరణ పద్యమునందు మొదటి మూడు పాదములందును మూడు వ్యస్తపదములును ఒక సమస్తపదమును గలవు. ఇట్లుండుటచేత 'సమస్త పంచష పద' అను లక్షణమునకు సరిపోయినది.

'ఓజః సమాస భూయస్త్వమ్' అను లక్షణమునుబట్టి సుదీర్ఘ సమాసములు గలది ఓజోగుణము. ఇచ్చటి సమాసములు పరిమితదైర్ఘ్యము గలవి. కావుననే యిచ్చట ఓజోగుణము లేదు. 'కాంతి' యనగా 'బంధస్య ఉజ్జ్వలత్వమ్'. ఉజ్జ్వలత్వ మనగా సాజాత్యముగల వర్ణముం సమీపావృత్తిని, శబ్దప్రయోగములోని నవ్యతను గ్రహింపవలసియుండును. అట్టిది యీ పద్యమునందు గోచరము కాదు. కావుననే కాంతిగుణముకూడ ఇచ్చటలేదు. ఏపాదమున కాపాదమే స్పష్టముగా తెగిపోవుటచేత అశ్లిష్టశ్లథత్వము కానవచ్చుచున్నది. నిష్ఠురములైన యక్షరములు లేకుండుటచేత సౌకుమార్య గుణమును, పృథక్పదత్వముచేత మాధుర్యమును వెలయుచున్నవి. కావుననే ప్రకృతపద్యము పాంచాలీరీతికి ఉదాహరణమైనది.

## [ గౌడీయ - ఉదాహరణము ]

గౌడీయా యథా-

'యస్యావస్కంద లీలావలిత బలపరిస్పందఖర్వీ కృతోర్వీ
సంరంభోత్తంభనా యోన్నమితభుజనమస్కంధరాసంధి రాసీత్
శేషో విస్ఫారిఫుల్లస్ఫుట పృథులఫణాఫూత్కృతాగ్ని స్ఫులింగ
స్ఫూర్జత్సందోహ సందేహిత వికటశిఖామండలీ రత్నఖండః' 27

సేయ మోజఃకాంతిమత్తీ సమస్తోద్భటభూరిపదా చ గౌడీయా రీతిః,

అర్థము : గౌడీయా రీతికి ఉదాహరణము. ఎవనియొక్క దండయాత్ర యందు విలాసముతో కదలిన సైన్యములయొక్క కదలికచేత మొక్కవోయిన భూమియొక్క సంరంభము నాపుటకై ఎత్తబడిన బరువుచేత వంగిన శిరసుల నడుమ సంధిలేనివాడైన శేషుడు విశాలములై వికసించినవై ప్రకటములై పెద్దవైన పడగల చేత పూత్కృతములయిన అగ్నికణముల మెరపుల సమూహమువల్ల సందేహింప బడిన వికటజ్వాలా సమూహముగల రత్నఖండముగా నయ్యెను.

[పద్యమునందు తదర్థకములేదు. తరువాతి పద్యములోనుండి యుండును]

ఇది ఓజస్సును కాంతిని గలదియు, సమసించిన సముద్ధత సుదీర్ఘ పదము లను గలదియు నైన గౌడీయారీతి.

వ్యాఖ్య : ఉదాహృత పద్యము సముద్దండశైలీ సమన్వితము. మొత్తము పద్యమంతయు ఒక్కటే సమాసమైనట్లు తోచును. నిజమునకు 'యస్య' యని ప్రారంభముననే వ్యస్తపదము కలదు. 'అపస్కంధ....నాయ' అన్నంతవరకు నొక సమాసము; ఇరువదియేడక్షరముల నిడివి యున్నది. 'ఉన్నమితభరనమత్కం ధరా సంధిః' అనునది పదుమూడక్షరముల నిడివిగల సమాసము. 'ఆసీత్' క్రియా పదము. 'శేషః' కర్తృపదము. 'విస్ఫార.... రత్నఖండః' అన్నది నలువది యక్ష రముల నిడివి గల సమాసము. ఇంతటి సుదీర్ఘ సమాసములను, ఉద్ధతములైన వర్ణముల కూర్పును కలిగియుండుటచేతనే యిది గౌడీయారీతికి లక్ష్యమైనది. సమాస భూయస్త్వమువల్ల ఓజోగుణమును బంధౌజ్జ్వల్యముచేత కాంతి గుణమును నెలకొని యున్నవనుట స్పష్టము.

[ ఆవంతిక - ఉదాహరణము ]

ఆవంతికా యథా—

'ఏతాని నిస్సహతనో రసమంజసాని
శూన్యం మనః పిశునయంతి పదాని తస్యాః
ఏతే చ మార్గతరవః ప్రథయంతి తాప
మాలంబితోజ్ఝిత పరిగ్లపితైః ప్రవాలైః' 33

సేయం సమస్తద్విత్రి* చతుష్పదా వైదర్భీపాంచాల్యో రంత రాల వర్తిన్యావంతికా నామరీతిః.

అర్థము : ఆవంతికారీతికి ఉదాహరణము. నిస్పృహ శరీరయైన ఆమె యొక్క ఈ అసమంజసములైన పదములు శూన్యమనస్సును వెల్లడించుచున్నవి. వ్రేలాడుచున్న రాలిన వాడిన ప్రవాళములచేత ఈ మార్గతరువులు తాపమును ప్రకటించుచున్నవి.

ఇది రెండు మూడు నాలుగు సమస్తపదములు గలిగి వైదర్భీపాంచాలులకు నడుమ వర్తిల్లుచున్న ఆవంతిక యను పేరుగల రీతి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యమునందు 'ఏతాని, శూన్యం, మనః' మున్నగు వ్యస్తపదములే అధికముగా కలవు. ఇట్లుండుట వైదర్భీలక్షణము. 'నిస్పృహతనోః' 'అసమంజసాని' 'మార్గతరవః' అన్నవి రెండేసి పదముల నిడివి గల సమాసములు. 'ఆలంబి...పరిగ్లపితైః' మూడు పదముల సమాసము. ఇట్లుండుట పాంచాలీరీతి లక్షణము. కావున రెండు రీతులను కలిగియుండుటచేత, అనగా రెండు రీతులకు మధ్యస్థముగా నుండుటచేత ఇది ఆవంతికారీతియైనది.

[ లాటీయ - ఉదాహరణము ]

లాటీయా యథా-

'అయ ముదయతి ముద్రాభంజనః పద్మినీనా
ముదయగిరివనాలీ బాల మందారపుష్పమ్
విరహ విధురకోక ద్వంద్వబంధు ర్విభిందన్
కుపిత కపికపోల క్రోడతామ్ర స్తమాంసి' 29

సేయం సమ స్తరీతిమిశ్రా లాటీయా నామ రీతిః.

అర్థము : లాటీయారీతికి ఉదాహరణము పద్మినులకు ముద్రాభంజనుడును, ఉదయగిరివనమునకు బాలమందార పుష్పమును, విరహముచేత విడిపోయిన చక్ర

* ఛతుర్థపదా — పాఠాంతరము.

వాకదంపతులకు బంధువును, కోపించిన కపికపోలమువలె ఎఱ్ఱనివాడు నైన యీతడు చీకట్లను ఛేదించుచు ఉదయించుచున్నాడు.

ఇది సమస్తరీతులను మిశ్రణము చెందిన లాటీయ యనుపేరు గలరీతి.

వ్యాఖ్య : ఉదాహరణ పద్యమునందు 'అయమ్' 'ఉదయతి' మొదలయిన వ్యస్తపదములు గలవు. ఇవి వైదర్భీరీతిని సూచించుచున్నవి. 'ముద్రాభంజనః' రెండుపదముల సమాసము. ఇది ఆవంతికారీతిని సూచించుచున్నది. 'ఉదయ.... పుష్పమ్' అన్న సమాసమునందు ఐదు పదములు గలవు. 'విరహ....బంధుః' కూడ ఐదు పదముల సమాసమే. 'కుపిత .. తామ్రః' ఇదియు నట్టిదే. ఇవి పాంచాలీరీతిని వ్యక్తముచేయుచున్నవి. మొత్తముమీద బంధము గాఢముగా ఉజ్జ్వలముగా నుండుటచే ఓజః కాంతి గుణములు కలిగి గౌడీయారీతిని సూచించుచున్నవి. ఇట్లు సర్వరీతి సమ్మిశ్రణముచేత ఇది లాటీయ యగుచున్నది.

[ మాగధి - ఉదాహరణము ]

మాగధీ యథా—

'కరికబలన శిష్టైః శాఖి శాఖాగ్రపత్రై
రరుణ సరణయో౽మీ సర్వతో భీషయన్తే
చలిత శబరసేనా దత్తగో శృంగ చండ
ధ్వని చకిత వరాహ వ్యాకులా వింధ్యపాదాః' 30

సేయ మారబ్ధరీతే రనిర్వాహాత్ ఖండరీతి ర్మాగధీ.

అర్థము : మాగధీరీతికి ఉదాహరణము. ఏనుగులు కబళింపగా మిగిలిన వృక్షశాఖాగ్రపత్రములచేత, సాగివెళ్ళిన శబరసేనలు కొమ్ముబూరలతో చేసిన చండ ధ్వనులకు భయము నొందిన వరాహములచేత వ్యాకులములయిన వింధ్యపర్వత పాదదేశములు, సూర్యకాంతి మార్గములు కలవై భయపెట్టుచున్నవి.

ఇది ఆరంభింపబడిన రీతిని తుదముట్ట నిర్వహింపక పోవుటచేత ఖండరీతి. కావున మాగధి.

వ్యాఖ్య : ఉదాహరణపద్యము 'కరికబలనశిష్టైః' 'శాఖిశాఖాగ్రపత్త్రైః' మున్నగు సమాసములతో ప్రారంభమైనది. మొదటి సమాసమునందు మూడు పదములు గలవు. రెండవ సమాసమునందు నాలుగు పదములు గలవు. కావున ఆవంతికారీతి యని నిర్ణయింపవచ్చును. 'శిష్టైః' 'పత్త్రైః' అను తృతీయావిభక్త్యంతముకూడ శబ్దగుణమైనరీతి నిర్వహణమునకు తోడ్పడుచున్నది. కాని యిది యింతటితో ఆగిపోయినది. రెండవపాదమునందు రెండు పదముల సమాస మొకటియు, వ్యస్తపదములు మూడు నున్నవి. మూడు నాలుగు పాదములందు సుదీర్ఘ సమాస మొకటియు, రెండు పదముల సమాసమొకటియు నున్నవి. ఒకరీతి ముగియగా రెండవ రీతిని మొదలుపెట్టి నిర్వహించుట యిందు లేదు. కావుననే ఖండరీతిగా గ్రహియించి దీనిని మాగధీరీతిగా పరిగణించుట జరుగుచున్నది.

## వృత్త్యలంకారము

34. యా వికాసేఽథ విక్షేపే సంకోచే విస్తరే తథా
చేతసో వర్తయిత్రీ స్యాత్సా వృత్తిః సాపి షడ్విధా.

**అర్థము** : మనస్సుయొక్క వికాసమునందును, విక్షేపమునందును, సంకోచమునందును, విస్తారమునందును వర్తింపజేయునది వృత్తి. ఇదియు ఆరు విధములు.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో నాలుగవది వృత్తి. శబ్దమునలంకరించుటచేతనే శబ్దాలంకార మన్న పేరు చెల్లుచున్నది. ఇంతవరకు చెప్పుకొన్న జాతి, గతి, రీతి యన్నవి ముఖ్యముగా శబ్దము నాశ్రయించుకొనియే యున్నట్లు గమనించితిమి.

వృత్తి విషయమున భోజదేవుడే ముందుగా మనలను హెచ్చరించుట కానవచ్చుచున్నది. మనస్సునకు నాలుగు స్థితులు కలవు. అవి 1. వికాసము 2. విక్షేపము 3. సంకోచము 4. విస్తారము — అనునవి. సత్త్వావిర్భావము వికాసము. సత్త్వరజస్తమో గుణములలో రజస్తమములు అపక్రాంతములై మనస్సునందు సత్త్వగుణము ఆవిర్భావము నొందుటయే చిత్తవికాసము. ఈ వికాసమునకు రౌద్రాదుల వలన చ్యుతి కలుగుటయే చిత్తవిక్షేపము. ఇది రజోగుణ సంసర్గముచేత కలుగును. సత్త్వమును తమస్సును అపక్రాంతముచేసి కేవలము రజోగుణము ప్రతిష్ఠ నొందు

నపుడు చిత్తవిస్తారము కలుగును. సత్త్వరజోగుణము లపక్రాంతములై తమో గుణము ప్రతిష్ఠ నొందినపుడు చిత్తసంకోచము కలుగును. చిత్తవికాసము, చిత్త విక్షేపము, చిత్తవిస్తారము, చిత్తసంకోచము - అనువానియందు సహృదయులను ప్రవర్తింపజేయునదియే వృత్తి యని భోజదేవుని నిష్కర్ష. పాఠకులకు వృత్తులు చిత్త వికాసాదులను కలుగజేయునని తాత్పర్యము.

శృంగార హాస్యములు చిత్తవికాసమును, రౌద్రకరుణములు చిత్త విక్షేపమును, వీరాద్భుతములు చిత్తవిస్తృతిని, బీభత్సభయానకములు చిత్త సంకోచమును కలుగ జేయును ఆయారసముల కాయాచిత్తస్థితులు ఆశ్రయములు. వృత్తులుకూడ ఆయాచిత్త స్థితులయందు ప్రవర్తింపజేయునని చెప్పుటచేత వృత్తులు రసధర్మములని చెప్పినట్లే యైనది. ఒక పంక ఇవి శబ్దముల నలంకరించుచు, పురోక్తవంత్ర గుణ సంఘటనాది సంసర్గముచేత రసపోషకములై ప్రవర్తించును.

## [వృత్తులు – లక్షణములు]

35. కైశిక్యారభటీ చైవ భారతీ సాత్త్వతీ పరా
మధ్యమారభటీ చైవ తథా మధ్యమకైశికీ.

అర్థము : కైశికి, ఆరభటి, భారతి, సాత్త్వతి, మధ్యమారభటి, మధ్యమ కైశికి – అని వృత్తి ఆరు విధములు.

36. సుకుమారార్థ సందర్భా కైశికీ తాను కథ్యతే
యా తు ప్రౌఢార్థ సందర్భా వృత్తి రారభటీతి సా.

అర్థము : సుకుమారమైన అర్థమును, సుకుమారమైన సందర్భము (పద రచనము)ను కలది కైశికీవృత్తి. ప్రౌఢమైన అర్థమును, ప్రౌఢమైన సందర్భమును గలది ఆరభటీ వృత్తి.

37. కోమలప్రౌఢసందర్భా కోమలార్థాథ భారతీ
ప్రౌఢార్థా కోమలప్రౌఢ సందర్భా సాత్త్వతీ విదుః.

అర్థము : సుకుమారమైన అర్థము కలిగి కోమల ప్రౌఢమైన సందర్భము కలది భారతీవృత్తి. ప్రౌఢమైన అర్థము కలిగి కోమలప్రౌఢమైన సందర్భము కలది సాత్వతీవృత్తి.

38. కోమలే ప్రౌఢసందర్భా త్వర్థే మధ్యమకైశికీ
ప్రౌఢార్థా కోమలే బంధే మధ్యమారభటీష్యతే.

అర్థము : సుకుమారమైన అర్థము కలిగి ప్రౌఢమైన సందర్భము కలది మధ్యమకైశికీవృత్తి. ప్రౌఢమైన అర్థముకలిగి సుకుమారమైన సందర్భము కలది మధ్యమారభటీవృత్తి.

[ కైశికీవృత్తి - ఉదాహరణము ]

తత్ర కైశికీ యథా—

'శశిరుచిషు దలేషు నాగవల్ల్యా
విచకిలదామని చందనే చ హృద్యే
కువలయిని పురాణసీధుపాత్రే
తరలదృశా మపతన్ దృశః ప్రియే చ' 31

సేయ మర్థస్య చ సందర్భస్య చ సౌకుమార్యాత్ కైశికీ నామ వృత్తిః.

అర్థము : కైశికీవృత్తికి ఉదాహరణము. చంద్రకాంతులయందును, తమలపాకులయందును, మల్లికాహారమునందును, మనోహరమైన చందనమందును, కువలయముల సమూహమునందును, ప్రాచీనమద్యపాత్రమునందును, ప్రియునియందును తరళేక్షణల చూపులు పడినవి.

ఇది అర్థముయొక్కయు సందర్భముయొక్కయు సౌకుమార్యమువల్ల కైశికి యను వృత్తి.

వ్యాఖ్య : శృంగారమున కుద్దీపకములయిన వెన్నెల, మల్లికామాల, చందనము, కలువలసమూహము, మద్యపాత్ర మున్నగునవి వర్ణితములు. శృంగారమున కాలంబన విభావమయిన ప్రియుడును పేర్కొనబడెను. తరళేక్షణలచూపులు ఆయా పదార్థములమీద పడెననుట సుకుమారార్థము.

ఇట్లే పదరచనమునందు నిష్ఠురాక్షరముల ప్రయోగము లేదు. కావున సౌకుమార్య మన్న శబ్దగుణము వెలయుచున్నది. ఇట్లు సుకుమారమైన యర్థమును

సుకుమారమైన రచనాబంధమును కలిగి కైశికీవృత్తి యగుచున్నది. ఇది యిచ్చట శృంగారమునకు పుష్టిని గూర్చుచున్నది.

[ ఆరభటీవృత్తి - ఉదాహరణము ]

ఆరభటీ యథా-

'యో యః శస్త్రం బిభర్తి స్వభుజగురుమదః పాండవీనాం చమూనాం
యో యః పాంచాలగోత్రే శిశురధికవయా గర్భశయ్యాం గతో వా
యో యస్తత్కర్మసాక్షీ చరతి మయి రణే యశ్చ యశ్చ ప్రతీపః
క్రోధాంధస్తస్య తస్య స్వయమిహ జగతామంతకస్యాంతకోఽహమ్'

సేయం ప్రౌఢార్థ సందర్భారభటీ నామ వృత్తిః.

**అర్థము :** ఆరభటీవృత్తికి ఉదాహరణము. పాండవ సైన్యములందు ఎవడెవడు స్వీయభుజాబలాధిక్యమదముచేత శస్త్రము పట్టునో, పాంచాలవంశమునందు గర్భశయ్యాగతుడు కాని అధికవయస్కుడు కాని యేయేశిశువు కలడో, నేను రణమునందు సంచరించుచుండగా ఆయా కర్మలకు సాక్షియై యెవడెవడుండునో, యెవడెవడు నాకు విరోధియో, ఆ యెల్లవానికిని, స్వయముగా జగదంతకునకును క్రోధాంధుడనైన నేను అంతకుడ నయ్యెదను.

ఇది ప్రౌఢమైన అర్థమును సందర్భమును కలిగియుండుటచేత ఆరభటీ యనెడి వృత్తి.

వ్యాఖ్య : ఉదాహరణశ్లోకము భట్టనారాయణుడు రచించిన వేణీసంహారము నుండి గ్రహింపబడినది. ఇందు ఓజోగుణము కలదు. సమాసభూయిష్ఠమై యుండుట ఓజస్సు. దీప్తార్థ సమన్వితమై గాఢమైన బంధమును కలిగియున్నది. రణోత్సాహ సముద్దీప్తుడైన అశ్వత్థామ యిచ్చట వక్త. వీరరౌద్రముల కనుగుణమైన ప్రౌఢార్థములు కూర్పబడినవి. సంయుక్తాక్షరముల ప్రాబల్యము, నిష్ఠురాక్షరముల పునః పునరావృత్తి, శైథిల్యములేని రచనాబంధము - ఇవన్నియు అర్థానుగుణమైన బంధప్రౌఢిని వ్యక్తముచేయుచున్నవి.

ఇట్లు అర్థమునందును, బంధమునందునుగల గాఢత్వమునుబట్టి యిది ఆరభటీ వృత్తికి ఉదాహరణమైనది.

[ భారతీవృత్తి - ఉదాహరణము ]

భారతీ యథా -

'ఉత్తిష్ఠన్త్యా రతాంతే భర మురగపతౌ పాణినైకేన కృత్వా
ధృత్వా చాన్యేన వాసో విగలితకబరీభార మంసే వహంత్యాః
భూయ స్తత్కాలకాంతి ద్విగుణిత సురతప్రీతినా శౌరిణా వః
శయ్యా మాలింగ్య నీతం వపు రలసలసద్బాహు లక్ష్మ్యాః పునాతు' 33

సేయ మతిసుకుమారార్థే నాతి సుకుమార సందర్భా భారతీ నామ వృత్తిః.

అర్థము : భారతీవృత్తికి ఉదాహరణము. రతాంతమునందు శేషునియందు ఒకచేతిపై భారమును మోపి, మరొకచేతితో వస్త్రమును పట్టుకొని, విడివడిన కబరీ భారమును మూపులపై మోయుచు లేచుచున్న లక్ష్మీదేవిని అప్పటి కాంతిచేత ద్విగుణితసురతప్రీతికలవాడైన విష్ణువు మరల కౌగిలించుకొని శయ్యకు తార్చెను. అట్టి లక్ష్మీదేవియొక్క అలసలసద్బాహువు మిమ్ములను పవిత్రీకరించును గాక!

ఇది అతి సుకుమారమైన అర్థమునందు అనతిసుకుమార సందర్భముగల భారతి యనెడి వృత్తి.

వ్యాఖ్య : ఉదాహృతపద్యము భట్టనారాయణుడు రచించిన వేణీసంహారము నుండి గ్రహింపబడినది.

ఇచ్చటి రసము సంభోగశృంగారము. ఇది చిత్తవికాసకరము; చిత్తవికాస జన్యము. మిక్కిలి సుకుమారము హృద్యమునైన విషయము. ఇట్టియెడల బంధము కూడ సుకుమారముగానే యున్నయెడల కైశికీవృత్తి యయ్యెడిది. ఇచ్చటి బంధము సుకుమారముగా లేదు. కఠోరవర్ణములును సంయుక్తవర్ణములును ప్రచురముగా ప్రయుక్తములయినవి. 'విగలిత కబరీభారమ్' 'తత్కాలకాంతి ద్విగుణిత సురత ప్రీతినా' 'అలసలసద్బాహు' మొదలయిన సమాసములుకూడ నున్నవి. అట్లని ఓజో గుణప్రధానముగా ఉద్దండముగా లేదు. కావుననే దీనిని కోమల ప్రౌఢబంధముగా పేర్కొనుట జరిగినది. కోమల ప్రౌఢ మధ్యస్థమైన బంధమును కలిగి,

సుకుమార (కోమల) మైన అర్థమును కలదగుటచే ఇది భారతీవృత్తికి ఉదాహరణ మైనది.

[ సాత్త్వతీవృత్తి - ఉదాహరణము ]

సాత్త్వతీ యథా-

'వంద్యౌ ద్వావపి తా వనార్యచరితప్రాప్తప్రతాపోదయౌ
భీమో భీమపరాక్రమః స చ మునిర్భాస్వత్కుఠారాయుధః
ఏకే నామృతవద్విదార్య కరజైః పీతాన్యసృఞ్జి ద్విషో
మన్యేనాపి హతాహితాస్రసరసి స్నాతం క్రుధః శాంతయే.'
సేయం ప్రౌఢార్థా నాతిప్రౌఢసందర్భా సాత్త్వతీనామవృత్తిః.

అర్థము : సాత్త్వతీవృత్తికి ఉదాహరణము. భీమపరాక్రముడైన భీముడును కుఠారాయుధుడైన ఆ మునియు (పరశురాముడు)ను వందనీయులే. అయినప్పటికిని అనార్యచరిత ప్రాప్తప్రతాపోదయులు. ఒకడు చేతిగోళ్ళతో చీల్చి శత్రువుల రక్తము నమృతమువలె త్రాగెను. ఇంకొకడు హతులైన శత్రువుల రక్తపు మడుగులో క్రోధశాంతికొరకై స్నానముచేసెను.

ఇది ప్రౌఢార్థముకలిగి అనతి ప్రౌఢసందర్భముగల సాత్త్వతియనెడి వృత్తి.

వ్యాఖ్య : ఇచ్చట రౌద్రరసము వర్ణితమైనది. ఇది చిత్తవిక్షోభజన్యము; చిత్తవిక్షోభకరము. అందువలన నిది సౌకుమార్యమునకు విరుద్ధము. శత్రువులను గోళ్ళతో చీల్చుట, రక్తము త్రాగుట, క్రోధశాంతికై రక్తసరసులో స్నానమాడుట దుస్సహములు. కావుననే అనార్యములు. ఇటువంటి దుస్సహమైన విషయమును ప్రౌఢబంధములో చెప్పినయెడల ఆరభటీవృత్తి యయ్యెడిది. ప్రకృత పద్యమునందు అర్థములోనున్న ఉద్దండత రచనాబంధమునందు లేదు. 'వంద్యౌ, ద్వౌ, అపి, భీమః, స, చ, ఏకేన, విదార్య, కరజైః' మొదలయిన వ్యస్తపదములు సమృద్ధముగా నున్నవి. రేఫము, హకారము మొదలయిన వర్ణములు సౌకుమార్యవ్యంజకములు. ఈ విధముగా ఇంతవరకు కోమలబంధమే. కాని 'ద్వావపి' 'తా వనార్య' మొదలయిన విధముగా సంధివశమున నేర్పడినరూపములు అఖండములవలె భాసించుటచేతను, 'మునిర్భాస్వత్కుఠారాయుధ' 'అమృతవద్విదార్య' మొదలయిన విధ

ముగా హల్లులు సన్నికర్షము నొందుటచేతను బంధమున కొక ప్రౌఢి కలుగు చున్నది. ఏ పాదమున కాపాదమే విరుగుచుండుటచేత బంధమున నొక శైథిల్యము చోటుచేసికొన్నది. ఇట్లు సౌకుమార్యము కొంత ప్రౌఢి కొంత యుండుటచేత కోమల ప్రౌఢసందర్భముగలదై ఇది సాత్త్వతీ వృత్తికి ఉదాహరణమైనది.

[ మధ్యమ కైశికీవృత్తి - ఉదాహరణము ]

మధ్యమకైశికీ యథా-

'కిం ద్వారి దైవహతకే సహకారేణ
సంవర్ధితేన విషపాదప ఏష పాపః
అస్మిన్మనాగపి వికాసవికారభాజి
భీమా భవన్తి మదనజ్వర సన్నిపాతాః' 35

సేయం సుకుమారేఽర్థే ప్రౌఢసందర్భా మధ్యమకైశికీ నామ వృత్తిః.

అర్థము: మధ్యమకైశికీవృత్తికి ఉదాహరణము. ఓసీ! దురదృష్టవంతురాలా! ద్వారమునం దీసహకార వృక్షము నేల పెంచితివి? ఇది పాపము; విషవృక్షము. వికాసవికారములుగల దీనియందు అల్పములేయైనను మదనజ్వర సన్నిపాతములు భయంకరములుగా నగును.

ఇది సుకుమారమైన అర్థమునందు ప్రౌఢరచనాబంధముగల మధ్యమకైశికి యనెడి వృత్తి.

వ్యాఖ్య : ఇచ్చటి రసము విప్రలంభశృంగారము. ప్రియునితో నెడబాటు పొందిన నాయిక యొకతె సహకారవృక్షమును పెంచినది. ఉద్దీపన విభావములలో సహకార మొకటి. దుస్సహమైన విరహతాపమును మరింత దుర్భరము చేయుట కొరకే తియ్యమామిడిచెట్టు సహకరించును. ఈ విషయము నెరిగిన వృద్ధవయస్క నాయికను మందలించుచున్నది. ఇచ్చట మందలింపునకు కాక విప్రలంభమునకే ప్రాధాన్యము. కావుననే అర్థమునందు సౌకుమార్యము గలదనుట.

ఈ అర్థమును వెల్లడించుట భంగ్యంతరముగానున్నది కాని సూటిగా లేదు. పైగా వృక్షమునకు సంబంధించిన సర్వవిశేషణములును పురుషవ్యక్తిని స్ఫురింప జేయుచున్నవి. ఇట్లు అర్థాంతర సంక్రమణముచేత అర్థకల్పనమునందు ప్రౌఢి యేర్పడుచున్నది. 'వికాసవికారభాజి' 'మదనజ్వర సన్నిపాతాః' అన్నవి రెండు మాత్రమే మూడుపదముల సమాసములు. కావున పదరచనాబంధమునందు ప్రౌఢి యున్నదనుట సమంజసము కాదు. సుకుమారమైన భావమును కవి తనకల్పనతో భంగ్యంతరమున వెల్లడించుటచేత కల్పనప్రౌఢి యిచ్చట నెలకొన్నది. ఇట్లు సుకుమారార్థము, ప్రౌఢకల్పనము నుండుటచేతనే యిది మధ్యమకైశికీవృత్తికి ఉదాహరణ మైనది.

## [ మధ్యమారభటీవృత్తి - ఉదాహరణము ]

మధ్యమారభటీ యథా-

'త్వాం నాగరాజ బహుమస్య నితంబభాగం
భోగేన గాఢ ముపవేష్టయ మందరాద్రేః
సోఢావిషహ్య వృషవాహన యోగలీలా
పర్యంకబంధనవిధే స్తవ కోఽతిభారః' 36

సేయం ప్రౌఢేఽర్థే సుకుమారసందర్భా మధ్యమారభటీనామ వృత్తిః.

అర్థము : మధ్యమారభటీవృత్తికి ఉదాహరణము. ఓ నాగరాజా! ఈ మందరాద్రియొక్క నితంబభాగము నధికముగా గట్టిగా నీభోగముతో చుట్టుకొనుము. సహింపశక్యముకాని వృషవాహనుని (ఈశ్వరుని) యోగలీలాపర్యంక బంధన విధికి సమర్థుడవు. నీకు అలవికాని భారమేమున్నది !

ఇది ప్రౌఢమైన అర్థమునందు సుకుమార సందర్భముగల మధ్యమారభటి యనెడి వృత్తి.

వ్యాఖ్య : ప్రకృతపద్యము సముద్రమథన విషయమును వర్ణించుచున్నది. అది అసామాన్య కార్యము. పాలసముద్రమే దధిభాండమై, మందరాద్రి కవ్వమై,

వాసుకి కష్టమునకు కట్టుబ్రాడై, దేవదానవులు చిలికెడువారై, అమృతలబ్ధి ప్రయోజనముగా ఆ మహాకార్యము సాగినది. తద్వర్ణన సందర్భసంబంధముచేత తదర్థము నుద్ధతార్థముగానే పరిగణింప వలయును. నాగరాజు వృషవాహనుని యోగలీలా సందర్భమున పర్యంకబంధముగా ఉపయోగించుట ! అది అత్యంత దుష్కరము. సముద్రమథన సమయమున మందరాద్రిని గట్టిగా చుట్టుకొని యుండుటయు దుష్కరమే. కాని కైముత్యన్యాయమున శివపర్యంకబంధనకార్యము నిర్వహించెడి సమర్థునకు మందరాద్రి పరివేష్టనము సులభసాధ్యమే. అందువల్లనే 'తవ కో2తిభారః' అని యనుట. ఉద్ధతమైన విషయమును వర్ణించుటచేత ఇది ప్రౌఢార్థము.

మొదటి రెండు పాదములందును రచనాబంధము పరమసుకుమారముగా నున్నది. మూడవపాదమునుండి 'అవిషహ్య .. బంధనవిధేః' అన్నంతవరకు సుదీర్ఘ సమాసము సాగినది. అయినను హ, ర, య, ల ప్రభృతివర్ణముల ప్రయోగము చేత లాలిత్యమే నెలకొని యున్నదనవలయును.

ఇట్లు ప్రౌఢమైన విషయమును అప్రౌఢమైన పదరచనా బంధమును కలిగి యుండుటచేత ఇది మధ్యమారభటీవృత్తికి ఉదాహరణ మైనది.

## ఛాయాలంకారము

49. అన్యోక్తీనా మనుకృతిశ్ఛాయా సాపీహ షడ్విధా
లోకచ్ఛేకార్భకోన్మత్త పోటా మత్తోక్తి భేదతః.

అర్థము : అన్యోక్తులయొక్క అనుకరణము ఛాయ. లోకోక్తి, ఛేకోక్తి, అర్భకోక్తి, ఉన్మత్తోక్తి, పోటోక్తి, మత్తోక్తి అను నుక్తి భేదములవల్ల ఇది ఆరు విధములు.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో ఐదవది ఛాయ. అనగా అనుకరణ మనియే యర్థము. కవి లోకకావ్యావేక్షణము చేయవలయునని, అదియే వ్యుత్పత్తి యని ఆలంకారికుల వచనము. ఆ వ్యుత్పత్తిని కవి తన ప్రతిభాగరిమనుబట్టి యుపయోగించుకొనును. 'అవస్థానుకృతిర్నాట్య'మ్మని నిర్వచనము. అవస్థ యనగా ప్రవృత్తి యని స్థూలముగా నర్థము చెప్పుకొనవచ్చును. నాట్యమునందువలెనే కావ్యమునందును ప్రవృత్త్యనుకరణమునకు ప్రాధాన్యమున్నది. అట్లే ఆయాపాత్రల

సంభాషణాదికము ననుకరించుటయు కవికి ఆవశ్యకమైన లక్షణము కావలయును. అట్లయినప్పుడుమాత్రమే కవి తన కావ్యమునందు లోకమును యథాతథముగను యథోచితముగను ప్రతిఫలింపజేయగలడు. కావున అనుకృతి అలంకృతియేకాని అపకృతి కాదని స్పష్టమగుచున్నది.

1. లోకోక్తుల ననుకరించుట లోకోక్తిచ్ఛాయ. 2. ఛేకు లనగా నిపుణులని యర్థము. కావున వాఙ్నిపుణుల ఉక్తుల ననుకరించుట ఛేకోక్తిచ్ఛాయ. 3. అర్భకు లనగా వివేకము చాలని బాలుడని యర్థము. మాటలు పలుకుశక్తికూడ తగినంత లేనివాడు బాలుడు. అట్టివాని మాటల ననుకరించుట అర్భకోక్తిచ్ఛాయ. 4. ఉన్మత్తు లనగా మతిస్థిమితత్వములేనివారు. వారి పలుకుబడుల ననుకరించుట ఉన్మత్తోక్తిచ్ఛాయ. పోట యని యనగా పురుషలక్షణములు గల స్త్రీ యని యర్థము. అట్టి వారి మాటల ననుకరించుట పోటోక్తిచ్ఛాయ. 6. మత్తుడనగా మద్యపానముచేసిన వాడని యర్థము. ధనబల పరివారాదికముచేత గర్వితుడైన వాడును మత్తుడే. అట్టి వారి వచోవిధానము ననుకరించుట మత్తోక్తిచ్ఛాయ.

భోజదేవుడు తన ప్రణాళికానురోధముచేత ఆరువిధములే యని చెప్పినను, తత్తత్సందర్భ సముచితముగా ఈ సంఖ్య యెక్కువ కావచ్చును. ఇది మార్గప్రదర్శనమేకాని సర్వస్వసాక్షాత్కరణము కాదు.

[ లో కో క్తి చ్ఛా య ]

తాసు లోకోక్తిచ్ఛాయా యథా-

'శాపాంతో మే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ
మాసానేతాన్గమయ చతురో లోచనే మీలయిత్వా
పశ్చాదావాం విరహగుణితం తం తమాత్మాభిలాషం
నిర్వేక్ష్యావః పరిణత శరచ్చంద్రికాసు క్షపాసు' 37

నేయం లోచనే మీలయిత్వేతి లోకోక్తే రనుకృతి ర్లోకోక్తిచ్ఛాయా.

అర్థము : ఛాయాభేదములందు లోకోక్తిచ్ఛాయ కుదాహరణము. విష్ణువు భుజగశయనమునుండి లేచునరికి నాకు శాపముతీరిపోవును. కనులు మూసికొని యీ నాలుగు మాసములను గడపివేయుము. ఆ పిమ్మట మన మిర్వురము పరిణత శరచ్చంద్రికలుగల రాత్రులయందు విరహగుణితములైన తత్తదాత్మాభిలాషములను నెరవేర్చుకొందము.

ఇది (లోచనే మీలయిత్వా) 'కనులు మూసికొని'అన్న లోకోక్తికి అనుకృతి. కావున లోకోక్తిచ్ఛాయ

వ్యాఖ్య : ఉదాహరణశ్లోకము కాళిదాసు మేఘదూతమునుండి గ్రహింపబడినది. 'కనులుమూసికొని గడపుట' యన్నది లోకోక్తి. కష్టముగానున్న విషయమును గాని, యిష్టములేని విషయమును గాని చేయవలసివచ్చినప్పుడు ఈవిధముగా 'కనులుమూసికొని' చేయుమనుట యలవాటు. మనసార చేయుటకు పూర్తిగా విరుద్ధమైన దిది. లోకమునందుకూడ ఇష్టములేనప్పుడు కనులు మూసికొనుట స్వాభావిక ప్రతిక్రియయే. దాని ననుసరించియే యీ వాడుక యేర్పడియుండును. ఇట్టి పదముల చేతను, పదబంధములచేతను ఉక్త్యర్థమునకు జిగియు, బిగియు నేర్పడును. ఇట్లు లోకమునందు ప్రసిద్ధములయిన వాడుకలే లోకోక్తులు. వీని ననుకరించుటచేత లోకోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకార మేర్పడును.

[ ఛేకోక్తిచ్ఛాయ ]

ఛేకోక్తిచ్ఛాయా యథా—

'యో హి దీర్ఘాసితాక్షస్య విలాస లలితభ్రుణః
కాంతా ముఖస్యావశగ స్తస్మై నృపశవే నమః' 38

నేయం తస్మై నృపశవే నమ ఇతి విదగ్ధోక్తే రనుకృతిశ్ఛేకోక్తిచ్ఛాయా.

అర్థము: ఛేకోక్తిచ్ఛాయ కుదాహరణము. నల్లని నిడువాలుచూపులు గలిగి విలాసలలితములైన కనుబొమలు కలిగిన కాంతాముఖమునకు వశుడుగాని ఆ నరరూప పశువునకు నమస్కారము.

'ఆ నరరూపపశువునకు నమస్కారము' అన్న పండితోక్త్యనుకరణము ఛేకోక్తిచ్ఛాయ

వ్యాఖ్య : ఇదియొక శృంగారనాయకుడు పలికినవాక్యము. భక్తిపూర్వకముగా నమస్కరించుట సార్వత్రికము. కొందరు నిపుణులు తిరస్కారమును సుకుమారముగా ప్రదర్శించుటకు నమస్కారమును సాధనముగా చేసికొందురు

'రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే । రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః' అని యన్నప్పుడు వక్త భక్తిభరితుడై యనుచున్నాడనుట స్పష్టము. 'మారీచాయ నమోనమః' అని యన్నప్పుడు భక్తిపూర్వక నమస్కారము కాక నిగూఢతిరస్కారమే యుద్దిష్ట మనుట స్పష్టము. మారీచుడు రామునిచేతిలో రెండుసారులు బాణహతికి పాలయ్యెను. ఆరెండు మారులను సూచించుటకే 'నమః' శబ్దముకూడ రెండుసార్లు ప్రయుక్తమైనది. ఇది సన్నివేశమునుబట్టి కాకువునుబట్టి గమనింపవలసిన విషయము. ఇది వాఙ్నిపుణులయిన విద్వాంసులకు వెన్నతోపెట్టిన విద్య. వారి ననుకరించుట జరిగినయెడల ఛేకోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకార మగును.

ఉదాహరణమున మొదటి మూడు పాదములను ముముక్షువు, జ్ఞానవంతుడు పలుకవచ్చును. అప్పుడాతడు సగౌరవముగానే పలుకును. శృంగారపురుషునకు కాంతాముఖమే సర్వస్వమగుటవల్ల తదాకర్షణకు లొంగనివారు విరసులుగను, పశువులుగను కనిపింతురు. కావుననే విద్వాంసులరీతినే యనుసరించుచు 'నృపశవే' అన్న పదమును తిరస్కార సూచకముగా నుపయోగించుట జరిగినది. ఇచ్చట విద్వదుక్తి యనుసరింపబడుటచేతనే యిది ఛేకోక్తిచ్ఛాయ యైనది.

[ అర్భకోక్తిచ్ఛాయ ]

అర్భకోక్తిచ్ఛాయా యథా—

'కిం స స్వర్గతరుః కోఽపి యస్య పుష్పం నిశాకరః
తే వృక్షాః కీదృశా మాతర్యేషాం ముక్తాఫలం ఫలమ్' ౩౭
సేయ మవ్యుత్పన్న శిశుజనోక్తే రనుకృతి రర్భకోక్తిచ్ఛాయా.

అర్థము : అర్భకోక్తిచ్ఛాయ కుదాహరణము. నిశాకరుని పుష్పముగా కలిగిన ఆ స్వర్గతరువేది? అమ్మా! ముక్తాఫలమును కాయు చెట్టు లెట్టులుండును?

ఇది అవ్యుత్పన్నులైన శిశుజనుల మాటకు అనుకృతి. కావున అర్భకోక్తిచ్ఛాయ.

వ్యాఖ్య : అర్భకుడనగా అవ్యుత్పన్నుడని యర్థము. లోకానుభవము కాని కావ్యానుభవము కాని లేనివాడని భావము. కాని వానిపరిధిలో వానికిని అనుభవముండును; యుక్తియుండును. విశాలమైన అనుభవపరిధి లేకపోవుటచేత యుక్తి అయుక్తముగా పరిణమించును. బాలకులు పరిసరములందలి చెట్లను చూచుచున్నారు. చెట్లకు పూవులు పూయుచున్నవి; కాయలు కాయుచున్నవి; పండ్లు పండుచున్నవి. వానినికూడ చూచుచున్నారు. కాబట్టి పూవులు, కాయలు, ఫలములు చెట్లవల్లనే లభించునన్న నిశ్చయ మేర్పరుచుకొందురు. తెల్లని గుండ్రని చంద్రుడు చక్కగా విచ్చిన పువ్వువలె గోచరించినప్పుడు దాని కాశ్రయమైన వృక్షమును యుక్తిచేత భావించుకొందురు. 'కల్పతరువు' అన్న మాట వారు వినియుందురు. ఇది స్వర్గతరువు, కనిపించుటలేదు. చిన్నచెట్లు చిన్న పువ్వులను పూయుచుండగా స్వర్గతరువు పెద్దపువ్వును పూయును. ఆ బాలుర మనఃస్థితికి అది యుక్తియుక్తముగా గోచరించును. 'ముక్తాఫలము' అనగా ముత్యమని యర్థము. 'ఫలము' అని విన్నప్పుడు దీనికికూడ చెట్టే ఆశ్రయమని బాలురబుద్ధికి భాసించును. అనుభవవిశేషము కలవాడు చంద్రుడు పువ్వు కాదనియు, ముక్తాఫలము ఫలముకాదనియు గుర్తించును. బాలకులు గుర్తింపలేరు.

స్వాభావికమైన బాలకుల భావన కవులకు పెట్టుబడియనుట నిర్వివాదము. కొన్నియెడల అమాయికమైన బాలకభావనమును, తదుక్తులను అనుకరించుట రుచిరముగా నుండును. ఇటు బాలకోక్తి ననుకరించుటయే అర్భకోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకారము.

## [ ఉన్మత్తోక్తిచ్ఛాయ ]

ఉన్మత్తోక్తిచ్ఛాయా యథా—

'దృష్టః కథం సుతను కిం కురు తే కిమస్మ
ద్వార్తాం స పృచ్ఛతి శృణోతి నివేద్యమానామ్
ఆస్తాం కిమస్య కథయా కథయాశు తావ
దత్రాగమిష్యతి న వా ఖలు సోఽభిమానీ' 40

సేయ మసమంజసాయా ఉన్మత్తోక్తే రనుకృతి రున్మత్తోక్తి చ్ఛాయా.

అర్థము : ఉన్మత్తోక్తిచ్ఛాయ కుదాహరణము. సుందరాంగీ! అతడు కనిపించెనా? ఏమి చేయుచున్నాడు? నన్నుగురించి అతడు ప్రశ్నించెనా? నీవు నివేదించు దానిని వినెనా? అది అటులుండనీ! అతని కథతో నాకేమి పని? తొందరగా చెప్పు. అతడిక్కడకు వచ్చునా? రాడా? అతడు అభిమానవంతుడు.

అసమంజసమైన ఉన్మత్తోక్తికి అనుకృతి యగుటవల్ల ఇది ఉన్మత్తోక్తిచ్ఛాయ.

వ్యాఖ్య : ఉదాహరణ పద్యమునందు నాయికయొక్క యున్మత్తప్రసంగము అనుకృతమైనది. నాయకుని కడకు దూతికను పంపిన నాయిక, ఆమె రాకకై యెదురు తెన్నులు చూచుచున్నది. దూతిక వచ్చినది. వచ్చినవెంటనే నాయిక నాయకునిగురించి 'అతడు కనిపించెనా?....వినెనా?' అన్నంతవరకు ప్రశ్నపై ప్రశ్న వేయుచు తన ఆత్రము నావిష్కరించెను. ఇంతవరకు సక్రమముగానే యున్నది. 'అది యటులుండనీ! ఆకథతో నాకేమి పని?' అని యనుటతో క్రమము తప్పినది. ఎంతయో యుత్కంఠతో మొదలుపెట్టిన నాయిక మమతలేనట్లుగా, తనకేమియు పట్టనట్లుగా మాటలాడుట సమంజసముగా లేదు. దూతిక మొగము చూచి నిఃస్పృహ చెందినదనుకొందమన్న, తరువాతి ప్రశ్నలలో మరింత ఆసక్తి కానవచ్చును. చివరికి 'సోఽభిమానీఖలు' అని యనుట నాయకప్రశంసయా ? నాయికానిఃస్పృహయా ? స్పష్టము కాదు. రెండు విధముల అది అప్రస్తుతమే. పూర్వవాక్యములతో అతుకని వాక్యమే.

ఇట్లు సామంజస్యములేని వాక్యసముదాయమును పలుకుట ఉన్మత్తులుచేయు పని. నాయిక విరహావేశముచేత తత్స్థితికి చేరుకొన్నది. కావుననే కవి ఉన్మత్తోక్తి ననుకరించుచు నాయికాప్రసంగమును నిర్వహించుచున్నాడు. కావుననే, యిది ఉన్మత్తోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకారమైనది.

[ పోటోక్తిచ్ఛాయ ]

పోటోక్తిచ్ఛాయా యథా—

'తిలక మసహాస్మి సోఢుం పునసా రేణాతిసారదోషో మే

లంభయతి చ దౌర్బల్యం కుంకుమరాగో మమాంగాని'

నేయ ముత్తమపదారోపిత నీచయువత్యుక్తే రనుకృతిః పోటోక్తిచ్ఛాయా.

అర్థము : పోటోక్తిచ్ఛాయ కుదాహరణము. తిలకమును ధరించుట కోపిక లేకున్నది. కస్తూరిపల్ల నాకు అతిసారదోషము కలుగుచున్నది. కుంకుమరాగము నా అంగములకు దౌర్బల్యమును కలిగించుచున్నది.

ఇది ఉత్తమపదమును పొందిన నీచయువతియొక్క మాటలకు అనుకృతి; కావున పోటోక్తిచ్ఛాయ.

వ్యాఖ్య : 'పోట' యనగా పురుషలక్షణములుగల స్త్రీయని చెప్పుకొంటిమి. తదుక్త్యనుకరణము పోటోక్తిచ్ఛాయ యగును. ప్రకృతోదాహరణమునందు దశాంతరారోపణమునొందిన యువతియొక్క వచోరీతి అనుకృతమైనది. నీచస్త్రీయొక్కతె ఉత్తమస్థానమును పొందినది. సాధారణముగా సంపన్నయువతులు సుకుమారముగా నుందురు; శరీరశ్రమ కోర్వజాలరు. ఈభావము మనసులోనున్న పేదరాలు సంపన్న యువతివలె నుండుటకై సౌకుమార్యము నభినయింపవలయును. ఇది సహజ సౌకుమార్యముకాక అభినయమగుటచేత కృత్రిమముగా ననిపించును; అతిశయముగా ననిపించును. తిలకము దిద్దుకొనుట, కస్తూరిపూసికొనుట, కుంకుమద్రవము నద్దుకొనుట మొదలయిన అలంకరణ విశేషములుకూడ భారములే యనుట సంభవించినది. నడుమంత్రపు సిరినొందిన నీచస్త్రీ యుక్తులకు అనుకరణ మగుటచే ఇది పోటోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకారమగుచున్నది.

[ మత్తోక్తిచ్ఛాయ ]

మత్తోక్తిచ్ఛాయా యథా-

'పి పి ప్రియ స స స్వయం ము ము ముఖాసవం దేహి మే
త త త్యజ దు దు ద్రుతం భ భ భ భాజనం కాంచనమ్
ఇతి స్ఖలితజల్పితం మదవశాత్కురంగీదృశః
ప్రగే హసితహేతవే సహచరీభి రధ్యైయత' 42

నేయం స్ఖలంత్యా మత్తోక్తే రనుకృతి ర్మత్తోక్తిచ్ఛాయా.

అర్థము మత్తోక్తిచ్ఛాయ కుదాహరణము. ప్రియా! స్వయముగా నీముఖాసవ మునే నాకిమ్ము. వేగముగా కాంచన పాత్రమును విడిచిపెట్టుము — అని కురంగీ లోచన మైకముతో అక్షరములను జార్చుకొనుచు పలికిన పలుకులను, ఆమె సఖులు నవ్వుకొనుటకై వెలుపల నధ్యయనము చేయుచున్నారు.

ఇది స్ఖలితమగుచున్న మత్తోక్తికి అనుకృతి యగుటచేత మత్తోక్తిచ్ఛాయ.

వ్యాఖ్య : మద్యముచేత మైకమునొందిన నాయిక మాటలలో తడబాటు పడుచున్నది. 'ప్రియ' యనుటకు 'పి పి ప్రియ' అని 'స్వయమ్' అనుటకు 'స స స్వయమ్' అని 'ముఖాసవమ్' అనుటకు 'ముముముఖాసవమ్'అని యీవిధముగా పలికినది. ఇది మత్తోక్తి. సన్నిహితముగా నున్న చెలికత్తెలు నాయిక మాటలను వినిరి. కాని నాయకుని సన్నిధానములో నేమి యనుటకును వారి కవకాశములేదు, కావున శయ్యామందిరమునుండి తాము వెలుపలికి వచ్చిన పిమ్మట నాయికమాటల ననుకరించుచు తాము మాటలాడుకొనుచు నవ్వుకొనుచున్నారు. ఇట్లు మత్తోక్తి ననుకరించుటచేత ఇది మత్తోక్తిచ్ఛాయ యన్న శబ్దాలంకార మగుచున్నది.

## ముద్రాలంకారము

40. సాభిప్రాయస్య వాక్యే యద్వచసో వినివేశనమ్
ముద్రాం తాం ముత్ప్రదాయిత్వాత్ కావ్యముద్రావిదో విదుః

41. సాస్మిన్ పదస్య వాక్యస్య విభక్తే ర్వచనస్య చ
సముచ్చయస్య సంవృత్యా షోఢా న్యాసేన జాయతే.

అర్థము : ముద్రాలంకారమునకు లక్షణము. వాక్యమునందు సాభిప్రాయ మైన వాక్కును వినివేశనము చేసినయెడల ముత్ప్రదాయకత్వమువల్ల దానిని ముద్ర యని ముద్రావేత్తలు గుర్తించిరి.

1. పదముద్ర 2. వాక్యముద్ర 3. విభక్తిముద్ర 4. వచనముద్ర 5. సముచ్చయముద్ర 6. సంవృతిముద్ర - ఈ యారును ముద్రాలంకారము నందలి భేదములు.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో ఆరవది ముద్ర. 'ముదమ్ రాతి దదాతీతి ముద్రా' అని వ్యుత్పత్తి. ముదమును కలిగించునది ముద్ర అని యర్థము. అంగు

శీయకము మొదలయినవానికి ముద్ర యను వాడుక కలదు. వ్రేలిని, మొత్తము చేతిని శోభింపజేయుటకు ఆభరణరూపమైన ముద్ర కారణమైనట్లే వాక్యమును శోభింపజేయుటకు అలంకారరూపమైన యీముద్ర కారణమగును. అందుచేత దీనికి ముద్రయన్న పేరు అన్వర్థక మగుచున్నది.

'కావ్యము సర్వస్వము కవిభావమునే ఆవిష్కరించునుగదా। మరి, నడుమ ముద్రయేమి?' అన్న ప్రశ్న యుదయింపవచ్చును. అట్టి ప్రశ్న యుదయించుట సమంజసమే వాక్యముకాని వాక్యసముదాయముకాని ఒక భావమును ప్రకటించు చుండగా తద్గతమైన ఒకపదమో, ఒకవిభక్తియో, వచనమో ఒక విశిష్టతను సూచింప వచ్చును. వాచ్యమైన యర్థముకంటె ఈ పదాదికముచేత సూచ్యమైన యర్థమే సురుచిరమై సుప్రతిష్ఠితమగును. అప్పుడే సహృదయులకు ఆనందసంధాయక మగును.

నిజమునకు భోజదేవుడు ధ్వనివాదమును ముద్రాలంకారమునందే కొంత యంతర్భవింపజేయుటకు యత్నించుచున్నాడు.

[పదముద్ర - ఉదాహరణము]

తాసు పదముద్రా యథా-

'నిర్మాల్యం నయనశ్రియః కువలయం వక్త్రస్య దాసః శశీ
భ్రూయుగ్మస్య సనాభి మన్మథధనుర్జ్యోత్స్నాస్మితస్యాఞ్చలః
సంగీతస్య చ మత్తకోకిలరుతాన్యుచ్ఛిష్ట మేణీదృశః
సర్వాంగీణ మహో విధేః పరిణతం విజ్ఞానచిత్రం చిరాత్' 43

అత్ర నిర్మాల్యం, దాసః, సనాభి, అంచలః, ఉచ్ఛిష్ట మితి పదానాం గౌణవృత్తివ్యపాశ్రయేణ ముత్ప్రదాయినాం సాభిప్రాయ నివేశా దియం పదముద్రా.

**అర్థము** : ముద్రాలంకారభేదములలోని పదముద్ర కుదాహరణము. మృగ లోచనయొక్క నయనలక్ష్మికి కువలయము నిర్మాల్యము; ముఖమునకు చంద్రుడు దాసుడు; కనుబొమలకు మరునివిల్లు దగ్గరచుట్టము; చిరునవ్వు చివరిరేఖ వెన్నెల;

[వాక్యముద్ర - ఉదాహరణము]

వాక్యముద్రా యథా—

'యత్స్వచ్ఛే సలిలాత్మని ప్రతిఫలద్దేవే త్రియామాపతౌ
పీయూషాకృతి పర్యవస్యతి కిల జ్యోత్స్నేతి తత్త్వాంతరమ్
తిగ్మం ధామ చిరం చకాస్తి దివి యత్తత్రాస్తి దివ్యః పుమాన్
యం విజ్ఞానవతాం త్రుటంతి నిఖిలా భూయోభవగ్రంథయః' 744

అత్ర 'తత్రాస్తి దివ్యః పుమాన్' ఇత్యాదేర్వాక్యాంతరస్య పూర్వవాక్యోపకారిత్వేన ముక్త్విదాయకస్యాభిప్రాయపూర్వ నివేశాదియం వాక్యముద్రా.

అర్థము: వాక్యముద్ర కుదాహరణము. స్వచ్ఛమై సలిలాత్మమై ప్రతిఫలించుచున్న చంద్రునియందు వెన్నెల యన్న అమృతాకారమైన తత్త్వాంతరము పర్యవసించును గదా! ఆకాశమునందు సుస్థిరమై తీవ్రమైన కాంతి ప్రకాశించును. అచ్చట నొక దివ్యపురుషుడున్నాడు. అతని నెరిగిన వారి సర్వసంసార గ్రంథులను పూర్తిగా తెగిపోవును.

ఇచ్చట 'అచ్చట నొక దివ్యపురుషుడున్నాడు' అని మొదలయిన ముక్త్విదాయకమైన వాక్యాంతరమును పూర్వవాక్యమున కుపకారకముగా సాభిప్రాయముగా నివేశనము చేయుటవల్ల ఇది వాక్యముద్ర.

వ్యాఖ్య : సాభిప్రాయమైన వాక్యాంతరముచేత వాక్యము విశిష్ట భావసంపన్నమై సహృదయ సంతర్పకమైనయెడల వాక్యముద్ర యగునని భావము.

ప్రకృతోదాహరణమునందు చంద్రవర్ణనము, జ్యోత్స్నావర్ణనము పూర్వార్థమునందున్నవి. చంద్రుడు ప్రకాశించుచున్నప్పుడు వెన్నెల వ్యాపించును. ఇది తత్త్వాంతరముగా పీయూషాకృతిగా పర్యవసించును. ఉత్తరార్ధమునందు సూర్యవర్ణనము, తదంతర్వర్తి నారాయణవర్ణనము నున్నవి. ఆ నారాయణుడు సర్వసంసారబంధములను సమూలముగా ఛేదించును. ఇవి పరస్పరము సంబంధములేవి వాక్యములుగా అగపడుచున్నవి. కాని యిందు కవి ఉపనిషదర్థముల నుపబృంహితము చేయుచున్నాడు.

రాత్రివేళ సూర్యునికాంతియే చంద్రునియందు ప్రవేశించి తమస్సును హరించుచున్నది. అట్లు ప్రవేశించిన సూర్యకాంతియే వెన్నెలరూపమున అమృతమయమై విశ్వమున వ్యాపించుచున్నది. చండకిరణుడు సూర్యుడు; శీతకిరణుడు చంద్రుడు. సూర్యకాంతి వెన్నెలగా రూపాంతరము నొందుచున్నది; అమృతమయమై తత్త్వమునందు పైతము పూర్ప నొందుచున్నది. ఇంక, ఆ సూర్యమండలాంతర్వర్తియైన నారాయణుని ప్రసంగము. సూర్యుడు సూర్యనారాయణుడు; అంతర్వర్తియైనవాడు ఆదినారాయణుడు.

ఆదినారాయణుడే పరబ్రహ్మము. బ్రహ్మజ్ఞానులు సంసారబంధ విముక్తులు. ఆదినారాయణునివలన సూర్యనారాయణునకును, సూర్యనారాయణుని వలన చంద్రునకును తత్తత్కార్య నిర్వహణసామర్థ్యము కలుగుచున్నది. ఇది యంతయు 'అచ్చట నొక దివ్యపురుషుడున్నాడు' అని మొదలుగా చెప్పిన వాక్యాంతరమువల్ల సౌష్ఠవమును సంతరించుకొనుచున్నది. అతడు సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు, సర్వశక్తిశాలి, సర్వద్రష్ట, సర్వనియోక్త అన్న విశిష్టార్థము వ్యజ్యమానమగుచున్నది. కావుననే, యిది వాక్యముద్ర కుదాహరణ మైనది.

[ విభక్తిముద్ర - ఉదాహరణము ]

విభక్తిముద్రా యథా-

'శ్రియః ప్రదుగ్ధే విపదో రుణద్ధి
యశాంసి సూతే మలినం ప్రమార్ష్టి
సంస్కార శౌచేన పరం పునీతే
శుద్ధా హి బుద్ధిః కిల కామధేనుః' 45

అత్ర ప్రదుగ్ధే, రుణద్ధి, సూతే, ప్రమార్ష్టి, పునీతే ఇతి తిఙ్విభక్తీనాం 'దుహి పచ్యోర్బహులం సకర్మకయో రుపసంఖ్యానమ్' (3-1-87 వా.), 'రుధాదిభ్యః శ్నమ్' (3-1-78) ఇత్యాదిభి ర్విశేషలక్షణయోగైః పరస్మైపదాత్మనేపద పర్యాయేణ నివేశో దృశ్యతే. శ్రియః, విపదః, యశాంసి, మలినం, సంస్కారశౌచేన ఇతి చ సుబ్విభక్తీనామ్ 'అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ' (6-4-77)

ఇత్యాది విశేషలక్షణవతీనా మవికృతవికృతానాం మంగలామంగలార్థ పరత్వేన మంగలాద్యర్థానా మభిప్రాయతః ప్రయోగో లక్ష్యతే. తేనేయం విభక్తిముద్రా భవతి.

అర్థము : విభక్తిముద్ర కుదాహరణము. శ్రీలను పిదుకును; విపత్తులను రోధించును; కీర్తులను ప్రసవించును; మలినమును తుడిచివేయును; సంస్కార శౌచముచేత మిక్కిలి పవిత్రీకరించును – శుద్ధమైన బుద్ధి కామధేనువుకదా !

ఇచ్చట 'ప్రదుగ్ధే, రుణద్ధి, సూతే, ప్రమార్ష్టి, పునీతే' అని 'దుహి పచ్యోర్బ్ హులం సకర్మక యో రుపసంఖ్యానమ్' 'రుధాదిభ్యః శ్నమ్' అని మొదలయిన విశేష లక్షణయోగములచేత క్రియా విభక్తులను పరస్మైపదాత్మనేపద పర్యాయక్రమమున కూర్చుట కానబడును. 'అచి శ్నుధాతు భ్రువాం య్వోరియఙు వఙౌ' మొదలయిన విశేషలక్షణవంతములై మంగళామంగళార్థపరములైన 'శ్రియః, విపదః, యశాంసి, మలినం, సంస్కారశౌచేన' అను నామ విభక్తులను మంగళార్థముల యభిప్రాయ ముతో ప్రయోగించుట కానబడును. దానిచేత ఇది విభక్తిముద్ర యగుచున్నది.

వ్యాఖ్య: విభక్తిప్రయోగముచేత విశేషార్థమును సూచించుట జరిగినయెడల అది విభక్తిముద్ర యన్న శబ్దాలంకారభేద మగును.

విభక్తులు నామవిభక్తులు, క్రియావిభక్తులు అని రెండు విధములు. నామ విభక్తులనే సుబ్విభక్తులని, క్రియా విభక్తులనే తిఙ్విభక్తులని కూడ వ్యవహరింతురు.

ప్రదుగ్ధే, రుణద్ధి, సూతే, ప్రమార్ష్టి, పునీతే – అన్నవి వర్తమానకాలము నందలి క్రియాపదములు. సంస్కృత క్రియాధాతువులు పరస్మైపదములు, ఆత్మనేపదములు – అని రెండు విధములు. పరస్మైపద ధాతువులకు పరస్మై పదప్రత్యయములును, ఆత్మనేపద ధాతువులకు ఆత్మనేపద ప్రత్యయములును మాత్రమే చేరవలయును. కొన్ని ఉభయపదము లుండును. వానికి పరస్మైపద ప్రత్యయములు కాని, ఆత్మనేపద ప్రత్యయములు కాని చేరవచ్చును. 'దుహ' ధాతువు ఉభయపది. కావున 'దుగ్ధే'యన్న ఆత్మనేపదరూపముతోను, 'దోగ్ధి' యన్న పరస్మైపద రూపముతోను కూడ ప్రయోగింపవచ్చును. ముందుచేరిన 'ప్ర' ఉపసర్గ.

రుధ్' ధాతువుకూడ ఉభయపదియే. కావున 'రుంద్ధే'యన్న ఆత్మనేపద రూపము, 'రుణద్ధి' యన్న పరస్మైపదరూపములుకూడ ప్రయోగార్హములే యగుచును,

'సూ' ధాతువు ఆత్మనేపదిమాత్రమే. కావున ఆత్మనేపద ప్రత్యయమ్ము చేర్చుటచేత 'సూతే' యన్న వర్తమానక్రియ యేర్పడును. 'మృజ్' పరస్మైపది మాత్రమే. కాబట్టి 'మార్ష్టి' యన్నదే రూపము.

'పూ' ధాతువు ఉభయపది. కాబట్టి 'పునీతే' యన్న ఆత్మనేపద రూపము 'పునాతి' యన్న పరస్మైపదరూపముకూడ నుండును.

పై యుదాహరణమునందు ఆత్మనేపదమును, పరస్మైపదమును పర్యాయ క్రమమున సంధానించుట కలదు. ఇట్టి కూర్పు మణులను పగడములను కూర్చిన హారమువలె సహృదయులకు ముదమ్మును పంధించును.

ఇంక నామవిభక్తులను చూతము. 'శ్రియః, విపదః, యశాంసి, మలినం, సంస్కారశౌచేన' అన్నవి నామవాచకములు. 'శ్రీ' అన్న ప్రాతిపదిక ద్వితీయా విభక్తి బహువచనమునందు 'శ్రియః' అని యగును. ఇచ్చట ప్రాతిపదిక కొంత మార్పు నొందినది. 'విపద్' 'విపదః' అనియైనది. ఇచ్చట మార్పులేదు. 'యశస్' అన్న ప్రాతిపదిక 'యశాంసి' అన్న రూపమునొందినది. ఇచ్చట ప్రత్యయములో మార్పుకలదు. 'మలినమ్' అన్నది ఏకవచనరూపము. 'సంస్కారశౌచేన' తృతీయా విభక్తి యేకవచనరూపము. మార్పునొందిన ప్రాతిపదికలను, మార్పునొందని ప్రాతిపదికలను, మార్పునొందిన ప్రత్యయములను, మార్పునొందని ప్రత్యయములను, బహువచనరూపములతో ఏకవచనరూపములను, ద్వితీయావిభక్తులతో తృతీయా విభక్తిని – ఇట్లు భిన్నభిన్నరూపములై మంగళార్థకామంగళార్థక పదములను కలుపుటచేత అనేక వర్ణసమ్మిశ్రణసౌందర్యము సముత్పన్నమగుచున్నది.

ఇదంతయు నామవిభక్తులను, క్రియావిభక్తులను విశిష్టార్థస్ఫోరకములుగా ప్రయోగించుటచేత సిద్ధించుచున్నది. కావుననే ఇది విభక్తిముద్ర కుదాహరణమైనది.

ఇంకొక విషయము. ఇచ్చట కర్తృపదము 'బుద్ధి'. బుద్ధికి దోహన సామర్థ్యములేదు. అది గోవు చేయగల పని. కావుననే గోవుతో ఔపమ్యమును చెప్పుట అవసరమయ్యెను. అప్పుడైనను బుద్ధికి దోహనశక్తి నారోపించుటకు వీలుకాదు. 'కలిగించుట' యన్న యర్థమున మాత్రమే 'దుహ్' ధాతువు ప్రయుక్తమయ్యెను. వాచ్యార్థము పొసగ దనుట స్పష్టము. తక్కిన క్రియాపదముల విషయముకూడ

అట్టిదే. ధ్వనివాదుల అత్యంత తిరస్కృతవాచ్యధ్వని కిది లక్ష్యము. ధ్వని క్రియావిభక్తుల నాశ్రయించుకొని యున్నది. దీనిని భోజదేవుడు ముద్రాలంకారములో నిమిడించుటలోనే మోదము నొందుచున్నాడు.

[ వచనముద్ర - ఉదాహరణము ]

వచనముద్రా యథా-

'విశ్వంభరా భగవతీ భవతీ మసూత
రాజా ప్రజాపతి సమో జనకః పితా తే
తేషాం వధూ స్త్వమసి నందిని పార్థివానాం
యేషాం కులేషు సవితా చ గురుర్వయం చ' 46

అత్ర వయమిత్యాత్మని బహువచనేన సవితాచేతి సవితర్యేక వచనేన సవితు రప్యహం బహుమత ఇత్యభిప్రాయో వక్తు రితీయం వచన ముద్రా.

అర్థము : వచనముద్ర కుదాహరణము. నందినీ! భగవతియైన భూదేవి నిన్ను కన్నది. ప్రజాపతి సమానుడైన జనకమహారాజు నీతండ్రి. నీవు సూర్యుడును మేమును గురువులమైన రాజుల యింటి కోడలివైతివి.

ఇచ్చట 'మేము' అని తన విషయమును బహువచనముచేత 'సూర్యుడు'అని సూర్యుని విషయము నేకవచనముచేత చెప్పుట 'సూర్యునికంటె నేను మాన్యుడ' నని వక్త యొక్క యభిప్రాయమైనట్లు వెల్లడించుటవల్ల ఇది వచనముద్ర.

వ్యాఖ్య : ఉదాహరణ శ్లోకము భవభూతి రచించిన ఉత్తరరామచరితము నందలిది ఇందు వక్త వశిష్ఠుడు. 'వయం గురుః' అని చెప్పుటచేత ఇచ్చట వచనముద్ర యన్న శబ్దాలంకారమున్నది.

ఏకత్వసంఖ్యను బోధించునది ఏకవచనము; బహుత్వసంఖ్యను బోధించునది బహువచనము. 'సవితా' అని యనగా సూర్యుడని యర్థము. సూర్యు డొక్కడే యగుటచే ఏకవచనమును వాడుట సమంజసమే. సూర్యుడు రఘుకులమునకు మూల

పురుషుడు; కావున గురుడు. మరి, వశిష్ఠుడు సర్వశుభాశుభకర్మలకు నిర్వాహకుడు; శిక్షకుడు. అందువల్ల వశిష్ఠుడు గురుడు. మూలపురుషుడైన సూర్యునివిషయమున నేకవచనమును వాడి, తన విషయమున బహువచనమును వాడుకొనుట యిచ్చట కాననగును. బహుత్వసంఖ్యను బోధించునప్పుడే కాక బహుమతత్వమును బోధించు నప్పుడుకూడ బహువచనమును వాడుట సంప్రదాయము. ఇట్లు వచనమునందు చేసిన పరివర్తనము మూలమున వశిష్ఠుని విశిష్టతయు, ప్రభావౌన్నత్యమును ధ్వనితము లగుచున్నవి.

## [సముచ్చయముద్ర - ఉదాహరణము]

సముచ్చయముద్రా యథా-

'జాతశ్చాయం ముఖేందుస్తే భ్రుకుటిప్రణయీ పురః
గతం చ వసుదేవస్య కులం నామావశేషతామ్' 47

అత్ర 'ఆశంసాయాం భూతవచ్చ'(3-3-132) ఇతి భూతవద్భావస్య హయగ్రీవప్రభావాతిశయశంసినః సముచ్చయద్వారేణ నివేశాదయం సముచ్చయముద్రా.

అర్థము : సముచ్చయముద్ర కుదాహరణము. నీ యీ ముఖచంద్రుడు బొమముడి వేయుటయందు ప్రణయము కలిగియుండెను. ఇకముందు, మరి వసుదేవుని కులము నామావశేషత్వమును పొందెను.

ఇచ్చట 'ఆశంసాయాం భూతవచ్చ' అని భూతవద్భావమును హయగ్రీవ ప్రభావాతిశయ ప్రశంసనమును సముచ్చయద్వారమున నివేశనముచేయుటచేత సముచ్చయముద్ర.

వ్యాఖ్య : చ, తు, కిల, ఖలు మొదలయినవి నిపాతములు. ఇందు 'చ' యనునది సముచ్చయముకూడ. పూర్వాపర పదములను గాని, పూర్వాపరవాక్యములనుగాని కలుపుటచేత దీనికి సముచ్చయ మనుపేరు తగియున్నది.

ప్రకృతోదాహరణమునందు రెండు వాక్యములు గలవు. రెండు వాక్యములందును విధేయ విశేషణములు భూతార్థకములై యున్నవి. 'ఆశంసాయాం

భూతవచ్చ' అన్న వ్యాకరణ నియమ మిచ్చట అనుసంధేయము. 'ఆశంస' యనగా 'ఆశించుట' యని యర్థము. 'వానలు కురిసెనేని పంటలు పండును' మొదలైన వాక్యమునందు చేదర్థకమునకు ముందున్న భూతక్రియ యిట్టిదే. కాని సమాపక క్రియ తద్ధర్మార్థకమునం దున్నది; భవిష్యదర్థమును సూచించుచున్నది. మీది యుదాహరణమందు రెంశవ వాక్యమునందలి భూతార్థకము నిశ్చయార్థమును ధ్వనింప జేయును. భావిక్రియను గాక భూతక్రియను వాడుట అవశ్యంభావిత్వమును తెలియ జేయును. ఇది యొక విషయము.

మరొక విషయము. పూర్వపరవాక్యముల నడుమ ఇచ్చట 'చేత్' అని లేదు. కార్యకారణ సంబంధసాధకమైన నిపాతమును దేనినో వాడవలయును. ఇచ్చట ఆ సంబంధమును 'చ' యన్న సముచ్చయార్థకమే సాధించుచున్నది. 'నీవు కోపము నొందినయెడల వసుదేవవంశము నాశనమగును' అన్నదియే భావము. అయినను నిశ్చయత్వమును, దానిమూలమున శ్రోతయైన హయగ్రీవుని ప్రభావాతిశయమును ధ్వనింపజేయుటకే సముచ్చయము ప్రయుక్తమైనది. ఇట్లు సముచ్చయమువల్ల ప్రకర్ష వ్యంజితమగుచుండుటచేత ఇది సముచ్చయముద్ర యన్న శబ్దాలంకార మగుచున్నది.

## [సంవృతిముద్ర - ఉదాహరణము]

సంవృతిముద్రా యథా-

'మణిరత్నం ప్రసేనస్య తచ్చానార్యేణ విష్ణునా
లబ్ధం యేనాద్య యోగేన తేన కిం కీర్తితేన వః' 45

అత్ర 'కథాపి ఖలు పాపానా మలమశ్రేయసే యతః' తతః 'కిం తేన వః కీర్తితేన', ఇతి సాభిప్రాయ సంవృతి కరణా దియం సంవృతిముద్రా.

అర్థము : సంవృతిముద్ర కుదాహరణము. ప్రసేనునియొక్క మణిరత్నము అదృష్టవశమున నీనాడు ఆ అనార్యుడైన విష్ణువుచేత పొందబడినది. మీకు దానిని చెప్పుకొనుటతో నేమి పని ?

ఇచ్చట 'పాపులయొక్క కథకూడ అమంగళమునకు చాలు' నని యుండుట వల్ల 'మీకు దానిని చెప్పుకొనుటలో నేమిపని?' అన్న సాభిప్రాయ సంవృతికరణము వల్ల ఇది సంవృతిముద్ర.

వ్యాఖ్య : సంవృతి యనగా మూసియుంచుట యని యర్థము. భావమును స్పష్టముగా వ్యక్తముచేయక, నిగూఢముగా దాచియుంచుట యని యర్థము.

ఇచ్చట 'తేన కిం కీర్తితేన వః' అనుచోట సంవృతి యున్నది. 'దానిని కీర్తించుటతో నేమిపని?' యని యర్థము. 'కీర్తన' మని యనగా చెప్పుట యని పొగడుట యని రెండర్థములు గలవు. 'తేన' అని యన్నప్పుడు 'ఆవృత్తాంతము' అన్నదియే తచ్ఛబ్దార్థము. సాధారణముగా ఒకడొక మంచిపనినో చెడ్డపనినో చేసినప్పుడు నలుగురును చెప్పుకొందురు, ఇది సహజము. మంచినిగూర్చి చెప్పుకొన్నప్పుడు నష్టములేదు. పక్తయుద్దేశమున కృష్ణుడు అనార్యుడుగా వ్యవహరించెను. ప్రసేనుని సంహరించి శ్యమంతకమణి నపహరించెను. ఈవిషయమునిట్లుగా తెలిసికొన్న కొందరు మరికొందరతో చెప్పుచున్నారు. దానిని వారించుచు సత్రాజిత్తు పలికెడి పలుకు లివి.

కృష్ణుడు హంత యని చోరు డని సత్రాజిత్తు భావము. కావున వారట్లు చెప్పుకొనుట తన కనుకూలమే. కాని 'ఖలుల కథలను వినుటచేత సైతము కీడు కలుగును' అని పెద్దల నమ్మకము. దానిని మనస్సులో నుంచుకొనియే 'శ్యమంతకాపహరణ ప్రసంగము'ను విడనాడు మనుచున్నాడు. మనస్సులో నుంచుకొన్న భావమే కృష్ణునియందు మరింత ఖలత్వమును స్థాపింపదగియున్నది. అది వాచ్యము కాక అనంతర వాక్యముచేత ఊహ్యమగుటవల్లనే మరింత పుష్టిని పుంజుకొనుచున్నది. ఇట్లు సంవృతిచేతనే సమర్థముగా వ్యంజితమగుటవల్ల ఇది సంవృతి ముద్ర యన్న శబ్దాలంకారముగా సార్థకమగుచున్నది.

## ఉక్త్యలంకారము

42. విధిద్వారేణ వా యత్ర నిషేధేనాథ వా పునః
ప్రతీయతే విశిష్టోఽర్థః సోక్తి రిత్రాభిధీయతే.

43. విధే రథ నిషేధాత్ స్యా దధికారా ద్వికల్పతః
నియమాత్ పరిసంఖ్యాయా ఉపాధేః సేహ షడ్విధా.

అర్థము : ఉక్తి యన్న అలంకారమునకు లక్షణము. విధి ద్వారమున కాని, నిషేధద్వారమున గాని విశిష్టమగు నర్థము ప్రతీతమగునెడల, అది యిచ్చట ఉక్తి యనబడును. ఉక్తి విధి, నిషేధము, అధికారము, వికల్పము, నియమము, పరిసంఖ్య అన్న ఉపాధిభేదములనుబట్టి ఆరు విధములు.

వ్యాఖ్య : 'ఉచ్యతే ఇతి ఉక్తిః' చెప్పబడునది ఉక్తియని వ్యుత్పత్తి. 'ఉచ్యతే అనయా ఇతి ఉక్తిః' దీనిచేత చెప్పబడును కావున ఉక్తియనికూడ వ్యుత్పత్తి చెప్పవచ్చును. కర్మార్థమును, కరణార్థమునుగూడ స్వీకరింపవచ్చును. ఉక్తియందు ఉద్దేశ్యము, విధేయము – అని రెండంగము లుండును. విధేయము భావాత్మకముగాని, అభావాత్మకముకాని కావచ్చును. భావాత్మకవిధేయ మున్నచో విధియని, అభావాత్మక విధేయ మున్నచో నిషేధమని యందురు. ఇది స్థూల విభాగము.

ఇంకను సూక్ష్మముగా 1. విధ్యుక్తి 2. నిషేధోక్తి 3. అధికారోక్తి 4. వికల్పోక్తి 5. నియమోక్తి 6. పరిసంఖ్యోక్తి యని ఆరు విధములుగా విభక్తమగును.

అప్రాప్తప్రాపణము విధి; లేనిదానిని కలుగజేయుటయని యర్థము. ప్రసక్త ప్రతిషేధము నిషేధము; కలిగినదానిని వారించుట యని యర్థము. క్రియాఫల యోగ్యత అధికారము; విధిరూపమునందో నిషేధరూపమునందో యున్న క్రియ యొక్క ఫలమునకు అర్హత కలిగియుండుట యని యర్థము. అన్యతరసంబంధము వికల్పము; తుల్యకక్షకు చెందిన రెండింటియందు ఒకదానిని విడిచి రెండవదానిని గ్రహించుట యని యర్థము. వ్యావృత్తిఫలకవిధి నియమము; ఇతరేతరములకు వ్యవచ్ఛేదము కలిగించి ఒక్కదాని నిర్ణయించుట యని యర్థము. పరిసంఖ్యయనగా ఉభయప్రాప్తియందు ఒకదానితో వ్యావృత్తిని కలిగించుట. విధిచేత నిషేధమును గాని, నిషేధముచేత విధినిగాని బోధించుట యని యర్థము.

పై వానియందు విధ్యుక్తి, అధికారోక్తి యన్నవి రెండును భావాత్మకములు. నిషేధోక్తి, నియమోక్తి అన్నవి రెండును అభావాత్మకములు. వికల్పోక్తి, పరిసంఖ్యోక్తి యన్నవి రెండును భావాభావాత్మకములు. ఏ ఉక్తియైనను విశిష్టార్థ స్ఫోరకమైనప్పుడు మాత్రమే శబ్దాలంకార మగును. ఇది గమనింపదగిన విషయము.

[ విధ్యుక్తి - ఉదాహరణము ]

తాసు విధ్యుక్తి ర్యథా-

'శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీ జనే'
అత్రాప్రాప్తౌ ప్రాపణవచనం విధిః.

అర్థము : ఉక్త్యలంకారభేదములలో విధ్యుక్తికి ఉదాహరణము. పెద్దలను సేవింపుము. సవతులయెడల ప్రియసఖివై ప్రవర్తింపుము.

ఇచ్చట ప్రాప్తిలేనిచోట ప్రాపణవచనము కావున విధి.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో ఏడవది ఉక్తి. ఇది ఆరు విధములు. ఇందు మొదటిది విధ్యుక్తి.

ఉదాహరణ పద్యము కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నందలిది. వరుసగా ఒక్కొక్క పంక్తిని ఒక్కొక్క ఉక్తికి లక్ష్యముగా భోజదేవుడు ప్రదర్శించు చున్నాడు. కణ్వుడు శకుంతలను అత్తవారింటికి పంపుచు హితబోధ చేయుచున్న సందర్భములోనిది. శకుంతల దుష్యంతుని గాంధర్వవిధిని వివాహము చేసికొన్నది. దుష్యంతుడు రాజధానికి వెళ్ళిపోయెను. శకుంతల అచ్చటికి వెళ్ళలేదు. కావున, అచ్చటి పెద్దలనుగాని సవతులనుగాని తానెరుగదు. అట్టియెడల శుశ్రూషచేయుట, సఖీభావము నెరపుట అనునవి కింతవరకు అవకాశము లేనేలేదు అనగా అవి అప్రాప్తము లన్నమాట. అప్రాప్తములను లభింపజేయుటకై ప్రసరించిన వచన మగుటచేతనే యిది విధ్యుక్తి యగుచున్నది.

[ నిషేధోక్తి - ఉదాహరణము ]

నిషేధోక్తి ర్యథా-

'భర్తు ర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః'
అత్ర ప్రాప్తౌ నివారణం నిషేధః.

అర్థము : నిషేధోక్తికి ఉదాహరణము. భర్తయెడల కోపమునొందినప్పటి కిని రోషముచేత ప్రతికూలముగా ఆచరింపవలదు.

ఇచ్చట ప్రాప్తి యందు నివారణము నిషేధము.

వ్యాఖ్య : ఇచ్చట ప్రాప్తి యనగా ప్రాప్తవ్య మనియే భావము. సంసారము నందు భార్యాభర్తలకు ఎన్నడేని భేదభావము కలుగకపోదు. అట్టియెడల దానినే పెద్దగా చేసి భార్య భర్తకు విరుద్ధముగా ప్రవర్తించుట కూడదు. ఇదే విషయమును కణ్వమహర్షి శకుంతలకు చెప్పుచున్నాడు. భేదభావము కలిగినప్పుడు విరుద్ధముగా నడవవలయుననన్న బుద్ధి పొడమును. అదియే ప్రాప్తి. 'అట్లు చేయవద్దు' అని నిషేధించుట యిచ్చట కలదు. కావుననే యిది నిషేధోక్తికి ఉదాహరణమైనది.

[ అధికారోక్తి - ఉదాహరణము ]

అధికారోక్తి ర్యథా—

'భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భోగేష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః'

అత్ర విధినిషేధజ్ఞానా ద్విధినిషేధయోగ్యతాధికారః.

**అర్థము** : అధికారోక్తికి ఉదాహరణము. పరిజనమునందు అధికముగా దాక్షిణ్యమును వహింపుము. భోగములయందు గర్వము నొందకుము. ఈ విధముగా యువతులు గృహిణీపదమును పొందుదురు. భిన్నముగానుండువారు కులమునకు దుఃఖమును కలిగింతురు.

ఇచ్చట విధినిషేధజ్ఞానమువల్ల విధినిషేధయోగ్యత అధికారము.

వ్యాఖ్య : విధినిషేధములను రెండింటిని గుర్తించి విధుల నాచరించుటకును నిషేధములను పరిహరించుటకును సామర్థ్యమును కలుగజేయునది అధికారోక్తి. 'పరిజనమునందు అధికముగా దాక్షిణ్యమును వహింపుము' అన్నది విధ్యుక్తి. 'భోగములయందు గర్వము నొందకుము' అన్నది నిషేధోక్తి ఇట్లే 'గృహిణీపదమును పొందుదురు' అన్నది విధ్యుక్తి. 'దుఃఖమును కలిగింతురు' అనుటచేత 'అట్లు ప్రవర్తింపవద్దు' అన్న నిషేధోక్తియే ప్రతీయమానమగుచున్నది. ఇట్లు విధి నిషేధములను రెండింటిని తెల్పి 'యిట్లు చేసినచో ఈ లాభము కలదు; చేయకున్నచో ఈ నష్టము కలదు' అని చెప్పుటచేత ఇది అధికారోక్తి యన్న శబ్దాలంకార మగుచున్నది.

[ వికల్పోక్తి–ఉదాహరణము ]

వికల్పోక్తి ర్యథా–

'ఏకో నేతా క్షత్రియో వా ద్విజో వా
ఏకా విద్యాధ్యాత్మికీ వా త్రయీ వా
ఏకా భార్యా వంశజా వా ప్రియా వా
ఏకం మిత్రం భూపతిర్వా యతిర్వా'. 50

సోయం జాతి క్రియాగుణద్రవ్యావలంబీ చతుర్విధో వికల్పః.

అర్థము : వికల్పోక్తికి ఉదాహరణము: క్షత్రియుడుకాని ద్విజుడు కాని ఒక్కడే నాయకుడు. ఆధ్యాత్మికము కాని వైదికము కాని ఒక్కటే విద్య. ఉత్తమ వంశమునందు పుట్టినదికాని మనసుకు నచ్చినది కాని ఒక్కతెయే భార్య. భూపతి కాని యతి కాని ఒక్కడే మిత్రుడు.

ఇది జాతి క్రియా గుణ ద్రవ్యము లవలంబములుగా కల చతుర్విధమైన వికల్పము.

వ్యాఖ్య : అన్యతర సంబంధము వికల్పము. ఈ వికల్పము జాతినిబట్టి, క్రియనుబట్టి, గుణమునుబట్టి, ద్రవ్యమునుబట్టి నాలుగువిధములుగా నుండును. క్షత్రియ, ద్విజశబ్దములు జాతివాచకములు. ఈ రెండు జాతులలో ఒక్క జాతితో సంబంధమును కలిగించునది వికల్పోక్తి. నాయకుడు క్షత్రియుడైన కావలయును; బ్రాహ్మణుడైన కావలయును. ఇట్లు రెండుజాతులలో ఒకజాతికి గ్రహించుట అన్యతర గ్రహణము.

క్రియావలంబమున కుదాహరణము. భూపాలనముచేయువాడు భూపతి. సంయమము కలవాడు యతి. ఈ యిర్వురు నాయా క్రియాసంబంధము కలవారు. అందు ఒక్కనిని గ్రహించుట వికల్పము.

గుణావలంబమున కుదాహరణము. ఉత్తమవంశమునందు పుట్టిన స్త్రీ ఉత్తమ గుణములు కలదని, మనసుకు నచ్చినది ప్రేమాది గుణములు కలదని భావము. కావున అభిజాత్యము గలస్త్రీ కాని ప్రేమభావముగల స్త్రీ కాని భార్య కావలయును. ఇట్లు ఇర్వురలో ఒకరిని గ్రహించుట వికల్పము.

ద్రవ్యావలంబమున కుదాహరణము. విద్య ద్రవ్యము; జ్ఞానమునకు సాధన మైన పదార్థము. వేదవిద్య యొకటి, ఆధ్యాత్మిక విద్య యొకటి. ఈ రెండింటిలో నొక్కదానిని విద్యగా స్వీకరింపవలయును.

ఇట్లు 'కాని, కాని' అని తెల్పి రెండేసి వస్తువులలో ఒక్కదానిని గ్రహించు టకు ప్రేరేపించుటచేత ఇది వికల్పోక్తి యన్న శబ్దాలంకార మగుచున్నది.

## [నియమోక్తి - ఉదాహరణము]

నియమోక్తి ర్యథా-

'వివాదోఽపార్థ ఏవాయం పార్థ ఏవ ధనుర్ధరః

యో న కేవల మాత్మీయైః పరై రప్యభినంద్యతే' 51

సోఽయ మయోగాన్యయోగాత్యంతాయోగ వ్యవచ్ఛేద లక్షణ

త్రి ప్రకారో నియమః.

అర్థము : నియమోక్తికి ఉదాహరణము. వివాదము అపార్థము మాత్రమే. ఆత్మీయులచేత మాత్రమేకాక యితరులచేత సైతము అభినందింపబడు పార్థుడు మాత్రమే ధనుర్ధరుడు.

ఇది అయోగము, అన్యయోగము, అత్యంతాయోగము - అన్న మూడు వ్యవచ్ఛేదములను లక్షణముగా కలిగి మూడువిధములయినది నియమము

వ్యాఖ్య : వ్యావృత్తి ఫలక విధి నియము మని చెప్పుకొంటిమి. ఈ నియ మము అయోగము, అన్యయోగము, అత్యంతాయోగము అను మూడు విధములయిన వ్యవచ్ఛేదములను ప్రతిఫలింపజేయును.

'వివాదోఽపార్థ ఏవాయమ్' అని యన్నప్పుడు 'వివాదః' విశేష్యము. 'అపా ర్థః' విశేషణము. ఇచట ఏవకారము విశేషణముతో సంగతమై యున్నది. కేవల విశేషణముతో ఏవకారమునకు సంబంధము కలుగదు. అందువల్ల వ్యుత్పత్తినిబట్టి తదభావమును వ్యవచ్ఛేదము గావించి యోగవ్యావృత్తిని స్థాపించుచున్నది. వ్యావృత్తి యనగా వ్యవచ్ఛేదములను పరిహరించి నిర్ణయించుట యని యర్థము.

'పార్థ ఏవ ధనుర్ధరః' అన్నప్పుడు అన్యయోగవ్యవచ్ఛేదకత్వమున్నది. ఇచ్చట ఏవకారము 'పార్థః' అన్నవిశేష్యముతో సంగతమై యున్నది. ఇది 'ధనుర్ధరః' అన్నవిశేషణమునకు వ్యావర్తించి అన్యయోగ వ్యవచ్ఛేదక మగుచున్నది. అన్యులకు ధనుర్ధరత్వమును నిషేధించుచున్న దని యర్థము.

'యో న కేవల నంద్యతే' అనుచోట 'కేవలమ్' అనుటచేత అయోగమును కాని అన్యయోగమును కాని వ్యవచ్ఛేదము చేయుటలేదు. పయిగా తత్సంబంధ వ్యావృత్తిచేత అత్యంతాయోగ వ్యవచ్ఛేదకత్వమే విధింపబడుచున్నది.

ఇట్లు అయోగమునుకాని, అన్యయోగమునుకాని, అత్యంతాయోగమునుకాని నిషేధించుటవల్ల నియమ మన్న శబ్దాలంకారమగును. ఇచ్చటి నిషేధమువల్ల వ్యావృత్తి (నిర్ధారణరూపమైన యోగము) ప్రతిఫలింపవలయును. అట్లు ప్రతిఫలించి నప్పుడే యిది అలంకార మగును.

[పరిసంఖ్యోక్తి - ఉదాహరణము]

పరిసంఖ్యోక్తి ర్యథా-

'పంచ పంచనఖా భక్ష్యా వామేనాక్ష్ణా న పశ్యతి
కాఠిన్య మస్యాః కుచయోః కిమసద్య న్న రోచతే' 52

తదిదం విధినిషేధాభ్యాం శేషాభ్యనుజ్ఞానం పరిసంఖ్యేత్యుచ్యతే.

అర్థము : పరిసంఖ్యోక్తికి ఉదాహరణము. ఐదుగోళ్ళను గలవి ఐదు భక్ష్యములు. ఎడమకంటితో చూడదు. ఆమె కుచములయందు కాఠిన్యము కలదు. ఇష్టము కానిది చెడ్డది.

ఇది విధినిషేధ శేషము నెరిగించుటచేత పరిసంఖ్య యనబడుచున్నది.

వ్యాఖ్య : విధి అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి _ యని మూడు విధములు. పరిసంఖ్యావిధి నాధారముచేసికొని పరిసంఖ్యోక్తి ప్రవర్తించుచున్నది.

'పంచ పంచనఖా భక్ష్యాః' ఐదుగోళ్లుగల జంతువులును, పక్షులును పంచనఖములు. ఇవి పెక్కులు గలవు. వీనిలో ఐదు మాత్రమే భక్షింపదగినవి. ఇది

విధియే. పరిశేషన్యాయముచేత 'ఐదింటిని కాక తక్కిన పంచనఖములను భక్షింప రాదు' అన్న నిషేధము స్ఫురించుచున్నది.

'వామేనాక్ష్ణా న పశ్యతి' ఎడమకంటితో చూడడు. మరి మనుష్యునికి రెండు కన్నులున్నవికదా! 'ఎడమకంటితో చూడడు' అని యన్నప్పుడు పరిశేష న్యాయము చేత 'కుడికంటితో చూచును' అన్న భావము స్ఫురించుచున్నది.

'కాఠిన్య మస్యాః కుచయోః' ఆమె కుచములయందు కాఠిన్యము కలదు. ఇది భావార్థకము. పరిశేషన్యాయముచేత 'ఆమె మనసునందును, మాటలందును, చేష్టలందును కాఠిన్యములేదు' అన్న అభావార్థము ద్యోతితమగుచున్నది.

'అసత్ కిమ్?' ఏది చెడ్డది? 'యన్నరోచతే' ఏది యిష్టముకాదో అది. ఇష్టము కానిది చెడ్డది. పరిశేష న్యాయముచేత 'ఇష్టమైనది మంచిది' అన్న భావమే ప్రతీతమగుచున్నది.

ఇట్లు భావమును చెప్పుటచేత అభావముకాని, అభావమును చెప్పుటచేత భావముకాని, విధిని చెప్పుటచేత నిషేధముకాని, నిషేధమును చెప్పుటచేత విధికాని పరిశేష న్యాయమునుబట్టి స్ఫురించినయెడల పరిసంఖ్యోక్తి యన్న శబ్దాలంకార మగును.

## యుక్త్యలంకారము

44. అయుజ్యమానస్య మిథః శబ్దస్యార్థస్య వా పునః
యోజనా క్రియతే యాసా యుక్తిరిత్యుచ్యతే బుధైః.

45. పదం చైవ పదార్థశ్చ వాక్యం వాక్యార్థ ఏవ చ
విషయోఽస్యాః ప్రకరణం ప్రబంధశ్చాభిధీయతే.

అర్థము: అయుజ్యమానమైన శబ్దమునకు గాని అర్థమునకు గాని, శబ్దార్థము లకు పరస్పరము గాని యోగమును గూర్చినయెడల, దానిని బుధులు యుక్తి యని యందురు. దీనికి విషయముగా పదము, పదార్థము, వాక్యము, వాక్యార్థము, ప్రక రణము, ప్రబంధము - అన్నవి వ్యవహరించును.

వ్యాఖ్య : యోగములేని వానికి యోగమును కల్పించుటకే యుక్తి యని పేరు. యుక్తియన్నను యోగమన్నను కలయిక యని యర్థము. ఇచ్చట 'శబ్దము'

అను పదము 'వాచక' మన్న విస్తృతార్థమున ఉపయుక్తము. అట్లే 'అర్థము'అన్న పదము 'వాచ్యము' అన్న విస్తృతార్థమున ఉపయుక్తము. వాచకములకు యోగమునుగాని, వాచ్యములకు యోగమునుగాని, వాచకవాచ్యములకు పరస్పరయోగమునుగాని కలిగించినయెడల యుక్తియన్న శబ్దాలంకారమగును.

ఈ యలంకారము పదాదుల నాశ్రయించి ఆరు విధములుగా నగును. అవి 1. పదయుక్తి 2. పదార్థయుక్తి 3. వాక్యయుక్తి 4. వాక్యార్థయుక్తి 5. ప్రకరణయుక్తి 6. ప్రబంధయుక్తి.

[పదయుక్తి లక్షణము]

తత్ర-

46. యోగ కారణ పర్యాయాంగాంగిభావ పరంపరాః
పదయుక్తే ర్నిమిత్తం స్యు ర్నిరూఢాః పదసిద్ధయే.

అర్థము : నిరూఢములయిన యోగకారణ పర్యాయాంగాంగిభావపరంపరలు పదసిద్ధికొరకు పదయోజనయొక్క నిమిత్తముగా వ్యవహరించును.

వ్యాఖ్య : ఇది పదయుక్తికి లక్షణము. యోగము, కారణము పర్యాయము, అంగాంగిభావము — అనునవి పరంపరా రూపమున సంయోగము నొందినప్పుడు పదయుక్తి యన్న యలంకార మేర్పడును.

యోగమనగా ప్రకృతి ప్రత్యయమేళనము కాని, అనేక పదమేళనము కాని కావచ్చును. కృదంత, తద్ధితరూపములనుగాని సమాసరూపములనుగాని యిందుచేర్చుకోనగును. నిరూఢమైన యోగము అని యనుటచేత యోగరూఢి యని భావము. అట్టి పదముల పరంపరకు యోజన కలిగించుట ఒక విధమయిన పదయుక్తి. ఇట్లే కారణ కార్యసంబంధమును సూచించు పదముల పరంపరకు యోజన కలిగించుట మరొక విధమయిన పదయుక్తి. ఇచ్చట కారణమనగా కార్యకారణభావ మని తాత్పర్యము. పర్యాయమనగా పర్యాయశబ్దము. ఒకే అర్థమును తెలుపు పెక్కుపదము లున్నప్పుడు ఒకదాని కొకటి పర్యాయపద మగును. పర్యాయపదముల పరంపరకు యోజన కలిగించుట మరొక విధమైన పదయుక్తి. అంగాంగి భావమనగా సమగ్ర రూపమునకును, అందొక్క భాగమునకును గల సంబంధము. ఇట్టి సంబంధముగల పదముల పరంపరచేత ఇంకొకవిధమైన పదయుక్తి.

ఇట్లు యుక్తియందు మొదటిప్రకారమైన పదయుక్తి యోగరూఢి పరంపర, కారణపరంపర, పర్యాయపరంపర, అంగాంగిభావపరంపర – అను వానినిబట్టి యేర్పడు చున్నది.

పదముల సంబంధము సాధారణముగా అర్థము నాశ్రయించియే యేర్పడును. అయినప్పటికి నిచ్చట అన్వయౌపయిక రంజక విశేష నివేశనముచేత పదములకు సంబంధ మేర్పడును. అదియే పదయుక్తి.

## [పదార్థయుక్తి లక్షణము]

47. విరుద్ధానాం పదార్థానాం జాత్యాదీనాం పరస్పరమ్
యోజనా యేహ తాం యుక్తిం పదార్థవిషయాం విదుః.

అర్థము విరుద్ధములయిన జాత్యాది పదార్థములకు పరస్పరము యోజన కలిగించుట పదార్థయుక్తి.

వ్యాఖ్య : జాతి క్రియా గుణ ద్రవ్యములు జాత్యాదులు. విరుద్ధజాతులను బోధించు పదములను యోజన చేసినయెడల ఒక విధమైన పదార్థయుక్తి యగును. ఇట్లే భిన్నములయిన క్రియలను గాని, భిన్నములయిన గుణములను గాని, భిన్నములయిన ద్రవ్యములను గాని యోజన చేసినయెడల పదార్థయుక్తియై సహృదయ హృదయరంజక మగును.

## [వాక్యయుక్తి లక్షణము]

48. గర్భః సహ నిగర్భేణ సంవృత్తిః స సముచ్చయా
హేతవో వాక్యయుక్తీనాం క్రియతా మేవ మాదయః.

అర్థము : నిగర్భముతోడి గర్భము, సముచ్చయముతోడి సంవృత్తి యిటు వంటివానిని వాక్యయుక్తులకు హేతువులుగా చేయనగును.

వ్యాఖ్య : ప్రధానవిషయబోధకమైన వాక్యసముదాయమునకు నడుమనున్న వాక్యాంతరము గర్భము. వాక్యాంతరములో ఏకదేశభూతమైన వాక్యఖండము నిగర్భము. ఉక్తియొక్క ఉపసంహారవచనము సంవృత్తి. తుల్యప్రధానభావములకు

యుగపదేకార్థ సంబంధము సముచ్చయము. పైని చెప్పికొన్న గర్భవాక్యము నిగర్భవాక్యము మొదలయినవానికి యోజన కలిగిన వాక్యయుక్తి యన్న శబ్దాలంకార మగును.

## [వాక్యార్థయుక్తి లక్షణము]

49. యత్తదాదే రుపాదానం క్రియాభ్యాస సముచ్చయౌ
క్రియాసమభిహారశ్చ వాక్యార్థా న్యుజ్యతే మిథః.

**అర్థము** : యత్తదాదుల యుపాదానము, క్రియాభ్యాసము, క్రియా సముచ్చయము, క్రియాసమభిహారము వేర్వేరుగా వాక్యార్థములను కూడియుండును.

**వ్యాఖ్య** : యత్, తత్ – అనునవి సంబంధ బోధక సర్వనామములు ఒకటి ఉద్దేశ్యమునంటి యుండగా రెండవది విధేయము నంటియుండును. ఆదిపద ప్రయోగముచేత యథా, తథా; యత్ర, తత్ర; యః, సః – మున్నగువానినిగూడ జ్ఞాపనముచేయుట జరుగుచున్నది. క్రియను పునరావృత్తి చేయుట క్రియాభ్యాసము. ఇచ్చట సాధారణముగా పునరావృత్తమైన పదము అన్యపదవ్యవహితమై యుండును. విజాతీయములయిన క్రియల నొకేచోట ఒకేమాటు చెప్పుట సముచ్చయము. భృశార్థమునందు పదము పునరుక్తమగుట సమభిహారము. ఇచ్చట పునరుక్తపదము వ్యవహితముకాదు. ఇట్లు పైని చెప్పికొన్న యత్తదాదులను, క్రియాభ్యాసమును, క్రియా సముచ్చయమును, క్రియా సమభిహారమును కూర్చుటచేత వాక్యార్థయుక్తి యన్న శబ్దాలంకార మగును

## [ప్రకరణవిషయయుక్తి లక్షణము]

50. య దశ్రద్ధేయ శైలాదివర్ణనాభ్యుపపత్తయే
వాక్యం సేహ ప్రకరణవిషయా యుక్తి రిష్యతే.

**అర్థము :** అశ్రద్ధేయములయిన శైలాదులను వర్ణించుటకొరకై చేసిన వాక్యరచనము ప్రకరణ విషయమయిన యుక్తిగా పరిగణింపబడును.

**వ్యాఖ్య** : శ్రద్ధేయ మని యనగా శ్రద్ధాపూర్వకముగా గమనింపదగినదని యర్థము. అశ్రద్ధేయమని యనగా అట్లుకానిదని యర్థము. లోకమునందు నదీసముద్ర

పర్వతారణ్యప్రభృతులు పెక్కులు దర్శనీయములు కలవు. కాని, వానిని దర్శించుటకు అందరకు నవకాశములు కలుగవు. కావ్యము వ్యవహారవేత్తృత్వమును గూడ కలిగించును. కావుననే ప్రకృత్యంగములయిన నదీసముద్రాదులను వర్ణించును. అష్టాదశవర్ణనములను కావ్యమునందు గావింపవలయుననుట కిదియే హేతువు. దీనివలన నైసర్గికస్థితి తెలియుటయే కాక పాఠకునిలో నైసర్గిక సౌందర్య సముద్దీపనము కూడ జరుగును. అవకాశములున్నవారు ప్రకృతిలోనే యిట్టివానిని చూడగలరు. అయినప్పటికిని, అతిమాత్ర పరిమాణముగల పర్వతాదులను సమగ్రముగా నేకకాలములో దర్శింపగలుగుట సాధ్యము కాదు. కవి తన సామర్థ్యముచేత సమగ్రత్వ దర్శనము కలుగజేయును. కావుననే బాహ్యాలోచనములతో శ్రద్ధాపూర్వకముగా చూడజాలని పర్వతాదులను వర్ణించి రచనచేసినచో, అది ప్రకరణయుక్తియన్న శబ్దాలంకార మగును.

[ ప్రబంధవిషయయుక్తి లక్షణము ]

51. ప్రబంధవిషయాప్యేవం యుక్తి రుక్తా మనీషిభిః
ఉదాహరణమాలాసాం రూపవ్యక్త్యై నిదర్శ్యతే.

అర్థము : పండితవర్యులచేత ఈవిధముగానే ప్రబంధవిషయముకూడ యుక్తిభేదముగా చెప్పబడినది. పైనిచెప్పిన యుక్తిభేదములకు రూపము స్పష్టమగుటకై ఉదాహరణములు చూపబడుచున్నవి.

[ పదయుక్తి - ఉదాహరణము ]

తత్ర యోగరూఢి పరంపరాదినిమిత్తా పదయుక్తి ర్యథా—
'ప్రాచ్యాం నిర్జితజంభజిద్ద్విపశిరః సిందూరశోభం దిశి
ప్రత్యాఖ్యాతహయాంగనాస్యహుతభుగ్జ్యోతిః ప్రతీచ్యర్ణవే
ప్రాతర్జాత మదోన్మమత్కమలినీ కింజల్క కల్కోద్భటం
భానోః పూర్ణనభఃకటాహ కుహరక్రోడం మహః పాతువః' 53

అత్ర జంభజిద్ద్విప ఇతి యోగరూఢి పరంపరా, హయాంగనాస్యహుతభుగితి పర్యాయపరంపరా, ప్రాతర్జాతమదోన్మమత్క

మలినీ కింజల్క కల్కోద్భట మితి హేతుపరంపరా, నభఃకటాహ కుహర క్రోడ మిత్యంగాంగిభావ పరంపరా చ పరిస్ఫురన్తీ దృశ్యతే.

అర్థము : యోగరూఢి పరంపరాది నిమిత్తమయిన పదయుక్తికి ఉదాహరణము.

తూర్పుదిక్కున ఓడింపబడిన ఐరావత శిరస్సిందూరశోభను గలదియు, పడమటి సముద్రమునందు నిరాకరింపబడిన బడబాముఖానలజ్యోతిని గలదియు, ఉదయమున నుద్భవించిన మదముచేత వికసించిన కమలసమూహముల కేసరముల కల్కమున కుద్భటమైనదియు, పూర్ణనభః కటాహకుహరమును క్రోడముగా కలదియునైన భానుని మహస్సు మిమ్ములను రక్షించును గాక !

ఇచ్చట 'జంభజిద్ద్విపః' అనుటచే యోగరూఢి పరంపర, 'హయాంగనాస్య హుతభుక్' అనుటచే పర్యాయ పరంపర, 'ప్రాతర్జాత మదోన్మిషత్కమలినీ కింజల్క కల్కోద్భట'మ్మని యనుటచే హేతు పరంపర, 'నభః కటాహకుహరక్రోడ'మ్మని యనుటచే అంగాంగి భావపరంపర పరిస్ఫురితములై కనిపించుచున్నవి.

వ్యాఖ్య : ఇది పదయుక్తి అన్న శబ్దాలంకారభేదమున కుదాహరణము. ఇందు యోగరూఢి పరంపర, పర్యాయపరంపర, హేతుపరంపర, అంగాంగిభావపరంపర ప్రదర్శితములైనవి ఇవి యన్నియు పదముల యోగముచేతనే సిద్ధించుట చేత పదయుక్తి యన్న పేరు అన్వర్థమగుచున్నది.

జంభుడను రాక్షసుని జయించినవాడు 'జంభజిత్'. ఇది కృదంతపదము; కావున యౌగికము. జంభజిత్తుయొక్క ద్విపము జంభజిద్ద్విపము. ఇది సమాసము. ఇదియు యౌగికమే. జంభజిత్తనగా ఇంద్రుడని రూఢి. ఇంద్రుని యేనుగు ఐరావతమని రూఢి. కావుననే యిది యోగరూఢి పరంపరకు లక్ష్యము.

హయాంగన 'బడబ'కు పర్యాయపదము. హుతభుక్కు 'అగ్ని'కి పర్యాయపదము. 'హయాంగనాస్యహుతభుగ్జ్యోతిః' అని పర్యాయపదములతో చెప్పినప్పటికి 'బడబాగ్ని కాంతి' యే యుద్దిష్టము. అదియే ప్రతీత మగుచున్నది. కావుననే యిది పర్యాయపరంపరకు లక్ష్యము.

మదము – కింజల్కము – కల్కము – ఉద్భటత్వము – ఈ పరంపరయందు పూర్వములు తదుత్తరములకు హేతువు లగుచున్నవి. అన్నింటికిని హేతువు

భానుకాంతి. మదము కింజల్కముల ఉన్మేషమునకు, అది కల్కమునకు, అది ఉద్భటత్వమునకు హేతువు లగుచున్నవి. కావుననే, యిది హేతు పరంపరకు లక్ష్యము.

నభఃకటాహమని యనగా ఆకాశమనెడి పర్వతమని యర్థము. ఇది అంగి. ఇందొక యంగము కుహరము; ఇందొక యంగము క్రోడము. ఆకాశపర్వతము - తద్గుహ - తన్మధ్యభాగము. ఈ పరంపరలో అంగాంగిభావము ప్రదర్శింపబడినది. కావుననే, యిది అంగాంగిభావ పరంపరకు లక్ష్యము.

ఇట్లు కవిసామర్థ్యముచేత సహృదయహృదయములందు పై విధములయిన పరంపరలు పరిస్ఫురితములగుచున్నవి. ఇవి పదముల నలంకరించుటచేత పదయుక్తి శబ్దాలంకారముగా పరిగణింపబడుచున్నది.

[ పదార్థయుక్తి - ఉదాహరణము ]

విరుద్ధజాత్యాదియోగనిమిత్తా పదార్థయుక్తిర్యథా-
'తన్నాగేంద్రకరోరుదోః కరిశిరః పీనస్తనాంసం వపుః
స్త్రీపుంసాకృతి యత్పితుస్తవ ముఖే రమ్యాగ్రమీక్షామహే
వారాహ్యేతి నర్మణీభవదనః పశ్యన్నదాస్యా ముఖం
నాభిష్టౌతి హసన్న నిందతి తదా శ్లిష్టోఽంబయా పాతు వః'

అత్ర స్త్రీపుంసాకృతీతి విరుద్ధజాతియోజనా, నాభిష్టౌతి న నిందతీతి విరుద్ధక్రియాయోజనా, రమ్యాగ్రమితి విరుద్ధగుణయోజనా, ముఖే వపురీక్షామహే ఇతి విరుద్ధద్రవ్యయోజనా చ లక్ష్యతే.

అర్థము : విరుద్ధజాత్యాదియోగ నిమిత్తమయిన పదార్థయుక్తికి ఉదాహరణము.

ఏనుగుతుండములవంటి యూరువులును, బాహువులును కలిగి, ఏనుగు కుంభస్థలమువలె పీనములయిన స్తనములను మూపులను కలిగియుండి స్త్రీపురుష రూపము గల నీ తండ్రియొక్క రమ్యాగ్రమైన శరీరమును నీముఖమునందు చూచుచున్నామని వారాహిచేత పరిహసింపబడిన గజాననుడు ఆమె ముఖమును చూచుచు స్తుతిం

చుటగాని, నిందించుటగాని చేయలేదు. అప్పుడు నవ్వుచు అంబ అతనిని కౌగిలించు కొనెను. అట్టి గజాననుడు మిమ్ములను రక్షించునుగాక!

ఇచ్చట స్త్రీపుంసాకృతి యనునది విరుద్ధజాతియోజన, స్తుతించుట గాని నిందించుట గాని చేయలేదు అన్నది విరుద్ధ క్రియాయోజన, రమ్యోగ్ర మనునది విరుద్ధగుణయోజన, ముఖమునందు శరీరమును చూచుచున్నామన్నది విరుద్ధద్రవ్య యోజన.

వ్యాఖ్య: ఇది పదార్థయుక్తి యన్న శబ్దాలంకార భేదమున కుదాహరణము. ఇందు విరుద్ధములయిన జాతులు, విరుద్ధములయిన క్రియలు, విరుద్ధములయిన గుణములు, విరుద్ధములయిన ద్రవ్యములు యోజన నొంది కన్పించుచున్నవి. ఇది విరుద్ధపదార్థముల కూడికచేత నేర్పడి సహృదయ రంజక మగుచున్నది. కావుననే పదార్థయుక్తి యన్న పేరు అన్వర్థమగుచున్నది.

స్త్రీ పురుషులు భిన్నజాతులు. ఈశ్వరుని శరీరమునందు ఈవిరుద్ధజాతుల యోజన యున్నది. కావుననే స్త్రీపుంసాకృతి విరుద్ధజాతియోజనకు లక్ష్యము.

స్తుతియు నిందయు పరస్పరము విరుద్ధక్రియలు. ఈ రెండింటి నొక్కచోట చేర్చుటచేత ఇది విరుద్ధక్రియాయోజనకు లక్ష్యము

రమ్యము ఉగ్రము పరస్పరము విరుద్ధగుణములు. శివశరీరము నాశ్రయించి యున్నట్లు చెప్పుటచేత, ఇది విరుద్ధగుణయోజనకు లక్ష్యము.

ముఖము శరీరము విరుద్ధద్రవ్యములు. శరీరమున నేకదేశము ముఖము. కావుననే రెండింటిని తుల్యకోటికి చెందినట్లు చూచుట సంగతము కాదు. కావున విరుద్ధద్రవ్యము లనియే యనవలయును. అందువల్లనే, యిది విరుద్ధ ద్రవ్యయోజనకు లక్ష్యమైనది.

ఇట్లు పరస్పర విరుద్ధములయిన జాత్యాది పదార్థములను యోజనచేయుట చేతనే యిది పదార్థయుక్తి యైనది.

[ వాక్యయుక్తి - యుదాహరణము ]

వాక్యగర్భాదివిషయా వాక్యయుక్తి ర్యథా -

నిజాన్మాతంగ ఘటావిభక్త చతురాఘాటా మహీ సాధ్యతే
సిద్ధా సా చ వదంత ఏవ హి వయం రోమాంచితాః పశ్యత

విప్రాయ ప్రతిపాద్యతే కి మపరం రామాయ తస్మైనమో
యస్మా దావిరభూత్కథాద్భుతమిదం యత్రైవచాస్తంగతమ్' 55

అత్ర వదంత ఏవ హి వయం రోమాంచితాః పశ్యతేతి వాక్య గర్భః. తత్రైవ పశ్యతేతి వాక్యాంతరే భావావిష్కారవాచా నిగర్భః. కిమపరం రామాయ తస్మై నమ ఇతి వాక్యసంవృత్తిః. యస్మాదావిర భూత్కథాద్భుతమిదం యత్రైవచాస్తంగత మితి వాక్యసముచ్చయః. సేయ మేతేషాం యోజనాద్వాక్యవిషయా యుక్తిర్భవతి.

అర్థము : వాక్యగర్భాది విషయమైన వాక్యయుక్తికి ఉదాహరణము.

దిగ్గజ ఘటావిభక్తమై చతురస్రముగానున్న భూమి జయింపబడుచున్నది. అది సిద్ధించినది. చెప్పుచుండగనే మేము రోమాంచితుల మగుచున్నాము. చూడుడు. విప్రునికి దానము చేయబడుచున్నది. ఇంతకంటె నేమున్నది? ఎవనివలన ఈ కథాద్భుతము పుట్టినదో, యెవనియందు అస్తమించినదో ఆ (పరశు)రామునకు నమస్కారము.

ఇచ్చట 'చెప్పుచుండగనే మేము రోమాంచితుల మగుచున్నాము' అన్నది వాక్యగర్భము అచ్చటనే 'చూడుడు' అని వాక్యాంతరమునందలి భావావిష్కార వచనముచేత నిగర్భము. 'ఇంతకంటె నేమున్నది? ఆ రామునికి నమస్కారము' అన్నది వాక్యసంవృత్తి. 'ఎవనివల్ల ఈ కథాద్భుతమావిర్భూతమయ్యెనో, ఎవని యందు అస్తమించెనో' యన్నది వాక్యసముచ్చయము. వీని యన్నింటి యోజన వల్ల, ఇది వాక్యవిషయమైన యుక్తి యగుచున్నది.

వ్యాఖ్య : ఇది వాక్యయుక్తియన్న శబ్దాలంకారభేదమున కుదాహరణము. ఇందు వాక్యగర్భము, నిగర్భము, సంవృత్తి, సముచ్చయము – అనువానికి ఒకే యెడల యోజన యుండుటచేత ఇది వాక్యయుక్తి యన్నపేరునకు తగియున్నది.

ఉదాహరణపద్యము భట్టప్రభాకరుని రచనగా క్షేమేంద్రుని ఔచిత్యవిచార చర్చయందు ప్రదర్శింపబడినది.

[ వాక్యార్థయుక్తి - ఉదాహరణము ]

యత్తదాద్యుపాదాన నిమిత్తా వాక్యార్థయుక్తి ర్యథా-
'తిష్ఠ ద్వారి భవాంగణే వ్రజ బహిః సద్మేతి వర్త్మేక్షతే
శాలామంచ తమంగమంచ వలభీమంచేతి వేశ్మాంచతి
దూతీం సందిశ సందిశేతి బహుశః శందిశ్య సాస్తే తథా
తల్పే కల్పమయీవ నిర్ఘృణ యథా నాంతం నిశా గచ్ఛతి' 56

అత్ర ప్రథమపాదే క్రియాసముచ్చయః, ద్వితీయే క్రియాభ్యాసః తృతీయే దూతీం సందిశ సందిశేతి యావత్క్రియాసమభిహారః. శేషే తు తథా సాస్తే యథా నిశాంతం న గచ్ఛతీతి యత్తదోరుపాదానం వాక్యార్థయుక్తే ర్హేతుః ప్రతీయతే. సేయ ముక్తలక్షణా వాక్యార్థయుక్తి ర్భవతి.

అర్థము : యత్తదాద్యుపాదాన నిమిత్తమయిన వాక్యార్థయుక్తికి ఉదాహరణము.

ఓయి! నిర్దయుడా! ద్వారమునందు నిలిచి, వాకిటనుండి, యింటిబయటికి వెడలి, తెన్ను చూచుచున్నది. శాలాగృహము నధిరోహించి, అట్టాలకము నధిరోహించి, వలభి నధిరోహించి, గృహోపరిభాగము నధిరోహించుచున్నది. దూతికను సందేశించి సందేశించి సందేశించి కల్పసదృశముగానైన రాత్రి గడచునంతవరకు ఆమె తల్పమునం దట్లే యున్నది.

ఇచ్చట ప్రథమపాదమునందు క్రియాసముచ్చయము; ద్వితీయమునందు క్రియాభ్యాసము; తృతీయమునందు దూతికను సందేశించి సందేశించి అన్నంతవరకు క్రియాసమభిహారము; మిగిలినదానియందు 'ఎంతవరకు రాత్రి గడవదో అంతవరకు అట్లే యున్నది' అని యత్తచ్ఛబ్దముల యుపాదానము వాక్యార్థయుక్తికి హేతువుగా ప్రతీతమగుచున్నది. ఇది పైని చెప్పిన లక్షణములుగల వాక్యార్థయుక్తి యగుచున్నది.

వ్యాఖ్య : ఇది వాక్యార్థయుక్తి యన్న శబ్దాలంకారభేదమున కుదాహరణము. ఇందు క్రియా సముచ్చయము, క్రియాభ్యాసము, క్రియాసమభిహారము,

య త్తత్ప్రయోగము – అనువానికి యోజన కలదు. కావుననే దీనికి వాక్యార్థయుక్తి యన్నపేరు అన్వర్థమగుచున్నది.

ఒక దూతిక నాయికనుగూర్చి నాయకునితో చెప్పుచున్న ప్రసంగము లక్ష్యము. నాయిక మొదట ఇంటిలోనే ప్రియునికొరకు వేచియుండెను. సమయము దాటు చున్నది. అతడు రాలేదు. ఆమెకు తొందర కలిగినది. కావున మరికొంత ముందు నకు వచ్చినది. ఇల్లు – వాకిలి – బయలు – వీధి – ఈ విధముగా ముందుముందు నకు వచ్చినది. ఇక్కడి క్రియాపదములు పెక్కులు, భిన్నభిన్నములు. కావుననే యిది క్రియాసముచ్చయమునకు లక్ష్యము. 'సముచ్చయేఽన్యతరస్యామ్' (3-4-3) అను సూత్రమువలన పూర్వక్రియల కన్నింటికిని 'లోట్' ప్రయుక్తమైనది. (తెలుగునందు క్త్వార్థకమును వాడినచోట్ల సంస్కృతమునందు మధ్యమపురుషైకవచనము వాడబడినది. తెలుగునం దిట్టి వాడుకలేదు. సంస్కృతమునందు విశిష్టముగా కలదు. కావుననే తిష్ఠ, భవ, వ్రజ – అని మధ్యమపురుషైకవచనరూపములు ప్రయుక్తములయినవి. 'సముచ్చయే సామాన్యవచనస్య' (3-4-5) అను సూత్రము వలన చివరిక్రియ వర్తమానార్థకమైన లట్ప్రత్యయమును పొంది 'ఈక్షతే' అని యున్నది.

రెండవపాదమునందు క్రియాభ్యాసము కలదు. అభ్యాసమనగా ఒకే క్రియ పునఃపునరుక్తమగుట. 'అంచతి' అను క్రియ యిచ్చట పునరుక్తి నొందినది. ఇచ్చటకూడ చివరి రూపము మాత్రమే వర్తమానార్థకప్రత్యయమును కలిగి యున్నది; పూర్వపూర్వములు లోట్ప్రత్యయముతోనే యున్నవి.

మూడవపాదమునందు క్రియాసమభిహారము కలదు. భృశార్థమునందు పదము పునరుక్తమగుట సమభిహారము. 'సందిశ, సందిశ' అని యిచట వెంట వెంటనే పదము పునరుక్తమైనది. ఇదియు లోట్ప్రత్యయముతోనే యున్నది. 'క్రియా సమభిహారే లోట్, లోటో హిస్వౌ వా చ తధ్వమోః' (3-4-2) అను సూత్రము నిర్వాహకము. 'యథావిధ్యను ప్రయోగః పూర్వస్మిన్' (3-4-4) అని యనుటవల్ల అదేధాతువు అనుప్రయుక్తము కావలయును. 'బహుశః సందిశ్య' అని మరల అదే ధాతువు నుపయోగించుట అందుకొరకే.

ఇట్లు పై లక్షణములన్నియు నొక్కచోట యోజననొందుటచేత, ఇది వాక్యార్థ యుక్తి యన్న శబ్దాలంకారమునకు లక్ష్యమయినది.

[ ప్రకరణయుక్తి - ఉదాహరణము ]

అశ్రద్ధేయ పర్వతాదివర్ణనోపపత్తిహేతుః ప్రకరణవిషయా యథా -

'ముదే మురారే రమరైః సుమేరో
రానీయ యస్యోపచితస్య శృంగైః
భవంతి నోద్దామగిరాం కవీనా
ముచ్ఛ్రాయ సౌందర్యగుణా మృషోద్యాః' 57

**అర్థము** : అశ్రద్ధేయ పర్వతవర్ణనోపపత్తికి హేతువైన ప్రకరణ విషయమైన యుక్తికి ఉదాహరణము.

శ్రీకృష్ణుని సంతోషమునకై దేవతలచేత తీసికొనిరాబడిన సుమేరుశృంగముల చేత సేవింపబడిన (రైవతకపర్వతముయొక్క) దానియొక్క ఔన్నత్య సౌందర్య గుణములు ఉద్దామవాక్కులయిన కవులకు మిథ్యాప్రయత్నము లగుటలేదు.

**వ్యాఖ్య** : ఇది ప్రకరణయుక్తియన్న శబ్దాలంకారభేదమున కుదాహరణము. ఇందు పర్వతవర్ణన కలదు. కవి తన భావుకత్వముచేత కొన్ని కల్పనలు చేయును. అవి కొన్నియెడల వస్తుతత్త్వమును గోచరింపజేయును; కొన్ని యెడల వస్తుస్థితికి ఉత్కర్షను కలుగజేయును; కొన్ని కథాగతికి సౌందర్యమును, సముజ్జ్వలత్వమును కలుగజేయును. కొన్నియెడల పాత్రల శీలసంపదను ప్రతిఫలింపజేయును. కావున వర్ణన తన్మాత్రప్రయోజన పర్యవసితము కాదు. ఆయా ప్రకరణమునుబట్టి అనేక ప్రయోజనములు ఆలంబితములై యుండును.

ద్వారకయందలిది రైవతకపర్వతము. ద్వారకయందు కృష్ణు డుండుటచేత దేవతలు కృష్ణుని కానందమును కలిగింపగోరిరి. అందువలన దేవతాపర్వతమైన సుమేరువుయొక్క శృంగములను తీసికొనివచ్చి దీని శిఖరములను దిద్దిరి. ఇట్లు చేయుటచేత సుమేరువుయొక్క ఔన్నత్యము, సౌందర్యము, ఇంకను మిగిలినగుణము లన్నియు రైవతకమునకు సంక్రమించినవి. ఇది నిజమనుటకు తార్కాణమేమి ? ఏ పర్వతమును చూచినను అత్యంతోన్నతము, అత్యంత సుందరము అని కవులు వర్ణించుట సహజము. అట్టియెడల వారి వాక్కులు అతిశయోక్తులు; అనృతము నందు మాత్రమే వారి ప్రయత్నములు ప్రవర్తించును. ఇచ్చట రైవతకపర్వతము

సర్వగుణ సమున్నత మగుటచేత, సౌందర్య సముజ్జ్వల మగుటచేత కవుల వాక్కులు మృషోద్యమములు కావు. అనగా స్వభావోక్తు లనియే యర్థము. ఇట్లు భంగ్యంతరము నాశ్రయించి పర్వతౌన్నత్య సౌందర్యములను వర్ణించుట యిచ్చట కాననగును. దీనికి పరమ ప్రయోజనమేమి ? కృష్ణుని యుత్తమనాయకత్వమును దైవత్వమును నిరూపించుటయే. దేవతలే కృష్ణునికి సంతోషము కలిగించుటకై యిట్లు చేసిరనుట చేత కృష్ణుని ఉత్తమత్వము, ఉపాస్యత్వము వెల్లడి యగుచున్నవి.

లోకమునందు అశ్రద్ధేయములయిన పర్వతాదులు కవుల వర్ణనమునందు ప్రకరణోచితములై బహువిధప్రయోజన సంపన్నము లగును. కావుననే, యిది ప్రకరణయుక్తికి లక్ష్యమైనది.

ఉదాహరణశ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

## [ ప్రబంధయుక్తి - ఉదాహరణము ]

ప్రబంధవ్యాపి వస్తూపపత్త్యైర్హేతుస్తు ప్రబంధవిషయాయుక్తిర్భవతి. సా యథా -

'ధూమజ్యోతిః సలిల మరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యాదపరిగణయన్గుహ్యకస్తం యయాచే
కామార్తా హి ప్రకృతి కృపణాశ్చేతనా చేతనేషు' 58

అర్థము : ప్రబంధమునంతను వ్యాపించియుండు వస్తువుయొక్క ఉపపత్తికి హేతువైనది ప్రబంధవిషయమైన యుక్తి యగును. దానికి ఉదాహరణము

పొగ, నిప్పు, నీరు, గాలి - వీని కలయికయైన మేఘమెక్కడ ? సమర్థములయిన యింద్రియములు గల ప్రాణులచేత ప్రాపణీయములయిన సందేశార్థములెక్కడ ? అని యాలోచింపక ఔత్సుక్యమువల్ల యక్షుడు దానిని (మేఘమును) యాచించెను. కామార్తులు చేతనాచేతనముల విషయమున స్వాభావికముగనే దీనులు కదా !

వ్యాఖ్య : ఇది ప్రబంధయుక్తి యన్న శబ్దాలంకారభేదమున కుదాహరణము. ప్రబంధవస్తువు (ఇతివృత్తము)నకు సారభూతమైన విషయము యోజన పొందుటచేత ఈపేరు దీనికి సార్థకమగును.

ఉదాహరణ పద్యము కాళిదాసుని మేఘసందేశమునందలిది.

మేఘమునందు నాలుగు పదార్థములు గలవు. అందు ఒక్కటికూడ సచేతనము కాదు. అట్టియెడల చైతన్యవంతులు సమర్థములయిన యింద్రియములుకలవారు మాత్రమే చేయదగిన సందేశవాహకత్వమును మేఘమెట్లు చేయగలదు, ఇట్లు అననురూపముల నొకచోట చేర్చుటచేత విషమాలంకార మగుచున్నది. ఈ విషమత్వమునే ఆధారముగా చేసికొని మేఘసందేశ కథ సర్వస్వము నిలిచినది. కావుననే కవి అర్థాంతరన్యాసముచేత ఈ విశిష్టవిషయమును సమర్థించుచున్నాడు. కామార్తులయినవారు స్వాభావికముగనే దీనులగుదురు; కావుననే వారికి చేతనములని, అచేతనములని గుర్తింపగల జ్ఞానముకూడ నశించును. ఇది లోకసామాన్య విషయము. కథయందలి యక్షుడు కూడ అట్టివాడు. కావుననే చేతనములు, అందును సమర్థములయిన యింద్రియములు గల ప్రాణులు చేయదగిన సందేశవాహకకృత్యమునకు మేఘమును యాచించెను. ఇట్లనుటచేత కావ్యకథాసంబంధమయిన విషమత్వము సమర్థింపబడి, సమంజసముగా ప్రదర్శింపబడినది. కావుననే యిది ప్రబంధయుక్తికి లక్ష్యమైనది.

## భణిత్యలంకారము

51. ఉక్తిప్రకారో భణితిః సంభవేఽసంభవే చ సా
విశేష సంవృత్త్యాశ్చర్య కల్పనాసు చ కల్ప్యతే.

అర్థము : ఉక్తిప్రకారమునకు భణితి యనిపేరు. ఇది సంభవభణితి, అసంభవభణితి, విశేషభణితి, సంవృత్తిభణితి, ఆశ్చర్యభణితి, కల్పనాభణితి – అని ఆరు విధములుగా నుండును.

[ సంభవభణితి - ఉదాహరణము ]

అత్ర సంభవ భణితి ర్యథా -

'సద్యో(ద్రావిత కేతకోదరదల(స్రోతః (శియం బి(భతీ
యేయం మౌక్తికదామ గుంఫనవిధే ర్యోగచ్ఛవిః (ప్రాగభూత్
ఉత్సేక్యా కలశీభి రంజలిపుటైః పేయా మృణాలాంకురై
ర్పాతవ్యా చ శశిన్యముగ్ధవిభవే సా వర్తతే చం(దికా' 59

అ(త జ్యోత్స్నాయాః సద్యో(ద్రావిత కేతకోదరదల(స్రోతః సాదృశ్యాది సంభవా దియం సంభవభణితి ర్ద్విరూపా.

**అర్థము** : ఇచ్చట సంభవభణితికి ఉదాహరణము.

ఏది ముత్యాలహారమును (గుచ్చుట యందు ముందుగా యోగచ్ఛవి యయ్యెనో, అప్పుడే (దవించుచున్న మొగలిపొట్టలయందలి (ప్రవాహముయొక్క శోభను నింపుచున్నదై కలశములచేత తోడవలసినదియు, దోసిళ్ళతో (తాగవలసిన దియు, తామరతూండ్లతో కొలువవలసినదియు నయ్యెనో ఆ వెన్నెల అముగ్ధవిభవ మైన చం(దబింబమునందు వర్తించుచున్నది.

ఇచ్చట వెన్నెలకు అప్పుడే (దవించుచున్న మొగలిపొట్టలయందలి (ప్రవాహము మొదలయిన వానితో సాదృశ్యము సంభవించుటవల్ల ఇది రెండు రూపములు గల సంభవభణితి.

**వ్యాఖ్య** : ఉక్తిభంగికి భణితి యనిపేరు. అనగా సర్వసామాన్యమైన వచనరీతికి గాక, భంగ్యంతరముగా నున్న వచనరీతికి భణితియన్న పేరు చెల్లును. అప్పుడే యిది శబ్దాలంకారమగును. ఇది పైని చెప్పుకొన్న శబ్దాలంకారములలో తొమ్మిదవది.

భణితి ఆరువిధములుగా నుండును. అందు మొదటిది సంభవభణితి. ఇది చి(తతురగమువంటిది. చి(తమునందలి గుఱ్ఱము వాస్తవమైన గుఱ్ఱము కాదు. కాని చి(తకారుని రచనాచాతుర్యముచేత వాస్తవమే యనిపించును. అట్లే లోకమునందు అసంభవమేయైనప్పటికిని కవి తన(ప్రతిభచేత సంభవమని వర్ణించునెడల అది సంభవ భణితి యగును.

(ప్రకృతోదాహరణమునందు జ్యోత్స్న వర్ణనము గలదు. 'జ్యోత్స్న సద్యో(ద్రావిత కేతకోదర (స్రోతస్సువలె నున్నది' మొదలయిన విధముగా చెప్పినయెడల

ఉపమాలంకారము మాత్రమే అయ్యేడిది. అట్లు కాక స్రోతః శ్రీని నింపుట, గుంఫన విధికి యోగచ్ఛవినిగూర్చుట మొదలయిన విధముగా సాదృశ్యము భంగ్యంతరమున సముపాత్తమగుటచేత ఇది భణితి యన్న శబ్దాలంకార మయ్యెను. ఇంకొక విషయము. నిజమునకు కేతకోదరదళములు కరగుట లేదు; అట్లే ప్రవాహమేర్పడుటయు లేదు. లేనిదానిని విధించుట జరిగినది. కావుననే ఇది సంభవభణితి. మౌక్తిక దామగుంఫనవిధికిని వెన్నెలకును సంబంధము లేదు. అయినను కల్పింపబడినది. కావుననే సంభవభణితి యైనది. ఇట్లే వెన్నెలను కలశములతో తోడుట, దోసిళ్లతో త్రాగుట, తామరతూడులతో కొలుచుట అసంభవములు. అసంభవత్వమును నిషేధించి సంభవత్వమును విధించుట ఇచ్చట జరిగినది. కావుననే యిది సంభవభణితి యైనది. నిషేధించుటయు, విధించుటయు—రెండు నుండుటవల్ల నే యిది (ద్విరూప) రెండు రూపములు గలదైనది.

## [అసంభవభణితి - ఉదాహరణము]

అసంభవభణితి ర్యథా -

'క్వ పేయం జ్యోత్స్నాంభో వదనబిసవల్లీ సరణిభి
ర్మృణాలీతంతుభ్యః సిచయరచనా కుత్ర భవతి
క్వ వా పారీమేయో బత వకులదామ్నాం పరిమలః
కథం స్వప్నః సాక్షాత్ కువలయదృశం కల్పయతు తామ్' 60

అత్ర జ్యోత్స్నాదీనాం మృణాలాదిభిః పేయత్వాదే రసంభవాదియ మసంభవభణితి ర్నిషేధరూపా.

అర్థము : అసంభవభణితికి ఉదాహరణము. నోటియందుంచుకొన్న తామరతూడురంధ్రముల వెంబడి వెన్నెలనీరు ఎక్కడనైన త్రాగబడునా, తామర తూండ్లలోని దారములచేత ఎక్కడనైన వస్త్రములు నేయబడునా ? పొగడదండల పరిమళము ఎక్కడనైన కుండలతో కొలువబడునా ? స్వప్నము కువలయనేత్రను కన్నులయెదురుగా కల్పించుట యెట్లు ?

ఇచ్చట జ్యోత్స్నను మృణాళముతో త్రాగుట మొదలైనవానియొక్క అసంభవత్వమువల్ల, ఇది నిషేధరూపమైన అసంభవభణితి.

వ్యాఖ్య : లోకవ్యవహారమునందు వాస్తవముగా లేనిది అసంభవము. అసంభవమును కవికూడ కంఠోక్తముగా అసంభవమని తెల్పుటయే అసంభవభణితి. ఇది యలంకార మగుటచేత భంగ్యంతరము నాశ్రయించుటయే కాని సూటిగా చెప్పుట జరుగరాదు.

స్వప్నమునందు కనిపించిన వ్యక్తిని కన్నులయెదుట చూడగల్గుట అసంభవము 'కలలో విషయము ఇలలో జరుగదు' అని లోకోక్తి. దీనికి మూడు నిదర్శనములు చూపబడినవి. వెన్నెల నీటిని తామరతూడుతో త్రాగుట, తామరతూండ్ల దారములతో వస్త్రములు నేయుట, పొగడదండల వాసనను కుండలతో కొలుచుట – ఇవియు అసంభవములే. ఇట్లు అసంభవములైనవానిని ఉపమానములుగా చేసి ఉపమేయముయొక్క అసంభవత్వమును నిరూపించుట యిచ్చట జరిగినది. వస్తుగతమైన అసంభవత్వమే కాక ఉక్తిగతమైన అసంభవత్వముకూడ ఇచ్చట కలదు. కవియే 'క్వ, కుత్ర, క్వ, కథమ్' అను ప్రశ్నవాచకములచేత అసంభవత్వమును కంఠోక్తముగా చెప్పుచున్నాడు; అనగా నిషేధకల్పనము చేయుచున్నాడు. కావుననే యిది నిషేధరూపమైన అసంభవభణితికి లక్ష్యమైనది.

[ విశేషభణితి – ఉదాహరణము ]

విశేషభణితి ర్యథా –

'రేవతీ దశనోచ్ఛిష్ట పరిపూతపుటే దృశౌ
వహన్ హాలీ మదక్షీబః పానగోష్ఠ్యాం పునాతు వః' 61

అత్ర రేవతీ దశనోచ్ఛిష్టయో రపి హాలిదృశోర్యత్ పూతత్వం, మదక్షీబస్యాపి హాలినో యత్పావనత్వ మసౌ విశేష ఇతీయం విశేష భణితి ర్నిషేధే విధిరూపా.

అర్థము : విశేషభణితికి ఉదాహరణము. రేవతి ముద్దుపెట్టుటచేత పరిపూతములైన రెప్పలనుగల నేత్రములు వహించి, పానగోష్ఠియందు మద్యముచే మత్తుడైన బలరాముడు మిమ్ములను పవిత్రీకరించునుగాక !

ఇచ్చట రేవతీ దశనోచ్ఛిష్టములయిన బలరాముని నేత్రములకు పూతత్వము, మద్యముచే మత్తుడైన బలరామునికి పావనత్వము విశేషములు. కావుననే యిది నిషేధమునందు విధిరూపమైన విశేషభణితి.

వ్యాఖ్య : నిషేధింపవలసినచోట కవి ఒక విశిష్టమైన ఆశయముతో విధించుటయే విశేషము. ఇట్టియెడల భంగ్యంతరకథనము సహజముగానే సముత్పన్నమగును.

బలరాముని కన్నులను రేవతి ముద్దుపెట్టుకొన్నది. కావున అతని కన్నులకు ఉచ్ఛిష్టమంటినది; అనగా పవిత్రతను కోల్పోయిన వని యర్థము. కాని కవి అందువల్లనే ఆ కన్నులు పవిత్రములై నవనుచున్నాడు. పవిత్రత లేదని నిషేధింపవలసినచోట పవిత్రతను విధించుచున్నాడు. అట్లే త్రాగుబోతునకు పవిత్రత లేదని స్పష్టమగుచుండగా పవిత్రతను విధించుట జరుగుచున్నది. ఇట్లు బలరాముడు రెండు విధములుగా అపవిత్రుడై యుండగా, పవిత్రతను విధించుట విశేషము. 'ఆ బలరాముడు మిమ్ములను పవిత్రులను చేయునుగాక' యని యనుట మరింత విశేషము. కావుననే యిది విశేషభణితికి లక్ష్యమైనది.

ఉదాహరణశ్లోకమునందలి పూర్వార్ధము మాఘుని శిశుపాలవధమునందలిది.

[ సంవృత్తిభణితి- ఉదాహరణము ]

సంవృత్తిభణితి ర్యథా -

'ఆభరణస్యాభరణం
ప్రసాధనవిధేః ప్రసాధన విశేషః
ఉపమానస్యాపి సఖే
ప్రత్యుపమానం వపుస్తస్యాః' 62

అత్ర ప్రసిద్ధవర్ణనా ప్రపంచవిధే రాభరణస్యాభరణం వపురిత్యాదివాక్యైః సంవరణాదియం సంవృత్తిభణితిర్విధా నిషేధరూపా.

అర్థము : సంవృత్తిభణితికి ఉదాహరణము. ఆమె తనువు ఆభరణమునకాభరణము; అలంకరణవిధానమునకలంకరణవిశేషము; సఖుడా! ఉపమానమునకు పైతము ప్రత్యుపమానము.

ఇచ్చట ప్రసిద్ధవర్ణనావిస్తారవిధికి 'ఆభరణమునకాభరణము' మొదలయిన వాక్యములచేత సంవరణమగుటవల్ల ఇది విధియందు నిషేధరూపమయిన సంవృత్తిభణితి.

వ్యాఖ్య : సంవృత్తియనగా సమాప్తియని యర్థము. ఇది వ్యాప్తికి విరుద్ధము. విస్తరించి చెప్పుటకు వీలయినదానిని సంగ్రహముగా చెప్పి ముగించుట సంవృత్తిభణితి.

స్త్రీ శరీరవర్ణన విషయమున కవులు స్వైరవిహారముగావించుట సాధారణముగా కనిపించు లక్షణము. ఉపమానము లనుపమానములై గోచరించును. అట్టియెడల ప్రత్యంగవర్ణనమునకును, విపులవర్ణనమునకును చొరబడక సంయమ స్వభావుడై కవి సంగ్రహముగా వర్ణించినయెడల అది సంవృత్తిభణితి యగును. అట్లని రసహీనముగాను, సౌందర్యహీనముగాను సాగినయెడల అది యలంకారమే కాదు. ప్రకృతపద్యమునందు 'ఆమె తనువు ఆభరణమున కాభరణము' మొదలగువిధముగా నున్నది. శరీరమునకు శోభను కలిగించుటకు ఆభరణము నలంకరించుకొందురు. ఆమె శరీరమే ఆభరణము నలంకరించుచున్నదనుటచే ఆమె శరీరసౌందర్యవిశేషము ప్రతీతమగుచున్నది. ఎన్ని యుపమానములు వాడినను దీనిని మించి చెప్పుటకు వీలుకాదు ఇట్లే తక్కినవియును. సంగ్రహముగా చెప్పినను, ఇంక చెప్పవలసినది లేదన్నంత సమగ్రముగా చెప్పుటచేతనే ఇది సంవృత్తిభణితికి లక్ష్యమయినది.

ఉదాహరణ పద్యము కాళిదాసుని విక్రమోర్వశీయమునుండి గ్రహింపబడినది.

వర్ణనమును పెక్కువిధములుగా పల్లవింపజేయుటకును, విస్తరింపజేయుటకును వీలున్నప్పటికిని తద్విధానమును నిషేధించి సంగ్రహముగా ముగించుటచేత విధియందు నిషేధరూపమయిన సంవృత్తిభణితియైనది.

## [ ఆశ్చర్యభణితి - ఉదాహరణము ]

ఆశ్చర్యభణితి ర్యథా—

'జ్యోతిర్భ్య స్తదిదం తమః సముదితం జాతోఽయ మద్భ్యః శిఖీ
పీయూషా దిదముచ్ఛ్రితం విషమయం ఛాయా ప్త జన్మాతపః
కో నామాస్య విధిః ప్రశాంతిషు భవేద్బాఢం ప్రదక్షీయానయం
గ్రంథి ర్యత్ప్రియతోఽపి విప్రియమిదం సఖ్యాః కృతం సాంత్వనైః' 63

అత్ర జ్యోతిఃప్రభృతిభ్య స్తమఃప్రభృతీనా ముత్పత్తే రాశ్చర్యరూపత్వా దియ మాశ్చర్యభణితి ర్నిషేధవిధా విధినిషేధరూపా.

అర్థము : ఆశ్చర్యభణితికి ఉదాహరణము. సఖులారా! జ్యోతులనుండి యీ చీకటి వెలువడినది. జలములనుండి యీ యగ్ని జనించినది. అమృతము నుండి యీ విషము ఆవిర్భవించినది. ఛాయనుండి యీ యెండ జన్మను గ్రహించినది. ప్రశాంతులయందుకూడ ఎంతో దృఢమైన యీ ముడి యేర్పడుచున్నది. దీని విధానమేమో కదా! సాంత్వనములచేత ప్రియునివల్ల ఈ అప్రియము చేయబడినది.

ఇచ్చట జ్యోతిః ప్రభృతులనుండి తమః ప్రభృతుల యుత్పత్తి ఆశ్చర్యకరము. అందువల్ల ఇది నిషేధవిధియందు విధినిషేధరూపమయిన ఆశ్చర్యభణితి.

వ్యాఖ్య : వెలుగు – చీకటి, నీరు – నిప్పు, అమృతము – విషము, నీడ ఎండ. ఈజంటలు విరుద్ధపదార్థములవల్ల ఏర్పడినవి. ఒకటి రెండవదానికి శత్రువుగా వ్యవహరించును. వెలుగు చీకటిని తరిమివేయును; నీరు నిప్పు నార్పివేయును. విషము అమృతమునుగూడ విషమయము చేయును. వాస్తవ మిట్లుండగా వెలుగు నుండి చీకటి, నీటి నుండి నిప్పు, అమృతము నుండి విషము – ఉదయించెననుట ఆశ్చర్యమును కలిగింపక తప్పదు. ఇట్టి ఉక్తి నిషేధింపవలసినది. కాని ప్రకృత పద్యమునందు తదుక్తిని నిషేధించుట కాక నిషేధరూపమైన విధిని నిషేధించుట జరుగుచున్నది. ఇదియు నాశ్చర్యమునే కలిగించును గదా !

అతడు ప్రియుడట ! అనగా ప్రీతికలవాడని యర్థము. ఆమె సాంత్వనములు పలికెనట! అనగా శాంతముతోడి వచనముచే పలికె నని యర్థము. అయినప్పటికిని అతడు అప్రియమునే చేసెను. ప్రియుడు ప్రియముచేయుట స్వాభావికము; ఆకాంక్షితము. ప్రియుడు అప్రియము చేయుట అస్వాభావికము; ఆశ్చర్యజనకము. కావుననే 'కో నామాస్యవిధిః' అని నాయిక ఆశ్చర్యము నొందుచున్నది.

ప్రకృతవిషయము ప్రియుడు అప్రియముచేయుట; అప్రకృతములు వెలుగు నుండి చీకటి పుట్టుట మున్నగునవి అసంభవత్వము అను ధర్మసామ్యముచేత ఇచట ఔపమ్యము సాధింపబడినది. ఇందుకొరకే నిషేధింపదగిన వ్యతిక్రమమును నిషేధింపక, నిషేధమునే నిషేధించుట జరిగినది. కావుననే యిది నిషేధవిధి యందు విధినిషేధరూపమయిన ఆశ్చర్యభణితికి లక్ష్యమయినది.

[కల్పనాభణితి - ఉదాహరణము]

కల్పనాభణితి ర్యథా –

'దృశ్యం దృశాం సహస్రై
ర్మనసా మయుతై ర్విభావనీయం చ
సుకృత శతకోటిభోగ్యం
కిమపి వయః సుభ్రువః స్వదతే' 64

అత్ర వయోరామణీయకాతిశయస్య దృక్సహస్రాదిభిరే వావ లోకనీయత్వాది యోగ్యతా కల్పనా దియం కల్పనాభణితిర్విధి నిషేధే నిషేధవిధిరూపా.

అర్థము : కల్పనాభణితికి ఉదాహరణము. వేయి కన్నులతో చూడదగిన దియు, పదివేల మనస్సులతో భావింపదగినదియు, శతకోటి పుణ్యములచేత భోగింప దగినదియునైన కోమలియొక్క యొకానొక వయస్సు ప్రీతికరమైయున్నది.

ఇచ్చట వయోరామణీయకాతిశయమునకు దృక్సహస్రాద్యవలోకనీయత్వాది యోగ్యతాకల్పనవల్ల ఇది విధినిషేధమునందు నిషేధవిధిరూపమయిన కల్పనాభణితి.

వ్యాఖ్య : కల్పనమని యనగా లేనిదానిని విధించుటయని యర్థము. ఉన్న దానిని కాదని నిషేధించి లేనిదానిని విధించుట జరిగినయెడల, అది కల్పనాభణితి యగును.

ప్రకృతోదాహరణమునందు ఒక సుందరి వయోరామణీయకము ప్రవక్తమయి నది. ఆ వయస్సౌందర్యమును చూచుటకు వేయికన్నులు కావలయునట। దానిని భావించుటకు పదివేల మనస్సులు కావలయునట। దాని ననుభవించుటకు శతకోటి పుణ్యములు కావలయునట। లోకసామాన్యముగా మానవునకు రెండు కన్నులుండును, ఒక మనస్సుండును; ఏవో కొన్ని పుణ్యములుకూడ నుండును. కాని ఆమె సౌంద ర్యమును దర్శించుట కివి చాలవట। వేయికన్నులుండవలసినచోట రెండు కన్నులు మాత్రమే యున్నప్పుడు అల్పాల్ప సౌందర్యాంశమాత్రమే కనిపించును; సమగ్ర సౌందర్యము కనిపింపదని భావము. ఇట్లే తక్కినవియును.

ఇట్లు మానవునకున్న రెండు కన్నులవిధానమును నిషేధించుట జరుగుచున్నది: అంతటితో ఆగిపోక, లేని వేయికన్నులను విధించుట జరుగుచున్నది. ఇదియే నిషేధ

విధి. ఇట్లు కల్పించుట వర్ణ్యమునకు సౌందర్యాతిశయము ననుసంధించుటకే. కావ్య ననే యిది కల్పనాభణితికి లక్ష్యమైనది.

## గుంఫనాలంకారము

**౯౩.** వాక్యే శబ్దార్థయోః సమ్యగ్రచనా గుంఫనా స్మృతా
శబ్దార్థక్రమ పర్యాయపద వాక్యకృతా చ సా.

**అర్థము :** వాక్యమునందు శబ్దార్థములయొక్క సమ్యగ్రచనకు గుంఫనయని పేరు. అది శబ్దగుంఫన, అర్థగుంఫన, క్రమగుంఫన, పర్యాయగుంఫన, పద గుంఫన, వాక్యగుంఫన – అని ఆరు విధములుగా నగును.

**వ్యాఖ్య :** వాక్యము విషయప్రధానము. విషయము ఉద్దేశ్యము విధేయము నని రెండు భాగములు. ఈ రెండు భాగములకు అవిచ్ఛిన్నమయిన అర్థాన్వయమును కలిగించు శబ్దసముదాయమే వాక్యము. కావున వాక్యమునందు శబ్దములు, అర్థములు రెండు నుండును. శబ్దములు వాచకములు; అర్థములు వాచ్యములు. అనగా శబ్దములను సాధనములుగా చేసికొని అర్థములను బోధించుట జరుగును. ప్రతి వాక్యమునందును శబ్దార్థములుండియే తీరును మరి, గుంఫనయొక్క విశిష్టత యేమి ?

'శబ్దార్థయోః సమ్యగ్రచనా' అని నిర్వచనము- శబ్దముయొక్కయు అర్థము యొక్కయు సౌష్ఠవపూర్వకమైన రచనయని తాత్పర్యము. కొన్నియెడల శబ్దము ఉపాధిమాత్రముగానే వ్యవహృతమగును; కొన్నియెడల అర్థమును సమర్థముగా వ్యక్తముచేయును; కొన్నియెడల ఒక క్రమము ననుసరించుటచే ఒక విశిష్టతను వెలువరించును; కొన్నియెడల పర్యాయపదములకు పదము కల్పించును; కొన్ని యెడల శబ్దములు స్వతస్సిద్ధముగానే సౌందర్యబద్ధములై సంప్రయుక్తము లగును; కొన్నియెడల అల్పపదములు అనల్పార్థము నిమిడించుకొని సంగ్రహవాక్యముగా సాక్షాత్కరించును. ఇట్లు పదములు భిన్నరీతులలో భిన్నప్రయోజనములకై గుంఫితము లగుటవల్లనే గుంఫన యన్న శబ్దాలంకార మేర్పడినది. ఇది శబ్దాలంకారములలో పదవది.

[శబ్దగుంఫన - ఉదాహరణము]

తాసు శబ్దకృతా యథా -

'రామాభిషేకే మదవిహ్వలాయాః
కరాచ్చ్యుతో హేమఘట స్తరుణ్యాః
సోపాన మాసాద్య చకార శబ్దం
ఠం ఠం ఠ ఠంఠం ఠఠ ఠంఠఠంఠః' 65

సేయం ఠంఠ మిత్యాదే ర్నిరర్థకస్య శ్లోకపాదస్యార్థానుగుణ్యేన వాక్యేరచి, తత్త్వా చ్ఛబ్దరచనా.

అర్థము : వానియందు శబ్దకృతమున కుదాహరణము. రామాభిషేకము నందు మదవిహ్వలయైన తరుణి చేతినుండి జారిన బంగారుకుండ మెట్లను చేరి ఠంఠంఠ ఠంఠంఠ అని ధ్వని చేసెను.

ఠంఠం మొదలయిన విధముగానున్న నిరర్థకశ్లోకపాదము వాక్యమునందు అర్థానుగుణ్యముగా రచింపబడుటవల్ల ఇది శబ్దరచన

వ్యాఖ్య : గుంఫనాభేదములో శబ్దగుంఫన కిది యుదాహరణము. శబ్ద మన్నప్పుడు మాట యని చప్పుడని రెండర్థములు గలవు. శబ్దగుంఫనయందలి శబ్దము 'చప్పుడు' అన్న యర్థముననే ప్రయుక్తము. మాట యన్న యర్థముతో 'పదము' మరొక గుంఫనాభేదమునందు ప్రయుక్తమగుట దీనికి సూచకము.

'ఠంఠంఠ....' మొదలయినది ధ్వన్యనుకరణము. ఏదైన వస్తువు క్రింద పడి దొర్లుచు, పడుచు, దొర్లుచు నున్నప్పుడు ఇట్టి ధ్వని కలుగును. కావున ఉదాహరణ శ్లోకమునందలి నాలుగవపాదమంతయు తద్ధ్వనిని అనుకరించుటయందే అపసన్నమయినది. ఇంతకు మించిన అర్థసంపద యిందేమియు లేదు. కావుననే దీనిని భోజదేవుడు నిరర్థకమైన పాదమనియే ప్రకటించుచున్నాడు. శ్లోకార్థముయొక్క సమగ్రత్వమునకు సానుకూలమై యిదియు సహకరించుచున్నదనుట వాస్తవము. అట్లగుటచేతనే రచనకు సౌష్ఠవము చేకూరుచున్నది. అర్థసపర్వకముకాని చప్పుడే యిచ్చటి రచనకు బీజమగుటచేతనే, తదనుగుణముగా పదములకూర్పు సాగుటచేతనే యిది శబ్దగుంఫనకు లక్ష్యమయినది.

ఈ శ్లోకము 'మహానాటకము' నుండి గ్రహింపబడినది.

[అర్థగుంఫన - ఉదాహరణము]

అర్థకృతా యథా -

'దిక్కాలాత్మసమైవ యస్య విభుతా యస్తత్ర విద్యోతతే
యత్రాముష్య సుధీభవన్తి కిరణా రాశేః స యాసామభూత్
యస్తత్పిత్తముషః స యస్య హవిషే యస్తస్య జీవాతవే
వోఢా యద్గుణమేవ మన్మథరిపోస్తాః పాంతు వో మూర్తయః' 66

సేయం వ్యోమాదీనామష్టానామపి మహేశమూర్తిలక్షణానామర్థానాముత్తరోత్తర సంకలనయా రచితత్వాదర్థరచనా.

అర్థము : అర్థకృతమైన కుదాహరణము. దేవియొక్క విభుత్వము దిక్కాలాత్మసమమో, దానియందు ఎవడు ప్రకాశించుచున్నాడో, అతని కిరణము లెచ్చట సుధీభూతము లగుచున్నవో, అతడు వేనిరాశియందు పుట్టెనో, వానికి నేది పిత్తమో, అది ఉషఃకాలమునలదు ఎవని హవిస్సున కగునో, వానికి జీవధాతువుగా నెవ్వడగునో, వేనిగుణమును వాడు భరించుచున్నాడో – మన్మథవైరియొక్క ఆ మూర్తులు మిమ్ములను కాపాడును గాక।

ఆది మహేశమూర్తిలక్షణములయిన వ్యోమాదు లెనిమిదింటియొక్క అర్థముల యుత్తరోత్తర సంకలనముతోడి రచితత్వమువల్ల అర్థరచన.

వ్యాఖ్య : గుంఫనాభేదములలో అర్థగుంఫన కిది యుదాహరణము. ఇచ్చటి యర్థములు ఒక్కదానినుండి మరియొకటి పల్లవించుచు శృంఖలారూపమున నుండును. ఇట్లు అర్థములు పరంపరాక్రమమున నన్వయించుటకు సమర్థములయిన పదముల గుంఫనయే కారణము. కావుననే యిది శబ్దాలంకార మగుచున్నది.

ఈశ్వరుడు అష్టమూర్తి. పంచభూతములు, సూర్యుడు, చంద్రుడు, యజమానుడు – ఈ యెనిమిదింటిని శివుని మూర్తులుగా పరిగణింతురు. ప్రకృతోదాహరణ శ్లోకమునందు ఎనిమిది ప్రశ్నలున్నవి. ప్రతిప్రశ్నకు సమాధానము కలదు. అందుండి మరల ప్రశ్న, అందుండి మరల సమాధానము – ఇట్లుగా ఈక్రమము సాగగా ఈశ్వరుని ఎనిమిది మూర్తులను మూర్తికట్టును.

1. దేని విభుత్వము దిక్కాలాత్మసమము? ఆకాశముయొక్క విభుత్వము. 2. దానియందు ఎవడు ప్రకాశించుచున్నాడు? సూర్యుడు. 3. అతని కిరణము లెచ్చట సుధీభూతము లగుచున్నవి ? చంద్రునియందు. 4. అతడు వేనిరాశియందు పుట్టెను? జలముల రాశియందు (సముద్రమునందు). 5. వానికి నేది పిత్తము? అగ్ని. 6. అది ఉషఃకాలమున ఎవని హవిస్సున కగును? యజమానుని హవిస్సునకు. 7. వానికి జీవధాతు వెవడు? వాయువు. 8. దేనిగుణమును వాడు భరించుచున్నాడు? పృథ్వీగుణము (గంధము)ను. ఇట్లు ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, జలము, అగ్ని, యజమానుడు, వాయువు, పృథ్వి - అనెడి యెనిమిది మూర్తులను సంగతములయినవి. కావుననే యిది అర్థగుంఫనకు లక్ష్యమైనది.

[క్రమగుంఫన - ఉదాహరణము]

క్రమకృతా యథా -

'నీలాబ్జానాం నయనయుగలద్రాఘిమా దత్తపత్త్రః
కుంభావేభౌ కుచపరికరః పూర్వపక్షీచకార
భ్రూ విభ్రాంతి ర్మదనధనుషో విభ్రమానన్వవాదీ
ద్వక్త్రజ్యోత్స్నా శశధరరుచం దూషయామాస యస్యాః' 67

అత్ర పత్త్రప్రదాన పూర్వపక్షోపన్యాసానువాద దూషణో ద్భావనానాం బుధజన ప్రసిద్ధక్రమేణ రచితత్వా దియం క్రమ రచనా.

అర్థము క్రమకృతమున కుదాహరణము. ఆమె నయననయుగళ దీర్ఘత్వము నీలాబ్జములకు దత్తపత్రము. ఆమె కుచపరికరము ఇభకుంభములను పూర్వపక్షము గావించెను. ఆమె భ్రూవిభ్రమము మదన ధనుర్విభ్రమములను అనువదించెను. ఆమె వక్త్రజ్యోత్స్న చంద్రకాంతిని దూషించెను.

ఇచ్చట పత్త్రప్రదానము, పూర్వపక్షము, ఉపన్యాసానువాదము, దూషణము మొదలయిన యుద్భావనములను పండిత ప్రసిద్ధక్రమమున రచించుటవల్ల, ఇది క్రమ రచన.

వ్యాఖ్య : గుంఫనాభేదములలో క్రమగుంఫన కిది యుదాహరణము. ఇందు పండిత వివాదములలో అనుసరించు విధానము క్రమోపాత్తమయినది. మొదట వాదమునకు ఆహ్వానించుచు పత్రప్రదానము చేయుట జరుగును. ప్రతిపాదనమునకు విరుద్ధముగా వాదించుట, అనగా పూర్వపక్షము చేయుట జరుగును. వాది చేసిన ప్రసంగము నంతటిని తిరిగి చెప్పుచు ఖండింపవలయును. దీనినే అనువాదము చేయుట యందురు. ఖండించుట యనగా వాది వాదమునందలి దోషములను ప్రదర్శించుట. అదియే దూషణము. ఈ క్రమము ననుసరించియే యివి జరుగును.

నయనయుగళ దీర్ఘత్వము నీలాబ్జములకు పత్రమునొసగెను. ఇట్లనుటచేత సాదృశ్యమే ప్రతీయమానమగుచున్నది. కావున ప్రతీయమానోపమ మన్న అర్థాలంకారమగును. 'పత్రము నొసగుట' అను పదమును ప్రయోగించుట ఒక విశిష్ట రీతిలో జరిగినది. తరువాతి పాదములందలి పూర్వపక్షము, అనువాదము, దూషణము – ఇవి యన్నియు తత్తత్పాదములలో సాదృశ్యవ్యంజకములై యున్నవి. అంతమాత్రమేకాక పండితవివాద ప్రసిద్ధమైన చర్యాక్రమమునకు సూచకము లగుచున్నవి. పదప్రసిద్ధియే ప్రకృతవిషయము. ఇచ్చట ఒక క్రమము ననుసరించి ఆయా పదములు గుంఫితము లగుటచేత ఇది క్రమగుంఫనకు లక్ష్యమైనది.

దత్తపత్రాది పదములచేత సాదృశ్యప్రతీతియు, విజిగీషా చర్యాక్రమములు వెల్లడియగుటచేతనే శబ్దాలంకారము సంధానింపబడుచున్నది. కాని దత్తపత్రాది పదములు శ్లిష్టములగుటచేత మరొకయర్థముకూడి మరింత యందము కలుగుచున్నది. నీలాబ్జములకు పత్రము లిచ్చుట యనగా రేకులను కల్పించుట; కుంభములను పూర్వపక్షము చేయుట యనగా ముందరిభాగమున నిల్పుట; మదనధనువు ననువాదము చేయుట యనగా నారిమ్రోత కలుగునట్లుగా చేయుట; చంద్రకాంతిని దూషించుట యనగా లోపలి కళంకమును ప్రకటించుట. ఇవి యన్నియు ఆయా వస్తువులకున్న సహజలక్షణములే. ఇవి యుండుట దోషమైనట్లు వ్యంజితమగుచున్నది. అట్లగుటచేతనే ఉపమేయసామగ్రియైన నేత్రయుగళము, కుచ పరికరము, భ్రూవిభ్రమము, వక్త్రజ్యోత్స్న ఉన్నత స్థానమున నిల్చుచున్నవి.

ఈ యర్థవిశేషమునకు సైతము పదగుంఫనయే కారణము. కావుననే యిది క్రమగుంఫన యన్న శబ్దాలంకారమునకు లక్ష్యమయినది.

[పర్యాయగుంఫన – ఉదాహరణము]

పర్యాయకృతా యథా –

'కణఇల్లి చ్చిఅ జాణఇ కుంతపలస్సాఇ కీరసంలవఈ
ప్రూసలభాసం ముంచసు ణ హు రే హం ధద్దవా ఆడీ' 68

[ఛాయా –

'శుక్యేవ జానాతి శుకప్రలపితాని కీరసంలాపినీ
కీరభాషాం ముంచ న ఖలు రేఽహం ధృష్ట శుకీ']

సేయం శుకనామపర్యాయాణా మర్థానుగుణ్యేన రచితత్వాత్ పర్యాయ రచనా.

**అర్థము** : పర్యాయకృతమున కుదాహరణము. ఓ కీరసంలాపినీ! శుక ప్రలాపములను శుకియే యెరుగును. ఓయి ధృష్టుడా! కీరభాషను విడిచిపెట్టుము. నేను శుకిని కాదురా!

శుకనామ పర్యాయములను అర్థానుగుణ్యముతో రచించుటవల్ల పర్యాయ రచన.

**వ్యాఖ్య** : గుంఫనాభేదములలో పర్యాయగుంఫన కిది యుదాహరణము. ఒకే యర్థముగల వేర్వేరు పదములను పర్యాయపదము లని యందురు.

ప్రకృతోదాహరణము నాయికా నాయక సంభాషణ ప్రసంగము. 'చిలుకపలుకులు మొదలుపెట్టితివా?' యని నాయిక ధృష్టుడయిన నాయకుడు తన యపరాధమును కప్పిపుచ్చుకొనుటకై పలుకుచున్నప్పుడు వారించుటకై పలికినది; అతడు మాటలలో గడుసరి. అందువలన ఆమెను 'కీరసంలాపినీ' యని సంబోధించెను. 'నీవు నా చిలుకవు. నీపలుకులు చిలుకపలుకులు' అని భావము. 'చిలుకపలుకులు' అని నాయిక 'అర్థరహితములు, పునఃపునరుక్తములయిన మాటలు' అన్న యర్థమున వాడెను. నాయకుడు 'మధురములయిన మాటలు' అన్న యర్థమున నాయికా విషయమున వాడుచు 'నీవు చిలుకవు కావున చిలుకపలుకులను గ్రహింపగలవు' అని యనెను. ఆమెకు కోపము పెరుగుచున్నది. 'నేను చిలుక నెంతమాత్రమును

కాదు. నీ చిలుకపలుకులు విడిచిపెట్టు' అన్నది. పైగా నాయకుని 'వంచకుడా! అని సంబోధించినది.

ఇచ్చట 'చిలుక' యన్న యర్థము పెక్కుపర్యాయము లావృత్త మయినది' కవి యీ యర్థమును బోధించుటకై కుంత, కీర, పూస శబ్దములను వాడెను. ఇవి శుకశబ్దమునకు పర్యాయశబ్దములు. ఇందు కీరశబ్దము సంస్కృతము. కుంత, పూస శబ్దములు దేశ్యములు. ఇట్లే శుకీ శబ్దమునకు బదులుగా కణఇల్లి, వా అది అను పర్యాయ శబ్దములను వాడెను. ఇవికూడ దేశభాషనుండి సంగ్రహింప బడినవే.

ఒకే యర్థమైనప్పటికిని శబ్దమునందు మార్పు చూపినచో కొంత వైచిత్రి యుండును. అట్లు కానియెడల శబ్దదారిద్ర్యము వెల్లడియై వెగటు పుట్టించును. అర్థానుగుణముగా పర్యాయపదములను ప్రయోగించి రచించుటవల్లనే యిది పర్యాయ గుంఫనకు లక్ష్యమైనది.

[పదగుంఫన - ఉదాహరణము]

పదకృతా యథా -

'లోలల్లాంగూలవల్లీ వలయిత వకులానోకహస్కంధలోలై
ర్గోలాంగూలై ర్నదద్భిః ప్రతిరసితజరత్కందరామందిరేషు
ఖండేషూద్దండపిండీతగరతరలనాః ప్రాపిరే యేన వేలా
మాలంబ్యోత్తాల తల్ల స్ఫుటితపుటకినీబంధవో గంధవాహాః' 69

అత్ర లాంగూలవల్లీ వలయితవకులై ర్నదద్భి ర్గోలాంగూలైః ప్రతిరసిత జరత్కందరామందిరేషు ఖండేషు ఉద్దండపిండీ తగర తరల నాః పుటకినీబంధవో గంధవాహా వేలామాలంబ్యయేన ప్రాపిరే ఇత్యతోఽధికానా మపుష్టార్థానామపి పదానా మనుప్రాసాయ చ్ఛందః పూరణాయ చార్థానుగుణ్యేన రచితత్వా దియం పదరచనా.

అర్థము: పదకృతమున కుదాహరణము. చలించుచున్న తీగలవంటి తోకల చేత చుట్టబడిన పొగడమ్రాకులయందు వ్రేలాడుచు నాదములు చేయుచున్న కోతులచేత ప్రతిరసితములగుచున్న జరత్కందరామందిరము లందలి ఖండములందు ఉద్దండము

లను సాంద్రములునై నందివర్ధనములను చలింపజేయునవియై గంధవాహములు,గట్టు నాలంబనముగా చేసికొని ఉత్తాలమైన సరస్సనెడి పూలగంపకు బంధువులై యున్నవి.

ఇచ్చట 'లాంగూలవల్లీవలయితవకులైః' మొదలయిన అపుష్టార్థములయిన పదము లధికముగా నున్నప్పటికిని, అనుప్రాసముకొరకును ఛందఃపూరణముకొరకున్ను అర్థానుగుణముగా పదములను రచించుటవల్ల, ఇది పదరచన.

వ్యాఖ్య : గుంఫనాభేదములలో పదగుంఫన కిది యుదాహరణము. అర్థ సౌందర్యమును మించి పదముల సౌందర్యమున్నయెడల పదగుంభన మగును. పద సౌందర్యము అనుప్రాసమువల్లను, ఛందస్సౌష్ఠవమువల్లను సంక్రమించును.

ప్రకృతపద్యమునందు వాయువుల వర్ణన కలదు. ఈ వాయువులు గుహా మందిరఖండములందును నందివర్ధన వనములందును, సరస్సునందును విహరించు చున్నవి. ఏతన్మాత్రమైన భావమును విస్తరింపజేయుటయే యిచ్చట జరిగినది. ఆ విస్తరణము అర్థమున కేమాత్రమును పుష్టికూర్చుటలేదు. అయినప్పటికిని అను ప్రాసస్థితివల్లను ఛందోగతివల్లను శ్రుతిసుభగమై యున్నదనుట వాస్తవము. ప్రథమ పాదమునందు ల వర్ణము పెక్కు పర్యాయము లావృత్తమయినది. ద్వితీయపాద మున ర వర్ణమును, త వర్ణమును, బిందుపూర్వక ద వర్ణము నావృత్తము లయినవి. మూడవపాదమునందు బిందుపూర్వక డ వర్ణమును, త వర్ణము, ర వర్ణము నావృత్తి నొందినవి. నాల్గవపాదమునందు ల వర్ణమును, ట వర్ణమును, వ వర్ణమును, బిందువు తోడి ధ వర్ణము నావృత్తినొందినవి. ఇట్లు అనుప్రాసము అమరియుండుట ఒక యందము. దీనికి వీలుగా నుపయోగపడు పదములను కూర్చుటవల్ల, ఇది పద గుంఫనయన్న శబ్దాలంకారమునకు లక్ష్యమయినది.

ఉదాహరణ శ్లోకము రాజశేఖరుని కావ్యమీమాంసనుండి గృహీతము.

[వాక్యగుంఫన - ఉదాహరణము]

వాక్యకృతా యథా -

'పతి శ్వశురతా జ్యేష్ఠే పతి దేవరతానుజే
మధ్యమేషు చ పాంచాల్యాస్త్రితయం త్రితయం త్రిషు' 70

ఇహ మహతో౽ర్థ స్యాల్పీయసా గ్రంథేనాభిధాన మితి వ్యుత్క్రమేణాపి గ్రంథలాఘవాయ వాక్యార్థో రచిత ఇతీయం వాక్య రచనా.

అర్థము : వాక్యకృతమున కుదాహరణము. పాంచాలికి జ్యేష్ఠునియందు భర్తయు బావయు, కనిష్ఠునియందు భర్తయు మరదియు, మధ్యములు ముగ్గురయందు మూడు మూడు లక్షణములు నున్నవి.

ఇచట గొప్పదైన యర్థమును మిక్కిలి అల్పమైన గ్రంథముచేత చెప్పట యున్నది. క్రమభ్రంశమే అయినప్పటికిని గ్రంథలాఘవమునకై వాక్యార్థ మిట్లు రచితమైయుండుటవల్ల, ఇది వాక్యరచన.

వ్యాఖ్య : గుంఫనాభేదములలో వాక్యగుంఫన కిది యుదాహరణము. ఎంతో విస్తృతముగా చెప్పదగిన యర్థమును మిక్కిలి క్లుప్తముగా చెప్పుట యిచ్చట లక్షణము. 'అల్పపదముల ననల్పార్థరచన' యన్న దిట్టి రచనయే. దీనివల్ల కవితకు జిగియు బిగియు లభించును. ఇట్టియెడల క్రమము భ్రష్టమైనను అంగీకార్యమే. క్రమభ్రంశమువల్ల కలుగు నష్టముకంటె గ్రంథలాఘవమువల్ల కలుగు లాభము గొప్పది; సహృదయ లోభనీయము. కావుననే యిది యలంకార మగుచున్నది.

ద్రౌపదికి భర్త లైదుగురు. ఈవిషయమును చెప్పి, ఎవరెవ రేయే సంబంధము కలిగియున్నారో వరుసగా చెప్పవలయునన్న గ్రంథము పెరుగును. అట్లు గ్రంథగౌరవము నెంచుట దోషము. గౌరవము అని యనగా ఇచ్చట నిరర్థకమైన వాచాలత యని యర్థము. కావున సమర్థుడగు కవి గ్రంథలాఘవమునకే ప్రయత్నించును. లాఘవ మనగా కౌశలమని యర్థము; ఇది సంగ్రహముగా చెప్పుట నాశ్రయించు కొని యున్నది. జ్యేష్ఠుడు భర్త యగును, బావ యగును. ఈ తరువాత రెండవ వానిని గురించి చెప్పవలయును. అట్లుకాక ఐదవవానిని చెప్పుటచేత క్రమము తప్పినది. ఐనప్పటికిని అతడు భర్తయు మరదియు నగునని చెప్పిన పిమ్మట నడుమ నున్న ముగ్గురికి మూడు రకములయిన సంబంధమును గలదనుట సంగ్రహణమున కెంతో సహకరించినది. కావుననే, ఇది వాక్యగుంఫనకు లక్ష్యమైనది.

## శయ్యాలంకారము

54. శయ్యేత్యాహుః పదార్థానాం ఘటనాయాం పరస్పరమ్
సా ప్రక్రాంతేన కస్మింశ్చి దప్రక్రాంతేన కుత్రచిత్.

55. అతిక్రాంతేన కుత్రాపి పదార్థం వర్ణయోః క్వచిత్
వాక్యార్థే వాక్యయోః క్వాపి ప్రకీర్ణానాం చ దృశ్యతే.

అర్థము : పదార్థముల ఘటనయందలి సంబంధమును శయ్య యని యందురు. అది ప్రక్రాంతఘటన, అప్రక్రాంతఘటన, అతిక్రాంతఘటన, పద ఘటన, వాక్యఘటన, ప్రకీర్ణఘటన — అని ఆరు విధములయిన ఘటనల నాశ్రయించుకొని యుండును.

### [ప్రక్రాంతఘటనాశయ్య - ఉదాహరణము]

తాసు ప్రక్రాంతఘటనా యథా -

'స తథేతి ప్రతిజ్ఞాయ విసృజ్య కథ మప్యుమామ్
ఋషీన్ జ్యోతిర్మయాన్ సప్త సస్మార స్మరశాసనః' 71

సేయం సప్తర్షీణా మాగమనస్య ప్రక్రాంతస్యైవ ఘటనా.

అర్థము : వానియందు ప్రక్రాంత ఘటన కుదాహరణము. స్మరశాసను డైన శివుడు 'అట్లే' యని పల్కి ఎట్లో ఉమను విడిచిపెట్టి జ్యోతిర్మయులయిన సప్తర్షులను స్మరించెను.

ఇది సప్తర్షుల ఆగమని మనెడి ప్రక్రాంతముయొక్క ఘటన.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో పదునొకండవదిగా శయ్యపరిగణింపబడినది· ఈ శయ్య శబ్దార్థముల ఘటన నాశ్రయించుకొనియుండును. ప్రక్రాంతము, అప్రక్రాంతము, అతిక్రాంతము, పదము, వాక్యము, ప్రకీర్ణము – అని ఘటన ఆరు విధములు. ఈ భేదములనుబట్టియే శయ్యాభేదము లేర్పడును.

శయ్యాభేదములలో మొదటిది ప్రక్రాంతఘటనాశయ్య – ఇచ్చట ప్రక్రాంతము అన్ని యనగా ప్రకరణ మని యర్థము; ఇతివృత్తమునకు సంబంధించిన సన్ని

వేశ మని భావము. శబ్దార్థముల ఘటన ప్రబంధేతివృత్తమునకు ఆవశ్యకమైన సన్నివేశమును తెల్పినయెడల అది ప్రక్రాంతఘటనాశయ్య యగును.

ఉదాహరణపద్యము కాళిదాసు కుమారసంభవములోనిది. పెద్దలను అడుగవలసినదిగా పార్వతి చెప్పినప్పుడు శివుడు 'అట్లే' యని చెప్పి సప్తర్షులను స్మరించెను. ఈ ప్రకరణము గౌరీశంకరుల కల్యాణనిర్వహణమునకు అత్యంతావశ్యకము. సప్తర్షులే పెండ్లి పెద్దలుగా వ్యవహరించి హిమవంతునిచేత వివాహనిశ్చయము చేయింతురు. కావుననే యీ ఘటన కథాసన్నివేశమున కవసరమై ప్రక్రాంతఘటనాశయ్య అన్న శబ్దాలంకార మగుచున్నది.

[అప్రక్రాంతఘటనాశయ్యా - ఉదాహరణము]

అప్రక్రాంత ఘటనా యథా -

'అత్రాప్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్
నిషాదస్య చ సంవాద మృషేః సంవరణస్య చ' 72

సేయ మప్రక్రాంతస్య నిషాదసంవరణ సంవాదస్య ఘటనా దప్రక్రాంతఘటనా.

అర్థము : అప్రక్రాంతఘటన కుదాహరణము. నిషాదునకును ఋషియగు సంవరణున్నకును జరిగిన సంవాదము అనెడి పురాతనమైన యితిహాసము నిప్పుడు కూడ చెప్పుకొనుచున్నారు

అప్రక్రాంతమైన నిషాదసంవరణ సంవాదముయొక్క ఘటనవల్ల ఇది అప్రక్రాంతఘటన.

వ్యాఖ్య : శయ్యాభేదములలో రెండవ దిది. అప్రక్రాంత మని యనగా అప్రకరణ మని యర్థము; కావ్యేతివృత్తముతో సంబంధములేని సన్నివేశమని భావము. దీనివలన పూర్వకథాఘట్టమునకు గాని, అనంతర కథాఘట్టమునకు గాని ప్రయోజనముకూడ నేమియు లేదు. అయినప్పటికిని ఇతిహాస నిబద్ధ సన్నివేశములను అనంతరకావ్యములందు నివేశింపజేయుట యొక పరిపాటి. ఇట్లగుటచేత ఇది వ్యర్థముకాని దోషముకాని కాదు. అయినను ప్రకృతకథాసందర్భమున కుపకరింపదనుట వాస్తవము.

ప్రకృతోదాహరణమునందు పురాతనమై యితిహాసమైన నిషాదసంవరణ సంవాదప్రసంగము కలదు. అది ప్రకృత కథాసందర్భమునకు సహకారకము కాదని, అందువల్ల అప్రక్రాంతఘటన కుదాహరణ మగునని భోజదేవుడు తెల్పుచున్నాడు.

[అతిక్రాంతఘటనాశయ్యా - ఉదాహరణము]

అతిక్రాంతఘటనా యథా -

'తస్య చక్షు శ్చమత్కారం వ్యతీతసమయా అపి
స్మితార్ద్రి ముకులోద్భేదాః కదంబ వనరాజయః' 73

ఇయ మతిక్రాంతస్యాపి కదంబవనరాజీనా మార్ద్రిముకులోద్భేదస్య విరహి మనశ్చమత్కార కారిణో రామస్య స్మృతిద్వారేణ ఘటనా దతిక్రాంతఘటనా.

అర్థము : అతిక్రాంతఘటన కుదాహరణము. చిరునవ్వుల ఆర్ద్రితచేత మొగ్గ తొడిగిన కదంబవనపంక్తులు, ఎంతో కాలము గడచినప్పటికిని అతనికి (రామునికి) చమత్కారమును కలిగించెను.

కదంబవనపంక్తులు ఆర్ద్రిములయిన మొగ్గలను ధరించుట యన్న విరహిజన చమత్కారకరమైన అతిక్రాంతమైన ఘటన రాముని యొక్క స్మృతిద్వారమున జరిగినట్లు చెప్పుటచే ఇది అతిక్రాంత ఘటన.

వ్యాఖ్య : శయ్యాభేదములలో మూడవ దిది. అతిక్రాంత మని యనగా గడచిపోయిన దని యర్థము. ఎప్పుడో జరిగిన సన్నివేశ మని భావము. ఆ సన్నివేశము మరల అట్లే జరుగుట కవకాశము లేదు. అయినప్పటికిని స్మరణ శక్తివల్ల గడచిన సన్నివేశమును కన్నులకు కట్టించుకొన వచ్చును. ఇట్లయినప్పుడు కొంతసేపు తత్సన్నివేశ సౌందర్యమగ్నుడు మన స్తృప్తిని పొందవచ్చును.

ప్రకృతోదాహరణమునందు కదంబములు మొగ్గతొడుగుట ప్రస్తావింపబడినది. అకాలములో కదంబములు పూయవలయునన్న సుందరి చిరునవ్వులు దోహదములుగా వ్యవహరింపవలయును. ఒకానొకప్పుడు, అయోధ్యలో నుండగా జానకి తన చిరునవ్వులతో కదంబములను పుష్పింపజేసినది. ఆదృశ్యము రాముని కానందమును

కలిగించినది. అది గడచిపోయిన విషయము. వియోగ సంతప్తుడైన రాముడు అరణ్యములో సంచరించునప్పుడు తద్విషయమును జ్ఞప్తికి తెచ్చుకొనెను. అందు వల్ల తాత్కాలికముగానైనను సంయోగావస్థయందలి సంతృప్తి అనుభూతమైనది. ఇట్లు అతిక్రాంతమైన విషయమును స్మరణశక్తి ద్వారమున వర్తమానమున ననుభూతమైనట్లు ఘటనచేయుటచేతనే, యిది అతిక్రాంత ఘటనాశయ్యకు లక్ష్యమైనది.

ఉదాహరణము అభినందుని రామచరితమునుండి గృహీతము.

[పదఘటనాశయ్య – ఉదాహరణము]

పదఘటనా యథా -

'భిన్నేన పతతా వహ్నౌ యస్మాత్కేన హఠాత్ కృతౌ
స్వేతి హేతి హరేణోక్తేః స్వాహాసీత్ సైవ రావణః' 74

ఇయం స్వేతిహేతి వర్ణాభ్యాం స్వాహేతి పదస్య ఘటితత్వా త్పదఘటనా.

అర్థము : పదఘటన కుదాహరణము. ఛిన్నమై అగ్నిలో పడుచున్న ఏముఖమునుండి 'స్వా' యని హఠాత్తుగా ఉచ్చరింపబడి హరునిచేత 'హా' యని ఉక్తమై 'స్వాహా' యయ్యెనో ఆ రావణు డీతడు.

'స్వా' అని 'హా' అని రెండు వర్ణములచేత 'స్వాహా' అన్నపదము ఘటిత మైనందువల్ల ఇది పదఘటన.

వ్యాఖ్య : శయ్యాభేదములలో నాలుగవ దిది. వేర్వేరుగా నున్న యక్షరములు సన్నిహితములై పదముగా ఏర్పడుటయే పదఘటన.

ప్రకృతోదాహరణమునందు రావణుని యుద్దండభక్తి ప్రసక్తమయినది. హవిర్ద్రవ్యములను హోమాగ్నిలో వేయునప్పుడు 'స్వాహా' యని చెప్పవలయును. రావణుడు తన శిరములనే శివునికి సమర్పించుచుండెను. స్వయముగా తన చంద్రహాసముతో తలలను నరకుకొనెను. సంప్రదాయజ్ఞుడు కావున 'స్వాహా' యనబోయెను. 'స్వా' యనుసరికే తలలు తెగిపోయెను. ఆ ఘోరమైన వీరవ్రతమును చూచి ఈశ్వరుడు జాలితో అశ్చర్యముతో 'హా' యని యనెను. ఇది అనుద్దిష్టమే.

అయినప్పటికిని రావణుని 'స్వా' వర్ణమును హరుని 'హా' వర్ణమును కలిసి 'స్వాహా' యన్న పదమై హోమక్రియకు సహకరించినవి ఇట్లయినట్లు కూర్చుట చేత, ఇది పదఘటనాశయ్యకు లక్ష్యమయినది.

[ వాక్యఘటనాశయ్య - ఉదాహరణము ]

వాక్యఘటనా యథా -

'హంస ప్రయచ్ఛమే కాంతాం గతి స్తస్యా స్త్వయా హృతా
విభావితైకదేశేన స్తేయం యదభియుజ్యతే' 75

ఇయం పూర్వశాస్త్రనిబద్ధస్యోత్తరార్ధస్య తదర్థాననుయాయినాపి ప్రస్తుతార్థావిరుద్ధేన పూర్వార్ధేనైన వాక్యతయైవ ఘటితత్వాద్వాక్యఘటనా.

అర్థము : వాక్యఘటన కుదాహరణము. ఓ హంసా! నా కాంతను నా కిమ్ము. ఆమె నడక నీచేత దొంగిలింపబడినది. లక్షితమైన ఏకదేశముచేతనే చౌర్యము నిరూపితమగుచున్నది.

పూర్వశాస్త్రనిబద్ధమైన ఉత్తరార్ధము స్వీయార్ధము ననుసరింపకపోయినప్పటికిని ప్రస్తుతార్థమునకు విరుద్ధముకాకుండను పూర్వభాగముతో నేకవాక్యత పొందునట్లును కూర్పబడుటవల్ల ఇది వాక్యఘటన.

వ్యాఖ్య : శయ్యాభేదములలో అయిదవ దిది. పూర్వశాస్త్రమునందలి ఒక వాక్యము శ్లోకమునందు సగముభాగము నాక్రమించుకొనియున్నది. ప్రకృతార్థముతో సంగత మగునట్లుగా మిగిలిన శ్లోకభాగముతో కలిసి ఒకే వాక్యముగా నేర్పడుటచేతనే యిది వాక్యఘటన యైనది.

'లక్షితమైన ఏకదేశముచేతనే చౌర్యము నిరూపితమగుచున్నది'. ఇది శిక్షాస్మృతికి సంబంధించిన వాక్యము. దొంగిలింపబడిన వస్తువులలో ఒకవస్తువు కానవచ్చినచో ఆవస్తువునుబట్టియే దొంగను నిర్ణయింతురు. హంసనడకను చూచిన పురూరవుడు అది తన ప్రియురాలయిన ఊర్వశి నడకయే యని నిర్ణయించెను. 'ఆమె నడక దీనిదగ్గర లభించినది. కావున ఆమె నిదియే అపహరించియుండు' నని పురూరవుడు నిర్ణయించుచున్నాడు. కావుననే 'నా కాంతను నా కిమ్ము' అని

ఆడుగుచున్నాడు. నిజమునకు చౌర్యనిర్ణయ విధానమునకు ప్రకృతకథాంశమునకు సంబంధము లేదు. అయినప్పటికిని కవి తన ప్రతిభచేత ప్రస్తుతాంశమును స్మృతి యందలి వాక్యముతో సమర్థించుచున్నాడు: కావున ఒక సంబంధ మేర్పడినది కదా! ఇట్లు ఏకవాక్యత యేర్పడుటవల్ల నే, యిది వాక్యఘటనాశయ్యకు లక్ష్య మయినది.

ఉదాహరణ శ్లోకము కాళిదాసుని విక్రమోర్వశీయమునుండి గ్రహింపబడినది.

[ప్రకీర్ణఘటనాశయ్యా – ఉదాహరణము]

ప్రకీర్ణఘటనా యథా –

'ఏక్కింహిం అచ్ఛిహిం సావణు అణ్ణహిం భద్దవఉ
మాహఉ మహిఅలసత్థరి గణ్డత్థల సరఉ
అంగిహిం గిమ్హ సుహాచ్ఛి తిలవణ మగ్గసిరు
ముద్ధిహిం ముహపంకఅసరి ఆవాసిఉ సిసిరు' 76

[ఛాయా –

'ఏకస్మిన్నక్ష్ణి శ్రావణోఽన్యస్మిన్ భాద్రపదో
మాధవో మహీతలప్రస్తరే గండస్థలే శరత్
అంగే గ్రీష్మః సుఖాసికా తిలవనే మార్గశీర్షో
ముగ్ధాయా ముఖపంకజసరసి ఆవాసితః శిశిరః']

అత్ర శ్రావణాదీనామయుగపద్భావిత్వేన విప్రకీర్ణానాం ఘటనా దియం ప్రకీర్ణఘటనా.

అర్థము : ప్రకీర్ణఘటన కుదాహరణము. ముగ్ధయొక్క ఒక కంటియందు శ్రావణమును, మరొక కంటియందు భాద్రపదమును, మహీతల ప్రస్తరమునందు మాధవమును, గండస్థలము నందు శరత్తును, అంగమునందు గ్రీష్మమును, సుఖ స్థితియన్న తిలవనమందు మార్గశీర్షమును, ముఖపంకజ సరస్సునందు శిశిరమును నెలకొని యున్నవి.

ఇచ్చట శ్రావణాదులు సమసమయమున నుండనివగుటచేత విప్రకీర్ణముల ఘటన యగుటవల్ల ఇది ప్రకీర్ణఘటన.

వ్యాఖ్య : శయ్యాభేదములలో ఆరవ దిది. ప్రకీర్ణము అని యనగా చెల్లా చెదరుగా నున్నదని యర్థము. ఒక్కచోట నుండక, పెక్కుచోట్ల విస్తరించుకొని యున్నవానిని ప్రకీర్ణములని యందురు. అట్లు వేరువేరై విస్తరించుకొని యున్న వాని నొకచోట ననుసంధించుటయే ప్రకీర్ణఘటన. దాని నాశ్రయించుకొన్న శబ్దార్థ రచన ప్రకీర్ణఘటనాశయ్య.

ప్రకృతోదాహరణమునందు విరహార్తయయిన ఒకముగ్ధానాయిక వర్ణింపబడి నది. ఆ వర్ణనమునందు కవి మాసములను ఋతువులను యథేచ్ఛముగా వాడు కొనెను ఒకమాసమున్న సమయమున మరొక మాసముండదు. ఒక ఋతువున్న సమయమున మరొక ఋతువుండదు. అయినప్పటికిని కవి తన ప్రతిభాబలముతో ప్రకీర్ణముల నొక్కచోటనే ఘటించుటచేత ఇది ప్రకీర్ణఘటనాశయ్యకు లక్ష్యమైనది. (భోజదేవుడే విస్తృతముగా వివరించియున్నాడు, కావున దీని వివృతిని వక్ష్యమాణ ప్రసంగమునందు గుర్తించుకొననగును.)

ప్రకీర్ణశబ్దశ్చాయం శేషవాచీ. తేనాన్యాసా మపి ప్రకీర్ణ ఘటనానా మిహావకాశో భవతి, తేన యా ఇమా మహాకవిప్రబంధేషు ముఖ్యా గౌణీ లక్షణా స్తద్భావాపత్తి రుపచరితా లక్షితలక్షణేతి శబ్ద వృత్తయ స్తా అపీహ ప్రయుజ్యంతే.

అర్థము : ఈ ప్రకీర్ణశబ్దము మిగిలినవానికి పైతము బోధకము. దానిచేత, ఇతరములయిన ప్రకీర్ణఘటనలకు నవకాశము కలుగుచున్నది. అందుచేత మహా కవుల ప్రబంధములందు ముఖ్యయని గౌణియని లక్షణయని, భావాపత్తియని, ఉపచరితయని, లక్షితలక్షణ యని యున్న శబ్దవృత్తులుకూడ ఇచ్చట వినబడును.

యత్రాదితః షట్స్వర్థాభిధానవచనేషు ముగ్ధాయా ఇతి సంబంధి పదే చ ముఖ్యా. శేషయో ర్ద్వయో రాధాభివచనయో ర్గౌణీ. శ్రావణాదిషు చతుర్షు మాసవచనేషు లక్షణా. షట్స్వపి చార్థేభ్యవచ నేషు వర్షాదిషు లక్షితాభిహితేష్వపి యుగప దసంభవత్సు శ్రుతార్థా పత్తిలభ్యా తావద్భావాపత్తిః. ఆవాసిత ఇతి క్రియాపదం చోప చరితాన్యుక్తమేవ ప్రతీయతే. లక్షితలక్షణాపి చైతాస్వేవ వ్యాఖ్యా

నత ఉన్నిమతి. తథాహ్యావాసితశబ్దోఽయ మభిమతప్రదేశ నివేశిత మహాపరిచ్ఛదే మహారాజాదౌ నిరూఢాభిధానశక్తిః. స ఉపచారేణ శ్రావణాదిషు ప్రయుజ్యమాన స్తేషా మపి మహత్త్వ మభిలక్ష్య మహాపరిచ్ఛదతాం మహాసంభవత్వం చ లక్షయన్ ప్రస్తుతాయా అపి ప్రవృత్తే ర్మహాంత మనుబంధం లక్షయతి.

అర్థము : మొదటినుండి ఆధారవచనములయిన (కన్నులు రెండు, మహీతల ప్రస్తరము, గండస్థలములు రెండు, అంగము) ఆరింటియందును 'ముగ్ధయొక్క' యన్న సంబంధి పదమునందును ముఖ్యవృత్తి. మిగిలిన ఆధారవచనములు (శిరోవనము, ముఖపంకజ సరస్సు) రెండింటియందును గౌణీవృత్తి. శ్రావణాదుల్లయుజ్యమానవచనములు (శ్రావణము, భాద్రపదము, మాఘము, మార్గశిరము) నాలుగింటియందును లక్షణావృత్తి. వర్షాదులయిన ఆధేయవచనము లారింటియందును, లక్షితాభిహితములయినవ్వాటికిని, యుగపదసంభవత్వమువల్ల శ్రుతార్థమునకు అపత్తి కలుగుటచేత భావావత్తి. 'ఆవాసితః' అన్న క్రియాపద ముపచరితావ్యక్తమునే ప్రతీతము గావించుచున్నది. లక్షితలక్షణకూడ వీనియందు వ్యాఖ్యానమువల్ల వికసించుచున్నది. అట్లే ఆవాసితశబ్దము మహారాజు మొదలయినవారియందు నిరూఢమైన అభిధానశక్తి కలది. అది ఔపచారికముగా శ్రావణాదులందు ప్రయుజ్యమానమగుటచేత వారియొక్క మహత్త్వము నభిలక్షించి మహాపరివారమును, మహాప్రాభవమును లక్షించుచు ప్రస్తుతమయిన ప్రవృత్తికి సైతము మహత్త్వము ననుబంధించుట కనిపించుచున్నది.

తే చ యుగపల్లోచనాదౌ చానుపపద్యమానస్థితయః స్వశబ్దశక్తిత స్తత్రతత్ర చ నివేశ్యమానాః స్వధర్మసంపదః ప్రత్యాసన్నాయాం తద్ధర్మసంపద ముపలక్షయ న్తి. అసావసౌ విరహవత్యా అపి వియోగవేదనాతిశయం లక్షయంతీ కమితరి స్నేహాతిశయం లక్షయతి. తత్ర శ్రావణో భాద్రపద ఇత్యేతాభ్యా మవయవాభ్యాం వర్షర్తు ర్లక్ష్యతే. స చ లోచనయో రనుపపద్యమాన స్థితి రపి విభక్తి శక్త్యా నివేశితః పయఃపృషత్ప్రవాహాలక్షణాయాః స్వధర్మసంపదః

ప్రత్యాసన్నా మవిచ్ఛిన్నా మశ్రుసంపద ముపలక్షయన్ సమాగమో త్కాయా ఉత్కంఠాతిశయం లక్షయతి.

అర్థము : అవి సమకాలమున లోచనాదులందు సముపపన్నములగు స్థితు లను లేనివేయైనను స్వశబ్దశక్తివలన అచ్చటచ్చట నివేశింపబడినవై స్వధర్మసంప దకు సన్నిహితమైయున్న తద్ధర్మ సంపదను ఉపలక్షించుచున్నవి. (శ్రావణాదులు నిరంతరవర్షణాదిధర్మములు గలవి. స్వార్థమును విడువకుండగనే లోచనాదులకు అశ్రుపాతాదులందు లక్షితమగుచున్నవి.) అయ్యవి విరహిణియొక్క వియోగవేద నాతిశయమును చూపుచున్నవై ప్రియునియందలి స్నేహాతిశయమును సూచించు చున్నవి అచ్చట శ్రావణము భాద్రపదము నన్న రెండవయవములవల్ల వర్షర్తువు లక్షితమగుచున్నది. అది లోచనములయందు ప్రభవించు స్థితికలది కాకపోయి నప్పటికిని విభక్తిశ్రుతిచేత నివేశితమై పయః ప్రవృత్త్వాహ లక్షణము గలిగి స్వధర్మ సంపదకు సన్నిహితము నవిచ్ఛిన్నము నైన అశ్రుసంపద నుపలక్షించుచు సమాగమోత్కంఠిత యగు నాయికయొక్క ఉత్కంఠాతిశయమును లక్షించు చున్నది.

మాధవ ఇత్యుత్తరావయవేన వసంతో లక్ష్యతే. సోఽపి మహీ తలప్రస్తరేఽనుపపద్యమానస్థితిః ప్రాగ్వదేవ శబ్దశక్త్యా నివేశితః కుసుమ కిసలయ మృణాల కమలినీదలాదికాయాః స్వధర్మసంపదః సమాసన్నాం శిశిరోపకరణ సామగ్రీ ముపలక్షయన్ కామవత్యాః శరీ రాంతస్తాపం లక్షయతి.

అర్థము : మాధవ మన్న ఉత్తరావయవముచేత వసంతము (చైత్ర మాసము) లక్షింపబడుచున్నది. మహీతలప్రస్తరమునందు ఉపస్థితమైయుందు స్థితి దానికిని లేదు. అయినప్పటికిని పూర్వమువలెనే శబ్దశక్తిచేత నివేశింపబడి, కుసుమ కిసలయ మృణాళ పద్మపత్రాది స్వధర్మసంపదకు సమాసన్నమయిన శీతలోపచార సామగ్రి నుపలక్షించుచు కామవతియైన నాయికయొక్క శరీరాంతర్గత తాపమును సూచించుచున్నది.

శరదిత్యనేన ఋతువిశేషోఽభిధీయతే. సా గండయో రనుప పద్యమానస్థితిః ప్రశంసావచనస్యాపి స్థలశబ్దస్యానుస్మరణశక్త్యా సమా

కృశ్యమాణ కాశకుసుమ హంసాగమన కుముద సరః ప్రసాద చంద్రా తపాదికాయాః స్వధర్మసంపదః సమాసన్నం గండయోః పాండు భావం లక్షయన్ మృగేక్షణాయా విరహకార్శ్య ముపలక్షయతి.

అర్థము : శరత్తని యనుటచేత ఋతువిశేషము చెప్పబడుచున్నది. చెక్కిళులందుండు స్థితి దానికి లేదు. ప్రశంసావచనమే అయినప్పటికిని స్థలశబ్దము యొక్క అనుస్మరణశక్తిచేత ఆకర్షింపబడుచున్న రెల్లుపూలు, హంసలరాక, కలువలు, తేటయైన సరస్సులు, తెల్లనివెన్నెల మొదలయిన స్వధర్మసంపదలకు సమాసన్నమైన చెక్కిళుల తెల్లదనమును లక్షించుచు మృగేక్షణయొక్క వియోగకృశత్వము నుపలక్షించుచున్నది.

గ్రీష్మ ఇత్యనేనాపి ఋతువిశేష ఏవోచ్యతే. సోఽప్యంగనాంగేఽనుపపద్యమానః సూర్యాంశు కార్కశ్య ప్రతప్త పాంసు తాప పరుషోష్మానిలత్వ దావాగ్ని కాలుష్యాదేః స్వధర్మ సంపదః సమానానీక భూతాభూత పూర్వానంగజ్వర లింగ సంపద ముపయన్నష్టమీం కామావస్థా ముపలక్షయతి.

అర్థము : 'గ్రీష్మము' అను దీనిచేత పైతము ఋతువిశేషమే చెప్పబడుచున్నది. దీనికి పైతము అంగనాంగమునందు సముపస్థితమైయుండు స్థితిలేదు. అయినప్పటికిని సూర్యకిరణముల కర్కశత్వము, ప్రతప్తపాంసులత్వము, తాప తీవ్రోష్మము, చండానిలత్వము, దావానలత్వము మొదలయిన కాలుష్యములుగల స్వధర్మ సంపదకు సమానానీకభూతమై అభూతపూర్వమైన మన్మథజ్వర చిహ్న సంపద నుపలక్షించుచు ఎనిమిదవదైన కామావస్థ (ఉన్మాదము)ను సూచించుచున్నది.

మార్గశీర్ష ఇత్యనేన తు పూర్వావయవేన హేమంతో లక్ష్యతే. తేన చ యథా హేమంతే తిలవనం లూయతే తథా తస్యాః సుఖాసికా సాంప్రతం లూయత ఇతి లక్షితే నాతిశాయినీ మనఃపీడోపలక్షితా భవతి. కా పునః సుఖాసికా తిలవనయోః సమానధర్మతా యేయం స్నేహనిర్భరతా నామ. అభిసారికాణాం చ ప్రాయేణ తిలవనాబ్జినీ ఖండయో రేవ బహుమానప్రసిద్ధిః. యదిత్థ మాహుః—

'అ త్తంత హరమణిజ్జం అహ్మాం గామస్స మండణీహూఅమ్
లుఅతిలవాడి సరిచ్ఛం సిసిరేణ కఅం భిసిణిసండమ్' 77

[ఛాయా -
'అత్యంతరమణీయ మస్మాకం గ్రామస్య మండనీభూతమ్
లూన తిలవాటీ సదృశం శిశిరేణ కృత మబ్జినీఖండమ్']

అత ఏవాయ ముత్తరవాక్యే కమలసరః శబ్దేనాబ్జినీఖండమపి నిర్దిశతి. తద్యథా 'ముద్ధిహి ముహపంకఅసరి ఆవాసి ఉసిసిరు'.

అర్థము : మార్గశీర్ష మను పూర్వావయవముచేత హేమంతము లక్షింపబడుచున్నది. దీనిచేత హేమంతమునందు ఏవిధముగా నువ్వుచేను కోయబడునో ఆవిధముగానే ప్రస్తుతము ఆమె సుఖస్థితి కోయబడుచున్న దనెడి లక్షితముచేత అతిశయమైన మనఃపీడ ఉపలక్షిత మగుచున్నది. మరి, సుఖస్థితికిని తిలవనమునకు సమానధర్మత్వ మేమి? యన్నచో స్నేహనిర్భరత్వ మన్నదే యని సమాధానము. అభిసారికలకు నువ్వుచేనును, పద్మసర స్తీరమును బహుమానపాత్రములుగా ప్రసిద్ధములు. 'మన గ్రామమున కలంకారభూతమైనదియు మిక్కిలి రమణీయమైనదియునైన పద్మసరస్సు శిశిర ఋతువువల్ల కోయబడిన నువ్వు చేనువలె నైనది' అనియనిరి. అందువల్ల నే యీ తరువాతి వాక్యమునందు కమలసరశ్శబ్దముచేత అబ్జినీఖండమునుకూడ నిర్దేశించుచున్నాడు. 'ముగ్ధాయాః ముఖపంకజసరసి ఆవాసితః శిశిరః' అని ఆ వాక్యము. (ప్రాకృత పద్యఛ్ఛాయయందు చివరిపాదము 'కృతం బిసినీ షండమ్' అని యుండుట సమంజసము.)

తత్ర శిశిర ఇత్యనేన ఋతువిశేషేణ ముగ్ధాముఖేఽపి పద్మసరసీవ శబ్దశక్త్యా నివేశితేన కమలవనోపప్లవాదేః స్వధర్మసంపదో లోకప్రతీతాయాః ప్రత్యాసన్నా ముగ్ధాముఖాంభోరుహ లోచనోత్పలస్మితకుసుమ దశన కేసరాదే శ్ఛాయాపరమ్లాని ర్లక్ష్యమాణా విప్రలంభానుభావ ప్రకర్ష ముపలక్షయతి. శిశిర లక్ష్మీవర్ణన ప్రస్తావాచ్చ 'ముఖ మర్ధం శరీరస్య సర్వం వా ముఖముచ్యతే' ఇతి ప్రస్థానప్రాధాన్యలక్షణయా సర్వర్తుభ్యః శిశిర ఏవ ప్రధాన మిత్యపి లక్షితం భవతి.

అర్థము : అక్కడ శిశిరమన్న ఋతువిశేషముచేత పద్మసరస్సునందు పెరెనే ముగ్ధాముఖమునందును కమలవనోపప్లవాదులయిన స్వధర్మసంపదకు సన్నిహితమైన ముగ్ధాముఖపద్మముయొక్కయు, లోచనోత్పలములయొక్కయు, మందహాస కుసుమములయొక్కయు, దశనకేసరములు మొదలగువానియొక్కయు వర్ణము వాడిపోవుట లక్షితమై విప్రలంభానుభావ ప్రకర్ష ఉపలక్షిత మగుచున్నది. శిశిరలక్ష్మీ వర్ణన ప్రస్తావమువల్ల 'శరీరములో సగముకాని శరీరము సర్వము కాని మునిగిమన బడును' అని యనుటచేత ప్రస్థాన ప్రాధాన్యలక్షణచేత సర్వఋతువులకంటె శిశిరమే ప్రధాన మనికూడ లక్షిత మగుచున్నది.

## పఠిత్యలంకారము

56. కాకు స్వర పదచ్ఛేద భేదాభినయ కాంతిభిః
పాఠో యోఽర్థవిశేషాయ పఠితిః సేహ షడ్విధా.

అర్థము : కాకువు, స్వరము, పదచ్ఛేదము, పదభేదము, అభినయము, కాంతి - అనువానితో కూర్చి, అర్థవిశేషముకొరకై పఠించినచో అది 'పఠితి' యను శబ్దాలంకారమై ఆరు ప్రభేదముల నొందును.

### [కాకుపఠితి - ఉదాహరణము]

సా కాక్వా యథా -

'యది మే వల్లభా దూతీ తదాహమపి వల్లభా
యది తస్యాః ప్రియా వాచ స్తన్మమాపి ప్రియ ప్రియాః' 78

అత్రైకయా కాక్వా విధి రన్యయా నిషేధః ప్రతీయతే.

అర్థము : కాకువుతోడి పఠితి కుదాహరణము. నా దూతిక వల్లభయైనప్పుడు నేనుకూడ వల్లభనే. ప్రియాః ఆమె మాటలు ప్రియములైనపుడు నామాటలు కూడ ప్రియములే.

ఇక్కడ ఒక కాకువుచేత విధియు, మరొక కాకువుచేత నిషేధమును ప్రతీత మగుచున్నవి.

వ్యాఖ్య : పతనమునే పఠితి యనవచ్చును. ఇచ్చట పఠనవిశేషమును 'పఠితి' యనుపేర వ్యవహరించుట జరిగినది. ఒక విధముగా పఠింపగా ఒక యర్థము కలుగగా, మరొక విధముగా పఠించుటచేత మరొకయర్థము కలుగునెడల, దానిని పఠితియన్న శబ్దాలంకారముగా పరిగ్రహింతురు. ఇది కాకువు మొదలయిన భేదములచేత ఆరువిధములుగా నగును.

శబ్దాలంకారములలో పండ్రెండవది పఠితి. అందు మొదటి ప్రభేదము కాకు పఠితి. కాకు వనగా భిన్నకంఠధ్వని యని యర్థము. కాకువునందలి మార్పు వలన అర్థమునందు మార్పు కలిగినయెడల కాకు పఠితి యగును.

ప్రకృతోదాహరణమున ఒక ప్రియురాలు ప్రియునితో విధిరూపమున ప్రసంగించుచున్నది. 'నా దూతిక నీకు ప్రియురాలు; కాబట్టి నేనుకూడ నీకు ప్రియురాలినే. ఆమె మాటలు నీకు ప్రియముగా నుండును; కాబట్టి నా మాటలుకూడ నీకు ప్రియములే' అని యొకభావము. 'నీకు నాయందు ప్రీతి యున్నది కాబట్టియే నీవు నాదూతిక నాదరించుచున్నా'వన్న భావము విధిరూపమున వెల్లడియగుచున్నది. కాకువును మార్చి పలికినప్పుడు దీనికి విరుద్ధమైన యర్థమే కలుగును. 'నా దూతిక నీకు ప్రియురాలయినప్పుడు ఇంక నేను నీకు ప్రియరాలినగుట యెట్లు? ఆమె మాటలు నీకు ప్రియములైనపుడు నామాటలు నీకు ప్రియము లగుటయెట్లు? నీకు ప్రియురాలు దూతికయేకాని నేను కాను' అన్న అర్థాంతరము వెల్లడి యగుచున్నది. ఇట్లు కాకుభేదముచేత అర్థభేదము నొందుటవల్లనే, ఇది కాకు పఠితికి లక్ష్యమైనది.

[స్వరపఠితి - ఉదాహరణము]

స్వరేణ యథా -

'సుభ్రూస్త్వం కుపితేత్యపాస్తమశనం త్యక్తా కథా యోషితాం
దూరాదేవ మయోజ్ఝితాః సురభయః స్రగ్గంధధూపాదయః
రాగం రాగిణి ముంచ మయ్యవనతే దృష్టే ప్రసీదాధునా
సత్యం త్వద్విరహాద్భవంతి దయితే సర్వా మమాంధా దిశః' 79

అత్ర దృష్టే ఇత్యత్ర ప్లుతస్వరకరణాత్ కుపితకాంతా ప్రసాదన పర మపీదం వాక్య ముత్కుపిత దృష్టిప్రసాదన పరతాం ప్రతిపద్యతే.

అర్థము : స్వరముతోడి పతితి కుదాహరణము. మంచి కనుబొమలు కలదానా! నీవు కోపించితి వని నేను భోజనమును విడిచితిని; స్త్రీలకథను విడిచితిని; పుష్ప చందనధూపాది సౌరభములను దూరమునుండియే విడిచితిని. అవనతుడనై కనబడుచున్న నన్ను అనుగ్రహింపుము; కోపనురాలా! ఇప్పుడు నాయందు కోపమును విడిచిపెట్టుము. ప్రియురాలా ! నీవిరహమువల్ల నాకు సర్వదిక్కులును గ్రుడ్డివైయున్నవి. నిజము.

ఇచ్చట 'దృష్టే' అని ప్లుతస్వరమును చేర్చుటవల్ల కుపితకాంతను శాంతింపజేయనదేయైనను, ఈవాక్యము ఉత్కుపితదృష్టిని శాంతింపజేయుటకై ప్రవర్తించు వట్లు ప్రతిపాదించును.

వ్యాఖ్య : స్వరములు హ్రస్వములు దీర్ఘములు ప్లుతములు అని మూడు విధములు. హ్రస్వములకు దీర్ఘములకు లిపియందు స్పష్టమయిన భేదము కలదు; దీర్ఘములకు ప్లుతములకు లిపియందు భేదము లేదు. కావున దీర్ఘమును ప్లుతముగా కాని, ప్లుతమును దీర్ఘముగా కాని పలుకుట కవకాశ మధికముగా కలదు.

గాన రోదన దూరాహ్వాన సంబోధనాదులందు సాధారణముగా ప్లుతము ప్రయుక్తమగును. దీర్ఘముగా నుచ్చరించుటవల్ల, ఒక యర్థము కలుగుచుండగా, ప్లుతముగా నుచ్చరించుటవల్ల మరొక యర్థము కలుగునెడల, అది స్వరపతితి యగును.

ప్రకృతోదాహరణమునందు కోపనయైన ప్రియురాలిని ప్రసన్నురాలిని చేసి కొనుటకై ప్రియుడు చేయు ప్రసంగము కలదు. 'మయ్యవనతే దృష్టే ప్రసీద' అని యన్నప్పుడు 'అవనతుడనై కనిపించుచున్న నాయందు ప్రసన్నురాలవగుము' అని యర్థము. ఇట్టియెడల 'దృష్టే' యందలి 'ఏ' దీర్ఘము. దీనిని ప్లుతముగా పఠించినచో 'దృష్టే' యన్నది సంబోధ్యవాచకముగా మారిపోవును. అట్లయినప్పుడు 'రాగిణీ! రాగమును విడిచిపెట్టుము. ఓ దృష్టీ! అవనతుడనైన నాయందు ప్రసన్నమవగుము' అన్న యర్థమేర్పడును. ఇట్లగుటచేత నాయకుడు కాంతానుగ్రహమును గాక, దృష్టిప్రసాదమును గాంక్షించుచున్నా డన్న భావమేర్పడును. ఇట్లు స్వరమునందలి మార్పువల్ల అర్థమునందు మార్పు కలుగుచుండుటవల్లనే యిది స్వరపతితికి లక్ష్యమయినది. ఉదాహరణపద్యము శార్ఙ్గధరపద్ధతినుండి గ్రహింపబడినది. విద్యాపతి రచనము.

[పదచ్ఛేదపఠితి - ఉదాహరణము]

పదచ్ఛేదేన యథా -

'సర్వక్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యే వనాంతేఽస్మిన్మయా విరహితా త్వయా' 80

అత్ర మయా విరహితేత్యావతి పదచ్ఛేదే పురూరవస స్త్వయే త్యేతావతి తు పర్వతస్య వాక్యభేదో భవతి.

**అర్థము :** పదచ్ఛేదముతోడి పఠితి కుదాహరణము. సర్వభూధరపతీ! సర్వాంగసుందరియు, మనోహరయు, ఈ రమ్యవనాంతమున నాచేత విరహితయు నైన స్త్రీ నీచేత చూడబడినదా ?

ఇచ్చట 'మయావిరహితా' అన్నంతవరకు పదచ్ఛేదముచేయగా పురూరవః ప్రోక్తముగాను, 'త్వయా' అన్నంతవరకు పదచ్ఛేదముచేయగా పర్వతప్రోక్తము గాను వాక్యభేదము కలుగును.

**వ్యాఖ్య :** పదచ్ఛేదము అని యనగా పదముల విరుపు అని యర్థము. వాక్యము నొకచోట విరిచి పఠించుటచేత నొక యర్థమును, మరొకచోట విరిచి పఠించుటచేత మరొక యర్థమును కలుగు నెడల పదచ్ఛేద పఠితి యగును. ఒక యర్థము మాత్రమే ప్రకృత సందర్భమునకు సరిపడును; రెండవది అప్రకృతమే. అయిన ప్పటికిని అర్థద్వయ దాయకమగుటచేతనే ఇది సహృదయరంజకమై అలంకారమగు చున్నది. పదచ్ఛేదముచేత కలుగుటచేత, ఇది పదచ్ఛేద పఠితి యగుచున్నది.

ప్రకృతోదాహరణము కాళిదాసు విక్రమోర్వశీయములోనిది. పురూరవుడు ప్రియురాలయిన యూర్వశికొరకై అన్వేషించుచు చెట్లను, లతలను, కొంశలను, బండలనుగూడ అడుగుట ప్రారంభించును. 'నాచేత విరహితయైన సర్వాంగసుందరి యైన రామ నీచేత చూడబడినదా?' అని ప్రశ్నించును. క్షితిభృత్తని యనగా పర్వత మనియు, రాజనియుకూడ నర్థములు గలవు. పురూరవుడు వక్తయైనపుడు 'పర్వత నాథా' అని సంబుద్ధి. ఇది ప్రశ్నవాక్యము. ఇదియే పర్వతగుహలనుండి ప్రతి ధ్వనిగా వెలువడినప్పుడు అర్థాంతరమునొందుట కవకాశము కలదు. దీనికి పదచ్ఛే దమే కారణము. 'రాజేంద్రా! నీచేత విడువబడిన సర్వాంగసుందరియైన రామ

మనోహరమైన వనాంతమున నాచేత చూడబడినది'. ఇది సమాధానవాక్యము: పర్వత ప్రోక్తము. 'దృష్టా మయా - త్వయా విరహితా' అని పదచ్ఛేదము చేయుటవల్ల ఈ యర్థము కలుగును. ఇట్లు పదచ్ఛేదమువల్ల అర్థభేదము కలుగుటచేత, ఇది పదచ్ఛేద పరితికి లక్ష్యమయినది.

[పదభేదపరితి - ఉదాహరణము]

పదభేదేన యథా-

'యేన ధ్వస్తమనోభవేన బలిజిత్కాయః పురాస్త్రీకృతో
యో గంగాం చ దధేఽంధకక్షయకరో యో బర్హిపత్త్రప్రియః
యస్యాహుః శశిమచ్ఛిరోహర ఇతి స్తుత్యం చ నామామరాః
సోఽవ్యాదిష్టభుజంగహారవలయ స్త్వాం సర్వదో మాధవః' 81

అత్ర యేన ధ్వస్తమనోభవేనేత్యాదే ర్యేన ధ్వస్తమనోఽభవేనేత్యాదేశ్చ పదభేదా దుమాధవో మాధవ ఇత్యర్థద్వయం ప్రతీయతే. తయోశ్చ ద్వయోరపి ప్రాధాన్యేనోపపాదనా దంగాంగిభావేన ప్రకృతాప్రకృతరూపతయా చానవస్థానాత్పరస్పర మసంబంధేన నాయం శ్లేషః. పదభేదేన తు పాఠే పర్యాయతోఽర్థద్వయప్రతీతే రియం శ్లేషోపసర్జనాత్ పదభేద పరితిః.

అర్థము : పదభేదముతోడి పరితి కుదాహరణము. ఏ ధ్వస్తమన్మథుని చేత పూర్వము విష్ణుశరీరము శరముగా నయ్యెనో, ఎవడు గంగను ధరించెనో, ఎవడు అంధకాసుర నాశకుడో, ఎవడు నెమలివాహనముగా గల కుమారస్వామి కిష్టుడో, ఎవనికి చంద్రశిరుడని హరుడని స్తుత్యనామముపెట్టి దేవతలు పిలుతురో ఆ భుజంగహారవలయుడైన ఉమాధవుడు సర్వదా నిన్ను రక్షించును గాక! ఇది శివపరమైన యర్థము.

ఏ అభవునిచేత శకటము (అనః) ధ్వస్తమయ్యెనో, పూర్వము బలిని జయించిన ఎవని శరీరము స్త్రీరూపమును ధరించెనో, ఎవడు అగమును (గోవర్ధనపర్వతమును) భూమిని (వరహావతారమునందు) ధరించెనో, అంధకులకు ఆశ్రయము (క్షయకరః)గా నెవ్వడుండెనో, నెమలిపింఛమునం దిష్టముకలవాడెవ్వడో, శశిమథు

డైన రాహుని శిరస్సును హరించినవాడని స్తుత్యనామముతో దేవతలెవ్వనిని పిలు తురో, గరుడునియం దిష్టముగల్గి (ఇష్టభుజంగహా) శబ్దబ్రహ్మమునందు లీనమొం దెడి (రవలయః) కోరినకోరికల నన్నింటి నిచ్చెడి (సర్వదః) ఆ మాధవుడు నిన్ను కాపాడునుగాక। ఇది విష్ణుపరమైన యర్థము.

ఇచ్చట 'యేన ధ్వస్తమనోభవేన' మొదలయిన విధముగాను 'యేన ధ్వస్త మనః అభవేన' మొదలయిన విధముగాను పదభేదమువల్ల ఉమాధవుడని మాధవు డని అర్థద్వయము స్ఫురించుచున్నది. ఆ రెండింటిని ప్రాధాన్యముతో నుపపాదిం చుటవల్ల, అంగాంగిభావముతో గాని ప్రకృతాప్రకృతరూపముతో గాని ప్రతిపాదిం పకపోవుటవల్ల, పరస్పరము సంబంధము లేకపోవుటవల్ల ఇది శ్లేషము కాదు. పద భేదముతో పఠించునపుడు పర్యాయక్రమమున ఒకమారొక యర్థమునకు, మరొక మారు మరొక యర్థమునకు ప్రతీతి కలుగుటవల్ల ఇది శ్లేషోపసర్జనవల్ల నయిన పదభేదపఠితియే యగును.

వ్యాఖ్య : పదచ్ఛేదముచేతనే పదభేదము కలుగుచున్నది. ఈ పదభేదము కలుగుటవల్లనే అర్థాంతరము కలుగుచున్నది. కావుననే యిది పదభేదపఠితి యను పేరు నొందుచున్నది.

'నానార్థసంశ్రయః శ్లేషః'. అనేకార్థముల కాధారము శ్లేషాలంకారము. పద చ్ఛేదమువలన పదభేదము కలిగినయెడల సభంగశ్లేషమగును. ఇట్టియెడల 'సభంగ శ్లేషమునకును, పదభేదపఠితికిని భేదమేమి?' అని భోజదేవుడే ప్రశ్నవేసికొని సమాధానము చెప్పుచున్నాడు. శ్లేషయందలి రెండర్థములకు అంగాంగిభావము కాని, ప్రకృతాప్రకృతరూపత్వము కాని యుండును. ఒకటి ప్రధానమై, రెండవది అప్ర ధానమై యుండును. పఠితియందు రెండర్థములును ప్రధానములే. అయినప్పటికిని ఒక యర్థము ప్రతీతమగునప్పుడు రెండవదానికి ప్రతీతి యుండదు. ఒకమారు ఒక క్రమమున చదివినప్పుడు ఒకయర్థముమాత్రమే భాసించునని భావము. సభంగశ్లేష మునందు సైతము ప్రతీతి యిట్లే యుండును. ఆయినప్పటికి, ఒక యర్థము రెండవ దానిని ఉపసర్జనీకరించుకొనును. అందువల్లనే అది శ్లేషాలంకారముగా వేరుగా పరిగణన కెక్కినది. పదభేదపఠితికి శ్లేష సహకారమున్నది; కాని అది ప్రధానము కాక, పఠితియే ప్రధానమగుచున్నది. అందువల్లనే భోజదేవుడు తన వివృతి యందు 'శ్లేషోపసర్జనాత్ పదభేద పఠితిః' అని స్పష్టము చేయుచున్నాడు.

ఉదాహృత పద్యమునందు ఒక విధముగా పఠించినపుడు శివస్తుతియు, మరొక విధముగా పఠించినపుడు విష్ణుస్తుతియు ప్రతీతము లగుచున్నవి. ఈ పద్యము ధ్వన్యాలోకమునుండి గ్రహింపబడినది.

[అభినయపఠితి - ఉదాహరణము]

అభినయేన యథా –

'ఏద్దహమేత్తత్థణిఆ ఏద్దహమేత్తేహిం అచ్ఛివత్తేహిమ్
ఏద్దహమేత్తావత్థా ఏద్దహమేత్తేహిం దిఅహేహిమ్' 82

[ఛాయా –
'ఏతావన్మాత్రస్తనీ ఏతావన్మాత్రాభ్యా మక్షిపత్రాభ్యామ్
ఏతావన్మాత్రావస్థా ఏతావన్మాత్రైర్దివసైః']

అత్ర ఇయన్మాత్రస్తనాదీనాం తథాభూతహస్తాభినయైః సహ పఠనా త్తథావిధార్థవిశేషో గమ్యతే.

అర్థము : అభినయముతోడి పఠితి కుదాహరణము. ఇన్నిదినములలో, ఇంతవయసులో ఇంతింత కన్నులును ఇంతింత స్తనములు.

ఇచ్చట 'ఇంతింత స్తనములు' మొదలయిన్నవానికి ఆవిధమైన అభినయముతోడి పఠనమువల్ల ఆవిధమైన అర్థవిశేషము గోచరించును.

వ్యాఖ్య : భావానుగుణమైన కరచరణాద్యంగచలనమే అభినయము. అభినయమువల్లనే ఉచ్చరించిన వాక్యమునకు అర్థస్పష్టత యేర్పడును. ఇట్లు అభినయపూర్వకముగా పఠించుట అవసరమైన వాక్యమునందు 'అభినయపఠితి' అన్న శబ్దాలంకార ముండును.

ఉదాహృతపద్యములో 'ఏతావత్' అన్న పదము నాలుగు పర్యాయము లావృత్తమైనది. మొదటి పర్యాయము 'పెద్ద' యన్న యర్థమును, రెండవ పర్యాయము 'విశాల' మన్న యర్థమును, కడపటి రెండుపర్యాయములు 'చిన్న' యన్న యర్థమును కలుగునట్లుగా అభినయము చేసినపుడే భావము రమణీయముగా నుండును.

ఉదాహృతపద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

[ మనుచరిత్రమునందలి 'ఇంతలు కన్నులుండ' నని మొదలయిన పద్యము అభినయపరితి కుదాహరణము. సాధారణముగా 'ఇంతలు' చిన్నవానిని 'అంతలు' పెద్దవానిని సూచించును. ఇచ్చట 'ఇంతలు' అన్నపదము సువిశాల నేత్రములకే సూచకము. వరూధిని నాట్యప్రవీణ యగుటచేత ఆమె విశాలత్వమును అభినయ పురస్సరముగా సూచించిన దనుకొనవలయును. 'ఇంతింతై వటుడింతయై మఱియుఁ దానింతై నభోవీధిపై నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై' మొదలయిన భాగవత పద్యము క్రమౌన్నత్య సూచకమైన అభినయము నపేక్షించును. 'ఇటుపెట్టిన, అటుపెట్టిన, ఇటుపెట్టక ముక్తిలేదు' అని మొదలుగా నున్న వేమన పద్యము పూర్తిగా అభినయాపేక్షకము. 'నిలువుబొట్టు పెట్టుకొన్నను, అడ్డబొట్టు పెట్టుకొన్నను ముక్తి లభ్యముకాదు; దానము చేసినపుడు మాత్రమే ముక్తి లభ్యమగు' నన్న భావముతో అభినయము చేసినపుడు వాక్యము భావసంపన్నమై సహృదయ రంజక మగును. ]

అపదేశోఽప్యభినయ విశేష ఏవ యథా –
'ఇతః స దైత్యః ప్రాప్తశ్రీ ర్నేత ఏవార్హతి క్షయమ్'
ఇత్యాత్మాన మపదిశ్య బ్రూతే.

అర్థము : అపదేశముకూడ అభినయవిశేషమే; దాని కుదాహరణము. ఇక్కడనుండియే ఆదైత్యుడైశ్వర్యమును పొందెను. అతడిక్కడనుండియే నాశనము నొందుట కర్హుడు కాడు.

ఈ విధముగా తన్ను చూపుచ్చుకొని చెప్పుచున్నాడు.

వ్యాఖ్య : అస్మచ్ఛబ్దము నుపయోగింపక దానికి బదులుగా ఏతచ్ఛబ్దమును వాడుట అపదేశము. 'నేను' అని యన్నప్పుడు అభినయము చేసినను చేయకున్నను అర్థము స్పష్టముగానే యుండును. 'వీడు' అని తన్నుగురించి ప్రయోగించుకొన్నప్పుడు అభినయ మపేక్షితము. ఇదియు అభినయ పరితిలోనే అంతర్భవించును; స్పష్టతకై వేరుగా ఉదాహరించినప్పటికిని వేరుగా పరిగణింపలే దనుట గమనార్హము.

ఉదాహృత పద్యభాగము కాళిదాసుని కుమారసంభవమునుండి గ్రహింపబడినది. తారకాసురుని దౌష్ట్యమునుగురించి దేవతలు చెప్పుకొన్నప్పుడు బ్రహ్మచెప్పిన

వాక్యములలో నిదియొకటి. 'నేనే వానికి వరమిచ్చితిని; నేనే వానిని నాశము చేయరాదు' అన్న భావముతో పై వాక్యమును పలికెను. అచ్చట 'ఇక్కడనుండియే' అన్న పదమునకు 'నావల్ల నే'అని యర్థము. అట్లనకుండ రూపాంతరమున పలుకుట చేత అభినయపూర్వకముగా తన్ను చూపించుకొనుటకూడ అవసరము. అట్లు బ్రహ్మ చేసియేయుండును. నాటకీయత యున్న ప్రసంగములందెల్ల అభినయపరితి కవకాశ ముండుట ఆవశ్యకము.

[కాంతిపరితి - ఉదాహరణము]

కాంత్యా యథా -

'యస్యారిజాతం నృపతే రపశ్య ద్దవలంబనమ్
యయా నిర్ఘరసంభోగై రపశ్య దబలం వనమ్.' 83

అత్రావలంబన మబలం వనమితి పదే పదద్వయే వా ద్వితీయ చతుర్థస్థానయో ర్వ్యా వకారబకారౌ తయో రంతఃస్థ పవర్గాభ్యాం పవర్గాంతఃస్థాభ్యాం చ కాంతిమతి పాఠేఽర్థ భేదో జాయతే.

అర్థము : కాంతితోడి పరితి కుదాహరణము. నృపతియొక్క శత్రుసమూహము అవలంబనమును గాంచెను. నిర్ఘరసంభోగములుకూడ లేనిదై త్రాగుటకు నీరును, నిద్రయు, భోజనమును లేక దుర్బలమై వనమును చేరెను.

ఇచ్చట 'అవలంబన'మని 'అబలం వన'మ్మని పదమునందును, పదద్వయమునందును ద్వితీయ చతుర్థస్థానములందలి వకార బకారములు వానియొక్క అంతస్థ పవర్గములతోను, పవర్గాంతస్థములతోను కాంతిమంతమైన పాఠమునందు అర్థభేదము పుట్టుచున్నది.

వ్యాఖ్య : కాంతియనగా పదమునందలి, సన్నిహితపదములందలి వర్ణములు స్థానవినిమయము గావించుకొనుట. కాంతితోడి పఠనమువల్ల అర్థాంతరము లభించునెడల దానిని కాంతిపరితి యని యందురు.

ఉదాహృతపద్యమునందు పూర్వార్ధమున 'అపశ్య దవలంబనమ్' అని యున్నది. దీనికి 'అవలంబనమును గాంచెను' అని యర్థము. ఇదే ఉత్తరార్ధమున 'బ వ' ల విపర్యయముతో పునః ప్రయుక్తమై 'అపశ్య దబలం వనమ్' అని

యైనది 'అపశ్యత్' అన్నది క్రియాపదము కాక విశేషణముగా మారినది 'యయౌ' అన్న క్రియ 'వెళ్లెను' అన్న యర్థమున నిచ్చట వేరుగా ప్రయుక్తమయి నది. 'అ + పా + శీ + అత్' అన్న విభాగమువల్ల పానము, శయనము, అన్నము లేనిదై అన్నయర్థము కలుగుచున్నది. అట్లగుటచేతనే 'అబలమ్' అన్న విశేషణము సమర్థితమగుచున్నది. కేవలము రెండువర్ణములు వినిమయము (పరస్పరము స్థానములు మార్చుకొనుట) పొందుటచేత ఇంతటి అర్థవిశేషము కలుగుచున్నది. కావుననే యిది 'కాంతిపఠితి' యన్న శబ్దాలంకారభేదముగా, గణనకెక్కి సహృదయ రంజక మగుచున్నది.

అపరే పునః పఠితి మన్యథా కథయంతి -

57. పదపాదార్ధ భాషాణా మన్యథాకరణేన యః
పాఠః పూర్వోక్త సూక్తస్య పఠితిం తాం ప్రచక్షతే.

అర్థము : కొందరు పఠితిని మరొకవిధముగా చెప్పుచున్నారు. పూర్వోక్త సూక్తముయొక్క పదమును గాని, పాదమును గాని, అర్ధపద్యమును గాని, మూడు పాదములను గాని, భాషనుగాని అన్యథాకరించి చదువుటయే పఠితి యని వారు చెప్పుచున్నారు.

వ్యాఖ్య : పఠనముననే పఠితి యనిపేరని చెప్పుకొంటిమి. ఇంతకు ముందు చెప్పుకొన్న పఠితిలో ఉచ్చారణ గతములయిన భేదములు మాత్రమే ప్రసక్తము లయినవి. ముందుగా వానినే చెప్పుటచేత భోజదేవునికి తత్పరిగణనము నందున్న ఆసక్తి వెల్లడి యగుచున్నది. ఇతరాలంకారికులు మరొకవిధమైన పరిగణనము గావించిరి. ఇందు ఉచ్చారణమునకు గాక పరివర్తనమునకే ప్రాధాన్యము. పూర్వమున్న పద్యమునందలి పదమును మార్చుటయో, అర్ధపద్యమును మార్చుటయో, పాదమును మార్చుటయో, మూడు పాదములను మార్చి చదువుటయో జరుగును. ఇప్పుడుకూడ దీనికి 'పఠితి' యన్నపేరే చెల్లును. ఇదియు శబ్దాలంకారము గానే సంభావిత మగును.

[పదపఠితి - ఉదాహరణము]

తత్ర పదాన్యథాకరణం ద్విధా - ప్రకృతితః, విభక్తితశ్చ.
తత్ర ప్రకృతితో యథా -

అసకలహసితత్వాత్ క్షాలితానీవ కాంత్యా
ముకులితనయనత్వాద్వ్యక్తకర్ణోత్పలాని
పిబతు మధుసుగంధీన్యాననాని ప్రియాణాం
త్వయి వినిహితభారః కుంతలానా మధీశః. 84

అత్ర త్వయీత్యస్య స్థానే మయీతి యదా పఠ్యతే, తదైతత్ ప్రార్థనావాక్య మప్యనుమతివాక్యం భవతి.

అర్థము : అక్కడ పదాన్యథాకరణము ప్రకృతివల్ల, విభక్తివల్ల - అని రెండు విధములు. అందు ప్రకృత్యన్యథాకరణమున కుదాహరణము. నీయందు భారము నుంచిన కుంతలాధీశ్వరుడు మందస్మితములవల్ల కాంతిశోభితములును, ముకుళిత నయనత్వమువల్ల జ్ఞాత కర్ణోత్పలములును మధుపానమువల్ల సుగంధిలములునయిన ప్రియురాండ్ర ముఖములను త్రాగును గాక!

ఇక్కడ 'నీయందు' అనుదానికి బదులుగా 'నాయందు' యని చదువబడిన యెడల, అప్పుడు ఇది ప్రార్థనావాక్యమే అయినను అనుమతి వాక్యముగా నగును.

వ్యాఖ్య : పదమును మార్చుట రెండువిధములు. ప్రకృతిని మార్చుట మొదటి విధము: ప్రత్యయమును మార్చుట రెండవవిధము. ఇది ప్రకృతిని మార్చుట యన్న మొదటి విధమున కుదాహరణము.

'త్వయి' యుష్మద్వాచకము; సప్తమ్యేకవచనము. దీని స్థానమున 'మయి' అస్మద్వాచకము, సప్తమ్యేకవచనము పఠింపబడినది. అనగా ఇచ్చట అస్మత్ ప్రకృతికి బదులుగా యుష్మత్ ప్రకృతి వాడబడినది; ప్రత్యయము రెండుచోట్ల నొక్కటియే. మారలేదు. 'నీయందు' అని యనుటవల్ల వక్తయు, రాజును, ప్రియురాండ్రును మాత్రమే కాక సంబోధింపబడుచున్న మరొకవ్యక్తి యుండవలయును. వక్త ఆ వ్యక్తిని ప్రార్థించుట జరుగుచున్నది. 'నాయందు' అని మార్చి యుపయోగించుట వల్ల ఆ వ్యక్తి కవకాశము లేకుండ పోయినది. వాచ్యముగా కాకపోయినను పరివర్తిత వాక్యమునందు 'కుంతలాధీశుడు' సంబోధ్యమానుడగుచున్నాడు. కావున ఇచ్చట రాజునకు ప్రియాతమణుల యెడల అనుమతి నిచ్చుట జరుగుచున్నది. ఇట్లు ఒక పదమునందు పరివర్తనము కలుగుటచేత అర్థవిశేషము కలుగుచుండుటవల్ల ఇది పదపరితికి లక్ష్యమయినది.

విభక్తితో యథా –

'సహ భృత్యగణం సబాంధవం సహమిత్రం ససుతం సహానుజమ్
స్వబలేన నిహంతి సంయుగే నచిరాత్పాండుసుతః సుయోధనమ్' 85

అత్ర యదా పాండుసుతః సుయోధన మిత్యస్య స్థానే పాండుసుతం సుయోధన ఇతి పఠ్యతే, తదేత దమంగలార్థమపి సుయోధనే మంగలార్థం భవతి.

అర్థము : విభక్తి మార్పువల్ల పదపఠితి కుదాహరణము. సేవకగణముతోపాటు, బాంధవులతోపాటు, మిత్రులతోపాటు, పుత్రులతోపాటు, తమ్ములతోపాటు అచిరకాలముననే పాండుసుతుడైన ధర్మరాజు తన బలముచేత యుద్ధమునందు సుయోధనుని సంహరించును.

ఇచ్చట 'పాండుసుతః' 'సుయోధనమ్' అనువానికి బదులుగా 'పాండుసుతం' 'సుయోధనః' అని పఠింపబడినచో అది అమంగళకరమే అయినప్పటికిని సుయోధనునికి మంగళార్థముగా పరిణమించును.

వ్యాఖ్య : విభక్తిని మార్చి అర్థభేదమును సాధించుట పదపఠితియందొక అంతర్భాగము. పయి పద్యమునందు కర్తృపదము 'పాండుసుతః'; ప్రథమైకవచనము; కర్మపదము 'సుయోధనమ్'; ద్వితీయైకవచనము. అర్థాంతరాపేక్షతో మార్పు చేయగా 'పాండుసుతమ్' 'సుయోధనః' అని యైనవి: 'పాండుసుతమ్' ద్వితీయా విభక్తి – కర్మపదముగా మారినది. 'సుయోధనః' ప్రథమావిభక్తి – కర్తృపదముగా మారినది. ఇచ్చట ప్రాతిపదికలు మారలేదు; ప్రత్యయములు మాత్రమే మారినవి. ఇట్లగుటచేత తొలుతనున్న యర్థము తలక్రిందులయినది. కావుననే ఇది పదపఠితికి లక్ష్యమయినది.

[పాదపఠితి - ఉదాహరణము]

పాదాన్యథాకరణేన యథా –

'ఏకాంతే విజనే రాత్రావాంతర్వేశ్మని సాహసే
న్యాసాపహ్నవనే చైవ దివ్యా సంభవతి క్రియా' 86

అత్ర తృతీయపాదస్థానే 'తన్వంగీ యది లభ్యేత' ఇతి పాఠో భవతి, తర్హై తత్పరీక్షోపయికమపి కామాపయికం భవతి.

**అర్థము :** పాదాన్యథాకరణమున కుదాహరణము. ఏకాంతమునందు, నిర్జన ప్రదేశమునందు, అంతర్గృహమం లో, సాహసముతో న్యాసమును మరుగుపుచ్చుట యందు దివ్యమైన అనుభవము కలుగును.

ఇచ్చట తృతీయపాదము స్థానమున 'తన్వంగి యది లభ్యేత' అన్న పాఠమును చేర్చినయెడల, అప్పుడు పరీక్షాసంబంధియైనప్పటికి నిది కామసంధి యగును.

**వ్యాఖ్య :** ఒక పాదమును తొలగించి తత్స్థానమున నొకపాదము నుంచుట చేత అర్థాంతరము లభించునెడల, అది పాదపరితి యగును. ఉదాహృతపద్యము సాహసముతో కూడిన పందెమునకు సంబంధించినది ఇచ్చిన వస్తువును దాచి రావల యును. అట్లు దాచివచ్చుట దివ్యక్రియ. ఏకాంతము, విజనము మొదలయిన వన్నియు అట్లుచేయుట కవరోధములు. ఈ పద్యమునందలి మూడవపాదమును 'తన్వంగీ యది లభ్యేత' అని మార్చినచో అర్థమునందు మార్పు కలుగును. 'తన్వంగి లభించినచో' అని యర్థము. అప్పుడు మొత్తము పద్యమునకు 'ఏకాంతము నందు, నిర్జనప్రదేశమునందు, అంతర్గృహములో, సాహసముతో అందమైన యువతి లభించినచో దివ్యమైన అనుభవము కలుగును' అన్న యర్థమేర్పడును. ఇట్లు పాద మును మార్చుటచేత అర్థాంతరము కలుగుటవల్లనే యిది పాదపరితికి లక్ష్య మయినది.

## [పద్యార్ధపరితి - ఉదాహరణము]

అర్థాన్యథాకరణేన యథా -

'తత్తావదేవ శశినః స్ఫురితం మహీయో
యావన్న తిగ్మరుచిమండల మభ్యుదేతి
అభ్యుద్యతే సకలధామనిధౌ తు తస్మి
న్నిందోః సితాభ్రశకలస్య చ కో విశేషః?' 87

అత్ర యదా మధ్యమపాదయోః స్థానే 'యావన్న తాః కిమపి గౌరితరా హసంతి, తాభిః పునర్వికాసితాననపంకజాభిః' ఇతి పఠ్యతే, తదైతద్వీరార్థోక్తిరూప మపి శృంగారోక్తిరూపం సంపద్యతే.

అర్థము : అర్థాన్యథాకరణమున కుదాహరణము. సూర్యమండల ముదయించువరకే చంద్రుని యొక్క మహత్తర ప్రకాశము. సర్వకాంతి సమగ్రుడయిన సూర్యు డుదయింపగా ఆ చంద్రునకు, తెల్ల మేఘశకలముకంటె విశేషమేమి కలదు?

ఇచ్చట నడుమనున్న రెండుపాదముల స్థానమున 'యావన్నతాః గౌరితరా హసంతి, తాభిః పునర్వికాసితానన పంకజాభిః' అని పఠింపబడినచో, అప్పుడు వీరార్థోక్తిరూపమైనప్పటికిని శృంగారోక్తి రూపముగా సంపన్నమగును.

వ్యాఖ్య : పద్యార్ధ మనగా రెండుపాదము లన్నియర్థము. పద్యార్ధమును మార్చుటచేత అర్థాంతరము కలిగినచో అదియు పఠితిప్రభేదమే యగును. ఉదాహృత పద్యమునందు వీరత్వప్రకటన కలదు. ఇది అప్రస్తుతప్రశంసయన్న అర్థాలంకారము. నిజమున కిచ్చట చంద్రసూర్యుల ప్రసంగము కాక మరొక ప్రసంగము కలదు. ఒకడు విద్వాంసుడుగనో, వీరుడుగనో వెలుగుచున్నాడు. మరొకడు అంతకంటె సమర్థుడిప్పుడు వచ్చెను. ఈ క్రొత్తవాని వెలుగుముందు పాతవాని వెలుగు పోవలసినదే. ఇట్టియెడల రెండవ మూడవపాదములను మార్చినచో క్రొత్త యర్థమేర్పడును. అప్పుడు మొత్తము పద్యమునకు 'ఆ స్త్రీలు స్వచ్ఛముగా నవ్వువరకే చంద్రుని యొక్క మహత్తరప్రకాశము. వికసితానన పద్మలయిన వారిచేత చంద్రునికి గాని తెల్లని మేఘశకలమునకు గాని విశేష మేమి యుండును?' అన్న యర్థము కలుగును. దీనితో శృంగారానుకూల సౌందర్యవర్ణనము జరిగినది. పూర్వోక్తమునందున్న వీరత్వప్రకటనమును, అప్రస్తుతప్రశంసయు నదృశ్యము లయినవి.

ఇట్లు రెండుపాదములను మార్చుటవల్ల అర్థాంతరము కలుగుటచేత, ఇది పద్యార్ధపఠితికి లక్ష్యమయినది.

[పాదత్రయపఠితి - ఉదాహరణము]

పాదత్రయస్య చాన్యథాకరణేన యథా -

'త్యాగేన యుక్తా దివ ముత్పతంతి
త్యాగేన హీనా నరకం వ్రజంతి
న త్యాగినాం దుష్కర మస్తి కించి
త్త్యాగో హి సర్వవ్యసనాని హంతి' 88

అత్ర తురీయపాదమేవోపాదాయ పాదత్రయస్య చాన్యథాకరణేన వక్ష్యమాణః పాఠో భవతి. తద్దైత త్త్యాగప్రశంసార్థమపి త్యాగనిందార్థం జాయతే. యథా-

'త్యాగో హి సర్వవ్యసనాని హంతీ
త్యలీక మేతద్ భువి సంప్రతీదమ్
జాతాని సర్వవ్యసనాని తస్యా
స్త్యాగేన మే ముగ్ధవిలోచనాయాః' 89

**అర్థము** : పాదత్రయము నన్యథాకరించుట కుదాహరణము. త్యాగయుక్తులు స్వర్గమునకు పోవుదురు. త్యాగహీనులు నరకమునకు పోవుదురు. త్యాగులకు దుష్కర మనునదియే లేదు. త్యాగము సర్వదుఃఖములను నశింపజేయును.

ఇచ్చట నాలుగవపాదమును మాత్రమే తీసికొని మూడుపాదముల నన్యథాకరించుటచేత ఈ చెప్పబోవు పాఠమేర్పడును. అప్పుడు త్యాగప్రశంసార్థమైనప్పటికి నిది త్యాగనిందార్థము పరిణమించును. ఉదాహరణము - త్యాగము సర్వదుఃఖములను హరింపజేయు నన్నది భూమియం దీనాడు వట్టి యబద్ధము. ముగ్ధవిలోచన యొక్క త్యాగముచేత నాకు సర్వదుఃఖములును కలిగినవి.

వ్యాఖ్య : పద్యమునందలి ఒక్క పాదమును మాత్రమే యథాతథముగా నుంచి మిగిలిన మూడుపాదములను మార్చి పఠించినచో, అది పాదత్రయ పఠితి అను పేర శబ్దాలంకారమై అర్థాంతరబోధము గావించును. ప్రకృతోదాహరణమునందు పూర్వోక్తపద్యమునందలి నాలుగవపాదము మొదటి పాదముగా యథాతథముగా నిలిచినది. మిగిలిన మూడుపాదములును క్రొత్తగా సంతరింపబడినవి. పూర్వోక్త పద్యమునందు త్యాగము స్వర్గదాయకముగాను, సర్వవ్యసన సంహారకముగ్గాను ప్రశంసింపబడినది. అచ్చట దయాదానాది గుణసమన్వితమైన ప్రసిద్ధార్థమునందు త్యాగ

పదము ప్రయుక్తమయినది. అన్యథాకృత పద్యమునందు త్యాగపదమున కర్థము సంకుచితమైనది. ప్రియురాలుతోడి యెడబాటునే త్యాగమని వక్త చెప్పుచున్నాడు. ఇందువల్ల తనకు సర్వవ్యసనములును ప్రాప్తించెనట! ఇచ్చట ఉదాత్తస్థితిలో నున్న త్యాగము సంకుచితస్థితికి దిగజారినది. ప్రశంసార్హమైన త్యాగము నిందార్హమైనది. మూడుపాదములను మార్చి పఠించుటవల్లనే అర్థమునం దింతటిమార్పు సంభవించినది. ఇట్లగుటచేతనే ఇది పాదత్రయపఠితికి లక్ష్య మయినది.

## [భాషాపఠితి - ఉదాహరణము]

భాషాన్యథాకరణేన యథా -

'కిం తాదేణ నరేందసేహరసిహాలీఢగ్గపాదేణ మే
కిం వా మే ససురేణ వాసవసహాసీహాసణద్ధాసిణా
తే దేసా గిరిణో అ తే వణమహీ సజ్జేఅమే వల్లహా
కోసల్లాతణఅస్స జత్థ చలనే వందామి ణందామి అ' 90

అత్ర యది భాషాంతరేణ పఠ్యతే తదైతచ్చారసేనీభాషయా సీతావాక్యం సంస్కృత భాషాయాం సుమంత్రేణ దశరథాయ నివేదితమ్. తద్యథా -

'కిం తాతేన నరేంద్రశేఖర శిఖాలీఢాగ్రపాదేన మే
కిం వా మే శ్వశురేణ వాసవసభాసింహాసనాధ్యాసినా
తే దేశా గిరయశ్చ తే వనమహీ సా చైవమే వల్లభా
కౌసల్యాతనయస్య యత్ర చరణౌ వందామి నందామి చ' 91

సేయ మేవం ప్రకారా పఠితిః.

అర్థము : భాషాన్యథాకరణమున కుదాహరణము. నరేంద్రశేఖర శిఖాలీఢాగ్రపాదుడైన పితృపాదునివల్ల నేమిప్రయోజనము? ఇంద్ర సభాసింహాసనాసీనుడైన మామగారివల్ల నేమిప్రయోజనము? ఆ కౌసల్యాతనయుని చరణము లెచ్చటనుండునో ఆ దేశములు, ఆ కొండలు, ఆ అరణ్యభూములు నాకు ప్రియములు. ఆ చరణములకే నేను నమస్కరింతును; ఆ చరణములనే నేను ప్రశంసింతును.

ఇచ్చట భాషాంతరముచే పఠింపబడినచో అప్పుడు శౌరసేనీభాషలోని సీతా వాక్యము సంస్కృతభాషయందు సుమంత్రునిచేత దశరథునికి నివేదితమయినది. ఇది యీవిధమైన పఠితి.

వ్యాఖ్య : భాషను మార్చుటవల్ల మార్పు కలిగినయెడల, అది భాషాపఠితి యగును. ఇచ్చట అర్థమునందు మార్పు కలుగదు. కాని భాషాభేదమువల్ల వక్తృ భేదము వ్యజ్యమాన మగును.

పూర్వోక్తపద్యము శౌరసేనీభాషాగ్రథితము. దృశ్యకావ్యములందు శౌరసేనీ ప్రాకృతము స్త్రీపాత్రల కుపయోగించుట సాధారణలక్షణము. సందర్భమునుబట్టియు, విషయమునుబట్టియు అది సీతాకథిత మని స్పష్టమగుచున్నది. ఇదే విషయమును పురుషపాత్ర చెప్పవలసివచ్చినప్పుడు సంస్కృతభాష నాశ్రయించుట సాధారణ లక్షణము. కావుననే సీతాకథితమైన పద్యము సుమంత్రునినోట వెలువడినప్పుడు సంస్కృత భాషామయముగా పరివర్తన మొందినది. భాషాన్యథాకరణము వక్త్రన్య థాకరణమునకు హేతువయినది. ఒకరు ఒకభాషలో చెప్పిన విషయమును ఇతరౌచి త్యమునుబట్టి వేరొకరు మరొకభాషలో చెప్పవచ్చును. అట్లు చెప్పినప్పుడు అది భాషా పఠితి యన్న శబ్దాలంకారమై సహృదయరంజక మగును.

ఇట్లు 'పఠితి'ని రెండవవిధముగా పరిగణించినప్పుడు పదపఠితి, పాదపఠితి, పద్యార్ధపఠితి, పాదత్రయవృత్తి, భాషావృత్తి - అని అయిదు విధములుగా నగును. పదము ప్రకృతి, విభక్తి యని రెండు విధములుగా నుండుటచేత, మొత్తముమీద ఈ పఠితికూడ తక్కిన ప్రణాళికకు తగినట్లుగా ఆరు ప్రభేదములనే పొందుచున్నది.

## యమకాలంకారము

58. విభిన్నార్థైకరూపాయా యా వృత్తిర్వర్ణసంహతేః
అవ్యపేత వ్యపేతాత్మా యమకం తన్నిగద్యతే.

అర్థము : విభిన్నమైన అర్థము కలిగి ఒకే విధమైన రూపము గల వర్ణ సమూహముయొక్క ఆవృత్తి అవ్యపేతమును, వ్యపేతమునై యమకము అని పిలువబడును.

వ్యాఖ్య: ఆవృత్తి నాధారముగా చేసికొన్న యలంకారములలో ప్రధానమయినది యమకము. వర్ణసమూహముయొక్క ఆవృత్తి యని యనుటచేత, ఒక్క వర్ణముమాత్రమే పునఃపునఃప్రయుక్తమైనయెడల దానిని యమకమనుటకు వీలులేదు. ఒకే రూపముగల వర్ణసమూహ మని యనుటచేత ఒకే పదము పునరుక్తమయిన యమక మగునా? వర్ణసమూహమునకు ఏకత్వముండవలయును గాని అర్థమునందు భిన్నత్వముండవలయును. అందువల్ల, అక్షరసాన్నిహిత్యమువల్ల ఒకే పదము పునరుక్తమయినట్లు భాసించుటయే కాని ఒకేపదము పునరుక్తమగుట యిందుండదు. ఈ యమకము అవ్యపేత మని, వ్యపేతమని రెండువిధములు. ఆవృత్తి నొందు వర్ణసమూహమునకు నడుమ వ్యవధానములేకుండ నున్నయెడల అవ్యపేతయమకము; వ్యవధాన మున్నయెడల వ్యపేతయమకము. ఒక వర్ణగుచ్ఛము ఒకసారి ప్రయుక్తమై వెనువెంటనే తిరిగి ప్రయుక్తమైనయెడల అవ్యపేతము; ఒక వర్ణగుచ్ఛము ఒకసారి ప్రయుక్తమై యితరపదములు కొన్ని వచ్చినపిదప మరల ప్రయుక్తమయినచో, అది వ్యపేతము.

59. త దవ్యపేత యమకం వ్యపేతయమకం తథా
స్థానాస్థాన విభాగాభ్యాం పాదభేదాచ్చ భిద్యతే.

60. యత్ర పాదాది మధ్యాంతాః స్థానం తేషూపకల్ప్యతే
య దవ్యపేత మన్యద్వా తత్ స్థానయమకం విదుః.

అర్థము: అవ్యపేత యమకమును, అట్లే వ్యపేతయమకమును స్థానాస్థాన విభాగములవల్లను, పాదభేదమువల్లను భేదమునొందును. అవ్యపేతమైనప్పటికిని వ్యపేతమైనప్పటికిని పాదాది యని, పాదమధ్యమని, పాదాంతమని స్థానము నియమింపబడినపుడు దానిని స్థానయమక మని యందురు.

61. చతు స్త్రి ద్వ్యేకపాదేషు యమకానాం వికల్పనాః
ఆది మధ్యాంత మధ్యాంత మధ్యాద్యంతాశ్చ సర్వతః.

62. అత్యంత బహవ స్తేషాం భేదాః సంభేదయోనయః
సుకరా దుష్కరాశ్చైవ దర్శ్యంతే తత్ర కేచన.

అర్థము: నాలుగుపాదములందును, మూడుపాదములందును, రెండుపాదములందును, ఒక్కపాదమునందును ఆదియందు గాని మధ్యమందుగాని అంతమందు

గాని మధ్యాంతమునందు గాని ఆదిమధ్యమునందు గాని ఆద్యంతములందు గాని ఎల్లయెడల యమకములు కల్పనీయములు. సంభేదహేతువువల్ల వానియొక్క భేదములు పెక్కువిధములుగా నుండును. అందు సుకరములును దుష్కరములును నైన కొన్ని యిచ్చట చూపింపబడుచున్నవి.

## [అవ్యపేతయమకము]

తత్ర చతుష్పాదయమకేషు అవ్యపేత మాదియమకం యథా-

'రాజీవ రాజీవశలోల భృంగం
ముష్ణంత ముష్ణం తతిభి స్తరూణామ్
కాంతాలకాంతా లలనాః సురాణాం
రక్షోభి రక్షోభిత ముద్వహ న్తమ్'. 92

**అర్థము :** అచ్చట చతుష్పాదయమకములందు అవ్యపేతమున కాదియమకమున కుదాహరణము. రాజీవముల సమూహమునకు వశమై చలించుచున్న తుమ్మెదలను గలది; వృక్షముల సమూహములచేత ఎండవేడిమిని హరించుచున్నది; అందమైన ముంగురులుగల దేవతాస్త్రీలను రాక్షసులచేత క్షోభనొందకుండ భరించుచున్నది.

**వ్యాఖ్య :** వర్ణసంహతి వెంటవెంటనే ఆవృత్తినొందుట అవ్యపేత యమకముయొక్క లక్షణము. ఈ యమకము నాలుగుపాదములందు నున్నయెడల చతుష్పాదయమక మగును. ప్రతిపాదమునను ఆదియం దున్నయెడల ఆదియమక మగును.

ప్రకృతలక్ష్యము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది. రైవతకాద్రి వర్ణన సందర్భమునందలిది. మొదటిపాదమున 'రాజీవ-రాజీవ' యని, రెండవ పాదమున 'ముష్ణంత-ముష్ణంత' యని, మూడవపాదమున 'కాంతాల-కాంతాల' యని, నాలుగవపాదమున 'రక్షోభి-రక్షోభి' యని ఆదియందే మూడేసియక్షరము లావృత్తములైనవి. అక్షరసమూహము ఏకరూపముగా నున్నది కాని అర్థమునం దేకరూపత లేదు. రాజీవ శబ్దమునకు పద్మమని యర్థము, రాజీ శబ్దమునకు సమూహమని యర్థము. తరువాతిదైన 'వ' పిమ్మట నున్న వర్ణములలో మొదటిది. వర్ణముల సాన్నిహిత్యమువల్ల 'రాజీవ' పదమువలె నగుపట్టునే కాని అచ్చట ఆ పదము

లేదు; కావుననే ఆ యర్థమును లేదు. అట్లే తరువాతి పాదమందు 'ముష్ణంతమ్ + ఉష్ణం + త—' అనువాని సాన్నిహిత్యమువల్ల నేర్పడినవి. మూడవపాదమున 'కాంత + అలక + అంతా(ః) + ల—' అనునవియు, నాలుగవపాదమున 'రక్షోభిః + అక్షోభి(త)' అనునవియు సన్నిహితమైనవి. ఇట్లు ఒకే పదమువలె ననిపించు అక్షరసముదాయము ప్రతిపాదమునందు ఆదియందు అవ్యవహితముగా ఆవృత్తి నొందుటవల్ల అవ్యపేతాదిచతుష్పాదయమకమున కిది లక్ష్యమైనది.

తదేవ మధ్యయమకం యథా-

'దధత మాకరిభిః కరిభిః క్షతైః
సమవతారసమైః రసమైః స్తటైః
వివిధకామహితా మహితాంభసః
స్ఫుట సరోజవనా జవనా నదీః' 93

అర్థము : అందే మధ్యయమకమున కుదాహరణము. గనులచేతను, ఏనుగులచేత త్రొక్కబడిన సాటిలేని సమానములైన రేవులుగల తటములచేతను, అనేక వాంఛలను తీర్చెడి ప్రశస్తములయిన జలములచేతను, వికసించిన పద్మవనముల చేతను వేగవంతములయిన నదులను ధరించినది.

వ్యాఖ్య : ఇదికూడ అవ్యపేత చతుష్పాదయమకమే. ప్రతిపాదమున మధ్యభాగమున అక్షరసముదాయము ఆవృత్తి నొందును. కావుననే యిది 'మధ్య యమకము' అనుపేరు నొందినది.

ఉదాహరణపద్యము భారవి కిరాతార్జునీయమునుండి గ్రహింపబడినది. సందర్భము హిమవద్వర్ణనము. ప్రథమపాదమున 'కరిభిః' ఆవృత్తి నొందినది. ద్వితీయమున 'రసమైః' తృతీయమున 'మహితా' చతుర్థమున 'జవనా' ఆవృత్తి నొందినవి. అర్థమునందు ప్రతిపాదమునందును భేదము కలదు. కావుననే యిది మధ్య యమకమునకు లక్ష్యమయినది.

తదేవ మంత్యయమకం యథా -

'వ్యథిత సింధుమనీరశనైః శనై
రమరలోకవధూజఘనైర్ఘనైః

ఘణాంతా మభితో వితతం తతం
దయిత రమ్యలతా వకులైః కులైః' 94

అర్థము : అందే అంత్యయమకమున కుదాహరణము. రశనములు (మొలనూళ్లు) గల్గి ఘనములయిన దేవతాస్త్రీల జఘనములచేత మందమందముగా వ్యథితమయిన సింధువును గలది; ప్రియములై మనోహరములయిన పొగడలతలు గలది; సర్పముల కులములచేత చుట్టుకొనబడినది; పక్షులచేత వ్యాప్తినొందినది.

వ్యాఖ్య : ఇదికూడ అవ్యపేత చతుష్పాదయమకమే. ప్రతిపాదమునందు తుదియందు అక్షరసముదాయము ఆవృత్తినొందును. కావుననే యిది 'అంత్యయమకము' అనుపేరు నొందినది.

ఉదాహరణ పద్యము భారవి కిరాతార్జునీయమునుండి గ్రహింపబడినది. సందర్భము హిమవద్వర్ణనము. ప్రథమపాదమున 'శనైః' రెండవపాదమున 'ఘనైః' మూడవపాదమున 'తతం' నాలుగవపాదమున 'కులైః' ఆవృత్తి నొందినవి. ఇవి పాదాంతమునం దున్నవి. కావుననే యిది అంత్యయమకమునకు లక్ష్యమయినది.

ఆది మధ్యయమకం యథా -

'ఘనాఘనాభస్య మహీమహీయసః
సురాసురాణాం దయితస్య తస్య సా
ధరాధరాకారగృహా గృహార్ధినో
బభూవ భూమేర్నగరీ గరీయసీ' 95

అర్థము: ఆదిమధ్యయమకమున కుదాహరణము. ఘనాఘనము (మేఘము) యొక్క కాంతి గలిగి, లోకమునందు మహత్తరుడై, దేవతలకు రాక్షసులకు నిష్టుడైన ఆ గృహార్థియొక్క పర్వతాకార గృహములు గల నగరము భూమికి గొప్పదిగా నయినది.

వ్యాఖ్య : ఇదికూడ అవ్యపేతయమకమే. ఇందు ప్రతిపాదమునందును రెండుచోట్ల యమకము గలదు. ఆది యందొకచోట, మధ్యభాగమం దొకచోట యమకముండుటవల్ల దీనికి 'ఆదిమధ్యయమకము' అనుపేరు చెల్లుచున్నది.

ఉదాహృత పద్యమునందు మొదటిపాదమున ఆదియందలి 'ఘనా' అనెడి రెండక్షరములు అవ్యవహితముగా ఆవృత్తి నొందినవి. అట్లే మధ్యభాగమునందలి 'మహీ' యన్న రెండక్షరములు వెనువెంటనే పునరుక్తములయినవి. ఇట్లే తక్కిన పాదములందును 'సురా, తస్య' 'ధరా, గృహా' 'బభూ, గరీ' యన్న అక్షర యుగ్మములు క్రమముగా మొదటను, నడుమను ఆవృత్తినొందినవి. కావుననే 'ఆదిమధ్య యమకము'నకు ఈ పద్యము లక్ష్యమయినది. నాలుగవపాదమునందు మొదట 'బభూ' అని యుండగా దానివెంట 'వభూ' అని యున్నది. ఇచ్చట అక్షరము మారిన దనిపించును. 'వబయో రభేదః' అన్న నియమ మిచ్చట అవలంబనీయము.

ఆద్యంత యమకం యథా -

'ద్రుతం ద్రుతం వహ్నిసమాగతం గతం
మహీం మహీనద్యుతిరోచితం చితమ్
సమం సమంతా దపగోపురం పురం
పరైః పరై రప్యనిరాకృతం కృతమ్' 96

అర్థము : ఆద్యంతయమకమున కుదాహరణము అగ్నితోడి సంబంధము వల్ల కరగింపబడినది. వేగముగా భూమియందు వ్యాపించినది. అంతటను సమముగా నిబిడముగా అధికమైన కాంతి శోభతో స్థాపింపబడినది. శత్రువులచేత పురము ద్వారములు తెరువబడినవి. శ్రేష్ఠులచేత పైతము నిరాకారముగా చేయబడలేదు.

వ్యాఖ్య : అవ్యపేతయమకమునందలి నాలుగు పాదములందును ఆదియందును అంతమునందును వర్ణసంహతి ఆవృత్తినొందుట కుదాహరణ మిది. దీనికి ఆద్యంతయమక మనిపేరు.

ఉదాహరణపద్యము భట్టికావ్యమునుండి గ్రహింపబడినది. ప్రథమపాదమున ఆదియందు 'ద్రుతం' అంతమునందు 'గతం' ఆవృత్తములైనవి. అట్లే ద్వితీయమునందు 'మహీ, చితం' అనునవియు, తృతీయమునందు 'సమం, పురం' అనునవియు, చతుర్థమునందు 'పరైః, కృతమ్' అనునవియు ఆవృత్తినొందినవి 'ద్రుతం' అన్నప్పుడు మొదటిది 'వేగముగా' అన్న యర్థమున ప్రయుక్తము. రెండవది 'కరగింపబడినది' అన్న యర్థమందు ప్రయుక్తము. ఒకేపదమైనప్పటికి అర్థభేదము చాల కలదు. ఇట్లే తక్కినచోట్ల మహీమ్ + అహీన; రోచితం - చితం;

సమం_సమంతాత్; గోపురం_పురం అన్న విభాగమువల్ల భిన్నపదము లనుట స్పష్టము. మొదటిపాదమున 'సమాగతం-గతం' అనియు తుదిపాదమున 'నిరాకృతం-కృతం' అనియు తుదియందున్నవి. ఏకధాతు నిష్పన్నములే యైనను భిన్నార్థకములు. అట్లే నాలుగవపాదము తొలుతనున్న 'పరైః' అర్థభేదముతో ఆవృత్తి నొందినది. కావుననే ఆద్యంతయమకమున కీ పద్యము లక్ష్యమైనది.

మధ్యాంత యమకం యథా -

'ఉదయి తే దయితే జఘనం ఘనం
స్తనవతీ నవతీర్థ తను స్తనుః
సుమనసా మనసా సదృశౌ దృశౌ
ద్యుకురు మే కురు మేఽభిముఖం ముఖమ్' 97

అర్థము : మధ్యాంతయమకమున కుదాహరణము. ఓ ప్రియురాలా! అభ్యుదయసంపన్నమయిన నీ జఘనము ఘనము; నీ తనువు స్తనవతీనవతీర్థముల చేత వలచబడినది. నీ చూపులు పువ్వుతోను మనస్సుతోను సాటియైనవి. స్వర్లోక భూలోక సౌందర్యావధీ! నీముఖమును నా కభిముఖము గావింపుము.

వ్యాఖ్య : అవ్యపేత చతుష్పాదయమకమునందు పాదమధ్యమునందును పాదాంతమునందును రెండుచోట్ల యమకమున కుదాహరణ మిది. కావుననే మధ్యాంత యమకమన్న పేరునకు తగియున్నది.

ఉదాహరణపద్యమున ప్రతిపాదమధ్యమందును వర్ణత్రయము ఆవృత్తి నొందినది. ప్రథమపాదమున 'దయితే', ద్వితీయమున 'నవతీ', తృతీయమున 'మనసా', చతుర్థమున 'కురుమే'. ప్రతిపాదాంతమునందు వర్ణయుగళము ఆవృత్తి నొందినది. ప్రథమమున 'ఘనం' ద్వితీయమున 'తనుః' తృతీయమున 'దృశౌ' చతుర్థమున 'ముఖం'. ఇచ్చట వర్ణములలోనే ఏకత్వము కాని అర్థములలో ఏకత్వము లేదు. కావుననే మధ్యాంతయమకమున కీ పద్యము లక్ష్యమయినది.

ఆది మధ్యాంత యమకం యథా -

'సీమాసీ మానభూమిః షణిబలవలనోద్భావిరాజీ విరాజీ
హారీ హారీతవద్భిః పరిసరసరణావ స్తమాలై స్తమాలైః

దేవాదేవాస్త్రరక్షః కృతభవ భవతోఽగ్రే న దీనో నదీనో
ముక్తాముక్తాచ్ఛరత్నః సితరుచిరుచిరోల్లాసముద్రః సముద్రః'

**అర్థము :** ఆదిమధ్యాంతయమకమున కుదాహరణము. హద్దులయందు విలిచెడివాడు, గౌరవస్థానమైనవాడు, పాముల సమూహములు ప్రాకుటచేత ఏర్పడిన చాలులచేత విరాజిల్లువాడు, హారీతము లను పక్షులచేత పరిసరమార్గములందు విసరబడిన మాలా సన్నివేశములు గలిగిన తమాలవృక్షములచేత మనోహరమైనవాడు, దేవతలకు రాక్షసులకు రక్షణను గలిగించినవాడు, ముత్యములుగాక మిగిలిన స్వచ్ఛరత్నములను గలిగినవాడు, చంద్రునియొక్క కాంతిచేత ఉల్లాసముద్ర కలవాడు అయిన సముద్రుడు నదీపతి నీయెదుట దీనుడు కాడు.

**వ్యాఖ్య :** అవ్యపేత చతుష్పాదయమకమునందు ప్రతిపాదమున మూడు చోట్ల యమక ముండునది ఆదిమధ్యాంతయమకము. ఉదాహరణ పద్యమున ప్రతి పాదమునందు ప్రారంభమున 'సీమా, హారీ, దేవా, ముక్తా' అను నక్షరగుచ్ఛములు క్రమముగా ఆవృత్తినొందినవి. అట్లే మధ్యభాగమున 'బల, సర, భవ, రుచి' అన్న అక్షరగుచ్ఛములును – తుదిభాగమున 'విరాజీ, స్తమాలై, నదీనో, సముద్రః' అన్న అక్షరగుచ్ఛములును క్రమముగా ఆవృత్తినొందినవి. ఇట్లు ప్రతిపాదమున ఆది మధ్యాంతములందు ఆవృత్తి కలుగుట వల్లనే ఆదిమధ్యాంత యమక మన్నపేరు అన్వర్థ మగుచున్నది.

ప్రతిపాదయమకేష్వవ్యపేత మాదియమకం యథా –

'విశదా విశదామత్త
సారసే సారసే జలే
కురుతే కురు తేనేయం
హంసీ మామంతకామిషమ్' 99

నాస్య చతుష్ప్రయోగ ఇతి శేషభేదా నోదాహ్రియంతే.

**అర్థము :** ప్రతిపాదయమకములందు అవ్యపేతమయిన ఆదియమకమున కుదాహరణము. మదించిన బెగ్గురులు ప్రవేశించుచున్న సరోవర జలమునందుండి వశమైన హంసి తాను చేయుచున్న కుత్సితమైన రుతముచేత నన్ను యముని కాహారముగా చేయుచున్నది.

దీనికి చతుర్థమైన ప్రయోగము లేనందువల్ల మిగిలిన భేదముల నుదాహరించుట లేదు.

వ్యాఖ్య : అవ్యపేతయమకమే యిదికూడ. కాని యిందు మూడు పాదములలో మాత్రమే యమకము ప్రయుక్తమగును. కావుననే త్రిపాదయమకమని పేరు. ఇదికూడ ఆదియందు, మధ్యమునందు, అంతమునందు ప్రయుక్తము కావచ్చును. ప్రకృతోదాహరణము ఆదియమకము. మొదటిపాదమున 'విశదా'యని, రెండవపాదమున 'సారసే'యని, మూడవపాదమున 'కురుతే' యని మూడక్షరముల గుచ్ఛములు అవ్యవహితముగా పునరుక్తము లయినవి. నాలుగవ పాదమునందు యమకము లేదు. ఈ పద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

ఇట్లు మూడుపాదములం దుండుట లక్షణ సమ్మతమే. కాని కవుల ప్రయోగములందు మనోహరములయిన త్రిపాదయమకపద్యములు ఎక్కువగా కానవచ్చుట లేదు. అందువలన భోజదేవుడు మిగిలిన భేదములను పాఠకుల యూహాబలమునకే విడిచిపెట్టి ద్విపాదయమకమును గురించి ప్రసంగించుచున్నాడు.

ద్విపాద యమకేష్వవ్యపేత మాదియమకం యథా -

'కరోతి సహకారస్య
కలికోత్కలికోత్తరమ్
మన్మనో మన్మనోఽప్యేష
మత్తకోకిల నిస్స్వనః' 100

అర్థము : ద్విపాదయమకములందు అవ్యపేతమయిన ఆదియమకమున కుదాహరణము. అవ్యక్త మధురమైన యీ మత్తకోకిల కూతయు, తియ్యమామిడి పూతయు నా మనస్సును ఉత్కంఠితము గావించుచున్నవి.

వ్యాఖ్య : అవ్యపేతయమకమునందే ద్విపాదయమక మంతర్భవించును పద్యమునందలి నాలుగు పాదములలోను రెండు పాదములందు మాత్రమే యమక నియమము పాటింపబడును. ఆ పాదములం దాదియందు యమక మున్నచో ఆది యమక మందురు.

ఉదాహృతపద్యమునందలి రెండవపాదమున 'కలికోత్' అని, మూడవ పాదమున 'మన్మనో' అని పునరుక్తము లయినవి. మిగిలిన రెండుపాదములందు విట్టి

పునరుక్తి లేదు. కావుననే యిది అవ్యపేతద్విపాదాదియమకమునకు లక్ష్యమయినది. ఈ పద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

తదేవ మధ్యయమకం యథా –

'తులయతి స్మ విలోచన తారకాః
కురవక స్తవక వ్యతిషంగిణి
గుణవదాశ్రయలబ్ధ గుణోదయే
మలిని మాలిని మాధవయోషితామ్' 101

అర్థము : అందే మధ్యయమకమున కుదాహరణము. కురవక స్తబకము లందు చొచ్చి, గుణవంతుల ఆశ్రయముచేత పొందబడిన స్వగుణాభ్యుదయము గల తుమ్మెద యందలి మాలిన్యము (నల్లదనము) కృష్ణుని భార్యలయొక్క కనీనికలను బోలి యున్నది

వ్యాఖ్య : అవ్యపేతమునందు ద్విపాదమధ్యయమకమున కుదాహరణ మిది. ఉదాహృతపద్యమునందలి రెండవపాదమున 'వక' పునరుక్తమైనది; నాలుగవపాదమున 'లిని' పునరుక్తమైనది. ఇవి ఆదియందుగాని, అంతమునందుగాని లేవు. కావుననే మధ్యస్థానీయములుగా పరిగణింపబడుచున్నవి. అందువల్లనే యీ పద్యము మధ్యయమకమునకు లక్ష్యమయినది. ఈ పద్యము మాఘుని శిశుపాలవధనుండి గ్రహింపబడినది.

అంత్యయమకం యథా –

'ఖండితాశంసయా తేషాం పరాఙ్ముఖతయా తయా
ఆవివేశ కృపా కేతూకృతోచ్చైర్వానరం నరమ్' 102

ఏవ మాదిమధ్యాన్యపి ద్రష్టవ్యాని. ఏకపాదయమకేష్వవ్యపేత మాద్యంతయో రనుల్లేఖితి నోదాహ్రియతే.

అర్థము : అంత్యయమకమున కుదాహరణము. వారియొక్క జయాశ ఖండిత మగుటచేత వారు పరాఙ్ముఖులు కాగా వానరశ్రేష్ఠుని ధ్వజముగా నిల్పుకొన్న అర్జునునికి జాలి కలిగెను.

ఈ విధముగా ఆదిమధ్యములనుగూడ చూడనగును. ఏకపాదయమకము లందు ఆద్యంతములవలన అవ్యపేతము రచింపబడదు. కావున ఉదాహరించుటలేదు.

వ్యాఖ్య : అవ్యపేతమునందు ద్విపాదాంత్యయమకమున కిది యుదాహరణము. రెండవపాదము చివరనున్న 'తయా' నాలుగవపాదము చివరనున్న 'నరం' అనునవి పునరుక్తము లయినవి. ఈ పద్యము భారవి కిరాతార్జునీయమునుండి గ్రహింపబడినది.

భోజదేవుడు తక్కిన యుదాహరణములను తాను ప్రదర్శింపక పాఠకుని యూహకే విడిచిపెట్టెను. పైని చూపిన పద్ధతిలోనే, ఆదిమధ్యములను, మధ్యాంతములను, ఆద్యంతములను గూడ యమకనియమముతో వ్రాయవచ్చును. మూడు పాదములలో యమకము లేకుండ ఒక్కపాదములో మాత్రమే యమకము గలవి ఏకపాదయమకములు. అవ్యపేతములయిన వీనియందు ఆదియమకములును, అంత్యయమకములును రమణీయములు గావు. అందుచేత కవులు వానిని సాధారణముగా వ్రాయరు. అందువల్లనే భోజదేవుడుకూడ వాని నుదాహరించుట మానుకొనెను.

మధ్యయమకం తు చతుర్థపాద ఏవోల్లిఖతి. యథా –

'విలులితాలక సంహతి రామృశన్
మృగదృశాం శ్రమవారి లలాటజమ్
తను తరంగ తతీః సరసాం దలత్
కువలయం వలయం మరుదావవౌ' 103

అర్థము : మధ్యయమకము చతుర్థపాదమునందే ప్రసిద్ధమైయున్నది. ఉదాహరణము. ముంగురుల సమూహమును కదలించినవాడై, హరిణనేత్రల ఫాలభాగమునందలి స్వేదజలమును తుడుచుచు, వికసించుచున్న కలువలుగల సరస్సుల అలల సమూహములను కదలించుచు వాయువు వీచెను.

వ్యాఖ్య : ఏకపాదయమకమునందు ఆద్యంతయమకములు రమణీయములు కావు. ఇది ముందే ప్రసక్తమయినది. మధ్యయమకమయినను, ఏదో పాదమున గాక, నాలుగవపాదమునం దున్నప్పుడే రమణీయముగా నుండును. కవుల ప్రయోగములుకూడ అట్లే యున్నవి. ఉదాహృత పద్యమునందు నాలుగవపాదమున 'వలయం' పునరుక్తమైనది. ఇది ఆదియందుగాని అంతమునందుగాని లేకుండుట

వల్లనే మధ్యస్థానీయముగా పరిగణింపబడుచున్నది. ఈ పద్యము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

ఏవ మావృత్త్యాధిక్యే౽ప్యవ్యపేత ముదాహార్యమ్. యథా -

'వియ ద్వియద్వృష్టి పరం పరం పరం
ఘనాఘనాలీ రసితాసితా సితా
సర స్సరస్యాః స్వరసార సారసా
సభా సభా రాత్రి రతారతారతా' 104

అర్థము : ఈ విధముగానే అవ్యపేతమును అధికావృత్తులతో నుదాహరింపవచ్చును. ఉదాహరణము. తొలగిపోవుచున్న వానల పరంపర గల ఆకాశము మనోహరముగా నున్నది. మేఘముల సమూహము గర్జనల నాశ్రయించుకొన్నదై తెల్లగా నున్నది. ప్రవాహములును సరోవరములును స్వరమే సారముగా గల (కూజితములు చేయుచున్న) జలపక్షులను గలిగి యున్నవి. గృహము కాంతిమంతమై యున్నది. రాత్రి తారకల ప్రకాశము కొంచెము తక్కువగా నున్నది.

వ్యాఖ్య : యమక మనగా ఆవృత్తి యనియే నిర్వచనము. ద్విరావృత్తియా, త్రిరావృత్తియా, పునఃపునరావృత్తియా. అన్న ప్రశ్న యింతవరకు రాలేదు. ఇంతవరకు చూపిన యుదాహరణములనుబట్టి ద్విరావృత్తియే యమక మన్న యభిప్రాయము కలుగునేమో యని యనుమానించి గ్రంథకర్త యిట్లు చెప్పుచున్నాడు. ఆవృత్తు లధికముగా నున్నప్పటికిని అది యమకమే యగును. అది అవ్యపేతమే యగును.

ఉదాహృతపద్యము అవ్యపేతము; అధికావృత్తులను గలది. చతుష్పాద యమకము; ఆద్యంత యమకము.

ప్రథమపాదము మొదట 'వియద్' రెండవపాదము మొదట 'ఘనా' మూడవ పాదము మొదట 'సరస్' నాల్గవపాదము మొదట 'సభా' అన్న అక్షర గుచ్ఛములు పునరుక్తము లయినవి. ఇది ఆదియమకము. అంతమునందు మొదటిపాదమున 'పరం' రెండవపాదమున 'సితా' మూడవపాదమున 'రసా' నాల్గవపాదమున 'రతా' అన్న అక్షరగుచ్ఛములు మూడేసిమారులు ప్రయుక్తములయినవి. అధికసంఖ్యలో ప్రయుక్తమైనప్పటికిని యమకాలంకారమే యగును. ఇది అంతమందుండుటచే అంత

యమకము. ఆదియందు, అంతమందుకూడ యమకమున్నది కావున ఇది ఆద్యంత యమకమునకు లక్ష్యమయినది.

ఆవృత్త్యేక రూపతాయా మపి. తత్రాదియమకం యథా -

'యామ యామత్రయాధీనా
యామయా మరణం నిశా
యామయామ ధియా స్వర్త్యా
యామయా మథితైవ సా' 105

అర్థము : ఆవృత్త్యేకరూపతయందును అవ్యపేతము. అందు ఆదియమక మున కుదాహరణము - మూడుజాములకు అధీనమయిన వ్యాప్తిగల రాత్రిచేత మరణము పొందుదుము గాక! బుద్ధిచేత ప్రేయసిని పొందుదుము గాక! ప్రాణమునకు పీడకలిగించునట్టిదయిన రాత్రిచేత ఆమె (ప్రియురాలు) నలిగిపోయినది.

వ్యాఖ్య : ఆవృత్తి అనేకపర్యాయము లున్నట్లుగానే, ఆదినుండి అంతము వరకు ఒకే వర్ణగుచ్ఛముకూడ నుండవచ్చును. అదికూడ మరల స్థాననియతిని కలిగియుండవచ్చును. ఇట్టి అవ్యపేతమైన ఏకరూపమైన ఆదిమావృత్తికి ఉదాహరణమిది.

ప్రకృతోదాహరణమునందు 'యామ'అన్న అక్షరగుచ్ఛము ప్రతిపాదమునందు ప్రారంభమున ఆవృత్తినొందినది. ఇది పాదపాదమునకు భేదమునొందక యేక రూపముగానే యుండుట యిచ్చటి విశేషము. ప్రథమపాదమునందలి 'యామ' ద్వితీయపాదమునందలి 'మరణం'తో అన్వయించి 'మరణమును పొందుదుముగాక' అన్న యర్థమునిచ్చును. ఇది క్రియాపదము. దానిని వెన్నంటి వచ్చిన 'యామ' శబ్దము 'జాము' అన్న అర్థముగల నామవాచకము. రెండపాదమున '(అ)యామ యా + మ— ' రాత్రికి విశేషణము 'యామత్రయాధీనాయామ' అనునది. పైను న్నది తృతీయైకవచనరూపము. తరువాతి పదమునందలి తొలివర్ణము'మ' కలియుట వల్ల 'యామయామ' అనియైనది. మూడవపాదమునందు 'యామ్ + అయామ' అని విభాగము. 'యామ్' అనగా ప్రేయసిని 'ఆయామ' అనగా పొందుదుము అని యర్థము. చనిపోవుటచేత శరీరభారము నశించునని భావము. నాల్గవపాద మున 'రాత్రిచేత' అన్న యర్థమున 'యామయా' అని ప్రయుక్తము. దానినంటియే

'మథిత' శబ్దము ప్రయుక్తమైనందువల్ల 'యామయామ' అని సిద్ధించినది. ఇట్లు పద్యమున 'యామ' అన్న అక్షరగుచ్ఛము ఎనిమిది మారులు ప్రయుక్తమై ప్రతి పాదము నాదియందు యమకమును సంపాదించిపెట్టినది. ఉదాహరణపద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

తథైవ మధ్యయమకం యథా -

'స్థిరాయతే యతేంద్రియో
న హీయతే యతేర్భవాన్
అమాయతే యతేఽప్యభూత్
సుఖాయ తేఽయతే క్షయమ్' 106

అర్థము : అట్లే మధ్యయమకమున కుదాహరణము. స్థిరమైన భవితవ్యమును గల వాడా! నియతేంద్రియుడవైన నీవు యతికి తీసిపోవు. ఇంతయని చెప్పరాని నీ అమాయికత్వము అక్షయమైన సుఖమును నీకు కలిగించినది.

వ్యాఖ్య : అవ్యపేతమైన ఏకరూపమైన మధ్యయమకమున కుదాహరణము. ఇది దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది. ప్రతిపాదమున 'యతే' యన్న అక్షరగుచ్ఛము పునరుక్తమయినది. పాదమునకు ఆదియందుగాని, అంతమునందు గాని లేకుండుటచే ఇది మధ్యయమకమయినది.

తదేవాంతయమకం యథా -

'భవాదృశా నాథ! నజానతే నతే
రసం విరుద్ధే ఖలు సన్నతే నతే
య ఏవ దీనాః శిరసా నతేన తే
చరంత్యలం దైన్యరసేన తేన తే' 107

ఏదేతత్సర్వ మప్యవ్యనహితావృత్తే రవ్యపేతయమకం భవతి.

అర్థము : అట్లే అంతయమకమున కుదాహరణము. నాథా! నీవంటివారు నమస్కారముయొక్క ఆస్వాదము నెరుగరు. నతత్వమును, ఇనత్వము (ప్రభుత్వము)ను విరుద్ధములుకదా! దీనులు మాత్రమే తలవంచి నమస్కరించి, ఆ దైన్యరసముతో నిన్ను వెంబడించుచున్నారు.

ఇంతవరకు నిచియంతయు అవ్యవహితావృత్తివలన అవ్యపేతయమకమగును.

వ్యాఖ్య : అవ్యపేతమైన ఏకరూపమైన అంతయమకమున కుదాహరణము. ఈ పద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది. ఇందు ప్రతిపాదాంతము నందు 'నతే' యన్న అక్షరగుచ్ఛము ఆవృత్తమయినది. ఇంతవరకు అవ్యపేత యమకమున కుదాహరణములు చూపబడినవి.

## [ వ్యపేతయమకము ]

అథ చతుర్షు పాదేషు వ్యపేత మాది యమకం యథా -

'కాంచిప్రతోలీ మను*కామినీం తాం
కాంచి ప్రసవంతీవనమాతరిశ్వా
కాంచి ప్రభృత్యాభరణోజ్ఝితానాం
కాంచిల్లునీతే సురతశ్రమార్తిమ్' 108

అర్థము : ఇంక నాలుగుపాదములందును వ్యపేతమయిన ఆదియమకమున కుదాహరణము. కాంచీనగరపురాచబాట ననుసరించెడి మొలనూలు మొదలయిన ఆభరణములను విడిచిపెట్టిన కామినులయొక్క సురతశ్రమార్తిని జలములచే నొప్పు చున్న ప్రవాహముగల వనమందలి వాయువు పోగొట్టుచున్నది.

వ్యాఖ్య : వ్యపేతమని యనగా దూరదూరముగా నుంచబడినది యని యర్థము ఉదాహరణ పద్యమునందు ప్రతిపాదముయొక్క ఆదియందు 'కాంచి' యన్న అక్షరగుచ్ఛము కలదు. ప్రతిపాదమున నాదియందు ఇట్లుండుటచే ఆది యమక మగుచున్నది. మొదటి 'కాంచి'కి రెండవ 'కాంచి'కి నడుమ మిక్కిలి యెడ ముండుటచేత వ్యపేతయమక మగుచున్నది.

తదేవ మధ్యయమకం యథా -

'మదన దారుణ ఉద్ధిత ఉచ్ఛ్రితో
మధుమదారుణ హూణముఖచ్ఛవిః
తరుణి దారుణ ఏష దిశః సమం
మమ హృదారుణదాప్రమవఃస్థానః' 109

---

* కామినీనాం - అని యుండదగును.

అర్థము : నాలుగు పాదములందును వ్యపేతమయిన మధ్యయమకమున కుదాహరణము తరుణీ! మామిడితోట యనెడి అగ్ని మదనుడన్న దారువు (కట్టె) నుండి పుట్టినదై ఉన్నతమయిన శిఖలను (చిగుళ్ళు, జ్వాలలు) గలదై మద్యమదము చేత మిక్కిలి ఎఱ్ఱనైన హూణజాతీయుని ముఖముయొక్క కాంతివంటి కాంతిగలదై మిక్కిలి దారుణమై నాహృదయముతో సమముగా దిక్కులను బంధించెను.

వ్యాఖ్య : ఉదాహృతపద్యమునందు 'దారుణ' యన్న అక్షరగుచ్ఛము ప్రతిపాదమునందును వడిమిభాగమున నున్నది. నాలుగు పర్యాయములు ప్రయుక్త మగుటచే ఇది యమకము. ఆదియందు గాని, అంతమునందుగాని కాకుండుటవల్ల మధ్యయమకము. మొదటి 'దారుణ'కు రెండవ 'దారుణ'కు నడుమ మిక్కిలి యెడము కలదు. అట్లే తక్కినచోట్లను వ్యవధానమున్నది. కావుననే యిది వ్యపేతయమకమునకు లక్ష్యమైనది.

అంత యమకం యథా -

'తవ ప్రియా సచ్చరితాప్రమత్త యా
విభూషణం ధార్యమిహాంశుమత్తయా
రతోత్సవామోద విశేషమత్తయా
న మే ఫలం కించన కాంతిమత్తయా' 110

అర్థము : అంతయమకమున కుదాహరణము. ఓయీ! (అ) ప్రమత్తుడా! నీ ప్రియురాలు సౌశీల్యవంతురాలు. రతోత్సవ సంతోషవిశేషముచేత మదించిన ఆమె చంద్రకాంత మణిభూషణమును ధరింపవలయును. నేను కాంతిని పొందియుండుటవల్ల నాకేమియు ఫలము లేదు. (కావున నాకు మణిభూషణములతో పనిలేదు).

వ్యాఖ్య : ఒక నాయిక తన్నుపేక్షచేసి మరొకతెయందు మరులుగొన్న నాయకునితో అనుచున్నమాట లివి. ఇచ్చట 'అప్రమత్త' యన్నది సంబోధనాంతము. వెనుకనున్న 'సచ్చరితా' దీర్ఘాంతశబ్దము. కావున సంధివశమున 'సచ్చరితాప్రమత్త' అని యగును. అట్లు కాక 'సచ్చరితా' అని వేరుపడి 'ప్రమత్త' అని మాత్రమే సంబోధ్యవాచకముకూడ కావచ్చును. ఇట్లే 'సచ్చరితా' యని

యనుటలో కాకువునుబట్టి సౌశీల్యవతి యన్న యర్థమే కాక సౌశీల్యవతి కా దన్న యర్థముకూడ కలుగవచ్చును. నాయకుడు ప్రమత్తుడు. కావుననే ఆవిషయమును తెలిసికొనలేకపోవుచున్నా డన్నది తాత్పర్యము. ఇంక ఆమెకు మణిహార మున్న ప్పుడు మాత్రమే కాంతి కలుగును; లేనియెడల కాంతిహీనయే యని భావము. తా నయినచో స్వయముగానే కాంతిమంతురాలు. కావున కాంతికొరకు అలంకరించు కొనవలసిన ఆవశ్యకము లేదని భావము. పురొకవిషయము. కాళిదాసు చెప్పి నట్లు 'ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా'. స్త్రీ సౌందర్యము ప్రియుని మెప్పించుట కొరకే యుద్దిష్టము. తన నాయకుడు మరొకతెకు ప్రియుడయినాడు. అందువల్ల ఆమె యందములకే కాని తన యందములకు గుర్తింపులేదు కావుననే కాంతిమత్త వల్ల తనకు ఫలము లేదని యనుట. ఇదంతయు భావసౌందర్యము.

ఇప్పుడింక ప్రకృతమును పరిశీలింతము. ఇది కూడ నాలుగుపాదములందును వ్యపేతయమకమున కుదాహరణమే. ఇచ్చటి యమకము పాదాంతస్థితమై యున్నది. 'తయా' అన్న అక్షర గుచ్ఛము ప్రతిపాదముయొక్క అంతమునందును గలదు. నాలుగు పర్యాయములు ప్రయుక్తము లగుటచేత యమకము. అంతమునందుండుట చేత అంతయమకము. గుచ్ఛగుచ్ఛమునకు నడుమ వ్యవధానముండుటవల్ల వ్యపేతము.

ఉదాహరణపద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

ఆది మధ్య యమకం యథా -

'ఘనగిరీంద్ర విలంఘన శాలినా
వనగతా వనజద్యుతిలోచనా
జనమతా దదృశే జనకాత్మజా
తరు మృగేణ తరుస్థలశాయినీ' 111

**అర్థము** : ఆదిమధ్యయమకమున కుదాహరణము. పద్మముల కాంతివంటి కాంతిగల లోచనములు గలదియు, వనమునందున్నదియు, జనముల గౌరవమున కాశ్రయమైనదియు, వృక్షచ్ఛాయయందు పరుండియున్నదియునైన జానకిని మహా పర్వతలంఘన స్వభావముగల శాఖామృగమైన హనుమంతుడు దర్శించెను.

వ్యాఖ్య : నాలుగు పాదములందును వ్యపేతమయిన ఆదిమధ్యయమకమున కుదాహరణ మిది. ఆదియమకమునందును పాదమున కొకమారుచొప్పున అక్షర గుచ్ఛము నాలుగు పర్యాయములు ప్రయుక్తమయ్యెను. అట్లే మధ్యయమకము నందును, అంతయమకమునందును ఏకరూపమైన అక్షరగుచ్ఛము నాలుగేసి మారులే ప్రయుక్తమయ్యెను. ఆదిమధ్యయమకమునందు ఏ పాదమున కా పాదమునందే యమకము వేరుగా నున్నది. మొదటిపాదము మొదట 'ఘన' యున్నది. 'అంఘన' లోని 'ఘన'తో యమకము నిర్వహింపబడినది. రెండవపాదము మొదటనున్న 'వన'తో నడుమనున్న 'వనజ' యందలి 'వన' యమకమునకు హేతువైనది. ఇట్లే మూడవపాదమున 'జన' నాలుగవపాదమున 'తరు' యమకధర్మమును సాధించు చున్నవి. ఇట్లు వ్యపేత యమకమునందు ఏపాదమున కాపాదమే యమకము నొందును. ఆదియందలి అక్షరగుచ్ఛమే మధ్యస్థితమై యుండుటచేత ఆదిమధ్య యమకమయినది.

ఉదాహృతపద్యము భట్టి రచించిన రావణవధ కావ్యమునందలిది.

ఆద్యంత యమకం యథా -

'విహగాః కదంబ సురభావిహ గాః
కలయం త్యనుక్షణ మనేకలయమ్
భ్రమయన్నుపైతి ముహు రభ్రమయం
పవనశ్చ ధూతనవనీపవనః' 112

అర్థము : ఆద్యంతయమకమున కుదాహరణము. విహగములు కడిమి పూల సువాసనలు నిండిన యీ పర్వతమునందు ప్రతిక్షణము బహులయాత్మకము లయిన కూజితములను చేయుచున్నవి. కడిమితోటలను కదలించిన పవనము మేఘ మును భ్రమింపజేయుచున్నది.

వ్యాఖ్య : వ్యపేతమయిన ఆద్యంతయమకమున కుదాహరణ మిది. ప్రతి పాదమునందు మొదటనున్న మూడక్షరముల గుచ్ఛమే తుదిని ఆవృత్తమగుచున్నది. మొదటిపాదమున 'విహగాః' రెండవపాదమున 'కలయం' మూడవపాదమున 'భ్రమయం' నాలుగవపాదమున 'పవనః' అన్న అక్షరగుచ్ఛములు ఆయాపాద ముల తుదిని ఆవృత్తములయినవి. కావుననే ఆద్యంతయమక మన్న పేరు అన్వర్థ

మగుచున్నది. తొలిగుచ్ఛమునకు ఆవృత్తగుచ్ఛమునకు నడుమ వ్యవధానముండుట చేత 'వ్యపేతము'గా గణింపబడుచున్నది.

మొదటిపాదమున మొదటిపదము 'విహగాః'. తుదియందలిది 'సురభౌ + ఇహ + గాః' అను పదముల కూడికచే ఏర్పడినరూపము. ఇది ఏకపదము కాదు. రెండవపాదమున 'కలయంతి' అన్నది క్రియాపదము. తుది నున్నది 'అనేక + లయమ్' అను రూపముల సన్నికర్షవల్ల నేర్పడినది. మూడవపాదమున 'భ్రమయన్' అన్నది వర్తమానార్థకానసమాపకక్రియ 'అభ్ర+మయం' అన్న రూపముల సన్నికర్షవల్ల తుది దేర్పడినది. అట్లే నాలుగవపాదమున 'పవనః' అని మొదటనుండగా 'నీప+వనః' అని సన్నికర్షవల్ల నేర్పడిన రూపము తుది నున్నది. కాబట్టి అక్షర గుచ్ఛములకు రూపమునందు మాత్రమే సాదృశ్యమున్నది కాని అర్థమునందు సాదృశ్యముకాని సామ్యముకాని లేదనుట స్పష్టము. ఇట్లు అభిన్నరూపములై భిన్నార్థములయిన అక్షరసముదాయము లావృత్తి చెందినప్పుడు మాత్రమే యమకాలంకార మేర్పడును. ఇంతవరకు చెప్పికొన్న లక్ష్యము లన్నింట నిదే లక్షణమున్నదని స్మరించుకొనుట యవసరము.

ఉదాహృతపద్యము మాఘుని శిశుపాలవధము నందలిది.

మధ్యాంత యమకం యథా -

'మిత మవద దుదారం తాం హనూమాన్ముదారం
రఘు వృషభ సకాశం దేవి యామి ప్రకాశమ్
తవ విదితవిషాదో దృష్టకృత్స్నామిషాదః
శ్రియ మనిశ మవంతం పర్వతం మాల్యవంతమ్' 113

అర్థము : మధ్యాంతయమకమున కుదాహరణము. హనుమంతుడు సంతోషముతో వేగముతో మితము సర్థవంతమునైన యీ వాక్యములను ఆమెకు (సీతకు) చెప్పెను. ఓదేవీ! నీవిషాదమును తెలిసికొంటిని; రాక్షసుల నందరను చూచితిని. ఎల్లప్పుడును మాంగల్యమును కలిగించు మాల్యవంతముమీదుగా ప్రకాశముగా రఘువృషభుడయిన రాముని చెంతకు వెళ్ళుదును.

**వ్యాఖ్య :** వ్యపేతమయిన మధ్యాంతయమకమున కిది యుదాహరణము. మొదటిపాదమున ఏడెనిమిదక్షరములు కలియగా 'దారం' అని యగును. పాదాం

తమున 'దారం' అని కలదు. రెండవపాదమున నిట్లే 'కాశం' పునరుక్తమయినది. మూడవపాదమున 'షాదః' నాలుగవపాదమున 'వంతం' పునరుక్తము లయినవి. తొలిపదమునకు పునరుక్తపదమునకు నడుమ వ్యవధాన ముండుటచేత వ్యపేత విభాగమునకు చెందుచున్నది. ప్రతిపాదమున మొదటి గుచ్ఛము మధ్యనుండి పునరుక్త గుచ్ఛ మంతమున నుండుటచేత మధ్యాంతయమక మగుచున్నది.

ఉదాహృతపద్యము భట్టికృతమైన రావణవధమునుండి గ్రహింపబడినది.

ఆది మధ్యాంత యమకం యథా -

'సమం స సైన్యేన సమంతతః సమం
పురందరశ్రీః పుర ముచ్చగోపురమ్
మదాలసాం తాం ప్రమదాం సుసమ్మదాం
యయౌ నిధాయాక్షయ యౌవనాం యయౌ' 114

అర్థము : ఆదిమధ్యాంతయమకమున కుదాహరణము. అక్షయయౌవనయు, హర్షనిర్భరయు, మదాలస యనుపేరు గలదియునైన ఆ ప్రమదను యజ్ఞాశ్వముకడ నుంచి ఇంద్రవిభవుడయిన ఆతడు సర్వసైన్యముతోపాటుగా లక్ష్మిసంపన్నము, సమున్నతగోపురమునయిన నగరమునకు వెళ్లెను.

వ్యాఖ్య : వ్యపేతమయిన ఆది మధ్యాంతయమకమున కిది యుదాహరణము మొదటిపాదమున 'సమం' రెండవపాదమున 'పురం' మూడవపాదమున 'మదా' నాలుగవపాదమున 'యయౌ' మూడేసిమారులు ప్రయుక్తము లయినవి. ఒకేపదము (అక్షరగుచ్ఛము) ఆదియందు, మధ్యమున, అంతమందు వ్యవహితమై పునరుక్తమగుటచేత ఆదిమధ్యాంత వ్యపేత యమకమున కిది యుదాహరణమైనది. ఇంతటితో వ్యపేతవిభాగమునందు నాలుగుపాదములందుండెడి యమకము పూర్తియైనది.

త్రిపాదస్థయమకేషు వ్యపేత మాదియమకం యథా -

'కరేణ తే రణేష్వంత కరేణ ద్విపతాం హతాః
కరేణవః క్షరద్రక్తా భాన్తి సంధ్యాఘనా ఇవ' 115

అస్యాపి నాతిప్రచురః ప్రయోగ ఇతి విశేషభేదా నోదాహ్రియన్తే.

అర్థము : త్రిపాదయమకములందు వ్యపేతమయిన ఆదియమకమున కుదాహరణము. నాశనకరమైన నీచేతితో శత్రువుల యేనుగులు కొట్టబడినవి. కారుచున్న రక్తముతో అవి సంధ్యాకాలపు మేఘములవలె తోచుచున్నవి.

దీనికికూడ కవుల రచనలందు ప్రచురప్రయోగములేదు కావున విశేషభేదముల నుదాహరించుట లేదు.

వ్యాఖ్య: వ్యపేతయమక విభాగమునందు నాలుగు పాదములందును యమకముండెడి లక్ష్యములను చూచితిమి. అట్లే మూడుపాదములందు మాత్రమే యమకముండునట్లుగా వ్రాయవచ్చును. కాని, అది అంత అందముగా నుండదు. అందువల్లనే కవులు వ్యపేతత్రిపాదయమకము నధికముగా ఆదరింపలేదు. కావుననే భోజదేవుడు ఇట్టిభేదముకూడ నుండుననుటకే యన్నట్లు ఒకేయొక యుదాహరణముతో త్రిపాదయమకమును ముగించుచున్నాడు.

ప్రకృత పద్యమునందు మొదటి మూడుపాదములందును 'కరేణ' అను పదము ప్రయుక్తమైనది. ఆదియందు ప్రయుక్తమగుటచే ఆదియమకము; అన్యపదవ్యవహితమగుటచే వ్యపేతము. ఉదాహరణము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

ఇట్లే మధ్యయమకము, అంతయమకము అనువానినికూడ ప్రదర్శింపవచ్చును. రుచిరమును, ప్రచురమును కాకుండుటచేత భోజదేవుడు అన్యభేదప్రదర్శనోత్సాహము నరికట్టుకొనెను.

ద్విపాదయమకేషు వ్యపేత మాదియమకం యథా -
'ముదా రమణ మన్వీత ముదారమణిభూషణాః
మదభ్రమద్దృశః కర్తుం మదభ్రజఘనాః క్షమాః' 116

మధ్యయమకం పునరనుల్లేఖతి పరిహ్రియతే.

అర్థము : ద్విపాద యమకములందు వ్యపేతమయిన ఆదియమకమున కుదాహరణము. ఉత్కృష్టములయిన మణిభూషణములు గలవారును, మదముచేత భ్రమించుచున్న చూపులు గలవారును, విపులములైన జఘనములు గలవారునైన స్త్రీలు వల్లభులకు సంతోషమును కలిగించుటలో సమర్థలు.

మధ్యయమకము వ్రాయబడదని పరిహరింపబడుచున్నది.

వ్యాఖ్య : వ్యపేతయమక విభాగమునందు ద్విపాదయమకమున కిది యుదాహరణము. మొదటిపాదము మొదట 'ముదారమ' అన్న అక్షర గుచ్ఛ ముండి, రెండవపాదము మొదట పునరుక్తమయినది. ఇంతవరకు నిదియొక ద్విపాద యమకము. మూడవపాదము మొదట 'మదభ్రమి' యని యుండి నాల్గవపాదము మొదట పునరుక్తమైనది. ఇది మరొక ద్విపాదయమకము. ఉదాహరణము దండికావ్యాదర్శమునందలిది.

ఇట్లే బేసిపాదములందు మాత్రమే కాని, సరిపాదములందు మాత్రమే కాని బేసిపాదములం దొక యమకమును, సరిపాదములందు మరొక యమకమ్మును గాని ప్రయోగింపవచ్చును. యమకము శబ్దాలంకారము కదా! సౌందర్యముండి సహృదయులను ఆకర్షించినప్పుడే అలంకారమన్వర్థమగును. కానియెడల అన్వర్థము కాదు. అందువల్లనే భోజదేవుడు తదితరభేదములను పరిహరించెను. అట్లే 'మధ్యయమకము' అనునది కనుపట్టదు; కావున ఉదాహరించుట యన్న ప్రసంగమునకే అవకాశము లేదు.

అంతయమకం యథా –

'ఇహ ముహుర్ముదితైః కలభై రవః
ప్రతిదిశం క్రియతే కలభైరవః
స్ఫురతి చానువనం చమరీచయః
కనకరత్నభువాం చ మరీచయః' 117

అర్థము : అంతయమకమున కుదాహరణము. ఇచ్చట సంతోషము నొందిన పిల్లయేనుగులచేత ప్రతిదిశయందును అవ్యక్తమనోహరమును భీకరమునైన గర్జ

రవము చేయబడుచున్నది. ప్రతివనమునందును కనకరత్న భూములయొక్క కాంతులును, చమరీమృగముల సమూహమును స్ఫురించుచున్నవి.

వ్యాఖ్య : వ్యపేతయమకవిభాగమునందు ద్విపాదయమకమున కిది యుదాహరణము. మొదటి రెండుపాదములందును తుదియందు 'కలభైరవః' అన్న ఐదక్షరముల గుచ్ఛము లున్నవి. మొదటిపాదమునందు 'కలభైః + రవః' అని విభాగము; రెండవపాదమునందు 'కల + భైరవః' అని విభాగము. తుది రెండుపాదములందును తుదియందు 'చమరీచయః' అన్న ఐదక్షరముల గుచ్ఛములున్నవి. మూడవపాదమునందు 'చమరీ + చయః' అని నాలుగవపాదమునందు 'చ+మరీచయః' అని విభాగము. పూర్వార్ధమునందు ఒక ద్విపాదయమకము, ఉత్తరార్ధమునందు మరొక ద్విపాదయమకము కలవు.

ఏకపాదయమక మిహాశుద్ధం న భవతి, తస్య స్థానే ద్విపాదయమక మేవోదాహ్రియతే. తదాది యమకం యథా -

'మధురేణ దృశాం మానం మధురేణ సుగంధినా
సహకారోద్గమేనైవ శబ్దశేషం కరిష్యతి' 118

ఇహాపి మధ్యయమక మనుల్లేఖితి పరిహ్రియతే.

అర్థము : ఇచ్చట శుద్ధమైన ఏకపాదయమకము సంభవము కాదు. దాని స్థానమున ద్విపాదయమకమే ఉదాహరింపబడుచున్నది. ఆదియమకమున కుదాహరణము. వసంతుడు హరిణలోచనల మానమును మధురమును సురభిళమునైన సహకారపల్లవముచేతనే శబ్దశేషము చేయును.

ఇచ్చటకూడ మధ్యయమకము ఉల్లిఖితము కాదని పరిహరింపబడుచున్నది.

వ్యాఖ్య : వ్యపేతయమక విభాగమునందు క్రమమునుబట్టి యిప్పుడు ఏకపాదయమకమును ప్రదర్శింపవలయును. అవ్యపేతయమకమునందయినచో మొదటి గుచ్ఛమును వెన్నంటియే పునరుక్తగుచ్ఛము ప్రయుక్తమగును. వ్యపేత యమకమునందు అట్లుకాదు. మొదటిపదమునందలి అక్షరగుచ్ఛము రెండవపాదమునందు పునరుక్త మగుచున్నది. అట్లు పునరుక్తమయినప్పుడుమాత్రమే యమకము సిద్ధిం

చును. ఈ వివేచననుబట్టి యమకసిద్ధికి రెండుపాదములైన నుండుట యవసరమని తెలినది. కాబట్టి వ్యపేత విభాగమునందు ఏకపాదయమకమున కవకాశము లేదు. అయినప్పటికిని భోజదేవుడు ద్విపాదయమకమునే ఏకపాదయమకమునకు బదులుగా ఉదాహరించుచున్నాడు.

ఒక విధముగా దాని సామంజస్యమును సమర్థింపవచ్చును. లక్షణమునందు స్పష్టముగా చెప్పకపోయినప్పటికిని లక్ష్యసామర్థ్యమునుబట్టి యొక నిర్ణయము చేయవచ్చును. ద్విపాదయమకమునందు పూర్వార్ధమునం దొక యమకమును, ఉత్తరార్ధమునం దొక యమకమును వాడుట కలదు. అట్లు రెండేసిపాదముల కొకయమకము చొప్పున రెండుయమకములను వాడిన అది శుద్ధమైన వ్యపేతద్విపాదయమకము. అట్లు కాక రెండుపాదములకు మాత్రమే యమకమును వాడినయెడల దానిని ఏకపాదయమకస్థానీయముగానే గ్రహింపవచ్చును. ఒక్కపదము (అక్షరగుచ్ఛము) మాత్రమే పునరుక్తమగుట దీనికి హేతువు.

మొదటిపాదము మొదట 'మధుః + ఏణదృశాం' అని విభాగము; రెండవ పాదము మొదట 'మధురేణ' అని తృతీయావిభక్త్యంతమైన పదము. ఇట్లు 'మధురేణ' అన్న అక్షరగుచ్ఛము రెండుపర్యాయములు భిన్నార్థములలో ప్రయుక్తమగుట చేత యమకము సిద్ధించుచున్నది.

వ్యపేతయమకమునందు మధ్యయమకము ప్రయుక్తము కాదు; కావుననే భోజదేవుడు ఉదాహరణప్రదర్శనము చేయలేదు.

అంత యమకం యథా -

'యస్యాహు రతిగంభీర గల ద్రప్రతిమం గలమ్
స వః కరోతు నిస్సంగ ముదయం ప్రతి మంగలమ్' 119

అర్థము : అంతయమకమున కుదాహరణము. ఎవనికి అతిగంభీరముగా ధ్వనించు సాటిలేని కంఠము గలదో అతడు మీకు శుభవిషయమున అవరోధములేని అభ్యుదయమును కలిగించును గాక!

వ్యాఖ్య : వ్యపేతవిభాగమునందు ద్విపాదాంతయమకమున కుదాహరణమిది. రెండవపాదము చిట్టచివర 'అప్రతిమం + గలమ్' అను పదములు కలవు.

నాలుగవపాదము చిట్టచివర 'ప్రతి + మంగలమ్' అను పదములు గలవు. ఇచ్చట 'ప్రతిమంగలమ్' అన్న అక్షరగుచ్ఛము పునరుక్తమైనది. ఇచ్చట సరిపాదముల తుదినిమాత్రమే యమకము పాటింపబడినది.

ఏవమావృత్త్యాధిక్యేఽపి యథా -

'అవసితం హసితం ప్రసితం ముదా
విలసితం హ్రసితం స్మరభాసితమ్
న సమదాః ప్రమదా హతసమ్మదాః
పురహితం విహితం న సమీహితమ్' 120

అర్థము : ఇట్లే ఆవృత్త్యాధిక్యమునందలి యమకమున కుదాహరణము. సంతోషసంసక్తమయిన హాసము ముగిసిపోయినది; మన్మథభావముచేత భాసించిన విలాసము తుదముట్టినది; హర్షము నశించిపోగా యువతులు మదమును విడనాడిరి; సమీహితమై పురమునకు హితమును గలిగించు నిత్యకర్మము నిర్వర్తింపబడలేదు

వ్యాఖ్య : వ్యపేత విభాగమునందే రెండు పర్యాయములకంటె ఎక్కువ యావృత్తులు గల యమకమున కిది యుదాహరణము. ప్రథమ ద్వితీయపాదము లందు 'సితం' అన్న అక్షరగుచ్ఛము ఆరుపర్యాయము లావృత్తమయినది. తృతీయ పాదమునందు 'మదా' మూడుపర్యాయములును, చతుర్థపాదమునందు 'హితం' మూడు పర్యాయములును ఆవృత్తము లయినవి. వీనికి స్థాననియమ మేమియు లేదు. అక్షరగుచ్ఛములకు నడుమ వ్యవధానము కలదు. కావుననే వ్యపేతయమకమునందు ఆవృత్త్యాధిక్యమున కిది లక్ష్యమయినది.

ఈ పద్యము భట్టి రచించిన రావణవధమునుండి గ్రహింపబడినది.

ఆవృత్త్యైకరూపతాయా మపి, తత్రాదిమధ్యయమకం యథా-

'సారయంత మురసా రమయంతీ
సారభూత మురుసారధరా తమ్
సారసానుకృత సారసకాంచీ
సా రసాయన మసార మవైతి' 121

అర్థము : ఏకరూపమయిన ఆవృత్తియందును వ్యపేతయమకము అనేకావృత్తుల నొందును. అందు ఆది మధ్యయమకమున కుదాహరణము. ఆత్మకు సమీపముగా ఆకర్షించువానిని (సారయంతం) తనకు జీవన సర్వస్వమైనవానిని (సారభూతం) సువర్ణభూషణములు ధరించి (ఉరుసారధరా), బెగ్గురుపక్షుల కూజితముల ననుకరించు ధ్వనిగల మొలనూలు కలిగిన యామె (నాయిక) వక్షఃస్థలముతో క్రీడించి ఆనందపెట్టుచు రసాయనమును సారహీనముగా పరిగణించుచున్నది.

వ్యాఖ్య : అనేకావృత్తు లుండునప్పుడు భిన్నములయిన అక్షరగుచ్ఛములు క్రిందటి లక్ష్యమునందు చూపబడినవి. అట్లే ఆ లక్ష్యమునందు స్థాననియమము కూడ పరిగణింపబడలేదు. ఒకే అక్షరగుచ్ఛము పద్యమునందంతట ననేకపర్యాయము లావృత్తి నొందవచ్చును. అంతేకాక అది స్థాననియమమును పైతము పాటింపవచ్చును.

'సార' యను రెండక్షరములగుచ్ఛము పద్యము మొత్తముమీద ఎనిమిది పర్యాయములు ప్రయుక్తమయినది. రెండుసారులు ప్రయుక్తమైనంతట్రో యమకము సిద్ధించును. అధికావృత్తి యన్నది అదనపు లక్షణము. పైగా దానికి స్థాననియమముకూడ నుండుట మరొక విశేషము. ప్రతిపాదమువందు మొట్టమొదటను మధ్యను 'సార' ప్రయుక్తమయినది. కావుననే యిది ఆదిమధ్యయమకముగా గణింపబడుచున్నది.

ఉదాహరణపద్యము దండి కావ్యాదర్శము నందలిది.

మధ్యాంత యమకం యథా -

'లీలాస్మితేన శుచినా మృదునోదితేన
వ్యాలోకితేన లఘునా గురుణా గతేన
వ్యాజృంభితేన జఘనేన చ దర్శితేన
సా హంతి తేన గలితం మమ జీవితేన' 122

అర్థము : మధ్యాంతయమకమున కుదాహరణము. పరిశుభ్రమైన లీలాస్మితముచేతను, మృదువైన భాషణముచేతను, ఇష్టమైన దృష్టిచేతను, భారమయిన గమనముచేతను, విరుచుకొన్న శరీరముచేతను, కొంచెముగా ప్రదర్శింపబడిన జఘనముచేతను, ఆమె నన్ను చంపుచున్నది. అందువల్ల నేను నా జీవితమును కోల్పోయితిని.

వ్యాఖ్య : 'తేన' అన్న అక్షరగుచ్ఛము ప్రతిపాదమునందును మధ్యభాగమున, అంతభాగమున నుపయుక్తమయినది. ఇట్లగుటచేత మొత్తము పద్యమునందు ఎనిమిదిపర్యాయము లావృత్తి నొందినది. గుచ్ఛగుచ్ఛమునకు నడుమ నితర పదముల వ్యవధానము కలదు. కావుననే యిది వ్యపేతవిభాగమున ఏకరూపమయిన మధ్యాంతయమకమునకు లక్ష్యమయినది.

ఈ పద్యము దండి కావ్యాదర్శము నుండి గ్రహింపబడినది.

ఆద్యంతయమక మాదిమధ్యాంతయమకం చేహాస్థానయమకత్వ ప్రసంగాన్న సంగచ్ఛేతే. ఆదిమధ్యాంతయమకాని తు ప్రథమ మేవో దాహృతాని.

అర్థము : ఇక్కడ అస్థానయమకత్వప్రసంగమువల్ల ఆద్యంతయమకమును, ఆదిమధ్యాంతయమకమును సంగతములు కావు. ఆది మధ్యాంతయమకములు ముందుగానే ఉదాహరింపబడినవి.

వ్యాఖ్య : ఆది మధ్యయమక మని, మధ్యాంతయమక మని భోజదేవుడు తానే చెప్పుచు, వానికి లక్ష్యములు చూపుచు దీనిని 'అస్థానయమకత్వప్రసంగము' అని యనుట సంగతము కాదు. పూర్వలక్షితములే కాక అనంతరవక్ష్యమాణలక్ష్యము కూడ 'మధ్యయమకము'గా స్థాననియమముతోడనే ప్రదర్శింపబడనున్నది. కావున, 'అస్థాన యమకత్వప్రసంగాత్' అనునది తప్పుపాఠమై యుండవలయును. అట్లు సమ్మతింపనియెడల భోజదేవునికి స్వవచోవ్యాఘాతమును సమ్మతింపవలసియుండును. అది భావ్యముకాదు. 'వ్యపేతయమకత్వప్రసంగాత్' అని యుండుట సమంజసము. ఇట్లయినప్పుడు 'వ్యపేతయమకత్వప్రసంగమువల్ల ఇచ్చట ఆద్యంతయమకమును ఆదిమధ్యాంతయమకమును సంగతములు కావు' అన్న యర్థము కలుగును. మొదటి అక్షరగుచ్ఛమునకును పునరుక్తమైన అక్షరగుచ్ఛమునకును నడుమ వ్యవధాన మున్నప్పుడే 'వ్యపేత యమకము' అన్న వ్యవహారము కలుగును. ఆద్యంతయమకము నంగీకరించినయెడల ప్రథమపాదము తుదినున్న పదమే అవ్యవహితముగా ద్వితీయ పాదము మొదటికి రావలయును. ఇట్లే తక్కిన పాదములందు నగును. అట్లయినప్పుడు వ్యపేతత్వము తొలగిపోవును. కావుననే వ్యపేతయమకమునందు ఆద్యంత యమకముకాని, ఆదిమధ్యాంతయమకముకాని యుండుటకు వీలులేదు. మరొక

విషయము. 'ఆది మధ్యాంతయమకములు ముందుగానే ఉదాహరింపబడినవి' అను చోటి ముందరి సమాసము కొంత యిబ్బందిని కలుగజేయుచున్నది. తానేవి కూడని వనుచున్నాడో వానినే చెప్పుచున్నా డనిపించును. ఉద్దిష్ట మది కాదు. ఆది యమకములును, మధ్యయమకములును, అంతయమకములును ముందుగానే ఉదాహరింపబడినవని చెప్పుటయే యుద్దిష్టము. బహువచన సారస్యముచేతనే దీని నిట్లు గ్రహింపవలసి యున్నది. అట్లు కానియెడల పైనిచెప్పినట్లే 'ఆదిమధ్యాంతయమకం తు ప్రథమ మేవోదాహృతమ్' అన్న విధముగా ఏకవచనమునే నిబంధించెడివాడు.

ఆవృత్త్యేకరూపతాయా మావృత్త్యాధిక్యే చ మధ్యయమకం యథా -

'సభాసు రాజన్నసురాహతై ర్ముఖై
ర్మహీసురాణాం వసురాజితై స్స్తుతాః
న భాసురా యాన్తి సురాన్న తే గుణాః
ప్రజాసు రాగాత్మసు రాశితాం గతాః' 128

సదేశ స్సర్వ మపి వ్యవహితావృత్తే ర్వ్యపేతయమకం భవతి.

**అర్థము** : ఆవృత్త్యేకరూపతయందలి ఆవృత్త్యాధిక్యమునందు మధ్యయమకమున కుదాహరణము. ఓరాజా! సభలయందు నీగుణములు బ్రాహ్మణులయొక్క మద్యపానపరాభూతములుకాని కాంతిదీపితములయిన ముఖములచేత స్తుతింపబడినవి, భాసురములైన ఆ నీ గుణములు దేవతలను చేరకుండునా? రాగాత్ములైన ప్రజలయందు రాశీభూతము లయినవి.

**ఇదంతయు వ్యవహితావృత్తివలన వ్యపేతయమక మగును.**

వ్యాఖ్య : 'సురా' యన్న రెండక్షరముల గుచ్ఛము ప్రతిపాదమున మధ్యభాగమునందు వ్యవహితమై రెండేసి మారులు ప్రయుక్త మయినది. మొత్తముమీద ఎనిమిదిమారు లావృత్తి నొందినది. ఏకవిధమైన రూపముతో, పెక్కుపర్యాయములు పాదమధ్యమున ప్రయుక్తమగుటవల్ల ఇది వ్యపేతవిభాగమునందలి ఏకరూపావృత్తికిచెంది ఆవృత్త్యాధిక్యమును కలిగి మధ్యయమకమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణము దండి కావ్యాదర్శము నందలిది.

[అస్థాన యమకము]

63\. నాదౌ న మధ్యే నాంతే యత్సంధౌ వా యత్ర్పకాశతే
అవ్యపేత వ్యపేతం తదస్థాన యమకం విదుః.

అర్థము : ఆదియని గాని, మధ్యయని గాని, అంతమని గాని, సంధియని గాని నిర్దిష్టమైన స్థానములేక భాసించునది అస్థానయమకము. ఇది అవ్యపేతమై వ్యపేతమై రెండు విధముల నుండును.

64\. పాదే శ్లోకే చ తత్రాప్యయః పాదసంధౌ చ బధ్యతే
స్వభేదే చాన్యభేదే చ స్థూలం సూక్ష్మం చ సూరిభిః.

అర్థము : అస్థానయమకము తరుచుగా పాదమునందును, శ్లోకమునందును, పాదసంధియందును బంధింపబడియుండును. అది స్వభేదము, అన్యభేదము, స్థూలము, సూక్ష్మము – అన్న భేదములను కలిగియుండును.

అత్ర పాదే స్థూలావ్యపేతం యథా –

'పినాం బృందం చైతత్కూటే
సమరుతి సుతరుణి సమరుతి సుతరుణి
చిత్తం వా తేన క్రోడేఽస్మిన్
సురమణి గుణరుచి సురమణి గుణరుచి.' 124

అత్ర స్థూలేనైవావృత్తిద్వయేన శ్లోకపాదయో ర్వ్యవస్థిత్వా దాదిమధ్యాంతతా న సంభవతీత్యస్థానయమక మిదం స్థూలావ్యపేత ముచ్యతే.

అర్థము : ఇచ్చట పాదమునందు స్థూలావ్యపేతమున కుదాహరణము. ఓ చక్కని తరుణీ! మరుత్సమేతమయి చక్కనిచెట్లు గల యీ గిరిశృంగమునందు పక్షుల సమూహము సమరుతిని కలిగియున్నది. అందువల్ల, చక్కనిరమణీ! ఈ మధ్యభాగమునందుండి గుణములయం దాసక్తి గల నా చిత్తము ఇంద్రనీలమణులతో కూర్చిన హారమును ధరించినట్లు శోభించుచున్నది.

ఇచ్చట స్థూలమయిన ఆవృత్తిద్వయముచేత శ్లోకముయొక్క రెండుపాదము లందును పూర్తిగా వ్యాపించియుండుటవల్ల, ఆది యని మధ్య యని అంత మని విభాగించుటకు వీలుకాదు. కనుక, ఇది అస్థాన యమకముగా స్థూలావ్యపేతముగా పరిగణింపబడుచున్నది.

వ్యాఖ్య: అస్థాన యమకమునందు పాదస్థూలావ్యపేతమున కిది యుదాహరణము. అస్థాన మని యనగా స్థాననిర్ణయముచేయుటకు వీలుకాని దని యర్థము. పాదమంతయు వ్యాపించియున్న దానికి ఆదిమధ్యాంతవిభాగము సాధ్యముకాదు. స్థూల మని యనగా అధికవర్ణముల ఆవృత్తి యని యర్థము. రెండక్షరములకంటె నెక్కువ యక్షరములుగల గుచ్ఛము ఆవృత్తి నొందిన స్థూల యమకము. మొదటి గుచ్ఛము నకును ఆవృత్తినొందిన గుచ్ఛమునకు వ్యవధానము లేకపోవుటయే అవ్యపేతత్వము.

ప్రకృత పద్యమునందు రెండవపాదమున నొక యమకమును, నాలుగవ పాదమున నొక యమకము నున్నవి. 'సమరుతి సుతరుణి' అన్న ఎనిమిదక్షరముల గుచ్ఛమే అవ్యవహితముగా ఆవృత్తమయినది. అవ్యవహితముగా ఆవృత్త మగుటచేత అవ్యపేతము. ఎనిమిదక్షరముల ప్రమాణమును కలిగియుండుటచేత స్థూలము. పాదమంతయు వ్యాపించి ఆదిమధ్యాంతవిభాగమునకు వీలుకాకుండుట చేత అస్థానము. 'సమరుతి' అన్నప్పుడు 'మరుత్తుతో కూడిన' అని యర్థము. ఇది 'కూటే' అనుదానికి విశేషణమగుటచేత సప్తమీవిభక్తి నొందియున్నది. ఆవృత్త మయిన 'సమరుతి' 'బృందం' అన్న పదమునకు విశేషణము. 'సమానమయిన కూజితములను గలది' అని యర్థము. ఇది నపుంసకరూపము, ప్రథమావిభక్తి నొందియున్నది. కావున నివి యొకేరూపమును కలిగియున్నప్పటికిని అర్థమునుబట్టి భిన్నములని స్పష్టము. దీనివెంటనే 'సుతరుణి' అని నాలుగక్షరములు గలవు. 'సుందరమైన తరుణి' అని యర్థము. ఇది సంబోధనాంతమై యున్నది. ఆవృత్త మైన 'సుతరుణి' శబ్దము 'కూటే' అనుదానికి విశేషణము. కావుననే విశేష్యము నకు వలెనే సప్తమీవిభక్తి నొంది యున్నది. 'సుతరుణికూటే' అని యనగా 'చక్కని వృక్షములు గల కూటమునందు' అని యర్థము. రూపము అభిన్నముగా నున్నప్పటికి, ఇవి భిన్నపదములన్నది స్పష్టము. ఇంతవరకు ఇది ద్వితీయపాదము విషయము.

నాలుగవపాదమున 'సురమణిగుణరుచి' అన్న యెనిమిదక్షరముల గుచ్ఛము ఆవృత్తమయినది. 'సు+రమణి' సుందరమైనరమణి. ఇది సంబోధనాంతము,

'గుణరుచి' గుణములయందు రుచికలది; ఇది చిత్తమునకు విశేషణము; సప్తంస కము; ప్రథమాంతము. ఆవృత్తమైన ఎనిమిదక్షరముల గుచ్ఛము ఏకసమాసము. సురలయొక్క మణులనగా ఇంద్రనీలములని యర్థము. తన్మాల సురమణిగుణము అనగా ఇంద్రనీలమణులహారము; దానియొక్క శోభవంటి శోభకలది సురమణి గుణరుచి. ఇది చిత్తమునకు విశేషణము. ఇచ్చట రూపము సమానమే కాని పదములు భిన్నములు. పాదమునంతటిని ఆవరించియుండుటచే అస్థానయమక మున కిది యుదాహరణ మయినది.

పాద ఏవ సూక్ష్మావ్యపేతం యథా -

'స్వస్థః శైలే పశ్యాస్తే౽సౌ
రురు రురు రతి రతి తను తను మతిమతి
లోకో యద్వద్దైత్యానీకం
గురు గురు మయి మయి తరితరి సతి సతి' 125

అత్ర పునః సూక్ష్మాణావృత్త్యష్టకేన శ్లోకపాదౌ వ్యాప్తౌ అస్థానయమక మిదం సూక్ష్మావ్యపేత ముచ్యతే.

అర్థము : పాదమునందే సూక్ష్మావ్యపేతమున కుదాహరణము. ఓ సతీ! మతిమతీ! అత్యల్పతనూ! పెద్దదియు, శుక్రునితోను మయునితోను కూడినదియు నయిన దైత్యసమూహమును జయించిన నాయందు లోకము స్వస్థమయినట్లుగా పర్వతమునందు ఆ మృగము స్వస్థమై యున్నది. చూడు.

ఇచ్చట సూక్ష్మమైన ఎనిమిదావృత్తులచేత శ్లోకమునందలి రెండుపాదములు వ్యాప్తములు. అందువల్ల ఈ అస్థానయమకము సూక్ష్మావ్యపేత మనబడును.

వ్యాఖ్య : సూక్ష్మ మనగా అల్పవర్ణముల యావృత్తి యని యర్థము. అనగా రెండక్షరములకు మించని విడివిగల గుచ్ఛము ఆవృత్తి నొందిన సూక్ష్మ యమకము. ప్రకృతోదాహరణమునందు రెండేసి యక్షరముల గుచ్ఛములు మొత్త మెనిమిది కలవు. ద్వితీయపాదమున నాలుగు గుచ్ఛములు అవ్యవహితముగా ఆవృత్తినొంది పాదము నంతటి నాక్రమించుకొన్నవి. అట్లే చతుర్థపాదమున

నాలుగు గుచ్ఛము లున్నవి. కావుననే అస్థాన యమక మని, అవ్యపేత మని, సూక్ష్మమని పేర్కొనబడుచున్నది.

ద్వితీయపాదమునందు 'రురుః+ఉరురతిః+అతితను+తను' అను పదములు సన్నిహితములై యున్నవి. 'రురుః' అని యనగా పెక్కుకొమ్ములు గల లేడి యని యర్థము. 'ఉరురతిః' మిక్కిలి యాసక్తి కలదని యర్థము. 'అతి తను తను' అని యనగా 'మిక్కిలి యల్పమైన శరీరము గలదానా!' అని సంబోధనాంతము. 'మతిమతి'అని యన్నప్పుడు 'బుద్ధి' అన్న అర్థముగల శబ్దముపై మతు ప్రత్యయము చేరి స్త్రీప్రత్యయము చేరినది. ఇది సంబోధనాంతమగుటచేత తుది దీర్ఘము హ్రస్వమైనది.

చతుర్థపాదమునందలి 'గురు' శబ్దము నపుంసకము; 'దైత్యానీకమ్' యొక్క విశేషణము. 'పెద్దదైన' అని యర్థము. అట్లే 'గురుమయి' కూడ దానికి విశేషణమే. గురువైన శుక్రుని, రాక్షసశిల్పియైన మయుని గలది యని యర్థము. 'మయి' అస్మచ్ఛబ్దముయొక్క సప్తమ్యేకవచనము. 'సతి' సత్ యొక్క సప్తమ్యేకవచనము. చివరిది 'సతీ' శబ్దము; సంబోధనమునందు దీర్ఘము హ్రస్వమయినది. 'తరితరి' ఏకపదము; సప్తమ్యేకవచనము. 'తరితృ' అనగా దాటినవాడు; 'జేతృ' (జయించినవాడు) అన్న భావమున నుపయుక్తమయినది. సతి సప్తమివల్ల పైరూప మేర్పడినది.

పై విశ్లేషణమునుబట్టి 'రురు - రురు' మున్నగు వర్ణగుచ్ఛములు సమరూపము కలవియే కాని అర్థమునందు భిన్నములన్నది స్పష్టము. ఉదాహృతపద్యమునకు సందర్భము ఇంద్రుడు శచీదేవితో చేసిన ప్రసంగము.

శ్లోకే స్థానాव्यపేతం యథా —

'నగజా నగజా దయితా దయితా
విగతం విగతం లలితం లలితమ్
ప్రమదా ప్రమదా మహతా మహతా
మరణం మరణం సమయాత్సమయాత్' 126

అత్రావృత్తిస్పష్టకేన శ్లోకోఽపి వ్యాప్త ఇత్యస్థానయమక మిదం శ్లోకే స్థానావ్యపేత ముచ్యతే.

అర్థము : శ్లోకమునందు స్థూలావ్యపేతమున కుదాహరణము. పర్వతము లందు పుట్టిన ఏనుగులు ప్రియములే అయినప్పటికిని రక్షితములు కావు. పక్షుల యొక్క పరిభ్రమణము తొలగిపోయినది. ఆమవ్యాధిచేత బాధితయైన స్త్రీ ప్రమోద శూన్య యయినది. గొప్పవారికి దుర్వ్యాధిచేత సంగ్రామేతరమైన మరణము సంభ వించినది.

ఇచ్చట ఎనిమిదావృత్తులచేత శ్లోకము పూర్తిగా వ్యాప్తమయినది. కావున శ్లోకమునందు స్థూలమును, అవ్యపేతమును అయిన అస్థానయమక మిది.

వ్యాఖ్య : ఉదాహరణమునందు మూడేసి యక్షరములుగల గుచ్ఛములు ఎనిమిది గలవు. కావున నిచ్చటి గుచ్ఛములు స్థూలములు. ప్రతిపాదమునందు రెండేసి గుచ్ఛములు పునరుక్తము లయినవి. ఇట్లు శ్లోకమంతయు నిండియుండుట చేత, ఇది శ్లోకమునందలి అస్థానయమకము. పునరుక్తి అవ్యవహితముగా జరు గుటచేత అవ్యపేతము.

ప్రథమపాదమునందు 'నగ + జాః, న + గజాః' అని విభాగము. ఆవృత్త గుచ్ఛమునందలి 'దయితాః' అన్న పదముతో అన్వయించి 'రక్షితములు కావు' అన్న యర్థము నొసగును. 'దయితా.' అన్న తొలిగుచ్ఛమునకు 'ఇష్టములయి నవి' అని యర్థము. 'గజాః' అనుదానికి తక్కిన పదములు విశేషణములు. రెండవపాదమునందు 'వి + గతం' అనియనగా 'పక్షులయొక్క చంక్రమణ' మని యర్థము. 'విగతం' అన్న ఆవృత్తికి 'తొలగిపోయినది' అని యర్థము. మొదటి పదమున కిది విధేయవిశేషణము. 'లలిత' మని యనగా సౌకుమార్య మని యర్థము. దీనికి 'జారిపోయినది' అన్న అర్థముగల 'లలితం' విధేయవిశేషణము. మూడవపాదమునందు 'ప్రమదా' అన్నది విశేష్యము. 'అప్రమదా' అన్నది విశేష ణము. సన్నిహితమగుటచేత 'అ'కారము సవర్ణ దీర్ఘసంధి చాటున నొదిగిపోయి నది. దీనికి 'సంతోషము లేనిది' అని యర్థము. దీనికి హేతువు 'ఆమహత'యగుట. చివర నున్నది 'మహతామ్' అన్నది షష్ఠీ విభక్త్యంతము. 'గొప్పవారికి' అని యర్థము. తరువాతి పాదముతో అన్వయము. 'అరణం మరణం' యుద్ధసంబం ధములేని మరణ మని యర్థము. 'సమయాత్' అనగా 'కాలమువల్ల' అని యర్థము. ఆవృత్తగుచ్ఛము క్రియాపదము. దీనికి 'వచ్చెను' అని యర్థము.

మొత్తము శ్లోకము యమకముచేత వ్యాప్తమయినది.

శ్లోక ఏవ సూక్ష్మావ్యపేతం యథా -

'వివి ధధ వవ నానా గగ ర్ధర్ధ నానా
వివి తత గగ నానా మమ జ్జజ్జ నానా
రురు శశ లల నానా వవం ధుంధు నానా
మమ హిహి తత నానా నన స్వస్వ నానా' 127

అత్ర సూక్ష్మతరాభి రష్టావింశత్యావృత్తిభిః శ్లోకో వ్యాప్త ఇత్యస్థానయమక మిదం శ్లోకే సూక్ష్మావ్యపేత ముచ్యతే.

అర్థము : శ్లోకమునందే సూక్ష్మావ్యపేతమున కుదాహరణము. వివిధము లైన అర్జునవృక్షములతోడి వనములను గలది; ఏనుగులను (సర్పములను) కాంక్షించుచు అభివృద్ధములయిన నానా పక్షులతో విస్తృతమైన గగనమును గలది; వంగకయే మునుగుచున్న జనములను గలది; (విష్ణువుయొక్క నామము ననుచు మునక లిడుచున్న జనములను గలది); లేళ్లయొక్క కుందేళ్లయొక్క క్రీడలను గలది; మనయొక్క శత్రువును సంతాపింపజేయునది; నాకు హితమును గలుగజేయునది; ముఖము లేకున్నను స్వకీయ నిస్వనముచేతనే ప్రాణములు నిల్పునది; స్త్రీరూపమున నున్నది (ఈ సముద్రతీరమునందలి ప్రదేశము).

ఇచ్చట సూక్ష్మతరములైన యిరువది యెనిమిది ఆవృత్తులచేత శ్లోకము నిండియున్నది. అందువలన శ్లోకమునందు సూక్ష్మమును అవ్యపేతమును అయిన అస్థానయమక మిది.

వ్యాఖ్య : శ్రీకృష్ణుడు బలరామునికి సముద్రతీరభూమిని వర్ణించుచున్న ప్రసంగమునందలిది ఉదాహరణపద్యము. ఒక్కొక్క యక్షరమే యెడములేకుండ ఆవృత్తినొందినది. అట్టి ఆవృత్తులు మొత్తము పద్యములో ఇరువది యెనిమిది గలవు. ఇచ్చట ఒక్క యక్షరమే ఒక గుచ్ఛమయినది. సూక్ష్మముకంటె సూక్ష్మమగుటచేత దీనిని సూక్ష్మతర మని భోజదేవుడు తన వివరణమందు చెప్పుచున్నాడు. అయినప్పటికిని దానికి వేరుగా మరొక విభాగమును కల్పింపక 'సూక్ష్మ' మన్న విభాగములోనే అంతర్భవింపజేయుచున్నాడు.

వివిధ+ధవ+వనా. ధవ వృక్షము లనగా మద్దిచెట్లని యర్థము. నాగ+గర్ధ+ఋద్ధ - అనునవి గుణసంధివల్ల 'నాగగర్ధర్ధ' అని యైనది. నానా+వి

(పక్షులచేత) + తత + గగనా. అనామ+మజ్జత్ +జనా – మొదటి శబ్దమునకు 'వంగకుండ' అని కాని 'అ = విష్ణువు' కాబట్టి 'విష్ణునామముతో' అని కాని అర్థము. అనా = స్త్రీ.

రురు+శశ+లలనా. నౌ (మనయొక్క)+అవంధుం (శత్రువును)+ధునానా (కంపింపజేయునది). హి (కాబట్టి); మమ (నాయొక్క)+హిత+తనా (హితమును కలుగజేయునది); అనానన (న+అనన = ముఖములేకున్నను) + స్వ (తన యొక్క)+స్వన (రవముచేత)+అనా (జీవింపజేయునది).

వివి, ధధ, వవ – మున్నగు విధముగా ఒక్కొక్క యక్షరమే వ్యవధానము లేకుండ పునరుక్తమైనది. పద్యమంతయు నిట్లే యున్నది. కావుననే, యిది శ్లోకమువందు సూక్ష్మమైన అవ్యపేతమైన అస్థానయమకమున కుదాహరణమయినది.

ఉదాహరణపద్యము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యందలిది.

పాదసంధావన్యభేదోచ్ఛేదేన స్థూలం యథా –

ఉపోఢ రాగాప్యబలా మదేన సా
మదేన సా మన్యురసేన యోజితా
నయోజితాత్మాన మనంగతాపితాం
గతాపి తాపాయ మమాస నేయతే 128

అత్రాంతాది సందంశా దవ్యపేతం ప్రవర్తతే. వ్యపేతం తు పాదసంధిషు. నివర్తిత ఇత్యస్థానయమక మిదం స్థూలావృత్తేః. సంధి స్థూలావ్యపేత ముచ్యతే.

అర్థము : పాదసంధియందు అన్యభేదోచ్ఛేదముతోడి స్థూలమున కుదాహరణము. ఆమె (నాయిక) అబల యయ్యును తారుణ్యమదముచేత భరింపబడిన అనురాగమును గల దయ్యును, తన్ను తాను నిగ్రహించుకొన్నదై, నా పాపముచేత క్రోధరసముతో కూడుకొన్నదై మన్మథునికే తాపము కలిగించినదై నప్పటికిని నాకు తావింత తాపము కలిగించునది కాలేదు. (ఇంతయని చెప్పుటకు వీలులేనంత తాపమును కలిగించె నని భావము)

ఇచ్చట అంతాది సంధానమువల్ల అవ్యపేతము ప్రవర్తించుచున్నది. వ్యపేతము పాదసంధులయందు నివృత్తి నొందును. కావున స్థూలావృత్తియొక్క అస్థానయమక మిది. దీనిని సంధిస్థూలావ్యపేత మని యందురు.

వ్యాఖ్య : పాదసంధి యనగా తొలిపాదముయొక్క తుదికి మలిపాదము యొక్క మొదటికి నడుమనున్న భాగమని యర్థము. స్వభేదము, అన్యభేదము - అని అంతరభిన్నత్వము రెండు విధములుగా వ్యవహరించును. వ్యపేతగుచ్ఛములు వ్యపేతగుచ్ఛములచేత వ్యవహితము లగుట స్వభేదము. వ్యపేతము లవ్యపేతముల చేత గాని అవ్యపేతములు వ్యపేతములచేత గాని భిన్నము లగుట అన్యభేదము. అన్యభేదములేకుండుట అన్యభేదోచ్ఛేదము. అన్యభేదముండుట అన్యభేదానుచ్ఛేదము.

ప్రకృతపద్యమునందు ప్రథమపాదాంతమున 'మదేన సా' అని నాలుగక్షరముల గుచ్ఛము కలదు. ఇది స్థూలము. 'మదముచేత ఆమె' అని యర్థము. ద్వితీయపాదప్రారంభమున ఆవృత్తి గలదు. దీనికి 'నాయొక్క పావముచేత' అని యర్థము. రెండవపాదము చివర 'నయోజితా' అన్న గుచ్ఛము కలదు. 'రసేన యోజితా' రసముతో కూడియున్నదని యర్థము. మూడవపాదము మొదట 'న+యోజితా+ఆత్మానమ్' 'తన్నుతాను నిగ్రహించుకొన్నదై' అని యర్థము. ఇచ్చట 'న' వర్ణము 'అస'తో కూడి 'కాలేదు' అన్న యర్థము నిచ్చును. మూడవపాదము నాలుగవపాదముల సంధియందు 'అనంగతాపితాం గతాపి తాపాయ' అన్నచోట 'ంగతాపితా, ంగతాపితా' అన్న పునరుక్తి కలదు. ఇట్లు ప్రతిగుచ్ఛము అవ్యవహితముగా పాదసంధి యందు పునరుక్తమగుటవల్ల ఇది అవ్యపేతము, అస్థానయమకము, స్థూలము. కావుననే దీనిని సంధి స్థూలావ్యపేత మని యందురు.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

అన్యభేదానుచ్ఛేదేన సూత్క్మం యథా -

'మతాం ధునానారమతామకామతా
మతాపలబ్ధాగ్రి మతానులోమతా
మతావయత్యుత్తమతా విలోమతా
మతామ్యతస్తే సమతా న వామతా'

అత్ర వ్యపేతానుచ్ఛేదేనైవ పాదసంధిష్వవ్యపేత ముద్పద్యతే ఇత్యస్థానయమక మిదం సూక్ష్మవృత్తేః. సంధి సూక్ష్మావ్యపేత ముచ్యతే.

అర్థము : అన్యభేదానుచ్ఛేదముతోడి సూక్ష్మమున కుదాహరణము. ఆత్మారాములయిన యోగులయొక్క అనభిలాషిత్వమును చెదరగొట్టునదియు, అనాయాసముగా లభించినదియు, శ్రేష్ఠత్వమున కనుకూలమైనదియు, ఉత్తమత్వముయొక్క విలోమత్వమును బుద్ధియందు చేరనీయనిదియు నైన సమతయే అతామ్యుడవైన (చిత్తగ్లాని యెరుగవి) నీకు సమ్మతము. విషమత్వము (వామత) సమ్మతము కాదు.

ఇచ్చట వ్యపేతానుచ్ఛేదముచేతనే పాదసంధులయందు అవ్యపేతము పుట్టుచున్నది. కావున, ఇది సూక్ష్మవృత్తియొక్క అస్థానయమకము. దీనిని సంధి సూక్ష్మావ్యపేత మని యందురు.

వ్యాఖ్య : 'మతా' అను రెండక్షరముల గుచ్ఛము ప్రతిపాదమున ఆదియందు, మధ్యయందు, అంతమందు మూడుమూరులు చొప్పున ప్రయుక్తమయినది. నడుమ నితరాక్షరముల వ్యవధానము కలదు. కావున నిది ఆది మధ్యాంత వ్యపేత యమక మగును. ఏ పాదమున కా పాదమునే గ్రహించినప్పుడు దీని నిట్లే పరిగణింపవలయును. పూర్వపాదాంతగుచ్ఛము అనంతరపాదాదిగుచ్ఛ మగుచుండుట వల్ల పాదసంధులయందు అవ్యపేతత్వము నంగీకరింపవలయును. నిజమునకు ప్రకృతోదాహరణమునందు వ్యపేతమైన అక్షరగుచ్ఛములచేతనే అవ్యపేతయమకము సంభవించుచున్నది. కావున వీనిని విరుద్ధములుగా గ్రహించుటకు వీలుకాదు. కావుననే దీనిని అన్యభేదానుచ్ఛేదముతోడి అవ్యపేతయమకముగా పేర్కొనుట జరిగినది. అన్యభేదము అని యనగా వ్యపేతము. వ్యపేతము నంగీకరించుచున్న అవ్యపేత మిది. అవ్యపేతమునకే ప్రాధాన్యము; కావుననే అస్థానయమకముగా పరిగణించుట జరుగుచున్నది.

శ్లోకమంతటిలోను 'మతా' అన్న రెండక్షరముల గుచ్ఛము పండ్రెండు పర్యాయములు పునరుక్తమయినది. రెండక్షరముల నిడివి గల గుచ్ఛ మగుటచేత సూక్ష్మము. పద విభాగ మిది – మతాం, ధునానా, ఆరమతాం, అకామతాం; అతావలబ్ధా, అగ్రిమతానులోమతా; మతా, అయతీ, ఉత్తమతా విలోమతాం; అతామ్యతః, తే, సమతా, న, వామతా.

ఉదాహరణపద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

స్వభేదే పూర్వభేదానుచ్ఛేదేన * స్థూలం యథా -

'సతమాః సతమాలో యః పారా
పారాయతః స దావో౽దావః
లోకాలోకానుకృతిః సహ్యః
సహ్యాయమనభ్రకూటైః కూటైః' 130

అత్ర విషమపాదయోః సమపాదాంతే౽వతిష్ఠ మానా వాది యమకాద్యంత యమకయో రాదిమధ్యాంత యమకతా మాపాదయంతః పారాపారేతి సహ్యః సహ్య ఇత్యావృత్తీ స్థూలే ఏవాదిమధ్య యమకవ్యపదేశం చ లభేతే ఇత్యస్థానయమక మిదమ్. స్వభేదే పూర్వభేదానుచ్ఛేది * స్థూలావ్యపేత ముచ్యతే.

అర్థము : స్వభేదమునందు పూర్వభేదానుచ్ఛేదముతోడి స్థూలమున కుదాహరణము. పారానదీతీరమువరకు విస్తరించి తమాలవృక్షములను గలిగి అంధకారబంధురమై దావాగ్ని స్పర్శలేని వనముగల సహ్యపర్వతము మేఘసముదాయములు లేని శిఖరములతో లోకాలోకపర్వతము ననుకరించుచున్నది.

ఇచ్చట విషమపాదములందును సమపాదాంతమునందును అవతిష్ఠమానములయిన ఆదియమకమునకును ఆద్యంతయమకమునకును ఆదిమధ్యాంతయమకత్వము నాపాదించుచున్నవై 'పారాపార' అని 'సహ్యః సహ్య' యన్న ఆవృత్తులు రెండును స్థూలమునందే ఆది మధ్యయమక వ్యపదేశమును పొందుచున్నవి. కావున నిది అస్థానయమకము. దీనిని స్వభేదమునందు పూర్వభేదానుచ్ఛేది స్థూలావ్యపేతమని యందురు.

[ఇచ్చట మూలమునందును తద్వివరణమందును 'స్థూల' శబ్దమున్నచోటులందెల్ల 'సూక్ష్మ'శబ్దముండవలయును. నిర్ణయసాగర ముద్రితప్రతి పాఠము యథాతథముగా స్వీకరింపబడినది. లిఖితప్రతియందో ముద్రణసమయమునందో యీ దోషము దొరలియుండును. దానిని సవరించుకొనకున్న అభిప్రాయము సంగతము కాదు. ఇంతవరకు అర్థము మూలము ననుసరించియే వ్రాయబడినది. కావున అర్థమునందును స్థూలశబ్దమున్న చోటులందెల్ల సూక్ష్మశబ్దమును చదువవలయును.]

వ్యాఖ్య : ఇది స్వభేదమునందు పూర్వభేదానుచ్ఛేదముతోడి సూక్ష్మమున కుదాహరణము. స్వభేదము అని యనగా అవ్యపేత మని యర్థము. పూర్వభేదము అని యనగా పూర్వప్రసక్తమయిన అక్షరగుచ్ఛము కంటె భిన్నమయిన అక్షరగుచ్ఛ మని యర్థము.

ఉదాహృతశ్లోకమునందు ప్రథమపాదాది యందు 'సతమాః' అన్న అక్షర గుచ్ఛము స్థూలము. ఇది అవ్యవహితముగా పునరుక్తమయినది. తృతీయపాద మునందు 'లోకా' అన్న అక్షరగుచ్ఛము పునరుక్తమయినది. ఇది సూక్ష్మము. ఈ రెండింటివిబట్టి విషమపాదములందు అవ్యపేతమైన ఆదియమకమున్న దన వచ్చును. రెండవపాదము తుదియందు 'దావో' యన్న సూక్ష్మమైన అక్షరగుచ్ఛము నాల్గవపాదము తుదను 'కూపైః' అన్న సూక్ష్మమైన అక్షరగుచ్ఛము అవ్యవహిత ముగా పునరుక్తము లయినవి. కాబట్టి సమపాదములందు అవ్యపేతమైన అంత యమక మున్న దనవచ్చును. కావున నింతవరకు ఆద్యంతయమక మున్నదనుటకు వీలున్నది. ప్రథమ పాదాంతమున 'పారా' అని యున్న సూక్ష్మగుచ్ఛము ద్వితీయ పాదాదిని పునరుక్తమయినది. ఇట్లే తృతీయపాదాంతమునందలి 'సహ్యాః' చతుర్థ పాదాదియందు పునరుక్తమయినది. ఇట్లగుటచేత పాదసంధియందు యమకము నంగీకరింపవలయును. ఇట్లు పాదసంధియందలిది అస్థానయమకముగానే యింత వరకు పరిగణింపబడినది. కావుననే యిప్పుడుకూడ దీనిని అస్థానయమకముగానే పరిగణించుట సమంజసము.

అన్నియెడలను అవ్యపేత యమకమే యున్నది. పూర్వప్రసక్తమయిన గుచ్ఛమే అన్నియెడలను పునరుక్తము కాలేదు. అది యొకమారు పునరుక్తమైనది. తరువాత మరొక గుచ్ఛము పునరుక్తమైనది. పూర్వభేదమును అనగా పూర్వగుచ్ఛ మును అనుమోదించుటయే యిచ్చట జరుగుచున్నది. కావుననే యిది పూర్వభేదాను చ్ఛేది యని పేర్కొనబడినది. ప్రథమపాదాది గుచ్ఛము తక్క తరువాతి గుచ్ఛము లన్నియు సూక్ష్మములే. పాదసంధియందలి యమకమునుబట్టి అస్థానయమక మున్నట్లే సూక్ష్మయమక మని యనుటయు భావ్యము.

తదేవ స్వాన్యభేదోచ్ఛేది సూక్ష్మం యథా -

'సనాకవనితం నితంబరుచిరం

చిరం సునినదై ర్నదైర్వృత మమూష్

మహాఫణవతోఽవతో రసపరా
పరా స్తవసుధా సుధాధివసతి' 131

అత్ర పాదాంతాదిషు వ్యపేతం యదా మధ్యేష్వవ్యపేతం తదుభయమపి పాదాంతాది సంహితాయా మవ్యపేత మభిన్నజాతీయం జాయతే. న చ ప్రాచీనాం మధ్యయమకతాం జహాతీత్యస్థానయమక మిదం సూక్ష్మాన్వృత్తే రన్యతో భేదేన స్వభేదానుచ్ఛేది సూక్ష్మా వ్యపేత ముచ్యతే. ఉభయ మపి చైతదేవం విధేష్వేవ ఛందఃసు ద్రష్టవ్యమ్.

అర్థము : అందే స్వాన్యభేదోచ్ఛేది సూక్ష్మమున కుదాహరణము. దేవతా స్త్రీలతో కూడినదియు, నెత్తములచేత మనోహరమైనదియు, ఎల్లప్పుడును చక్కని ధ్వనులు చేయు నదములచేత చుట్టుకొనబడినదియునైన దీని (హిమాద్రి) యందు (పాతాళమును) రక్షించువాడైన మహాసర్పమునకు మిక్కిలి ప్రీతిపాత్రమైనదియు, భూమండలమం దెక్కడను లేనిదియు నైన సుధ యున్నది.

ఇచ్చట పాదాంతాదులయందు వ్యపేతము. అట్లే మధ్యభాగములందు అవ్యపేతము. కాబట్టి ఆ రెండును పాదాంతాది సంహితయందు అభిన్నజాతీయమైన అవ్యపేతముగా నగును. పూర్వమున్న మధ్యయమకము నిది విడిచిపెట్టదు కావున సూక్ష్మవృత్తియొక్క అస్థానయమక మిది. అన్యతోభేదపటుతోడి స్వభేదానుచ్ఛేది సూక్ష్మావ్యపేతముగా ఇది పరిగణింపబడును. ఈ విధమైన ఛందస్సులందే యీ యుభయమును కన్పట్టును.

వ్యాఖ్య : ప్రతిపాదమునందును రెండేసి యక్షరములగుచ్ఛము అవ్యవహిత ముగా పునరుక్తమయినది. నితం, నదైర్, వతో, సుధా - అన్నవి సూక్ష్మగుచ్ఛ ములు. కావున నిచ్చట అవ్యపేత సూక్ష్మమధ్యయమక మున్నదనవలయును. మొదటిపాదము చివరనున్న 'చిరం' రెండవపాదము మొదట పునరుక్తమయినది. అట్లే మూడవపాదము చివరి 'పరా' నాలుగవపాదము మొదట పునరుక్తమయినది. ఏ పాదమున కా పాదమునే వేరుగా పరిగణించినయెడల ఇది వ్యపేతయమకమే యగును. కాని పాదసంధి యగుటచేత, అనగా అవ్యాహత పఠితివల్ల వివృత్తి లేకపోవుటచేత ఇదికూడ అవ్యపేతయమకమే. అనగా మధ్యయమకమువలెనే,

యిదియు అవ్యపేతయమకముగానే అభిన్నజాతీయముగానే గ్రహింపబడును. దీని చేత వ్యపేతత్వము ఉచ్ఛిన్నమయినది. కాబట్టియే యిది అన్యభేదోచ్ఛేది సూక్ష్మమున కుదాహరణమైనది. 'నితం' మున్నగు వానివల్ల మధ్యయమకమట్లే యున్నది. ఇది అవ్యపేతయమకమగుటవల్ల స్వభేదానుచ్ఛేది యగుచున్నది.

పరభేదోచ్ఛేదము, స్వభేదానుచ్ఛేదము అను రెండు లక్షణములు యిచ్చట గలవు. ఆ యా పద్యములం దిట్లుండుట ఆక్షేపణీయము కాదు.

ఉదాహరణ పద్యము భారవి కిరాతార్జునీయమునందలిది.

పాదే స్థూలవ్యపేతం యథా -

'అభిద్యుతాసన్న ముదగ్రతాపం
రవిం దధానేఽప్యరవిందధానే
భృంగావలి ర్యస్య తటే నిపీత
రసా నమత్తామరసా న మత్తా' 132

అత్ర మా భూ దవ్యపేతప్రసంగ ఇత్యేక మేవాక్షరం విహాయ స్థూలావృత్తి ద్వయేన శ్లోకపాదయో ర్వ్యాప్తత్వా దాదిమధ్యాంతత్వా న సంభవతీ త్యస్థానయమక మిదం స్థూలవ్యపేత ముచ్యతే.

అర్థము : పాదమునందు స్థూలవ్యపేతమున కుదాహరణము. ఆసన్నముగాను, తీవ్రతాపముతోను సూర్యుడున్నప్పటికిని ఆ పర్వతము (రైవతకాద్రి)యొక్క తటమునందలి పద్మాకరమునందు పంచబడిన తామరలను గలదియు బాగుగా మధువును త్రాగినదియు మత్తిల్లినదియు నైన భృంగసమూహము ఖేదము నొందలేదు.

ఇచ్చట 'అవ్యపేత ప్రసంగ మరుండరాదు' అని ఒక యక్షరమును మాత్రమే విడిచి స్థూలమైన రెండావృత్తులతో శ్లోకపాదములను రెండింటిని వ్యాపించియుండుట వల్ల, ఆదిమధ్యాంతత్వము సంభవము కాదు. కనుక, ఇది స్థూలవ్యపేతమైన అస్థానయమకముగా పరిగణింపబడును.

వ్యాఖ్య : రెండవపాదమునందు 'రవిందధానే' అన్న అయిదక్షరముల గుచ్ఛము పునరుక్తమైనది. మొదటి గుచ్ఛమునకు ఆవృత్త గుచ్ఛమునకు నడుమ

ఒక్క యక్షరము మాత్రమే యున్నది. ఒక్క యక్షరమే యైనప్పటికిని వ్యవహితత్వము కలుగుటచేత, ఇది వ్యపేత యమక మగును. పాదమునంతటి నిది యాక్రమించియుండుటవల్ల ఆదియని మధ్యయని స్థాననిర్దేశమునకు వీలు కాదు. కావుననే అస్థానయమకము. 'రవిం+దధానే' రవిని ధరించుచున్న దని యర్థము. ఇది 'శ'తే' యనుదానికి విశేషణమగుటచేత సప్తమీవిభక్తి యందున్నది. 'అరవింద+ధానే' పద్మములకు నెలవైన దని యర్థము. ఇదియు సప్తమియందే యున్నది. ఐదక్షరముల పరిమితివల్ల ఇది స్థూలయమకము.

నాలుగవపాదమునందు 'రసా నమత్తా' అన్న ఐదక్షరములు పునరుక్తము లయినవి. ఇచ్చటి పదవిభాగము – నిపీతరసా, నమత్తామరసా, న, మత్తా. ఇందలి 'న'వర్ణము క్రియాపదమైన 'అభిద్యత'తో అన్వయించును. తొలిగుచ్ఛమునకు ఆవృత్తమునకు నడుమ 'మ'వర్ణముండి వ్యవధానమును కలిగించుచున్నది. కావుననే అస్థానయమకమునందలి పాదస్థూలవ్యపేతమున కిది లక్ష్యమయినది.

ఉదాహరణము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

పాద ఏవ సూక్ష్మవ్యపేతం యథా –

'కరేణుః ప్రస్థితో౽నేకో
రేణు ర్ఘంటాః సహస్రశః
కరే౽ణుః శీకరో జజ్ఞే
రేణు స్తేన శమం యయౌ' 133

అత్ర విషమపాదయోః కరేణుః కరే౽ణు రిత్యాదా వావృత్తమ్. సమ పాదయో స్తు రేణుః రేణురితి. తత్తు స్వాపేక్షయా న మధ్యమన్యాపేక్షయా నాది రిత్యస్థాన యమక మిదం సూక్ష్మవ్యపేత ముచ్యతే.

అర్థము : పాదమునందే సూక్ష్మవ్యపేతమున కుదాహరణము. అనేక గజములు బయలుదేరినవి. అనేకవిధములుగా గంటలు మ్రోగినవి. తుండము నందు చిన్నతుంపురులు పుట్టినవి. వానిచేత ధూళికణములు శాంతినొందినవి. (మూలశ్లోకమునందు జాత్యేకవచనమును వాడగా ఇచ్చట స్పష్టతకొరకు బహువచనమును వాడుట జరిగినది.)

ఇచ్చట విషమపాదములందు 'కరేణుః కరేఽణుః'అని ఆదియందు ఆవృత్తి గలదు. సమపాదములందు 'రేణుః రేణుః' అని. అది స్వాపేక్షచేత మధ్యస్థాని కము కాదు; అన్యాపేక్షచేత ఆదిస్థానికము కాదు; కావున ఇది అస్థానయమకము. సూక్ష్మవ్యపేత మని పిలువబడును.

వ్యాఖ్య : బేసిపాదములందు 'కరేణుః' అన్న గుచ్ఛము ఆదియందున్నది. ప్రథమపాదాది కరేణు శబ్దమునకు 'ఏనుగు' అని యర్థము. తృతీయపాదాది నున్న 'కరేఽణుః' ఏకపదము కాదు. 'కరే+అణుః' అని విభాగము. 'కరే' అని యనగా 'తుండమునందు' అని యర్థము. 'అణుః' అల్పార్థకము; తరువాతనున్న శీకరశబ్దమునకు విశేషణము. ఇచ్చట మొదటిపాదములోని గుచ్ఛము మూడవ పాదమునందు ఆవృత్తమయినది. దీనినిబట్టి ఆది వ్యపేతయమక మని అనవచ్చును. కాని రెండవపాదము మొదటను నాలుగవపాదము మొదటను 'రేణుః' అన్న గుచ్ఛము ప్రయుక్తము. సరిపాదములందు దీనిని ఆదివ్యపేత యమక మని అన వచ్చును. కాని, యీ రెండు గుచ్ఛములును పూర్తిగా భిన్నములు కావు. మొదటి గుచ్ఛమున నొకవర్ణము లోపించుటచేత రెండవగుచ్ఛ మేర్పడుచున్నది. 'రేణుః' అన్న గుచ్ఛమునే పరిగణించినయెడల అది మధ్యస్థము కాదు; అనగా ద్వితీయ పాదమునందును చతుర్థపాదమునందును ఆదియందే యున్నది. 'కరేణుః' అన్న గుచ్ఛమునే పరిగణించినయెడల 'రేణుః'అన్నది మధ్యమమే కాని ఆదిమము కాదు. ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలుకాని విధముగా నుండుటవల్లనే, యిది అస్థాన యమకముగా పరిగణింపబడుచున్నది. సూక్ష్మవ్యపేత విభాగమునకు చెందినది.

రెండవపాదము మొదట నున్న 'రేణుః' క్రియాపదము. 'మ్రోగినవి' అని యర్థము నాలుగవపాదము మొదటనున్నది నామవాచకము. 'ధూళికణములు' అన్న యర్థము కలది. జాత్యేకవచనము ప్రయుక్తమయినది. ఇట్లగుటవల్ల, ఇది సూక్ష్మము వ్యపేతమునైన అస్థానయమకము.

[గ్రంథకర్త యభిప్రాయముపైని వ్యాఖ్యాతమయినది. 'కరేణుః' అన్న ప్పుడు స్థూలగుచ్ఛము. కావున దీనిని 'రేణుః' అన్న సూక్ష్మమునకే పరిమితము చేయుట సరికాదు. అట్లే యైనప్పటికిని పూర్వభేదానుచ్ఛేద వ్యపేతాది సూక్ష్మ యమక మనవచ్చును. స్థూలమునందలి అంశమే యిచ్చట సూక్ష్మము కావున, దీనిని స్థూల తదంశ వ్యపేతాదియమక మనియైన ననవచ్చును. మధ్యయమక

మన్న ప్రసంగముతో నిజమునకు పనిలేదు. కావున, దీనిని అస్థానయమకముగా పరిగణింపవలసిన యవసరము కానరాదు.]

శ్లోకే స్థూలవ్యపేతం యథా-

'జయంతి తే సదా దేహం నమస్యంతి జయంతి తే
భవాన్యతో నమస్యంతి సదా దేహం భవాన్యతః' 134

అత్ర స్థూలవ్యపేతావృత్తి చతుష్టయేన శ్లోకోఽపి వ్యాప్త ఇత్యాదిమధ్యాంతా భావా దస్థానయమక మిదం స్థూలవ్యపేత ముచ్యతే.

**అర్థము** : శ్లోకమునందు స్థూలవ్యపేతమున కుదాహరణము. ఓ జయంతీ! నీయొక్క శరీరమునకు నమస్కరించు వారు సదా వర్ధిల్లుదురు. అందువల్ల సంసార బంధములను, భవునికంటె నన్యునివల్ల శ్రేయస్సును పొందవలయునన్న కోరికను తిరస్కరింతురు.

ఇచ్చట స్థూలమును వ్యపేతమునైన ఆవృత్తి చతుష్టయముతో శ్లోకము నిండియున్నది. కావున ఆదిమధ్యాంతముల అభావముచేత ఇది అస్థానయమకము, స్థూలవ్యపేతము అని చెప్పబడును.

**వ్యాఖ్య** : ఇచ్చట జయంతితే, సదాదేహం, నమస్యంతి, భవాన్యతో - అని నాలుగక్షరముల గుచ్ఛములు నాలుగున్నవి. ఇవి స్థూలములు. ఇవియే పునరుక్తములై శ్లోకమున వ్యాప్తినొందినవి. కావుననే ఆదిమధ్యాంతములని విభజించుటకు వీలుకాక అస్థానయమకమైనది. పై గుచ్ఛముల ఆవృత్తగుచ్ఛములు వానిని వెన్నంటి లేవు; అనగా ఇతరగుచ్ఛములవల్ల వ్యవహితములై యున్నవి. కావుననే వ్యపేతత్వము నొందినవి. ఇట్లగుటచేతనే యీ పద్యము స్థూలవ్యపేతమైన అస్థానయమకమునకు లక్ష్యమయినది.

శ్లోక ఏవ సూక్ష్మవ్యపేతం యథా -

'యామా నీతా నీతా యామా
లోకా ధీరా ధీరా లోకా

సేనా సన్నా సన్నా సేనా
సారం హత్వాహత్వా సారమ్' 135

అత్ర యద్యపి యామాయామేత్యాదౌ వ్యపేత మాద్యంత యమకం నీతానీతేత్యాదౌ చ మధ్యయమక మవ్యపేతం విద్యతే. తథాపి మండూకప్లుత్యా గతప్రత్యాగతే ర్యతేశ్చ నైత దుల్లిఖతి. అపి తు శ్లోకోఽపి ద్వాభ్యాం ద్వాభ్యా మక్షరాభ్యాం సూక్ష్మా వృత్త్యా వ్యాప్త ఇవ లక్ష్యతే. తేనాస్థానయమక మిద మాదిమధ్యాంతానా మభావాత్ సూక్ష్మవృత్తేః సూక్ష్మవ్యపేత ముచ్యతే.

**అర్థము** : శ్లోకమునందే సూక్ష్మవ్యపేతమున కుదాహరణము. ఏది అభిమానవంతులచే నడిపింపబడినదియు, తీసికొని రాబడిన విస్తృతిని కలదియు, లోకము యొక్క మనోవ్యాధిని తొలగించివేయునదియు, ధైర్యవంతులచేత దర్శింపబడునదియు, సేనా నాయకునితో కూడియున్నదియు, నాశనములేనిదియునై యున్నదో ఆ సేన శత్రుసముదాయమును సంహరించి నీకు సారభూతమైన ఫలితార్థమును చెప్పెను.

ఇచ్చట 'యామాయామా' మొదలయినచోట వ్యపేతమైన ఆద్యంతయమక మున్నప్పటికిని, 'నీతానీతా' మొదలయినచోట మధ్యయమకము అవ్యపేతముగా నున్నది. అట్లే అయినప్పటికిని మండూకప్లుతి (కప్పగంతు) చేత గత ప్రత్యాగతమైన యతి నుండి యిది యుల్లిఖితము కాదు. అయినప్పటికిని శ్లోకమంతయు రెండేసి రెండేసి యక్షరముల సూక్ష్మవృత్తిచేత వ్యాప్తమైనట్లు గోచరించుచున్నది. అందుచేత ఆదిమధ్యాంతముల అభావమువల్ల, సూక్ష్మవృత్తివల్ల ఇది సూక్ష్మవ్యపేతమైన అస్థానయమక మని పిలువబడును.

**వ్యాఖ్య** : ప్రథమపాదమునందు యామా, నీతా అను రెండు సూక్ష్మగుచ్ఛము లున్నవి. పాదాంతమున 'యామా' పునరుక్తమయినది. దీనినిబట్టి ఆద్యంత వ్యపేత సూక్ష్మయమక మనవచ్చును. ఈ నియమము ప్రతిపాదమునిందిట్లే యున్నది. రెండవ గుచ్ఛమైన 'నీతా' అవ్యవహితముగా పునరుక్తమయినది. దీనిని బట్టి యిచ్చట సూక్ష్మవ్యపేతమధ్యయమక మున్నదనవచ్చును. కాని మొత్తము పద్యము నంతటిని రెండేసి యక్షరముల గుచ్ఛములే ఆక్రమించుకొని యున్నవి. కావున ఒక దాని విషయమున ఆద్యంతయమకమని, ఒకదాని విషయమున మధ్య

యమకమని, ఒకటి వ్యపేత మని, ఒకటి అవ్యపేత మని చెప్పుట కాక సామూహిక ముగా అస్థానయమకముగానే పరిగణించుట యుచితము. కావుననే దీనిని సూక్ష్మము వ్యపేతమునైన అస్థానయమకముగా పరిగణించుట జరిగినది.

[ఇక్కడి గుచ్ఛములు ప్రతిపాదమునందును ప్రతిలోమక్రమమున పునరుక్తము లయినవి. కావున ప్రతిలోమ సూక్ష్మవ్యపేతాస్థాన యమక మనవచ్చును. కాని భోజదేవు డిట్టి సూచన చేయలేదు.]

పాదసంధౌ స్థూలవ్యపేతం యథా -

'హఠహృతః మహారాష్ట్రీ దశనచ్ఛద పాటలా
పాటలా కలికానేకైః శ్రేకైకా లిలిహేఽలిభిః' 136

అత్రాపి ప్రాగ్వదేవ యతివిచ్ఛేదాత్పూర్వోత్తరార్ధయో రసంహితాయాం పాటలా పాటలేత్యావృత్తే ర్నావ్యపేత యమకత్వమ్. న చైతత్పాదయో రాదావంతే వా శక్యతే వక్తుమ్. అపి త్వేకస్యాదావన్యస్య వాంత్యస్థానే యమక మిదం స్థూలావృత్తేః స్థూలవ్యపేత ముచ్యతే. న చైతద్వాచ్య ముపోఢరాగేత్యాదౌ కాంచీయమకేఽప్యయం న్యాయ ఇతి, తస్యైవ తథాభూత లక్షణత్వాత్.

అర్థము : పాదసంధియందు స్థూలవ్యపేతమున కుదాహరణము. బలాత్కారముగా త్రాగబడిన మహారాష్ట్ర వనితయొక్క పెదవివలె ఎఱ్ఱనయిన ఒకేయొక పాటల కోరకము అనేకములయిన తుమ్మెదలచేత త్రాగబడినది.

ఇచ్చట పూర్వమువలెనే యతివిచ్ఛేదమువల్ల పూర్వోత్తరార్ధములకు అసంహితయందు 'పాటలా పాటలా' అన్న ఆవృత్తికి అవ్యపేత యమకత్వము లేదు. ఇది రెండుపాదములయొక్క ఆదియందు నంతమునందు నున్నదని చెప్పుటకు వీలు కాదు. ఒకదానికి మొదటను, ఇంకొకదానికి తుదను నున్నప్పటికిని స్థూలావృత్తి యొక్క యీ యమకము స్థూలవ్యపేత మనిపించుకొనును. దీనిని 'ఉపోఢరాగ' ప్రభృతులందు చెప్పరాదు. కాంచీయమక మందును ఇదే న్యాయ మని యనరాదు. దాని కావిధమైనదే లక్షణము.

వ్యాఖ్య : ఈ పద్యమునందు ద్వితీయపాదము చివరనున్న 'పాటలా' శబ్దము తృతీయపాదాదియందు పునరుక్తమయినది. కాబట్టి దీనిని అంతాది యమక మని, అవ్యపేత మని పిలువవలె ననిపించును. అట్లు పిలుచుటకు వీలులేదని భోజదేవుడు తన వివృతియందు తెలుపుచున్నాడు. సంస్కృతమున ప్రతిపద్యమును పూర్వార్ధము, ఉత్తరార్ధము – అని రెండు భాగములుగా విడియుండును. అందువల్ల ప్రథమద్వితీయపాదములకు సంహిత యుండును. తృతీయ చతుర్థపాదములకు సంహిత యుండును. కాని పూర్వార్ధములో చివరిదయిన రెండవపాదమునకు ఉత్తరార్ధములో మొదటిదయిన మూడ పాదమునకు సంహిత యుండదు. కావున, చూచుటకు సన్నిహితములుగానే యున్నను, ఈ గుచ్ఛములు వ్యపేతములుగానే పరిగణితము లగును. అవ్యపేతము లనుటకు అవకాశము లేదు.

'పూర్వము చెప్పిన 'ఉపోఢరాగాప్యబలా' మొదలయినచోట పాదసంధియందే ఆవృత్తియున్నది. (ఉదా. ప. 128) అట్టియెడల 'అవ్యపేతముగా పరిగణించిరి కదా!' అని యెవరైన సందేహించి ప్రశ్నింపవచ్చును. దానికి సమాధానముగా 'తథాభూతలక్షణత్వమువల్ల' అని భోజదేవుడు చెప్పెను. ఏ యర్ధభాగమున కా యర్ధభాగము నివృత్తినొందుటయే నియతలక్షణము. కాని పూర్వోక్త పద్యము నందు ఆవృత్తి ప్రతిపాదమునందు నున్నది. అట్లగుటచేత పూర్వార్ధమునందలి అవ్యపేతత్వమును, అట్లే ఉత్తరార్ధమునందలి అవ్యపేతత్వమునుబట్టి పూర్వోత్త రార్ధములకు కూడ అవ్యపేతత్వము అంగీకృత మగుచున్నది. కాంచీయమకము నికముందు చెప్పబోవుచున్నాడు. అక్కడకూడ వ్యపేతత్వమునకు పరిహారమున్నది. (ఉ. ప. 137)

పై వివేచనవల్ల ఇది స్థూల వ్యపేతమునకు లక్ష్యమైనది. ఆద్యంతాది భేదము తిరస్కృతమైనందువల్ల అస్థానయమక మనిపించుకొనును.

కాంచీయమక ఏవాన్యపేతాస్థాన యమకభేదే సూక్ష్మవ్యపేతం యథా –

'ధరాధరా కారధరా ధరాభుజాం
భుజా మహీం పాతు మహీనవిక్రమాః
క్రమాత్సహాంతే సహసా హతారయో
రయోద్ధురా మానధురావలంబినః. 137

అత్రాంత్యపాదే ధురాధురేతి సూక్ష్మావ్యపేతం వర్తతే.

అర్థము : కాంచీయమకమునందే అవ్యపేతాస్థాన యమకభేదమునందు సూక్ష్మవ్యపేతమున కుదాహరణము. భూమిని మోయునట్టి ఆదిశేషుని యాకార మును దాల్చినవియు, అనల్పమైన శౌర్యమును గలవియు, సత్వర శత్రుసంహారకము లును, వేగముచేత తీవ్రములైనవియు, సన్మానభారమున కాలంబనము లైనవియు నైన ధరాధీశ్వరుల బాహువులు భూమిని దండయాత్రనుండి రక్షించుటకు దక్షము లై యున్నవి.

ఇచ్చట అంత్యపాదమునందు 'ధురా ధురా' అని సూక్ష్మావ్యపేతము వర్తించు చున్నది.

వ్యాఖ్య : ప్రథమపాదమునందు 'ధరా' యన్న రెండక్షరముల గుచ్ఛము నాలుగు పర్యాయములు ప్రయుక్తమైనది. మొదటి గుచ్ఛమునకును మొదటి ఆ వృత్తమునకు నడుమ నెడము లేదు. అట్లే రెండవ యావృత్తికి మూడవ యావృత్తికి నడుమ నెడము లేదు. కాని మొదటి యావృత్తికి రెండవయావృత్తికి మధ్య 'కార' యన్న రెండక్షరములు వ్యవధానము కలిగించుచున్నవి. కాబట్టి మొదటి జంట నొక యమకముగను, రెండవజంటను మరొక యమకముగను భావించిన నవ్యపేత ములుగనే యగును. పాదసంధియందు 'భుజాం-భుజా' అని యున్నవి. ద్వితీయ పాదమున 'మహా' అను గుచ్ఛము 'ంసాకు' అన్న వ్యవధానముతో పునరుక్తమయి నది ద్వితీయ తృతీయ పాదసంధియందు 'క్రమాః-క్రమా' యని యున్నవి. మూడవ పాదమునందు 'సహ' అన్న గుచ్ఛము అవ్యవహితముగా పునరుక్తమయినది. తృతీయ చతుర్థపాదసంధియందు 'రయో' అన్నది రెండుపర్యాయము లావృత్తినొంది నది అందే 'ధురా' యన్నది 'మాన' అన్న రెండక్షరముల వ్యవధానముతో పున రుక్తమయినది.

దీనిని గ్రంథకర్త కాంచీయమక మని పేర్కొనుచున్నాడు. అనేకములయిన యమకగుచ్ఛములతోపాటు, అల్పసంఖ్యాకములయిన యమకేతరాక్షరములు కూడ నిందు గలవు. ఇట్లుండుటచేతనే దీనికి కాంచీయమక మన్నపేరు చెల్లుచున్నది. కాంచి యందు అందమునకై చిరుమువ్వలో, కామిడి పింపెలో, అట్టి వేవియో యుప యోగించుచు అతుకుపెట్టుటకై నడుమ నడుమ పూసలను గ్రుచ్చినట్లున్న రచనమున కీ పేరు సార్థకమే యగును. నలుపది మొదుదక్షరముల ప్రమాణముగల శ్లోక

ములో ముప్పదిరెండక్షరములు యమకసంబంధులు. పదునారక్షరములు యమక సంబంధము లేనివి

[భోజదేవుడు వివృతివాక్యమునందు అంత్యపాదమునందు మాత్రమే 'ధురా-ధురా' యని సూక్ష్మవ్యపేతమున్నదని చెప్పుచున్నాడు. తక్కిన యన్నియెడల అవ్యపేతమే యున్నదన్నది అభిప్రాయము కావలయును. అది యథార్థముకాదు. ద్వితీయపాదమునందలి 'మహీ' వ్యపేతము. తృతీయపాదమునందలి 'సహ' వ్యపేతము. అట్లే చతుర్థపాదమునందలి 'ధురా' వ్యపేతము.]

ప్రథమపాదమునందలి 'ధరా' గుచ్ఛములు రెండును అవ్యపేతములు. పాద సంధియందు 'భుజా' అవ్యపేతము; 'క్రమా' అవ్యపేతము; 'రయో' అవ్యపేతము. ఇచ్చటకూడ కేవల హల్వర్ణమునుగాని, బిందువునుగాని, విసర్గమునుగాని వ్యవధానముగా గణింపరాదు. అట్లు కానియెడల 'భుజాం-భుజా' అని యన్నప్పుడు బిందువు చేత వ్యవహితమైనట్లు చెప్పవలసివచ్చును. మొత్తముమీద వ్యపేతగుచ్ఛములతో అవ్యపేత గుచ్ఛములను కలిసినవి. అట్లగుటచేతనే అవ్యపేతాస్థానయమకము నందు సూక్ష్మవ్యపేతముగా పరిగణించుట జరుగుచున్నది. ఇందలి గుచ్ఛము లన్నియు సూక్ష్మములే. ఈ కూర్పులో యమకత్వము నొందిన వివిధగుచ్ఛములతో పాటుగా, యమకత్వము నొందని కొన్ని యక్షరములుకూడ నున్నవి. అట్లగుట చేతనే, కాంచీయమక మనిపించుకొన్నది.

ఉదాహరణ పద్యము దండి కావ్యాదర్శమునుండి గ్రహింపబడినది.

స్వభేదాన్యభేదయోః స్థూలం సూక్ష్మం చ యథా -

'సాలం వహంతీ సురతాపనీయం
సాలం తడిద్భాసురతాపనీయమ్
రక్షోభరక్షోభరసత్రికూటా
లంకా కలంకా కలికాద్రి కూటా' 138

అత్ర సాలం సాల మితి స్వభేదే సురతాపనీయం సురతాపనీయ మితి స్థూలః. రక్షోభరక్షోభ లంకాకలంకా కేతి అన్యభేదే కూటా కూటేతి సూక్ష్మవ్యపేతో భేదో వర్తతే. తదిద మస్థానయమకం స్థూలసూక్ష్మ ముచ్యతే.

అర్థము : స్వభేదాన్యభేదములయందు స్థూలమునకు, సూక్ష్మమునకు ఉదాహరణము. విద్యుల్లతవలె ప్రకాశమానమైన బంగారముతో నిర్మింపబడి తగినంతగా దేవతలకు తాపమును కలిగించునదైన ప్రాకారమును ధరించుచున్నదై రాక్షసబృందముయొక్క కోలాహలరవముతో నిండిన సువేలపర్వతమును గలదై, కలహములు లేని అద్రికూటములను గలదై అకలంకయైన లంక యొప్పియున్నది.

ఇచ్చట 'సాలం సాల' మన్న స్వభేదమునందు 'సురతాపనీయం సురతాపనీయ'మని స్థూలము. 'రక్షోభిరక్షోభి' 'లంకాకలంకాక' యన్న అన్యభేదమునందు 'కూటా కూటా' అని సూక్ష్మవ్యపేతమగు భేదము వర్తించుచున్నది. అందువల్ల ఈ అస్థానయమకము స్థూలసూక్ష్మమని పిలువబడును.

వ్యాఖ్య : ఇదికూడ కాంచీయమకభేదమే. క్రిందటి యుదాహరణమునందు వ్యపేతములు నవ్యపేతములును సూక్ష్మములే. ఇందు స్థూలములును, సూక్ష్మములును గూడ అవ్యపేతము లయినవి. ఇది యొక్కటియే యీరెండింటికి నున్న భేదము.

ఇచ్చట స్వభేదమనగా వ్యపేతమని, అన్యభేదమనగా అవ్యపేతమని గ్రహింపవలయును. ప్రథమపాదాదినున్న 'సాలం' ద్వితీయపాదాదిని పునరుక్తమయినది. ఇది సూక్ష్మవ్యపేతము. ప్రథమపాదాంతమున నున్న 'సురతాపనీయం' ద్వితీయపాదాంతమున పునరుక్తమైనది. ఇది స్థూలవ్యపేతము. వ్యపేతత్వము రెండింటియందును సమానమే.

తృతీయపాదారంభమున 'రక్షోభి' అన్న స్థూలగుచ్ఛము అవ్యవహితముగా పునరుక్తమయినది. ఇది స్థూలావ్యపేతము. చతుర్థపాదారంభమున 'లంకాక' అవ్యవహితముగా పునరుక్తమయినది. ఇదియు స్థూలావ్యపేతమే. తృతీయపాదాంతమందలి 'కూటా' యన్న సూక్ష్మగుచ్ఛము చతుర్థపాదాంతమున పునరుక్తము. ఇది సూక్ష్మవ్యపేతము.

నడుమ 'వహంతీ' మున్నగు పరిమితాక్షరములు యమకదూరములై యున్నవి. అందువల్లనే యిది కాంచీయమకము స్థాననియమము లేకుండ ఆదిమధ్యాంతముల నాక్రమించుకొనియుండుటచేత ఇది అస్థానయమకము. స్థూలసూక్ష్మములు కలిసియుండుటచేత స్థూలసూక్ష్మము.

యత్సూక్ష్మం భాగం బహ్వావృత్తి తదపి స్థూలసూక్ష్మమేవ.
యథా -

'మధురయా మధుబోధిత మాధవీ
మధుసమృద్ధి సమేధిత మేధయా
మధుకరాంగనయా ముహురున్మద
ధ్వనిభృతా నిభృతాక్షర ముజ్జగే' 139

అర్థము : సూక్ష్మభాగము అనేకావృత్తులను పొందినయెడల, అదియు స్థూలసూక్ష్మమే. దాని కుదాహరణము. వసంతముచేత మేల్కొలుపబడిన అతిముక్తలతా పుష్పములందలి మకరంద పౌష్కల్యమువల్ల వృద్ధిపొందిన ప్రతిభకలిగి మనోహరమైన మధుకరాంగనచేత మాటిమాటికి నున్మాదకరమైన ధ్వనితోకూడి అవ్యక్తమనోహరమైన నాదము పాడబడినది.

వ్యాఖ్య : ప్రకృతోదాహరణమునందు 'మధు' అన్న రెండక్షరముల గుచ్ఛము నాలుగు పర్యాయములు ప్రయుక్తమయినది. ఇది వ్యపేతము. 'ధిత' రెండుపర్యాయములు ప్రయుక్తమయినది. ఇదియు వ్యపేతమే. చతుర్థపాదమున 'నిభృతా' అన్న స్థూలగుచ్ఛము వ్యవహితమై పునరుక్తమయినది. ఆద్యంతాది నియమము లేకపోవుటచేత ఇది అస్థానయమకము. స్థూలమును సూక్ష్మమును కలిసియుండుటచేత స్థూలసూక్ష్మ మనవచ్చును. లక్షణమునుబట్టి సూక్ష్మమే బహుపర్యాయము లావృత్తినొందినయెడల దానికిపైతము 'స్థూలసూక్ష్మము' అన్న పేరే నిలుపబడినది. ఇచ్చట 'మధు' అన్న సూక్ష్మగుచ్ఛము అనేకపర్యాయము లావృత్తమగుటచేతనే స్థూలసూక్ష్మముగా ఇది పరిగణింపబడుచున్నది. ఉదాహరణపద్యము మాఘుని శిశుపాలవధమునుండి గ్రహింపబడినది.

65. స్థానాస్థాన విభాగోఽయ మవ్యపేత వ్యపేతయోః
క్రమేణోక్త స్తయోరేవ పాదభేదోఽథ కథ్యతే.

అర్థము : అవ్యపేత వ్యపేతములకు స్థానాస్థానవిభాగము క్రమముగా (ఇంతవరకు) చెప్పబడినది. ఇప్పుడింక వానికే పాదభేదము చెప్పబడును.

[పాదయమకము]

తత్రావ్యపేతభేదేషు ప్రథమ ద్వితీయపాదయో రావృత్తి ర్యథా -

'న మందయావర్జిత మానసాత్మయా
నమం దయావర్జిత మానసాత్మయా
ఉరస్యుపా స్తీర్ణ పయోధర ద్వయం
మయా సమాలింగ్యత జీవితేశ్వరః' 140

అర్థము : అందలి అవ్యపేతభేదములందు ప్రథమద్వితీయపాదములం దావృత్తికి ఉదాహరణము. జీవితేశ్వరుడు వంగి నమస్కరించియు దయలేని మానసమును ఆత్మను గలిగి, విడువని మానముచేత ఇష్టములేని ప్రయత్నముచేయు మూఢురాలినైన నాచేత బాగుగా ఉరమున విస్తరించియున్న పయోధరములతో కౌగిలింపబడలేదు.

వ్యాఖ్య : అవ్యపేత భేదమునందు పాదయమకమున కుదాహరణము. పూర్తిపాదము పునరుక్తమగుటయే పాదయమక లక్షణము. ఇచ్చట ప్రథమపాదము పూర్తిగా ద్వితీయపాదముగా పునరుక్తమయినది. ఇచ్చట రూపమునందు అభేదమును, అర్థమునందు భేదమును అపేక్షిత మన్న విషయమును మరచిపోరాదు. ప్రథమపాదమునందు 'న, మందయా, ఆవర్జితమాన, సాత్మయా' అని విభాగము. ద్వితీయపాదమునందు 'నమన్, దయావర్జిత, మానసాత్మయా' అని విభాగము. ఇచ్చట మొదటిపాదమును వెన్వెంటనే ఆవృత్తియుండుటవల్ల అవ్యపేతము. పూర్తిపాదమే పునరుక్తమగుటవల్ల పాదయమకము.

ఉదాహృతపద్యము దండి కావ్యాదర్శము నందలిది.

తత్రైవ ద్వితీయ తృతీయయో ర్యథా –

'దృశ్యే స్త్వయాయం పురతః పయస్వా
నానాకలాలీ రుచిరేణ నేత్రా
నానాకలాలీ రుచిరేణ నేత్రా
దేవీ యదస్మా ధజని స్వయం శ్రీః' 141

అర్థము : అందే ద్వితీయ తృతీయముల కుదాహరణము. సర్వవిధ కళా సంపన్నయు, మనోహరయు, హరిణనేత్రయు, దేవియు నయిన లక్ష్మి స్వయముగా నెందుండి యుద్భవించినదో ఆ స్వర్గమువరకు లాలనముచేయు స్వభావముగల సముద్రుడు మనోహర నాయకుడవైన నీచేత ఎట్టయెదుట చూడబడుచున్నాడు.

వ్యాఖ్య : ఇచ్చట ద్వితీయపాదము తృతీయపాదముగా పునరుక్తినొందినది. అవ్యవహితత్వమువల్ల ఇది అవ్యపేతపాదయమకము. ద్వితీయపాదమునకు పద విభాగము 'అనాకలాలీ, రుచిరేణ, నేత్రా' అని. మొదటిపదమునకు 'నాకమువరకు లాలనము గలవాడు' అని యర్థము. ఇది సముద్రునకు విశేషణము. 'పయస్వాన్' సముద్రుడు. ఈ తుది నకారము తరువాతి పదముతో సంహిత నొందగా 'నానాక లాలీ' యయినది. 'నేత్రా' యనగా 'నాయకునిచేత' అని యర్థము. 'రుచిరేణ' సుందరుడవైన యని యర్థము; నేతృశబ్దమునకు విశేషణము. కావుననే తృతీయాంతమై యున్నది. మూడవపాదమునకు పదవిభాగము 'నానాకలాలీ, రుచిరా, ఏణ నేత్రా' అని. నానావిధములైన కళల సముదాయమును కలది 'నానాకలాలీ'. 'రుచిరా' మనోహరిణి. 'ఏణనేత్రా' హరిణలోచన. ఈ మూడును 'శ్రీ' కి విశేషణములు. కావుననే ప్రథమాంతములై యున్నవి.

ఏవం తృతీయచతుర్థయో రపి యథా -

'స్మరానలో మానవివర్ధితో యః
స నిర్వృతిం తే కిమపాకరోతి
సమం తత స్తామరసే క్షణేన
సమం తత స్తామరసేక్షణే న? 143

అర్థము : ఇట్లే తృతీయచతుర్థముల కుదాహరణము. ఓ పద్మలోచనా ! అరసికురాలా ! ఉత్సవముతోపాటుగా సుఖవిశేషమును నీ యొక్క మానముచేత వృద్ధినొందినదై విస్తరించినదైన మన్మథానలము పూర్తిగా తొలగజేయుటలేదా ? (అధికముగా మానము వహించుట అరసికత్వమని, అందువల్ల, ప్రాప్తించిన సుఖ విశేషముకూడ నష్టమగునని అభిప్రాయము.)

వ్యాఖ్య : ఇచ్చట తృతీయపాదమే చతుర్థపాదముగా పునరుక్తినొందినది. అవ్యవహితత్వమువల్ల ఇది అవ్యపేత పాదయమకము. తృతీయపాదమునకు పద

విభాగము 'సమం, తతః, తామ్, అరసే, క్షణేన' అని. 'క్షణేన సమం' అని యనగా 'ఉత్సవసహితముగా' అని అర్థము. 'తతః' విస్తృత మని యర్థము; ఇది ప్రథమపాదమునందలి 'స్మరానలః' అనుదానికి విశేషణము. 'తామ్' దానిని అని యర్థము ఇది ద్వితీయపాదమునందలి 'నిర్వృతిమ్' అను దానికి విశేషణము. 'అరసే' 'అరసికురాలా' యని యర్థము; సంబోధనాంతము. నాలుగవపాదమునకు పదవిభాగము 'సమంతతః, తామరసేక్షణే, న' అని. 'సమంతతః' అనగా 'సమ్యగ ముగా' అని యర్థము; అవ్యయము. 'తామరసేక్షణే' 'పద్మనేత్రా' యని సంబో ధనము. 'న' వ్యతిరేకత్వబోధకము. ద్వితీయపాదమునందలి 'కిమ్, అపాకరోతి' అనుచోట నన్వయించుచు 'తొలగింపదా? ఏమి?' అని యర్థము నిచ్చును. 'అపాకరో త్యేవ' 'తప్పక తొలగించును' అన్నది భావము.

ఉదాహృతపద్యము దండి కావ్యాదర్శమునుండి గృహీతము.

వ్యపేతభేదేషు ప్రథమతృతీయయో ర్యథా -

'సభా సురాణా మబలా విభూషితా
గుణై స్తవారోహి మృణాల నిర్మలైః
స భాసురాణా మబలా విభూషితా
విహారయన్నిర్విశ సంపదః పురామ్.' 143

**అర్థము :** వ్యపేతభేదములందు ప్రథమ తృతీయముల కుదాహరణము. బలదైత్యుడులేని దేవతలసభ, విభుడైన యింద్రునిచేత వసింపబడినదై మృణాల నిర్మలములయిన నీ గుణములచేత ఆరూఢమై యున్నది. భాసురములయిన పుర ములయొక్క అలంకృతలయిన అబలాజనములను విహరింపజేసి సంపదల ననుభ వింపుము.

**వ్యాఖ్య :** పాదయమకమునందలి వ్యపేతయమకభేదములను ప్రదర్శించు చున్నాడు. ఇచ్చట ప్రథమపాదమే తృతీయపాదముగా పునరుక్త మగుచున్నది. ప్రథమ తృతీయపాదములకు నడుమనుండి ద్వితీయపాదము వ్యవధానమును కల్పిం చుటచేత ఇది వ్యపేతయమక మగుచున్నది.

ప్రథమపాదమునందలి పద విభాగము 'సభా, సురాణాం, అబలా, విభూ షితా' అని, అబలయు విభూషితయు నయిన సురసభ యని యర్థము. బలుడన్న

దైత్యుడులేనిది కావున అబల. బలుడు నిర్జింపబడుటచేత ఇంద్రుడే సింహాసనము నధి ష్ఠించియున్నాడు. కావున [విభు+ఉషిత] విభూషిత.

తృతీయపాదమునందలి పదవిభాగము 'స, భాసురాణాం, అబలా, విభూషితా' అని. 'సః'బలుని నిర్జించుటకు హేతువైన ఆ నీవు అని భావము. 'భాసురాణామ్' భాసురములయిన అని అర్థము. ఇది తరువాతి పాదమునందలి 'పురామ్' అను దానికి విశేషణము. కావుననే షష్ఠీ బహువచనాంతమై యున్నది. 'అబలాః' స్త్రీలను అని యర్థము. దీనికి 'అలంకరింపబడినవారిని' అన్న అర్థముగల 'విభూ షితాః' అన్నది విశేషణము; ద్వితీయాబహువచనాంతము.

ఉదాహరణము దండి కావ్యాదర్శమునుండి స్వీకృతము.

తత్రైవ ప్రథమ చతుర్థయో ర్యథా -

'కలం కము క్తం తనుమధ్యనామికా
స్తనద్వయీ చ త్వద్ధృతే న హంత్యతః
న యాతి భూతం గణనే భవన్ముఖే
కలంక ముక్తం తనుమధ్య నామికా' 144

అర్థము : అందే ప్రథమ చతుర్థముల కుదాహరణము. వ్యక్తావ్యక్త మధురమైన మాటయు, తనుమధ్యముగా పేర్కొనబడు స్తనద్వయము నిన్ను తప్ప మరి యెవనిని బాధింపకుండును. అందువల్లనే నీవంటివారిని లెక్కించుటయందు అనామిక (చిటికెనవ్రేలికి ప్రక్కనున్న వ్రేలు) కలంకముక్తమయిన శరీరము ధరించిన ప్రాణిని పొందకున్నది.

వ్యాఖ్య : వ్యపేతభేదములందలి ప్రథమ చతుర్థపాదయమకమున కిది యుదాహరణము. ప్రథమ చతుర్థపాదములకు నడుమ రెండుపాదముల వ్యవధాన ముండుటచేత ఇది వ్యపేతము.

ప్రథమపాదమునందు పదవిభాగము 'కలం, కం, ఉక్తం, తనుమధ్య నామికా' అని 'కలం+ఉక్తం' మధురమైన భాషిత మని యర్థము. సందర్భమునుబట్టి యువ తులయొక్క 'తియ్యని మాట' యని యర్థము. అట్లే శరీరమధ్యము నాక్రమించు కొని యున్నది స్తనద్వయము. కాబట్టియే 'తనుమధ్యనామిక' అయినది. ఇది

తర్షువాతిపాదమునందలి 'స్తనద్వయీ' పదమునకు విశేషణము; స్త్రీలింగము; ప్రథమైకవచనము.

చతుర్థపాదమునందు పదవిభాగము 'కలంక, ముక్తం, తనుం, అధి, అనామికా' అని. ఇచ్చట 'అనామికా' కర్తృపదము. 'కళంకముక్తమయిన శరీరము నధిష్ఠించియున్న' అని తక్కిన పదములు వెనుకటిపాదములోని 'భూతం'తో అన్వయించుచున్నవి. భూతమని అనగా మనుష్యుడనియే భావము. ప్రకృతనాయకుడు జితేంద్రియుడు. కావుననే యువతుల భాషణము కాని సౌందర్యము కాని అతనిని వశీకరించుకొనలేవు. అందుచేత అతడు పరిశుద్ధుడు. అట్టి పరిశుద్ధులను లెక్కింప నెంచి వక్త మొదటివానినిగా నాయకుని లెక్కించి కనిష్ఠికను ముడిచెను. రెండవవాడెవ్వడును, అంతటి పరిశుద్ధుడు కాడు. అందువల్లనే అనామిక మరియెవ్వరిని పొందలేకపోయినది. ఇది భావము.

ఉదాహరణము దండీ కావ్యాదర్శమునుండి గ్రహీతము.

ఏవం ద్వితీయ చతుర్థయో రపి యథా -

'యా బిభర్తి కలవల్లకీగుణ
స్వానమానమతి కాలిమాలయా
నాత్రకాంత ముపగీతయా తయా
స్వానమా నమతి కాలిమాలయా.' 145

అర్థము : ఇట్లే ద్వితీయచతుర్థములకు నుదాహరణము. మిక్కిలి నల్లదనమును కలిగి లయలేనిదైన తుమ్మెదల బారు మధురవీణా తంత్రీనాదమును నింపుచున్నది. సమీపమువనుండి పాడిన యీ తుమ్మెదల సమూహముచేత సుఖముగా వంచుకొనదగిన యే కాంత యిచ్చట కాంతునకు వంగకుండ నుండును? (అలంకారము శృంగార భావపోషకమై స్త్రీలను స్వయముగా పురుషులకు వశలను గావించునని భావము.)

వ్యాఖ్య : ఇచ్చట రెండవపాదము నాలుగవపాదముగా పునరుక్తమైనది. మూడవపాదము నడుమనుండి వ్యవధానము కలిగించుటచేత వ్యపేత యమకము.

ద్వితీయపాదము పదవిభాగము 'స్వానమానం, అతికాలిమా, అలయా' అని. 'స్వానమాన' మనునది వెనుకటిపాదములోని సమాసమున నుత్తరభాగము. (వీణా)

ధ్వనితో సవమింపదగిన దని యర్థము. 'అలిమాలా' అను పదమునకు 'అతికో లిమా' (మిక్కిలి వల్లనిది), 'అలయా' (లయలేనిది) అనునవి విశేషణములు.

చతుర్థపాదము పదవిభాగము 'స్వానమా, నమతి, కా, అలిమాలయా' అని. 'స్వానమా' సుఖముగా వంచుకొనదగిన దని యర్థము. 'కా' స్త్రీవాచకము; ప్రశ్నార్థకము. పై పాదములోని 'నాత్ర' లోని 'న' యిచ్చట నన్వయించును. 'న, నమతి' వంగకుండును అని యర్థము. 'అలిమాలయా' తుమ్మెదల సమూహముచేత అని యర్థము.

ఉదాహరణము మాఘుని శిశుపాలవధమునుండి స్వీకృతము.

## [సముద్గయమకము]

66. అర్ధాభ్యాసః సముద్గః స్యాత్తస్య భేదా స్త్రయో మతాః
వ్యపేతశ్చావ్యపేతశ్చ ఉభయాత్మా చ సూరిభిః.

అర్థము : అర్ధాభ్యాసము సముద్గమగును. దానికి వ్యపేతము, అవ్యపేతము, ఉభయాత్మకము – అని మూడుభేదములు పండితులచే సమ్మతింపబడినవి.

వ్యాఖ్య : అభ్యాసమని యనగా పునరుక్తి యని యర్థము. అర్ధమని యనగా పద్యమునందు సగముభాగము, అనగా రెండు పాదము లని యర్థము. పైని చెప్పకొన్న పాదయమకమునందు వ్యపేతమునందు అవ్యపేతమునందుకూడ ఒక్క పాదము మాత్రమే పునరుక్త మగుట చూచితిమి. సముద్గమునందు రెండు పాదములు పునరుక్తము లగును.

తేషు వ్యపేతో యథా –

'అనేక పాదభ్రమదభ్రసాలం
మాన్యే దృశాభీరు పతత్త్రికూటమ్
అనేక పాదభ్రమ దభ్రసాలం
మాన్యే దృశా భీరు పతత్త్రికూటమ్.' 146

అర్థము : సముద్గ యమకభేదములందు వ్యపేతమున కుదాహరణము. అనేక పాదములతో భ్రమించుచున్న మేఘములనే ప్రాకారముగా కలదియు, ఈవిధ

ముగా భయరహితములై మాన్యములయిన పక్షులసమూహములను కలదియు, ఏను గులయొక్క అతిశయమైన మదమును భరించు వృక్షములను గలదియు నైన త్రికూట పర్వతమును మాన్యురాలా! భీరురాలా! చూడుము.

వ్యాఖ్య : ప్రకృతోదాహరణమునందు మొదటిపాదము మూడవపాదము గను, రెండవపాదము నాలుగవపాదముగను పునరుక్తములయినవి. ఇట్లు రెండు పాదములు పునరుక్తము లగుటచేత సముద్గయమకము. తొలిపాదమునకును పున రుక్తమునకును మధ్య రెండవపాదము వ్యవధానము కల్పించుచున్నది. అట్లే రెండవ పాదమునకును పునరుక్తమునకును మధ్య మూడవపాదము వ్యవధానము కల్పించు చున్నది. అందువల్లనే వ్యపేతము.

మొదటిపాదమున 'అనేక, పాద, భ్రమత్, అభ్ర, సాలం' అని మూడవ పాదమున 'అనేకప, అదభ్ర, మద, భ్ర, సాలం' అని పదవిభాగము. రెండవ పాదమున 'మాన్య, ఈదృశ, అభీరు, పతత్త్రి, కూటమ్' అని నాలుగవపాదమున 'మాన్యే, దృశా, భీరు, పత, త్రికూటమ్' అని పదవిభాగము.

అవ్యపేతో యథా -

'ఘనం విదార్యార్జున బాణపూగం
ఘనం విదార్యార్జున బాణపూగమ్
ససార బాణోఽయుగలోచనస్య
ససార బాణోఽయుగలోచనస్య' 147

అర్థము : అవ్యపేతమున కుదాహరణము. అలోచనుడైన త్రిలోచనుని యొక్క సారమును శబ్దమును గల బాణము అర్జునుని ఘనమైన శరసమూహమును చీల్చి క్రిక్కిరిసియున్న నేలగుమ్మడులను, వల్లిగోరంటలను, మద్దులను, గంగరావు లను దూరెను.

వ్యాఖ్య : సముద్గ యమకభేదములందు అవ్యపేతమున కుదాహరణము. మొదటిపాదము రెండవపాదముగాను, మూడవపాదము నాలుగవపాదముగాను వ్యవధానము లేకుండ పునరుక్తము లగుటచేత అవ్యపేతములు.

మొదటిపాదమున 'ఘనం, అర్జునబాణపూగం, విదార్య' అని పదవిభాగము. 'గొప్పదైన అర్జున శరసమూహమును చీల్చి' అని యర్థము. ద్వితీయపాదమున

'ఘనం, విదార్య, అర్జున, బాణ, పూగం' అని పదవిభాగము. 'దట్టముగా నున్న నేలగుమ్మడులను, మద్దులను, నల్లగోరంటలను, గంగరావులను' అని యర్థము. 'ససార' అన్న క్రియాపదముతో అన్వయము.

మూడవపాదమునందు 'ససార, బాణః, అయుగలోచనస్య' అని విభాగము. ఇచ్చటి 'ససార' క్రియాపదము. నాలుగవపాదమునందు 'ససారబాణః, అయుక్, అలోచనస్య' అని విభాగము. సారముతోను శబ్దముతోను కూడినదని మొదటి సమాసమున కర్థము. 'అయుక్' అని యనగా సాటిలేనిదని యర్థము. 'అలోచ నస్య' అని యనగా లక్ష్యమునందు దృష్టిలేనివాడని యర్థము. 'రలయో రభేదః' అని యనుటచేత 'అరోచనుడు' అని యనగా ఇష్టముకానివా డనియైన నర్థము చెప్పవచ్చును. ఇది అయుగలోచనునికే విశేషణముగా ఉపయుక్త మయినది.

ఉదాహరణము భారవి కిరాతార్జునీయమునుండి గృహీతము.

వ్యపేతావ్యపేతో యథా -

'కలాపినాం చారుతయోపయాన్తి
బృందాని లాపోఢ ఘనాగమానామ్
బృందాని లాపోఢ ఘనాగమానాం
కలాపినాం చారుతయోఽపయాన్తి' 148

పాదత్రయాభ్యాసస్తు నాతిసుందర ఇతి తద్భేదా నోదాహ్రియన్తే.

**అర్థము :** వ్యపేతావ్యపేతమున కుదాహరణము. పరస్పర సల్లాపము చేత ప్రాప్తించెడి నిరంతర సమాగమము గల హంసలయొక్క బృందములు మనోహరముగా సంగతము లగుచున్నవి. తీవ్రవాయువుచేత చెదరగొట్టబడిన మేఘములు గల నెమిళ్లయొక్క ధ్వనులు అపయాతము లగుచున్నవి.

పాదత్రయాభ్యాసము అతి సుందరము కాదని తద్భేదము లుదాహృతము లగుట లేదు.

**వ్యాఖ్య :** మొదటిపాదము నాలుగవపాదముగా పునరుక్తమయినది. కావున

అవ్యపేతము. ఉభయము నిట్లొక్క పద్యమునందే యుండుటచేత వ్యపేతా వ్యపేతము.

మొదటిపాదమున 'కలాపినాం, చారుతయా, ఉపయాంతి' అని పదవిభాగము. జలమునందు ఆలాపించెడి స్వభావముగలవి హంసలు. 'కలాపినాం' అని యనగా హంసలయొక్క అని యర్థము. నాలుగవపాదమున 'కలాపినాం, చ, అరుతయః, అపయాంతి' అని పదవిభాగము. కలాపములని యనగా పింఛము లని యర్థము. వానిని గలవి నెమళ్లు. 'అరుతి' అనగా క్రేంకార మని యర్థము.

ఇంతవరకు ఏకపాదము పునరుక్తమగుట చెప్పబడినది. పాదద్వయము పునరుక్తమగుట చెప్పబడినది. అదే వరుసలో 'పాదత్రయము పునరుక్తమగుట చెప్పవలదా?' అని ప్రశ్నించుకొని 'అది సుందరము కాదు కావున చెప్పుటలేదు' అని గ్రంథకర్త వివరించియున్నాడు. పద్యము చతుష్పాద పరిమితము. మూడు పాదములు పునరుక్తములు కావలయునన్న ఒక పద్యము చాలదు; పద్యాంతర మావశ్యకము. అట్లు కాకున్న పాదములసంఖ్యను పెంచుకొని మాలికగా వ్రాయ వలయును. ఎట్లుచేసినను సుందరత్వము తరుగునే కాని పెరుగదు. అలంకార మవి యన్నప్పుడు సుందరత్వమును పోషించుటయే దాని లక్ష్యము. అందువల్లనే భోజదేవుడు అసుందరములను అపాకరించుచున్నాడు.

[మహాయమకము]

67. ఏకాకార చతుష్పాదం మహాయమక ముచ్యతే
శ్లోకాభ్యాసశ్చ తత్రాద్యం పునరభ్యాస మర్హతి.

**అర్థము :** ఒకే యాకారముగల నాలుగుపాదములను గలది మహాయమక మనిపించుకొనును. శ్లోకాభ్యాసముకూడ మహాయమకమే. అచట మొదటిది తిరిగి ఆవృత్తి నొందును.

తత్రావ్యపేతభేదే మహాయమకం యథా -

'సభాసమానా సహసాపరాగాత్
సభాసమానా సహసాపరాగాత్
సభాసమానా సహసాపరాగాత్
సభాసమానా సహసాపరాగాత్'

అర్థము : అవ్యపేత భేదమునందు మహాయమకమున కుదాహరణము. కాంతితోడను గౌరవముతోడను శత్రువిక్షేపముతోడను హాసముతోడను రాగహీనత్వమును తినివేయుచున్నది; ప్రకాశముతో శోభించుచున్నదై యుండి మార్గశీర్షముచేత పరాగకణములను పొందుచున్నది; శత్రువులను సంహరించువారితో కూడినదై కాంతికి సరూపములైన వానిని కలిగియున్నది; ఈవిధమైన అసమానమయిన సభ ఒక కొండనుండి ఆకస్మికముగా మరొకచోటికి వెళ్లిపోయినది.

వ్యాఖ్య : ఇది మహాయమకమున కుదాహరణము. నాలుగుపాదములు నొకే రూపములో నుండుటచేత, మరి దేనికిని వ్యవధానము లేకుండుటవల్ల అవ్యపేతము.

మొదటిపాదమున పదవిభాగము 'స, భాస, మాన, ఆస, హస, అపరాగాత్' అని. 'అపరాగమును తినుచున్న' దని యిచ్చటి కృదంతమున కర్థము. రెండవ పాదమున 'స, భాసమానా, సహసా, పరాగ, అత్' అని. ఇచ్చటి చివరిపదమునకు 'పొందుచున్న' దని యర్థము. మూడవపాదమున 'స, భా, సమానా, సహసా' అని. ఇందలి చివరి పదము 'పర, అగాత్' అని 'మరొక కొండనుండి' అన్న యర్థము నొసగును. నాలుగవపాదమున 'సభా, అసమానా, సహసా, పరాగాత్' అని. చివరి క్రియాపదమునకు 'తిరిగివెళ్లెను' అని యర్థము.

నాలుగుపాదములును రూపమున నొకేవిధముగా నున్నప్పటికిని, అర్థమునందు భిన్నములై యున్నవి. మొదటి మూడుపాదములును నాలుగవపాదములోని 'అసమానా, సభా' అను దానికి విశేషణములుగానే విస్తరించుకొనియున్నవి.

వ్యపేతభేదే ద్వితీయం మహాయమకం యథా -

'ప్రవణ మదభ్ర మద చల
ద్విపరాజిత మూఢ విమల మహితతత రంగమ్
విరసం సదాతి మిశ్రిత
మచ్యుత ధామ ప్రతీత శిఖచరితవనమ్...

ప్రవణ మదభ్రమదచల
ద్విపరాజిత మూఢవిమల మహితత తరంగమ్
విరసం సదాతిమిశ్రిత
మచ్యుత ధామ ప్రతీత శిఖ చరితవనమ్' 150

అర్థము : వ్యపేతభేదమునందు ద్వితీయ మగు మహాయమకమున కుదాహరణము. ప్రకృష్టమైన జలమును గలదియు, అధికమైన మదముచేత చలించుచున్న పక్షులచేత పరాజితములయిన బాలవిహంగముల కాశ్రయమైన గొప్ప తరంగములను గలదియు, రసాతలము కానరానిదియు, ఎల్లప్పుడు తిమితిమింగిలములచేత ఆశ్రయింపబడినదియు, మహావిష్ణువునకు నెలవైనదియు, ప్రతీతమైన అగ్ని (బడబాగ్ని) చేత మేయబడిన జలపీడనము గలదియు (నయిన సముద్రమును చూడుము). మదాసక్తిచేత దర్పించి సంచరించుచున్న కొండలవంటి యేనుగులచేత శోభించునదియు, గాఢమై స్వచ్ఛమైనదియు, పాముల విస్తృతికి రంగమైనదియు, జలశూన్యమైనదియు, శోభనకరములయిన పక్షులతో కూడినదియు, కాంతిని గోల్పోవనిదియు, తిరిగివచ్చిన నెమిళ్లచేత సంచరింపబడుచున్న వనమును (చూడుము).

వ్యాఖ్య : మహాయమకమునందు రెండు భేదములు తెలుపబడినవి. మొదటిది ఏకాకార చతుష్పాదము. క్రిందటి పద్యము దానికి లక్ష్యము. రెండవది శ్లోకాభ్యాసము. ఏకాకార చతుష్పాద మహాయమకము అవ్యపేతము. శ్లోకాభ్యాసము వ్యపేతము. ఒక శ్లోకము నాలుగుపాదములతో పరిసమాప్త మగును. అది పునరుక్తమైనపుడు శ్లోకాంతరమే యగును. శ్లోకము శ్లోకాంతరముతో అవ్యపేతసంబంధమును పొందజాలదు; నడుమ మరేమియు వ్యవహితత్వమును కలిగింపక పోయినప్పటికిని శ్లోక ద్వయమున కున్న సంబంధమును వ్యపేతముగానే పరిగణింపవలయును.

ఇందు మొదటిశ్లోకము సముద్రవర్ణనము. ఇదే శ్లోకము పునరుక్తమై అర్థాంతరమును గ్రహించి వనవర్ణనమైనది. ఇట్లు శ్లోకమంతయు అభ్యస్తమగుటచేతనే యిది మహాయమక మయినది.

అవ్యపేతభేదే ఆద్యస్య పునరభ్యాసో యథా -

'సమాన యాసమానయా
స మానయా సమానయా
సమానయా సమానయా
సమానయా సమానయా' 151

అర్థము : అవ్యపేత భేదమునందలి మొదటిభేదమునకు తిరిగి అభ్యాసము కలుగుట కుదాహరణము. ఓయి మిత్రుడా! ఆయాసపడు నటువంటిదియు, సమా

నములయిన ప్రయత్నమును మానమును గలదియు, పూజానహితురాలును, సాటి లేనిదియు నైన ఆమెతో నన్ను కలుపుము.

వ్యాఖ్య : మహాయమకము నందలి మొదటి భేదము ఏకాకార చతుష్పాదము. దానియం దంతర్భేద మిది. మొదటి భేదమునందు నాలుగే ఆవృత్తులుండగా, ఇందు ఎనిమిదావృత్తు లున్నవి. 'తత్రాద్యం పునరభ్యాస మర్హతి' అని లక్షణము నందే తెలుపుట జరిగినది. పాదము సగమువరకే యుండి అదే ఆవృత్తి నొందిన యెడల ఎనిమిదావృత్తులు కలుగును. ఇట్లు ఆవృత్త్యష్టకముతోడి మహాయమకమున కిది యుదాహరణము.

## శ్లేషాలంకారము

68. ఏకరూపేణ వాక్యేన ద్వయోర్భణన మర్థయోః
తంత్రేణ యత్స శబ్దజ్ఞైః శ్లేష ఇత్యభిశబ్దితః.

అర్థము : ఏకరూపమైన వాక్యముచేత రెండర్థములను తంత్రముతో చెప్పుట శబ్దజ్ఞులచేత శ్లేష యని పిలువబడుచున్నది.

69. ప్రకృతిప్రత్యయోత్థో ద్వౌ విభక్తివచనాశ్రయౌ
పదభాషోద్భవౌ చేతి శబ్దశ్లేషా భవంతి షట్.

అర్థము : శబ్దశ్లేష 1. ప్రకృతిశ్లేష 2. ప్రత్యయశ్లేష 3. విభక్తిశ్లేష 4. వచనశ్లేష 5. పదశ్లేష 6. భాషాశ్లేష – యని ఆరు విధములు.

[ ప్రకృతిశ్లేష ]

తేషు ప్రకృతిశ్లేషో యథా -

'ఆత్మనశ్చ పరేషాం చ ప్రతాపస్తవ కీర్తినుత్
భయకృద్భూపతే బాహుర్ద్విషాం చ సుహృదాం చ తే' 152

అత్ర కీర్తిను దిత్యత్ర నౌతి నుదతో ర్భయకృ దిత్యత్ర కరోతి కృన్తతోః ప్రకృత్యోః క్విపి తుల్యం రూపమితి ప్రకృతిశ్లేషోఽయమ్.

అర్థము : వానియందు ప్రకృతిశ్లేష కుదాహరణము. ఓరాజా! నీయొక్క ప్రతాపము నీయొక్కయు శత్రువులయొక్కయు కీర్తినుత్తు. నీ బాహువు శత్రులకును మిత్రులకును భయకృత్తు.

ఇచ్చట 'కీర్తినుత్తు' అను చోట నౌతి, నుదతి అను ధాతువులకును 'భయకృత్తు' అనుచోట కరోతి, కృన్తతి అను ధాతువులకును క్విప్ పరమగునప్పుడు రూపము తుల్యమే. కావున ఇది ప్రకృతిశ్లేష.

వ్యాఖ్య : ప్రకృతి నాశ్రయించుకొని రెండర్థములు కలిగినయెడల ప్రకృతి శ్లేష యగును. ప్రకృతోదాహరణమున 'కీర్తినుత్' అను పదము కలదు. ఇది తనకు శత్రువులకు సమానముగా నొక్కటియే యుపయుక్త మయ్యెను. తన విషయమైనప్పుడు 'కీర్తిం నౌతి' అని యర్థము. తనయొక్క కీర్తిని ప్రశంసించునని భావము. పరులవిషయమైనప్పుడు 'కీర్తిం నుదతి' అని యర్థము. పరులయొక్క కీర్తిని చెదరగొట్టు నని భావము. 'ను' ధాతువునకును, 'నుద్' ధాతువునకును కృదంతరూపము సమానముగా 'నుత్' అనియే యేర్పడును. అట్లే 'భయకృత్' అన్న రూపము రెండర్థములలో నుపయుక్తము. శత్రువులకు భయకృత్తు. ఇచ్చట 'భయం కరోతి' భయమును కలిగించునని యర్థము. మిత్రులకు భయకృత్తు. ఇచ్చట 'భయంకృన్తతి' భయమును ఖండించు నని యర్థము. 'కృ' ధాతువునకును 'కృత్' ధాతువునకును కృదంతరూపము సమానముగా 'కృత్' అనియే యేర్పడును.

ఇచ్చట క్విప్ ప్రత్యయము రెండింటియందును సమానమే. ప్రకృతిభూతమైన ధాతువునందు భేదము కలదు. దానినిబట్టియే అర్థమునందు భేదము కలుగుచున్నది. అయినప్పటికిని ఒక్కమారే ప్రయుక్తమై ఒకే రూపమున నుండుటచేత, ఇది శ్లేషాలంకార మగుచున్నది. ప్రకృతి నాశ్రయించి అర్థభేదము కలుగుటచేత ప్రకృతిశ్లేష యగుచున్నది.

లింగశ్లేషోఽపి ప్రకృతిశ్లేష ఏవ. స యథా –

'కువలయ దల ద్యుతాసౌ
దృశాచ వపుషా చ కం న దర్శయతే
అధరీకృత ప్రవాల
శ్రియాంఘ్రిణాస్యేన చ నతభ్రూః' 153

అత్ర దృగ్వపుషో రాస్యచరణయోశ్చ కువలయదల ద్యుతే త్యధరీకృత ప్రవాలశ్రియేతి చ లింగభేదేఽపి తుల్యరూపే విశేషణే ఇతి లింగశ్లేషోఽయమ్.

అర్థము : లింగశ్లేష కూడ ప్రకృతిశ్లేషయే. దాని కుదాహరణము: కువలయదళద్యుతి గల చూపుచేతను రూపుచేతను, అధరీకృత ప్రవాళశోభగల పాదము చేతను ముఖముచేతను కనుబొమలు వంగిన యీ రమణి యెవనికి దర్శనీయ కాకుండును ?

ఇచ్చట చూపు రూపులకు పాదముఖములకు కువలయదళద్యుతిగల యని, అధరీకృతప్రవాళశోభ గల యని లింగభేద మున్నప్పటికిని తుల్యరూపమైన విశేషణమునే వాడుటవల్ల ఇది లింగశ్లేష.

వ్యాఖ్య : లింగభేదము నామములకు నియతము. కావున లింగభేదము కూడ నామభేదమునందే అంతర్భవించును. పూర్వోదాహరణమునందు ధాతురూపమయిన ప్రకృతిభేదము ప్రదర్శింపబడినది. ఇందు నామరూపమయిన ప్రకృతిభేదము ప్రదర్శింపబడుచున్నది.

విశేషణ విశేష్యములు లింగవిభక్తి వచనములందు సమానములై యుండవలయును. 'దృక్' శబ్దము స్త్రీలింగము. దీని తృతీయైకవచనము 'దృశా'. 'వపు' శ్శబ్దము నపుంసకలింగము. దీని తృతీయైకవచనము 'వపుషా'. కాబట్టి 'దృక్' శబ్దమునకు స్త్రీలింగ విశేషణమును, 'వపు'శ్శబ్దమునకు నపుంసకలింగ విశేషణమును తృతీయైకవచనాంతములుగా ప్రయుక్తము కావలయును. ఇచ్చట 'కువలయదలద్యుత్' అనునది విశేషణము. ఇది క్విప్ప్రత్యయాంతము. అది సర్వలింగములం దొక్కటే యుండును. 'కువలయదలద్యుతా' అని తృతీయా విభక్తి నొందినది. ఇట్లగుటచేత ఇది రెండింటికి విశేషణముగా నుపయుక్తమయినది. 'కువలయదళద్యుత్'అని యనగా పద్మపత్రముయొక్క కాంతివంటి కాంతిగల దని యర్థము. వాయిక కన్నులలో ఆ కాంతి యున్నది; ఆమె శరీరమునందును ఆకాంతి యున్నది. ఇచ్చట అర్థమునందు భేదము లేదు. ఒకే పదము భిన్నలింగములందలి విశేష్యములకు విశేషణముగా నగుటయే యిచ్చటి విశేషము. కాబట్టియే దీనిని లింగశ్లేష యని పేర్కొనుట జరిగినది.

ఇట్లే 'అధరీకృతప్రవాళశ్రియా' అన్న విశేషణము 'అంఘ్రిణా' అన్న పుంలింగశబ్దమునకు, 'ఆస్యేన' అన్న నపుంసకలింగ శబ్దమునకు సమానముగానే అన్వయించుచున్నది. ఇచ్చట అర్థభేదముకూడ కలదు. పాదము విషయమున 'క్రిందుచేయబడిన తలిరాకుల శోభచేత' అని యర్థము. ముఖము విషయమున 'పెదవులుగా చేయబడిన తలిరాకుల శోభచేత' అని యర్థము.

ఇట్లు లింగభేదమున్నప్పటికిని సమానరూపమయిన విశేషణము సాధకమగుటచేత ఇది లింగశ్లేష యగుచున్నది.

[ ప్రత్యయశ్లేష ]

ప్రత్యయశ్లేషః సోద్భేదో నిరుద్భేదశ్చ. తయోరాద్యో యథా -

'తస్యా వినాపి హారేణ
నిసర్గాదేవ హారిణౌ
జనయామాసతుః కస్య
విస్మయం న పయోధరౌ' 154

అత్ర హారిణావితి ఇనిణినిప్రత్యయయోరేకరూపత్వాద్వినాపి హారేణేతి చ మత్వర్థీయోద్భేదాత్సోద్భేదప్రత్యయశ్లేషోఽయమ్.

అర్థము : ప్రత్యయశ్లేష సోద్భేదము నిరుద్భేదము అని రెండు విధములు. అందు మొదటిదాని కుదాహరణము. హారము లేకపోయినప్పటికిని స్వభావసిద్ధముగనే హారులయిన ఆమె పయోధరములు ఎవనికి విస్మయము కలిగింపకుండును?

ఇచ్చట 'హారిణౌ' అని ఇనిణిని ప్రత్యయముల యేకరూపత్వమువల్ల 'హారము లేకపోయినప్పటికిని' అన్న మత్వర్థీయోద్భేదమువల్ల ఇది ఉద్భేద ప్రత్యయశ్లేష.

వ్యాఖ్య : ప్రత్యయము నాశ్రయించుకొని రెండర్థములు కలిగినయెడల దానిని ప్రత్యయశ్లేషాలంకారమని యందురు. అది సోద్భేద మని, నిరుద్భేద మని రెండు విధములు. అదే వాక్యమునందలి మరొక శబ్దముచేత వ్యక్తమయ్యేడిది సోద్భేదము; అట్లు కానిది నిరుద్భేదము.

'హార' శబ్దమునకు మత్వర్థీయమైన 'ఇని' ప్రత్యయమురాగా 'హారీ' అని ద్వివచనమునందు 'హారిణౌ' అని యగును. దీనికి 'హారమునుగలవి' అని యర్థము. ఆవశ్యకార్థమున 'ణిని' ప్రత్యయము రాగా 'హరతః ఇతి హారిణౌ' అని యగును. 'సరసహృదయుల మనసును హరించునవి' యని భావము. 'ఇని' ప్రత్యయము వచ్చినప్పుడును 'ణిని' ప్రత్యయము వచ్చినప్పుడును 'హారిణౌ' అన్న రూపమే యేర్పడుచున్నది. ప్రత్యయములు భిన్నములే: అందువల్ల కలుగుచున్న అర్థములును భిన్నములే. అయినను రూపము ఒకే విధముగా నున్నది. కావుననే దీనికి ప్రత్యయశ్లేష యను పేరు చెల్లుచున్నది.

'వినాపి హారేణ' అని యనగా 'హారము లేకపోయినప్పటికి' నని యర్థము. 'హారిణౌ' అని యన్నప్పుడు 'హారము కలవి' యన్న యర్థము కలుగుచుండగా 'వినాపి హారేణ' అన్నది విరోధమును వ్యంజింపజేయుచున్నది. కావుననే విస్మయ జనకత్వ సామర్థ్యము కలుగుచున్నది ఇట్లు శబ్దాంతర సంస్ఫురణము గావించుట వల్లనే యిది సోద్భేద ప్రత్యయశ్లేషమున కుదాహరణమైనది.

ద్వితీయో యథా -

'త్వదుద్ధృతామయస్థాన
రూఢ వ్రణ కిణాకృతిః
విభాతి హారిణీభూతా
శశినో లాంఛనచ్ఛవిః' 155

అత్ర హారిణీభూతేతి చ్వేర్ఙీపశ్చ తుల్యరూపతాయాం తదుద్భేదో నాస్తీత్యనుద్భేదః ప్రత్యయశ్లేషోఽయమ్.

అర్థము : ద్వితీయమున కుదాహరణము. నీచేత దాల్పబడిన గాయముల కాయల యాకారము చంద్రలాంఛనచ్ఛవిని కలిగి హారిణీ భూతమై వెలయుచున్నది.

ఇచ్చట 'హారిణీభూతా' యని చ్విప్రత్యయముయొక్కయు ఙీప్ప్రత్యయము యొక్కయు తుల్యరూపత్వమునందు ఉద్భేదము లేదు కావున అనుద్భేద ప్రత్యయ శ్లేష యిది.

వ్యాఖ్య : ఇది కూడ ప్రత్యయశ్లేషమునకే ఉదాహరణము. 'హరిణీ' శబ్దమునకు 'తెల్లని' అని కాని 'వివర్ణమయిన' అని కాని యర్థము. హరిణ శబ్దమునకు జీప్ప్రత్యయము రాగా ఇది యేర్పడినది. 'హరిణీభూతా' అని యన్నప్పుడు 'తెల్లగా నయినది' అని కాని 'పాలిపోయినది' అని కాని యర్థము. హరిణము కాకపోయినను హరిణత్వమును పొందిన దన్న యర్థమున చ్విప్రత్యయము నొంది 'హరిణీభూతా' అన్న రూప మేర్పడినది. అర్థమునం దంతర మున్నప్పటికిని రెండింటికి నొకే రూపము కలిగినది. ఇచ్చట ప్రకృతులును భిన్నములే; ప్రత్యయములును భిన్నములే; అర్థములును భిన్నములే. అయినప్పటికిని రూప మొక్కటియే. కావుననే యిది ప్రత్యయశ్లేష కుదాహరణమైనది.

ఇందు భేదసాధకమైన శబ్దాంతరము ప్రయుక్తము కాలేదు. కావుననే యిది నిరుద్వేద ప్రత్యయశ్లేష మయినది.

[ విభక్తిశ్లేష ]

విభక్తిశ్లేషో ద్విధా - భిన్నజాతీయయోః, అభిన్న జాతీయయోశ్చ. తయో రాద్యో యథా -

'విషం నిజగలే యేన బభ్రే చ భుజగప్రభుః
దేహే యేనాంగజో దధ్రే జాయా చ స జయత్యజః' 156

అత్ర యేన విషం నిజగలే, భుజగరాజశ్చ నిజగలే బభ్రే, అంగజో దేహే, జాయా చ దధ్రే ఇతి తిఙ్ సుబ్ విభక్త్యోః లిడాత్మనే పదప్రథమపురుషైకవచన సప్తమ్యేకవచనాంతయో రేకరూపత్వాద్విభిన్నార్థకత్వా ద్భిన్నజాతీయ సుప్తిఙ్విభక్తిశ్లేషోఽయమ్.

అర్థము : విభక్తిశ్లేష రెండు విధములు. 1. భిన్నజాతీయ విభక్తిశ్లేష. 2. అభిన్నజాతీయ విభక్తిశ్లేష. అందు మొదటిదానికి ఉదాహరణము. ఎవనిచేత విషము క్రక్కబడినదో ఆ భుజగప్రభువు ఎవనిచేత స్వీయగళమునందు ధరింపబడినాడో, ఎవనిచేత అంగజుడయిన మన్మథుడు దహింపబడెనో, ఎవనిచేత భార్య దేహమునందు ధరింపబడినదో ఆ శివుడు వర్ధిల్లును గాక!

ఇచ్చట 'ఎవనిచేత విషము క్రక్కబడినదో' 'భుజగరాజు స్వీయగళమునందు ధరింపబడినాడో' 'అంగజుడు దహింపబడినాడో' 'భార్యయు ధరింపబడెనో' అని క్రియా నామవిభక్తులకును లిడాత్మనేపద ప్రథమపురుషైకవచనములకును సప్తమ్యేక వచనాంతములకును ఏకరూపత్వమువల్ల విభిన్నార్థకత్వమువల్ల ఇది భిన్నజాతీయ సుప్తిఙ్విభక్తిశ్లేష.

వ్యాఖ్య : విభక్తులు క్రియావిభక్తులని నామవిభక్తులని రెండు విధములు. క్రియావిభక్తులకు నామవిభక్తులకు ఏకరూపత్వమును సాధించుటచేత శ్లేష సిద్ధించు నెడల అది భిన్నజాతీయ విభక్తిశ్లేష యగును. అట్లు కాక కేవల క్రియావిభక్తు లకు గాని, కేవల నామ విభక్తులకు గాని యేకరూపత్వమును సాధించుటచేత శ్లేష సిద్ధించునెడల అది అభిన్నజాతీయ విభక్తిశ్లేష యగును.

ప్రకృతపద్యము భిన్నజాతీయవిభక్తిశ్లేషకు లక్ష్యము. 'నిజగలే' అనునది క్రియాపదముగను నామవాచకముగను కూడ ఉపయుక్తమయినది. 'గల్' ధాతువు; ఉపసర్గ 'ని'. దీనికి కర్మార్థమున లిట్ ప్రథమపురుషైక వచనరూపము 'నిజగలే' అని యగును. ఇది క్రియాపదము. 'క్రక్కబడినది' అని యర్థము. 'ఆత్మనః గలే' తనయొక్క గళమునందు అన్న యర్థమున సప్తమ్యేకవచనమైన నామవాచకము. అట్లే 'దేహే' యనునది 'దహ్' ధాతువునకు కర్మార్థమున లిట్ ప్రథమపురుషైక వచనరూపము. ఇది క్రియాపదము. 'దేహ' శబ్దమునకు సప్తమ్యేకవచనరూపము 'దేహే'. ఇది నామవాచకము. క్రియాపదమునకు 'దహింపబడె' నని యర్థము. నామవాచకమునకు 'దేహమునందు' అని యర్థము. మూలరూపములు భిన్నములు; విభక్తిప్రత్యయములు భిన్నములు. అయినప్పటికిని విజాతీయములయిన విభక్తుల వల్లనే ఏకరూపత్వము కలుగుటచేతను, నానార్థత్వము కలుగుటచేతను ఇది భిన్న జాతీయ విభక్తిశ్లేష కుదాహరణమైనది.

ద్వితీయో యథా -

'త్వమేవ ధాతుఃపూర్వోఽసి త్వమేవ ప్రత్యయః పరః
అనాఖ్యాతం న తే కించిన్నాథ కేనోపమీయసే' 157

అత్ర ధాతురితి ప్రథమాంతస్య షష్ఠ్యంతస్య చైకరూపత్వాద్ భిన్నార్థకత్వాచ్చాభిన్నజాతీయ సుబ్విభక్తిశ్లేషోఽయమ్.

అర్థము : ద్వితీయమున కుదాహరణము. నాథా! నీవే ధాతకంటె ముందున్నావు; నీవే పరాత్పరుడవు; ఆశ్రయింప దగినవాడవు. కొంచెముకూడ నిన్ను గురించి చెప్పబడనిది లేదు. ఎవనితో నుపమింపబడగలవు? (అనుపమానుడ వని భావము). మరొక యర్థము - నీవే ధాతువవు; పూర్వమున నుంటివి. నీవే ప్రత్యయమవు; పరమందుంటివి. ఆఖ్యాతమవు కాకపోలేదు. ఇంకెవరితో నుపమింపబడుదువు ?

ఇచ్చట 'ధాతుః' అని ప్రథమాంతముయొక్కయు, షష్ఠ్యంతముయొక్కయు ఏకరూపత్వమువల్లను భిన్నార్థకత్వమువల్లను ఇది అభిన్నజాతీయ సుబ్విభక్తిశ్లేష.

వ్యాఖ్య : విభక్తిశ్లేషయందు రెండవవిభాగమైన అభిన్నజాతీయ విభక్తిశ్లేషకిది యుదాహరణము. 'ధాతృ' శబ్దమునకు షష్ఠ్యేకవచనరూపము 'ధాతుః'; నామవాచకము. 'సృష్టికర్తయొక్క' యని యర్థము. ప్రథమైకవచనరూపము 'ధాతుః' అని యనగా క్రియాపదమందలి మూలరూప మని యర్థము. ఇదికూడ నామవాచకమే. దీనినిబట్టియే పూర్వః, ప్రత్యయః, పరః, ఆఖ్యాతమ్ - అన్న పదములకును అర్థాంతరము సిద్ధించినది. ధాతువుపైని ప్రత్యయము చేరి క్రియాపదము నేర్పరుచును. కావున క్రియాపదమునందు పూర్వస్థానికము ధాతువు, పరస్థానికము ప్రత్యయము. క్రియాపదమునకే ఆఖ్యాత మని పేరు. ఒక క్రియాపదమును మరొక క్రియాపదముతో పోల్చుటకు వీలులేదు; దేని కదియే స్వతంత్రము.

నామవిభక్తుల నాధారముగా చేసికొనియే శ్లేషను సాధించుటవల్ల ఇది సుబ్విభక్తిశ్లేష యనిపించుకొన్నది. ఇది అభిన్నజాతీయ విభక్తిశ్లేషయం దొక భాగము. ఇట్లే కేవల తిఙ్విభక్తుల నాధారముగా చేసికొనికూడ శ్లేషను సాధింపవచ్చును అట్లయినప్పుడు అభిన్నజాతీయ తిఙ్విభక్తిశ్లేష సిద్ధించును.

[ వచనశ్లేష ]

వచనశ్లేషో ద్విధా - సోద్భేదః నిరుద్భేదశ్చ. తయోః సోద్భేదో యథా -

'ప్రాజ్యప్రభావః ప్రభవో ధర్మస్యాస్తరజస్తమాః
ముక్తాత్మా సః శివం నేమి రన్యేఽపి దదతాం జినాః' 158

అత్ర నేమి రిత్యన్యేఽపీతి ఏకవచన బహువచనాభ్యాం దదతా మిత్యత్ర తిఙన్తే ప్రాజ్యప్రభావః ప్రభవ ఇత్యాదిషు చ సుబంతే ష్వేకవచన బహువచనయో రుద్భేద ఇత్యయం సోద్భేదో నామ వచనశ్లేషః.

అర్థము : వచనశ్లేష సోద్భేద మని నిరుద్భేద మని రెండు విధములు. వానియందు సోద్భేదమున కుదాహరణము. ప్రసిద్ధప్రభావుడును, ధర్మమున కాలవాలమును, పోగొట్టబడిన రజస్తమోగుణములు కలవాడును, ముక్తాత్ముడు నైన నేమియు ఇతర జినులును మనకు మంగళముల నిత్తురుగాక। అర్థాంతరము – ప్రసిద్ధ మయిన ప్రభలు కలవారును, ధర్మప్రభువులును, గత రజస్కులలో శ్రేష్ఠులును ముక్తాత్ములు నైన యితర జినులును నేమియును మీకు మంగళము నిత్తురుగాక।

ఇచ్చట 'నేమి' యని 'ఇతరులును' అని ఏకవచన బహువచనములతో 'దదతామ్' అని తిఙంతమునందును, 'ప్రాజ్యప్రభావుడు' 'ప్రభువులు' మున్నగు సుబంతముల యేకవచన బహువచనములందును ఉద్భేదమగుటచేత ఇది సోద్భేద వచనశ్లేషము.

వ్యాఖ్య : వచనము నాశ్రయించుకొని యేర్పడిన శ్లేషకు వచనశ్లేష యని పేరు. ఇది సోద్భేదవచనశ్లేష యని, నిరుద్భేదవచనశ్లేష యని రెండు విధములు. పదాంతరముచేత భిన్నార్థ స్ఫురణము కలిగినయెడల సోద్భేద మని, అట్లు కాని యెడల నిరుద్భేద మని పరిగణింపబడును.

ఉదాహరణమునందు 'ప్రాజ్యప్రభావః' మున్నగు నేకవచన విశేషణములు గలవు. 'నేమి' యన్నది కర్తృపదము, విశేష్యము. ఇది ఏకవచనమే, కాని క్రియాపదము 'దదతామ్' అని బహువచనమునం దున్నది. కర్త యేకవచనము నందును క్రియ బహువచనమునం దుండుటకు వీలుకాదు. ఇట్లగుటచేత 'అన్యే' 'ప్రభవః' మున్నగు బహువచనాంతములే ప్రాధాన్యము వహించి క్రియాపదముతో అన్వయించుచున్నవన వలయును. ఇట్లనుటకు క్రియాపదమునందలి బహుత్వమే కారణము. ఇదియే ఉద్భేద సాధకము. కావుననే యిది సోద్భేద వచనశ్లేషగా పరిగణింపబడుచున్నది.

ప్రాజ్యప్రభావుడు, ప్రభువులు, ముక్తాత్ముడు, అన్యులు – మున్నగు విధముగా ఏకవచన బహువచనరూపములు కలబోత నొందినవి. కాని క్రియాపదము

వలని స్ఫురణముబట్టి ప్రాజ్యప్రభాః, ధర్మస్య ప్రభవః, అస్తరజస్తమాః, ముక్తాత్మానః, నేమిశ్చ, అన్యేఽపి జినాశ్చ, వః, శివం, దదతామ్ – అన్న విధముగా అన్వయము నొందును. ఇదంతయు బహువచనమును కర్తగా గ్రహించి, విశేషణములను దాని కన్వయించినప్పు డుండెడి అన్వయము. 'నేమి' యే విశేష్యమైనప్పుడు ప్రాజ్యప్రభావః, ధర్మస్య ప్రభవః (జన్మస్థానము), అస్తరజస్తమాః, ముక్తాత్మా, నేమిః అని అన్వయించును. ఇట్టి విశేషములు గల నేమియు, అన్యేచ జినాః (ఇతరులయిన జినులును), నః (మనకు), శివం దదతామ్. (శుభము నిత్తురుగాక) అని అన్వయము.

ఏకరూపత్వము కలిగియున్నప్పటికిని భిన్నవచనత్వమును కలిగియుండుట వల్ల ఇది వచనశ్లేష యగుచున్నది. వాక్యగత శబ్దాంతరమువల్లనే భేదస్ఫురణము కలుగుచుండుటవల్ల ఇది సోద్భేదము.

నిరుద్భేదో యథా –

'తనుత్వరమణీ యస్య మధ్యస్య చ భుజస్య చ
అభవన్నితరాం తస్యా వలయః కాంతివృద్ధయే' 159

అత్రాభవన్నితి వలయ ఇతి పదయో స్తిఙన్త సుబంతయో రేకవచన బహువచనే అనుద్భిన్నే ఏవ శ్లిష్యేతే ఇత్యయం నిరుద్భేదో నామ వచనశ్లేషః.

**అర్థము :** నిరుద్భేదమున కుదాహరణము. ఆమెయొక్క భుజమునకు కంకణము కాంతివృద్ధిని కలిగింపకపోగా, తనుత్వరమణీయమైన ఆమె యుదరమునకు వళులు అత్యధికముగా కాంతివృద్ధి కొరకైనవి.

ఇచ్చట 'అభవన్' అని 'వలయః' అని రెండుపదములకు తిఙంతసుబంతములకు ఏకవచన బహువచనములు భేదకము లేకుండగనే శ్లేషించుచున్నవి. అందువల్ల, ఇది నిరుద్భేదవచనశ్లేష.

వ్యాఖ్య : వచనశ్లేషయందలి రెండవవిభాగము నిరుద్భేదము. శబ్దాంతరము చేత భేదమును స్ఫురింపజేయుట సోద్భేదము; అట్లు కానిది నిరుద్భేదము. ప్రకృతోదాహరణమునందు 'అభవన్' 'వలయః' అను రెండు పదములు శ్లేషకు ప్రాణభూత

ములు. 'అభవన్' అనునది భూధాతువుయొక్క లఙ్రూపము; ప్రథమపురుష బహువచనము. ఇదియే శతృక్ప్రత్యయాంతమై యేకవచనమున 'భవన్' అని యగును. దీనికి పూర్వమందున్న 'అ'వర్ణము నిషేధార్థకమైన అవ్యయము. 'వలయః' అనునది నామవాచకము; కర్తృపదము. ఏకవచనమైనపుడు పుంలింగశబ్దమై 'కంకణము' అన్న అర్థము నొసగును. అప్పుడు 'తస్యా భుజస్య వలయః కాంతివృద్ధయే అభవన్' అని అన్వయించును. ఇచ్చటి క్రియాపదము అసమాపకము, నిషేధార్థకము. 'వలయః' అనునది 'వలిః' అను శబ్దముయొక్క బహువచనరూపము. ఇప్పుడిది 'తస్యాః తనుత్వరమణీయస్య మధ్యస్య వలయః నితరాం కాంతివృద్ధయే అభవన్' అని బహువచన సమాపకక్రియతో అన్వయించును.

ఇట్లు నామవాచకము ఏకవచన బహువచనములలో ఒక్కేవిధముగా నుండి భిన్నార్థములను కలిగించుటవల్లను, క్రియాపదము ఏకవచన బహువచనములలో ఒకే విధముగానుండి భిన్నార్థములను కలిగించుటవల్లను వచనశ్లేష కుదాహరణముగా ఇది తగియున్నది. భేదసాధకముగా శబ్దాంతరము నుపయోగించుట జరుగలేదు. కావున, విరుద్ధైదవచనశ్లేషము.

[ పదశ్లేష ]

పదశ్లేషో యథా -

'అరిమేదః పలాశశ్చ బాహుః కల్పద్రుమశ్చ తే
బాలేవోద్యానమాలేయం సాలకానన శోభినీ' 160

అత్ర ప్రకృతి ప్రత్యయ విభక్తి వచనానాం పృథగభిధానాదభిధాన మాలోక్తాని ప్రాతిపదికాన్యేవ పద శబ్దేనోచ్యంతే. తేన పూర్వార్ధే శత్రుమేదో మాంసాద స్తే బాహు రిత్యర్థేనారిమేద పలాశాఖ్య వృక్షనామ్నా శ్లిష్యతే. ఉత్తరార్ధే చ సాలానాం కాననేన శోభత ఇత్యేవం శీలేయముద్యానమాలేవ ద్వ్యర్థేన సాలకేనాననేన శోభత ఇత్యేవం శీలా బాలేత్యుపమానార్థః శ్లిష్యతే. స ఏష పదశ్లేషో నామ శబ్దశ్లేషః.

అర్థము : పదశ్లేష కుదాహరణము. నీ బాహువు వెలితుమ్మ, మోదుగు, కల్పవృక్షము. అర్థాంతరము – నీ బాహువు శత్రువుల మేదో మాంసములను తినును;

(అర్థాలకు) కల్పద్రుమము. ఈ యుద్యానవనమాల నలకాననమును కలిగి అలకలు గల ఆననముతో నున్న బాలవలె శోభించుచున్నది.

ఇచ్చట ప్రకృతి ప్రత్యయ విభక్తివచనములను వేరుగా పరిగణించుటవల్ల అభిధానమాలయందు చెప్పబడిన ప్రాతిపదికలు మాత్రమే పదశబ్దముచేత చెప్పబడు చున్నవి. అందుచేత పూర్వార్ధమందు 'నీబాహంవు శత్రుమేదోమాంసాశి' అన్న యర్థములందు అరిమేద పలాశాఖ్య వృక్షనామములు శ్లేషింపబడుచున్నవి. ఉత్త రార్ధమందు 'సాలములయొక్క కాననముచేత శోభించుచున్నది' అని యీ విధమైన లక్షణముగల ఉద్యానమాలవలె రెండవయర్థముచేత 'అలకలుగల ఆననముచేత శోభించుచున్నది' అని ఈ విధమైన శీలముగల బాలయని ఉపమానార్థము శ్లేషింప బడుచున్నది. ఇది పదశ్లేష యనుపేరు గల శబ్దశ్లేష.

వ్యాఖ్య : 'సుప్తిఙంతం పదమ్' అని నిర్వచనము. నామధాతువుపై నామ ప్రత్యయము చేరగా నేర్పడునది నామపదము. క్రియాధాతువుపై క్రియాప్రత్యయము చేరగా నేర్పడునది క్రియాపదము. ఇంతకుముందే ప్రకృతి, ప్రత్యయము, విభక్తి, వచనము – అన్న అంశముల నాధారముగా చేసికొని శ్లేషభేదములను వివరించి లక్ష్యములను ప్రదర్శించియుండుటచేత భోజదేవుడు 'ప్రకృతి ప్రత్యయాత్మకము పదము' అన్న నిర్వచనమునుబట్టి కాక నిఘంటువులయందు స్పష్టముగా ప్రదర్శింప బడిన పదములనే పదములుగా వ్యవహరించుచున్నట్లు వివరించియున్నాడు. దీనిని బట్టి యిచ్చట సిద్ధమైయున్న పదరూపమునే యథాతథముగా గ్రహించుచున్నాడని, అంగాంగ విభాగమునకు అనుమతించుటలేదని స్పష్టము.

శ్లోకపూర్వార్ధమున నొక యుదాహరణమును, ఉత్తరార్ధమున మరొక యుదా హరణమును నిబద్ధము లయినవి. నీ బాహంవు అరిమేదము (వెలితుమ్మ); పలాశము (మోదుగు); కల్పవృక్షము. చివరి కల్పవృక్షశబ్దమునుబట్టి మొదటనున్న రెండుశబ్దము లను వృక్షవాచకములుగానే గ్రహింపవలయు ననిపించును. నిఘంటువులందు ఆ పద ములు వృక్షవాచకములుగా ప్రసిద్ధములు. రాజప్రశంసకై ఒక చాటుకారుడు చెప్పిన వాక్యమిది. కావున, కేవల వృక్షనామములను గుదిగ్రుచ్చుట అపేక్షితముకాదు. పైకి ఒక యర్థమునుబట్టి అట్లు తోచుచున్నట్లు చేసినను, అర్థాంతరమువల్ల ప్రశంస చేయవలయును. 'అరిమేదః పలాశః తే బాహుః' అని అన్వయము. 'శత్రువుల యొక్క క్రొవ్వును, మాంసములు తినునది నీ భుజము' అని యర్థము. 'శత్రు

మాన ప్రాణహరణ భయంకరమైనది' అని భావము. మిత్రుల విషయమునందు కల్పద్రుమమువంటిది; అడిగిన కోరికల నన్నింటివి తీర్చునదని భావము. రణ కౌశలమును వితరణకౌశలమును ప్రశస్తములయినవి.

ఇంక రెండవ యుదాహరణము. ఉద్యానముల సమూహము బాలికతో పోల్చ బడినది. ఉపమానోపమేయములకు సమానధర్మము సాలకానన శోభాధారణము. బాల (స+అలక+ఆనవ) ముంగురులతో కూడిన ముఖముతో శోభించుచున్నది. ఉద్యానమాల (సాల+కానన) సాలవృక్షముల కాననముతో శోభించుచున్నది.

ఇట్లు పదములను శ్లేషించుటవల్ల ఇది పదశ్లేష కుదాహరణమైనది.

వర్ణశ్లేషో౽పి పదశ్లేష ఏవ స యథా—

'త్వమేవ దేవ పాతాల మాశానాం త్వం నిబంధనమ్
త్వం చామరమరుద్భూమి రేకో లోకత్రయాత్మకః' 161

అత్ర త్వమేవ పాతాల మిత్యకారః పాశ్చాత్యే, త్వం చ అమరమరుద్ భూమి రితి చకారః పౌరస్త్యే౽క్తే శ్లిష్టః పాతాలం చామరే ఇతి చ పదం రచయతి. సో౽యం పదశ్లేష ఏవ వర్ణశ్లేష ఇత్యుచ్యతే.

అర్థము : వర్ణశ్లేషకూడ పదశ్లేషయే. దాని కుదాహరణము. దేవా! నీవే పాతాళమవు; నీవే దిక్కులను ముడివేయువాడవు (మర్త్యలోకమవు); మరి నీవు అమరులైన దేవతలలోకమవు; లోకత్రయాత్మకుడవైన యొక్కడవు.

ఇచ్చట 'త్వమేవపాతాలమ్' అని అకారము వెనుకటిదానియందు 'త్వం చ అమరమరుద్భూమిః' అని చకారము ముందరి యక్షరముతోను కూడినవై పాతాల చామర పదములను ఏర్పరుచుచున్నవి. ఈ పదశ్లేషయే వర్ణశ్లేషయని పిలువబడు చున్నది.

వ్యాఖ్య : పదశ్లేషమునం దంతర్భాగమే వర్ణశ్లేషము. పదము సముదాయ రూపము; వర్ణము అవయవరూపము. అవయవభేదమువల్ల సముదాయభేదము సంభ

వించును. అనగా వర్ణభేదముచేత పదభేదము సంభవించునని భావము. కావుననే వర్ణశ్లేషను వేరుగా పరిగణింపక పదశ్లేషయందే అంతర్భవింపజేయుట జరిగినది.

ఉదాహరణ పద్యమునందు ప్రసక్తవిషయము రాజప్రశంస. ఒక కవి 'దేవా! నీవే పాతాళమవు, నీవే మర్త్యలోకమవు, నీవే అమరలోకమవు. నీవు మూడులోకముల కేకరూపుడవు' అని ప్రభువును ప్రశంసించెను. పాతాళాది పదములచేత ప్రకర్ష వెల్లడి కాదు. అందువల్ల అర్థాంతరము నన్వేషింపవలయును.

'త్వం అలం పాతా' అని యన్నప్పుడు 'నీవు సమర్థుడవైన రక్షకుడవు' అన్న యర్థము కలుగును. పదముల క్రమమును మార్చి 'అలం'లోని అత్వమును 'పాతా' అను పదము తుదిఅకారమునకు సంధింపగా 'పాతాలం' అని యేర్పడినది. అట్లే 'చామరమరుద్భూమిః' అనుచోట నున్న తొలి చవర్ణమును సముచ్చయార్థకముగా విడదీయగా 'అమరమరుద్భూమిః' అని యేర్పడినది. అనగా సముచ్చయార్థకావ్యయమైన చవర్ణము మీదియచ్చుతో కలిసినదన్నమాట! ఇట్లు ఒకవర్ణము కలియుటయో, ఒక వర్ణము విడుటయో జరుగుటచేత వచ్చిన శ్లేష యగుటవల్లనే యిది వర్ణశ్లేష యగుచున్నది.

'దేవా! నీవే సమర్థుడవైన రక్షకుడవు ఆశలను (మనోరథములను) పూరించువాడవు, చామరములనుండి వచ్చు చల్లనిగాలివలె హాయికి జన్మస్థానమవు. నీవొక్కడవేయైనను ముజ్జగములకు ఆత్మవంటివాడవు' అని అర్థాంతరము.

[ భా షా శ్లే ష ]

భాషాశ్లేషో యథా-

'కురు లాలన భూలేహే
మహిమోహాహారే తుహారి విచ్ఛిన్నే
హారిణారిసార దేహే
వరే వరం హార ఉమే భావమ్'* 162

---

* ప్రాకృత పద్యమైనపుడు సంస్కృత చ్ఛాయ – కుటిలాలనభ్రూలేఖే। మహిమోహగృహే తవహారి విచ్ఛిన్నే। హారిణారీసార్ధదేహే। వరే వరం హారతుష్టే భావమ్।

అత్ర-

'ధ్యానానీతాం చ రుద్రాణీం కాంతాం చ పురతఃస్థితామ్
రణేచ్ఛుః కశ్చిదానర్చ దివ్యప్రాకృతయా గిరా' 163

తత్ర రుద్రాణీపక్షే॥ హే ఉమే, హారే భవే వరం శ్రేష్ఠం భావం కురు కిం భూతే? లాలసభూలేహే లాలసభూః కామ స్తం లేఢి య స్తస్మిన్. తథా మహిమ్నా ప్రభావేణోహం వితర్క మపహరతి య స్తస్మిన్ మహిమోహాహారే మహేశ్వర సన్నిధా హి సర్వజ్ఞానాభి భవ ఇతి శ్రూయతే. అతఏవ తోహాంతః అర్దయంతి తుహా అరయ స్తైర్విచ్ఛిన్నే విరహితే. అపర మప్యరీణాం విచ్ఛేదకారణ మాహ హారిణారిసారదేహే హారిణారిః సింహ స్తస్య సారోబలం స దేహో యస్య తస్మిన్. వరే పరిణేతరీతి. ఉమాయా ఏవ ఇమాని సంబోధన విశేషణాని. కాంతాపక్షేతు॥ హే కాంతే, తవ యోఽయం హరి నార్యాః శ్రియాః సార ఉత్కృష్టోదేహ స్తత్ర యద్వరం శ్రేష్ఠం విలో చనానన స్తనజఘనాది తస్మై భావ మభిలాషం హరతు. కామాన్ పూరయత్విత్యర్థః. కిం భూతే దేహే? కుటిలాలస భ్రూలేఖే మహి మోహాహారే గృహే హారిణి విచ్ఛిన్నే చ తనుమధ్యత్వాదిభి రితి.

అర్థము : భాషాశ్లేష కుదాహరణము. [సంస్కృతభాషయైనప్పుడు] ఓ పార్వతీ! మన్మథుని నశింపజేసినవాడును, మహిమచేత తర్కమును నశింపజేయు వాడును (నిశ్చయజ్ఞానము గలిగించువాడని భావము), బాధించు శత్రువులకు విచ్ఛేద కుడును, హరిణశత్రువైన సింహముయొక్క బలమువంటి బలముగల శరీరముగల వాడును, నీభర్తయునైన హరునియందు నీశ్రేష్ఠభావమును నిల్పుము. [ప్రాకృత భాషయైనప్పుడు] ఓ కాంతా! కుంతలములు పొరాడు భ్రూసౌందర్యము గలిగి, భూ జనములకు మోహగృహమై, మనోహరముగా విప్పారిన అంగములను గలిగి, విష్ణునిభార్యయైన లక్ష్మీదేవివలె శోభించుచున్న దేహమునందలి శ్రేష్ఠమైనయంగము నా అభిలాషమును హరించును గాక! (ఆయా యంగముల సౌందర్యముచేత ఆకర్షింప కొనవలయు నని భావము)

ఇచ్చట ధ్యానాసీతయై ముందర నిలిచియున్న రుద్రాణిని రణేచ్ఛువొక్కడు దివ్యభాషతో అర్చించెను. ధ్యానమగ్నయై ముందరనున్న యువతి నొకానొకడు ప్రాకృతభాషతో అర్థించెను.

అక్కడ రుద్రాణీపక్షమునందు - హే ఉమే = ఓ ఉమా, హరే = ఈశ్వరుని యందు, వరం = శ్రేష్ఠమైన, భావంతురు = భావమును నిల్పుము. కింభూతే—ఎటువంటి వానియందు, లాలసభూలేహే లాలసభూః = మన్మథుడు, తం లేఢి యంః = అతని నెవ్వడు నాకివేసెనో, తస్మిన్ = అతనియందు (కామాంతకుని యందు అనిభావము). అహ్లీ, మహిమ్నా = ప్రభావముచేత, ఊహం = వితర్కమును, అపహరతి యః = ఎవడు అపహరించునో, తస్మిన్ = వానియందు, మహిమోహహరునియందు, మహేశ్వర సన్నిధియందు సర్వజ్ఞానాభిభవ మగునని చెప్పుదురుకదా! అందువల్ల, తోహంతి = బాధించువారు, తుహః, అరయః = శత్రువులు, వారిచేత, విచ్ఛిన్నే = విరహితుడైనవానియందు (శత్రుపీడలేనివానియందు), అరివిచ్ఛేదకారణము మరొకటి కూడ చెప్పుచున్నాడు. హరిణారి సారదేహే, హరిణారిః = సింహము, తస్య సారః = దానియొక్క బలము, దేహే యస్య = ఎవని దేహమునందున్నదో, తస్మిన్ = అతనియందు, వరే = పరిణయముచేసికొన్న భర్తయందు. ఉమకైనను పై సంబోధన విశేషణము లన్వయించును. [ఇంతవరకు నిది సంస్కృతభాషాశ్లోకమునకు వివరణము].

ఇంక కాంతాపక్షమునందు — హే కాంతే = ఓ కాంతా; తవ = నీయొక్క, యో ఽయం, హరిణార్యాః = లక్ష్మీదేవియొక్క, సార = ఉత్కృష్టమైన, దేహః = శరీరము, తత్ర = ఆ శరీరమునందు, యద్వరం = ఏది శ్రేష్ఠమో, విలోచనానన జఘనాది = కన్నులు, ముఖము, నడుము మొదలయినది, తత్ = అది, మే = నాయొక్క, అభిలాషం హరతు = కోరికను హరించునుగాక; కామములను నింపును గాక యని యర్థము. ఎటువంటి దేహమునందు? కుటిలాలస భ్రూలేఖే = వంకర కలిగి అలసమైన కనుబొమల వుంపుగలదానియందు, మహిమోహహరే, గృహే = భూ జనులను మోహముతో హరించు గృహమునందు, హారిణి = మనోహరమైనదానియందు, విచ్ఛిన్నేచ = విస్ఫారమైనదానియందును, తను మధ్యత్వాదిభిః = శరీరమధ్యత్వము (నడుము) మొదలయినవానిచేత, ఇతి = అని. (ఈవిధముగా అన్వయించునని భావము). [ఇంతవరకు నిది ప్రాకృతభాషా పద్యమునకు వివరణము.]

వ్యాఖ్య : భాషాశ్లేష యనగా ఒక్కవాక్యముగాని వాక్యసముదాయముగాని ఒకభాషలో నొక యర్థమును, మరొకభాషలో మరొకయర్థము నిచ్చుట యని యర్థము.

ఉదాహరణశ్లోకము సంస్కృతభాషలో నున్నది. అప్పు డది ఒక రణేచ్ఛ నైన భక్తుడు రుద్రాణికిచేయు స్తోత్రము భోజదేవుడే ప్రతిపద వివరణమును ప్రదర్శించియున్నాడు. అదే శ్లోకమును ఒక్క యక్షరమునందైనను మార్పులేకుండ ప్రాకృతభాషాగ్రథితముగా గ్రహింపవచ్చును. అట్లయినప్పుడు ప్రియుడు ప్రియురాలి సౌందర్యమును పొగడి వేడుకొనుట విషయము. దీనిని కూడ మూలరచయితయే వివరించియున్నాడు.

ఉమే! లాలసభూలేహే మహిమోహహరే తుహరి విచ్ఛిన్నే హరిణారి సార దేహే వరే హరే వరం భావం కురు—అని సంస్కృత పద్యమునకు ఖండాన్వయము.

ప్రాకృతమునందు 'కురులాలస భూలేహే' అని యన్నప్పుడు 'కుటిలాలస భ్రూలేఖే' యని సంస్కృతచ్ఛాయ. 'కుటిల' శబ్దము ప్రాకృతమునందు 'కురుల' అనియైనది. 'భ్రూలేఖే' అన్న సంస్కృతరూపము రేఫమును గోల్పోయి, ఖస్థాన మున హవర్ణము నొందినది 'మహిమోహగృహే' అన్న సంస్కృతసమాసములోని చివరియంగము 'హరే' యని మార్పునొందినది. 'తవ' అనుదానికి 'తు' ప్రాకృత రూపము. 'హరినారీ' యన్న సంస్కృతరూపము ణత్వము నొంది ప్రాకృతమయి నది. 'హరతు' అన్న సంస్కృతరూపములోని 'తు' లోని వ్యంజనవర్ణము లోపము నొందగా 'హరఉ' అని ప్రాకృతమైనది. ఈ మార్పు లన్నియు నుండుటచేతనే యిది మహారాష్ట్రీ ప్రాకృతమైనది.

కురులాలసభూదేహే మహిమోహహరే తు హరివిచ్ఛిన్నే వరే హరిణారిసార దేహే వరం మే భావం హరఉ – అని ప్రాకృత పద్యమునకు ఖండాన్వయము.

ఇట్లు ఒకేవాక్యము (పద్యము) రెండు భాషలందును సమానముగా వ్యవహ రించి భిన్నార్థములను తెల్పుటచేతనే యిది భాషాశ్లేషయన్న శబ్దాలంకార భేదమున కుదాహరణమైనది.

యథా వా—

'రుచిరంజితారి హేతిం
జననమితం సామకాయ మకలంకమ్
సంత మమితం చ మానయ
కమలాసన మభి విరాజంతమ్'* 164

'భూతసంస్కృతభాషాభ్యాం ద్విర్నమస్కృత్య మాధవమ్
జగామ సమరం కోఽపి కస్య శ్రీయసి తృప్తయః' 165

తత్ర భూతభాషాయాం యథా - రుచిరం మనోహరం జితారిహేతిం భగ్నసపత్నాయుధం జనై ర్నమితం శ్యామకాయ మకలంకం శాంతం శాంతరూపం అమిత మనంతమ్ చః సముచ్చయే. కమలాసనం బ్రహ్మణ మభిలక్షీకృత్య విరాజంతం శోభమానం మానయ పూజయేతి.

సంస్కృతభాషాయాం యథా - రుచిభీ రంజితా అరిహేతయ శ్చక్రదీప్తయో యేన తమ్, జనసై ర్ధశభి రవతారై ర్మితం పరిచ్ఛిన్నం, సామాని కాయతి గాయతి యః స సామకాయ స్తమ్, న విద్యతే కలా యస్య సోఽకల స్తమ్, కం సంతం బ్రహ్మణం అం విష్ణుమితం గతమ్, అభివిరాజం గరుత్మంతమభి తం ప్రసిద్ధం కమలాసనం శ్రియాసంసక్తం మా మాం నయ ప్రాపయేతి.

అర్థము : మరొక యుదాహరణము. [భూతభాషగా గ్రహించినప్పుడు] మనోహరుడును, ఓడింపబడిన శత్రుశస్త్రములను గలవాడును, జనులచేత నమస్క-

---

* భూతభాషా పద్యమునకు సంస్కృతచ్ఛాయ –

రుచిరం జితారిహేతిం । జన నమితం శ్యామకాయ మకలంకమ్।
శాంత మమితం చ మానయ । కమలాసనమభి విరాజంతమ్॥

రింపబడువాడును, నీలదేహుడును, కళంకరహితుడును, శాంతుడును, కమలాసనా సీనుడైన బ్రహ్మ నభిలక్షించుచు విరాజిల్లుచున్నవాడునైన అనంతుని నర్చింపుము. [సంస్కృతభాషగా గ్రహించినప్పుడు] కాంతులచేత రంజితములైన చక్రాంచలములు గలవాడును, జన్మలకు మితి గలవాడును (దశావతారములు దాల్చినవాడని భావము), సామములను గానముచేయువాడును, నిష్కలుడును (పరిపూర్ణుడని భావము), అస్తిత్వము గలవాడును, బ్రహ్మను పొందినవాడును (బ్రహ్మకు జనకుడని భావము), లక్ష్మీదేవికి సన్నిహితుడును, పక్షిరాజయిన గరుడు నధిష్ఠించువాడును, అకారనామదైన విష్ణువును నన్ను చేర్పుము. (విష్ణునియందు చేర్పు మనిభావము).

భూత సంస్కృతభాషలు రెండింటియందు మాధవునికి రెండుమారులు నమస్కరించి ఒకానొకడు సమరమునకు వెళ్ళెను. శ్రేయస్సునందు ఎవనికి తృప్తి కలుగును ? (నమస్కారముచేత శ్రేయస్సు చేకూరును. దాని కింతమాత్రమే యని అవధిలేదు. కావుననే భక్తుడు లభించిన శ్రేయస్సుతో తృప్తినొందక మరింత యధికముగా నభిలషించును. కావుననే రెండు మారులు నమస్కరించె నని తాత్పర్యము.)

అందు భూతభాషయందలి పద్యమున కన్వయక్రమము – రుచిరం=మనోజ్ఞమైనవానిని, జితారిహేతిం = జయింపబడిన శత్రువుల శస్త్రములుగలవానిని, జననమితం=జనులచేత నమస్కరింపబడినవానిని, శ్యామకాయమ్=నీలవర్ణ శరీరముగలవానిని, అకలంకం=కళంక రహితుని, శాంతం=శాంతరూపుని, అమితం=మితిలేనివానిని, చవర్ణము సముచ్చయార్థకము, కమలాసనం=బ్రహ్మను, అభిలక్షీకృత్య=లక్ష్యముగా చేసికొని, విరాజంతం=శోభించుచున్నవానిని, మానయ = పూజింపుము, ఇతి=ఈవిధముగా అన్వయము.

సంస్కృత భాషయందలి పద్యమున కన్వయక్రమము. రుచిరంజితాః= కాంతులచేత రంజితములయిన, అరిహేతయః = చక్రముయొక్క దీప్తులు, యేన తమ్=ఎవ్వనిచేతనో వానిని, రుచిరంజితారిహేతిం, జననైః దశభిః = పది జన్మల (అవతారముల) చేత, మితం = పరిచ్ఛిన్నుడగునవానిని, సామాని = సామవేద మంత్రములను, కాయతి=గాయతి=పాడుచున్నవాడు, యః=ఎవ్వడో, సః=అతడు, సామకాయః, తమ్=అతనిని, న విద్యతే కలా యస్య=ఎవనికి కళ (విభాగము) లేదో, సః = అతడు, అకలః=నిష్కలుడు, తమ్=అతనిని, కం=బ్రహ్మను,

ఇతమ్=పొందిన వానిని, సంతమ్=అస్వేత్వము గలవానిని, అం=విష్ణువును, అఖి విరాజం=పక్షిరాజయిన గరుత్మంతుని యందున్న వానిని, తం=ప్రసిద్ధుని, కమలా సనం=లక్ష్మీదేవితో సంసక్తుడైన వానిని, మా=నన్ను, నయ=నడిపింపుము. ఇతి= అని యీ విధముగా అన్వయము.

వ్యాఖ్య : భూతభాష యనగా పైశాచీ భాషయని యర్థము. అది ఆరు ప్రాకృతములలో నొకటి. ఒకే పద్యము ఒక విధముగా అన్వయించినప్పుడు పైశాచీ భాషాపద్యముగను మరొక విధముగా అన్వయించినప్పుడు సంస్కృత భాషాపద్యము గను ప్రవర్తించును. ఇట్లగుటచేతనే యిది భాషాశ్లేషకు లక్ష్యమైనది.

మూలరచయితయే మొదట భూతభాషా పద్యముగాను, పిదప సంస్కృత భాషా పద్యముగాను విశదముగా వివరించి ప్రదర్శించియున్నాడు.

భూత భాషయందు – రుచిరం జితారిహేతిం జన నమితం సామకాయం అక లంకం సంతం అమితంచ కమలాసన మఖి విరాజంతం మానయ, అని ఖండా న్వయము.

సంస్కృత భాషయందు – రుచిరంజితారిహేతిం జననమితం సామకాయం అకలం అం సంతం కం ఇతం కమలాసనం చ అఖివిరాజం తం మా (మాం) నయ, అని ఖండాన్వయము.

పైశాచికమునందు సంస్కృతమునందలి శ వర్ణము స వర్ణముగా మారినది. కొన్నియెడల దీర్ఘము హ్రస్వమయినది. శ్యామకాయం – సామకాయం; శాంతం – సంతం; ఈ మార్పులే దీనిని భూతభాషా పద్యముగా ప్రతిష్ఠించుచున్నవి.

ఒకే పద్యము భిన్న భాషలలో భిన్న విధములుగా అన్వయించి భిన్నార్థ దాయకమగుట యిచ్చట కలదు. కావుననే యిది భాషాశ్లేష యన్న శబ్దాలంకారమున కుదాహరణమైనది.

## అనుప్రాసాలంకారము

70. అవృత్తిర్యాతు వర్ణానాం నాతిదూరాంతరస్థితా
అలంకారః స విద్వద్భి రనుప్రాసః ప్రదర్శ్యతే.

అర్థము : వర్ణములకు మిక్కిలి దూర వ్యవధానము లేకుండ ఆవృత్తి యున్న యెడల, అది పండితులచే అనుప్రాసాలంకారముగా ప్రదర్శింపబడు చున్నది.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో పదునైదవది అనుప్రాసము. ఒక వర్ణము గాని, అనేక వర్ణములు గాని దగ్గర దగ్గరగా పునరుక్తిని పొందినయెడల అనుప్రాసాలంకార మగును. దగ్గర దగ్గరగా ననుటచే వెనువెంటనే అని యర్థము కాదు, పునరుక్తములైన వర్ణముల నడుమ నెడమున్నప్పుడే తదావృత్తి ఆకర్షణీయముగా నుండును. వర్ణముల నడుమ వ్యవధానము మరింత యెక్కువైన యెడల ఆవృత్తి యున్నట్లే శ్రోతకు స్ఫూర్తము కాదు. కావుననే లక్షణ వాక్యమునందు 'నాతిదూరాంతరస్థితా' యని యనుట ఆవశ్యకమయినది.

యమకమునందు వర్ణగుచ్ఛమున కావృత్తి కలుగును; తొలిగుచ్ఛము కంటె ఆవృత్తగుచ్ఛము భిన్నార్థకమై యుండును. అనుప్రాసమునందు ఒక వర్ణము పునరుక్తము కావచ్చును; అనేక వర్ణములు వేరువేరుగా పునరుక్తము కావచ్చును. వర్ణము నాశ్రయించి యుండుటచేత అర్థప్రసక్తి కిచ్చట అవకాశమే లేదు. అనుప్రాసమందలి ఆవృత్తి యమకమందలి ఆవృత్తికంటె భిన్నమన్నది స్పష్టము.

ఆవృత్తిచేత పూర్వజాతి ప్రతిబింబనము కలిగి బంధగతమైన సౌందర్యము సంపన్న మగుచున్నది. కావున, దీనిని శబ్దాలంకారముగా పరిగణించుట జరిగినది.

71. శ్రుతిభి ర్వృత్తిభి ర్వర్ణైః పదై ర్నామద్విరుక్తిభిః

లాటానా ముక్తిభిశ్చాయం షట్ప్రకారః ప్రకాశతే.

అర్థము : శ్రుతుల చేతను, వృత్తుల చేతను, వర్ణముల చేతను, పదముల చేతను, నామద్విరుక్తుల చేతను, లాటదేశీయుల మాటలచేతను ఆరు విధములుగా ఇది ప్రకాశించుచున్నది.

వ్యాఖ్య : అనుప్రాసము ఆయా విశేషములచేత 1. శ్రుత్యనుప్రాసము 2. వృత్త్యనుప్రాసము 3. వర్ణానుప్రాసము 4. పదానుప్రాసము 5. నామానుప్రాసము 6. లాటానుప్రాసము — అని ఆరు విధములగుచున్నది.

[ శ్రుత్యనుప్రాసము ]

72. ప్రాయేణ శ్రుత్యనుప్రాస స్తేష్వనుప్రాసనాయకః
సనాథైవ హి వైదర్భీ భాతి తేన విచిత్రతా.

73. నివేశయతి వాగ్దేవీ ప్రతిభానవతః కవేః
పుణ్యై రముమనుప్రాసం ససమాధిని చేతసి.

**అర్థము** : తరుచుగా శ్రుత్యనుప్రాసమే అనుప్రాసనాయక మగుచున్నది. వైదర్భీ రీతి దీనిచేతనే సనాథ యగుచున్నది, దీనిచేతనే విచిత్రత భాసించుచున్నది. వాగ్దేవియైన సరస్వతి ప్రతిభావంతుడైన కవియొక్క పుణ్యములచేత, ఆతని సమాధి నివిష్టమైన మనస్సునందు అనుప్రాసమును నివేశింపజేయును.

వ్యాఖ్య : పైని చెప్పిన ఆరువిధములయిన అనుప్రాసములలోను శ్రుత్యను ప్రాసమే నాయకస్థానము నొందుచున్నది. శ్రుత్యనుప్రాసమువల్ల వైదర్భీ రీతికి శోభ కలుగుచున్నది. విచిత్రత యనగా విశిష్టమైన చిత్తరంజకత్వ మని యర్థము. కావున, శ్రుత్యనుప్రాసము స్వభావమునుబట్టి శబ్దమును మాత్రమే అలంకరింపవలసి యున్నను, తదతిరిక్తముగా కూడ ప్రవర్తించి రీతి సౌందర్యమును సమకూర్చునని, మనస్సున కాహ్లాదక మగునని చెప్పుటచేత రసపోషక మగునని చెప్పినట్లే యైనది. దీనిని బట్టి శబ్దాలంకారమైన అనుప్రాసము కేవల శ్రవణ సుఖమునే కాక రసపరి పోషకత్వమును కూడ లక్ష్యముగా పెట్టుకొనవలయునని భంగ్యంతరముగా గ్రంథ కర్త సూచన చేయుచున్నాడు. తరువాతి శ్లోకము దానిని బలపరుచుటకే ప్రసక్త మయినది. అనుప్రాసము పృథక్ప్రయత్న సాధ్యముకాదని, వాగ్దేవియే ప్రతిభావంతుడైన కవి యొక్క సమాధి నిష్ఠమైన మనస్సునందు అనుప్రాసమును ప్రవేశపెట్టునని యనుటచేత అనుప్రాసప్రాధాన్యము అభివ్యక్తమగుచున్నది. అనుప్రాసాదులు చిత్రకవితార్హములని, ఉత్తమకోటికి చెందినవి కావని నిరసించువారికి సమాధానముగానే యీ శ్లోకము ప్రసక్తమయినది.

స త్రిధా - గ్రామ్యః, నాగరః, ఉపనాగరశ్చ. తేషు గ్రామ్యశ్చతుర్ధా - మసృణః, వర్ణమసృణః, వర్ణోత్కటః, వర్ణానుత్కటశ్చ.

అర్థము : శ్రుత్యనుప్రాసము గ్రామ్యము, నాగరము, ఉపనాగరము_ అని మూడు విధములు. వానిలో గ్రామ్యము మసృణము, వర్ణమసృణము, వర్ణోత్కటము, వర్ణానుత్కటము _ అని నాలుగు విధములు.

తేషాం మసృణో యథా -

'ఏష రాజా యదాలక్ష్మీం ప్రాప్తవాన్ బ్రాహ్మణ ప్రియః
తదా ప్రభృతి ధర్మస్య లోకేఽస్మిన్నుత్సవోఽభవత్' 166.

అత్ర స్థానతః సమానశ్రుతీనాం మూర్ధన్య తాలవ్య దంత్యౌష్ఠ్య కంఠ్యవర్ణానాం ప్రథమ తృతీయ పాదయో ర్నిరంతరా ద్వితీయ చతుర్థయోశ్చ సాంతరా పట ఇవ స్రగ్దామ్నీవ వా వర్ణ ప్రదానాన్మసృణైవావృత్తిః. సోఽయం శ్రుత్యనుప్రాసో మసృణ ఇత్యుచ్యతే.

అర్థము : వానియందు మసృణమున కుదాహరణము బ్రాహ్మణ ప్రియుడైన యీ రాజు ఎప్పుడు లక్ష్మిని పొందెనో అప్పటి నుండి యీ లోకమునందు ధర్మమున కుత్సవము కలిగెను.

ఇచ్చట స్థానమునుబట్టి సమానోచ్చారణముగల మూర్ధన్యతాలవ్య దంత్యోష్ఠ్య కంఠ్య వర్ణములకు ప్రథమ తృతీయ పాదముల యందు వస్త్రమునందువలె వర్ణప్రదానము చేయుటవల్ల నిరంతరమైన మసృణావృత్తి; ద్వితీయ చతుర్థపాదముల యందు పూలమాలలో వలె వర్ణప్రదానము చేయుటవల్ల సాంతరమైన మసృణావృత్తి; ఇది మసృణమయిన శ్రుత్యనుప్రాసముగా చెప్పబడుచున్నది.

వ్యాఖ్య : ఆవృత్తి వర్ణమాత్ర గోచర, సముదాయ గోచర - అని రెండు విధములు. అందు మొదటిది సమానత్వమును బట్టి, సదృశత్వమును బట్టి మరల రెండు విధములు. సామాన్య వర్ణమాత్రగోచర మరల స్థానమునుబట్టి వ్యాపారమును బట్టి రెండు విధములుగా వింగడింపబడును.

స్థానమనగా వర్ణోత్పత్తి స్థానమనియే యర్థము. కంఠ్యములు - అ ఆ క ఖ గ ఘ ఙ హ ః; తాలవ్యములు - ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ; మూర్ధన్యములు- ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష; దంత్యములు - ఌ ౡ త థ ద ధ న ల స; ఓష్ఠ్యములు - ఉ ఊ ప ఫ బ భ మ ; అనునాసికములు - ఙ ఞ ణ న మ; కంఠ

తాలవ్యములు - ఏ ఐ; కంఠోష్ఠ్యములు - ఓ ఔ; దంతోష్ఠ్యము - వ; ఇట్లు చెప్పి కొనిన ఏకస్థాన జన్యత్వమునకే శ్రుతి యని పేరు. అనగా కంఠ్యము లన్నియు ఉత్పత్తి స్థానమునుబట్టి ఒక్కే శ్రుతి కలవిగా పరిగణింపబడునని అర్థము. అట్లే ఆయా వర్గములలోని వర్ణములకు శ్రుతి సమానత్వము చెల్లును. కావుననే ఒక వర్గములోని భిన్నవర్ణము లావృత్తము లైనప్పటికిని దానిని శ్రుత్యనుప్రాసముగా పరిగణింతురు.

శ్రుత్యనుప్రాసము గ్రామ్యము, నాగరము, ఉపనాగరము-అని మరల మూడు విధములు. అతి ప్రసిద్ధత్వమే గ్రామ్యత్వము. సర్వజన సామాన్యమై మిక్కిలి వాడుక యందుండుటయే గ్రామ్యముయొక్క లక్షణము.

ఈ గ్రామ్యము కూడ మసృణము, వర్ణమసృణము, వర్ణోత్కటము, వర్ణానుత్కటము - అని నాలుగు విధములు.

'ఏక పద ప్రతిభాస మాత్రానుమేయో మసృణః' అని లక్షణము. మసృణత్వ మనగా మృదుత్వమని యర్థము; ఒక పదమునందు ప్రతిభాసించుట చేతనే ఊహింప దగినది మసృణము.

ప్రకృతోదాహరణమునందు మసృణమైన శ్రుత్యనుప్రాసము కలదు. ప్రథమ పాదమునందు ష, ర వర్ణములు నిరంతరముగా ప్రయుక్తములు ఇవి మూర్ధన్యములు. జ, య వర్ణములు తాలవ్యములు. ద, ల వర్ణములు దంత్యములు. మూడవ పాద మునందు త, ద వర్ణములు అవ్యవహితములు, ఇవి దంత్యములు. ప, భ వర్ణములు ఓష్ఠ్యములు; వానితో సంయుక్తములైయున్న ర ఋ వర్ణములు మూర్ధన్యములు. త ధ వర్ణములు దంత్యములు. నవర్ణము దంత్యము. ఇట్లు ప్రథమ తృతీయపాదము లందు మూర్ధన్యాదులు అవ్యవహితములై ప్రయుక్తములయినవి. అనగా ఇవి నిరంత రములై వస్త్రమునందు పడుగు, పేక యున్నట్లుగా నున్నవన్నమాట. కావుననే యిది నిరంతర మసృణరూపమయిన శ్రుత్యనుప్రాసమున కుదాహరణ మగుచున్నది.

ద్వితీయపాదమునందు ప, వ, బ, మ వర్ణములు ప్రయుక్తములు. ఇవి ఓష్ఠ్య ములు. త, న వర్ణములు దంత్యములు. ర వర్ణము పునఃపునరుక్తము; మూర్ధన్యము. చతుర్థపాదమునందు ల, స, ?, త, ఎ వర్ణములు దంత్యములు. మ, ఉ, ఓ, భ వర్ణ ములు ఓష్ఠ్యములు. ఇవి యితర వర్ణములచేత వ్యవహితములైనవి. కావుననే సాంత రములు. దీని కూర్పు పూలమాలలో వేరువన్నెల పూలకూర్పువలె నున్నదన్నమాట.

ఈ రెండు విధములయిన్నకూర్పును శ్రుత్యనుప్రాసమునందలి మసృణ విభాగమునకే చెందును. కావుననే యీ పద్యము మసృణమైన శ్రుత్యనుప్రాసమున కుదాహరణ మైనది.

ఉదాహరణము భవభూతి రచితమైన మాలతీమాధవము నుండి గ్రహింప బడినది.

వర్ణమసృణో యథా – ,

'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధ నిపాత చూర్ణితాః
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిందవః' 167

అత్ర దంత్యౌ మూర్ధన్యౌ వోష్ఠ్యౌ డలయోరైక్యేన దంత్య పంచకం మూర్ధన్య ఇత్యాదినా క్రమేణ యద్యపి పూర్వవత్ స్థానతః సమానశ్రుతితయా మసృణైవావృత్తిః, తథాపి చిత్రపట ఇవ మాల్య గ్రథన ఇవ వా యోఽయం క్షణం పక్ష్మసు తాడితాధరాః పయో ధరః వలీః స్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోదబిందవః ఇతి నానా వర్ణాత్మకః సూత్రాంతరస్యేవ పుష్పాంతరస్యేవ వా స్థానభేదేన మసృణ ఏవసివేశ స్తైనైవ శ్రుత్యనుప్రాసో వర్ణమసృణ ఇత్యుచ్యతే.

అర్థము : వర్ణమసృణమున కుదాహరణము. తొలకరి నీటి బిందువులు క్షణముసేపు ఆమె కనురెప్పలపై నిలిచి, అధరములను తాడనము చేసి, పయోధర ముల యౌన్నత్యము నుండి పడుటచేత చూర్ణితములై, ఆమె వళులలోనికి జారి, చాలసేపటికి నాభిని చేరుకొన్నవి.

ఇచ్చట రెండు దంత్యములు, రెండు మూర్ధన్యములు, రెండు ఓష్ఠ్యములు డలల యైక్యముచేత ఐదు దంత్యములు, ఒక మూర్ధన్యము – ఈ విధమైన క్రమము చేత పూర్వమువలెనే స్థానమునుబట్టి సమాన శ్రుతిత్వముచేత మసృణావృత్తియే అయినప్పటికిని చిత్ర వస్త్రమునందు వలె గాని మాలా గ్రథనము నందువలె గాని

క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరః పలీః స్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోద బిందవః అని సూత్రాంతరము యొక్క నివేశము వలెనో పుష్పాంతరము యొక్క నివేశము వలెనో స్థానభేదముచేత నానావర్ణాత్మకమైన మసృణ నివేశమే యుండుటవల్ల వర్ణమసృణమైన శ్రుత్యనుప్రాస మని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : గ్రామ్యమునందు రెండవభేదము వర్ణమసృణము. 'రూపసాజాత్యేऽపి మసృణతా న్యగ్భూతో వర్ణ మసృణః.' అని లక్షణము. రూపసాజాత్యమును గలిగియుండియు మసృణత్వమును తిరస్కరించునది వర్ణమసృణము.

ఒక వర్గమునందు పుట్టిన వర్ణము లావృత్తములయిన యెడల మసృణము అని చెప్పికొంటిమి అవి వ్యవహితములై యున్నను, అవ్యవహితములై యున్నను మసృణత్వము చెల్లును. వర్ణమసృణము నందు ఒక వర్గమునకు చెందిన వర్ణము లావృత్తములగును; వానికి పిమ్మట మరొక వర్గమునకు చెందిన వర్ణము లావృత్తము లగును; ఆ పిమ్మట మరల నింకొక వర్గము. ఇట్లు వేర్వేరు వర్గము లావృత్తము లగుచు, మొదట ఆ వృత్తములైన వర్గములు పునరావృత్తములు కావచ్చును. నడుమ నడుమ ఒక యక్షరమే పునరుక్తమగును. అట్లు స్థానీయ సంబంధము వలని మసృణత్వము కంటె భిన్నమయిన మసృణత్వము దీని వలన కలుగును. రంగు రంగుల వస్త్రమును నేయువాడు వేరు వేరు రంగుల దారములను నివేశము చేయును. పూలమాలను గ్రుచ్చువాడు వేరు వేరు పూలను గుత్తులు గుత్తులుగా గ్రుచ్చును. ఇట్లగుటచేత పూర్వమున్న మసృణత్వము భంగింపబడును. అయినను వర్ణసాజాత్యముచేత క్రొత్త మసృణత్వము కలుగును. ఇట్లుండుటకే వర్ణమసృణ మనిపేరు.

ఉదాహరణ పద్యమునందు 'క్షణం పక్ష్మసు' అన్నప్పుడు క్షకారము ఆవృత్తి నొందినది. 'తాడితాధరాః పయోధరః' అన్నప్పుడు ధరవర్ణములును 'పలీస్ఖలితాః' అన్నప్పుడు ల వర్ణమును 'ప్రపేదిరే చిరేణ' అన్నప్పుడు ర వర్ణమును 'నాభిం ప్రథమోద బిందవః' అన్నప్పుడు బ వర్ణమును మీది యచ్చులతో కూడి పునరుక్తము లయినవి. వర్ణమసృణత్వమును వేరుగా పరిగణించుటకు ప్రధాన బీజము లీ పునరుక్తులే.

'స్థితాః' అన్నప్పుడు 'థత' లు రెండును దంత్యములే. (సవర్ణము కూడ దంత్యమే). 'క్షణం' అన్నప్పుడు షణలు మూర్ధన్యములు. 'పక్ష్మ' పమలు ఓష్ఠ్య

ములు. 'డలయోరభేదః' అన్న నియమమును బట్టి 'తాలితాధరాః' అని యను కొన్నచో మొదటి నాలుగు వర్ణములును దంత్యము లగును. వెనుకటి పదమున మిగిలిన 'సు' దంత్యము. అనగా వరుసగా ఐదు దంత్యములు కూర్చబడిన పన్న మాట. ర వర్ణము మూర్ధన్యము. ఇట్లే ప్రతిపాదమునందును వర్గ సాజాత్యము గల వర్ణముల ఆవృత్తిచేత మసృణత్వము కలుగుచున్నది. పైని చెప్పికొన్నట్లు వీనికి నడుమ అక్షరమే పునరుక్త మగుటచేత మసృణత్వము తిరస్కృతమై వర్ణ మసృణత్వము ప్రాధాన్యము వహించుచున్నది. కావుననే యీ పద్యము వర్ణమసృణ రూపమైన శ్రుత్యనుప్రాసమున కుదాహరణమైః ది

ఉదాహృత పద్యము కాళిదాసుని కుమారసంభవము నుండి స్వీకృతము.

వర్ణోత్కటో యథా-

'విముచ్య సా హారి మహార్యనిశ్చయా
విలోల దృష్టిః ప్రవిలుప్త చందనా
బబంధ బాలారుణ బభ్రు వల్కలం
పయోధరోత్సేధ విశీర్ణ సంహతి' 168

అత్ర సర్వం పూర్వవత్. కింతు తృతీయపాదే బబంధ బాలా రుణ బభ్రువల్కల మితి సవర్ణాధిక్యయోగః సోఽయం వర్ణోత్కటో నామ శ్రుత్యనుప్రాసః.

అర్థము - వర్ణోత్కటముల కుదాహరణము. చంచలములైన చూపులు గల దియు, తొలగింపబడిన గంధపు పూత గలదియు, వారింపశక్యముగాని నిశ్చయము గలదియునైన యామె (పార్వతి) హారము నుజ్జగించి పయోధరముల యౌన్నత్యము చేత విఘటితమైన అవయవసముదాయమునందు బాల సూర్యునివలె బభ్రువర్ణము గల వల్కలమును ధరించెను.

ఇచ్చట సర్వము పూర్వము వలెనే. కాని తృతీయపాదమునందు 'బబంధ బాలారుణ బభ్రువల్కల' మని బవర్ణాధిక్యయోగము కలదు. ఇది వర్ణోత్కట మను శ్రుత్యనుప్రాసము.

వ్యాఖ్య : ఏదేని యొక వర్ణము పెక్కు పర్యాయము లావృత్తమైనయెడల వర్ణోత్కటమగును. ఇది శ్రుత్యనుప్రాసములో నొకభేదము. అట్లగుటచేత ఇంతకు ముందు చెప్పుకొన్న వర్ణమసృణత్వమును, మసృణత్వమును పూర్వమువలెనే దీని యందు నుండవచ్చును. అదనముగా అధికావృత్తి యోగముండుటచేత దానికే ప్రాధాన్యము నిచ్చుట జరుగుచున్నది.

ఉదాహరణమునందు మొదటి పాదమున 'హ' రెండవ పాదమున 'వి' నాలుగవ పాదమున 'థ' యన్న యక్షరములు పునరుక్తము లయినవి. వీనినిబట్టి వర్ణమసృణత్వము గలదని నిర్ణయింపవచ్చును. ప్రథమపాదమున వ, మ, హ వర్ణములు ఓష్ఠ్యములు; చ, య, శ వర్ణములు తాలవ్యములు, ర మూర్ధన్యము. ద్వితీయపాదమున వ, ల, ద, న వర్ణములు దంత్యములు; ఋ, ష, ట, ర – మూర్ధన్యములు; వ ఓష్ఠ్యము. ఇట్లే తక్కిన పాదములందును వర్గసంబంధి సాజాత్యముండుటచేత మసృణత్వము గలదని నిశ్చయింపవచ్చును. ఇంతవరకు నీ లక్షణములు పూర్వోదాహృతులయందున్నవియే. ఇచ్చట అదనముగానున్న లక్షణము వర్ణోత్కటత్వము. తృతీయపాదమునందు బ వర్ణము పెక్కు పర్యాయములు ప్రయుక్తమైనది. ఒకే వర్ణము పెక్కుపర్యాయము లావృతమగుటయే వర్ణోత్కటత్వము. కావుననే యిది వర్ణోత్కటమను శ్రుత్యనుప్రాసమున కుదాహరణమైనది.

ఉదాహరణపద్యము కాళిదాసుని కుమారసంభవము నుండి స్వీకృతము.

వర్ణానుత్కటో యథా –

'తతః ప్రభృత్యున్మదనా పితుర్గృహే
లలాటికా చందన ధూసరాలకా
న జాతు బాలా లభతే స్మ నిర్వృతిం
తుషార సంఘాత శిలాతలేష్వపి' 169

అత్ర దంత్యవర్ణ ప్రాయతయాతిమసృణత్వే శిలాతలేష్వితి దంత్యవర్ణాభ్యామేవ వర్ణస్తోభో దత్తః, సోఽయం వర్ణానుత్కటో నామ శ్రుత్యనుప్రాసః. తేఽమీ చత్వారోఽప్యతి ప్రసిద్ధతయా గ్రామ్యా ఉచ్యన్తే.

అర్థము : వర్ణానుత్కటమున కుదాహరణము. అప్పటి నుండియు మన్మథ భావాతిశయము గల బాల (పార్వతి) లలాటికా చందనముచేత ధూసరత్వమును బొందిన ముంగురులు గలదై పితృగృహమున హిమసమూహములచే నేర్పడిన శిలాతలములందు పైతము ఎంతమాత్రమును సుఖమును పొందలేకున్నది.

ఇచ్చట దంత్యవర్ణముల ఆధిక్యముచేత కలిగిన అతిమసృణత్వమువందు 'శిలాతలేషు' అని రెండు దంత్యవర్ణములయొక్క వర్ణస్తోభము కూర్చబడినది. ఇది వర్ణానుత్కట మను పేరుగల శ్రుత్యనుప్రాసము. ఈ నాలుగును అతి ప్రసిద్ధత్వము వల్ల గ్రామ్యములుగా పేర్కొనబడుచున్నవి.

వ్యాఖ్య : వెనుక చెప్పిన వర్ణోత్కటమునకు విరుద్ధమైనది యీ వర్ణానుత్కట మన్న శ్రుత్యనుప్రాస భేదము. ఒకే వర్ణము పునఃపునరావృత్తి నధిక పర్యాయము లొందినయెడల వర్ణోత్కటమగును. అట్లు కాక ఒకటి రెండు పర్యాయములు మాత్రమే ఆవృత్తి నొందినయెడల వర్ణానుత్కట మగును.

ఉదాహరణ శ్లోకమువందు మొదటినుండి తుదివరకు పెక్కు దంత్యవర్ణములు గలవు. ఈ లక్షణముచేత ఇచ్చట మసృణత్వ మున్నదని నిర్ణయింపవచ్చును. ఓష్ఠ్యములు, కంఠ్యములు మొదలయినవి కొంతవరకు పునరుక్తము లయినవి. కావున వర్ణమసృణత్వముకూడ ఇచ్చట నున్నది. నాలుగవ పాదమునందు 'శిలాతలేషు' అని యన్నప్పుడు దంత్యమైన ల కారము రెండు సారులు ప్రయుక్తమయినది. అంతకు ముందు ప్రయుక్తములయిన వర్ణములకంటె దీని కొక విశిష్టత యున్నది. పూర్వ వర్ణములు యథాలాపముగా ప్రయుక్తము లయినవి; అనగా స్వచ్ఛందముగా ప్రయుక్తములైనవే కాని ఒక విశిష్టమైన శ్రుతికై యుద్దిష్టములు కావు. శిలాతలే – అని యన్నప్పుడు లఘువుమీద దీర్ఘముతోడి ల కారము పునరుక్తమైనది. దీనినే భోజదేవుడు 'వర్ణస్తోభము' అని పేర్కొనుచున్నాడు. ఇది పూర్వగతికి అడ్డు తగిలి క్రొత్తగతిని కలిగించుచున్నాడు. అట్లని పునఃపునరుక్తము కాలేదు. కావుననే యిది శ్రుత్యనుప్రాస మన్న శబ్దాలంకారమునందు వర్ణానుత్కట మను భేదముగా పరిగణిత మగుచున్నది.

ఉదాహృతశ్లోకము కాళిదాసుని కుమారసంభవము నుండి స్వీకృతము.

ఇంతవరకు చెప్పుకొన్న మసృణము, వర్ణమసృణము, వర్ణోత్కటము, వర్ణానుత్కటము - అను నాలుగును శ్రుత్యనుప్రాసము నందలి గ్రామ్యవిభాగమునకు చెందినవి. గ్రామ్యము అని యనగా అతి ప్రసిద్ధమని మాత్రమే లక్షణము.

గ్రామ్యావై పరీత్యేన నాతిప్రసిద్ధో నాగరః. యథోచ్యతే -

74. ఏకత్వబుద్ధిర్భేదేఽపి తత్త్వేఽప్యేకత్వ నిహ్నవః
యస్య వర్ణస్య తం ప్రాహు రనుప్రాసస్య జీవితమ్.

అర్థము : గ్రామ్యవైపరీత్యముచేత అనతి ప్రసిద్ధము నాగరము. దాని లక్షణ మిది. ఏ వర్ణమునకు భేదమున్నప్పటికి ఏకత్వబుద్ధితో గ్రహింతురో, ఏకత్వమున్నప్పటికిని ఏకత్వమును తిరస్కరింతురో ఆ వర్ణము ననుప్రాసమునకు జీవితమని చెప్పుదురు.

వ్యాఖ్య : శ్రుత్యనుప్రాసమునందలి రెండవ భేదము నాగరము. అతి ప్రసిద్ధము గ్రామ్యమని పూర్వము చెప్పుకొంటిమి. దానికి విరుద్ధమైనది నాగరము: అనగా అతి ప్రసిద్ధముకాని దని యర్థము. గ్రామ్యము సర్వజనసంభావితము కాగా నాగరము కతిపయ పండిత సంభావితమై ప్రసిద్ధి నొందుచున్నది. నాతి ప్రసిద్ధమని యనగా అప్రసిద్ధమని యర్థము కాదు. విస్తృతమైన ప్రసిద్ధి లేకపోయినను, నాగరమైన శ్రుత్యనుప్రాసకు పైతము పర్యాప్తమయిన ప్రసిద్ధి కలదు. కావుననే దీనికి ఘటకమైన వర్ణమును 'అనుప్రాసస్యజీవిత' మని యనుట జరిగినది.

ఇందు ప్రధానముగా రెండు భేదములు కలవు. మొదటి భేదము-కించిద్భిన్నములయిన వర్ణములను ఏకవర్ణముగా గ్రహించుట. అనగా, శ్రుతిసాజాత్యము లేనిచోట శ్రుతిసాజాత్యము నాపాదించుకొనుట యని యర్థము రెండవ భేదము - వాస్తవముగా ఏకత్వమున్నప్పటికిని, తదేకత్వమును నిరాకరించుట. అనగా భిన్నస్థానీయములయిన వర్ణము లేదోయొక యంశమున (ప్రయత్నాదికము నందు) సామ్యము కలిగి యుండవచ్చును. ఈ సామ్యమునుబట్టి ఏకత్వమును చెప్పవలసి యున్నను భిన్నత్వమునే పరిగణించుట యిచ్చట జరుగును. అయినప్పటికిని అధియు శ్రుత్యనుప్రాసము నందలి నాగర భేదముగానే ఎన్నిక కెక్కును.

తత్ర భేదేఽప్యేకత్వబుద్ధ్యా సమానస్థానయోర్యథా -

'హారే ర్లంఘిత ఘర్మాంశు ర్వ్యోమ్ని దీర్ఘేణ రంహసా
బలిబంధన ఘోరోఽంఘ్రి రంహస్సంఘం నిహంతు వః' 170

అత్ర హాకారస్య తుల్యస్యాతుల్యస్థానేన ఘకారేణ సహ భేదేఽప్యేకత్వబుద్ధే స్తుల్య శ్రుతిత్వ మితి భేదేఽప్యేకత్వబుద్ధ్యా నాగరానుప్రాసోఽయమ్.

అర్థము : అందు సమానస్థానములందు భేదమునందు ఏకత్వబుద్ధికి ఉదాహరణము. అత్యంతవేగముతో ఆకాశమునందు సూర్యమండలము నతిక్రమించి బలిబంధన ఘోరమయిన విష్ణుమూర్తి పాదము మీ పాప సమూహమును నశింప జేయును గాక !

ఇచ్చట తుల్యమగు హ కారమునకు అతుల్యస్థానమగు ఘ కారముతో భేదమే యైనప్పటికిని, ఏకత్వబుద్ధికి తుల్యశ్రుతిత్వ మని భేదమునందేకత్వబుద్ధితోడి నాగరానుప్రాసముగా గ్రహింపబడుచున్నది.

వ్యాఖ్య : నాగరానుప్రాసమునందు భేదమునందలి ఏకత్వబుద్ధికి ఉదాహరణము. ఇది కూడ రెండు విధములై యున్నది. సమానస్థాన జన్యములయిన భిన్నవర్ణములను ఏకవర్ణముగానే భావించి గ్రహించుట మొదటి విధము. భిన్నస్థాన జన్యములయిన భిన్నవర్ణములను ఏకవర్ణముగా భావించి గ్రహించుట రెండవవిధము. ఈ శ్లోకము మొదటి విధమున కుదాహరణము.

హకార ఘకారములు కంఠ్యములుగా పరిగణింపబడినవి. కాని హకారము ఊష్మవర్ణము. ఉచ్చారణ సమయమున ముఖయంత్రమునందు ఏవిధమైన అవరోధము నొందదు. ఘ వర్ణము స్పర్శము. జిహ్వామూలము కంఠబిలమును స్పృశించుటవలన నిది వెలువడును. ఒకే స్థానమునందు పుట్టినప్పటికిని హకార ఘకారములు భిన్నవర్ణములు; విజాతీయములు. అయినప్పటికిని వానికి కొంత సాదృశ్యమున్న దనుట అనుభవవేద్యము. సింహము సింగమని, సగము సహమని వ్యవహృతి నొందుటకు సాదృశ్యమే హేతువు. కావుననే భిన్నవర్ణములే యైనను సమస్థాన జన్యములయిన హకారఘకారములు శ్రుతి సాజాత్యమును కలిగి ఒకేవర్ణ

మువలె భావింపబడుచున్నవి. ఘకారమునందలి మహాప్రాణత్వమువలని స్ఫోటము, హకారోచ్చారణము ననుగమించుచున్నదనుట వాస్తవము. ఇది యంతయు పండితైకవేద్యము. కావుననే, యిది నాగరానుప్రాసముగా పరిగణింప బడుచున్నది.

ఉదాహరణమునందు హవర్ణము నాలుగు పర్యాయములు, ఘవర్ణము ఆరు, పర్యాయములు ప్రయుక్తమయినవి. ఈ రెండు వర్ణములును తుల్యములైనట్లే శ్రుతి సాజాత్యమును కలిగియున్నవి.

తథైవాసమానస్థానయో ర్యథా -

'ఉచ్ఛలన్మత్స్యపుచ్ఛాగ్ర దండపాతాహతాంభసి
జగదుద్యాన మంభోధావున్మమజ్జ మమజ్జ చ' 171

అత్రోచ్ఛలన్మత్స్యపుచ్ఛాగ్రేత్యత్ర త్స్యచ్ఛకారయోరివ త్స్యకారస్యాపి తుల్యశ్రుతిత్వ మిత్యసమానస్థానత్వేన భేదేఽప్యేకత్వ బుద్ధ్యా నాగరానుప్రాసోఽయమ్.

అర్థము : అట్లే, అసమానస్థానజన్యముల కుదాహరణము పైకి లేచుచున్న మత్స్యముయొక్క పుచ్ఛాగ్రమను దండముచేత ఆహతమయిన జలముగల సముద్రమునందు జగదుద్యానము లేచెను, మునిగెను.

ఇచ్చట 'ఉచ్ఛలన్మత్స్యపుచ్ఛాగ్ర' అనుచోటి త్స్యకారచ్ఛకారములకువలె త్స్యకారమునకును తుల్యశ్రుతిత్వము, అసమానస్థానత్వముచేత భేదమునందు ఏకత్వ బుద్ధితోడి నాగరానుప్రాస మిది.

వ్యాఖ్య : భిన్నస్థాన జన్యములయిన భిన్నవర్ణములను ఒకేవర్ణముగా భావించి గ్రహించుట కుదాహరణ మిది. ఇందు చ్ఛ. త్స్య — వర్ణములు అనుప్రాస ఘటకములు. ఇవి భిన్నస్థానజన్యములు. చ, ఛ లు తాలవ్యములు; తసలు దంత్యములు. కావున, వీనికి స్థానీయమయిన సాజాత్యము లేదు. అయినప్పటికివి, అనుభవమునందు వీనియందు శ్రుతిసామ్యము గోచరించును. కొందరు తెలుగునందు దంత్య చవర్ణము స్థానమున 'త్స' వ్రాయుట తాళపత్రగ్రంథములందు సైతము కాననగును. మత్స్యశబ్దము వికృతియందు 'మచ్చెము' అని మారుట సమానశ్రుతిత్వమునే సమర్థించును. 'త్స'వర్ణము దంత్యచవర్ణముతోను, 'త్స్య'వర్ణము తాలవ్య

చవర్గముతోను సన్నిహితమైన ఉచ్చారణము కలిగియున్నవి. కావుననే భిన్నస్థానీక్రమతు లైనప్పటికివి ఉచ్చారణ సాదృశ్యమునుబట్టి ఏకత్వమును పరిగణించి గ్రహించుట జరుగుచున్నది. ఇది నాగరానుప్రాసమునందు అంతర్భేదము.

తత్త్వేఽప్యేక నిహ్నవేన డకార వకార యకారాణాం యథా—

'క్రోడే మా డింభ మాదాయ చండి పీడయ వక్షసా
కర్ణే బ్రూహి వయస్యాయా యువా యదయ ముచ్యతే' 172

అత్ర డకారాదీనా మీషత్స్పృష్టతాదిభి రేకత్వేఽపి భేదావభాస ఇతి తత్త్వేఽప్యేకత్వ నిహ్నవేన నాగరానుప్రాసోఽయమ్.

అర్థము : తత్త్వమునందు ఏకనిహ్నవముతోడి డకార వకార యకారముల కుదాహరణము. ఓ ప్రియా! పిల్లవాని నొడిలోనుంచుకొని గుండెల కొత్తుకొని బాధింపకుము. ఈ యువకుడు ఏమి చెప్పుచున్నాడో చెలికత్తె చెవిలో చెప్పుము. ఇచ్చట డకారాదులకు ఈషత్స్పృష్టత మున్నగువానిచేత ఏకత్వమున్నప్పటికిని భేదమే భాసించుచున్నది. అందువల్ల తత్త్వమునందు ఏకత్వ నిహ్నవముతోడి నాగరానుప్రాస మిది.

వ్యాఖ్య : డకారము స్పర్శము, మూర్ధన్యము. యవర్ణము అంతస్థము. దీని వర్ధాచ్ఛుగా పరిగణించుటకూడ కలదు. కకారాదులను పలుకునప్పుడు కరణము (నాలుక) స్థానమును స్పృశించునట్లు ఇచ్చట స్పృశింపదు. కావుననే దీనిని స్పర్శముగా పరిగణింపరు. అచ్చువలె ఏమాత్రమును స్పర్శలేకుండ నుండదు. కావున దీనిని ఈషత్స్పృష్టము అని యందురు. వకారముకూడ ఇట్టిదే. పై దంతములకు క్రిందుగా క్రిందిపెదవిని చేర్చి పలుకుటచేత వకారము పుట్టును. ఇదికూడ ఈషత్స్పృష్టమే. డకారముకూడ కొన్ని స్థానములందు ఈషత్స్పృష్టముగానే వ్యవహరించును. ఈవిధముగా ఈ మూడు వర్ణములకును ప్రయత్నమునుబట్టి సామ్యము నంగీకరింపవలయును.

జన్మస్థానమునుబట్టి ఈ మూడును మూడుభిన్నవర్ణములు. డవర్ణమునకు జన్మస్థానము మూర్ధము; యవర్ణమునకు తాలువు; వవర్ణమునకు దంతోష్ఠ్యములు. ఈషత్స్పృష్టత్వమన్న ఏకత్వమున్నప్పటికిని విభిన్నస్థానికములయిన యీ వర్ణములను

భిన్నములుగానే భావించుట జరుగుచున్నది. అయినప్పటికిని శ్రుతిసాజాత్యము సంపన్నమై నాగరానుప్రాసభేదముగా పరిగణింపబడుచున్నది.

తథైవ ఢకార వకార లకారాణాం యథా –

'నవోఢే త్వం కుచాఢ్యాపి నోపగూఢాయ ఢౌకసే
వహన్ బాహులతే వ్రీణో వరః పులకలంఘితే' 173

అత్ర ఢకారాదీనా మీషత్ స్పృష్టతాదిభి రేకత్వేఽపి భేదావభాస ఇతి తత్త్వేఽప్యేకత్వ నిహ్నవేన నాగరానుప్రాసోఽయమ్.

అర్థము : అట్లే ఢకార వకార లకారముల కుదాహరణము. పులకలు నిండిన బాహులతలను కలిగియు వరుడు సిగ్గిలియున్నాడు. ఓ క్రొత్తపెండ్లికూతురా! నీవు కుచాఢ్యవై యుండియు కౌగిలించుటకు ముందునకు పోవుట లేదు.

ఇచ్చట ఢకారాదులయొక్క ఈషత్స్పృష్టత్వాదులవల్ల ఏకత్వమునందు భేదావభాసము. అందువల్ల ఏకత్వమున్నప్పటికిని ఏకత్వనిహ్నవముతోడి నాగరానుప్రాస మిది.

వ్యాఖ్య : ఇదియు పైదానివంటిదే. ఇచ్చట ఢ ల వర్ణములతోపాటు పూర్వము చెప్పిన వకారమును కలిపెను. జన్మస్థానమునుబట్టి భిన్నత్వ మున్నది. అదియే శ్రోతకు కాని, వక్తకు కాని భాసించునది. అయినప్పటికిని, ఈషత్స్పృష్టత్వము అన్న ప్రయత్నము ఈమూడు వర్ణములకును సమత్వము నిచ్చుచున్నది. ఈ సమత్వమున్నప్పటికిని భిన్నత్వమే పైకి కనిపించుచుండుటచేత, వీనిని అనుప్రాసఘటకములుగా వాడుటచేత, ఇది నాగరానుప్రాస మగుచున్నది.

ఉభయగుణయోగా న్నాత్యప్రసిద్ధ ఉపనాగరః. యథోచ్యతే-

75. డలయో రైక్యమిత్యాదివాక్యై ర్యస్యానుమీయతే
సమానశ్రుతితాన్యోన్యం సోఽనుప్రాసః ప్రశస్యతే.

అర్థము : ఉభయగుణయోగమువల్ల మిక్కిలి అప్రసిద్ధముకానిది ఉపనాగరము దాని లక్షణ మిది. 'డలయోరైక్యమ్' మొదలయిన వాక్యములచేత అన్యో

వ్యము దేనియొక్క సమాన శ్రుతిత్వము భావింపబడుచున్నదో ఆ అనుప్రాసము (ఉపనాగరము) ప్రశంసింపబడుచున్నది.

వ్యాఖ్య : గ్రామ్యలక్షణము కొంతయు నాగరలక్షణము కొంతయు కలది ఉపనాగరము. గ్రామ్యమువలె అతిప్రసిద్ధము కాదు: నాగరమువలె పండితమాత్ర పరిమిత ప్రసిద్ధము కాదు. గ్రామ్యముకంటె తక్కువయైనను, నాగరముకంటె ఎక్కువ ప్రసిద్ధి గలది ఉపనాగరము.

'డలయోరైక్యమ్' డలవర్ణముల కేకత్వము మొదలయిన వాక్యములు వ్యాకరణమునందు వినిపించును. ఇవి కేవల పండితులలోనే కాక, తదనుకర్తలయందు నైతము వినిపించును. అట్టివాక్యములతో సమర్థనీయమైన భిన్నవర్ణముల అనుప్రాసముకూడ ఉపనాగరానుప్రాస మని ప్రసిద్ధికెక్కినది.

స డలయో రైక్యేన యథా -

'శయనే యస్య శేషాహిః సనీడే బడబానలః

మహాసాహసినా మగ్ర్యం తమీడే జడశాయినమ్' 174

సోఽయ ముపనాగరః శ్రుత్యనుప్రాసః.

అర్థము : డలల కైక్యముగల ఉపనాగరమున కుదాహరణము. శయనమునందు శేషాహిని, సమీపమునందు బడబాగ్నిని కలిగి జలములందు నిద్రించుచున్న మహాసాహసికులలో అగ్రగణ్యుడైన వానిని (విష్ణువును) ప్రశంసింతును.

ఇది ఉపనాగర మన్న శ్రుత్యనుప్రాసము.

వ్యాఖ్య : డవర్ణము మూర్ధన్యము; లవర్ణము దంత్యము. జన్మస్థానమును బట్టి యీ రెండును భిన్నవర్ణము లనుట వాస్తవము. వెనుక చెప్పికొనినట్లు డవర్ణ లవర్ణములు ఈషత్స్పృష్టములు. ఈ లక్షణమునుబట్టి గణించినయెడల, దీనిని నాగరానుప్రాసముగానే పరిగణింపవలయును. ప్రకృతమునందు 'డలయోరభేదః' అన్న నియమము ననుసరించియే యీ పరిగణనము జరుగుచున్నది. 'సనీడే బడబానలః' అన్న పాదమునందు డ వర్ణము రెండు పర్యాయములును, లవర్ణము ఒక పర్యాయము వచ్చినవి. 'తమీడే జడశాయినమ్' అన్న తుదిపాదమునందు డవర్ణము రెండు పర్యాయములు వచ్చినది. ఇట్లు నాలుగు పర్యాయములు ప్రయుక్త

మయిన డ వర్ణమును, ఒక పర్యాయము మాత్రమే ప్రయుక్తమయిన ల వర్ణమును ఒకే శ్రుతిని కలిగియున్నట్లు గ్రహించుట జరుగుచున్నది. కావుననే, యిది ఉపనాగర మన్న శ్రుత్యనుప్రాసభేద మగుచున్నది.

[ఉదాహృతపద్యము నిర్ణయసాగర ప్రతియందును; జీవానంద విద్యాసాగర ప్రతియందును సమానముగానే యున్నది. లక్షణము లక్ష్యమునందు మరింత సమర్థముగా సమన్వితము కావలయునన్న చతుర్థపాదమునందు చిన్నసవరణ చేయుట అవసరము. లేఖకు లెవ్వరో లక్షణమును గుర్తింపక మూలమును మార్చియుందురు. కావున 'తమీశే జలశాయినమ్' అని పఠించుట సమంజసముగా నుండును. 'ఈడే' అనుచోటి దుఃస్పృష్ట డకారము ళకారముగా మారును. 'జలము'నకు రూపాంతరము 'జడము'. ఇట్లున్నప్పుడే డల(ళ) వర్ణములను అభిన్నములుగా అనుప్రాసఘటకములుగా గ్రహింపనగును. యథాస్థితముగా నైనచో ఒక్కచోటనే ల వర్ణము కలదు. దానిని విడిచి డ వర్ణమునే అనుప్రాసఘటకముగా అనుమానింప వచ్చును. కావున భిన్నవర్ణమైన 'ల'కూడ ఆవృత్తి నొందుట లక్షణమునకు బలము చేకూర్చును. అప్పుడే దీనిని వర్ణానుప్రాసముకంటె భిన్నముగా ఉపనాగరానుప్రాసముగా గ్రహింపవీలగును.

'జలనిధి యను తెరమఱుఁగటు। వెడలి నిలిచినట్టి యాటవెలఁదియ పోలెన్' అను విధముగా ల డ లకు ప్రాస నుపయోగించుట యీ లక్షణమునే సమర్థించును. అప్పుడే యిది అభేదప్రాస మనిపించుకొనును. ఇట్లుకాక 'జలనిధి'ని 'జడనిధి'గా మార్చి పఠించిన యెడల ప్రాసవైశిష్ట్యము తొలగిపోవును. ప్రకృతోదాహరణమునందు అభేదము నాశ్రయించిన అనుప్రాసముండుట అపేక్షితము. కావున 'తమీశే జలశాయినమ్' అన్నదియే సమంజసమైన పాఠము.]

నణయో రైక్యేన యథా -

'బాణైః క్షుణ్ణేషు సైన్యేషు త్వయా దేవ రణాంగణే
హతశేషాః శ్రయన్తి మే శూన్యారణ్యాని విద్విషః' 175

అత్ర క్షుణ్ణేషు సైన్యేషు శూన్యారణ్యానీతి నకార ణకారయోః స్వల్పశ్రుతిత్వ మేకత్వం వా భాసత ఇతి ఉపనాగరోఽయం శ్రుత్యనుప్రాసః.

అర్థము : వణల యేకత్వముతోడి ఉదాహరణము. దేవా! సంగ్రామరంగము నందు నీ బాణములచేత కొట్టబడిన సైన్యములయందు చావగా మిగిలిన శత్రువులు ఈ శూన్యారణ్యముల నాశ్రయించుచున్నారు.

ఇచ్చట 'క్షణ్ణేషు సైన్యేషు' 'శూన్యారణ్యాని' అని నకార ణకారములకు స్వల్ప శ్రుతిత్వముకాని ఏకత్వముకాని భాసించుచున్నది. కావున, ఇది ఉపనాగర మన్న శ్రుత్యనుప్రాసము.

వ్యాఖ్య : నవర్ణము దంత్యానునాసికము; ణవర్ణము మూర్ధన్యానునాసికము. న ణ లు భిన్నవర్ణములు; భిన్నస్థానికములు. అయినను ఆనునాసిక్యము రెండింటి యందును సమానము. కాని 'డ ల'లకు చెప్పినట్లు 'న ణ'లకు అభిన్నత్వము నెవ్వరును చెప్పలేదు. కావున వాని కవి అనుప్రాసఘటకములు కాలేవు. అవి యితర హల్లులతో సంయోగముచెందినప్పుడు స్వల్పశ్రుతిని మాత్రమే కలిగి యుండును. అట్టియెడల అనునాసికత్వము వినిపించినంత స్పష్టముగా భేదకధ్వని వినిపింపదు. కావున, ఇతర వర్ణసంయుక్తము లయిన న ణ లు ఆవృత్తినొందిన ఉపనాగరానుప్రాస మేర్పడును.

ఉదాహరణమునందు 'క్షణ్ణేషు' అనుచోట ణ కారద్విత్వమున్నది; 'సైన్యేషు' అనుచోట నకార యకార సంయుక్తమున్నది. 'శూన్య' అన్నప్పుడు నయసంయుక్తము; 'అరణ్యాని' అన్నప్పుడు ణయసంయుక్తము. వీనియందు న ణ లు అర్ధ మాత్రలుగానే యున్నవి. వానితో చేరిన యక్షరములే సమగ్రమైన యుచ్చారణము కలిగియున్నవి. కావుననే స్వల్పశ్రుతికల న ణ లు అభిన్నములుగానే భావింప బడుట జరుగుచున్నది. తెలుగున 'అన్యము' అను పదము 'అన్నెము' అని 'పుణ్యము' అను పదము 'పున్నెము' అని మారుట సర్వవిదితము. ఇట్లు మారుటకు శ్రుతి సమత్వమే కారణము. అల్పభేద మేమయిన నున్నప్పటికిని, దానిని గుర్తించు నంతటి అవధానత వక్తకుగాని శ్రోతకుగాని సాధారణముగా నుండదు. అందు వల్లనే న ణ లకు అన్యోన్యము అనుప్రాసయోగ్యత సిద్ధించుచున్నది.

ర ల యో రైక్యేన యథా -

'విభిన్నవర్ణా గరుడాగ్రజేన
సూర్యస్య రథ్యాః పరితః స్ఫురంత్యా

రత్నైః పునర్యత్ర రుచా రుచం స్వా
మానిన్యిరే వంశకరీర నీలైః' 176

అత్ర కరీరనీలై రితి రేఫలకారయో రైక్యేన తుల్యశ్రుత్యా చతుర్ష్వపి పాదేష్వనుప్రాసనిర్వహణ మిత్యుపనాగరోఽయం శ్రుత్యనుప్రాసః.

అర్థము : ర ల ల కేకత్వముతోడి యుదాహరణము. గరుడుని అన్నయైన అనూరునిచేత భిన్నవర్ణము (ఎఱ్ఱదనము)ను పొందిన సూర్యరథాశ్వములు తిరిగి (రైవతకాద్రి) యందలి వంశాంకుర శ్యామలములైన రత్నముల (మరకతముల)చేత చుట్టుప్రక్కలకు చూపట్టునట్టి కాంతిచేత స్వీయమైన కాంతికి (హరితవర్ణమునకు) తీసికొని రాబడుచున్నవి.

ఇచ్చట 'కరీరనీలైః' అని రేఫ లకారముల కైక్యముచేత తుల్యశ్రుతిచేత నాలుగు పాదములందును అనుప్రాస నిర్వహణము జరిగినది. కావున, ఇది ఉపనాగర మన్న శ్రుత్యనుప్రాసము.

వ్యాఖ్య : 'ర ల యో రభేదః' అను వాక్యము ప్రసిద్ధమే. రవర్ణము మూర్ధన్యము; లవర్ణము దంత్యము. ఈ రెండును భిన్నవర్ణములే అయినప్పటికిని లకారము రకారముతో వినిమయము నొందుట కొన్నియెడల కనుపట్టును. 'పర+అయనము' ఒక యర్థమున 'పరాయణము' కాగా మరొక యర్థమున 'పలాయనము' అగును. ఇట్టి వినిమయమువల్లనే సమశ్రుతిత్వము సమర్థింపబడుచున్నది.

ప్రకృతోదాహరణమున 'ర' మొదటి మూడు పాదములందు పునఃపునరావృత్తి నొందినది. కొన్నియెడల ఇతర హల్సంయోగము నొందినది. కొన్నియెడల కేవల స్వరయోగముతోనే సంతృప్తినొందినది. చతుర్థపాదమునందు రే, రీ, ర - అని మూడుసార్లు రేఫము ఆవృత్తినొందినది. 'నీలైః' అనుచోటి లకారముకూడ రేఫముతో సమశ్రుతి కలదే. అందువల్ల దానినికూడ అనుప్రాసఘటకముగా తీసికొన్నయెడల ర ల వర్ణముల ఏకత్వముచేత అనుప్రాసము సిద్ధించినట్లగును. అప్పుడిది శ్రుత్యనుప్రాసమునందలి ఉపనాగరభేద మగును.

ఉదాహరణము మాఘుని శిశుపాలవధమునుండి స్వీకృతము.

దంత్య తాలవ్యానా మైక్యేన యథా -

'విద్యాస్యందో వాగ్విదాం యః ప్రసన్నః
పుణ్యాం వాచం దేవతాం తాం నమామః
యాం బ్రహ్మాణ శ్చింతయంతే విశోకాః
సా నో దేయాత్ సూనృతా సూనృతాని' 177

అత్ర దంత్య తాలవ్యానా మైక్యేన తుల్యశ్రుతినేత్యుపనాగరో౽యం శ్రుత్యనుప్రాసః. సర్వే౽పి చానుప్రాసాః ప్రాయేణ భిన్నదృశ వర్ణాంతరితా ఏవ స్వదంతే. ఇతో౽ప్యూష్మ కంఠ్యాదీనా మనుప్రవేశో భవతి.

అర్థము : దంత్యతాలవ్యముల కైక్యముతోడి యుదాహరణము. విద్వాంసులకు విద్యాప్రవాహరూపమున ప్రసన్నమైన పుణ్యదేవతయైన ఆ వాక్కునకు నమస్కరించుచున్నాము. శోకరహితులై బ్రహ్మజ్ఞానులుకూడ చింతించునట్టి సూనృత మాకు సూనృతవాక్కులను ప్రసాదించునుగాక!

ఇచ్చట దంత్యతాలవ్యముల యేకత్వముచేత తుల్యశ్రుతి. దీనిచేత, ఇది ఉపనాగర మన్న శ్రుత్యనుప్రాసము. అనుప్రాసము లన్నియు సాధారణముగా సదృశములు కావి వర్ణములతో కూడినవే రుచిరములై యుండును. కావుననే ఊష్మములు కంఠ్యములు మొదలయినవాని అనుప్రవేశము జరుగుచున్నది.

వ్యాఖ్య : దంత్యములును, తాలవ్యములును స్థానమునుబట్టి భిన్నములు. వీనికి శ్రుతినిబట్టి నైతము సామ్యము లేదు. శ, ష, స, హ - అనునవి ఊష్మములు. స్థానమునుబట్టి శవర్ణము తాలవ్యము; ష మూర్ధన్యము; స దంత్యము; హ కంఠ్యము. స్థానమునుబట్టి భిన్నములైనప్పటికి ఊష్మత్వమునుబట్టి వీనికి తుల్యత్వము కలదు. ముఖ్యముగా శ ష స లు శ్రుతిసామ్యమునుగూడ కలిగి యున్నవి. కావున దంత్యతాలవ్యముల కేకత్వమనుపేర స శ లు మాత్రమే గ్రహింపబడుచున్నవి. వ్వర్ణముల కిచ్చట ప్రసక్తిలేదు.

'విద్యాస్యంద' అనుచోట 'స్య' యున్నది. 'ప్రసన్నః' అనుచోట 'స' యున్నది. తృతీయపాదమందు 'బ్రహ్మాణశ్చింతయంతే' అనుచోట సంధివశమున

'శ' యేర్పడినది. 'పశోకాః' అనుచోట 'శ' యున్నది. ఇట్లు దంత్యమైన సవర్ణము నకు తాలవ్యమైన శవర్ణమునకు అనుప్రాసమును ఘటించుటచేత ఇది ఉపనాగరమైన వృత్త్యనుప్రాస మగుచున్నది.

ఏవర్ణమున కావర్ణమే అనుప్రాస ఘటకమైన యెడల వర్ణసమత్వముచేత సుందరముగానే యుండును. ఇది సహజధర్మమే. అసదృశ వర్ణములలో అంతంత మాత్రముగా నున్న శ్రుతిసమానత్వమునుబట్టి అనుప్రాసమునం దనుబద్ధముచేయుట పండితుల కౌక ముచ్చట. తదనుకరణశీలురైన ఉపనాగరులయందు పైతము కొంచెము రూపుమార్చుకొని యీ లక్షణము కనుపట్టును. ఇందువల్లనే ఓష్ఠ్యములు, కంఠ్యములు మొదలయినవి కూడ అనుప్రాసఘటకములకు నడుమనుండి సాదృశ్య సంజాతమైన సౌందర్యమును తమ విజాతీయత్వముచేత వికసింపజేయును. ఎండ యెక్కువగా నున్నప్పుడు ఏపాటి నీడయైనను పాంథునకు చల్లగా ననిపించినట్లు విభిన్నవర్ణముల నడుమ ఏపాటి సామ్యముగల వర్ణములైనను సజాతీయములుగానే తోచి సౌందర్యసంధానము చేయును.

76. యథా జ్యోత్స్నా చంద్రమసం యథా లావణ్య మంగనామ్
అనుప్రాస స్తథా కావ్య మలంకర్తు మయం క్షమః.

అర్థము : చందమామను వెన్నెలయు, యువతిని లావణ్యమును శోభింప జేయునట్లు, ఉపనాగరమన్న యీ అనుప్రాసము కావ్యమును శోభింపజేయుటకు సమర్థము.

77. అనుప్రాసః కవిగిరాం పదవర్ణమయోఽపి యః
సోఽప్యనేన స్తబకితః శ్రియం కామపి పుష్యతి.

అర్థము : కవివాక్కులలో పదవర్ణమయమయిన అనుప్రాసము కావ్యముతో పొందిపొసగి ఒకానొక సౌందర్యమును పోషించును.

వ్యాఖ్య : వెన్నెల చంద్రునికంటె వేరుకాదు; చంద్రుని నాశ్రయించు కొనియే వెన్నెల యున్నది. అయినప్పటికిని చంద్రునికే అది యలంకార మగు చున్నది. అంగన నాశ్రయించుకొని అందమున్నది. అందమువల్లనే అంగనకు శోభ కలుగుచున్నది. పదవర్ణరూపమయిన కవివాక్కులచేతనే అనుప్రాసము కలుగు

చున్నది. కవి కర్మ కావ్యము. తత్కావ్యము నాశ్రయించుకొన్నది అనుప్రాసము. కావ్యము నలంకరించుటకు సమర్థమై యున్నది.

కావ్యము నాశ్రయించుకొన్నప్పుడే, ఔచిత్యవంతముగా అమరియున్నప్పుడే అనుప్రాసము అర్థవంతమగును. అట్లే అనుప్రాసముతో కూడియున్నప్పుడే కావ్యము సౌందర్యసముజ్జ్వలమగును. భోజదేవు డీవిధముగా అనుప్రాస ప్రాధాన్యమును నిర్దేశించుచున్నాడు.

ఇంతవరకు శ్రుత్యనుప్రాసభేదములు చెప్పబడినవి. ఇప్పుడింక క్రమానుగుణముగా వృత్త్యనుప్రాసము ప్రారంభమగుచున్నది.

[ వృత్త్యనుప్రాసము ]

78. ముహురావర్త్యమానేషు యః స్వవర్గ్యేషు వర్తతే
కావ్యవ్యాపీ స సందర్భో వృత్తి రిత్యభిధీయతే.

అర్థము : మాటిమాటికి నావృత్తిచెందుచున్న స్వవర్గజములయిన వర్ణములయందు వర్తించుచు, కావ్యమునందు వ్యాపించియున్న సన్నివేశము వృత్త్యనుప్రాసమని పేర్కొనబడుచున్నది.

79. కార్ణాటీ కౌంతలీ కౌంకీ కౌంకణీ బాణవాసికా
ద్రావిడీ మాథురీ మాత్సీ మాగధీ తామ్రలిప్తికా.

80. ఔండ్రీ పౌండ్రీతి విద్వద్భిః సా ద్వాదశవిధేష్యతే
అథ లక్షణ మేతాసాం సోదాహరణ ముచ్యతే.

అర్థము : వృత్త్యనుప్రాసము పండ్రెండు విధములని పండితులు గ్రహింతురు. 1. కార్ణాటి 2. కౌంతలి 3. కౌంకి 4. కౌంకణి 5. బాణవాసిక 6. ద్రావిడి 7. మాథురి 8. మాత్సి 9. మాగధి 10. తామ్రలిప్తిక 11. ఔండ్రి 12. పౌండ్రి - అనునవి ఆభేదములు. వీని లక్షణము ఉదాహరణ పూర్వకముగా చెప్పబడును.

వ్యాఖ్య : వృత్త్యనుప్రాసభేదములు దేశనామములనుబట్టి పేరు పొందినవి. ఇచ్చట ఈ సంజ్ఞలు కేవల సంకేతములే కాని ఆయాదేశములతో కాని, దేశవాసుల భాషాసంప్రదాయముతో కాని ఎంతమాత్రమును సంబంధము కలవి కావు.

తాసు కవర్ణానుప్రాసవతీ కార్ణాటీ యథా -

'కాంతే కుటిల మాలోక్య కర్ణకండూయనేన కిమ్
కామం కథయ కల్యాణి కింకరః కరవాణి కిమ్' 178

అర్థము : వానియందు కవర్ణానుప్రాసము గల కార్ణాటికి ఉదాహరణము. కాంతా! కుటిలముగా చూచి చెవి గోకుకొనుటచేత ఏమిలాభము? కల్యాణీ! నీ కోరికను చెప్పుము. కింకరుడనైన నేను ఏమిచేయవలయును ?

వ్యాఖ్య : కవర్గము పునఃపునరావృత్తి నొందినయెడల, దానిని కార్ణాటీ వృత్త్యనుప్రాస మని యందురు. ఇది లక్షణము. ఉదాహరణమునందు కవర్గము పెక్కు పర్యాయము లావృత్తి నొందియున్నది. ఇచ్చట హల్వర్ణమునకే ప్రాధాన్యము. అది యేస్వరముతో నయిన సంయోగము నొందవచ్చును. పద్యమునందంతటను వ్యాప్తినొంది యుండవలయును. ఇట్లుండుటచేతనే ప్రకృతపద్యము కార్ణాటికి లక్ష్యమయినది.

చవర్గానుప్రాసవతీ కౌంతలీ యథా -

'జ్వలజ్జటిల దీప్తార్చి రంజనోచ్చయ చారవః
చంపకేషు చకోరాక్షి చంచరీకా శ్చకాసతి' 179

అర్థము : చవర్గానుప్రాసము గల కౌంతలికి ఉదాహరణము. ఓ చకోరాక్షీ! సంపెంగలయందు జ్వలించుచున్న జడలు కలిగిన ప్రకాశమానమయిన అగ్నులవలె అత్యంత రంజనమనోహరములయిన తుమ్మెదలు విలసిల్లుచున్నవి.

వ్యాఖ్య : చవర్గము పునఃపునరావృత్తి నొందినయెడల, దానిని కౌంతలీ వృత్త్యనుప్రాస మని యందురు. ఇది లక్షణము. ఉదాహరణమునందు చ, జ, ఞ వర్ణములు పెక్కుపర్యాయము లావృత్తినొందినవి. ఇవి యన్నియు చ వర్గమునకు చెందినవి. కావుననే, యిది కౌంతలీవృత్త్యనుప్రాసమునకు లక్ష్యమయినది.

[రంజన, చంచరీక శబ్దములందు పూర్ణబిందువున్నది. నాగరలిపి యందు సాధారణముగా 'రఞ్జన, చఞ్చరీక' అని 'ఞ' వర్ణమునే వ్రాయుదురు. పూర్ణబిందు

వునే [వ్రాతయందు వాడినప్పటికిని చ వర్గమునకు ముందు అది 'ఞ' వర్ణముయొక్క ఉచ్చారణమునే కలిగి యుండును.]

టవర్గానుప్రాసవతీ కౌంకీ యథా—

'కుంభకూటాట్ట కుట్టాక కుటిలోత్కట పాణిరుట్
హరిః కరటిపేటేన న ద్రష్టుమపి చేష్ట్యతే' 180

అర్థము : టవర్గానుప్రాసము గల కౌంకికి ఉదాహరణము. కుంభస్థలముల న్నట్టి హర్మ్యాగ్రములను పడగొట్టుటలో ప్రావీణ్యము గల దారుణమైన పంజా గల సింహమును ఏనుగులు చూచుటకుకూడ ప్రయత్నించుట లేదు.

వ్యాఖ్య : టవర్గజములైన వర్ణములు పెక్కు పర్యాయము లావృత్తి నొందినయెడల, దానిని కౌంకీ వృత్త్యనుప్రాసమని యందురు. ఇది లక్షణము. ఉదాహరణమునందు ట, ణ వర్ణములు పునఃపునరావృత్తములై పద్యమునంతటా విస్తరించుకొని యున్నవి. కావుననే యిది కౌంకికి లక్ష్యమయినది.

తవర్గానుప్రాసవతీ కౌంకణీ యథా—

'మధు ర్మధూని గాంధర్వ మందిరం మదిరేక్షణా
ఇందు రిందీవరం దామ కామ మానందయన్తి నః' 181

అర్థము : తవర్గానుప్రాసముగల కౌంకణికి ఉదాహరణము. వసంత ఋతువు, మధువులు, సంగీతమందిరము, మదిరేక్షణ, చంద్రుడు, నల్లకలువల హారము మాకు పూర్తిగా ఆనందమును కలుగజేయును.

వ్యాఖ్య : త థ ద ధ న అను వర్ణములు పెక్కుపర్యాయము లావృత్తి నొందినయెడల, దానిని కౌంకణీవృత్త్యనుప్రాస మని యందురు. ఇది లక్షణము. లక్ష్యమునందు ద ధ న వర్ణములు పునఃపునః ప్రయుక్తము లయినవి. తవర్ణ మొక్క చోటనే వచ్చినది. శ్లోకమునందున్న పూర్ణబిందువు లన్నియు తవర్గమునకు పూర్వమందే యుండుటచే నకారోచ్చారణమునే కలిగి యుండును. 'మదిరేక్షణా' అను పదమునకు పూర్వమందున్న బిందువుమాత్రము 'మ'కారోచ్చారణము కలది. తవర్గజ ప్రాసఃపున్యముచేతనే యీశ్లోకము కౌంకణికి లక్ష్యమయినది.

పవర్గానుప్రాసవతీ బాణవాసికా యథా-

'ప్రియా ప్రగల్భా తాంబూలం పరిస్ఫుత్ఫుల్ల ముత్పలమ్
పృషత్కాః పంచ బాణస్య పంచమః పంచమధ్వనిః' 182

అర్థము : పవర్గానుప్రాసముగల బాణవాసిక కుదాహరణము. ప్రాగల్భ్యము గల ప్రియురాలును, తాంబూలమును, మద్యమును, వికసించిన యుత్పలమును, పంచమస్వరమును పంచబాణుడైన మన్మథుని బాణములు.

వ్యాఖ్య : ప ఫ బ భ మ అను వర్ణములు పెక్కుపర్యాయము లావృత్తి నొందినయెడల, దానిని బాణవాసికా వృత్త్యనుప్రాసమని యందురు. ఇది లక్షణము. ఉదాహరణమునందు పవర్గమునందలి వర్ణములన్నియు బహుపర్యాయము లావృత్తము లైనవి. 'తాంబూలం' అనుచోటి పూర్ణబిందువులు రెండును మకారోచ్చారణముగలవి. కావుననే యీ శ్లోకము బాణవాసికకు లక్ష్యమయినది.

అంతస్థానుప్రాసవతీ ద్రావిడీ యథా-

'ప్రియాల లవలీ తాల తమాలైలావనావలీ
భాతి పత్త్రిల హింతాల కృత పుండ్రా వధూరివ' 183

అర్థము : అంతస్థానుప్రాసముగల ద్రావిడికి ఉదాహరణము. ప్రియాలము, లవలి, తాలము, తమాలము, ఏలకి అను వనముల సముదాయము సాంద్రపత్రములు గల హింతాలముచేత తిలకము దిద్దబడిన వధువువలె భాసించుచున్నది.

వ్యాఖ్య : య ర ల వ - అను నాలుగు వర్ణములు నంతస్థములు. అంతస్థ వర్ణములు అనుప్రాసఘటకములుగా వ్యవహరించిన యెడల, అది ద్రావిడీ వృత్త్యను ప్రాస మగును. ఉదాహృత పద్యమునందు ల వ లు అధికముగాను, రవర్ణము అల్పముగాను ఆవృత్తి నొందినది. యవర్ణము ఒక్కమారుమాత్రమే ప్రయుక్త మయినది. అంతస్థవర్ణముల ఆవృత్తినిబట్టియే యీ శ్లోకము ద్రావిడీవృత్త్యను ప్రాసమునకు లక్ష్యమయినది.

ఊష్మానుప్రాసవతీ మాథురీ యథా -

'పుష్ణాతి పుష్పధనుషం ముష్ణాతీ ప్లోషవిప్రుషః
మిషస్త్రీ నిర్నిమేషేణ చక్షుషా మానుషీ న సా' 184

అర్థము : ఊష్మానుప్రాసము గల మాథురికి ఉదాహరణము. పుష్పధన్వి యైన మన్మథుని పోషించుచున్నది; విరహదాహకణములను విరజిమ్ముచున్నది. నిర్నిమేష నేత్రముతో చూచుచున్నది. ఆమె మనుష్యస్త్రీ కాదు.

వ్యాఖ్య : శ ష స హ - అను వర్ణములను నాలుగింటిని ఊష్మములని యందురు. ఊష్మవర్ణములు అనుప్రాసఘటకములుగా వ్యవహరించినయెడల, అది మాథురీ వృత్త్యనుప్రాసమగును. ఉదాహరణమునందు షవర్ణము పెక్కుపర్యాయము లావృత్తినొందినది ఇట్లే తక్కిన వర్ణములుకూడ ఆవృత్తినొందవచ్చును. షవర్ణావృత్తిచేతనే యీ శ్లోకము మాథురీవృత్త్యనుప్రాసమునకు లక్ష్యమయినది.

ద్విత్రివర్గానుప్రాసవతీ మాత్సీ యథా -

'కోకిలాలాపవాచాలో మామేతి మలయానిలః
ఉచ్ఛలచ్ఛీకరాచ్ఛాచ్ఛ నిర్ఝరాంభః కణోక్షితః' 185

అర్థము : రెండు మూడు వర్గముల అనుప్రాసముగల మాత్సికి ఉదాహరణము. కోకిలాలాపవాచాలమును, పైకెగురుచున్న తుంపురులు గల స్వచ్ఛమైన ప్రవాహమునందలి జలబిందువులచేత తడుపబడినదియు అయిన మలయానిలము నన్ను పొందుచున్నది.

వ్యాఖ్య : కార్ణాటి నుండి మాథురి వరకు నున్న ఏడును శుద్ధానుప్రాసములు. మాత్సి నుండి పౌంద్రి వరకు నున్న ఐదును సంకరానుప్రాసములు.

మాత్సీవృత్త్యనుప్రాసమునందు రెండువర్గములకు చెందిన వర్ణములు గాని మూడు వర్గములకు చెందిన వర్ణములు కాని సాంకర్యము నొంది అనుప్రాస ఘటకములుగా వ్యవహరించును. ఉదాహరణ శ్లోకమునందు కవర్ణము, చవర్గము, పవర్గము - పెక్కు పర్యాయము లావృత్తము లయినవి. అంతస్థముల ఆవృత్తికూడ అధికముగానే యున్నది. కావున లక్షణమునందు 'ద్విత్రివర్గానుప్రాసవతీ' అని

యనుట 'అనేకవర్గానుప్రాసవతీ' అన్న భావముతోనే కావచ్చును. అట్లయినప్పుడే ప్రకృతశ్లోకము మాత్రికి లక్ష్యము కాగలదు ఉదాహరణము దండి కావ్యాదర్శము నుండి గ్రహింపబడినది.

ద్వాభ్యాం విదర్భితైకవర్గ్యా మాగధీ యథా -

'అఘౌఘం నో నృసింహస్య ఘనాఘనఘనధ్వనిః
హన్యాద్ఘురుఘురారాఘోరః సుదీర్ఘో ఘోరఘర్ఘరః' 186

అర్థము : రెండువర్గములచేత విదర్భితమైన ఏకవర్గము గల మాగధికి ఉదాహరణము. నరసింహస్వామియొక్క ఘురుఘురాఘోరమును, సుదీర్ఘమును, ఘోరఘర్ఘరమును అయిన మేఘ గంభీరధ్వని మా పాపముల సమూహమును నాశము చేయు గాక !

వ్యాఖ్య : వంకరములయిన అనుప్రాసములలో మాత్రిని పైనిచూచితిమి. అందు అనేకవర్గముల వర్ణములు అనుప్రాస ఘటకము లగునని చెప్పుకొంటిమి. మాగధి యందు మూడువర్గములు అనుప్రాసఘటకము లగును. ఒక వర్గము ప్రధానమై ఆద్యంతము నిర్వహింపబడును. నడుమ మరిరెండు వర్గములు చేరి ఒక రకమైన విచ్ఛిత్తిని కలిగించును. ఇట్లు చేయుటచేత వైదర్భీ సహజమైన సౌందర్యము సముత్పన్న మగును.

ఉదాహరణమునందు కవర్గము ప్రధానము. అది ద్వితీయపాదమైన 'ఘనాఘనఘనధ్వనిః' అనుచోట తవర్గముచేతను, మూడవ నాలుగవ పాదములందు య ర వర్ణములచేతను విదర్భితమై యున్నది. అనగా ప్రధానమై యున్న కవర్గము కొంతదూరము తవర్గముతో జంట కలిపినది; తరువాత దానిని విడిచి మరి కొంత దూరము అంతస్థములతో జంట కలిపినది ఇట్లగుటవల్లనే, యిది మాగధీవృత్త్యను ప్రాసమునకు లక్ష్యమైనది.

స్వాంత్య సంయోగివర్గ్యా తామ్రలిప్తికా యథా-

'శిఞ్జాన మఞ్జు మఞ్జీరా శ్చారు కాఞ్చన కాఞ్చయః
కఙ్కణాఙ్క భుజా భాన్తి జితానఙ్గ తవాఙ్గనాః' 187

అర్థము : స్యాంత్యసంయోగి వర్గ్యమైన తామ్రలిప్తిక కుదాహరణము. ఓ జితమన్మథా! నీ ప్రియురాండ్రు చక్కని సవ్వడులుగల మంజీరములను కలిగి, మనోహరములయిన బంగారు మొలనూళ్ళను కలిగి, కంకణములుగల బాహువులను కలిగి ప్రకాశించుచున్నారు.

వ్యాఖ్య : వర్గాక్షరములు తమ యనునాసికాక్షరములతో సంయుక్తములై అనుప్రాసఘటకములైనయెడల, అది తామ్రలిప్తిక యగును. ఉదాహరణ శ్లోకము నందు పూర్వభాగమును చవర్గ మాక్రమించినది; ఉత్తరభాగమును కవర్గ మాక్రమించినది. 'శిఞ్జాన' మొదలయిన విధముగా జవర్గము తద్వర్గీయానునాసికమైన 'ఞ'తో కలిసి మూడుసారులు ప్రయుక్తమయినది. 'ఞ'తో సంయోగమునొంది చవర్గము రెండు పర్యాయములు ప్రయుక్తమయినది. అనగా తాలవ్యవర్గము తదంత్యవర్ణముతో సంయోగము నొందిన దన్నమాట!

ఉత్తరార్థమునందు 'కఙ్కణ', 'అఙ్క' అనుచోట్ల కవర్ణముతో అనునాసికమైన 'ఙ' సంయుక్తమయినది. 'అఙ్గ' 'అఙ్గన' అనుచోట్ల గవర్ణము సంయుక్తమయినది అనగా కంఠ్యవర్గము తదంత్యవర్ణముతో సంయోగమునొందిన దన్నమాట!

'శిఞ్జాన' మున్నగు రూపములను 'శింజాన' మున్నగు విధముగా వ్రాయవచ్చును. 'కఙ్కణ' మున్నగు రూపములను 'కంకణ' మున్నగు విధముగా వ్రాయవచ్చును. తెనుగునందు పూర్ణబిందువులతో వ్రాయుటయే పరిపాటి. కావున, పూర్ణబిందుపూర్వకములయిన వర్గాక్షరములు అనుప్రాసఘటకములైనయెడల, అది తామ్రలిప్తిక యగునని తెనుగుతేటనమున కనుగుణముగా గ్రహింపవచ్చును.

సరూప సంయోగి గ్రథితౌండ్రీ యథా -

'సల్లతా పల్లవోల్లాసీ చిత్తవిత్తహరో నృణామ్
మజ్జతీజ్జల సజ్జాసు నదీషు మలయానిలః' 188

అర్థము : సరూప సంయుక్తములతో రచింపబడిన ఔండ్రికి ఉదాహరణము. చక్కని లతల పల్లవములందు ఉల్లాసము నొందువాడును, మానవుల చిత్తవిత్తము అను హరించువాడును అయిన మలయ సమీరణుడు నిర్మల జలసమృద్ధములయిన నదుల యందు మునుగుచున్నాడు.

వ్యాఖ్య : తామ్రలిప్తికయందు పైతము సంయుక్తవర్ణములు పునరుక్తము లగుటయే లక్షణము. అందు, అనునాసికములు తత్తద్ వర్గాక్షరములతో సంయుక్తము లగును. ప్రకృతమైన ఔండ్రి యందు పరూపములయిన వర్ణములతో సంయోగము నొందుట ప్రసక్తము. అనగా ద్విత్వాక్షరములే యిచ్చట అనుప్రాసఘటకములుగా వ్యవహరించునని యర్థము.

ఉదాహృత శ్లోకమునందు లకారద్విత్వము, తకారద్విత్వము, జకారద్విత్వము అనుప్రాసఘటకములుగా వ్యవహరించుచున్నవి. కావుననే, యిది ఔండ్రీవృత్త్యనుప్రాసమునకు లక్ష్యమయినది.

అసరూప సంయోగగ్రథితా పౌండ్రీ యథా-

'అస్తమస్తక పర్యస్త సమస్తార్కాంశు సంస్తరా
పీనస్తన స్థితా తామ్రకవ్రస్త్రేవ వారుణీ' 189

అర్థము : అసరూపసంయుక్తములతో రచింపబడిన పౌండ్రికి ఉదాహరణము. అస్తాచల శిఖరము నావరించియున్న సూర్యకిరణముల సమూహముచేత కప్పబడిన పశ్చిమదిశ పీనస్తనములయందు ఎఱ్ఱని మనోహరమయిన వస్త్రమును కప్పుకొన్నట్లున్నది.

వ్యాఖ్య : పౌండ్రియందు భిన్నవర్ణములు సంయోగమునొంది పునఃపునరుక్తము లగును. ఉదాహృతశ్లోకమునందు సకార తకారములు సంయుక్తములై పెక్కువర్యాయము లావృత్తినొందినవి. ఇవి రెండును భిన్నవర్ణములు. ఇట్లు భిన్నములయిన వర్ణములు సంయుక్తములైనప్పుడే పౌండ్రి యగును. తామ్ర, కవ్ర- అన్నప్పుడు మర సంయోగము రెండుసారులు కలిగినది. ఇదియు పౌండ్రికి లక్ష్యముగానే వ్యవహరించును.

81. అకఠోరాక్షరాదానం నాతినిర్వాహణైషితా
అశైథిల్యం చ సత్కర్తుం వృత్త్యనుప్రాస మీశతే.

82. క్వచిదస్తి క్వచిన్నాస్తి క్వచిదస్తి చ నాస్తి చ
వర్ణానుప్రాస ఏషాతు సర్వతోఽస్తీతి భిద్యతే.

అర్థము : కఠోరములు కాని అక్షరముల నాదానము చేయుట, అతిగా నిర్వహింపవలయునన్న కోరిక లేకుండుట, శైథిల్యము కలుగకుండుట – అనునవి వృత్త్యనుప్రాసమును సత్కరించుటకు సమర్థములు.

వర్ణానుప్రాసము ఒకచోట నుండును; ఒకచోట నుండదు; ఒకచోట నుండియు నుండదు. కాని యీ వృత్త్యనుప్రాసము ఎల్లచోట్ల నుండును. కావుననే యిది వర్ణానుప్రాసముకంటె భిన్నమగుచున్నది.

వ్యాఖ్య : గ్రంథకర్త వృత్త్యనుప్రాస లక్షణలక్ష్యములను చెప్పిన పిమ్మట జాగరూకతకై మరొకవిషయమును జ్ఞాపనముచేయుచున్నాడు. అకఠోరాక్షరాదానము అనగా పరుషములయిన అక్షరములను అనుప్రాసఘటకములుగా నిలుపకుండుట యని యర్థము పరుషత్వమువలన సరసత్వమునకు హానికలుగును. అట్లే 'అకఠోర ములు' అని యనగా, మృదువులయిన అక్షరములనే నిలుపుటచేత శైథిల్యము కలి గెడి అవకాశమున్నది. కావున రచయిత పరుషత్వమును, శిథిలత్వమును కలుగ కుండ జాగరూకుడై యుండవలయును. ఇంకొక ముఖ్య విషయము, కవికి నియం త్రణముండుట చాల యవసరము. కావుననే అతినిర్వహణమును పరిహరింపవల యును, సంయమనము కలిగి, పరుషబంధము కాని శిథిలబంధము కాని కాకుండు నట్లు రచించినయెడల వృత్త్యనుప్రాసము సుందరమై యొప్పునని భావము.

'క్వచిదస్తి' మొదలయిన శ్లోకమునందు వర్ణానుప్రాసమునకు వృత్త్యనుప్రాస మునకు భేదము వివరింపబడినది. వృత్త్యనుప్రాసమునందుకూడ అనుప్రాసఘటక ములు వర్ణములే. వర్ణానుప్రాసమునందును అనుప్రాసఘటకములు వర్ణములే. కావున భేదమును గుర్తించుకొనుట యవసరము. వర్ణానుప్రాసము పద్యము సర్వము నాక్రమించి యుండదు. కొన్నియెడల నున్నయెడల సరిపోవును. వృత్త్యను ప్రాసము పద్యము మొదటినుండి చివరివరకు వ్యాపించి యుండును. ఈ భేదము వల్లనే రెండింటిని వేర్వేరుగా గుర్తించి పేర్కొనుట జరిగినది.

అన్యే పునరన్యథా వృత్తిం వ్యాచక్షతే –

83. స్పర్శాదీనా మసంబంధః సంబంధో వాపి యో మిథః
స్ఫుటాది బంధ సంసిద్ధ్యై సైషా వృత్తి ర్నిగద్యతే.

అర్థము : ఇతరులు మరొక విధముగా వృత్తిని వ్యాఖ్యానించుచున్నారు. స్ఫుటాది బంధ సంసిద్ధికొరకు స్పర్శాదులయొక్క పరస్పర సంబంధము కాని అసంబంధము కాని వృత్తి యనబడును.

84. కావ్యవ్యాపీ చ సందర్భో వృత్తి రిత్యభిధీయతే
సౌకుమార్య మథ ప్రౌఢి ర్మధ్యమత్వం చ తద్గుణాః.

అర్థము : కావ్యమునందు వ్యాపించియున్న సందర్భమును వృత్తి యని యందురు. సౌకుమార్యము, ప్రౌఢి, మధ్యమత్వము – అనునవి దాని గుణములు.

85. గంభీరౌజస్వినీ ప్రౌఢా మధురా నిష్ఠురా శ్లథా
కఠోరా కోమలా మిశ్రా పరుషా లలితామితా.

86. ఇతి ద్వాదశధా భిన్నా కవిభిః పరిపఠ్యతే
కారణం పునరుత్పత్తే స్త ఏవాసాం విజానతే.

అర్థము : గంభీర, ఓజస్విని, ప్రౌఢ, మధుర, నిష్ఠుర, శ్లథ, కఠోర, కోమల, మిశ్ర, పరుష, లలిత, అమిత– అని వృత్తి కవులచేత పన్రెండు విధములుగా పరిగణింపబడుచున్నది. వాని యుత్పత్తికి కారణమును వారే యెరుగుదురు.

తాసు గంభీరా యథా –

'అప్ఫుందంతేణ ణహం మహిం చ తడి ఉద్ధమాఅదినేణ
దుందుభిగంభీరరవం దుందభిఅం అంబువాహేణ' 190

[ఛాయా –

'ఆస్పందతా నభో మహీం చ తడిదుధ్మాసిత దిశా
దుందుభి గంభీరరవం దుందుభిత మంబువాహేన']

సైషా ప్రాయ స్తవర్గ పవర్గయో స్తృతీయ చతుర్థానాం పకార ఫకారయోశ్చ స్వసంయోగ బిందుయోగాభ్యాం జాయతే.

అర్థము : వానియందు గంభీరావృత్తికి ఉదాహరణము. ఆకాశమును భూమిని కంపింపజేయుచు, మెరపులతో దిక్కులను ప్రకాశింపజేయుచు మేఘము దుందుభి గంభీరరవమును కలుగజేసెను.

ఇది తవర్గ పవర్గములయొక్క తృతీయ చతుర్థములకును, పకార ఫకారము లకును స్వసంయోగమువల్లను బిందుయోగమువల్లను జనించుచున్నది.

వ్యాఖ్య : వృత్తియొక్క పండ్రెండు భేదములలో మొదటిదయిన గంభీరా వృత్తికి ఉదాహరణ మిది. తవర్గమునందలి తృతీయ చతుర్థములు 'ద ధ'. పవర్గము నందలి తృతీయ చతుర్థములు 'బ భ'. 'అప్ఫుందంతేణ' – అని తన్నప్పుడు దవ ర్ణము బిందుసంయోగము నొందియున్నది. 'దుందుభి' – అని అన్నప్పుడు నట్లే యున్నది. గంభీర, అంబు – అనుచోట్ల బభవర్ణములు బిందు సంయోగమునొంది యున్నవి. 'ప్ఫు' 'ద్ధ' – అన్నవి స్వసంయోగము నొందిన స్థానములు ఇట్లు ఈ విధముగా సంయుక్తవర్ణములు ప్రయుక్తము లగుటవల్లనే దీనిని గంభీరావృత్తి లక్ష్యముగా గ్రహించుట జరుగుచున్నది.

ఓజస్వినీ యథా –

'పత్తాఅ సీఅరాహాఅ
ధాఊ సిలా అలణిసణ్ణ రాఇఅ జలఅమ్
సజ్ఝం ఓజ్ఝర పవాసిద
దరిముహ ణిమహిఅ వఉల మఇరామోఅమ్' 101

[ఛాయా –

'ప్రాప్తాశ్చ శీకరాహాత
ధాతుశిలా జలనిమగ్న రాజితజలదమ్
సహ్యాం నిర్ఝర ప్రవాసిత
దరీముఖ నిర్మథిత వకుళమదిరామోదమ్'

నేయం మూర్ధన్యానాం ప్రథమ చతుర్థ పంచమ ద్విత్వై స్తదా వృత్త్యా చ ప్రాయో జాయతే.

అర్థము : ఓజస్వినీవృత్తికి ఉదాహరణము. వీటితుంపురుల చేత కొట్టబడిన ధాతుశిలలందలి జలములందుండి కూర్చుండి రంజితములయిన మేఘములను కలిగి, సెలయేళ్ళరూపమున నవ్వుచున్న గుహాముఖములనుండి వెలువడుచున్న మదిరామోదమువంటి పొగడపూల వాసనలను గలిగియున్న సహ్యాపర్వతమును వారు (వానరవీరులు) చేరిరి.

ఇది మూర్ధన్యములయొక్క ప్రథమ చతుర్థ పంచమవర్ణములు రెండు మూడు పర్యాయములు ఆవృత్తినొందుటచేత జనించుచున్నది.

వ్యాఖ్య : ట ఠ డ ఢ ణ ఋ ర ష వర్ణములు మూర్ధన్యములు. మూర్ధన్యములు రెండో మూడో ఆవృత్తుల నొందినయెడల ఓజస్వినీవృత్తి కావచ్చు నని లక్షణము.

వివరణయందు 'ప్రథమ చతుర్థ' వర్ణముల పునరుక్తినిగూర్చి ప్రసక్తమయినది. ఉదాహృత పద్యమునందు ప్రథమ చతుర్థవర్ణములు ప్రయుక్తములు కాలేదు. రవర్ణము ఐదుసారులు ప్రయుక్తమయినది; ణవర్ణము మూడుసారులు ప్రయుక్తమయినది. ఇట్లగుటవల్లనే ఇది ఓజస్వినీ వృత్తికి లక్ష్యముగా ప్రదర్శింపబడినది.

ఉదాహరణపద్యము ప్రవరసేనుని సేతుబంధమహాకావ్యమునుండి స్వీకరింపబడినది.

ప్రౌఢా యథా –

'కృత్వా పుంవత్పాతముచ్చైర్భృగుభ్యాం
మూర్ధ్ని గ్రావ్ణాం జర్జరా నిర్ఝరౌఘాః
కుర్వన్తి ద్యాముత్పతంతః స్మరార్త
స్వర్లోక స్త్రీగాత్ర నిర్వాణ మత్ర' 192

సైషా ప్రాయేణ మూర్ధన్యానా మంతఃస్థానాం సంయోగాత్ పూర్వగురుత్వేన జాయతే

అర్థము : ప్రౌఢావృత్తికి ఉదాహరణము. ఇచ్చటి సెలయేటి ప్రవాహములు ఎత్తయిన తటములనుండి శిలల మూర్ధముపైని భృగుపాత మొనరించు

పురుషులవలె దుమికి శిథిలీభూతములై స్వర్గమునకు ఎగురుచున్నవై స్మరార్తలైన దేవతాస్త్రీలకు గాత్రనిర్వృతిని కలిగించుచున్నవి.

మూర్ధన్యములయొక్క అంతస్థములయొక్క సంయోగమువల్ల, పూర్వగురుత్వముచేత ఇది యేర్పడుచున్నది.

వ్యాఖ్య : మూర్ధన్యములు కాని అంతస్థములు కాని యితరవర్ణములతో సంయోగము నొందినయెడల ప్రౌఢావృత్తి యగునని లక్షణము. సంయుక్తవర్ణములకు పూర్వమందున్న వర్ణములు గురుత్వము నొందును. సహజముగా గురువులయిన వర్ణములకంటె సంయుక్తపరకత్వముచేత గురువులయిన వర్ణములవల్ల గతికి గాంభీర్య మలవడు ననుటలో సందేహము లేదు. త్వా, ర్భు, ర్ధి, ష్వా, ర్ణ, ర్థ, ర్వ, ద్యా - మున్నగు సంయుక్తములందు మూర్ధన్యములు కాని, అంతస్థములు కాని చేరి యున్నవి. ఈ వర్ణములతో నేర్పడిన సంయుక్తవర్ణము లున్నప్పుడు మాత్రమే గంభీర యగును.

ఉదాహృత శ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి స్వీకృతము.

మధురా యథా—

'కింజల్క సంగి శింజాన భృంగలాంఛిత చంపకః
అయం మధు రుపైతిత్వాం చండి పంకజదంతురః' 193

సైషా ప్రాయోఽనుస్వార పురోవర్తి స్పర్శతయా జాయతే.

అర్థము : మధురా వృత్తి కుదాహరణము. కేసరముల సాంగత్యము నొంది రొదచేయు తుమ్మెదలచేత లాంఛితములయిన సంపెంగలను గల యీ వసంతుడు పంకజదంతురుడై చండీ! నిన్ను సమీపించుచున్నాడు.

ఇది సాధారణముగా అనుస్వారముమీద స్పర్శతచేత జనించుచున్నది.

వ్యాఖ్య : పూర్ణబిందుపూర్వకములైన స్పర్శముల ప్రయోగమువల్ల మధురావృత్తి యేర్పడు నని లక్షణము. ఉదాహృత శ్లోకమునందు 'కింజల్క' అను చోట పూర్ణబిందువుమీద జవర్ణమున్నది. అట్లే తక్కినచోట్లను స్పర్శములే నిల్చి

యున్నవి కవర్గము నుండి మవర్గమువరకుగల హల్లులను స్పర్శము లని యందురు. అనుస్వార పురోవర్తిస్పర్శముల యావృత్తిని కలిగియుండుటవల్లనే యిది మధురా వృత్తికి ఉదాహరణమైనది.

నిష్ఠురా యథా -

'స్వాంగ శ్లిష్టాద్రి జన్మానం నేత్రార్చిః ప్లుష్టమన్మథమ్
స్తౌమి త్ర్యక్షం ద్యువజ్జ్యేష్ఠం దైత్యశ్రేణ్యర్చితాంఘ్రికమ్' 194

సైషా ప్రాయః సంయోగభూయస్త్వే నోత్పద్యతే.

అర్థము : నిష్ఠురావృత్తి కుదాహరణము. తన శరీరముతో పార్వతిని కౌగిలించుకొన్నవాడును, నేత్రాగ్నిచేత మన్మథుని భస్మీకరించిన వాడును, దేవతలలో జ్యేష్ఠుడును, రాక్షసశ్రేణులచేత అర్చింపబడిన పాదములు గలవాడును అయిన ముక్కంటిని స్తవము చేయుచున్నాను.

సంయుక్తవర్ణముల ఆధిక్యమువల్ల ఇది జనించుచున్నది.

వ్యాఖ్య : సంయుక్తవర్ణముల ఆధిక్యమువల్ల నిష్ఠురావృత్తి యేర్పడునని లక్షణము. మధురావృత్తియందు అనుస్వారములమీది స్పర్శముల యావృత్తిని చెప్పుకొంటిమి. విజమునకు 'కింజల్క, సంగి' మొదలయిన వానిని 'కిఞ్జల్క, సఙ్గి' మొదలయిన విధముగా వ్రాయుట సంస్కృత సంప్రదాయము. కావున, అచ్చటనున్నవికూడ సంయుక్తములే. అచ్చట స్పర్శములు తమ తమ వర్గానునాసికములతో సంయోగము నొందుచున్నవి. అందువల్లనే, అచ్చటి నాదము మధురమై మధురావృత్తిని కలిగించుచున్నది. ప్రకృతమైన నిష్ఠురావృత్తియందు తద్భిన్న వర్ణములు సంశ్లిష్టములైయుండును. ఈ సంయుక్తవర్ణముల పునఃపునః ప్రయుక్తి ధారాళతకు అడ్డుతగులుటయే కాక శ్రుతి సౌఖ్యమునకును అపకర్షను కలిగించును. అందువల్లనే, యిది నిష్ఠురావృత్తి యని పేర్కొనబడుచున్నది.

ఉదాహృత పద్యమునందు 'శ్లిష్టాద్రి, న్మా, త్రార్చిః, ప్లుష్ట, న్మ మొదలయిన విధముగా సంయుక్తవర్ణము లధికసంఖ్యాకములైయున్నవి. కావుననే, యిది నిష్ఠురావృత్తికి లక్ష్యమైనది.

శ్లథా యథా -

'దయిత జన విరహ విగలిత
నయనోదక క్షీత హారిణ మదతిలకమ్
వదన మపగత మృగమద
శశికరణిం వహతి లోలదృశః' 195

సేయం ప్రాయో వ్యంజనానా మసంయోగేన జన్యతే.

అర్థము : శ్లథావృత్తి కుదాహరణము. ప్రియుని యెడబాటుచేత కారిన కన్నీటిచేత త్రాగబడిన కస్తూరీతిలకముగల వదనము తొలగింపబడిన మృగమదము గల చంద్రబింబమువలె చంచల దృష్టులను ధరించుచున్నది.

ఇది సాధారణముగా వ్యంజనవర్ణములకు సంయోజనము లేకపోవుటచే జనించు చున్నది.

వ్యాఖ్య : శ్లథమయిన వృత్తిని కలిగియున్నది శ్లథావృత్తి. శ్లథము అని యనగా బిగువులేని దని యర్థము. వ్యంజనవర్ణముల సంయోగమువల్ల రచనకు బిగువు వచ్చును. శ్లథమునందు హల్లుల సంయోగము సాధారణముగా కానరాదు. ఇది లక్షణము. ఉదాహృత శ్లోకమున సంయుక్తాక్షరము లేదు. కావుననే యిది లక్షణమునకు సరిపోయినది.

[మూడవ పాదము 'వదన మపాగత మృగపద' అని యుండియుండుట సమంజసము. లేనియెడల ఛందస్సు తప్పుచున్నది. 'మృగమదము' అని యనగా 'కస్తూరి' యని యర్థము. చంద్రునికి 'కస్తూరి' తొలగిపోవుటచేత కాక 'మృగపదము' తొలగుటచేత విహ్వలత్వము కలుగుట రమణీయము. మృగపదము అని యనగా హరిణ ముండెడి స్థానము. చంద్రుడు హరిణలాంఛనుడు కదా!]

కఠోరా యథా -

'నిసర్గ నిర్గతానర్ఘ ఘర్ఘరధ్వని హాస్తికమ్
చక్రే చక్రం యుధి క్రామన్నలర్కః కర్కశార్కరుక్' 196

సైషా ప్రాయః కంఠ్యరేఫాది సంయోగా దుత్పద్యతే.

అర్థము : కఠోరావృత్తి కుదాహరణము. కర్కశ సూర్యకిరణుడైన అలర్కుడు యుద్ధమునందు సంచరించుచు సేనాసమూహమును స్వాభావికముగానే వెలువడుచున్న అనర్ఘమైన ఘర్ఘరధ్వని గల గజసమూహముగా చేసెను.

ఇది సాధారణముగా కంఠ్యము, రేఫము మొదలయినవాని సంయోగమువల్ల జనించుచున్నది.

వ్యాఖ్య : కంఠ్యముతో కాని, రేఫముతో కాని సంయుక్తములయిన వర్ణముల ఆవృత్తివలన కఠోరావృత్తి జనించునని లక్షణము.

నిష్ఠురావృత్తియందు సంయుక్తవర్ణము లధికముగా నుండును. కఠోరావృత్తియందు పైతము సంయుక్తవర్ణముల ప్రయోగమే యెక్కువగా నుండును. ఇంక రెండింటికి భేదమేమి ? ఏహల్లు మరి యే హల్లుతోనైన సంయోగముచెంది నిష్ఠురావృత్తి కావచ్చును. దీనికి వ్యాప్తి యెక్కువ. కఠోరావృత్తియందు కవర్గమును, రేఫమును సంయోగము నొందును. లక్షణవాక్యమునందు 'రేఫాది' అని ఆదిశబ్దము నుపయోగించుటవల్ల క్వాచిత్కముగా నితర వర్ణసంయోగముకూడ సమ్మతమే. కాని అది ప్రధానము కారాదు. అదే ప్రధానమైనచో నిష్ఠురావృత్తిగా పరిగణన కెక్కును గాని కఠోరావృత్తిగా పరిగణనకు రాదు.

ఉదాహరణ శ్లోకమునందు ర్గ, ర్ఘ, క్ర, ర్క మున్నగునవి కంఠ్యరేఫ సంయుక్తములు. వీని సంఖ్యయే యధికము. ధ్వ, స్త్రి, న్న - అన్నవి అన్య సంయుక్తములు. వీని సంఖ్య యల్పము. కావుననే, యిది కఠోరావృత్తికి లక్ష్యమయినది.

కోమలా యథా -

'దారుణ రణే రణంతం
కరిదారణ కారణం కృపాణం తే
రమణకృతే రణరణకీ
పశ్యతి తరుణీ జనో దివ్యః' 197

సేయం రేఫ ణకారాద్యసంయుక్త కోమల వర్ణవిరచనయా నిష్పద్యతే.

అర్థము : కోమలావృత్తి కుదాహరణము. దారుణమైన సంగ్రామమందు ధ్వనిచేయుచు ఏనుగులన్ను ఖండించుటకు కారణమైన నీఖడ్గమును రమణుల నిమిత్తమై ప్రేమతో దివ్యతరుణీజనము చూచుచున్నది.

ఇది రేఫము, ణకారము మొదలయిన అసంయుక్త కోమలవర్ణముల రచన చేత సిద్ధించుచున్నది.

వ్యాఖ్య : కోమలవర్ణములు అసంయుక్తములుగా రచింపబడిన యెడల కోమలావృత్తి యేర్పడునని లక్షణము. లక్ష్యమునందు రేఫమును, ణవర్ణమును అనేక పర్యాయము లావృత్తములైయున్నవి. ను, న, ద – మున్నగు నాదవర్ణములు 'ఆది' పదముచేత గ్రహింపబడుచున్నవి. ఇవి పునరుక్తములు కాలేదు; కాన వీనివలన కోమలత్వము కలుగునా? లేదా? యన్న ప్రశ్న తలయెత్తదు. కాని, వీని ప్రయోగమువలన కోమలావృత్తికి భంగము కలుగకుండ నుండుటయే ఫలము.

మిశ్రా యథా -

'పినష్టీవ తరంగాగ్రై రుదధిః ఫేనచందనమ్
తదాదాయ కరై రిందుర్లింపతీవ దిగంగనాః' 198

సైషా ప్రాయః కఠోరాణా మోష్ఠ్య కంఠ్య మూర్ధన్యానాం బాహుల్యాదిభి రుత్పద్యతే.

అర్థము : మిశ్రావృత్తి కుదాహరణము. సముద్రము తరంగాగ్రములచేత నురుగుగంధమును తీయుచున్నట్లున్నది. దానిని తీసికొనివచ్చి చంద్రుడు తన కరములతో దిశాకాంతలకు పూయుచున్నట్లున్నది.

ఇది సాధారణముగా కఠోరములైన ఓష్ఠ్య కంఠ్య మూర్ధన్యముల బాహుల్యాదులచేత ఉత్పన్న మగుచున్నది.

వ్యాఖ్య : ఓష్ఠ్యకంఠ్యమూర్ధన్యములలోని కఠోరవర్ణములను కొన్నియెడల అధికముగను, కొన్నియెడల అల్పముగను మిశ్రణముచేసి ప్రయోగించుటచేత మిశ్రావృత్తి యేర్పడు నని లక్షణము. పఫలు కఠోరములైన ఓష్ఠ్యములు క ఖ లు కఠోరములయిన కంఠ్యములు, ట ఠ లు కఠోరములైన మూర్ధన్యములు. ఇవి

యితరవర్ణములతో సంయోగము నొందియు, సంయోగము నొందకయు గ్రథితము లైన యెడల మిశ్రావృత్తి యగును. ఉదాహరణమునందలి 'పిసష్టి' 'తరంగాగ్రైః' 'ఫేన' 'ఇందుర్లింపతి' మున్నగు రూపములనుబట్టియే మిశ్రావృత్తిగా దీనిని పరిగణించుట జరుగుచున్నది.

పరుషా యథా -

'జహ్రే నిర్హ్రాదిహ్రాదోఽస్తా కహ్లారాహ్లాదిత హ్రదః
ప్రసహ్యా మహ్యా గర్హ్యాత్వ మర్హ్యాణార్హ్యాః శరన్మరుత్' 199
సైషా ప్రాయేణోష్మణా మంతఃస్థాది సంయోగై రవస్థాప్యతే.

అర్థము : పరుషావృత్తికి ఉదాహరణము. నీరవవరోవరమునకు సంబంధించి తెల్లగలువలచేత ఆనందపెట్టబడిన సరస్సు గల శరద్వాయువు భూమీ గర్హ్యత్వము నోర్చుకొని పూజార్హముగా గ్రహింపబడెను;

ఇది ప్రాయికముగా ఊష్మములకు అంతస్థాదుల సంయోగముచేత నేర్పడుచున్నది.

వ్యాఖ్య : ఊష్మములును అంతస్థములును సంయుక్తములై పునరుక్తము లైన యెడల పరుషావృత్తి యేర్పడునని లక్షణము. ఉదాహృత పద్యమునందు హకారముతో రేఫము నాలుగుచోట్ల సంయోగము నొందినది. రేఫముతో హకారము మూడుచోట్ల సంయోగము నొందినది. హకారముతో లకారము రెండుచోట్లను, యకారము మూడుచోట్లను సంయోగము నొందినది. హవర్ణము ఊష్మము. య ర ల వ ఌ అంతస్థములు. ఆది శబ్దముచేత ఇతరము లయిన ప్ర, త్వ, న్మ మున్నగు సంయుక్త వర్ణములకును ప్రవేశము కలుగవచ్చును; కాని వానికి ప్రాధాన్యము కలుగదు.

లలితా యథా -

'ద్రావిడీనాం ధ్రువం లీలారేచిత భ్రూలతే ముఖే
ఆసజ్య రాజ్యభారం స్వం సుఖం స్వపితి మన్మథః' 200

సైషా ప్రాయేణ దంత్యౌష్ఠ్యతాలవ్యానాం మధ్యేఽంతః స్థాది సంయోగైః స్థాప్యతే.

అర్థము : లలితావృత్తికి ఉదాహరణము. ద్రావిడ స్త్రీలు సవిలాసముగా ఎత్తిన కనుబొమలు గల ముఖమునందు తన రాజ్యభారమును నిల్పి మన్మథుడు నిశ్చయముగా సుఖముగా నిద్రించుచున్నాడు.

ఇది ప్రాయికముగా దంత్యౌష్ఠ్యతాలవ్యములకు నడుమ అంతస్థాదుల సంయోగముచేత సంపన్నమగుచున్నది.

వ్యాఖ్య : అంతస్థములును దంత్యతాలవ్యౌష్ఠ్యములును సంయుక్తములై పునఃపునః ప్రయుక్తములైనయెడల లలితావృత్తి యగునని లక్షణము. ఉదాహరణమునందు రేఫము ద ధ భ లతో సంయోగము నొందినది యకారము జకారముతో రెండుచోట్ల, వకారము సకారముతో రెండుచోట్ల సంయోగము నొందినవి.

అమితా యథా -

'వకుల కలికా లలామని
కలకంఠీ కలకలాకులే కాలే
కలయా కలావతోఽపి హి
కలయతి కలితాస్త్రతాం మదనః' 201

సేయ మమితయోరేవ కకార లకార బంధయో రనుప్రాసేన ప్రసూయతే.

అర్థము : అమితావృత్తి కుదాహరణము పొగడ మొగ్గలతో శ్రేష్ఠమైనదియు, కలకంఠీ కలకలాకులమైనదియు నైన కాలమున చంద్రుని కళను కూడ మన్మథుడు తన కస్త్రముగా వినియోగించుకొనును

ఇది అమితములైన కకార లకార బంధములయొక్క అనుప్రాసముచేత ప్రాదుర్భవించుచున్నది.

వ్యాఖ్య : కవర్ణ లవర్ణములు జంటకట్టి పునఃపునః ప్రయుక్తములైనయెడల అమితావృత్తి యగునని లక్షణము. ఉదాహరణమునందు కుల, కలి, కాల, కలకల,

కులే, కాలే మున్నగు విధముగా కకార లకారములు వెంటవెంట ముహుర్ముహు రు క్తములైనవి. వానిపైని చేరిన స్వరముల భేదముచేత వర్ణభేదము కలిగినది. ఇట్లు రెండే వర్ణములు అమితమైన ఆవృత్తులను పొందుటచేత ఇది అమితావృత్తికి లక్ష్యమయినది.

87. ఇతి ద్వాదశధా వృత్తిః కైశ్చిద్వ్యాకథితేహ సా
న గుణేభ్యో న వృత్తిభ్యః పృథక్త్వేనావభాసతే.

అర్థము : ఈ విధముగా కొందరచేత పండ్రెండు విధములుగా చెప్పబడిన వృత్తి గుణముల కంటెను వృత్తులకంటెను భిన్నముగా భాసించుట లేదు.

వ్యాఖ్య : ఇతరులు కొందరు వృత్త్యనుప్రాసమును గంభీరావృత్తి మొదలయిన పేరులతో పండ్రెండు విధములుగా పరిగణించుచున్నారని తెల్పి వానివి లక్షణ లక్ష్యసమన్వితముగా భోజదేవుడు ప్రదర్శించియున్నాడు. ఇది అన్యుల మతమే కాని తనకు సమ్మతము కాదు. అందువల్లనే ప్రారంభమునందు (లక్షణ శ్లోకము 86) 'వాని యుత్పత్తికి కారణమును వారే యెరుగుదురు' అని తెలిపెను. ఆయన యభిప్రాయమునుబట్టి గంభీరాదివృత్త్యనుప్రాసభేదములను వేరుగా పరిగణించుటకు తగిన కారణము లేదు. అదే విషయమును తిరిగియిచ్చట ఉద్ఘాటించుట జరుగుచున్నది. సమతా సౌకుమార్యాది గుణముల కంటెను, భారతీ వైదర్భీ ప్రభృతి వృత్తులకంటెను పైని చూపిన వృత్త్యనుప్రాస విభాగము భిన్నముగా లేదు. ఒకే భూమిక నాధారముచేసికొని రెండు విధములుగా విభాగముగావించుట సరియైనపద్ధతి కాదు. అందువల్లనే భోజదేవుడు దీనిని సమర్థించుటలేదు. అయినను పూర్వపూర్వులను విడిచి శాస్త్రము ప్రవర్తింపదు. కావుననే, వాని మతమునుకూడ ప్రదర్శించి తన యభిమతమును వ్యక్తముచేయుచున్నాడు. ఇంకొక విషయము. గంభీరావృత్త్యాది భేదములకు లక్షణమును చెప్పినప్పుడు 'ప్రాయేణ' అన్న పదము నుపయోగించుట కూడ భోజదేవుని అసమ్మతికే సూచకముగా నున్నది. విభాగ విధానము నందే అంగీకారము లేనప్పుడు లక్షణ నిర్ణయము గావించుట వీలుకాదు. అయినను, పూర్వాభిప్రాయమును పునరుక్తము గావించుటయే ఆయన చేసిన పని. తాను చెప్పిన కర్ణాటీ వృత్త్యనుప్రాసాది భేదములలో గంభీరాదులకు చూపిన లక్ష్యములు ఇమిడిపోవును. కావున వీనిని వేరుగా పరిగణించుట ప్రయోజనవంతము కాదు.

88. శ్రుత్యనుప్రాస వర్ణానుప్రాసయో రపి దుష్కరాః
క్వచిద్భేదాః పృథక్కర్తు మస్యా స్తేనేహ నేష్యతే.

అర్థము : శ్రుత్యనుప్రాసకంటెను, వర్ణానుప్రాసకంటెను కూడ దీని భేదములు పృథక్కరణమునకు దుష్కరములు. అందువల్ల ఇచ్చట అపేక్షితము కాదు.

వ్యాఖ్య : పూర్వము చెప్పిన శ్రుత్యనుప్రాసమునకును, ఇకముందు చెప్పబోవు వర్ణానుప్రాసమునకును ఘటకములు వర్ణములే. అట్లే యీ రెంటికిని నడుమ చెప్పిన వృత్త్యనుప్రాస ఘటకములుకూడ వర్ణములే. అందువల్ల శ్రుత్యనుప్రాస భేదములతోను, వర్ణానుప్రాసభేదములతోను వృత్త్యనుప్రాసభేదములు కొన్ని యెడల సాదృశ్యమును కలిగియుండును. వానిని వేరుచేసి చెప్పుట కష్టసాధ్యము. కావుననే, ఆ ప్రయత్నము యిచ్చట చేయుటలేదు.

[వర్ణాను ప్రాసము]

89. యథాఽమ్రాతక పుష్పాది స్రగాదే ర్వర్ణ ఉచ్యతే
వర్ణావృత్తి స్తథా వాచాం వర్ణానుప్రాస ఉచ్యతే.

అర్థము : పూలమాలకు నడుమ నడనడ గూర్చిన ఆమ్రాతకాది పుష్పములను వర్ణమని యందురు. అట్లే వాక్కులలో నున్న వర్ణావృత్తిని వర్ణానుప్రాసమని యందురు.

90. న తు స్తబకవాన్ స్థానీ గర్భో వివృతసంవృతః
గృహీత ముక్తః క్రమవాన్ విపర్యస్తోఽథ సంపుటః.

91. మిథునం వేణికా చిత్రో విచిత్రశ్చేతి వర్ణ్యతే
వర్ణావృత్తి ప్రయోగేభ్య స్తేభ్య స్తేభ్యో మనీషిభిః.

అర్థము : ఆయా వర్ణావృత్తిప్రయోగములనుబట్టి పండితులు వర్ణానుప్రాసమును 1. స్తబకవంతము 2 స్థాని 3. గర్భము 4. వివృతసంవృతము 5. గృహీతముక్తము 6. క్రమవంతము 7. విపర్యస్తము 8. సంపుటము 9. మిథునము 10. వేణిక 11. చిత్రము 12. విచిత్రము – అని పండ్రెండు విధములుగా పరిగణించుచున్నారు.

తేషు స్థానే స్థానేఽనుప్రాస విన్యాసతః స్తబకవాన్ యథా-

'యస్యావాసీకృత హిమగిరేర్గుంజతాం కుంజరాణా
మావిశ్చక్రే వనగజ మదాఘ్రాణ ఘోరాయితాని
దర్పోత్ఫుల్ల స్ఫురణ వికటా కాండ కండూల గండ
స్వేచ్ఛా కామ ప్రణిత సరలానోకహాస్కంధ గంధః' 202

అత్ర గుంజతాం కుంజరాణా మిత్యాదే ర్వర్ణ స్తబకస్య స్థానే స్థానే విన్యాసాదయం వర్ణానుప్రాసః స్తబకవా నిత్యుచ్యతే.

అర్థము : వానిలో స్థానస్థానమునందు ననుప్రాస విన్యాసమువలని స్తబక వంతమున కుదాహరణము. అతని కావాసముగా నయిన హిమగిరియందు ఘీంక రించుచున్న యేనుగులు అకారణముగా తీవ్రముగా దురద పెట్టుచున్న తమ గండ స్థలములను దర్పాతిశయస్ఫోరకముగా స్వేచ్ఛగా అచ్చటి చెట్లకు రుద్దుకొను చున్నవి. అట్లు రుద్దుకొనుటచేత సరళవృక్షముల స్కంధములు వ్రణితములై గంధమును వెలార్చుచున్నవి. ఆ గంధము(పవనములను) వనగజమద వాసనాఘోరా యితములుగా చేసినది.

ఇచ్చట 'గుంజతాం కుంజరాణాం' అని మొదలయిన వర్ణ స్తబకమునకు స్థాన స్థానమునందును విన్యాసముండుటవల్ల, ఈ వర్ణానుప్రాసము స్తబకవంతము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : వర్ణములయొక్క ఆవృత్తివిబట్టియే వర్ణానుప్రాస మగుచున్నది. స్తబకమనగా గుత్తియని యర్థము. వర్ణ స్తబకము అని యనగా వర్ణముల సమూ హము అని యర్థము. రెండు మూడు వర్ణములు ఒక స్తబకముగా ఏర్పడి పున రుక్తి నొందిన యెడల స్తబకవంత మన్న యనుప్రాస మేర్పడును. భిన్నభిన్న స్తబకములు భిన్నభిన్న స్థానములందు పునరుక్తములై పద్యము నంతటి నావరించి యున్నప్పుడు లక్షణము సమగ్రముగా సమన్వితమగును.

ఉదాహరణమునందు 'గుంజతాం కుంజరాణాం' అన్నచోట పూర్ణబిందుపూర్వ కమైన జకారము పునరుక్తమై అనుప్రాస ఘటకమగుచున్నది. మూడవపాదము నందు 'అకాండ కండూల గండ' అనుచోట పూర్ణబిందుపూర్వకమైన డవర్ణము పున

రు_క్తమగుచున్నది. చతుర్థపాదమునందు 'స్కంధ గంధః' అనుచోట పూర్ణబిందు పూర్వకమైన ధవర్ణము పునరు_క్తమగుచున్నది. ఈ పునరు_క్తి మూడు స్తబకము లకు నిర్వహింపబడి, పద్యమునంతటి నావరించియుండుటచేత, ఇది స్తబకవంతము అను పేరుగల వర్ణానుప్రాసమునకు లక్ష్యమగుచున్నది.

నియత వివక్షిత స్థానవిశేషః స్థానీ యథా -

'బాలే మాలేయ ముచ్చైర్న భవతి గగనవ్యాపినీ నీరదానాం
కిం త్వం పక్ష్మాంతరాలై ర్మలినయసి ముధావ_క్త్రిమ_శ్రుప్రవాహైః
ఏషా ప్రోద్వృ_త్త మ_త్తద్విప కట కషణ క్షుణ్ణవింధ్యోపలాభా
దావాగ్నే ర్వ్యోమలగ్నా మలినయతి దిశాం మండలం ధూమరేఖా

అత్ర ప్రథమ త్రిభాగ స్థానేషు బాలే మాలేయ మిత్యాది నియమేన వృ_త్తిః. సోఽయం వర్ణానుప్రాసః స్థానీత్యుచ్యతే.

అర్థము : నియత వివక్షిత స్థానవిశేషము గల స్థానికి ఉదాహరణము. ఓ బాలా! ఆకాశమునందు మేఘముల సమూహము వ్యాపింపలేదు. నీవు కనురెప్పల నడిమి కన్నీటిధారలతో ముఖము నేల కలుషితము చేసికొనుచున్నావు? ఇదిగో! ఇది దుర్నివారములైన మ_త్తగజములు తమ గండస్థలములతో రాయుటచేత అరగి నునుపుదేరిన వింధ్యపర్వత శిలవలె నున్న దావాగ్ని ధూమరేఖ ఆకాశమును వ్యాపించి దిఙ్మండలమును మలినపరుచుచున్నది.

ఇచ్చట ప్రథమ త్రిభాగస్థానములందు 'బాలా మాలేయం' మొదలయిన నియ మముచేత వృ_త్తి. ఇది స్థాని యను వర్ణానుప్రాసముగా వర్ణితమగుచున్నది.

వ్యాఖ్య : స్థాన నియమముగల వర్ణానుప్రాసమునకు స్థాని యని పేరు. స్తబకవంతమునకు స్థాననియమము లేదు. ఏ పాదమునం దెచ్చటనైన నావృ_త్తి యుండవచ్చును. ఈ స్థానియందును వర్ణస్తబకమే ఆవృ_త్తి నొందును; కాని యది సర్వత్ర స్థాననియమము ననుసరించి ప్రవ_ర్తించును. ఈ రెండింటికి సూక్ష్మభేద మిది.

ప్రతిపాదమును ఆది మధ్యాంతము లని మూడు భాగములుగా భావింపవల యును. అందు ఆదియందు ఆవృ_త్తియున్న ప్రతిపాదమందట్లే యుండవలయును.

మధ్యమందున్న మధ్యమందే, అంతమందున్న అంతమందే ఆవృత్తి యుండవల యును. అప్పుడే స్థానియన్న వర్ణానుప్రాస భేదమగును.

ప్రకృతోదాహరణమునందు ఏడేసి యక్షరములకు ఒక భాగముగా ప్రతిపాద మును మూడు భాగములు చేసికోవలయును. ఆ మూడు భాగములలో మొదటి భాగమునందే వర్ణస్తబకము ఆవృత్తి నొందినది. ఆదిమభాగమే యిచ్చట వ్యవస్థిత మైన స్థానము. 'బాలామాలేయ' మనుచోట ఆకారముతో లకారము అనుప్రాస ఘటకము. ఇది ప్రథమపాదము నందున్నది. ద్వితీయపాదము తొలిభాగమునందు 'కింత్వం పక్ష్మంత' అనుచోట పూర్ణబిందువుతోడి తకారము అనుప్రాసఘటకము. తృతీయపాదాది నున్న 'ప్రోద్వృత్త మత్త' అనుచోట తకార ద్విత్వము అనుప్రాస ఘటకము. చతుర్థ పాదాది నున్న 'దావాగ్నే ర్వ్యోఘలగ్నా' అనుచోట గకార నకార సంయుక్తము అనుప్రాస ఘటకము. ఇట్లు లక్షణానుగుణముగా స్థానినియ తితో వర్ణస్తబకము ఆవృత్తి నొందుటచేతనే యీ పద్యము స్థానికి లక్ష్యమయినది.

ఈ పద్యమునందు ప్రథమపాద తృతీయభాగమునందు 'నీ' పునరుక్తమయి నది. ద్వితీయపాదమున 'మ' – తృతీయపాదమున 'క', 'ప' – చతుర్థపాదమున 'మ' పునరుక్తములయినవి. ఇవి యాదృచ్ఛికములు. సమవర్ణములే కాని స్తబక ములు కావనుట గమనార్హము. కావుననే ప్రస్తుత స్థాని విషయమున పరిగణనీయ ములు కావు.

ఆవృత్తే ర్వర్ణాంతరాయేణ గర్భో యథా –

'కాలం కపాలమాలాంక మేక మంధకసూదనమ్
వందే వరద మీశానం శాసనం పుష్పధన్వనః' 204

అత్ర కాలం కపాలమాలేతి, అంకమేకమితి, వందే వరదమీ శానం శాసన మిత్యాదిషు* పకార రేఫ కకార గర్భాధానాదయం వర్ణానుప్రాసో గర్భ ఇత్యుచ్యతే.

---

* పకార వకార మకార రేఫ కకార గర్భాధానాదయం – శ్రీ జీవానంద సాగర ప్రతి.

అర్థము : ఆవృత్తికి వర్ణాంతరాయముచేత కలిగెడి గర్భమున కుదాహరణము. కాలస్వరూపుడును, కపాలమాల ధరించినవాడును, అద్వితీయుడును, అంధకాసుర సంహారకుడును, వరప్రదాయకుడును, మన్మథ శాసకుడును నైన ఈశ్వరునికి నమస్కరించుచున్నాను.

ఇచ్చట 'కాలం కపాలమాలా' అని 'అంకమేక'మని 'వందే వరద మీశానం శాసన' మని మున్నగువానియందు పకారమును, రేఫమును, కకారమును గర్భమునందు నెలకొల్పుటవల్ల ఈ వర్ణానుప్రాసము గర్భము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : స్తబకములయిన వర్ణముల నడుమ అన్యవర్ణమును చేర్చి ఆవృత్తము గావించినయెడల గర్భవర్ణానుప్రాస మగునని లక్షణము.

శ్లోకపూర్వార్ధమునందు కాల, అంక - అనునవి స్తబకములు. అట్లే ఉత్తరార్ధమునందు వందే, (ఈ)శానం - అనునవి స్తబకములు. 'కాల' పదము అవ్యవహితముగా ఉక్తమయిన 'కపాలమాలా' యందలి 'కపాల' అను విధముగా ఆవృత్తి నొందినది. తొలిపదము గర్భమునందు పవర్ణము విహితమైనది. 'అంక' అనుపదము 'అంధక సూదనమ్' అను సమాసమునందలి పూర్వపదముగా 'అంధక' అని ఆవృత్తి నొందినది. 'అంక' యనునది 'అంధక' యని యగుటకు ధవర్ణమును నడుమ నిముడ్చుకొన్నది. ఉత్తరార్ధమునందు 'వందే' అన్న స్తబకము 'వరద' రూపమున నావృత్తినొందినది. తొలి స్తబకమునందలి పూర్ణబిందువు తొలగిపోయినది. రవర్ణము అదనముగా చేరినది. అట్లు కాగా 'వంద్' అను వర్ణసమూహము 'వరద్' అను వర్ణసమూహముగా పరివర్తితమయినది. చివరి స్తబకము 'శానం' అమనది. ఇది నడుమ నకారమును చేర్చుకొని 'శాసనం' అని ఆవృత్తి నొందినది. ఇట్లు గర్భమునందు అన్యవర్ణము నాధానముచేసికొన్న ఆవృత్తియగుట చేతనే దీనికి గర్భము అన్న పేరు సార్థకమగుచున్నది.

[వృత్తియందు గర్భితవర్ణములుగా ప, ర, క వర్ణములు తెలుపబడినవి. పైశ్లోకమునందు కవర్ణము ప్రసంగము కానరాదు. ప్రసక్తములయిన ధ స వర్ణములు వృత్తియందు పేర్కొనబడలేదు; ఇది నిర్ణయసాగర ప్రతివిషయము. శ్రీ జీవానందసాగర ప్రతియందు ప, వ, మ, ర, క వర్ణములు తెలుపబడినవి. ఇచ్చట వ మ వర్ణములు అదనముగా చేర్చినవి. కాని ఉదాహృత శ్లోకమునందు వాని ప్రసక్తి

కానరాదు. కావున వృత్తి భాగమును 'పకార ధకార రేఫ పకార గర్భాధానా దయం' అని వవరించుకొనుట సమంజసము.]

స్థానే స్థానే వికాససంకోచాభ్యాం వివృతసంవృతో యథా -

'న మాలతీదామ విమర్ద యోగ్యం
న ప్రేమ నవ్యం సహతేఽపరాధాన్
మ్లానాపి న మ్లాయతి కేసరస్రగ్
దేవీ న ఖండప్రణయా కథంచిత్' 205

అత్ర ప్రథమపాదే న మాలతీదామేత్యాదిభి ర్వికాసః; ద్వితీయ పాదే ప్రేమేత్యేకావృత్త్యా సంకోచః; తృతీయపాదే మ్లానాపి న మ్లాయతీత్యేతాభ్యాం చ వికాసః; చతుర్థే నేతి సంకోచః. సోఽయం వర్ణానుప్రాసో వివృతసంవృత ఇత్యుచ్యతే.

అర్థము : వేర్వేరు స్థలములందు వికాస సంకోచములవల్ల నేర్పడు వివృత సంవృతమున కుదాహరణము. మాలతీ పుష్పమాల నలుపుటకు యోగ్యము కాదు. నవ్యప్రేమ అపరాధములను సహింపదు. కేసర పుష్పములమాల వాడియు వాడదు. దేవి ఎల్లో ప్రేమను తగ్గించుకొనలేదు.

ఇచ్చట ప్రథమపాదమందు 'నమాలతీదామ' మున్నగువానిచేత వికాసము; ద్వితీయపాదమందు 'ప్రేమ' యని ఒకే ఆవృత్తిచేత సంకోచము; తృతీయపాద మందు 'మ్లానాపి న మ్లాయతి' అనువానిచేత వికాసము; చతుర్థమందు 'న' యనుటచేత సంకోచము. ఈ వర్ణానుప్రాసము వివృత సంవృతము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : వికాసమునకే వివృతమని సంకోచమునకే సంవృతమని నామాం తరములు. వికాస సంకోచములు కారణముగా ఏర్పడెడి వర్ణానుప్రాస మగుటచేత దీనికి వివృత సంవృతమన్న పేరు సార్థకముగా నున్నది.

సకృదావృత్తి సంకోచము; అసకృదావృత్తి వికాసము. ఉదాహృత పద్యము నందు అనుప్రాస ఘటకము మవర్ణము. ఇది ప్రథమపాదమునందు మూడు పర్యా యములు ప్రవృత్తమయినది. కావున, వికాసమునొందినది. ద్వితీయపాదము

నందు 'ప్రేమ' యన్న యొక్కచోటనే మవర్ణ మున్నది. కావున నిచ్చట సంకోచము నొందినది. మూడవపాదమునందు 'మ్లా' యని రెండు పర్యాయములు ప్రయుక్తమయినది. కావున వికాసము. నాలుగవపాదమునందు ఒక్కమారుకూడ ప్రయుక్తము కాలేదు. కావున సంకోచము. ఇట్లు వికాసము సంకోచము, మరల వికాసము సంకోచము ఉదాహరణ పద్యమునందు కాననగును. కావుననే, యిది వివృతసంవృతమునకు లక్ష్యమయినది.

భోజదేవుని వృత్తి ననుసరించి పైవ్యాఖ్యానము ప్రవృత్తమయినది. ఉదాహరణమునందు 'న' వర్ణముకూడ బహుపర్యాయము లావృత్తమయినది. కావున, దానిని కూడ అనుప్రాస ఘటకముగా స్వీకరింపవచ్చును. అట్లయినప్పుడు ప్రథమపాదమందు 'న' వర్ణమొక్కచోటనే యుండి సంకోచమును కలిగించుచున్నది. ద్వితీయపాదమందు రెండుచోట్ల నుండుటచేత వికాసము. తృతీయపాదమందు రెండుచోట్ల నుండుటచే వికాసము. చతుర్థపాదమందు ఒక్కచోట నుండుటచే సంకోచము. ఇట్లు సంకోచ వికాస సంకోచములచేత సంవృత వివృత సంవృత మన్న పేరున మరొక భేదమును పరిగణింపవచ్చును. అట్లు కాకున్న, వివృత సంవృతములోనే అంతర్భవింపజేయవచ్చును ఇదే కాక, సంకోచ వికాసములున్నప్పుడు సంవృత వివృత మనుభేదముకూడ నేర్పరచవచ్చును. దానికి నిదియే యుపలక్షణము.

చక్రవాలవద్ధానోపాదానాభ్యాం గృహీతముక్తో యథా -

లోలల్లవంగలవలీ వలయా నికుంజ
కూజత్కపింజలకులా ముకులానవద్యాః
అధ్యాసిరే కనకచంపకరాజికాంతా
యేనాపరాంతవిజయే జలధేరుపాంతాః' 206

అత్ర చక్రవాలక్రమః సువ్యక్త ఏవ సోఽయం వర్ణానుప్రాసో గృహీతముక్త ఇత్యుచ్యతే.

అర్థము : చక్రవాళమువలె హానోపాదానములల్ల నేర్పడెడి గృహీతముక్తమున కుదాహరణము. అతని అపరాంతదేశ విజయమునందు సముద్ర సమీపభూమియందు కదలాడుచున్న లవంగవల్లికలచేతను లవలీవల్లికలచేతను చుట్టుకొన

బడినవియు, మొగ్గలచేత కప్పబడినవియు, పలాశవృక్షముల యొక్కయు సరపెంగ వృక్షముల యొక్కయు వరుసలలో నున్నవియునై పొదరిండ్లలోనుండి కూయుచున్న కపింజల పక్షుల సమూహములు నివసించుచున్నవి.

ఇచ్చట చక్రవాళక్రమము సువ్యక్తమే. ఈ వర్ణానుప్రాసము గృహీత ముక్తము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : పూర్వవలనముచేత పరమును గ్రహించుట చక్రవాళము. ముక్తమయిన వర్ణసమూహమును తిరిగి గ్రహించినయెడల చక్రవాళ మగును. ఇదియే గృహీత ముక్తము. హానము అని యనగా విడిచిపెట్టుట యని, ఉపాదానము అని యనగా స్వీకరించుట యని అర్థములు. ముక్తము గృహీతమగుట లక్షణముగా గృహీతముక్తము అన్న పేరు సార్థక మగుచున్నది.

ప్రథమపాదమందు 'లవంగ లవలీ'అని యన్నప్పుడు 'లవ' ముక్తమై పునరుపాత్తమయినది. అట్లే 'లవలీ వలయా' అని యన్నప్పుడు 'లవ' ముక్తమై 'లీవ' రూపమున నుపాత్తమైనది. 'నికుంజ కూజత్' అని యన్నప్పుడు 'కుంజ' ముక్తమై 'కూజత్' రూపమున గృహీతమయినది. 'కపింజలకులా' లోని చివరి యంశము ముక్తమై 'ముకులా' అన్నప్పుడు గ్రహింపబడినది. ఇట్లు రెండో మూడో హల్వర్ణములు స్వరసహితముగా కాని, స్వరభేదముతో కాని పునరుక్తములైనయెడల గృహీత ముక్త మగును. ఉదాహృత పద్యమునందు పూర్వభాగమునందే యీ లక్షణము సమన్విత మగును. ఉత్తరభాగమునందు బిందుపూర్వక తవర్ణమున కావృత్తి యున్నది. దానిని చక్రవాళక్రమ మనుట సమంజసము కాదు.

ప్రతాపరుద్రీయమునందు ఛేకానుప్రాసమునకు చూపిన యుదాహరణము గృహీతముక్తలక్షణమునకు సరిపడి యున్నది. దానిని గ్రహింతము.

'మహీ మహీన విభవే దత్తే క్షేమంకరే కరే
రాజన్యజన్య విజయీ రాజా రాజద్గుణోదయః'

ఈ శ్లోకమునందు 'మహీమహీ' యని 'కరేకరే' యని 'జన్యజన్య' యని 'రాజా రాజత్' అని యున్నవి అనుప్రాస స్థానములు. అందు మొదటిపదము ముక్తమై పునర్గృహీత మగుచున్నది. అన్నిచోట్లను సస్వరముగానే వ్యంజన సమూహము పునరుక్తమైనది. చివరి స్థలమునందు 'రాజా' అనునది ముక్తమై 'రాజత్' అని

గృహీతమైనది. ఇచ్చటి చివరి స్వరము భిన్నముగా నున్నది. వ్యంజనముల ఆవృత్తియే యిచ్చట ప్రధానముగా పరిగణవీయము.

క్రమేణ ద్విత్రాణాం త్రిచతురాణాం వర్ణానా మసంయోగ
స్వరవర్ణానా మావృత్తిః క్రమవానన్యథా -

'నితంబగుర్వీ గురుణా ప్రయుక్తా
వధూ ర్విధాతృ ప్రతిమేన తేన
చకార సా మత్తచకోరనేత్రా
లజ్జావతీ లాజవిమోక మగ్నౌ' 207

అత్ర గుర్వీ గురుణా ప్రయుక్తేతి, వధూ ర్విధాతృ ఇతి, చకార చకోరేతి, లజ్జావతీ లాజవిమోక మితి ద్వయో స్త్రయాణాం చ స్వరా సంయోగవర్ణానాం క్రమేణావృత్తిః సోఽయం వర్ణానుప్రాసః క్రమవా నిత్యుచ్యతే.

అర్థము : క్రమముగా రెండేసి మూడేసి కాని మూడేసి నాలుగేసి కాని అసంయోగ స్వరములయిన హల్వర్ణముల ఆవృత్తికల క్రమవంతమునకు ఉదాహరణము. విధాతృసమానుడైన గురువుచేత ప్రబోధింపబడి గురునితంబయు, మత్త చకోరనేత్రయు, లజ్జావతియునైన వధువు (ఇందుమతి) అగ్నియందు లాజలు (పేలాలు) విడిచిపెట్టెను.

ఇచ్చట 'గుర్వీ గురుణా ప్రయుక్తా' అని 'వధూర్విధాతృ' అని, 'చకార చకోర' అని 'లజ్జావతీ లాజవిమోక' మని రెండేసి మూడేసి స్వరాసంయోగ వర్ణములకు క్రమముగా ఆవృత్తి. ఈ వర్ణానుప్రాసము క్రమవంతము అని పిలువబడు చున్నది.

వ్యాఖ్య : రెండు కాని మూడు కాని హల్లులు ఆవృత్తి నొందుట గృహీతము క్తమునందున్న లక్షణమే. దానికి ఒక క్రమమునుకూడ జోడించుట యిచ్చటి అధిక లక్షణము. రెండు వర్ణముల స్తబకము తొలుదొల్త ఆవృత్తి నొందును, క్రమముగా వర్ణసంఖ్యను పెంచుకొనుచు సాగును. ఇట్లు ఒక క్రమము ననుసరించి

వర్ణసంఖ్యను పెంచుట జరుగుచున్నది. కావుననే దీనికి క్రమవంతము అన్న పేరు అన్వర్థ మగుచున్నది.

ఉదాహృత శ్లోకమున 'గుర్వీ, గురుణా' అను పదములందు గరవర్ణములు ఆవృత్తములయినవి. రెండవపాదమునందు 'వధూ, విధాత్ర' అను పదములు గలవు. ఇచ్చట వధవర్ణములు అనుప్రాసఘటకములు. ఈ రెండుచోట్లను రెండేసి వర్ణములు మాత్రమే ఆవృత్తము లయినవి. మూడవపాదమునందు 'చకార, చకోర' పదములు అనుప్రాస స్థానములు. ఇచ్చట చ, క, ర - అన్న హల్లులు పునరుక్తములు. చతుర్థపాదమునందలి 'లజ్జావతీ, లాజవిమోకమ్' అనునవి అనుప్రాస స్థానములు. ఇచ్చట ల, జ, వ - అన్న హల్లులు పునరుక్తములు. ఈ రెండు చోట్లను మూడేసి వర్ణములు ఆవృత్తము లయినవి. రెండేసి వర్ణముల ఆవృత్తితో ఆరంభించి, మూడేసి వర్ణముల ఆవృత్తితో ముగించుటచేత ఇది క్రమవంతమునకు లక్ష్యమగుచున్నది. ఇట్లే మూడేసి వర్ణములతో ఆరంభించి, నాలుగేసి వర్ణముల వరకు ఆవృత్తిని పెంచినప్పుడుకూడ క్రమవంతము అన్న వర్ణానుప్రాసమేయగును

అసంయోగ స్వరవర్ణము లని లక్షణమునందును, స్వరాసంయోగవర్ణములని వృత్తియందు నున్న విషయము గుర్తింపదగినది. అసంయోగము అని యనుట చేత హల్లులు స్వరసంయోగము నొందవని అర్థము కాదు; హల్లులు మాత్రమే పరిగణనీయము లని, వానితో కూడియున్న స్వరములు పరిగణనీయములు కావని భావము. 'గుర్వీ గురుణా' అనుచోట గరవర్ణములే కాక, గకారముమీది స్వరము (ఉ) కూడ పునరుక్తమయినది. ఇట్లు కారాదన్న నిషేధము లేదు. 'వధూ, విధాత్ర' అనుచోట్ల స్వరములు పూర్తిగా భేదించినవి. హల్లులు మాత్రమే పునరుక్తములు. ఇట్లే తక్కిన రెండుచోట్లనుకూడ గ్రహింపవలయును.

ఉదాహృత పద్యము కాళిదాసుని రఘువంశమునుండి స్వీకృతము.

క్రమవతాం విపర్యయోపన్యాసా ద్విపర్యయో యథా -

'ప్రణవః ప్రవణో యత్ర ప్రథమః ప్రమథేషు యః

రణవా న్వారణముఖః స వః పాతు వినాయకః' 208

అత్ర వ్యుత్క్రమో వ్యక్త ఏవ. సోఽయం వర్ణానుప్రాసో విపర్యయ ఇత్యుచ్యతే.

అర్థము : క్రమవంతములకు విపర్యయము నుపన్యసించుటవల్ల నేర్ప డెడి విపర్యయమున కుదాహరణము. ఓంకారమునకు ఆసక్తిస్థానమైనవాడును, ప్రమథులలో ప్రథముడును, రణవంతుడును, వారణముఖుడు నైన వినాయకుడు మిమ్ములను రక్షించును గాక !

ఇచ్చట వ్యుత్క్రమము స్పష్టమే. ఈ వర్ణానుప్రాసము వ్యత్యయము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : ఒక క్రమము కలిగిన పదమునందలి వర్ణములు వ్యత్యయము నొంది పునరుక్తము లయినయెడల, విపర్యయ మన్న వర్ణానుప్రాస మగునని లక్షణము.

ఉదాహృత శ్లోకమునందు ప్రణవ, ప్రథమ, రణవా – అన్న స్తబకములు అనుప్రాస ఘటకము లగుచున్నవి. మొదటి శబ్దమునందలి 'ణవ'ల్ల స్థానములు మార్చుకొనగా 'ప్రవణ' అని యైనది. ఇట్లు స్థానములు మార్చుకొనుటనే వ్యత్యయము, వ్యుత్క్రమము, విపర్యయము – అన్న పదములు వెల్లడించుచున్నవి. 'ప్రథమ' అన్న వర్ణములు 'ప్రమథ' అని యైనప్పుడును 'రణవా' అన్న వర్ణములు 'వారణ' అని యైనప్పుడును వర్ణవ్యత్యయమే వర్తించుచున్నది. కావుననే యీ శ్లోకము విపర్యయము అన్న వర్ణానుప్రాసమునకు లక్ష్యమయినది.

స్వాద్యవర్ణ వర్తినా స్వరేణ సహ పాదమధ్యాంతయో రనుప్రాసః సంపుటో యథా –

'స్థిరాపాయః కాయః ప్రణయిషు సుఖం స్థైర్యవిముఖం
మహారోగా భోగాః కువలయదృశః సర్పసదృశః
గృహావేశః క్లేశః ప్రకృతి చపలా శ్రీరపి ఖలా
యమః స్వైరీ వైరీ తదపి న హితం కర్మ విహితమ్' 209

తదేత ల్లక్షణేనైవ వ్యాఖ్యాతమ్. సోఽయం వర్ణానుప్రాసః సంపుట ఇత్యుచ్యతే.

అర్థము : స్వాద్యములైన వర్ణములతోకూడి వర్తించెడి స్వరముతోపాటుగా పాదముయొక్క మధ్యాంతములందుండెడి అనుప్రాసమైన సంపుటమున కుదాహరణము. శరీరమునకు అపాయము (ఎడబాటు) తప్పనిది. ప్రణయవంతులయందలి సుఖమునకు స్థిరత్వము లేదు. భోగములు మహారోగములు కువలయనేత్రలు సర్పములవంటివారు. గృహావేశము క్లేశము. స్వభావముచేతనే చపలత్వముగల లక్ష్మి దుర్మార్గురాలు, స్వైరప్రవృత్తిగల యముడు శత్రువు. విహితమైన కర్మము కూడ హితము కాదు.

ఇది లక్షణముచేతనే వ్యాఖ్యాతము ఈ వర్ణానుప్రాసము సంపుటము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : ఒక పదము తనయొక్క మొదటి అచ్చుతోపాటుగా పునరుక్తమగుట యిచ్చట ముఖ్యము. ఇట్లు పునరుక్తమగుట ప్రతిపాదమునకు నడుమ నొకమారు, చివర నొకమారు వేరువేరుగా జరుగును. ఇట్లు జరిగినయెడల, దీనిని సంపుట మని యందురు.

ఉదాహృత శ్లోకమునందు 'స్థిరాపాయః' అన్న సమాసమునందలి చివరి రెండక్షరముల స్తబకము అనుప్రాసస్థానము. 'పాయః' అను దానిలో తొలియచ్చు నుండి మిగిలిన వర్ణము లావృత్తి నొందవలయును. 'ఆయః' అని యేర్పడును. దీనికి పూర్వమందు హల్వర్ణము పవర్ణభిన్నము చేరవలయును. ఇచ్చట కవర్ణము చేరి 'కాయః' అనియైనది. కావున 'పాయః' అనునది 'కాయః' అను రూపమున ఆవృత్తి చెందిన దన్నమాట. ఇది పాదమధ్యానుప్రాసము. 'సుఖం' అన్న పదము 'స్థైర్యవిముఖం' అన్న సమాసములో తుది యంశముగా ఆవృత్తి నొందినది. 'సుఖం' లోని ఆదిమ స్వరమునుండి పునరాత్తము కాగా 'ఉఖం' అని యగును. దానికి ముందు మకారముచేరి 'ముఖం' అనియై అనుప్రాస ఘటకమైనది ఇది పాదాంతము నందున్నది. ఇట్లే ప్రతిపాదమునందును రోగాః, భోగాః; దృశః; దృశః; వేశః, క్లేశః; పలా, ఖలా; స్వైరీ, వైరీ; హితం, హితమ్–అను విధముగా అనుప్రాసము సంపుటీకరింపబడినది ఇట్లగుటచేతనే యీ పద్యము సంపుట మన్న వర్ణానుప్రాసమునకు లక్ష్యమయిన్నది.

అంతపాద ముపసంహారోపక్రమయో ర్వివక్షితః సస్వరాను
ప్రాసో మిథునం యథా -

'త్యజ మనసి సదాహే హే స్మర స్థాన మస్మి
న్నను కిరసి శరీరే రే కిమిందో మయూఖాన్
అపి పరిహర వాయో యోగ మంగై ర్మదీయైః
ప్రణయిని సమవేతే తే భవంతః సఖాయః' 210

తదేత న్నిగదేనైవ వ్యాఖ్యాతమ్. సోఽయం వర్ణానుప్రాసో
మిథున మిత్యుచ్యతే.

అర్థము : పాదమధ్యమున ఉపసంహారోపక్రమములందు వివక్షితమైన సస్వ
రానుప్రాసమైన మిథునమున కుదాహరణము. ఓయీ మన్మథుడా! తపించుచున్న
యీ మనస్సునందలి స్థానమును విడిచిపెట్టుము. ఓరీ చంద్రుడా! శరీరమునందు
కిరణములను విరజిమ్మెదవేల ? వాయువా! నా యంగములతో సాంగత్యము విడ
గింపుము. ఓ ప్రణయినీ! వారందరును నీకు మిత్రులగుచు నొక్కసారిగా కలిసి
వచ్చుచున్నారు.

ఇది పైని చెప్పిన వాక్యముచేతనే వ్యాఖ్యాతము. ఈ వర్ణానుప్రాసమును
మిథున మని యందురు.

వ్యాఖ్య : అంతపాద మని యనగా పాదాంతర్భాగమని యర్థము. పాద
మధ్యమున, ఒక పదమునకు తుదినున్న యక్షరమే పరపదమునకు ఆద్యక్షరముగా
కాని, పరపదముగా కాని ఆవృత్తి నొందినయెడల దానిని మిథున మన్న వర్ణాను
ప్రాసముగా పరిగణింతురు. లక్షణమునందు సస్వరానుప్రాసమన్న విశేషణము
గమనార్హము. అనుప్రాసమునందు సాధారణముగా హల్వర్ణమునకే ప్రాధాన్యము.
అయినప్పటికిని, వెనుకటి సంపుటమునందువలెనే మిథునమునందుకూడ స్వరము
గ్రహింపబడుచున్నది. సస్వరమయిన హల్లుగాని, హల్సముదాయముగాని అక్షర
మనిపించుకొనును. కావున, పూర్వపదము తుదినున్న యక్షరము పునరుక్త మగు
టయే ప్రవక్త విషయము.

ఉదాహృత శ్లోకమునందు ప్రథమపాదమున 'సదాహే' అన్న పదము గలదు. తుది యక్షరము 'హే'. ఇది వెనువెంటనే 'హేస్మర' అన్నప్పుడు పునరుక్తమైనది. ఉపసంహారోపక్రమ ఘటితములైన యీ వర్ణములు అవ్యవహితములై యున్నవి; అనగా వెనువెంట జంటగా నున్నవని యర్థము. కావుననే, దీనికి 'మిథునము' అన్నపేరు సమర్థక మగుచున్నది. ద్వితీయపాదమునందు 'రే', తృతీయ పాదమునందు 'యో', చతుర్థపాదమునందు 'తే' పూర్వపదాంతమై పునరుక్తముకూడ నగుటచేత మిథున మన్న వర్ణానుప్రాసమునకు ప్రకృతశ్లోకము లక్ష్యమయినది.

ఆవాక్యపరిసమాప్తే ర్వర్ణానుప్రాస నిర్వాహో వేణికా యథా -

'విద్రాణే రుద్రబృందే సవితరి తరలే వజ్రిణి ధ్వస్తవజ్రే
జాతాశంకే శశాంకే విరమతి మరుతి త్యక్తవైరే కుబేరే
వైకుంఠే కుంఠితాస్త్రే మహిష మతిరుషం పౌరుషోపఘ్ననిఘ్నం
నిర్విఘ్నం నిఘ్నతీ వః శమయతు దురితం భూరిభావా భవానీ' 211

తదేతన్నాతి దుర్బోధమ్. సోఽయం వర్ణానుప్రాసో వేణికేత్యుచ్యతే.

అర్థము : మొదలుపెట్టినది మొదలుగా వాక్యమును ముగించువరకు వర్ణానుప్రాస నిర్వహణము గల వేణిక కుదాహరణము. రుద్రబృందము పలాయనము చేయగా, సూర్యుడు చలనమునొందగా, ఇంద్రుని వజ్రాయుధము నాశము కాగా, చంద్రుడు జంకునొందగా, వాయువు విరమింపగా, కుబేరుడు వైరమును చాలింపగా, విష్ణుని యస్త్రము మొక్కవోగా పౌరుషమునే ఆశ్రయముగా చేసికొని పరవశించి అతిరోషముతో నున్న మహిషరాక్షసుని నిర్విఘ్నముగా నోడించిన భూరిభావయైన భవాని మీ దురితమును శమింపజేయును గాక।

ఇది అతిదుర్బోధము కాదు. ఈ వర్ణానుప్రాసమును వేణికయని యందురు.

వ్యాఖ్య : భిన్నభిన్నములయిన వర్ణానుప్రాసములను వాక్యము ప్రారంభము నుండి పరిసమాప్తి పర్యంతము నిర్వహించిన యెడల వేణిక యని యందురు. వేణిక యని యనగా జడ యని యర్థము. వికీర్ణములయిన కేశములను పాయలుగా చేసి

ఆసాంతము జడ యల్లినట్లుగా భిన్నములయిన అనుప్రాసములను ఆసాంతము నిర్వహించుటనుబట్టి యీపేరు దీనికి అన్వర్థ మగుచున్నది.

ప్రథమపాదమునందు 'విద్రాణే' 'రుద్ర' అనుచోట 'ద్ర' ఆవృత్తినొందినది. అందే 'సవితరి' 'తరలే' అనుచోట 'తర' వర్ణములు ఆవృత్తి నొందినవి. అందే 'వజ్రిణి' 'ధ్వస్తవజ్రే' అనుచోట 'వజ్ర' ఆవృత్తి నొందినవి. ఇట్లే అన్నిపాదములందును కొన్నియెడల ఒకే వర్ణము, కొన్నియెడల రెండు వర్ణములు, కొన్నియెడల మూడు వర్ణములు కొన్నియెడల ద్విరుక్తములై కొన్నియెడల త్రిరుక్తములై పద్యమునంతటి నావరించియున్నవి. కావుననే, యీ శ్లోకము వేణికకు లక్ష్యమయినది.

ఉదాహరణము బాణుని చండీశతకమునుండి స్వీకృతము.

ఉక్తలక్షణేభ్యోఽన్య శ్చిత్రో యథా -

'సీతే నిర్వ్యాజదీర్ఘా మఘవతి మఘవద్వజ్ర నిద్రానిదానే
నిద్రా ద్రాగేవ దేవద్విషి ముషితరుషః సంస్మరంత్యాః స్వభావమ్
దేవ్యా దృగ్భ్యస్తిసృభ్యస్త్రయ ఇవ గలితా రాశయో రక్తతాయా
రక్షంతు త్వాం త్రిశూలక్షతి కుహరభువో లోహితాంభః సముద్రాః'

ఏవ మన్యేఽపి ద్రష్టవ్యాః.

అర్థము : పైని చెప్పిన లక్షణములకంటె భిన్నమైన చిత్రమున కుదాహరణము. ఇంద్రుని వజ్రాయుధము నిద్రపోవుటకు మూల కారణమైన పాపియైన దేవద్వేషికి (మహిషాసురునికి) నిర్వ్యాజమైన దీర్ఘనిద్రను కలుగజేసిన వెంటనే కోపమును విడిచినదై, స్వభావమైన ప్రసన్నతను స్వీకరించినదైన దేవియొక్క మూడు కన్నులనుండి వెలువడిన యనురాగపు రాశులవలె నున్న ముమ్మొనవాలు (త్రిశూలము) చేత కలిగిన గాయపు గంటులనుండి వెలువడిన రక్తసముద్రములు మూడు నిన్ను కాపాడును గాక !

ఇట్లే యితరములను చూచునది.

వ్యాఖ్య : వార్ణానుప్రాస విషయమున నింతవరకు నెన్నో లక్షణములు ప్రసక్తము లయినవి. ఆయా లక్షణములనుబట్టి కానివి వార్ణానుప్రాస భేదములుగా

పరిగణించుట జరిగినది. కావున, పూర్వోక్త లక్షణము పునరుక్తమగుటకు వీలు కాదు. అట్లు పునరుక్తమైనయెడల, పూర్వభేదము కంటె అన్యభేదముగా పరిగణించుట కాని, దానికి 'చిత్రము' అని ఒక పేరు పెట్టుటకాని జరుగదు. కాని పైని చెప్పిన లక్షణము లన్నియో, అందు కొన్నియో యొక్కచోట నున్నచో, అప్పుడు దానిని వేరుగా పరిగణింపవలసియే యుండును. అట్లేర్పడినదే చిత్రము. ఇందు పూర్వోక్త లక్షణము లుండకపోవు. కాని వెనువెంటనే తద్భిన్నలక్షణములు కూడ నుండుటవల్ల పూర్వభేదములలో నొదిగించుటకు వీలుకాదు. అందువల్లనే వేరుగా పరిగణించుటయు, వేరుగా పేరు పెట్టుటయు జరిగినవి. 'చిత్తం రంజయతి' అన్న వ్యుత్పత్తినిబట్టి చిత్తమును అనుప్రాస శబలితము గావించి రంజింపజేయుట లక్షణముగా 'చిత్రము' అన్న పేరు అన్వర్థమగుచున్నది.

ప్రథమ పాదమునందు నవర్ణము పెక్కుపర్యాయము లావృత్తినొందినది. 'దీర్ఘామ్+అఘవతి' అనునవి 'దీర్ఘా మఘవతి'అని సంధి నొందగా, ఇందలి 'మఘ' తరువాత వచ్చిన 'మఘవత్' అనుచోట పునరుక్తమయినది. ఇది గృహీతముక్తము. ద్వితీయపాదమున 'విద్రా' 'ద్రాగేవ' అని యన్నప్పుడు మిథునము. 'దేవద్విషి ముషితరుషః' అనుచోట స్తబకము. 'ద్రాగేవ దేవ' అనుచోట సంపుటము. ఇట్లింకను పెక్కు లక్షణములు గలవు. అయినప్పటికిని, ఈ వర్ణానుప్రాసము పైవానియం దొక్కటియు కాక, వాని నన్నింటిని గలిగియుండుటవల్ల 'చిత్రము' అన్న వేరొక వర్ణానుప్రాసభేదముగా ప్రతిష్ఠిత మయినది.

ఉదాహరణ శ్లోకము బాణుని చండీశతకమునుండి సంగృహీతము.

ఏక వర్ణావృత్తే ర్వృత్త్యనుప్రాసస్య వర్ణాంతర వైచిత్ర్యేణ విచిత్రో యథా -

'చంచత్కాంచన కాంచయో లయవలచ్చేలాంచలై ర్వంచితా
శ్చారీ సంచరణైక చారుచరణాః సించంతి చిత్తం మమ
లీలాచంచుర చంచరీక రుచిభి శ్చూలాలకై శ్చర్చితాః
కించిచ్చందన చంద్రచంపకరుచాం చౌర్యో మృగీలోచనాః' 213

అర్థము : ఏకవర్ణావృత్తిగల వృత్త్యనుప్రాసమునకు వర్ణాంతరవైచిత్ర్యము చేత నేర్పడెడి విచిత్రమున కుదాహరణము. చలించుచున్న బంగారు మొలనూలు

ధరించిన వారును, లయచేత చుట్టుకొనుచున్న చేలాంచలములచేత విరోధమునొందు చున్నవారును, చారీ (నర్తన విశేషము) సంచరణమునందు మనోహరములైన పాదములు గలవారును, విలాససుందరములైన భ్రమరకాంతులు గల ముంగురుల చేత అలంకరింపబడినవారును, చందన చంద్ర చంపకరుచులను హరించినవారును నైన మృగీలోచనలు నా చిత్తము నార్ద్రీకరించుచున్నారు.

వ్యాఖ్య : ఒకే వర్ణము ఆవృత్తినొందుట వృత్త్యనుప్రాసభేదము. అదియే ప్రధానముగా నుండి యితరవర్ణముల ఆవృత్తి నడుమ నడుమ నుండి వైచిత్రిని కలిగించు నెడల 'విచిత్రము' అన్న వర్ణానుప్రాస మగును.

ప్రకృతోదాహరణమునందు 'చంచత్కాంచన కాంచయో' మొదలయినచోట్ల పూర్ణబిందుపూర్వక చవర్ణము పునఃపునరావృత్తి నొందినది. బిందు విరహితమైన చవర్ణముకూడ పెక్కు పర్యాయము లావృత్తినొందినది. చవర్ణమునే అనుప్రాస ఘటకముగా గ్రహించి వృత్త్యనుప్రాసముగా పేర్కొనవచ్చును. 'లయవల చ్చేలాంచలైర్వంచితా' మున్నగుచోట్ల లవర్ణమును వకారమును పునరావృతము లైనవి. 'చారీసంచరణైక చారుచరణాః' మున్నగుచోట్ల రవర్ణమును ణవర్ణమును అనుప్రాసఘటకము లయినవి. 'లీలా....చూలాలకైః' అనుచోట మరల లకారము ఆవృత్తినొందినది. ఇట్లు ప్రధానమైన చవర్ణానుప్రాస ఘటిత వృత్త్యనుప్రాసము నందు ఇతరవర్ణములు కూడ అనుప్రాసఘటకము లగుట విచిత్రము. కావుననే దీనికి 'విచిత్రము' అనుపేరు సరిపడుచున్నది. 'విచిత్రము' అని యనగా విశేషముగా చిత్తమును రంజింపజేయునది అనియే యర్థము.

ఉదాహరణ శ్లోకము పంచస్తవి నుండి సంగృహీతము.

అన్యే పునరన్యథా చిత్రవిచిత్రయో ర్లక్షణం వ్యాచక్షతే. తత్ర యమకచ్ఛాయానుకారీ చిత్రః. స ఏవ వర్ణానుప్రాసవాన్ విచిత్ర ఇతి. తత్రచిత్రో యథా -

'సర్వాశారుధి దగ్ధవీరుధి సదా సారంగబద్ధక్రుధి
క్షామక్ష్మారుహి మందమున్మధులిహి స్వచ్ఛంద కందద్రుహి
శుష్యత్ స్రోతసి తప్తభూరి రజసి జ్వాలాయమానాంభసి
జ్యేష్ఠేమాసి ఖరార్కతేజసి కథం పాంథ వ్రజన్ జీవసి.' 214

అర్థము : అన్యులు క్షఅన్యవిధముగా చిత్రవిచిత్రములకు లక్షణమును పలుకుచున్నారు. అచ్చట యమకచ్ఛాయానుకారి చిత్రము. అదియే వర్ణానుప్రాస పంతము విచిత్రము. అందు చిత్రమున కుదాహరణము. సర్వదిక్కులను (వాంఛలను) నిరోధించునదియు, దగ్ధములయిన లతలను గలదియు, ఎల్లప్పుడును సారంగముల యందు క్రోధము కలదియు, ఎండిన చెట్లను గలదియు, మందమోదముగల తుమ్మెదలను గలదియు, స్వచ్ఛందముగా మొలచు కందమూలములకు ద్రోహము చేయునదియు, ఇంకిపోవుచున్న ప్రవాహములను కలదియు, మండుచున్న యిసుకను గలదియు, జ్వాలలవలె నున్న జలములు గలదియు, తీవ్రమైన సూర్యుని తేజస్సు గలదియు నయిన జ్యేష్ఠమాసమునందు వెళ్ళిపోయి, పాంథుడా! యెట్లు బ్రతుకుదువు?

వ్యాఖ్య : భోజదేవుడు వర్ణానుప్రాస భేదములుగ చిత్రము, విచిత్రము అనువానికి లక్షణము దెల్పి లక్ష్యములనుగూడ ప్రదర్శించియున్నాడు. ఈ పేరులతోనే యితరాలంకారికులు లక్షణము నింకొకవిధముగా చెప్పిరని తెల్పి క్షభోజదేవుడా లక్షణమును దెల్పి, తదనుగుణముగా లక్ష్యములను ప్రదర్శించుచున్నాడు.

యమకచ్ఛాయానుకారి చిత్రము. యమకచ్ఛాయ అని యన్నప్పుడు విభిన్నార్థకములకు ఏకరూపత్వకల్పనము, స్థాననిర్ణయము మున్నగు సంశములను గ్రహింపవలసి యుండును.

ప్రకృతోదాహరణమునందు రుధి, రుధి, క్రుధి – అను వర్ణగుచ్ఛము లావృత్తము లయినవి. 'సర్వాశారుధి' అని యన్నప్పుడు 'రుధి' ధాతు నిష్పన్నరూపము ప్రయుక్తము. 'దగ్ధవీరుధి' అని యన్నప్పుడు 'వీరుధ్' అన్న నామవాచకము ప్రయుక్తము. 'క్రుధి' అన్నప్పుడు నామవాచకమే ప్రయుక్తము. అట్లే తక్కిన పాదములందును సమాన రూపాంతములయిన పదములు మూడేసిమారు లావృత్తము లయినవి. ఆదిమధ్యాంత్యములందు ప్రతిపాదమున ననుప్రాస ఘటకములు ప్రవృత్తము లయినవి కావున స్థాననిర్దేశముకూడ పాటింపబడినది. ఇట్లుండుటయే యమకచ్ఛాయానుకారిత్వము. కావుననే, యిది 'చిత్రము' అన్న వర్ణానుప్రాసమునకు లక్ష్యమయినది.

ఉదాహృతశ్లోకము సుభాషితావళియందు భాణుని రచనగా ప్రదర్శింపబడినది.

విచిత్రో యథా -

'ఉద్యద్బర్హిషి దర్దురారవపుషి ప్రక్షీణ పాంథాయుషి
చ్యోతద్విప్లుషి చంద్రరుఙ్ముషి సఖే హంసద్విషి ప్రావృషి
మా ముంచోచ్చకుచాంత సంతతగలద్బాష్పాకులాం బాలికాం
కాలే కాలకరాలనీల జలదవ్యాలుప్త భాస్వత్త్విషి'. 215

అర్థము : విచిత్రమున కుదాహరణము. మొలకెత్తుచున్న తృణాంకురము లను గలదియు, కప్పల చప్పుళ్ళను పోషించునదియు, పాంథుల జీవమును క్షీణింప జేయునదియు, జలబిందువులను కార్చునదియు, చంద్రకిరణములను మరుగుపుచ్చు నదియు, హంసలకు శత్రువైనదియు, కాలకరాళ నీలజలదములచేత లోపింపజేయ బడిన సూర్యకాంతులను గలదియు నైన ప్రావృట్కాలమునందు, ఓ సఖుడా! ఉన్నత ములయిన కుచములమీదుగా కారుచున్న కన్నీళ్ళతో కలతచెందుచున్న బాలికను విడిచిపెట్టకుము.

వ్యాఖ్య : యమకచ్ఛాయానుకారియై వర్ణానుప్రాసమునుకూడ కలిగియున్న మొదల విచిత్రమగునని లక్షణము. చిత్రమునందు యమకచ్ఛాయానుకారిత్వమే ప్రసక్తము. వర్ణానుప్రాస బాహుళ్యమున కచ్చట తావులేదు. విచిత్రమునందు యమకచ్ఛాయతోపాటుగా వర్ణానుప్రాసముకూడ సమస్కంధముగా నిర్వహింప బడును.

ప్రకృతోదాహరణమునందు విభిన్నార్థములకు ఏకరూపత్వ కల్పనము, స్థాన నిర్ణయము కొంతవరకు జరిగినవి. శ్లోకపూర్వార్ధమందు బర్హిషి, పుషి, ఆయుషి, విప్లుషి, ముషి, ద్విషి, ప్రావృషి - అని సదృశాంతములయిన పదములు ప్రయు క్తము లయినవి. ఇవన్నియు సప్తమీవిభక్త్యంతములు. ఇందు పుషి, ముషి, ద్విషి - అన్నవి క్రియాధాతువులవల్ల నేర్పడిన రూపములు. తక్కినవి నామవాచ కములు. ఇట్లు భిన్నార్థముల కేకవిధ రూపకల్పనము జరిగినది. ప్రథమపాదము నందు మూడు పర్యాయములు, ఆదిమధ్యాంతములందు ఆవృత్తియున్నది ద్వితీయ పాదమునందు నాలుగు పర్యాయములు ఆవృత్తియున్నది. స్థాననిర్ణయాతిక్రమణము జరిగినది. తృతీయ చతుర్థపాదములందు 'షి' వర్ణాంతపదములు ప్రయుక్తములు

కాలేదు. పద్యాంతమునందు 'త్విషి' అని ప్రయుక్తమై పూర్వావృత్తి ననుసంధించు చున్నది. ఇదంతయు యమకచ్ఛాయానుకారిత్వము.

ప్రథమపాదమునందు 'ఉద్యద్భర్హిషి దర్దురావపుషి' అని యన్నప్పుడు దవ-మును, రవర్ణమును అనుప్రాస ఘటకము లగుచున్నవి. ఇందలి షవర్ణము 'ప్రక్షి పాంథాయుషి' అని యన్నప్పుడు రెండు మార్లు పునరుక్తమగుచున్నది. ద్వితీర పాదమున 'ప్లుషి' 'ప్రావృషి' యన్నప్పుడును పునరుక్తమైనది. తృతీయపాదముు మ, చ, త, క, బ వర్ణములు అనుప్రాస ఘటకము లగుచున్నవి. చతుర్థపాదము నందు క, ల వర్ణములు పునఃపునరుక్తము లగుచున్నవి. ఇవన్నియు వర్ణానుప్రాస భేదములలో అంతర్భవించును.

యమక లక్షణముతోపాటుగా అనుప్రాస లక్షణమునుగూడ జోడించుటచేత చిత్తరంజకత్వము విశేషముగా కలుగునని యభిప్రాయము. తదనుసారముగానే ప్రకృతశ్లోకము 'విచిత్ర' మన్న వర్ణానుప్రాసభేదమునకు లక్ష్యమైనది.

ఉదాహరణశ్లోకము శార్ఙ్గధరపద్ధతియందు బాణుని రచనగా ప్రదర్శింప బడినది.

92. వర్ణావృత్తి రనుప్రాస ఇతి యఃకృతలక్షణః
సోఽయం ద్వాదశధా భేదైః ప్రవిభజ్య ప్రదర్శితః.

అర్థము : 'వర్ణావృత్తి అనుప్రాసము' అని చేసిన లక్షణమునకు అనుగుణ ముగా అది పండ్రెండు భేదములుగా విభజింపబడి ప్రదర్శింపబడినది.

వ్యాఖ్య : అనుప్రాసాలంకారము ఆరు విధములుగా విభక్తము. అందు శ్రుత్యనుప్రాసము, వృత్త్యనుప్రాసము, వర్ణానుప్రాసము - అను వాని నింతవరకు సలక్షణముగా ప్రదర్శించుట జరిగినది. వర్ణానుప్రాసమునకు ఉపసంహార వాక్యము ఈ శ్లోకము. ఇకముందు పదానుప్రాసము ప్రదర్శింపబడును.

[ పదానుప్రాసము ]

93. సమగ్ర మసమగ్రం వా యస్మిన్నావర్తతే పదమ్
పదాశ్రయేణ స ప్రాయః పదానుప్రాస ఉచ్యతే.

అర్థము : సమగ్రముగా కాని అసమగ్రముగా కాని పదము దేనియందు ఆవృత్తిచెందునో దానిని ప్రాయికముగా పదాశ్రయత్వముచేత పదానుప్రాస మని యందురు.

94. విసర్గ బిందు సంయోగ స్వర స్థానావివక్షయా
అనిర్వాహాచ్చ స ప్రాయో యమకేభ్యో విభిద్యతే.

అర్థము : అచ్చట విసర్గము, బిందువు, సంయోగము, స్వరము, స్థానము- అనువాని వివక్ష లేకుండుటచేతను, నిర్వహింపకుండుటచేతను పదానుప్రాసము యమకములకంటె భిన్నముగా నుండును.

95. మసృణో దంతురః శ్లక్ష్ణః సంపుటః సంపుటావలీ
భిన్నః స్తబకవాన్ స్థానీ మిథునం మిథునావలీ

96. గృహీతముక్తనామాన్య స్తతోఽన్యః పునరుక్తిమాన్
ఇతి ద్వాదశభేదోఽయం మనీషిభిరిహేష్యతే.

అర్థము : 1. మసృణము 2. దంతురము 3 శ్లక్ష్ణము 4. సంపుటము 5. సంపుటావళి 6. భిన్నము 7. స్తబకవంతము 8. స్థాని 9. మిథునము 10. మిథునావళి 11. గృహీతముక్తము 12 పునరుక్తిమంతము – అని యీ పదానుప్రాసము పండ్రెండు విధములుగా పండితుల కిష్టము.

తేషు మసృణో యథా -

'స రణే వారణాస్యస్య దశనేఽశని సన్నిభే
చకార వలయాకారం భుజం భుజగభీషణమ్'

సోఽయ మసంయుక్తవర్ణావృత్తేః పదానుప్రాసో మసృణ ఇత్యుచ్యతే.

అర్థము : వానియందు మసృణమున కుదాహరణము, అతడు యుద్ధము నందు గజముఖముయొక్క పిడుగువంటి దంతమునందు భుజగభీషణమైన తన బాహువును వలయాకారముగా చేసెను.

ఇది అసంయుక్త వర్ణావృత్తి గల పదానుప్రాసము మసృణమని యందురు.

వ్యాఖ్య : పదావృత్తికాని పదాంశావృత్తికాని యమకశంకను కలిగించును. యమకభేదములందు విసర్గము, బిందువు, సంయోగము – మున్నగు విషయములు పరిగణనీయములు కావు, కాని పదానుప్రాసమునందు ఆయా యంశములనుబట్టియే భేద పరికల్పనము జరుగుచున్నది. కావున, పైకి ఒకే విధముగా కనుపట్టినను శక్త్వమునుబట్టి పదానుప్రాసమునకును, యమకమునకును భేదము కలదని గ్రహింప వలయును.

సారూప్యముగల పదము (పదాంశము) ఆవృత్తినొందినయెడల పదానుప్రాస మగును. అందు అసంయుక్తవర్ణములకు మాత్రమే ఆవృత్తి యైనయెడల దానిని మసృణపదానుప్రాస మని యందురు. ఇది లక్షణము.

ప్రకృతోదాహరణమునందు రణే, రణా; శనే, శని; కార, కారం; భుజం, భుజ – అను జంటలు అనుప్రాసస్థానములు. వానిలో నెచ్చటను సంయుక్తవర్ణములు లేవు. కావుననే, యీ శ్లోకము మసృణ పదానుప్రాసమునకు లక్ష్యమైనది.

దంతురో యథా –

'స నైషధస్యార్థపతేః సుతాయా
ముత్పాదయామాస నిషిద్ధశత్రుః
అనూనసారం నిషధా న్నగేంద్రాత్
పుత్త్రం యమాహు ర్నిషధాఖ్యమేవ' 217

అత్ర నిషిద్ధ శత్రు రితి పదే సంయోగాధిక్యేన దంతురతా. సోఽయం పదానుప్రాసో దంతుర ఇత్యుచ్యతే.

అర్థము : దంతురమున కుదాహరణము- నిషిద్ధశత్రువైన (అతిథి) యతడు నిషధేశుడైన అర్థపతియొక్క పుత్త్రికయందు నిషధపర్వతముకన్న మిక్కిలి శక్తి శాలియైన పుత్రుని పుట్టించెను. అతనిని నిషధాఖ్యుడనియే పిలుతురు.

ఇక్కడ 'నిషిద్ధశత్రుః' అన్న పదమునందు సంయోగాధిక్యమువల్ల దంతురత్వము. ఈ పదానుప్రాసమును దంతుర మని యందురు.

వ్యాఖ్య : అసమగ్రపదముకూడ పునరుక్తినొందినయెడల పదానుప్రాస మగును. అట్టి పదములలో ఒకటి సంయోగాధిక్యమును కలిగియున్నయెడల దంతుర మని యందురు. ఇది లక్షణము.

ఉదాహరణమునందు నైషధ, నిషిద్ధ, నిషధాత్, నిషధాఖ్య - అన్న నాలుగు పదానుప్రాసస్థానములు. అనుప్రాసమునందు వ్యంజనవర్ణములకే ప్రాధాన్యము. కావున, పైవానిలో న ష ధ వర్ణములనే అనుప్రాస ఘటకము లనవలయును. పదభావ సిద్ధి కొరకు వేర్వేరు స్వరములు చేరవచ్చును. అవి ప్రకృతము పరిగణనీయములు కావు. ఇట్లు హల్లులను (మూడింటిని) బట్టి పదానుప్రాసమును గుర్తింపవచ్చును. రెండవ స్థానమునందు 'నిషిద్ధ' అని యుండుటచేత 'ధ' వర్ణమునకు దవర్ణముతో సంయోగమేర్పడినది. ఈ సంయోగముచేతనే యిది దంతురపదానుప్రాసమునకు లక్ష్యమైనది.

ఈ శ్లోకము కాళిదాసుని రఘువంశమునుండి స్వీకృతము.

శ్లక్ష్ణో యథా -

'అప్యేహి కాంతే వైదేహి దేహి ప్రతివచో మమ
అరవిందాక్షి దాక్షిణ్య మలంకారో హి యోషితామ్' 218

అత్ర స్వరేణ సహావృత్తేః శ్లక్ష్ణతా. సోఽయం పదానుప్రాసః శ్లక్ష్ణ ఇత్యుచ్యతే.

అర్థము : శ్లక్ష్ణమున కుదాహరణము. ఓ కాంతా! వైదేహీ! పరేః వెళ్లుము. నాకు బదులు పలుకుము. అరవిందాక్షీ! స్త్రీలకు దాక్షిణ్య మలంకారము కదా!

ఇచ్చట స్వరముతోడి ఆవృత్తివల్ల శ్లక్ష్ణత. ఈ పదానుప్రాసమును శ్లక్ష్ణము అని యందురు.

వ్యాఖ్య : స్వరసహితముగా వ్యంజన సముదాయము ఆవృత్తినొందిన యెడల శ్లక్ష్ణము అన్న పదానుప్రాస మగును. ఇది లక్షణము.

ఉదాహరణ శ్లోకమునందు 'దేహి' అను పదాంశము అవ్యవహితముగా పునరుక్తమయినది. అట్లే 'అరవిందాక్షి'లోని చివరి రెండక్షరములను 'దాక్షిణ్య'

లోని తొలి రెండక్షరములుగా అవ్యవహితముగా పునరుక్తము లయినవి. కావుననే, యిది శ్లక్ష్ణమునకు లక్ష్యమయినది.

- సంపుటో యథా -

'సదర్ప ఇవ కందర్ప స్తరలా మాదృశాం మతిః
అసార ఇవ సంసారః కురుష్వ మదనుగ్రహమ్' 219

అత్రేవ శబ్దస్యాపవాదత్వే నావ్యవధాయకత్వా దనుప్రాసోఽయం సంపుట ఇత్యుచ్యతే.

అర్థము : సంపుటమున కుదాహరణము. కందర్పుడు దర్పవంతునివలె నున్నాడు. మావంటివారి బుద్ధి చంచలమైనది. సంసారమేమో సారహీనము. నన్ను అనుగ్రహింపుము.

ఇచ్చట 'ఇవ' శబ్దముయొక్క అపవాదత్వముచేత అవ్యవధాయకత్వమువల్ల ఈ అనుప్రాసము సంపుటము అని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : ఏకరూపమయిన అసమగ్రపదముయొక్క అవ్యవహితావృత్తి సంపుట మన్న పదానుప్రాస మగును. ఇది లక్షణము.

ఉదాహరణమునందు ప్రథమపాదమున నున్న సదర్ప, కందర్ప - పదములును, తృతీయపాదమున నున్న అసార, సంసార - పదములును అనుప్రాస ఘటకములు నిజమున కీ పదములు అవ్యవహితముగా ఆవృత్తి నొందలేదు. 'ఇవ' శబ్దము వీనికి నడుమనుండి యెడము కలిగించుచున్నది. ఇట్లు 'ఇవ' ప్రభృతి నిపాతములకు అపవాదత్వము కలదు. అనగా, అవి నడుమ వచ్చినను వచ్చినట్లు పరిగణింపరాదని వృత్తివాక్యమునుబట్టి బోధపడుచున్నది.

అట్లు గ్రహించినప్పటికిని మరొక వర్ణము వ్యవధానముగా నిలుచున్నట్లు గోచరించుచున్నది. సదర్ప, కందర్ప - అని యున్నప్పుడు 'దర్ప' అన్న పద ఖండమే ఆవృత్తి నొందినది. అప్పుడు 'కం' అన్న అక్షరము వ్యవధానమును కలిగించుచున్న దనవలయును. అసార, సంసార - అని యన్నప్పుడు 'సం' వ్యవధానకారణ మగుచున్న దనవలయును. కాబట్టి అవ్యవధాయకత్వము అన్న లక్షణము సమన్వితము కాదు.

ఉదాహరణమునందు కరోతి, కిం కిరాతః, సమాకృష్య, శిలీముఖాన్ – అని పూర్వార్ధమున నున్న పదములు. ఉత్తరార్ధమునం దివి విలోమ క్రమమున శిలీముఖాన్, సమాకృష్య, కింకిరాతః, కరోతి – అని పునరుక్తము లయినవి. ఇట్లు నాలుగు పదములు ఆవృత్తి నొందుటచేత సంపుటావళి యన్న పదానుప్రాస మగుచున్నది. పూర్వార్ధమున 'అయం' అన్న పదము ఉత్తరార్ధమున 'యత్' అన్న పదమును మిగిలిపోయినవి. ఇవి కూడ నిపాతములవలె అపదేశతార్థములు.

ఖిన్నో యథా –

'కులజాతి సమాకులీ కృతానాం
సుఖద సుఖాశయమూఢచేతనానామ్
అభవ విభవ లాభలోలుభానాం
భవ భవబంధ విభేదనాయ భూయః' 221

అత్ర రీతే రనిర్వాహాత్ ఖిన్నతా. సోఽయం పదానుప్రాసః ఖిన్న ఇత్యుచ్యతే.

అర్థము : ఖిన్నమున కుదాహరణము. కులముచేతను, జాతిచేతను కలత నొందిన వారికి, సుఖదములైన సుఖాశయములచేత మూఢచేతను లయినవారికి, భవరహితమైన వైభవమును పొందుటకై పేరాసపడువారికి భవబంధనములను త్రెంచివేయుము.

ఇచ్చట రీతి నిర్వహింపబడకపోవుట వల్ల ఖిన్నత. ఈ పదానుప్రాసమును 'ఖిన్నము' అని యందురు.

వ్యాఖ్య : రీతి సక్రమముగా నిర్వహణమునొందనియెడల ఖిన్నమగును. ఇది లక్షణము. ఇచ్చట రీతి యనగా అనుప్రాస నిర్వహణమునందు పాటించెడి విధానమని యర్థము. ఆవిధాన మేకరీతిగా నున్నయెడల రీతి యున్నట్లు, ఆ విధానము భిన్నభిన్నముగా నున్నయెడల రీతి చెడినట్లు గ్రహింపవలయును. రీతిభంగము నొందుట దోషము. కాని, యిచ్చట అదియే లక్షణముగా అనుప్రాసభేద మేర్పడుచున్నది. కావున, అనుప్రాస విషయమున అరీతి అనునది దోషము కాదు.

ప్రథమపాదమున 'ఖల' అన్న పదఖండము ప్రారంభముననే యున్నది, నాలుగక్షరములకు తరువాత 'కులీ' యన్న పదఖండ మావృత్తినొందినది. చివరి యచ్చుకాక మిగిలిన భాగము సమముగానుండి పదానుప్రాస మగుచున్నది. ద్వితీయ పాదమున 'సుఖద సుఖాశయ' అని యన్నప్పుడు 'సుఖ'యన్న పదఖండము నడుమ 'ద'యన్న యక్షరముండగా పునరుక్త మయినది. తృతీయపాదమున 'అభవ, విభవ' యని అన్నప్పుడు 'భవ' శబ్దము పునరుక్తమయినది. 'వి' యన్న యక్షరము వ్యవధానమును కలిగించుచున్నది. చతుర్థపాదమున 'భవ' శబ్దము అవ్యవహితముగా పునరుక్తమయినది. ప్రథమపాదమున నాలుగక్షరముల వ్యవధానముతోను, ద్వితీయ తృతీయ పాదములందు ఏకాక్షర వ్యవధానముతోను, చతుర్థపాదమున వ్యవధానరహితముగాను పదానుప్రాసము నిర్వహింపబడినది. వ్యవధాన విషయమున ఏకవిధమైన వ్యవస్థ లేదు. కావుననే, యిది భిన్న మన్న పదానుప్రాసమునకు లక్ష్యమయినది.

స్తబకవాన్ యథా -

'భాసయత్యపి భాసాదౌ కవివర్గే జగత్త్రయీమ్
కే న యాన్తి నిబన్ధారః కాలిదాసస్య దాసతామ్' 222

సోఽయం వర్ణానుప్రాసవత్ పదానుప్రాసోఽపి స్థానే స్థానే వినివేశాత్ స్తబకవా నిత్యుచ్యతే.

అర్థము : స్తబకవంతమున కుదాహరణము, భాసాదులయిన కవులవర్గము మూడులోకములను ప్రకాశింపజేసినప్పటికిని కాళిదాసుని దాసత్వమును పొందని రచయిత లెవరు ?

వర్ణానుప్రాసమువలెనే పదానుప్రాసముకూడ వేర్వేరు స్థానములందు వినివేశము నొందుటవల్ల స్తబకవంత మనిపించుకొనును.

వ్యాఖ్య : పెక్కుచోట్ల వేర్వేరు పదములు గాని పదఖండములు గాని పునరుక్తములయిన యెడల స్తబకవంత మన్న పదానుప్రాస మగును. ఇది లక్షణము. భిన్నమునందుకూడ వేర్వేరు పదములే అనుప్రాస ఘటకము లయినను అయినప్పటికిని, అచ్చట నొకరీతి ఆరంభింపబడి భగ్నమయినది. స్తబకవంతమున

నందు రీతిప్రసంగము లేనేలేదు. అయినను పదము వ్యవహితమై పునరుక్త మగుటయే యిచ్చట కాననగును. భిన్నమునందు వలె ప్రతిపాదమునందు అనుప్రాస మమరియుండవలయు నన్న నియమము స్తబకవంతమునకు లేదు.

ఉదాహరణమునందు ప్రథమపాదమున 'భాస' మూడక్షరముల వ్యవధానముతో ఆవృత్తినొందినది. చతుర్థపాదమున 'దాస' ఒకే యక్షరము వ్యవధానముతో ఆవృత్తి నొందినది. మొత్తముమీద అనుప్రాస స్థానములు రెండు మాత్రమే. కావుననే, యిది స్తబకవంతమునకు లక్ష్యమయినది.

స్థానీ యథా -

'పరం జోహ్ణా ఉణ్హా గరలసరిసో చందణరసో
ఖదక్ఖారో హారో మలఅపవణా దేహతవణా
ముణాలీ బాణాలీ జలది అ జలద్దా తణులదా
వరిట్ఠా జం దిట్ఠా కమలణఅణా సా సువఅణా' 223

[ఛాయా -

'పరం జ్యోత్స్నా ఉష్ణా గరలసదృశ శ్చందనరసః
క్షతక్షారో హారో మలయపవనా దేహతపనాః
మృణాలీ బాణాలీ జ్వలతి చ జలార్ద్రా తనులతా
వరిష్ఠా యద్దృష్టా కమలనయనా సా సువదనా']

సోఽయం పదానుప్రాసః స్థాననియమాత్ స్థానీత్యుచ్యతే.

అర్థము : స్థానికి ఉదాహరణము. చక్కని ముఖమును, కమలములవంటి కన్నులను గల ఆ యుత్తమురాలిని చూచినప్పటినుండి వెన్నెల మిక్కిలి వెచ్చనయ్యెను; చందనరసము గరళసదృశమయ్యెను; హారము గాయముపైని కారమయ్యెను; మలయవాయువులు దేహదాహకము లయ్యెను; తామరతూడులు బాణములయ్యెను; నీటిలో తడిసినప్పటికిని శరీరవల్లి క మండుచుండెను.

ఈ పదానుప్రాసము స్థాననియమమువల్ల స్థాని యని పిలువబడుచున్నది.

వ్యాఖ్య : స్థాననియమము ననుసరించి ప్రవృత్తమయిన పదానుప్రాసము నకు స్థాని యనిపేరు.

ఉదాహరణమునందు ప్రతిపదమునను రెండేసి అనుప్రాస స్థానములు కలవు. ప్రథమపాదమునందు 'జోణ్హా, ఉణ్హా' అనుచోట ణకార హకార సంయుక్తవర్ణము మీదిదీర్ఘస్వరముతోపాటుగా అనుప్రాస ఘటకమైనది. అదే పాదమున తుదిభాగ మున 'గరల సరిసో, చందణరసో' అనుచోట ర, స వర్ణములు మీది స్వరమైన 'ఓ' తో పునరుక్తములై అనుప్రాస ఘటకము లయినవి. ద్వితీయపాదమున ఆది యందు 'ఖారో, హారో' అని అంతమందు 'పవణా, తవణా' అని అనుప్రాస స్థాన ములు. దీర్ఘముతోడి 'రో' మొదటి అనుప్రాస ఘటకము. 'వణా' చివరి అను ప్రాస ఘటకములు. తృతీయపాదమునందు 'ముణాలీ, బాణాలీ' 'జలద్దా, లదా' అనునవియు చతుర్థపాదమునందు 'పరిట్ఠా జం దిట్ఠా' 'ణఅణా, వఅణా' అనునవియు అనుప్రాస స్థానములు.

ఇట్లు స్థాననియమపూర్వకముగా పాదానుప్రాసము ప్రవర్తించుటవల్లనే యీ పద్యము స్థానికి లక్ష్యమయినది.

ఉదాహరణ పద్యము రాజశేఖరుని కర్పూరమంజరి నుండి గృహీతము.

మిథునం యథా -

'పురః పారాపారాతటభువి విహారః పురవరం
తతః సింధుః సింధుః ఫణిపతివనం పావనమతః
తదగ్రే తూదగ్రో గిరిరితి గిరే స్తస్య పురతో
విశాలా శాలాభి ర్లలితలలనాభి ర్విజయతే.

తదేతత్ప్రతిపాదం ద్వయోర్ద్వయోః పదానుప్రాసయో ర్విన్యా సాన్మిథునమ్.

అర్థము : మిథునమున కుదాహరణము. ఎదురుగా అపారమైన పారానది; తీరభూమియందు విహారము; ఆ పిమ్మట పురవరము; నది సముద్రమే; నాగరాజు వనము పావనమైనది; దానికి అగ్రభాగమున ఉదగ్రమైన గిరి; ఆ గిరికి ముందర లలితలలనలతోను శాలలతోను కూడిన విశాలానగరము వర్ధిల్లుచున్నది.

ఇట్లు ప్రతిపాదమునను రెండు రెండు పదానుప్రాసములకు విన్యాసముండుట వల్ల మిథునము.

వ్యాఖ్య : ప్రతిపాదమునందును రెండేసి పదానుప్రాసము లుండినయెడల మిథున మగును. ఇది లక్షణము.

వర్ణానుప్రాసమైన మిథునమునకును, పదానుప్రాసమైన మిథునమునకు లక్షణమునం దెట్టి సామ్యమును లేదు. మిథున మని యనగా జంటయని యర్థము. ఇచ్చట 'జంట' కు 'రెండు' అని మాత్రమే యర్థము. వెంట నంటియుండుట యన్న యర్థము వివిక్తము కాదు.

ఉదాహరణమునందు ప్రథమపాదము మొదటనున్న 'పుర' చివరనున్న 'పుర వరం'లోని 'పుర'తో అనుప్రాస ఘటకమగుచున్నది. ఈ పాదమునందే 'పారా' అవ్యవహితముగా నున్న 'పారా'తో అనుప్రాసమును ఘటించుచున్నది. ఇట్లు ఈ పాదమున రెండు పదానుప్రాసములు ప్రవర్తించినవి. ద్వితీయపాదమునందు 'సింధుః, సింధుః' అని 'వనం, పావనం' అని రెండు అనుప్రాసములున్నవి. తృతీయపాదమున 'తదగ్రే తూదగ్రో' అనుచోట 'దగ్ర' అనుప్రాస ఘటకములు. అదే పాదమున 'గిరి. గిరే' అనుప్రాస ఘటకములు. చతుర్థపాదమందు 'శాలా. శాలా' అని 'లలి, లల' అని రెండుచోట్ల పదానుప్రాసములు.

ఇట్లు రెండేసిచోట్ల పదానుప్రాసము ప్రతిపాదమున నుండుటచేతనే యిది మిథునమునకు లక్ష్యమయినది.

**మిథునావలీ యథా -**

'శిరసి శరభః క్రోడే క్రోడః కరీ కరటే రట
న్నురసి చ రురుర్మర్మణ్యేణః శిఖీ ముఖరో ముఖే
కపి రపి హృది హ్రాదీ దూరాద్ధిరిద్విపజిద్ధతో
ధనుషి లఘుతా లక్ష్యేఽపూర్వే జయోఽస్య యశస్వినః 225

సేయం ద్వయో ర్ద్వయోః పదానుప్రాసయో ర్నిరంతరమావృత్తి ర్మిథునావలీత్యుచ్యతే.

అర్థము : మిథునావళికి ఉదాహరణము. శరభమృగము శిరస్సునందును, వరాహము పార్శ్వమునందును, గజము గండస్థలమునందును, రురువు వక్షఃస్థలము

నందును, లేడి మర్మభాగమునందును, నెమలి ముఖమునందును, వానరము హృదయము నందును, గజవైరియు గర్జాధారియునైన సింహము దూరమునుండియు హతములైనవి. కీర్తిశాలియైన యీతనికి ధనువునందు లాఘవము, లక్ష్యమునందు అపూర్వజయము నున్నవి.

రెండు రెండు పదానుప్రాసములకు నిరంతరమైన ఆవృత్తి. కావుననే దీనిని మిథునావళి యని యందురు.

వ్యాఖ్య : రెండేసి పదానుప్రాసములు నిరంతరముగా ఆవృత్తి నొందిన యెడల మిథునావళి యగును. ఇది లక్షణము. నిరంతరమని యనగా అవ్యవహితముగా నని యర్థము. మిథునమునందు ప్రతిపాదమున రెండేసి పదానుప్రాసములు వ్యవహితములై కాని, అవ్యవహితములై కాని యుండవలయును. మొత్తముమీద అచ్చట అనుప్రాసస్థానములు ఎనిమిది మాత్రమే యుండును. మిథునావళియందు ప్రతిపాదమునందు అనుప్రాసస్థానములు రెంటి కధికముగా నుండును. అందు రెండేసి నిరంతరముగా నుండవలయును. ఈ భేదమునుబట్టి మిథునముకంటె ఇది వేరుగా పరిగణింపబడుచున్నది.

ప్రథమపాదమునందు 'శిరసి, శరభః' అన్న రెండు పదములు గలవు. ఇవి నిరంతరములు. వీనియందలి తొలియంశములు 'శిర, శర' యనునవి. పదములు పదసంబంధి వర్ణములచేత వ్యవహితములయినప్పటికిని అవ్యవహితము లనియే పరిగణింపవలయును. సంపుటమునందు ఈ విషయము ప్రసక్తమయినది.

శిర, శర; క్రోడే, క్రోడ–ఇవి రెండు నిరంతరావృత్తినొందినవి. కరీ, కరటే; రటే, రటన్ – ఇవి రెండు నిరంతరములు. ద్వితీయపాదమునందు ఉర, రుపః రురు, రర – అవ్యవహితానుప్రాసములు. చివరనున్న ముఖ, ముఖే; కపి, రపి; హృది, హ్రాదీ; దూరా, ద్దరి – అనునవి జంటలుగా అవ్యవహితములయిన అనుప్రాసములు. కావుననే ప్రకృతశ్లోకము మిథునావళికి లక్ష్యమయినది.

గృహీతముక్తో యథా –

'పుం నాగ నాగ కేసర కేసర పరివాస వాసనాసురభిః
సురభి ర్మధుర మధుప్రియ షట్చరణాచరణవాన్ ప్రాప్తః' 226

సోఽయం చక్రవాలపదనుప్రాసో గృహీతముక్త ఇత్యుచ్యతే.

అర్థము : గృహీతముక్తమున కుదాహరణము. పున్నాగములు, నాగకేశరములు, కేసరముల గృహములకు వాసనలందించు కామధేనువైన వసంతము తేనెలయందిష్టముగల భ్రమరముల మధుర భ్రమణములను గలదై ప్రాప్తించెను.

చక్రవాళమువంటి యీ అనుప్రాసము గృహీతముక్తము అని పిలువబడును.

వ్యాఖ్య : ముక్తమయిన పదఖండమును గ్రహించి, తరువాతి పదము ప్రారంభమగును. ముక్తము పునఃప్రయుక్త మగుటయే చక్రవాళక్రమము. చక్రవాళక్రమము గల పదానుప్రాసము గృహీతముక్తము. ఇది లక్షణము.

పూర్వము చెప్పికొన్న మిథునావళి యందలి నిరంతరావృత్తి వలన కొన్నియెడల గృహీతముక్తమువలెనే యనిపింపవచ్చును, కాని రెండింటికిని స్పష్టమయిన భేదమున్నది. మిథునావళియందు పదమునందలి పూర్వఖండము కాని ఉత్తర ఖండము కాని పునరుక్తము కావచ్చును. గృహీత ముక్తమునందు ఉత్తరఖండము మాత్రమే పునరుక్తము కావలయును. మిథునావళియందు వ్యంజనవర్ణములు పునరుక్తము లయినంతమాత్రమున పదానుప్రాసత్వము సిద్ధించును. గృహీతముక్తమునందు పదఖండము అచ్చులతోపాటుగా పునరుక్తము కావలయును.

ప్రస్తుతోదాహరణమునందు పుంనాగ, నాగకేసర, కేసర – శబ్దములు వృక్ష విశేషబోధకములు. 'పుంనాగ' లోని ఉత్తరఖండము 'నాగకేసర' లోని పూర్వ ఖండముగా ఆవృత్తి నొందినది. అందలి ఉత్తర ఖండమైన 'కేసర' తరువాతిపద మైన 'కేసరపరివాస' లోని ప్రథమఖండమైనది. ఇందు తుదిదైన 'వాస' 'వాసనా సురభిః' శబ్దమునకు పూర్వభాగమయినది. ఇందలి తుదిఖండము 'సురభిః' అని వ్యస్తముగా పునరుక్తమయినది. ఇట్లు 'మధుర' లోని 'మధు' తరువాతి సమాసము నందు పూర్వఖండమైనది. 'చరణ' ముక్తమై 'ఆచరణవాన్' లోని పూర్వభాగముగా పునరావృత్తమైనది. ఇట్లు హానోపదానములచేత చక్రవాళక్రమమును పాటించుటచేతనే యీ పద్యము గృహీతముక్తమునకు లక్ష్యమయినది.

పునరుక్తిమాన్ యథా -

'ధూమాఅ ధూమకలుషే
జలఅ జలంతా త్త హాత్థజీఅబంధే
పడిరఅ పడిఉణ్ణా దసే
రసఅ రసంతిసిహారే ధణుమ్మి ణహాఅలమ్' 227

[ఛాయా -

'ధూమాయతే ధూమకలుషే
జ్వలతి జ్వలదాత్త హాస్త జీవాబంధే
ప్రతిరవ ప్రతిపూర్ణ దిశి
రనతి రసచ్ఛిఖరే ధనుషి నభస్తలమ్']

అత్ర ధూమాదీనాం పునర్వచనా దనుప్రాసోఽయం పునరుక్తి మానుచ్యతే.

అర్థము : పునరుక్తిమంతమున కుదాహరణము. ధనుస్సునుండి వెలువడిన ధూమముచేత ఆకాశము ధూమకలుష మగుచున్నది. మంటలు వెలువరుచున్న బాణాగ్రముచేత ఆకాశము మండుచున్నది. జ్యారవము ప్రతి దిశయందును ప్రతిధ్వనించుచున్నది.

ఇచ్చట ధూమాదులయొక్క పునర్వచనమువల్ల ఈ యనుప్రాసము పునరుక్తిమంతము అని పిలువబడును.

వ్యాఖ్య : ఒకేపదము అర్థభేదము లేకుండ పునఃప్రయుక్తమైన యెడల పునరుక్తి యగును. అట్టి పునరుక్తిని గలది పునరుక్తి మంతము. ఇది లక్షణము.

పునరుక్తి యన్నది దోషముగా పరిగణింపబడినది. దోషము నాశ్రయించుకొని అలంకారము ప్రవర్తించుననుట సమంజసముకాదు. అర్థమునందు భేదము లేకున్నప్పటికిని వాచ్యమునందు భేదముండుట యావశ్యకము. అట్లయినప్పుడే అలంకార మగును.

ప్రకృతపద్యము ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యములోనిది. రాముని మహావీరత్వమునకు స్ఫోరకముగా ఈ రచన సాగినది. ధనుస్సు రామునిచేతిలో నున్నది. అయినప్పటికిని ఆకాశమునందు దాని ప్రభావము అవ్యవహితముగా కనబడుచున్నది. రాముడు విల్లెత్తునరికి దానినుండి పొగలు వెలువడి ఆకాశమే ధూమముగా నైపోయినది. అగ్నిబాణమును సంధించునరికి ఆకాశమున మంటలు లేచినవి. నారి ధ్వనియగునరికి సర్వదిశలనుండి ప్రతిధ్వనులు మారుమ్రోగినవి. ఇచ్చట ధూమ, ధూమ; జలఇ, జలంతా; పడి, పడి; రస, రస – అనునవి అనుప్రాస స్థాన

ములు. పునరుక్తులే అయినప్పటికి ధనుఃప్రకర్షమునకు, తద్ద్వారమున రాముని వీరత్వ చిత్రణమునకు పుష్టిని చేకూర్చుటకై ఉద్దిష్టములు. కావుననే యిది దోషము కాక పునరుక్తిమంతమన్న పదానుప్రాసమునకు లక్ష్యమయినది.

97. వర్ణావృత్తి రనుప్రాసః పాదేషు చ పదేషు చ
పూర్వానుభవ సంస్కారబోధినీ పద్యదూరతా

అర్థము : పాదములందు కాని పదములందు కాని వర్ణావృత్తి అనుప్రాస మగును. పూర్వానుభవ సంస్కార బోధకము పద్యదూరత్వము.

98. లాటానుప్రాస వర్గస్య యావద్వా లక్ష్యతే గతిః
పదానుప్రాసవర్గేఽపి తావదేవ ప్రపంచ్యతే.

అర్థము : లాటానుప్రాస వర్గమునకు ఎన్ని ప్రకారముల నూహింపనగునో పదానుప్రాసవర్గమునందుకూడ అన్ని ప్రకారముల నూహించి ప్రపంచింపవచ్చును.

వ్యాఖ్య : వర్ణావృత్తి రనుప్రాసః మొదలుగానున్న విషయము బహు పర్యాయములు ప్రసక్తమే. పదానుప్రాసమును ముగించుచు సింహావలోకన పంద ర్భమున ముక్తాయింపుగా చెప్పుట జరుగుచున్నది. 'పదానుప్రాసమువలెనే, పాదాను ప్రాసము వలెనే పద్యానుప్రాసముండునా?' అన్న ప్రశ్నము నూహించుకొని పూర్వ సంస్కారమునుబట్టి, అనుభవమునుబట్టి పద్యానుప్రాస ముండునని సమాధానము చెప్పుచున్నాడు. పాదానుప్రాసమునే భోజదేవుడు పేర్కొనలేదు. ఇంక పద్యాను ప్రాసము మాట యెక్కడ ? పాదము పునరుక్తమైనపుడు పాదయమకముగాను, పద్యము పునరుక్తమైనపుడు పద్యయమకముగాను యమకవివేచనమునందు ప్రసక్త మయినది. కావుననే తిరిగి 'లాటానుప్రాసవర్గస్య' మొదలయిన విధముగా పదాను ప్రాసమును లాటానుప్రాసమువలెనే పెక్కువిధములుగా విభజించుటకు వీలు కల దని సూచించి ముగించుచున్నాడు.

[ నామానుప్రాసము ]

99. స్వభావతశ్చ గౌణ్యాచ వీప్సాభీక్ష్ణ్యాదిభిశ్చ సా
నామ్నాం ద్విరుక్తిభి ర్వాక్యే తదనుప్రాస ఉచ్యతే.

అర్థము : స్వభావమువల్లను, గౌణార్థముచేతను, వీప్సచేతను, అభీక్ష్ణమును చేతను వాక్యమునందు నామములయొక్క ద్విరుక్తులచేత నామానుప్రాస మేర్పడును.

వ్యాఖ్య : పదానుప్రాసమునందలి పునరుక్తిమంతమువంటిదే నామానుప్రాసముకూడ. పునరుక్తిమంతమునందు వర్ణసముదాయము కాని, పదఖండము కాని పునరుక్తమగును. నామానుప్రాసమునందు పదము పూర్తిగా పునరుక్తమగును. ఈ పునరుక్తి స్వభావమునుబట్టి, గౌణార్థమునుబట్టి, వీప్సనుబట్టి, అభీక్ష్ణనుబట్టి నాలుగు విధములుగా నుండును. ఆదిశబ్దముచేత నిమూలమునుబట్టి, సంభ్రమమును బట్టి మరిరెండు విధములు సూచితములు. మొత్తముమీద నామానుప్రాసము ఆరు విధములుగా విభక్తమగును.

సా స్వభావతో యథా -

'కుర్వంతోఽమీ కలకలం మారుతేన చలాచలాః
ప్రాతర్గులుగులాయంతే గజా ఇవ ఘనాఘనాః' 228

అత్ర కలకల మిత్యాదిషు స్వాభావికీ పునరుక్తి రుపదిశ్యతే.

అర్థము : స్వభావమునుబట్టి అయిన నామావృత్తికి ఉదాహరణము. గాలి చేత చలాచలములయిన యివి కలకలమును చేయుచున్నవి; ఉదయముననే యేనుగులవలె ఘనాఘనములు (మేఘములు) గులగుల శబ్దములు చేయుచున్నవి.

ఇచ్చట 'కలకలము' మున్నగువానియందు స్వాభావికమైన పునరుక్తి యుపదేశింపబడుచున్నది.

వ్యాఖ్య : నామములకు సంబంధించిన పునరుక్తికి నామానుప్రాసమని పేరు. కొన్ని నామములు స్వభావసిద్ధముగానే పునరుక్తములై యుండును; అట్లే కొన్ని ధ్వన్యనుకరణ శబ్దములును పునరుక్తములై యుండును. ఇచ్చట పునరుక్తములైన యంశములే నామమును సిద్ధింపజేయును. కావున, ఇచ్చటి పునరుక్తి సహజసిద్ధము; స్వాభావికము. అట్టి నామమువల్ల కలిగిన అనుప్రాస మగుటచేతనే, యిది నామానుప్రాసమగును.

ఉదాహరణమందు 'కలకలం' 'చలాచలాః' 'గులుగుల' 'ఘనాఘన' అను నాల్గు ననుప్రాసస్థానములు. 'కల కలం' ధ్వన్యనుకరణశబ్దము. ఒక్క 'కల'ను మాత్రమే ప్రయోగించిన, ఇది యీ యర్థమునకు వాచకము కాదు. పునరుక్తమై నప్పుడు మాత్రమే ధ్వన్యనుకరణ వాచక మగును. 'గులుగుల' శబ్దముకూడ ఇట్టిదే. 'చలాచలాః' అన్న పదముకూడ పునరుక్తిచేతనే యేర్పడుచున్నది. 'అత్యంత చంచలములు' అన్న యర్థమున సహజముగనే పునరుక్తి యగుచున్నది. 'ఘనాఘనాః' అనగా మేఘములని యర్థము. 'ఘనాః' అని యన్నప్పటికి నిదే యర్థము. అయినప్పటికిని ముందున్న 'ఘనా' అన్నది విశేషార్థము నేమియు బోధింపకయే అదనముగా చేరినది. కావున, ఇది యేకపదమే యైనది. ఇట్లు పునరుక్త భాగములచేత నేర్పడిన నామములకు కలిగిన అనుప్రాసమగుటవల్లనే యీ పద్యము నామానుప్రాస భేదములలో స్వభావ నామానుప్రాసమునకు లక్ష్యమయినది.

గౌణ్యా యథా -

'అమృత మమృతం చంద్రశ్చంద్ర స్తథాంబుజ మంబుజం
రతి రపి రతిః కామః కామో మధూని మధూన్యపి
ఇతి న భజతే వస్తు ప్రాయః పరస్పర సంకరం
తదియ మబలా కాంతిం ధత్తే కుతః సకలాత్మికామ్' 229

అత్రామృత మమృత మిత్యాదిష్వభేదేఽపి భేదోపచారేణ విశేషణ విశేష్యభావః సామాన్యవిశేష భావాద్భవన్ పునరుక్తి వదవభాసతే.

అర్థము : గౌణార్థమునుబట్టి అయిన నామావృత్తికి ఉదాహరణము. అమృతము అమృతమే; చంద్రుడు చంద్రుడే; అంబుజము అంబుజమే; రతికూడ రతియే; కాముడు కాముడే; తేనెలు తేనెలే – అని సాధారణముగా పరస్పర సంకరమైన పదార్థము నామె భజింపదు. అయినప్పటికి నీమె సకలాత్మకమైన కాంతి నెట్లు ధరించుచున్నది ?

ఇచ్చట 'అమృతము అమృతమే' మొదలయినవానియందు అభేదమే అయినప్పటికిని భేదోపచారముచేత సామాన్య విశేషభావమువల్ల విశేషణ విశేష్యభావమగుచు పునరుక్తివలె భాసించుచున్నది.

వ్యాఖ్య : గౌణార్థమనగా అముఖ్యార్థము. అముఖ్యార్థమునే పునరుక్తి అవిష్కరించు నెడల అది గౌణీనామానుప్రాస మగును. ఇది లక్షణము. ఒకే పదమును రెండుసార్లు పలికినయెడల మొదటిపదము అభిధార్థమునే కలిగియుండును. దీనినే ముఖ్యార్థమని యందురు; ఇదే సామాన్యార్థము. రెండవసారి పలికిన పదము గౌణార్థమును కలిగియుండును: దీనినే అముఖ్యార్థమని యందురు: ఇదే విశేషార్థము. సామాన్య విశేషార్థములవల్ల పునరుక్తపదములు విశేషణ విశేష్యములుగా వ్యవహరించును. కావున, అభిన్నములుగా నున్న పదములు విశేషణ విశేష్యత్వము చేత భిన్నముగా వ్యవహరించును. పునరుక్తి యున్నట్లు భాసించుటయే కాని, యిచ్చట నిజముగా పునరుక్తి లేదు.

ఉదాహరణ శ్లోకమునందు 'అమృతము అమృతమే' అని యన్నప్పుడు రెండవ పదమునకు 'అమృతమాత్రమే, అంతకుమించి యెక్కువకాదు' అన్న నిరసనము కానవచ్చుచున్నది. ఇది విశేషార్థము. తక్కిన యన్నిచోట్లను గూడ విశేషార్థమే స్ఫురించుచున్నది కావుననే నాయిక నిరసించుట జరిగినది.

ఇట్లు వాచ్యార్థమును కాక తదన్యార్థమును బోధించుటచేతనే ఈ పద్యము గౌణీనామానుప్రాసమునకు లక్ష్యమయినది.

ఉదాహరణ పద్యము రుద్రటుని కావ్యాలంకారమునకు నమిసాధువు రచించిన వృత్తి యందలిది

వీప్సయా యథా-

'శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే
దేశే దేశే న విద్వాంస శ్చందనం న వనే వనే' 230

సేయం ద్రవ్యవీప్సా నామ ద్విరుక్తిః. ఏవం గుణజాతి క్రియా వీప్సాయా మపి ద్రష్టవ్యమ్.

అర్థము : వీప్సనుబట్టి అయిన నామావృత్తికి ఉదాహరణము. శైల శైలము నందును మాణిక్యము లేదు గజగజమునందు ముత్యము లేదు. దేశదేశమునందు పండితులు లేరు. వనవనమునందు మంచి గంధము లేదు.

ఇది ద్రవ్యవీప్స యనెడి నామద్విరుక్తి. ఈ విధముగానే గుణజాతి క్రియా వీప్సయందును ద్రష్టవ్యము.

వ్యాఖ్య : వీప్స యనగా ఒకదానిని విడిచి మరొకదాని మీదికి ప్రసరించు నిచ్ఛ. విశేషముగానున్న యాప్సనే వీప్స యని యందురు. వీప్సయందు సాధారణ ముగా ద్విరుక్తి యుండును. ఆ ద్విరుక్తి కూడ నామానుప్రాసమే. ఇది లక్షణము.

ప్రతి శైలమునందును మణులుండవు. రోహణ పర్వతము వంటి విశిష్ట పర్వతములందు మాత్రమే యుండును. అట్లే ప్రతి గజము కుంభస్థలమునందును ముత్యము లుండవు. కొన్ని విశిష్టలక్షణములు గల ఏనుగుల కుంభస్థలములలో మాత్రమే ముత్యము లుండును. లోక సాధారణములయిన పర్వతములు, ఏనుగులు, దేశములు, వనములు- అనువానిని పునరుక్తములుగా తెలుపుటచేత భృశార్థమే గ్రహింప బడుచున్నది. విశిష్టలక్షణ లక్షితములు కొలదిగానే యుండును. తదన్య ములు బహుసంఖ్యాకములు. పునరుక్తిచేత వీప్సయే బోధింప బడుచున్నది; అనగా అధిక సంఖ్యాగ్రహణము నందలి ఆసక్తియే బోధింపబడుచున్నదని భావము.

శైలే, శైలే; గజే, గజే; దేశే, దేశే; వనే, వనే - అనునవి అనుప్రాస స్థానములు. వీప్సచేత నామములు ఆవృత్తి నొందుటచేత ఈ పద్యము నామానుప్రాస మునకు లక్ష్యమగుచున్నది.

శైలము, గజము మొదలయినవి ద్రవ్యవాచకములు. ద్రవ్యవాచకములకు వలెనే గుణవాచకములకు, జాతివాచకములకు, క్రియావాచకములకు కూడ వీప్స యందు పునరుక్తి కలుగును. అవికూడ నామానుప్రాసములుగానే వ్యవహృతము లగును. వానిని కూడ గుర్తించుకొనవలయును.

'ప్రకారే గుణవచనస్య' [8-1-12] ఇత్యాదిరపి వీప్సాప్రకార ఏవ. యథా-

> 'మానినీజన విలోచనపాతా
> నుష్ణబాష్పకలుషాన్ ప్రతిగృహ్ణన్
> మంద మంద ముదితః ప్రయయౌ ఖం
> భీతభీత ఇవ శీతమయూఖః' 231

అర్థము : 'ప్రకారే గుణవచనస్య' అని మొదలయినది కూడ వీప్సా ప్రకారమే. ఉదాహరణము – మానినీ జనుల కన్నులనుండి పడిన నిట్టూర్పులతోడి బాష్పములను ప్రతిగ్రహించి మెల్లమెల్లగా నుదయించిన చంద్రుడు ఆకాశమునందు భయముచెందినవానివలె ప్రయాణించెను.

వ్యాఖ్య : గుణవాచకముకూడ వీప్సయందు పునరుక్తిని చెందును. అది వీప్సయం దొక ప్రకారము.

'మందమందమ్' మెల్లమెల్లగా నని యర్థము. చంద్రుడు ఉదయించిన ప్రకారము నిది చెప్పుచున్నది. ఇది క్రియావిశేషణముగా వ్యవహరించుచున్నది. మందత్వము యొక్క అధికత్వమును తెల్పుటయే యిక్కడ ఉద్దిష్టము. 'భీతభీతఇవ శీతముఖః' అని యున్నప్పుడు 'భీతభీతునివలె చంద్రుడున్నా'డని యర్థము. ఇది చంద్రునికి విశేషణము. భయముయొక్క అధికత్వమును తెల్పుటయే యిక్కడ ఉద్దిష్టము. కావుననే పునరుక్తి నొందినవి. ఇవి రెండును గుణవాచకములే. గుణవాచకములైన నామము వీప్సయందు ఆవృత్తిని పొందుటచేతనే యీ పద్యము గుణవాచక నామామ్రేడమునకు లక్ష్యమయినది.

ఆభీక్ష్ణ్యేన యథా –

'శ్లేషం శ్లేషం మృగదృశా దత్తమానన పంకజమ్
మయా ముకులితాక్షేణ పాయం పాయ మరమ్యత' 232

సోఽయ మాభీక్ష్ణ్యే ణముల్. స చానుప్రయుజ్యత ఇతి పునరుక్తిః.

అర్థము : ఆభీక్ష్ణ్యముతోడి నామావృత్తి కుదాహరణము. ఆలింగనము చేసికొని చేసికొని కాంత ముఖపంకజము నిచ్చినది. ముకులితాక్షుడనైన నేను (మధువును) త్రాగి త్రాగి రమించితిని.

ఇది ఆభీక్ష్ణ్యమునందు ణముల్ ప్రత్యయము. ఇది అనుప్రయుక్తముకూడ అగును. కావుననే పునరుక్తి.

వ్యాఖ్య : ఆభీక్ష్ణ్యము అని యనగా నిత్యత్వమని, నిరంతరత్వ మని యర్థము. ఒకే క్రియ అవ్యవహితముగా తిరిగి తిరిగి జరిగినయెడల ఆభీక్ష్ణ్యమగును. క్రియాపౌనఃపున్యమును బట్టియే తద్వాచకముకూడ పునరుక్తి నొందును.

ప్రకృతోదాహరణమునందు 'శ్లేషం శ్లేషం' అనియు, 'పాయం పాయం' అనియు అనుప్రాసస్థానములు రెండున్నవి. ఆభీక్ష్ణ్యమునందు శ్లిష్ ధాతువునకు ణముల్ ప్రత్యయము కలిగి 'శ్లేషం' అనియైనది. ఆభీక్ష్ణ్యమునందు పునరుక్తి నొందుటకూడ అవశ్యలక్షణము. అందువల్లనే 'శ్లేషం శ్లేషమ్' అని యైనది. దీనికి "నిరంతరముగా (ఎడములేకుండ) పెక్కు పర్యాయములు కౌగిలించుకొని" అని యర్థము. ఇట్లే 'పా' ధాతువు ణముల్ ప్రత్యయాంతమై పునరుక్తమైనపుడు 'పాయం పాయమ్' అని యగును. దీనికి 'విడువకుండ పెక్కు పర్యాయములు త్రాగి' అని యర్థము. ఆభీక్ష్ణ్యమునందు ణముల్ ప్రత్యయాంత నామములు ఆవృత్తిచెందుట చేతనే, యీ పద్యము ఆభీక్ష్ణ్యముతోడి నామానుప్రాసమునకు లక్ష్యమయినది.

క్రియాపదాభీక్ష్ణ్యే ద్విరుక్తౌ తు పునరుక్తే రపి పునరుక్తిః. యథా—

'జయతి జయతి దేవః శ్యామకంఠః పినాకీ
జయతి జయతి దేవీ లోకమాతా భవానీ
జయతి జయతి ధన్యః సోఽపి భక్తస్తయోర్యః
కిమపర మిహ ధన్యం వర్ణ్యతే తావదేవ' 233

అర్థము : క్రియాపదాభీక్ష్ణ్యమువలని ద్విరుక్తియందు పునరుక్తికి కూడ పునరుక్తి. ఉదాహరణము - నీలగ్రీవుడును, పినాకపాణియు నైన దేవునికి జయము. లోకమాతయు, భవానియు నగు దేవికి జయము. ఆ యిర్వురికి భక్తుడై ధన్యుడయిన వానికి జయము. అంతమాత్రము వర్ణించుటను మించి ధన్యమయిన దేమున్నది?

వ్యాఖ్య : ఆభీక్ష్ణ్యమునందు పునరుక్తి ఆవశ్యకమని పూర్వము ప్రసక్తము. ఇంతవరకు ద్విరుక్తికి మాత్రమే లక్ష్యములు చూపబడినవి. కాని అంతకు మించి కూడ పునరుక్తి యుండుట కవకాశములు కలవు. 'క్రియాపదాభీక్ష్ణ్యాత్' అన్న లక్షణమువల్ల క్రియాపదము మాత్రమే అధికావృత్తులకు అర్హమన్న విషయము సూచితమగుచున్నది. వెనుకటి ప్రసంగమునందలి 'శ్లేషం శ్లేషం' మొదలయిన ణముల్ ప్రత్యయాంతములు అధికావృత్తులకు అర్హములు కావు. సమాపకక్రియల నుపయోగించినప్పుడే ఆవృత్త్యాధిక్యమునకు అవకాశము కలదు.

ప్రకృతోదాహరణమునందు 'జయతి' అన్న క్రియాపదము పునరుక్తమైనది. మొత్తము పద్యమునందు ఆరుసారులు ప్రయుక్తమయినది. ఆభీక్ష్ణ్యమువల్లనే యీ

పునఃపునః పునరుక్తి అంగీకృతమయినది. కావుననే, యిది నామానుప్రాసమునకు లక్ష్యమయినది.

ఆది గ్రహణేన నిమూల సంభ్రమాదయః పరిగృహ్యంతే, తేషు నిమూలాదిర్యథా -

'నిమూలకాషం కషతి స్వాంత మంతఃస్మరజ్వరే
లాజస్ఫోటం స్ఫుటంత్యాశు హృదయే హార యష్టయః' 234

అర్థము : ఆదిగ్రహణముచేత నిమూల సంభ్రమాదులు పరిగ్రహింపబడు చున్నవి. లోనున్న మదనజ్వరమునందు స్వాంతము మూలముట్టుగా ఒత్తుకొను చున్నది. హృదయముపైని ముత్యాలహారములు పేలాలు చిట్లినట్లు చిట్లుచున్నవి.

వ్యాఖ్య : నిమూల నామానుప్రాసమున కిది యుదాహరణము. కొన్ని పదబంధములలో ఇమిడియున్న పదమే పునరుక్తమైనపుడు నిమూలనామానుప్రాస మగునని లక్షణము. 'నిమూలం కషతీతి నిమూల కాషమ్' మూలములకు ఒరసి కొమనట్లు - అన్న యర్థమే యీ పదబంధమున కున్నది. అయినప్పటికిని, క్రియా రూపమును పునరుక్తము చేసినప్పుడుగాని భావము పూర్తిగా వ్యక్తము కాదు. తెనుగు నందు తన్ని తన్నెను, గ్రుద్దు గ్రుద్దెను, పలుకు పలికెను - మొదలయినవానిలో నున్న పునరుక్తివంటిదే యిచ్చటను గలదు. ప్రవాహము నిండుగా ప్రవహించు చున్నది; భోజనమును భుజించుచున్నాడు - మొదలయిన వ్యవహారమువంటిదే యిది కూడ. 'నిమూలకాషం కషతి' అని యన్నప్పుడు 'కషతి' పునరుక్తరూపము. అట్లే 'లాజస్ఫోటం స్ఫుటంతి' అని యన్నప్పుడు 'స్ఫుటంతి' పునరుక్తరూపము. తత్పూర్వమున్న కాషం, స్ఫోటం - అనునవి ఆయా ధాతువులనుండి నిష్పన్నము లయిన నామవాచక రూపములే.

నామవాచకముగా నున్నరూపమే, క్రియాపదముగా పునరుక్తమై అర్థవ్యక్తికి తోడ్పడుచున్నది. కావుననే, యిది దోషముకాక అలంకారముగా గ్రహింపబడు చున్నది. నామానుప్రాస భేదములం దిది ఐదవది.

సంభ్రమేణ యథా -

'అస్థీ న్యస్థీ న్యజిన మజినం భస్మ భస్మేందు రిందు
ర్గంగా గంగోరగ ఉరగ ఇత్యాకులాః సంభ్రమేణ

భూషావేషోపకరణగణ ప్రాపణ వ్యాపృతానాం
నృత్యారంభప్రణయిని శివే పాంతు వచో గణానామ్' 235

అర్థము : సంభ్రమముతోడి నామానుప్రాసమున కుదాహరణము. శివుడు నృత్యారంభమునం దిష్టుడు కాగా 'ఎముకలు ఎముకలు - చర్మము చర్మము - విభూతి విభూతి - చంద్రుడు చంద్రుడు - గంగ గంగ - సర్పము సర్పము' అని త్వరావేగము నొంది భూషణ వేషోపకరణ సంధానమునందు వర్తించుచున్న గణముల మాటలు రక్షించును గాక !

వ్యాఖ్య : సంభ్రమ మనగా ఆవేగమని యర్థము. అది భయముతో కూడినది కాని, సంతోషముతో కూడినది కాని కావచ్చును. ఇతరభావములతో నైతము కూడియుండవచ్చును. సంభ్రమమునందు మాటలు పునరుక్తము లగుట స్వాభావికము.

ప్రకృత పద్యము శివుడు నృత్యమునకు వెళ్ళుచుండగా, తదుచితముగా శివు నలంకరించు సన్నివేశమునందలిది. ప్రమథగణములు శివుని కాహార్యమును గూర్చు చున్నవి. కొందరు ఒక వస్తువును కోరుచుండగా, మరికొందరు మరొక వస్తువును కోరుచుండుట ఇట్టియెడల సాధారణము. ఈ సందడిలో ఒకరిమాట యొకరికి వినబడుట కష్టము. స్పష్టముగా వినిపించుటకై అన్నమాటనే తిరిగి యనుట అనివార్యము. ఇచ్చట పునరుక్తి దోషము కాదు; సంభ్రమమును సంస్ఫురింపజేయు చున్నది. కావుననే, యీ పద్యము సంభ్రమ నామానుప్రాసమునకు లక్ష్యమగు చున్నది.

హర్షావేగ విస్మయాదయోఽపి సంభ్రమస్యోపాధయో భవంతి। తేషు హర్ష సంభ్రమేణ యథా -

'రురుధుః కౌతుకోత్తాలా స్తత స్తా మమరావతీమ్
క్వార్జునః క్వార్జున ఇతి బ్రువంత్యో నాకయోషితః' 236

అర్థము : హర్షము, ఆవేగము, విస్మయము మొదలయినవి కూడ సంభ్రమమునకు ఉపాధు లగును. వానియందు హర్షసంభ్రమముతోడి నామావృత్తికి ఉదా

హరణము - అంతట కౌతూహలము పరాకాష్ఠ నందుకొన్న స్వర్గ యువతులు 'అర్జును డెక్కడ? అర్జునుడెక్కడ?' అని యనుచు అమరావతి నడ్డగించిరి.

వ్యాఖ్య : హర్షము, ఆవేగము, ఆశ్చర్యము - అనువానివల్ల కూడ సంభ్రమము కలుగును. సందడి, తొట్రుపాటు, ఉత్సాహము మొదలయినవి సంభ్రమమునకు అర్థచ్ఛాయలు. క్రిందటి శ్లోకము అలంకరణ సంభ్రమమును సూచించుచున్నది. ప్రకృత శ్లోకము హర్షసంభ్రమమునకు లక్ష్యము.

అర్జునుడు దేవలోకమునకు వెళ్ళినప్పుడు, ఆ విషయము నెరింగిన స్వర్గస్త్రీలు ఆతనిని చూచుటకై ఆకాంక్షతో వెళ్ళిరి. జనసముదాయము పెరుగు నరికి కావలసిన వ్యక్తి కానరాదయ్యెను. అందువల్లనే తామే ముందు చూడవలయునన్న కుతూహలముతో 'అర్జును డెక్కడ?' అని యడుగుట జరుగుచున్నది. ఎవరికి వారే యిట్లడుగుటచేత సందడి యెక్కువైనది. కావున, ఒకరిమాట ఒకరికి వినిపించుట కష్టము. అట్టియెడల పునరుచ్చారణము చేయుట యొక్కటే మార్గము. ఈ పునరుక్తి హర్షముతోడి సంభ్రమమును సూచించి సహృదయ రంజక మగుచున్నది.

ఆవేగ సంభ్రమేణ యథా -

'కంచుకం కంచుకం ముంచ హారం హారం పరిత్యజ
హా హా దహతి దావాగ్ని ర్వస్త్రం వస్త్ర మపాకురు' 237

అత్ర 'ముంచ పరిత్యజ దహతి అపాకురు' ఇతి క్రియాపదేష్వావేగ సంభ్రమా న్న ద్విరుక్తిః. తథాహి. అరణ్యానీప్రవేశే విజిగీషు ద్విషాం యోషిద్దావాగ్ని సంభ్రమావేశాత్కయాప్యేవ ముచ్యతే. తత్ర ప్రథమం కంచుక ఏవావేగ సంభ్రమః. స హ్యాగతే దావాగ్నా వుత్తరాయితు మశక్యః. తత స్తద్వ్యాసంగ హేతౌ హారే, అనంతరం పరావపతిత దావాగ్ని దీప్తే వాససీతి.

అర్థము : ఆవేగ సంభ్రమముతోడి నామావృత్తి కుదాహరణము. కంచుకము కంచుకమును విడిచిపెట్టుము. హారము హారమును వదలివేయుము. అయ్యయ్యో! దావాగ్ని దహించుచున్నది. వస్త్రమును తొలగింపుము.

ఇక్కడ 'విడిచిపెట్టుము, వదలివేయుము, దహించుచున్నది, తొలగింపుము' అన్న క్రియాపదములందు ఆవేగసంభ్రమమువల్ల ద్విరుక్తి లేదు. అట్లే దగ్ధమయిన అరణ్యప్రదేశమునందు శత్రుస్త్రీ ప్రవేశించినపుడు దావాగ్ని సంభ్రమావేశమువల్ల మరొక స్త్రీ యెవ్వతెయో ఆమె నిట్లు హెచ్చరించుచున్నది. అచ్చట ప్రథమముగా ఆవేగసంభ్రమమునకు కంచుకము స్థానమయినది. అది వచ్చినంతటిలో దావాగ్నిని దాటుట శక్యము కాదు. అందువల్లనే, దానితో సంబంధము గల హారము, ఆ పిమ్మట దావాగ్ని, మిక్కిలి సన్నిహితము కాగా వస్త్రము సంభ్రమమునకు స్థానము లయినవి.

వ్యాఖ్య : ఆవేగ సంభ్రమము అనియనగా భయాందోళనమని యర్థము. భయాందోళనము వలన కలిగిన నామావృత్తి మరొక విధమయిన సంభ్రమ నామామ్రేడ మగును.

దావాగ్నిలో చిక్కుకొన్న స్త్రీని చూచి మరొకస్త్రీ చేయుచున్న హెచ్చరికయే ఉదాహరణపద్యము. కంచుకము శరీరమునకు పై భాగమునమన్న వస్త్రవిశేషము. కావుననే దావాగ్ని ముట్టుకొనునన్న భయముతో దానిని తొలగించు మనుట జరిగినది. ఆవలి వ్యక్తికి దృష్టిలోనున్నది కంచుకమే. కావున దానినే పునరుక్తము చేయుట జరిగినది. ఇట్టియెడల క్రియాపదమును ద్విరుక్తము చేయవచ్చును. కాని వక్తకు లక్ష్యమయినదే ద్విరుక్తమగుట సహజము. కంచుకము విడుచుటకు హారము అడ్డు వచ్చుచున్నది. కావుననే హారమును వదలివేయు మనుట జరిగినది. ఇచ్చట లక్షితము హారము, కావుననే పునరుక్తమయినది. ఇంతలో దావాగ్ని మరింత దీప్తమయినది. కావున వస్త్రము లక్షితమై పునరుక్తమయినది. భయావేగముచేత నామము ఆవృత్తి నొందుటవల్లనే, యీ పద్యము సంభ్రమ నామామ్రేడమున నొక భేదమునకు లక్ష్యమయినది.

విస్మయసంభ్రమేణ యథా -

'అహో రూప మహోరూప మహో ముఖ మహోముఖమ్
అహో మధ్య మహో మధ్య మస్యాః సారంగచక్షుషః 238

ఏతేషు సమస్తేష్వపి సంభ్రమేషు యావదర్థమితి ద్విరుక్తిః.

అర్థము : విస్మయసంభ్రమముతోడి నామావృత్తి కుదాహరణము. ఈ సారంగనేత్రకు ఓహో! రూపము, ఓహో! రూపము; ఓహో! ముఖము, ఓహో! ముఖము; ఓహో! నడుము, ఓహో! నడుము.

ఈ సమస్త సంభ్రమములందును గ్రహణశక్తి పరిమితి సూచకముగా ద్విరుక్తి.

వ్యాఖ్య : ఆశ్చర్యముతోడి ఆవేగము విస్మయసంభ్రమము, లోకసాధారణము కానటువంటి, అపూర్వములైనటువంటి వస్తువులను దర్శించుటచేతను వార్తలను వినుటచేతను ఆశ్చర్యము కలుగును. అటువంటి ఆశ్చర్యము అనిర్వచనీయము. ఆ సమయమున నటువంటి ఆశ్చర్యమునకు ఆశ్రయములైన వాచకశబ్దములు దిరుక్తములగుట స్వాభావికము.

ప్రకృతోదాహరణమునందు ఒకానొక స్త్రీయొక్క అపురూపమైన అందము నభివర్ణించుట జరిగినది. వక్త రూపము (సౌందర్యము)ను చూచి 'ఓహో రూపము ఓహో రూపము' అని మెచ్చుకొనుచున్నాడు. ఇచ్చట 'ఓహో' అన్న ఆశ్చర్య బోధకమైన అవ్యయమును చేర్చుట తప్ప, చేసిన వర్ణన మేమియులేదు. అట్లే ముఖమును, నడుమునుగూడ అవ్యయమును ముందు జేర్చి పునరుక్తము చేయుటతోనే సరిపెట్టుచున్నాడు. దీనివలన, అది మాటల కందని అందమనియు, ఎంతవరకు భావించుటకు శక్తి యున్నదో అంతవరకు భావింపవలసిన దనియు వ్యక్తమగుచున్నది. ఈ పునరుక్తి వక్త పొందిన ఆశ్చర్య సంభ్రమమునకు వ్యక్తీకరణము, ఇదే వర్ణితయువతి సౌందర్యవిశేషమునకు వ్యంజక మగుచున్నది.

ఏవం త్రిరుక్తి రపి ద్రష్టవ్యా యథా -

'జయ జయ జయ శ్రీమన్భోజ! ప్రభాతి విభావరీ
వద వద వద శ్రవ్యం విద్వన్నిదం వ్యావధీయతే
శృణు శృణు శృణు త్వద్వ్రతూర్యోఽనురజ్యతి మండలం
నహి నహి నహి త్వన్మే మార్తండః క్షణేన విరజ్యతే' 239

అర్థము : ఈ విధముగా త్రిరుక్తికూడ నుండును. ఉదాహరణము. శ్రీమంతుడా! భోజమహారాజా! జయము జయము జయము; రాత్రి తెల్లవారుచున్నది;

ఓ విద్వాంసుడా! వినవలసినది చెప్పుము చెప్పుము చెప్పుము; శ్రద్ధగా వినుచున్నాను. వినుము వినుము వినుము; నీవలెనే సూర్యుడు మండలమును అనురంజింపజేయు చున్నాడు. కాదు కాదు కాదు; భూమార్తాండుడు క్షణములో విరక్తుడు కాడు.

వ్యాఖ్య : విస్మయ సంభ్రమమునందు రెండు మారులు ప్రయుక్తములైన నామములను చూచితిమి. మూడు మారులుకూడ ప్రయుక్తములు కావచ్చును. అట్టి వానికి పైతము లక్ష్యములు సాహిత్యమునందు కానవచ్చును.

ప్రకృతోదాహరణమున ఒక పండితుడు వైతాళికుడై భోజదేవుని నిద్రలేపు చున్నాడు. 'జయ' శబ్దముతో ప్రసంగము మొదలుపెట్టి త్రిరావృత్తము చేసెను. భోజుడుకూడ తన సావధానతను స్పష్టముచేయుటకై 'వద' శబ్దమును త్రిరావృత్తము చేసెను. 'నీవలెనే సూర్యుడు క్ష్మామండలమును అనురంజనము చేయుచున్నాడు' ఇది పండితుని ప్రశంసావాక్యము. భోజునితో సూర్యునికి పోలిక చెప్పబడినది. సూర్యునికంటె భోజునికే గొప్పతనము ఆపాదింపబడినది. కావుననే 'శృణు' శబ్దము మూడు పర్యాయములు అవ్యవహితముగా ప్రయోగించెను. భోజుడు సర సుడు మాత్రమే కాదు; మహాకవికూడ. అందువల్ల మరొక మెట్టుపైకెక్కి 'నావలె కాదు' అన్న భావముతో తక్కిన విషయము చెప్పెను. 'అనురంజనము' అని యనగా ఎఱ్ఱబరుచుట అనియు, అనురాగమును కలిగించుట యనియు అర్థములు. 'మండల మనురజ్యతి' అని యనగా దిక్కులను ఎఱ్ఱబరుచుచున్నాడనియే కవి యర్థము. భోజుడు మరొక యర్థమును సంపాదించి 'క్ష్మామండలమును' పృథ్వీ సూర్యుడైన భోజుడు ఎల్లప్పుడును అనురంజింపజేయునే కాని క్షణములో విరక్తుడు కాడు' అని చెప్పెను. సూర్యుని ఎఱ్ఱదనము కొలదిసేపటిలో తొలగిపోవుటచే విరక్తుడగును. తాను విరక్తుడు కాడు. ఇచ్చట తనకును, సూర్యునకును భేద మున్నదని తెల్పి భోజుడు పండితునికి వంకలు దిద్దినాడు.

పండితునికిని భోజునికిని నడచిన సంభాషణములో ఇరువురును క్రియాపదము లను, అవ్యయములను (నహి) త్రిరావృత్తము గావించిరి. ఈ ఆవృత్తి తత్పరమయ విస్మయ సంభ్రమమునకు సూచకము. కావుననే, యీపద్యము విస్మయ సంభ్రమము తోడి నామానుప్రాసమునకు లక్ష్యమయినది.

100. క్రియానమభిహారశ్చ క్రియాభ్యాసశ్చ యః పురా
యుక్తో వుదాహృతః సోఽపి నామానుప్రాస ఇష్యతే.

అర్థము : యుక్తియందు లక్ష్యములుగా చూపబడిన క్రియాసమభిహారమ్ము క్రియాభ్యాసము కూడ నామానుప్రాసమునందు సమ్మతములే.

101. జాయతే న చ దోషాయ కావ్యేఽలంకార సంకరః
విభూషయతి హారోఽపి స్తనౌ గ్రీవాం మృగీదృశామ్

అర్థము : కావ్యమునందు అలంకార సాంకర్యము దోషమును కలిగింపదు. హారము స్త్రీల వక్షోజములను, గ్రీవాభాగములను గూడ అలంకరించును.

వ్యాఖ్య : అనుప్రాసమునందు ఐదవభేదమయిన నామానుప్రాసమున్ను ముగించుచు, గ్రంథకర్త యందు చేరుటకు యోగ్యములయిన వానిని పర్యాలోకించు చున్నాడు. పూర్వము చెప్పిన 'యుక్తి' యన్న శబ్దాలంకారము పదయుక్తి, పదార్థ యుక్తి, వాక్యయుక్తి, వాక్యార్థయుక్తి, ప్రకరణయుక్తి, ప్రబంధయుక్తి - అని ఆరు విధములుగా పరిగణితమైనది. అందలి వాక్యార్థయుక్తియందు క్రియాసమభిహారమ్ము క్రియాభ్యాసము సంగృహీతములైనవి. (ద్వి. ప. లక్షణశ్లోకము 49). వానిని నామానుప్రాసమునందు సైతము చేర్చుకొనవచ్చునని గ్రంథకర్త యాశయము. 'అలంకార సంకరత్వము కలుగదా?' అని యెవ్వరేని ప్రశ్నింతురని సందేహించి దానికికూడ సమాధానము చెప్పుచున్నాడు. అలంకార సంకరత్వము దోషము కాదు. పైగా దానివలన అంద మినుమడించును. స్త్రీలు మెడలో హారములను ధరింపగా మెడకే కాక స్తనములకును సౌందర్యము కలుగుచున్నది. అట్లే యుక్తియందు పరిగణింపబడిన క్రియా సమభిహార క్రియాభ్యాసములు నామానుప్రాసమునందును పరిగణితములు కావచ్చును. నామానుప్రాసమునందు నామములు అవ్యవహితములుగా ఆవృత్తములగును. అట్లున్నప్పుడు యుక్తిలక్ష్యములు అనుప్రాసమునందు నంతర్గతములు కావచ్చును. ఇది గ్రంథకర్తకు సమ్మతము.

## [ లాటానుప్రాసము ]

102. అర్థాభేదే పదావృత్తిః ప్రవృత్త్యా భిన్నయేహ యా
స సూరిభి రనుప్రాసో లాటీయ ఇతి గీయతే.

అర్థము : అర్థమునందు అభిన్నమై ప్రవృత్తిచేత భిన్నమైన పదావృత్తిని పండితులు లాటానుప్రాసమని ప్రశంసింతురు.

103. న చావ్యవహితో వ్యస్తః సమస్త ఉభయః పునః
ఉభయం చక్రవాలం చ గర్భశ్చైవాభిధీయతే.

104. యస్తు వ్యవహితో నామ నేయతా తస్య శక్యతే
కర్తు మేకాది గణనా పద వృత్త్యాది భంగిభిః.

అర్థము : వ్యవహితమైన లాటానుప్రాసము 1. వ్యస్తము 2. సమస్తము 3. ఉభయము (సమస్త వ్యస్తము) 4. ఉభయము (వ్యస్త సమస్తము) 5. చక్రవాళము 6. గర్భము – అని ఆరు విధములుగా పిలువబడును.

ఇంక వ్యవహితమైన లాటానుప్రాసము పదవృత్త్యాది భంగులచేత ఏకాది గణనము చేయుటకును, అనేక విధములుగా నిర్వహించుటకును శక్యమై యుండును.

తేష్వవ్యవహితభేదేషు వ్యస్తో యథా -

'ఉఅహిస్స జసేణ జసం
ధీరం ధీరేణ గరుఆఇ వి గరుఅమ్
రామో ఠిఏఅ వి ఠిఇం
భణఇ రవేణ అ రవం సముప్పణ్ణందంతో' 240

[ఛాయా -

'ఉదధే ర్యశసా యశో
ధైర్యం ధైర్యేణ గురుతయాపి గురుతామ్
రామః స్థిత్యాపి స్థితిం
భణతి రవేణ చ రవం సమభి [రామన్']

అత్రావ్యయానాం ద్యోతకాదిత్వా దివాదిభి ర్వ్యవధానం నాశ్రీయతే. న హీవాదేః ప్రకృతేఽపి పృథక్పదత్వ మస్తి.

అర్థము : అవ్యవహితభేదములందు వ్యస్తమున కుదాహరణము. రాముడు సముద్రుని యశస్సును యశస్సుచేతను, ధైర్యమును ధైర్యముచేతను, గురుత్వ

మును గురుత్వముచేతను, స్థితిని స్థితిచేతను, శబ్దమును శబ్దముచేతను అతిక్రమించి పలుకుచున్నాడు.

ఇచ్చట అవ్యయములయొక్క ద్యోతకాదిత్వమువల్ల 'ఇవ' మున్నగు వాని చేత వ్యవధాన మాశ్రయింపబడుటలేదు. 'ఇవ' మున్నగువానికి ప్రకృతమునందు కూడ పృథక్పదత్వము లేదు.

వ్యాఖ్య : ఒకే పదము అర్థమున భేదము లేనిదై ప్రవృత్తియందు భేదము కలదై ఆవృత్తి నొందినచో దీనిని లాటానుప్రాస మని యందురు. 'ప్రవృత్తి యందు భేదము' అని యనగా తాత్పర్యభేద మనియే భావము. లాటదేశీయులకిది మానపాత్ర మగుటచేత, వాని పేరుననే యీ యనుప్రాస భేదము లాటానుప్రాస మని వ్యవహృత మగుచున్నది.

లాటానుప్రాసము అవ్యవహితము, వ్యవహితము – అని స్థూలముగా రెండు విధములు. అవ్యవహిత లాటానుప్రాసము వ్యస్తము, సమస్తము – మొదలయిన పేరులతో ఆరు విధములుగా పేర్కొనబడినది. అందు మొదటిదైన వ్యస్తమును గురించి చూతము.

అవ్యవహితము అని యనగా పదమునకును తదావృత్తమునకును నడుమ వ్యవధానము లేని దని యర్థము. వ్యస్తమని యనగా స్వతంత్ర మని యర్థము. సమస్తమునకు విరుద్ధముగా ఇది ప్రయుక్తము. సమాసమునందలి అంగములు అస్వతంత్రములు.

ప్రకృతోదాహరణమునందు యశః, ధైర్యమ్, గురుతా, స్థితిః, రవః – అను పదము లనుప్రాస ఘటకములు. యశసాయశో, ధైర్యం ధైర్యేణ – మున్నగు విధముగా అవ్యవహితములుగా అనుప్రయుక్తము లగుటచేత అవ్యవహిత విభాగము నకు చెందుచున్నవి యశము – అని యన్నప్పుడు 'కీర్తి' అనియే రెండుచోట్ల మన్న యర్థము. ధైర్యమునకు రెండుచోట్లను ధీరత్వమనియే యర్థము. ద్వితీయాంతపదములు సముద్రునికి చెందినవి; తృతీయాంతపదములు శ్రీరామునికి చెంది నవి. భిన్నవ్యక్తులతోడి అన్వయముచేతనే, యీ పదముల ప్రవృత్తి భిన్నత్వము నొందుచున్నది. కావుననే లాటానుప్రాసమునకు లక్ష్యము లయినవి.

అవ్యవహితత్వము, స్వతంత్రత్వము, తాత్పర్యభేదము – అనువానిచేత దీనిని అవ్యవహిత వ్యస్త లాటానుప్రాస మని యందురు. కాని, యిచ్చట నింకొక

సంధియము కలుగుట కవకాశమున్నది. 'యశసా యశో' అని యన్నప్పుడు 'యశ' అన్న రెండక్షరములలోనే సామ్యమున్నది తొలిపదము చివరనున్న 'సా' వ్యవధానమును కలిగించుటనేదా? అని. విభక్తి ప్రత్యయములు ద్యోతకములు. వానివల్లనే అన్వయము ద్యోతితమగును. కావున విభక్తి ప్రత్యయముల వ్యవధానమును వ్యవధానముగా పరిగణింపరాదు. అట్లే 'ఇవ' మున్నగు ఉపమావాచకములు కాని, 'చ, తు, అపి' మున్నగు అవ్యయములు కాని వ్యవధానమును కలిగింపలేవు. వానికి పృథక్ పదత్వమును శాస్త్రజ్ఞులు అంగీకరింపరు. కాబట్టి ఏవో పదములనంటుకొనియే ప్రవర్తించును, అపరిహార్యములైన వాని నంగీకరించుటయే ఔచిత్యము.

యద్యేవ మిద మిహోదాహరణం యుజ్యతే -

'త్వన్ముఖం త్వన్ముఖమివ త్వద్దృశౌ త్వద్దృశావివ
త్వన్మూర్తి రివ మూర్తిస్తే త్వమివ త్వం కృశోదరి' 241

ఇతి. అస్త్వేవైతత్. కింతు యథా 'అమృత మమృతం చంద్ర శ్చంద్రః' ఇత్యాదిక మభేదేఽపి భేదోపచారా న్నామ ద్విరుక్తి స్తథేయ మిత్యుత్ప్రేక్ష్యతే.

అర్థము : ఈ విధముగా నయినచో ఈ యుదాహరణము తగియుండును. ఓ కృశోదరీ! నీముఖము నీముఖమువలె, నీచూపులు నీచూపులవలె, నీమూర్తి నీ మూర్తివలె, నీవు నీవువలె నున్నారు - అని. ఇది యుండనే యున్నది. కాని యేవిధముగా 'అమృత మమృతం చంద్ర శ్చంద్రః' అని అభేదమునందు భేదోపచారమువల్ల నామద్విరుక్తియో, అదేవిధముగా ఇదికూడ భావింపబడుచున్నది.

వ్యాఖ్య : పైని చూపిన లక్ష్యమునందు విభక్తి ప్రత్యయములు ఆవృత్తికి అంతరమును కలిగించుచున్న వనుకొన్నచో అట్లు అంతరమును కలిగింపని లక్ష్యముగా గ్రంథకర్త ప్రకృత శ్లోకమును చూపుచున్నాడు. 'త్వన్ముఖం త్వన్ముఖం' అను విధముగా వ్యవధానము లేకుండగనే ఆవృత్తి జరిగినది. తృతీయ చతుర్థ పాదములందు 'ఇవ' అంతరమును కలిగించుచున్నది. అది గణనీయము కాదని పైని వ్యాఖ్యాతము, నిజమునకు రెండవపదైన యీ లక్ష్యము అపేక్షితము కాదు.

విభ_క్తి ప్రత్యయములు వ్యవధానకారకములు కావని పైని చెప్పుకొంటిమి. గ్రంథ క_ర్తయే వృ_త్తియందు దానిని తెలిపెను.

ఇంక ఇచ్చట చెప్పుకొనవలసిన దొకటి యున్నది. 'నీముఖము నీముఖము వలె'న్ మొదలయిన విధముగా చెప్పినప్పుడు ముఖశబ్దమునకు అర్థభేదము కానరాదు. తాత్పర్యభేద మేమైన నున్నదా? అన్వయమునందు భేదములేదు కాన, అదియు లేదు. మరి, దీనిని లాటానుప్రాసమనుట యెట్లు? ఈ ప్రశ్నకు సమాధానముగా నామాను ప్రాసమునందలి 'అమృత మమృతం చంద్రశ్చంద్రః' అని మొదలయినచోట భేదమును కల్పించుకొన్నట్లే యిక్కడను కల్పించుకొనవలయునని గ్రంథక_ర్త వాక్యము. పైనున్న అనుప్రాసస్థానములందు పూర్వో_క్తము ఉపమేయము; పునరు_క్తము ఉపమానము. ఇచ్చట ఒకే పదము ఉపమేయమై పునరు_క్తినొంది ఉపమానత్వము నొందుచున్నది. ఇట్లు ఉపమేయోపమానప్రవృ_త్తులనుబట్టి తాత్పర్యభేదము తల యె_త్తుచున్నది. కావుననే యిది లాటానుప్రాసమునకు లక్ష్యమైనది.

సమస్తో యథా -

'అపహ_స్తితాన్య కిసలయ
కిసలయశోభం విలోకయాశోకమ్
సఖి విజితాపర సుమనః
సుమనః సుభగం చ మధుతిలకమ్'

అత్ర 'కిసలయ కిసలయ' ఇతి 'సుమనః సుమనః' ఇతి చ సమాస్తానా మేవావ్యవధానా దయం లాటీయోఽనుప్రాసోఽవ్యవహిత సమ_స్తః. పూర్వః పున రవ్యవహితవ్య_స్త ఇత్యుచ్యతే.

అర్థము : సమ_స్తమున కుదాహరణము. అన్యకిసలయములందు హ_స్తము మోపని సఖీ! చిగుళ్ళతో శోభించుచున్న అశోకమును చూడుము. ఇతర పుష్పముల నోడించి పుష్పసుందరమయిన మధుతిలకమును దర్శింపుము.

ఇక్కడ 'కిసలయ కిసలయ' అని 'సుమనః సుమనః' అని సమ_స్తపదముల యొక్క అవ్యవధానమువల్ల అవ్యవహిత సమ_స్తమైన లాటీయానుప్రాసము. మరి, పూర్వము చెప్పినది అవ్యవహిత వ్య_స్త మనిపించుకొనును.

వ్యాఖ్య : అవ్యవహిత లాటానుప్రాసభేదములలో రెండవది సమస్తము. అనుప్రాస ఘటకమైన పదము సమాసఘటితమై యుండును. అందువల్లనే సమస్త మన్న అభిధానము అన్వర్థమగుచున్నది. ఒకే సమాసమునందు మధ్యస్థమై పదము పునరుక్తము కావచ్చును. కాని, ఏకార్థకమైన పదము అట్లు పునరుక్తినొందుట కవకాశము అత్యల్పము. పూర్వసమాసమునందు ఉత్తరాంగముగను, తరువాతి సమాసమునందు పూర్వాంగముగను ఒకే పదము అవ్యవహితముగా పునరుక్తము కావచ్చును. రెండుచోట్లను పదము సమాసఘటితమై యుండుటవల్ల ఇది అవ్యవహిత సమస్త మగును.

ప్రకృతోదాహరణమునందు 'అవ....కిసలయ' అన్న సమాసము నందలి తుదియంగమును 'కిసలయశోభం' అన్న సమాసములోని తొలి యంగమును సమాన ములు; సమానార్థకములు. రెండుచోట్లను బహువ్రీహి సమాసములే యున్నవి కాని మొదటి సమాసము సఖికి విశేషణము: రెండవది అశోకమునకు విశేషణము. అన్వయభేదముచేతనే తాత్పర్యభేదము కలుగుచున్నది కావుననే లాటానుప్రాసము నకు లక్ష్యమైనది. రెండు పదములును వెంటవెంటనే ఆవృత్తము లగుటచే అవ్యవ హితత్వము. సమాసాంతర్గతములగుటచేత సమస్తత్వము.

పూర్వము చెప్పికొన్న రెండు లక్ష్యములును అవ్యవహితములే. స్వతంత్ర పదము లావృత్తి నొందుటచేత వ్యస్తములు. కావుననే అవ్యవహిత వ్యస్తలాటాను ప్రాసమున కుదాహరణములుగా ఉపాత్తములైనవి. క్రమమును తప్పించి గ్రంథ కర్త సమస్తమును ముందుగాను, వ్యస్తమును తరువాతను వృత్తియం దెత్తుకొనెను. వ్యస్తప్రసంగమునందు ఇతరేతర వివరణము కావలసివచ్చినది. కావున, సమస్త మును వివరించిన పిమ్మట వ్యస్తమును వివరించి తన మార్గమును సుగమము చేసి కొనెను.

ఉభయస్తు ద్విధా. ప్రథమః సమస్తోఽపరో వ్యస్తః. ప్రథమో వ్యస్తోఽపరః సమస్త ఇతి చ. తయోః ప్రథమో యథా-

'జిత లాటాంగనా వక్త్రం తస్యా మృగీదృశః
కస్య న క్షోభజనకం జనకం పుష్పధన్వనః' 243

తదిదం లక్షణేనైవ వ్యాఖ్యాతమ్.

అర్థము : ఉభయము రెండువిధములు. మొదటిది సమస్తము, తరువాతిది వ్యస్తము; మొదటిది వ్యస్తము, తరువాతిది సమస్తము. ఆ రెండింటియందు ప్రథమమున కుదాహరణము. లాటదేశపు స్త్రీముఖమును జయించిన ఆ మృగిలోచన ముఖము ఎవనికి క్షోభను కలిగింపకుండును? ఎవనికి మదనుని కలిగింపకుండును?

ఇది లక్షణముచేతనే వ్యాఖ్యాతమైనది.

వ్యాఖ్య : అవ్యవహితలాటానుప్రాసమునందు మూడవభేదమును ఉభయమని యందురు. దీనికి పూర్వము పరిగణితములైన వ్యస్తసమస్తభేదములే ఉభయమన్న పదముచేత ఉద్దిష్టములు. సమాసమునందలి తుదిపదమే అవ్యవహితముగా వ్యస్తముగా పునరుక్తమైనచో ఉభయమునందలి తొలిభేద మగును. దీనిని సమస్తవ్యస్తోభయము అని పిలువవచ్చును. లాటానుప్రాసభేదములలో ఇది మూడవది. తొలుత వ్యస్తపదముండి అదియే అవ్యవహితముగా పునరుక్తమై సమాసమున పూర్వాంగమైనయెడల ఉభయమునందలి మలిభేదమగును. దీనిని వ్యస్తసమస్తోభయము అని పిలువవచ్చును.

ఉదాహరణమునందు 'వక్త్రం, జనకం' అన్న పదములు అనుప్రాసపాదములు. ప్రథమపాదమంతయు నొకటే సమాసము. అందు చివరిపదము 'వక్త్రం'. ద్వితీయపాదము మొదటనే 'వక్త్రం' వ్యస్తముగా పునరుక్తమయినది. ఇది చతుర్థపాదాదిని వ్యస్తముగా పునరుక్తమైనది. అన్వయభేదముచేతనే తాత్పర్యభేదము కలుగుచున్నది. తొలుత సమస్తము, తరువాత వ్యస్తము నున్నవి. కావున సమస్తవ్యస్తోభయమున కిది లక్ష్యమయినది.

ద్వితీయో యథా -

'నలినీ నలినీనాథ కరసంతతి సంగమాత్
వికచా వికచాస్యానాం కాంతానాం హరతి శ్రియమ్' 244

అస్యాపి లక్షణే నైవోక్తోఽర్థః.

అర్థము : ద్వితీయమున కుదాహరణము. పద్మము పద్మబాంధవ కిరణమూహ సంగమమువల్ల వికసించినదై వికసించిన ముఖములుగల కాంతలయొక్క శోభను హరించుచున్నది.

అర్థము : గతి చిత్రమునందు గత ప్రత్యాగతమున కుదాహరణము. ఏనుగు లనెడి పర్వతములతో గంభీరమైనదియు, సారమైనదియు, భయంకర సైనిక సమూహముల ధ్వనులు గలదియు, శత్రువులను సంహరించినదియు, అవరోధము లేనిదియు, శత్రుసైనికులను యుద్ధమునకై వరించునదియు నైన సేన.

ఇచ్చట బేసిపదములయందు గతి; సరిపాదములందు ప్రత్యాగతి.

వ్యాఖ్య : గతి చిత్రము అక్షరగమనమునుబట్టి యేర్పడిన చిత్రము. చిత్రాలంకార భేదములలో గతి చిత్రము ఐదవది. ఇది కూడ అవాంతర భేదములను పెక్కింటిని కలిగియున్నది.

అందు మొదటిది గత ప్రత్యాగతము. ఒక పాదమునందు ఒక క్రమమున నక్షరముల విన్యాసము జరుగును. ఇది అనులోమ క్రమము. ఇదే గతము. అవే యక్షరములు రెండవపాదమునందు వెనుకనుండి ముందునకు విన్యస్తములగును. ఇది ప్రతిలోమక్రమము. ఇదే ప్రత్యాగతము. ఇట్లే మూడవ పాదము ప్రతిలోమ క్రమమున నాలుగవ పాదమగును.

ప్రకృతోదాహరణమునందు 'వా ర ణా గ గ భీ రా సా' అన్న ప్రథమపాదమును వెనుకనుండి ముందునకు చదువగా 'సా రా భీ గ గ ణా ర వా' అని యైనది. ఇదే ద్వితీయ పాదము. 'కా రి తా రి వ ధా సే నా' అన్న తృతీయ పాదము ప్రతిలోమక్రమమునొంది 'నా సే ధా వ రి తా రి కా' అని చతుర్థ పాదముగా రూపొందినది. ప్రథమ తృతీయపాదముల గతియే ప్రత్యాగతమై క్రమముగా ద్వితీయ చతుర్థపాదములుగా అయినది. ఒక యర్థమునం దుపయుక్తములయిన వర్ణములే క్రమమును మార్చుకొని అర్థాంతరము ననుగ్రహించుచున్నవి. ఇట్లు చిత్తరంజనమును గావించుట చేతనే చిత్రము. ఇచ్చట వర్ణముల నాశ్రయించుకొని మార్పు చెందినదియు, సౌందర్యమును సంపాదించుకొన్నదియు శబ్దమే. కావుననే, యిది శబ్దాలంకారముగా సంగృహీతమయినది.

తదర్ధగతం యథా—

'నిశితాసిరతోఽభీకో న్యేజతేఽమరణా రుచా
చారుణా రమతే జన్యే కోఽభీతో రసితాశిని' ౨౪౩

పదములనుబట్టి సమస్తము. అనగా అనుప్రాసఘటకములు కానివి యితరపదములు. వానితో సమాసము నొంది పూర్వమందు కాని పరమందుకాని నిలిచియుండుట చేత సమస్తము. ఇట్లు వ్యస్తసమస్త లక్షణములను రెండింటిని గలిగియుండుటవల్లనే వ్యస్తసమస్తోభయము అని పిలిపించుకొనుచున్నది.

ఇది మరల రెండు విధములు. మొదటిది చక్రవాళము. రెండవది గర్భము. చక్రవాళమునందు ప్రతిపాదమునందు అంత్యాద్యములకు అనుప్రాసము చెల్లును. అనగా ప్రథమపాదము తుదినున్న పదమే ద్వితీయపాదము మొదట నుండును. ద్వితీయపాదము చివరనున్నదే తృతీయపాదము మొదటను, తృతీయపాదము చివర నున్నదే చతుర్థపాదము మొదట నుండును. ఇట్లు గృహీతముక్తములోవలె నుండుట వల్లనే చక్రవాళము అనుపేరు సార్థకమగుచున్నది. గర్భమునందు పునరుక్తి పాద మధ్యమునందు జరుగును. ఇచ్చట కూడ రెండు పదములును సమాసగర్భితములే కావలయును.

తయోః ప్రథమ శ్చక్రవాలం యథా-

'జయతి క్షుణ్ణతిమిర స్తిమిరాంశ్వైక వల్లభః
వల్లభీకృత పూర్వాశః పూర్వాశాతిలకో రవిః' 245

అత్ర తిమిర వల్లభ పూర్వాశేతి శబ్దా స్తిమిరాది శబ్దాపేక్ష యావ్యస్తా యథా స్వపూర్వోత్తర పదాపేక్షయా చ సమస్తాః పాదాం తాద్యో ర్వినివేశితా ఇతి యథోక్త లక్షణానుగమా ల్లాటీయాను ప్రాసోఽయ మవ్యవహితో వ్యస్తసమస్త శ్చక్రవాల మిత్యుచ్యతే.

అర్థము : వానిలో మొదటిదైన చక్రవాళమున కుదాహరణము. చీకటులను వలుగగొట్టినవాడును, చక్రవాకముల కేకైక వల్లభుడును, పూర్వదిశను వల్లభగా చేసికొన్నవాడును, పూర్వదిక్కాంతకు తిలకమైనవాడు నైన సూర్యుడు జయించును.

ఇచ్చట తిమర, వల్లభ, పూర్వాశ - అన్న శబ్దములు తిమిరాది శబ్దాపేక్ష చేత వ్యస్తములైనట్లే తమకు ముందు వెనుకల నున్న పదముల అపేక్షచేత సమస్తములు. పాదాంతాద్యములందు వినివేశితము లని చెప్పబడిన లక్షణము ననుసరించుట వల్ల ఈ లాటీయానుప్రాసము అవ్యవహితము వ్యస్తసమస్తమునై చక్రవాళ మన బడుచున్నది.

వ్యాఖ్య : ఉదాహరణమునందు మొదటిపాదము చివర 'క్షుణ్ణతిమిరః'అన్న సమాసమున్నది. చివరిపదమైన 'తిమిరః' అన్నది ద్వితీయపాదమైన 'తిమిరాంధైక వల్లభః' అను సమాసమున తొలిపదముగా అవ్యవహితముగా ఆవృత్తమయినది. ఇట్లే ద్వితీయపాదాంతమందలి 'వల్లభః' తృతీయపాదాదిని పునరుక్తమయినది. తృతీయపాదాంతము నందలి 'పూర్వాశః' చతుర్థపాదాదిని పునరుక్తమయినది. ఇట్లు ఏకార్థకమైన పదములు తాత్పర్యభేదముతో అవ్యవహితముగా గృహీత ముక్తపద్ధతిలో పునరుక్తిము లగుటచేత, ఇది చక్రవాళమునకు లక్ష్యమైనది.

ఏతేన పాదమధ్యేఽనుప్రాసవిన్యాసాద్గర్భోఽపి వ్యాఖ్యాతః యథా-

'సమాధవా మాధవదత్తదృష్టిః
సకౌతుకా కౌతుకమందిరే స్తాత్
సవిభ్రమా విభ్రమదాయినీ వః
సపంకజా పంకజలోచనా శ్రీః'                    246

అర్థము : దీనిచేతనే పాదమధ్యమునందు అనుప్రాస విన్యాసమువల్ల నేర్పడు గర్భము వైతము వ్యాఖ్యాతము. ఉదాహరణము-మాధవునితో నుండి మాధవుని యందు దృష్టి నిల్పి, విభ్రమముతో కూడినదై, మీకు విభ్రమమును కలిగించునదై, పద్మములు గలదైన పద్మలోచనయైన లక్ష్మి వేడుకతో వేడుక మందిరము నందున్నది.

వ్యాఖ్య : చక్రవాళము నందువలెనే సమాసఘటితములైన పదములే ఇచ్చట కూడ ఆవృత్తినొందును. ఇచ్చట ఆవృత్తి పాదమధ్యమున నుండును. చక్రవాళమునకు పాదాంతాద్యములందుండును. ఈ రెండింటికి మన్నభేద మిదియే.

ఉదాహరణమునందు ప్రథమపాదమున మాధవ, ద్వితీయపాదమున కౌతుక, తృతీయపాదమున విభ్రమ, చతుర్థపాదమున పంకజ-అన్నపదములు అవ్యవహితములుగా పాదమధ్యమున పునరుక్తము లగుచున్నవి. కావుననే యీ పద్యము గర్భమునకు లక్ష్యమయినది.

వ్యవహితభేదేషు వ్యస్తో యథా-

'ప్రకాశో యశసా దేవః ప్రకాశో మహసా రవిః
దుఃసహో విద్విషాం స్వామీ దుస్సహ స్తమసాంచ సః' 245

తదేతన్నాతి దుర్బోధ మితి న వ్యాక్రియతే. సోఽయ మేక గుణో వ్యస్తశ్చ లాటీయానుప్రాసో వ్యవహిత ఇత్యుచ్యతే.

అర్థము : వ్యవహిత భేదములందు వ్యస్తమున కుదాహరణము. ప్రభువు కీర్తిచేత ప్రకాశము; సూర్యుడు మహస్సుచేత ప్రకాశము; స్వామి శత్రువులకు దుస్సహుడు; సూర్యుడు తమస్సులకు దుస్సహుడు.

ఇది అతిదుర్బోధము కాదని వివరించుటలేదు. ఇది ఏకగుణము వ్యస్తము వ్యవహితము నయిన లాటీయానుప్రాసముగా పిలువబడుచున్నది.

వ్యాఖ్య : లాటానుప్రాసమును స్థూలముగా అవ్యవహితము, వ్యవహితము అని రెండు విధములుగా పరిగణించుట జరిగినది. ఇంతవరకు అవ్యవహితభేదము లను లక్ష్యపూర్వకముగా దర్శించితిమి. ఇప్పుడింక వ్యవహితభేదమును గురించి తెలిసికొనవలయును. నియతముగా ఇవి యిన్ని యని చెప్పుటకు వీలులేదు. విభజన సామర్థ్యమునుబట్టి పెక్కువిధములుగా పరిగణించుట కవకాశము గలదు. గ్రంథ కర్త అవ్యవహితమువందువలెనే వ్యవహితమునందు కూడ వ్యస్తము, సమస్తము, వ్యస్తసమస్తము-అన్నభేదములను ప్రదర్శించుచున్నాడు. వీని కింకను కొన్ని అవాంతర భేదములను కూడ జోడించుచున్నాడు.

వ్యవహితము అని యనగా అనుప్రాసఘటకమైన పదమునకు, పునరుక్తమైన పదమునకు నడుమ వ్యవధానము కల దని యర్థము. అటువంటి వానిలో వ్యస్తము లయిన పదములు అనుప్రాస ఘటకములయిన యెడల అది వ్యవహిత వ్యస్తమగును. పదము ఒక్కమారు మాత్రమే ఆవృత్తి నొందినయెడల, అది ఏక గుణము.

ప్రకృతోదాహరణమునందు 'ప్రకాశము' అన్న వ్యస్త పదము వ్యవహితమై ప్రథమ ద్వితీయ పాదములందు ప్రయుక్తమైనది. అట్లే 'దుస్సహుడు' అన్న వ్యస్త పదము తృతీయ చతుర్థపాదములందు వ్యవహితమై ప్రయుక్తమైనది. ఒకపదము ఒకమారు మాత్రమే ఆవృత్తి నొందుటవల్ల ఏక గుణ మన్న లక్షణమునకు సరిపోయినది.

వ్యస్తశ్చానేకగుణో యథా-

'కించిద్వచ్మి న వచ్మి వచ్మియది వా కిం వచ్మి వచ్మీదృశం
దృశ్యం తే న భవాదృశేషు పతిషు స్వేషా మదోషే దమాః
తే కిం సంతి న సంతి సంతి యది వా కే సంతి సంతీదృశాః
సర్వస్వేషు గుణైర్గృహీతహృదయా లోకః కుతో వర్తతే' 248

అత్ర వచ్మీతి సంతీత్యేతయో రనేకగుణావృత్తిః.

అర్థము : వ్యస్తానేక గుణమున కుదాహరణము. కొంచెము చెప్పుదును; చెప్పను; ఒకవేళ చెప్పినచో నేమి చెప్పుదును? నీవంటి రాజులయందు ఆత్మీయులకు అదోషమునందు దండనములు కనిపింపవని చెప్పుదును. అటువంటి వారు ఉన్నారా? లేరా? ఉన్నట్లయినచో వా రెవరు? గుణములచేత గ్రహింపబడిన హృదయముగల దై లోకమంతయు వారియందెందుల కని వర్తించుచున్నదో అటువంటి వారున్నారు.

ఇచ్చట వచ్మి సంతి అను రెండింటికి అనేక గుణావృత్తి.

వ్యాఖ్య : ఒకే పదము అనేక పర్యాయము లావృత్తి నొందినయెడల అనేక గుణ మగును. ఉదాహరణమునందు ప్రథమపాదమున 'వచ్మి' యన్న క్రియా పదము ఐదు పర్యాయములు ప్రయుక్తమయినది. అట్లే తృతీయపాదమున 'సంతి' యన్న క్రియాపదము ఐదుపర్యాయములు ప్రయుక్తమయినది. కావుననే యిది వ్యవహిత వ్యస్తానేకగుణమైన లాటానుప్రాసమునకు లక్ష్యమయినది.

[పాదమధ్యమునందు 'న వచ్మి వచ్మియది' 'వచ్మివచ్మీదృశం' అనుచోట్ల పునరుక్తి అవ్యవహితముగానే యున్నది. తృతీయపాదమునందుకూడ ఇట్లే రెండు చోట్ల అవ్యవహితత్వమున్నది. కాబట్టి దీనిని వ్యవహితావ్యవహితానేకగుణమైన వ్యస్తలాటానుప్రాసమున కుదాహరణముగా ప్రదర్శించుట యోగ్యము.]

సమస్త ఏకగుణో యథా -

'చంద్రానన చంద్రదినం
మృగలోచన మృగశిరశ్చ నక్షత్రమ్
తిథి రతిథిప్రియదశమీ
పరత స్త్వేకాదశీ ప్రహారాత్' 249

నన్విహ తిథి రిత్యసమస్తమ్. న కేవల మసమస్తం భిన్నార్థతయా లాటీయానుప్రాసేఽపి న సంగచ్ఛతే. సంగచ్ఛతే చ కేనచిత్ పదానుప్రాసేన. న చ లాటీయానుప్రాసో వా నామానుప్రాసో వా పదానుప్రాసాద్భిద్యత ఇతి

అర్థము : సమస్తైక గుణమున కుదాహరణము. చంద్రముఖీ! ఇది చంద్ర దినము (సోమవారము). మృగలోచనా! మృగశిరా నక్షత్రము. తిథి అతిథి ప్రియమైన దశమి. జాము దాటిన పిమ్మట ఏకాదశి.

ఇక్కడ 'తిథి' అసమస్తముకదా! అసమస్త మగుటయేకాదు, భిన్నార్థత్వము చేత లాటీయానుప్రాసమునందు చేరదు. ఒకానొక పదానుప్రాసములో చేరును. లాటీయానుప్రాసముకాని నామానుప్రాసముకాని పదానుప్రాసముకంటె భిన్నముకావు.

వ్యాఖ్య : వ్యవహిత సమస్తైకగుణ లాటీయానుప్రాసమునకు లక్ష్యమిది. 'చంద్రానన: చంద్రదినం' అనుచోట్ల చంద్రశబ్దము సమాసఘటితమై యున్నది. నడుమ నితరవర్ణములు వచ్చి రెండుచోట్ల నున్న పదమునకు వ్యవధానమును కలిగించుచున్నవి. ఇట్లే 'మృగలోచన'మృగశిరశ్చ అనుచోట్ల మృగశబ్దము సమాసఘటితమై వ్యవహితమై యున్నది. ఒక్కొక్కమారు మాత్రమే ఆవృత్తిని చెందుటచేత ఏకగుణ మగుచున్నది, ఈ రెండే లాటానుప్రాసస్థానములు.

తృతీయ పాదమునందు 'తిథి రతిథి' యున్నగు విధముగా 'తిథి' యన్న శబ్దము పునరుక్తమైనది. మొదటనున్న 'తిథి' వ్యస్తముగా నున్నది. కావున లక్షణమునకు సరిపోలేదని అనిపించును. అట్టి భ్రాంతి కలుగుట కవకాశము కలదని గుర్తించి గ్రంథకర్త 'ఇక్కడ తిథి వ్యస్తముగా నుండుట మాత్రమేకాదు; తర్వాత నున్న అతిథి శబ్దము కంటె అర్థమునందు భిన్నముకూడనై యున్నది. ఇది లాటానుప్రాస విషయము కాదు' అని వృత్తియందు స్పష్టము చేసెను. పదానుప్రాసము

నందువలెనే నామానుప్రాస లాటానుప్రాసములందు కూడ పదము నాశ్రయించియే అనుప్రాసము ప్రవర్తించును. 'తిథి-అతిథి' అని యన్నప్పుడు పదానుప్రాస భేద మయిన సంపుట మగును.

సమస్తోఽనేకగుణో యథా—

'బ్రహ్మాండ చ్ఛత్రదండః శతధృతిభువనాంభోరుహో నాలదండః
క్షోణీనౌకూపదండః క్షరదమరసరిత్పట్టికా కేతు దండః
జ్యోతిశ్చక్రాక్ష దండ స్త్రిభువనవిజయ స్తంభదండోఽఙ్ఘ్రిదండః
శ్రేయ స్త్రైవిక్రమ స్తే వితరతు విబుధద్వేషిణాం కాలదండః' 250

అత్రానేకశో దండ ఇత్యస్యావృత్తిః.

అర్థము : సమస్తానేక గుణమున కుదాహరణము. బ్రహ్మాండమన్న గొడుగు నకు కామయు, బ్రహ్మ పుట్టిన పద్మమునకు కాడయు, భూమి యన్న పడవకు తెరచాపకంబమును, జారుచున్న మందాకిని యన్న ధ్వజమునకు స్తంభమును, జ్యోతి శ్చక్రమునకు అక్షదండమును, త్రిభువనవిజయమును చాటు విజయ స్తంభ మును, దేవతావిరోధులకు యమదండమునయిన త్రివిక్రమదేవుని పాదదండము నీకు శ్రేయమును ప్రసాదించును గాక ।

ఇచ్చట అనేక పర్యాయములు దండశబ్దమున కావృత్తి.

వ్యాఖ్య : వ్యవహితభేదములలో సమస్తానేక గుణమైన లాటీయానుప్రాస మున కుదాహరణ మిది. 'దండః' అను పదము ప్రతి సమాసమునందును చివరి యంగమై నిలిచి అనేక పర్యాయము లావృత్తి నొందినది అన్నిచోట్ల ఒకే యర్థ మున నుపయుక్తమైనది. ఒక యావృత్తికి నడుమ వ్యవధాన మున్నది. కావుననే యిది లక్షణమునకు సరిపోయి లక్ష్యముగా స్వీకృతమైనది.

ఉదాహరణ పద్యము దండిరచించిన దశకుమారచరిత్రమునుండి గ్రహింప బడినది.

ఆభ్యాం వ్యస్తసమస్తభేదోఽపి వ్యాఖ్యాతః యథా—

'దశ రశ్మి శతోపమద్యుతిం
యశసా దిక్షు దశ స్వపి శ్రుతమ్
దశ పూర్వరథం యమాఖ్యయా
దశకంఠారి గురుం విదు ర్బుధాః' 251

అత్రానేకధా దశశబ్ద ఆవర్తతే.

అర్థము : వీనికి (అవ్యవహిత వ్యవహితములకు) వ్యస్త సమస్తభేదము కూడ వ్యాఖ్యాతమైనది. ఉదాహరణము - దశరశ్ములయొక్క శతము (సహస్రకిరణములు) గల సూర్యునితో సాటియైన దీప్తి గలవాడును, కీర్తిచేత దశదిశలయందును సుప్రసిద్ధుడును. పేరుచేత దశపూర్వరథశబ్ద (దశరథ) వాచ్యుడును, దశకంఠునికి శత్రువైన రామునికి తండ్రియని దేవత లెరుంగుదురు.

ఇచ్చట దశశబ్దము అనేక విధములుగా ఆవృత్తమయినది.

వ్యాఖ్య : అవ్యవహితమునందు వలెనే వ్యవహితమునందు కూడ వ్యస్తము, సమస్తము, వ్యస్త సమస్తము - అన్నభేదము లున్నవని ముందే తెలుపబడినది. ప్రథమగుణముగా వ్యస్తసమస్తమునకు లక్ష్యమును చూపుట జరుగుచున్నది.

ఉదాహరణమునందు 'దశ' శబ్దము పెక్కు పర్యాయములు ప్రయుక్తమయినది. 'దిక్షుదశసు' అని యన్నప్పుడు మాత్రమే వ్యస్త రూపమున, తక్కిన మూడు చోట్ల సమస్తరూపమున నున్నది. దశశబ్దము దూరదూరముగా ఆవృత్తి నొందినదనుటయు స్పష్టమే. కావుననే, యిది వ్యవహితభేదములలో వ్యస్తసమస్తమునకు లక్ష్యమగుచున్నది. దశశబ్దమున కనేకావృత్తులుండుటవల్ల అనేక గుణమగుచున్నది.

అవ్యవహితేఽపి ద్వైగుణ్యాదే ర్నవిరోధః యథా-

వస్త్రాయంతే నదీనాం సితకుసుమధరాః శక్రసంకాశకాశాః
కాశాభా భాంతి తాసాం నవపులినచరాః శ్రీ నదీహంస హంసాః
హంసాభాంభోదముక్తస్ఫుర దమృతరుచి ర్మేదినీ చంద్ర చంద్ర
శ్చంద్రాంకః శారదస్తే జయకృదుపనతో విద్విషాం కాలకాలః' 252

అర్థము : అవ్యవహితమునందుకూడ ద్వైగుణ్యాదులకు విరోధము లేదు ఓ దేవేంద్రసన్నిభుడా! తెల్లని పువ్వులు ధరించిన కాశములు (రెల్లుమొక్కలు) నదులకు వస్త్రములగుచున్నవి. సంపద యన్న నదికి హంసయైనవాడా! కాశాభము లయిన హంసలు ఆ నదీనవపులినములందు సంచరించుచు ప్రకాశించుచున్నవి. ఓ మేదినీచంద్ర! హంసలవలె తెల్లనైన మేఘములనుండి వెలువడి చంద్రుడు అమృత కాంతులను వెదజల్లుచున్నాడు. ఓ శత్రుకాలుడా! చంద్రాంకమైన శరత్కాలము జయ కరమై సమీపించినది.

వ్యాఖ్య : వ్యవహితలాటానుప్రాస భేదములందుమాత్రమే ఏకగుణము, అనేక గుణము-అన్న విభాగము ప్రసక్తమైనది. దీనిని బట్టి అవ్యవహితము లందు ఒక్కమారు పునరుక్తమగుట (ఏకగుణము) మాత్రమే కలదని, పెక్కుమారులు పునరుక్తమగుట (అనేక గుణము) లేదని భ్రమపడుట కవకాశము కలదు. ఆ భ్రాంతిని వారించుటకొరకే, వ్యవహితప్రసంగమునందు పైతము అవ్యవహితానేక గుణప్రసంగము చేయుటకు గ్రంథకర్త సంకోచించుటలేదు. క్రమము తప్పెడి మాట యథార్థమే కాని చెప్పెడిమాట స్పష్టార్థమై యుండవలయునన్న పట్టుదలయే దీని నిక్కడ చెప్పించుచున్నది.

ఉదాహరణమునందు ప్రథమపాదాంతమున 'శక్రసంకాశకాశాః' అనియు ద్వితీయపాదారంభమున 'కాశాభాః' అనియు 'కాశ' శబ్దము మూడువర్యాయము లుప యుక్తమైనది. కావున, దీనిని ద్వైగుణ్య మని యనవచ్చు ననిపించును. లాటాను ప్రాసమునందు అర్థభేదము లేని పదము తాత్పర్యభేదముతో పునరుక్తము కావలయు నన్న విషయమును గమనింపవలయును. 'శక్రసంకాశ' అని యన్నప్పుడు సంకాశ శబ్దము సాదృశ్యార్థకము. కాబట్టి యిది అనుప్రాస ఘటకము కాదు. 'కాశాః, కాశాభాః' అనుచోట్లనున్న కాశశబ్దము సమానార్థకము; అనుప్రాస ఘటకము; ఏక గుణము; అవ్యవహితము.

చివరిపాదము చివరనున్న 'కాలకాలః' అని యన్నప్పుడు మొదటి పదము నకు 'యముడు' అని యర్థము; రెండవది ఋతుసూచకము. కావున లాటాను ప్రాసమున కిదికూడ స్థానము కాదు. 'సంకాశకాశాః' 'కాలకాలః' అనువానిని యమకముగానే గ్రహింపవలసియుండును.

ద్వితీయపాదాంతమునను, తృతీయపాదారంభమునను హంసశబ్దము మూడు సారులు ప్రయుక్తమైనది. అన్నిచోట్లను సమానార్థకము, అవ్యవహితము; సమస్తము; ద్విగుణము. అట్లే తృతీయపాదాంతమునను, చతుర్థపాదారంభమునను చంద్ర శబ్దము మూడుసారులు ప్రయుక్తమైనది. అన్నిచోట్ల నర్థము సమానము; అవ్యవహితము; సమస్తము; ద్విగుణము. కావున లాటానుప్రాసమునందలి అవ్యవహిత సమస్త ద్విగుణమునకు హంస, చంద్ర శబ్దములను బట్టియే ప్రకృత పద్యమును లక్ష్యముగా గ్రహించుట జరిగినది.

ఉదాహరణ పద్యము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తినుండి సంగృహీతము.

వ్యవహి తావ్యవహితభేదేఽపి దృశ్యతే. యథా-

'ధనై ర్దుష్కులీనాః కులీనాః క్రియంతే
ధనై రేవ పాపా న్నరా నిస్తరంతి
ధనేభ్యో హి కశ్చిత్సుహృన్నాస్తి లోకే
ధనాన్యర్జయధ్వం ధనాన్యర్జయధ్వమ్' 263

అర్థము : వ్యవహి తావ్యవహితభేదమునందుకూడ (అనేక గుణము) కన్పడుచున్నది. ఉదాహరణము - ధనములచేత దుష్కులీనులు కులీనులగుచున్నారు. ధనములచేతనే నరులు పాపములను దాటుచున్నారు. లోకమునందు ధనములను మించిన స్నేహితు డెవ్వడును లేడు. ధనముల నార్జింపుడు; ధనముల నార్జింపుడు.

వ్యాఖ్య : క్రమానుసారముగా అనేకగుణమును గ్రహించి, వ్యవహితము నందు అవ్యవహితమునందుకూడ దాని యునికిని ప్రదర్శించిన పిమ్మట వ్యవహితా వ్యవహితమునందు ప్రదర్శించుటకు గ్రంథకర్త పూనుకొనుచున్నాడు.

ఉదాహరణమున మొదటి మూడుపాదములందును ప్రారంభముననే ధనశబ్దము ప్రయుక్తమైనది. నాలుగవపాదమునందు రెండు పర్యాయములు ప్రయుక్తమైనది. అన్నియెడల నున్న అర్థమొక్కటే. అన్నియెడల ధనశబ్దము వ్యస్తముగనే యున్నది. వ్యవహితముగనే యున్నది. ఈ విధముగా భావించినప్పుడు దీనిని వ్యవహితవ్యస్త లాటానుప్రాసమునందు అనేకగుణ మని అనవలయును. కాని,

చివరిపాదము రెండు విరుపులు విరిగినది. మొదటి విరుపే పునరుక్తమై పాదమును పూర్తిచేసినది. దీనిని పాదార్ధాభ్యాస మని యందురు. దీనినిబట్టి పునరుక్తి అవ్యవహితముగా పరిగణిత మగుచున్నది. నిజమున కిచ్చట ధనశబ్దముకాక 'ధనాన్యర్జయధ్వం' అన్న వాక్యమే అనుప్రాస ఘటకమగుచున్నది. అయినను ధనశబ్దోపస్థితినిబట్టి మొత్తము పద్యమును వ్యవహితావ్యవహితముగానే గ్రంథకర్త లక్షించి, అనేక గుణమున కుదాహరణముగా ప్రదర్శించుచున్నాడు

యోఽపి చార్ధాభ్యాసః సోఽపి వ్యవహితావ్యవహితభేదఏవ. యథా -

'యైస్త్వం సాక్షాత్కృతో నాథ తేషాం కామేషు కో గ్రహః
యైస్త్వం సాక్షాత్కృతో నాథ తేషాం కామేషు కో గ్రహః' 254

అత్ర పాదాపేక్షయా వ్యవహితత్వ మర్ధాపేక్షయా పునరవ్యవహితత్వం భవతి.

అర్థము : అర్ధాభ్యాసముకూడ వ్యవహితావ్యవహితభేదమే. ఉదాహరణము-
నాథా! ఎవరికి నీవు సాక్షాత్కరించితివో వారికింక కామములందు పట్టుదల యేమి,
నాథా! ఎవరికి నీవు సాక్షాత్కరించితివో వారి కింక కామములందు పట్టుదల యేమి?

ఇచ్చట పాదాపేక్షచేత వ్యవహితత్వము; అర్ధాపేక్షచేత అవ్యవహితత్వము.

వ్యాఖ్య : అర్ధాభ్యాసము అని యనగా శ్లోకార్ధము అభ్యాసము నొందుట యని యర్థము. శ్లోకమునందలి సగముభాగము (పూర్వార్ధము) మార్పేమియు లేకుండ పునరుక్తమై (ఉత్తరార్ధము) శ్లోకమును పూర్తిచేసినయెడల దీనిని అర్ధాభ్యాసమని యందురు. దీనిని గ్రంథకర్త వ్యవహితావ్యవహిత భేదముగా పరిగణించుచున్నాడు. దానికి హేతు విది యని వృత్తియందు తానే తెల్పుచున్నాడు.

ప్రథమపాదమును ద్వితీయపాదమును కలియగా శ్లోకపూర్వార్ధమగును. ఇదే ఉత్తరార్ధముగా పునరుక్తమైనప్పుడు, మరేమియు వ్యవధానము లేనందువలన, అవ్యవహితమే యగును. ప్రథమపాదమును వేరుగను, ద్వితీయపాదమును వేరుగను పరిగణించినప్పుడు ప్రథమపాదము తృతీయపాదముగా పునరుక్తమగును. అప్పుడు ద్వితీయపాదము ఆ రెండింటిని వ్యవహితము గావించుచున్నది. అట్లే ద్వితీయ

పాదము చతుర్థపాదముగా పునరుక్తమైనపుడు తృతీయపాదము ఆ రెండింటిని వ్యవహితము గావించుచున్నది. అందువల్ల, పాదమును అనుప్రాస ఘటకముగా గ్రహించిన యెడల అనుప్రాస స్థానములు రెండనియు వ్యవహితము లనియు చెప్పుకొనవలయును. అట్లు కాక శ్లోకార్ధమునే అనుప్రాస ఘటకముగా గ్రహించిన యెడల అనుప్రాస స్థాన మొక్కటే యనియు అవ్యవహిత మనియు చెప్పుకొనవలయును. ఈ రెండు విధములుగాను గ్రహించుటకు వీలుండుటచేతనే భోజదేవుడు రెండింటిని కలిపి వ్యవహితావ్యవహితభేదమని పేర్కొనుచున్నాడు.

నీవు సాక్షాత్కరించినపుడు సర్వకామములును సంపన్నములగును; కావున వారికి పట్టుదల యుండవలసిన యవసరము లేదు. నీవు సాక్షాత్కరించుటయే వారి కోరిక; అది జరిగినప్పుడు మరొక కోరిక యేమి యుండును ? — ఈ విధముగా ఒకే యర్థమును కలిగి తాత్పర్యభేదమును ప్రసాదించుటచేత ఇది లాటానుప్రాసమయినది. 'యై స్త్వం సాక్షాత్కృతో నాథ' అన్న ప్రథమపాదము తృతీయపాదముగా పునరుక్తమైనది. అప్పుడు 'తేషాం కామేషు కో గ్రహః' అన్న ద్వితీయపాదము వ్యవధానమును కలుగజేయుచున్నది. అట్లే ద్వితీయ చతుర్థపాదముల నడుమ తృతీయము వ్యవధానమును కలుగజేయుచున్నది. 'యైస్త్వం... గ్రహః' అన్నంతవరకు ఒకే యంశముగా గ్రహించినపుడు మిగిలిన శ్లోకమునందు అవ్యవహితముగా అదే పునరుక్త మగుచున్నది. కావుననే అర్ధాభ్యాసము వ్యవహితావ్యవహితభేద మనుదానికి లక్ష్యముగా ప్రకృత శ్లోకము ప్రదర్శింపబడినది.

ద్విభాగాభ్యాసస్తు వ్యవహిత ఏవ స్వదతే. యథా -

'శ్రద్ధాయత్నౌ యది స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్
తా వుభౌ యది న స్యాతాం మేధయా కిం ప్రయోజనమ్' 255

అర్థము : ద్విభాగాభ్యాసము వ్యవహితమైనప్పుడే అందముగా నుండును. ఉదాహరణము — శ్రద్ధా యత్నము లున్నయెడల బుద్ధితో నేమి పని? ఆ రెండును లేనియెడల బుద్ధితో నేమి పని ?

వ్యాఖ్య : అర్ధాభ్యాసముకంటె వ్యవహితమైన ద్విభాగాభ్యాసమే రమణీయముగా నుండును. ఇచ్చట 'ద్విభాగాభ్యాసము' అనియే యుపయుక్తమైనది. ఒక పాదము పూర్తిగను, రెండవపాదమునందు దరిదాపుగా సగము భాగమును పునరుక్త

మైనపుడు మూడుపంతు లని పరిగణించుట సమంజసముగా నుండును. కాబట్టి దీనిని ద్విభాగాభ్యాస మనుటకంటె త్రిభాగాభ్యాస మనుట యోగ్యతరము.

ఉదాహరణమునందు పూర్వార్ధమునందలి 'శ్రద్ధాయత్తౌ యది స్యాతాం' అన్న ప్రథమ పాదము 'తావు భౌ యది న స్యాతాం' అన్న తృతీయపాదముగా పునరుక్త మైనది. ద్వితీయము యథాతథముగా చతుర్థమైనది. ఒక సందర్భమున ఒక వస్తువునకు ప్రయోజనము లేదు; దానికి విరుద్ధ సందర్భమున ఆ వస్తువునకు ప్రయోజన ముండును. కాని యిచ్చట అప్పుడు కూడ ప్రయోజనము లేదనియే అభ్యస్తపాదము వ్యక్తీకరించుచున్నది. ఇట్లుండుటవల్ల చమత్కార ముత్పన్న మగుచున్నది. 'తావుభౌ, న' అనునవి పూర్వార్ధమునకు పునరుక్తమైన ఉత్తరార్ధభాగమునకు వ్యవధాన కారకము లగుచున్నవి. కావుననే యిది ద్వి(త్రి)భాగాభ్యాసమునందు వ్యవహితమునకు లక్ష్యమయినది.

పాదాభ్యాసః పునరవ్యవహితో వ్యవహితశ్చ దృశ్యతే. తయో రవ్యవహితో యథా -

'సంతః శృణుధ్వం హృదయే నిధధ్వ
ముత్క్షిప్య బాహుం పరిరారటీమి
న సుభ్రువాం తుల్య మిహాస్తి రమ్యం
న సుభ్రువాం తుల్య మిహాస్తి రమ్యమ్' 256

అర్థము : పాదాభ్యాసము తిరిగి అవ్యవహితముగా వ్యవహితముగా కవిపించుచున్నది. వానియందు అవ్యవహితమున కుదాహరణము - పండితులారా! వినుడు. హృదయమునందు భద్రపరుచుకొనుడు. చేయెత్తి మరి మరి చెప్పుచున్నాను - సుందరాంగులతో సమానమైన రమ్యము మరొకటి లేదు; సుందరాంగులతో సమానమైన రమ్యము మరొకటి లేదు.

వ్యాఖ్య : ఒక్కపాదము మాత్రమే పునరుక్తమైన యెడల పాదాభ్యాసమ' యందురు. ఉదాహరణమందు మూడవపాదము నాలుగవపాదముగా పునరుక్త మనది. రెంటు పాదములకును అర్థము సమానమే. ఏదయిన విషయము నొత్తిచెప్పనప్పుడు ద్విరుక్తముగా, త్రిరుక్తముగా చెప్పుట స్వాభావికము. ఇచ్చట నట్లే పునరుక్తి ప్రసక్తమయినది.

సా నశ్చేతసి కీలితేవ విశిఖై శ్చేతో౽భువః పంచభి
శ్చింతాసంతతి తంతుజాల నిబిడ స్యూతేవ లగ్నాప్రియా॥ 258

అర్థము : ఇవ ప్రకృతుల యావృత్తులుగూడ ఇచ్చటనే దర్శనీయములు. ఉదాహరణము – లీనమైనట్లుగా, ప్రతిబింబించినట్లుగా, వ్రాయబడినట్లుగా, చెక్కబడినట్లుగా, తాపడము చేసినట్లుగా, వజ్రలేపనముతో సిద్ధముచేసినట్లుగా, లోపలికి త్రవ్వబడినట్లుగా, మన్మథుని అయిదుబాణములనెడి మేకులతో హృదయమునందు దిగగొట్టబడినట్లుగా, చింతాసంతతి యనెడి తంతుజాలముతో మనస్సునకు కుట్టబడినట్లుగా ప్రియురాలు లగ్నమై యున్నది

వ్యాఖ్య : ఇంతవరకు పదములకు పునరుక్తిమాత్రమే సూచితము. అవ్యయములుకూడ పదములుగానే పరిగణితములు; కాని ఇవాదులకు పృథక్పదత్వమంగీకార్యము కాదని అవ్యవహితత్వ విషయమున నిర్ణయము జరిగినది. అయినను ఇవాదులచేతకూడ వాక్యాలు సుందరత్వము నొందినప్పుడు, వానినికూడ అనుప్రాస ఘటకములుగా అంగీకరించుటయే ఔచిత్యము.

ప్రకృతోదాహరణమునందు 'వలె' నన్న యర్థముగల ఇవశబ్దము పెక్కు పర్యాయము లావృత్తమైనది. అట్లు ఆవృత్తినొందుటచేత శబ్దసౌందర్యము సంపన్నమగుచున్నది. ఇవ శబ్దము వ్యవహితమై పెక్కు పర్యాయము లావృత్తి నొందినది. కావున దీనిని వ్యవహిత సమస్తానేక గుణలాటానుప్రాసముగా చెప్పుకొనవచ్చును.

ఉదాహృత శ్లోకము భవభూతి రచించిన మాలతీ మాధవమునుండి స్వీకృతము.

105. యమకానాం హి యావంత్యో వర్ణ్యంతే భేదభక్తయః
అనుప్రాసస్య లాటానాం భిదాస్తావంత్య ఏవ హి.

అర్థము : యమకమున కెన్ని అవాంతరభేదము లున్నవో లాటానుప్రాసమునకు కూడ అన్ని అవాంతరభేదము లున్నవి.

వ్యాఖ్య : లాటానుప్రాసమునకు తాను చూపిన భేదములు మాత్రమేకాక, యింకను పెక్కు భేదము లుండునని చెప్పుచున్నాడు. దీనినిబట్టి తాను చూపిన

భేదములు సమగ్రము కావని ప్రతిభాశాలియైన కవి యింక ననేకవిధములయిన లాటానుప్రాసములను ప్రయోగింపవచ్చునని గ్రంథకర్త సూచించుచున్నాడు.

106. ఉపమాది విముక్తాపి రాజతే కావ్యపద్ధతిః
యదనుప్రాసలేశోఽపి కాంత తత్ర నివేశ్యతే.

107. కుండలాది విముక్తాపి కాంతా కిమపి శోభతే
కుంకుమేనాంగరాగశ్చేత్ సర్వాంగీణః ప్రయుజ్యతే.

అర్థము : అనుప్రాస లేశమైనను నివేశితమైనయెడల ఉపమాద్యలంకారములు లేకపోయినప్పటికిని కావ్యపద్ధతి శోభించును. కుంకుమముచేత సర్వాంగములకు అంగరాగము సమకూర్పబడినయెడల కర్ణాభరణాదులు లేకపోయినప్పటికి కాంత కొంత శోభించుచునే యుండును.

వ్యాఖ్య : అలంకారములు సౌందర్య జనకము లని పెక్కురు అంగీకరించిన విషయమే. అయినను, ఉపమాద్యలంకారముల కున్న ప్రాధాన్యమును అనుప్రాసాద్యలంకారముల కిచ్చుట కితరు లంగీకరింపరు. భోజదేవుడు ఉపమాదులు లేకపోయినను కావ్యము అందముగానే యుండును కాని అనుప్రాసము లేనియెడల అందముగా నుండదని చెప్పుచుండుటచేత శబ్దాలంకారములకు అర్థాద్యలంకారములకంటె వెక్కువ ఔన్నత్యము నంగీకరించుచున్నాడనుట తథ్యము.

108. శ్రుతి వర్ణానుప్రాసా వేకవిధౌ కుంతలేషు గౌడేషు
పదయోని రనుప్రాసో ద్వేధా త్రేధా చ లాటేషు.

అర్థము : శ్రుత్యనుప్రాస వర్ణానుప్రాసములను రెండింటిని కుంతలదేశీయులును, గౌడదేశీయులు నేకవిధముగానే పరిగణింతురు. లాటదేశీయులు పదజన్యమైన అనుప్రాసమును రెండు మూడు విధములుగా పరిగణింతురు.

వ్యాఖ్య : అనుప్రాసాలంకార ప్రాధాన్యమును తెల్పిన పిమ్మట దేశీయములైన అభిరుచులననుబట్టి పరిగణనములో నున్న భేదమును తెల్పి గ్రంథకర్త యీ ప్రసంగమును ముగించి, క్రమమునుబట్టి యీ పిమ్మటిదైన చిత్రాలంకారముల గురించి ప్రారంభించుచున్నాడు.

## చిత్రాలంకారము

109. వర్ణ స్థాన స్వరాకార గతి బంధాన్ ప్రతీహ యః
నియమ స్తద్బుధైః షోఢా చిత్ర మిత్యభిధీయతే.

అర్థము : శబ్దాలంకార భేదములలో పదునారవది చిత్రాలంకారము. 1. వర్ణము 2. స్థానము 3. స్వరము 4. ఆకారము 5. గతి 6. బంధము - అనువాని కున్న నియమమును బుధులు చిత్రమని యందురు. ఇది ఆరు విధములు.

వ్యాఖ్య : 'చిత్తం రంజయతీతి చిత్రమ్'. చిత్తమును రంజింపజేయునది కావున, చిత్రము - అని వ్యుత్పత్త్యర్థము. అన్ని యలంకారములును చిత్తరంజకములే, సౌందర్య సంధాయకములే. అయినను వర్ణాదినియమమువల్ల చిత్రము ఆశ్చర్యాపాదకమై చిత్తమును మరింత యెక్కువగా రంజింపజేయును. తక్కిన యలంకారములకు వానికున్న వేర్వేరు లక్షణములనుబట్టి నామనిర్ణయము అన్వర్థముగా జరిగినది. దీనికి చిత్తరంజకత్వమే ప్రధాన లక్షణము. కావున దానిని బట్టియే 'చిత్రము' అన్న నామధేయము సమంజసముగా నిర్ణీతమైనది.

వర్ణము అని యనగా వ్యంజనమనియే యర్థము. మూడవ భేదముగా స్వరము పేర్కొనబడినది. వ్యంజన నియమమునుబట్టి ఒక భేదము; స్వరనియమమునుబట్టి మరియొకభేదము; కంఠ్యము మొదలైన వాని నియమము స్థాననియమము; పద్మాది రూపము కల్గునట్లుగా రచనచేయుట ఆకారనియమము; ముందువకు చదువుట వెనుకకు చదువుట మున్నగు భేదములతో రచనచేయుట గతినియమము; మురజాది రూపమున అక్షర విన్యాసక్రమమును నిబంధించుట బంధనియమము- ఈ ఆరువిధము లైన నియమములచేత చిత్రాలంకార మేర్పడును. ఇందు మరల అవాంతర భేదములు పెక్కులు గలవు.

### [వర్ణచిత్రము]

వర్ణశబ్దేన చాత్ర స్వరాణాం పృథఙ్నిర్దేశాద్ వ్యంజనాన్యేవ ప్రగృహ్యంతే తత్ర వర్ణచిత్రేషు చతుర్వ్యంజనం యథా -

'జ జౌ జో జా జి జి జ్జాజీ తం తతోఽతి తతాతితుత్
భాభోఽభీ భాభి భూభా భూ రారరి రిరరః' 259

అర్థము : వర్ణశబ్దముచేత ఇచ్చట అచ్చులన్ని వేరుగా నిర్దేశించుటవల్ల, హల్లులు మాత్రమే గ్రహింపబడుచున్నవి. అందు వర్ణచిత్రములందు చతుర్వ్యంజనమున కుదాహరణము. యుద్ధశీలుడును, రణకోవిదుల శౌర్యముచేత సంభవించిన సంగ్రామములను జయించు వాడును, శత్రువును మిక్కిలి విస్తరించి చేరవచ్చుచున్న శత్రుసైన్యమును బాధించువాడును, శుక్రాదితారల కాంతివంటి కాంతి గలవాడై, భయమెఱుగని యేనుగుల నోడింపగల పౌరుషమున కాశ్రయమైనవాడు నైన శత్రుఘ్న (బలభద్రుడు) అధికుడై శత్రువైన వేణుదారిని సమీపించెను.

వ్యాఖ్య : నాలుగు వ్యంజనములతో రచితమైన వర్ణచిత్రమున కుదాహరణమిది. ప్రథమపాదమునందు జవర్ణము, ద్వితీయపాదమునందు తవర్ణము, తృతీయపాదమునందు భవర్ణము, చతుర్థపాదమునందు రేఫము – ఈ నాలుగు వ్యంజనములు మాత్రమే మొత్తము శ్లోకమునం దుపయుక్తములైనవి. కావుననే, యిది చతుర్వ్యంజన వర్ణచిత్రమునకు లక్ష్యమైనది.

జాజీ (యుద్ధమే శీల మయినవాడు), జజా+ఓజః+జా (రణనిపుణుల ఓజస్సు చేత పుట్టిన), ఆజి+జిత్ (యుద్ధములను జయించువాడు); తమ్ (అతనిని = వేణు దారిని,) తతః (ఆ పిమ్మట), అతి తత (మిక్కిలి విస్తరించి), ఆతి (సంచలనశీలమైన సైన్యమును), తుద్ (బాధించువాడు); భా+ఆభః (మిక్కిలి కాంతిగల తారల యొక్క కాంతివంటి కాంతి గలవాడు), అభీ+ఇభ+అభిభూ (భయములేని ఏనుగు లను పరాభవించు) భా+భూః (తేజస్సునకు ఆశ్రయమైనవాడు); అరిః (శత్రువు= బలభద్రుడు) అరిరీ రరః (రథికుడై), ఆర (వెళ్ళెను) _ ఇది పై నాలుగు పాద ముల అన్వయక్రమము.

ఉదాహరణ శ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గృహీతము.

త్రివ్యంజనం యథా –

'దేవానాం నందనో దేవో నోదనో వేదనిందినామ్
దివం దుదావ నాదేన దానే దానవనందినః' 260

అర్థము : త్రివ్యంజనమున కుదాహరణము _ దేవతలకు ఆనందమును కలిగించువాడును, వేదనిందకులకు ఆక్రోశమును కలిగించువాడు నయిన భగవానుడు

అర్థము : అభిప్రాయగూఢమున కుదాహరణము. కత్తిపట్టుకొని రాజ భవనమునకు వెళ్లు మని మరది చెప్పినప్పుడు సేవకవధువు నవ్వి యెందులకని శయ్య నవలోకించెను ?

ఇచ్చట పాదమునకున్న లత్తుక మొదలయిన పురుషాయితపు గుర్తులుచూచి 'నన్ను పనియందు నియోగించుట లేదు' అన్న అభిప్రాయముతో వధువు శయ్య నవలోకించినది. ఇది అభిప్రాయగూఢము.

వ్యాఖ్య : అభిప్రాయమునుబట్టి చేష్టను, చేష్టనుబట్టి అభిప్రాయమును గుర్తింపవచ్చును. వాక్కు అభిప్రాయమును కలుగజేయును; చేష్టకు చోదనము నందిచ్చును. కొన్నియెడల వాక్కువల్ల వెల్లడియైన యభిప్రాయముకంటె ప్రతిక్రియ భిన్నముగా నుండవచ్చును; అనగా అప్పటి ప్రతిక్రియ భిన్నమైన అభిప్రాయముతో జరిగిన దనియే అర్థము. ప్రకృతోదాహరణమునందు పురుషుడు పురుషాయితోచిత వేషరచనతోనున్న నాయికను చూచెను. అయినను 'ఖడ్గమును తీసికొని రాజగృహమునకు పొమ్ము' అని ఆదేశించెను. 'సేవాకార్యమునకై పొమ్ము' అని చెప్పినట్లే యైనది. కాని, నాయిక అతని అభిప్రాయమును గ్రహించియే హసన్ముఖియై శయ్య నవలోకించెను. వాచకమునకు విరుద్ధమయిన కార్యాచరణమే యిచ్చట కానిపించును. కాని, ఆచరణము అభిప్రాయోచితముగానే యున్నది. నాయకుడు 'ఇంటి పనులను మాని శయనమందిరమునకు రమ్ము' అన్న అభిప్రాయముతోనే పలికెను. దానిని గ్రహించుటచేతనే ఆమె సంతోషముతో శయ్యవైపు చూచుట జరిగెను. నాయకుడు వాచ్యము చెయ్యలేదు; నాయిక నోరువిప్పి పలుకలేదు. కావుననే యిది అభిప్రాయగూఢము.

[వస్తు గూఢము]

వస్తుగూఢం యథా–

'పానీయం పాతు మిచ్ఛామి త్వత్తః కమలలోచనే
యది దాస్యసి నేచ్ఛామి నో దాస్యసి పిబామ్యహమ్' ౩59

అత్ర దాస్యసీతి దాసీలక్షణస్య వస్తునో గూఢత్వా దిదం వస్తుగూఢమ్.

గలవై), అభీరుభిః (భయము లేనివయిన), ఇభైః (ఏనుగులచేత), ఇభాః (శత్రు గజములు), అభిరేభిరే (అభియుక్తములైనవి) – ఇది అన్వయక్రమము.

ఉదాహరణ శ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి గృహీతము.

ఏకవ్యంజనం యథా -

'న నోననున్నో నున్నోనో నానా నానాననా నను
నున్నోఽనున్నో ననున్నేనో నానేనా నున్ననున్ననుత్' 262

అర్థము : ఏక వ్యంజనమున కుదాహరణము – ఓ నానాముఖులారా! నికృష్టునిచేతిలో గాయపడినవాడు పురుషుడు కాడు అట్లే అల్పుడైనవానిని గాయపరిచిన పురుషుడును పురుషుడు కాడుకదా! తన ప్రభువు గాయపడనియెడల, తాను గాయపడినప్పటికిని గాయపడనివాడే. మిక్కిలి గాయపడి బాధనొందెడి పురుషుని గాయపరిచెడివాడు దోషరహితుడు కాడు.

వ్యాఖ్య : ఒక్క వ్యంజనమును మాత్రమే యుపయోగించి రచించిన వర్ణ చిత్రమున కుదాహరణము. ఇందు నవర్ణ మొక్కటియే యుపయుక్తము. 'నాంత్య వర్ణస్తు భేదకః' అన్న నిర్ణయమునుబట్టి తుదినున్న తవర్ణము పృథక్పరిగణనము నొందదు.

న, నా, ఊనసున్నః, నున్నోనః, నా, అనా, నానాననాః, నను. నున్నః, అనున్నః, ననున్నేనః, నా, అనేనాః, నున్న నున్ననుత్ – అని పదవిభాగము. నానాననాః (ఓ నానా ముఖులారా!), ఊన (నికృష్టునిచేత), నున్నః (గాయపడిన వాడు), నా (పురుషుడు), న (కాడు); నున్నోనః (అల్పుని గాయపరిచినవాడైన), నా (పురుషుడు), అనా (అపురుషుడే), నను (కదా!); నున్న+ఇనః (గాయపడిన ప్రభువును గలవాడు), న (కాడో), నున్నః (గాయపడినప్పటికిని), అనున్నః (గాయపడనివాడే), నున్న నున్న నుత్ (మిక్కిలి గాయపడిన వానిని బాధించెడి), నా (పురుషుడు), అనేనాః (నిర్దోషికాడు) – అని అన్వయక్రమము.

ఉదాహరణ శ్లోకము భారవి కిరాతార్జునీయమునుండి గృహీతము.

క్రమస్థ సర్వవ్యంజనం యథా -

'కః ఖగౌఘాఙ చిచ్ఛౌజా ఝాఞ్జ్ఞోఽటౌఠీడడంఢణః
తథోదధీ న్పఫర్బాభీర్మయోఽరిల్వాశిషాం సహః' 263

అర్థము : క్రమస్థ సర్వవ్యంజనమున కుదాహరణము - దేవతల సమూహముచేత పూజింపబడువాడును, అజ్ఞానమును ఛేదించెడి ఓజస్సు గలవాడును, శత్రు బలముల నారగించువాడును, పండితుడును, యుద్ధభటులను బాధించువారికి ప్రభువును, అచంచలుడును, అంబుధులను పూరగించినవాడును, భయములేనివాడు నెవ్వడు ? శత్రుసంహారకములైన ఆశీస్సులను భరించెడి మయుడు.

వ్యాఖ్య : క్రమముగా కవర్గమునుండి హవర్ణమువరకు నున్న అన్నిహల్లుల నుపయోగించి రచించిన వర్ణచిత్రమున కుదాహరణము.

కః, ఖగౌఘాఙ్, అచిచ్ఛౌజాః, ఝూన్, జ్ఞః, అటౌఠీట్, అడండఢణః; తథా, ఉదధీన్, పఫర్వ, అభీః, మయః, అరిల్వాశిషాం, సహః - అని పదవిభాగము. ఖగౌఘాఙ్ (దేవతల సమూహముచేత పూజింపబడువాడు), అచిచ్ఛౌజాః (అజ్ఞానమును ఛేదించెడి ఓజస్సు గలవాడు), ఝూన్ (శత్రుబలములను కబళించువాడు), జ్ఞః (పండితుడు), అట + ఓఠీ + ఈట్ (సంగ్రామరంగ సంచారముచేయు భటులను బాధించువారికీశ్వరుడు), అడండఢణః (చపలత్వము లేనివాడు), తథా (అట్లే), ఉదధీన్ (సముద్రములను , పఫర్వ (పూరించినవాడు), అభీః (భయము లేనివాడు), కః (ఎవడు?): అరిల్వా శిషాం (శత్రు నాశకములైన ఆశీస్సులకు), సహః (ఓర్చు కొనెడివాడు) మయః (మయు డనెడి దైత్యరాజు) - ఇది అన్వయక్రమము.

ఝూన్ + జ్ఞః అని యున్నపుడు 'స్తో శ్చు నా శ్చుః' (8-4-40) అన్న నియమమునుబట్టి దంత్యమైన నవర్ణము సదృశ తాలవ్యమైన ఞవర్ణముగా మారినది. 'పఫర్వ' అన్న క్రియా రూపమునందు వకారమే సంయుక్తమై యున్నప్పటికిని 'వబయో రభేదః' అన్న నియమమును బట్టి బవర్ణసామ్యము నొంది తత్ స్థానము నాక్రమించుకొన్నది. మొదటి మూడుపాదములును కలిసి ప్రశ్నకాగా, నాలుగవ పాదము సమాధానమైనది.

ఇట్లు క వర్ణమునుండి హ వర్ణము వరకు క్రమము తప్పకుండ కూర్పు నొందిన వర్ణచిత్రమున కిది లక్ష్యమగుచున్నది.

ఛందోऽక్షర వ్యంజనం యథా -

'సారత్సరారాతి భయాయ జాగ్రతో
జగత్యలం స్తోతృజనస్య జాయతామ్
స్మితం స్మరారే ర్గిరిజాస్య నీరజే
సమేత నేత్రత్రితయస్య భూతయే' 264

అర్థము : ఛందోక్షర వ్యంజనమున కుదాహరణము – పార్వతీ ముఖపద్మము నందలి మన్మథ శత్రువైన శివుని చిరునవ్వు మేలుకొనియున్న స్తోతృజనులకై శ్వర్యమును గూర్చునుగాక! త్రినేత్రునియొక్క స్మితము కదలుచున్న రాక్షసులకు భయమును కలుగజేయును గాక!

వ్యాఖ్య : ఛందోక్షరములుగా పరిగణింపబడెడి పది హల్లుల నుపయోగించి చేసిన రచనము ఛందోక్షర వ్యంజనము. 'మ్యరస్త జభ్నగా లాంతాశ్ఛందో విభి వేదిభిః । దశైవ వర్ణా నిర్ణీతా శ్ఛందోరూప ప్రసిద్ధయే' అని ఛందోక్షరముల నిర్ణయము. మ, య, ర, స, త, జ, భ, న, గ, ల – అన్న పదియక్షరములే ఛందోరూపప్రసిద్ధికి నరిపడునని ఛందోవివేకుల నిర్ణయము. ప్రకృతోదాహరణమునందు ఈ పదిహల్లులకు మాత్రమే వినియోగము కలదు. కావుననే యిది లక్షణాను గుణమై ఛందోక్షరవ్యంజనమునకు లక్ష్యమయినది.

షడ్జాది స్వరవ్యంజనం యథా -

'సా మమారిధమనీ నిధానినీ
సామధామ ధనిధామ సాధినీ।
మానినీ సగరిమా పపాపపా
సాపగా సమనమాగమానమా' 265

అర్థము : షడ్జాది స్వర వ్యంజనమున కుదాహరణము – నదీతుల్యమైన క్షణిక సమాగమము కలదియు, సాటిలేనిదియు, నవనిధులను కలుగజేయునదియు, శాంతికి నెలవైనదియు, ధనికులకు తేజస్సును సంతరించునదియు, అర్చనయోగ్యయు, గౌరవవంతురాలును, పాపరహితులను పాలించునదియు నైన లక్ష్మీదేవి నాకు అరిధమని (శత్రుసంహారిణి) యగుగాక!

వ్యాఖ్య : సంగీతమునందు స రి గ మ ప ధ ని - అని సప్తస్వరములు గలవు. ఇందు మొదటిది షడ్జము. షడ్జాది స్వరములకు వినియోగపడు వ్యంజనములతో చేసిన రచనము షడ్జాది స్వరవ్యంజనము. ప్రకృతోదాహరణమునందు పైని చూపిన ఏడు హల్లులు మాత్రమే ప్రయుక్తము అయినవి.

మొదటి పదమైన 'సా' ఆమె యన్న యర్థమునందు కాక లక్ష్మి యన్న యర్థమున వినియుక్తమైనది. 'సహ ఏన విష్ణునా వర్తతే ఇతి సా లక్ష్మీః' అని వ్యుత్పత్తి. స+అ=సా. విష్ణువుతో కూడియున్నదని యర్థము. 'అ' వర్ణము విష్ణుబోధకము.

మురజాక్షర వ్యంజనం యథా -

'ఖర గర కాలిత కంఠం
మథిత గదం మకర కేతు మరణకరమ్
తడిదివ రురు ముండహారం
హార మంతరహాం దధే ఘోరమ్' 266

అర్థము : మురజాక్షర వ్యంజనమున కుదాహరణము - తీవ్రమైన విషము చేత నల్లబడిన కంఠము గలవానిని, గదుని మర్దించినవానిని, మకరధ్వజునికి మరణము గలిగించినవానిని, మెరుపువలె మృగశిరమును ఖండించినవానిని, ఘోరమైన హరుని హృదయమునందు ధరింతును.

వ్యాఖ్య : మురజాక్షరముల నుపయోగించి చేసిన రచనము మురజాక్షర వ్యంజనము. 'పాఠాక్షరాణి మురజే । లహకారౌ తథదధాశ్చ్యమౌ రేఫః । న ణ క ఖ గ ఘ జాంశ్చేత్థం । షోడశ భరతాది కథితాని' అని నిర్ణయము. ల హ త థ ద ధ మ ర న ణ క ఖ గ ఘ జ - ఈ పదునారును మురజాక్షరములు. ప్రకృతోదాహరణమునందు ఈ వ్యంజన వర్ణములకు మాత్రమే వినియోగము కలదు. కావుననే, యిది మురజాక్షర వ్యంజన చిత్రమునకు లక్ష్యమయినది.

ఇంతటితో వర్ణచిత్ర లక్ష్యములను ముగించి గ్రంథకర్త స్థానచిత్ర ప్రదర్శనమును ఉపక్రమించుచున్నాడు.

[స్థానచిత్రము]

చతుఃస్థాన చిత్రేషు నిష్కాంఠ్యం యథా -

'భూరిభూతిం పృథుప్రీతి మురుమూర్తిం పురుస్థితిమ్
విరించిం నూచిరుచిధీః శుచిభి ర్నుతిభి ర్ధిను' 267

అర్థము : చతుఃస్థాన చిత్రములందు నిష్కాంఠ్యమున కుదాహరణము - విస్తారమైన సంపదను, విస్తారమైన ప్రేమను, విస్తారమైన ఆకారమును, విస్తారమైన స్థితిని కలిగిన బ్రహ్మను ఓ విశదధీశాలీ ! పరిశుద్ధములైన నుతులతో తృప్తిపొందింపుము.

వ్యాఖ్య : కంఠము, తాలువు, మూర్ధము, దంతము, ఓష్ఠము - అనునవి అయిదును వర్ణోత్పత్తి స్థానములు. కంఠమునందు జనించునవి కంఠ్యములు. 'అ కు హ విసర్జనీయాః కంఠ్యాః'. అకారమును, కవర్గమును, హకారమును, విసర్జనీయమును కంఠ్యములు. వీనిని విడిచి మిగిలిన హల్లులతో రచనము నిర్వహించిన యెడల నిష్కాంఠ్యమైన చతుఃస్థానచిత్ర మగును.

ప్రకృతోదాహరణమునందు తాలవ్యములును, మూర్ధన్యములును, దంత్యములును, ఓష్ఠ్యములును మాత్రమే వినియుక్తములైనవి. కావుననే యిది చతుఃస్థానచిత్రమునకు లక్ష్యమయినది.

నిస్తాలవ్యం యథా -

'స్ఫురత్కుండల రత్నౌఘ మఘవద్ధను ర్కర్బురః
మేఘనాదోఽథ సంగ్రామే ప్రావృట్కాలవదాబభౌ' 268

అర్థము : నిస్తాలవ్యమున కుదాహరణము - ప్రకాశించుచున్న కర్ణభూషణ రత్న సమూహ మనెడి హరివిల్లుచేత పొడలుగలిగినవాడై సంగ్రామమునందు మేఘనాదుడు (ఇంద్రజిత్తు) ప్రావృట్కాలము వలె ప్రకాశించెను.

వ్యాఖ్య : నిస్తాలవ్యమైన చతుఃస్థానచిత్రమునకు లక్ష్యమిది. 'ఇచు యశా స్తాలవ్యాః'. ఇవర్ణమును, చవర్గమును, యకారమును, శకారమును తాలవ్య

ములు. వీనిని విడిచి మిగిలిన కంఠ్య దంత్య మూర్ధన్యోష్ఠ్యవర్గములతో రచన నిర్వహించుట ప్రకృతోదాహరణమునందు కలదు.

నిర్దంత్యం యథా -

'పాప్మాపహారీ రణకర్మశౌండ
చండీశమిశ్రో మమ చక్రపాణిః
భూయాచ్ఛ్రియాఽపశ్రమయేక్ష్యమాణో
మోక్షాయ ముఖ్యామర పూగ పూజ్యః' 269

అర్థము : నిర్దంత్యమున కుదాహరణము - పాపముల నపహరించువాడును, యుద్ధనిపుణుడును, పార్వతీశ్వరునితో అభిన్నుడును, బ్రహ్మాది ముఖ్యదేవతా సమూహమునకు పూజనీయుడును, లక్ష్మీదేవిచేత అశ్రమముగా చూడబడువాడును నైన చక్రపాణి నాకు మోక్షమున కగుగాక !

వ్యాఖ్య : చతుఃస్థానచిత్రములందు నిర్దంత్యమున కిది లక్ష్యము. 'ఌ తు ల సా దంత్యాః'. ఌకారమును, తవర్గమును, లవర్ణమును, సవర్ణమును దంత్యములు. వీనిని విడిచిపెట్టి మిగిలిన హల్లులను వినియోగించి చేసిన రచనము నిర్దంత్య చతుఃస్థానచిత్రము. ప్రకృతోదాహరణమునందు దంత్యములు అప్రయుక్తములు. కావుననే, యిది లక్షణానుగుణమై లక్ష్యమైనది.

నిరోష్ఠ్యం యథా-

'నయనానందజననే నక్షత్రగణశాలిని
అఘనే గగనే దృష్టి రంగనే దీయతాం సకృత్' 270

అర్థము : నిరోష్ఠ్యమున కుదాహరణము - అంగనా ! నయనానంద జనకమును, నక్షత్ర సమూహ సుందరమును, మేఘరహితము నైన ఆకాశమునందు ఒకసారి దృష్టి నిల్పుము.

వ్యాఖ్య : చతుఃస్థానచిత్రములందు నిరోష్ఠ్యమున కిది లక్ష్యము. 'ఉపూపధ్మానీయా ఓష్ఠ్యాః'. ఉకారమును, పవర్గమును, ఉపధ్మానీయమును ఓష్ఠ్యములు.

ఫీవివి విడిచిపెట్టి చేసిన రచనము నిరోష్ఠ్యము. ఉదాహరణ శ్లోకము లక్షణమునకు సరిపోయినది.

నిర్మూర్ధన్యం యథా—

'శలభా ఇవ ధావంతః సాయకా స్తస్య భూభుజః
నిపేతుః సాయకచ్ఛిన్నా స్తేన సంయుగ సీమని' 271

అర్థము : నిర్మూర్ధన్యమున కుదాహరణము – ఆరాజుయొక్క బాణములు మిడుతలవలె పరుగులు తీయుచు శత్రురాజుచేత బాణఖండితములై సంగరరంగము నందు పతనము నొందినవి.

వ్యాఖ్య : చతుఃస్థాన చిత్రములందు నిర్మూర్ధన్యమున కిది లక్ష్యము. 'ఋ టు ర షా మూర్ధన్యాః'. ఋకారమును, టవర్గమును, రేఫమును, షవర్ణము మూర్ధన్యములు. ప్రకృతలక్ష్యమునందు మూర్ధన్యములు వినియుక్తములు కాలేదు. కావుననే, యిది నిర్మూర్ధన్యమున కుదాహరణ మైనది.

త్రిస్థానచిత్రేషు నిరోష్ఠ్యదంత్యం యథా—

'జీయాజ్జగజ్జ్యేష్ఠ గరిష్ఠ చార
శ్చక్రార్చిషా కృష్ణకఠార కాయః
హారి ర్హిరణ్యాక్ష శరీర హారీ
ఖగేశగః శ్రీశ్రయణీయశయ్యః' 272

అర్థము : త్రిస్థానచిత్రములందు నిరోష్ఠ్యదంత్యమున కుదాహరణము — జగజ్జ్యేష్ఠ గరిష్ఠ చారుడును, చక్రాగ్నులచేత నల్లబడిన శరీరము గలవాడును, హిరణ్యాక్షుని శరీరమును హరించినవాడును, పక్షిరాడ్వాహనుడును, శ్రీకే ఆశ్రయింపదగిన శయ్య అయినవాడును అయిన విష్ణువు జయించును గాక!

వ్యాఖ్య : చతుస్థానచిత్రములందు ఒక వర్గమమాత్రమే పరిహృతము. త్రిస్థానచిత్రములందు రెండు వర్గములు పరిహృతములు. ప్రకృత లక్ష్యమునందు ఓష్ఠ్యములును దంత్యములును వినియుక్తములు కాలేదు. కంఠ్యములు, తాలవ్య

ములు, మూర్ధన్యములు – అను మూడు వర్గములకు చెందిన వ్యంజనములతోనే రచనమును నిర్వహించుటచేత దీనికి త్రిస్థానచిత్రము అను పేరు సార్థకమగుచున్నది.

నిరోష్ఠ్య మూర్ధన్యం యథా-

'అలినీలాలకలతం కం న హరతి ఘన స్తని
ఆననం నలినచ్ఛాయం నయనం శశికాంతి తే' 273

అర్థము : నిరోష్ఠ్యమూర్ధన్యమున కుదాహరణము – ఓ ఘన స్తనీ! తుమ్మెదలవలె నీలములైన ముంగురుల వల్లరులను గలిగి పద్మచ్ఛాయను గల నీ ముఖము చంద్రుని కాంతివంటి కాంతిగల నీ కన్నులును ఎవరిని చంపకుండును ?

వ్యాఖ్య : ఓష్ఠ్యములను మూర్ధన్యములను విడిచిపెట్టి కంఠ్యదంత్య తాలవ్యములతో రచించుటచేత ప్రకృత శ్లోకమునిరోష్ఠ్య మూర్ధన్యమైన త్రిస్థానచిత్రమునకు లక్ష్యమయినది.

ద్విస్థాన చిత్రేషు దంత్యకంఠ్యే యథా-

'అనంగ లంఘనాలగ్న నానాతంకా సదంగనా
సదానఘ సదానంద నతాంగీ సంగ సంగతా' 274

అర్థము : ద్విస్థానచిత్రములందు దంత్యకంఠ్యములతోడి చిత్రమున కుదాహరణము – ఓయి, నిశ్చింతుడా! సంతతానందుడా! పరాంగనా సంగ ముక్తుడా! పతివ్రతయైన నీ భార్య మన్మథాతిక్రమణము (విరహము) చేత అనేక వేదనలను పొందుచున్నది.

వ్యాఖ్య : ఐదు వర్గములందు మూటింటిని పరిహరించి, రెండింటిని మాత్రమే పరిగ్రహించి చేసిన రచనము ద్విస్థానచిత్రము. ప్రకృతోదాహరణమునందు దంత్యములును, కంఠ్యములును ప్రయుక్తములు. ఓష్ఠ్యములును, తాలవ్యములును, మూర్ధన్యములును త్యక్తములు. వెనుకటిపద్ధతి ననుసరించి 'ద్విస్థాన చిత్రేషు నిరోష్ఠ్యతాలవ్య మూర్ధన్యం యథా' అని యనవచ్చును కాని సౌలభ్యము నపేక్షించి గ్రంథకర్త ఆక్రమమును మార్చి ప్రయుక్తవర్గములనే పేర్కొనుచున్నాడు.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గృహీతము.

ఏకస్థాన చిత్రేషు కంఠ్యైర్యథా-
'అగా గాం గాంగకాకాంక గాహకాఘక కాకహా
అహాహాంగఖగాం కాగగ కంకాగ ఖగాంకగ' 275

అర్థము : ఏకస్థాన చిత్రములందు కంఠ్యములతోడి చిత్రమున కుదాహరణము. హానిలేని అంగములగల సూర్యుని (గరుడుని) గుర్తుగా ధరించిన పర్వతము (మేరువు)నందు సంచరించు కంఖములనెడి పర్వతపక్షులచేత ప్రస్తుతిగొన్న గమనము కలవాడా! గంగాజలము సందలి కుటిలమైన అంకమునందు ప్రేలాడుచున్న కుత్సిత పాప మనెడి కాకమును (చంపినవాడవేని) చంపి స్వర్గమునకు పోయితివి.

వ్యాఖ్య : కంఠ్యవర్గమునకు చెందిన వర్ణములతో రచించిన చిత్రము ఏకస్థాన చిత్రము. ఇచ్చట నాలుగువర్గములు పూర్తిగా పరిహృతములు.

ప్రకృతోదాహరణ శ్లోకమునందు అగాః, గాం, గాంగకా కాంకగాహక, అఘకాకాకహా, అహాహాంగ, ఖగాంగాకగ, కంఖాగ ఖగాంకగ - అని పదవిభాగము.

అహా+హా+అంగ (అహానమును పొందిన అవయవములు గల), అగ+అంక (సూర్యుని [గరుడుని] గుర్తుగా గలిగిన, అగ+గ (పర్వతమునకు వెళ్ల), ంఖ+అగ+ఖగ+అంకగ (కంఖములనెడి పర్వతపక్షుల గుర్తింపునొందిన గమము గలవాడా!); గాంగక+అక+అంక+గాహక (గంగాజలమునందలి కుటిలగతి యొక్క అంకమునందు మునుగుచున్న), అఘక+కాక+హా (కుత్సితమైన పాప మనెడి కాకిని చంపినవాడు) (అయితివేని - అని అధ్యాహార్యము), గామ్ (స్వర్గమునకు), అగాః (వెళ్ళితివి) – అని అన్వయక్రమము.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గృహీతము.

స్థానచిత్రప్రదర్శనము నింతటితో ముగించి గ్రంథకర్త క్రమాపతితమైన స్వరచిత్రభేదములను ప్రదర్శించుటకు ప్రారంభము చేయుచున్నాడు.

[స్వరచిత్రము]

స్వరచిత్రేషు హ్రస్వైకస్వరం యథా-

'ఉరుగుం ద్యుగురుం యుత్సు చుక్రుశుః స్తుష్టువుః పురు
లులుభుః పుపుషుర్ముత్సు ముముహుర్ను ముహుర్ముహుః. 376

అర్థము : స్వరచిత్రములందు హ్రస్వైక స్వరమున కుదాహరణము. విలువయిన వాక్కులు గల దేవతా గురువైన బృహస్పతిని యుద్ధములందు భటులు శరణు కోరిరి; మిక్కిలి స్తుతించిరి; మోదములందు లోభమును పొందిరి; పుష్టి నొందిరి; మరి మాటి మాటికిని మోహము నొందిరి.

వ్యాఖ్య : ఆరు విధములయిన చిత్రాలంకారమునందు వర్ణచిత్రములను స్థానచిత్రములను ముగిసిన పిమ్మట మూడవభేదమయిన స్వరచిత్రములు సముపాత్తము లయినవి. వర్ణచిత్రములందు వ్యంజనములకు మాత్రమే నియమమున్నది; స్వరముల కేవిధమైన నియమము లేదు. ప్రకృతమైన స్వరచిత్రములందు అచ్చులకు మాత్రమే నియమము; హల్లులేవియైన నుపయుక్తములు కావచ్చును.

ఉదాహరణమునందు హ్రస్వమైన ఉకార మొక్కటియే మొదటినుండి చివరి వరకు ప్రయుక్తమయినది. ఒక్కే స్వరము, అదియు హ్రస్వము, ప్రయోగింపబడుట చేత ఇది హ్రస్వైక స్వరమైన స్వరచిత్రమునకు లక్ష్యమయినది.

దీర్ఘైక స్వరం యథా-

'వైధై రైనై రైశై రైంద్రై రైజై రైలై ర్జైనైః సైద్ధైః
సౌత్రై రైఙ్కై ర్ధై రైర్యై రైవ్రై దైః సైవ్యైః సైవ్రై ర్ధైవై స్త్రైసైః'

అర్థము : దీర్ఘైక స్వరమున కుదాహరణము. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, మన్మథుడు, భూమి, జినుడు, సిద్ధులు, సూర్యుడు, కుబేరుడు అనువారికి సంబంధించినవారిచేతను, అనేక దేవతలచేతను సుష్ఠుగా ఒసగబడిన వారివారి ధైర్యములచేత [సమగ్రముగా సమృద్ధి నొందుదుము.]

వ్యాఖ్య : పద్యమంతటి దీర్ఘస్వరము నొక్కదానినే యుపయోగించి చేసిన రచనము దీర్ఘైకస్వరచిత్రము,

ఉదాహరణ పద్యమంతట ఐత్వము మాత్రమే ఉపాత్తమైనది. మరొక స్వరమేమియు నెచ్చటను వాడుక నొందలేదు. 'విధి'కి సంబంధించినవారు 'వైధాః'. తృతీయా విభక్తియందు 'వైధైః'. 'ఈ'యనగా లక్ష్మి, లక్ష్మికి సంబంధించినవాడు 'ఇనః' విష్ణువు. ఇన సంబంధులు 'ఐనాః'. తృతీయరాగా 'ఐనైః'. ఈ విధముగా సర్వశబ్దములును సర్వవర్ణములును ఐకారయుతములుగా పరిణామమునొంది ప్రయుక్తములయినవి.

ఒకే దీర్ఘస్వరము చివరంట నుండుట చేతనే యిది దీర్ఘైక స్వర చిత్రమునకు లక్ష్యమయినది.

ఉదాహరణమునందు సమాపక క్రియాపదము లేదు. కావుననే 'అహం సమృద్ధో భవామి' అను పదములను అధ్యాహృతము గావించుకొనుట జరిగినది. అర్థమునందు ఆ భాగము చతురస్రికలందు సూచితము.

హ్రస్వ ద్విస్వరం యథా-

"క్షితి స్థితి మితిక్షిప్తి విధివిన్నిధి సిద్ధిలిట్
మమ త్ర్యక్ష నమద్దక్ష హార స్మరహార స్మర" 278

అర్థము : హ్రస్వ ద్విస్వరమున కుదాహరణము- భూమియొక్క స్థితిని వాళవిధుల నెరిగినవాడా! విధులను సిద్ధులను ఆస్వాదించెడివాడా! త్రినేత్రుడా! దక్షుని వినతుని జేసినవాడా! మన్మథుని హరించినవాడా! హరా! నన్ను గుర్తుపెట్టుకొనుము.

వ్యాఖ్య : రెండు హ్రస్వస్వరములతోడి రచనమునకు హ్రస్వద్విస్వరచిత్ర మనిపేరు. ఉదాహరణ శ్లోకము పూర్వార్ధము నందంతటను ఇత్వము మాత్రమే కలదు. ఉత్తరార్ధము నందంతటను అత్వము మాత్రమే కలదు. ఇ, అ - అను రెండు హ్రస్వములైన యచ్చుల యుపయోగముచేతనే యిది హ్రస్వ ద్విస్వరచిత్రమునకు లక్ష్యమయినది.

దీర్ఘ ద్విస్వరం యథా-

"శ్రీ దీప్తీ హ్రీ కీర్తీ ధీనీతీ గీః ప్రీతీ
ఏధేతే ద్వే ద్వే తే యే నేమే దేవేశే" 279

అర్థము : దీర్ఘ ద్వి స్వరమున కుదాహరణము - దేవేంద్రుని యందుకూడ లేని శోభాదీప్తులు, లజ్జాకీర్తులు, బుద్ధినీతులు, వాక్ప్రేమలు రెండు రెండు నీకు వృద్ధినొందుచున్నవి.

వ్యాఖ్య : రెండు దీర్ఘస్వరములతోడి రచనమునకు దీర్ఘ ద్వి స్వరచిత్రమని పేరు. ఉదాహరణ శ్లోకము పూర్వార్ధమునందంతట ఈవర్ణము, ఉత్తరార్ధమునందంతట ఏవర్ణము ఉపయుక్తములైనవి. ఈ, ఏ – అను రెండు దీర్ఘాచ్చుల యుపయోగముచేతనే యిది దీర్ఘద్విస్వరచిత్రమునకు లక్ష్యమయినది. ఉదాహరణము దండి కావ్యాదర్శము నుండి గృహీతము.

త్రిస్వరేషు హ్రస్వత్రిస్వరం యథా-

'క్షితి విజితి స్థితి విహితి వ్రతరతయః పరగతయః
ఉరు యురుధుర్గురు దుధువుః స్వమరికులం యుధి కురవః' 280

అర్థము : త్రిస్వరచిత్రములందు హ్రస్వత్రిస్వరమున కుదాహరణము - భూవిజయమును, నియతి విధానమునన్న వ్రతములం దాసక్తులై ఉత్తమమార్గ స్థితులైన కురురాజులు యుద్ధమునందు పెద్దదైన తమ శత్రుసమూహమును నిరోధించిరి: అధికముగా కంపితము గావించిరి.

వ్యాఖ్య : మూడు హ్రస్వస్వరములుగల రచనము హ్రస్వ త్రిస్వర చిత్రము. ప్రథమపాదము నందంతట 'ఇ' – ద్వితీయపాదము నందంతట 'అ' - తృతీయపాదము నందంతట 'ఉ' అను హ్రస్వస్వరము లుపయుక్తములైనవి. చతుర్థపాదమునందుకూడ క్రమనిరపేక్షముగా ఈ మూడు హ్రస్వ స్వరములే వాడుక నొందినవి. కావుననే, యిది హ్రస్వ త్రి స్వరచిత్రమునకు లక్ష్యమయినది.

దండి కావ్యాదర్శము నుండి గృహీతము.

చతుఃస్వరేషు దీర్ఘస్వరం యథా-

'ఆమ్నాయానామాహాంత్యా వాగ్గీతీ రీతీః ప్రీతీ ర్భీతీః
భోగో రోగో మోహో మోదో ధ్యేయే వేచ్ఛేత్ క్షేమే దేశే' 281

అర్థము : చతుస్స్వరములందు దీర్ఘస్వరమున కుదాహరణము – వేదము లకు తుదినున్న వాక్కు (వేదాంతము) గీతులను ఈతిబాధలని, ఇష్టములను భయములని, భోగమే రోగమని, మోదమే మోహమని కావున క్షేమకరమైన క్షేత్రమువందు ధ్యానమునందు ధ్యేయుడైన పరమాత్మయందు మనస్సు నిల్పుమని చెప్పెను.

వ్యాఖ్య : నాల్గు దీర్ఘస్వరములతోడి రచనమునకు చతుర్దీర్ఘస్వరచిత్రమని పేరు. 'ఆమ్నాయానామ్+అంత్యావాక్+ఆహ' అని మొదటిపాదము విభాగము. దీనియందు 'ఆ'యున్నది. ద్వితీయపాదమునందు 'గీతీః, రీతీః' మున్నగు విధముగా ద్వితీయా బహువచన రూపము లుపయుక్తములు. 'ఈ'వర్ణమున్నది. తృతీయమునందు ప్రథమైక వచనరూపములు; అన్నింట 'ఓ' వర్ణమున్నది. చతుర్థమునందు 'ఇచ్ఛేత్' క్రియారూపము, తక్కినవన్నియు సప్తమ్యేకవచనరూపములు; అన్నింట 'ఏ' వర్ణమున్నది. ఇట్లు ఆ, ఈ, ఓ, ఏ – అన్న నాల్గు దీర్ఘాచ్చులను క్రమముగా నాలుగు పాదములందును వాడుటచేత, ఇది చతుర్దీర్ఘస్వర చిత్రమునకు లక్ష్యమయినది.

ఉదాహరణ శ్లోకము దండి కావ్యాదర్శమునుండి గృహీతము.

ప్రతి వ్యంజన విన్యస్త స్వరం యథా–

'తావేనోగ్రోఽస్తు దేహే నో హేయే విల్లోభినిందినా
జాయాగ్రే హి గుణిప్రేష్ఠే హితోఽక్షేపోఽమృతోక్షిణి' 282

అర్థము : ప్రతివ్యంజన విన్యస్త స్వరమున కుదాహరణము. హేయమైన దేహమునందు లాభము కలదనెడి లోభమును నిందించుటచేత కలిగిన తాపముచేత నా దేహమునందు ఉగ్రుడు నిలుచుగాక ! (శరీరహేయత్వమును గుర్తించుటచేత సమరయోగ్యమైన ఉగ్రత్వము కలుగవలయునని ఆకాంక్ష). అమృతస్యందినియు, గుణోన్నతయునయిన కాంత (సంగ్రామసుందరి) సన్నిధానమున హితము అలభ్యము కాకుండు గాక !

వ్యాఖ్య : ప్రతిహల్లును స్వరయుక్తమై యుండునట్లు చేసిన రచనమునకు ప్రతివ్యంజన విన్యస్త స్వరచిత్రమని పేరు. సంయుక్తాక్షరమని యన్నప్పుడు 'హలోఽనంతరాః సంయోగః' అన్న వివరణముబట్టి అవ్యవహితములైన హల్లు

ఉండుట తప్పదు. కావున సంయుక్తాక్షరమునందలి పూర్వవర్ణము స్వరవిరహిత ముగా నుండుట ఆక్షేపణీయము కాదు. కేవల హలంత శబ్దములను వాడకుండుటయే యిందు వాంఛనీయము. అట్లే పాదాంత పద్యాంతములు హలంతములు కాకుండ నుండవలయును.

ఉదాహరణ పద్యమునందు ఒక వీరుడు యుద్ధసన్నద్ధు డగుచు, తన్ను తాను ప్రోత్సహించుకొనుచు తన్ను తాను దీవించుకొనుచున్నాడు.

తదేవాపాస్త సమస్త స్వరం యథా-

తపన ప్రగస్తదహన హయపల్లభనందన
జయప్రగహ గణప్రష్ఠ హతక్షణ' 283

అర్థము : అపాస్త సమస్త స్వరమైన ప్రతివ్యంజన విన్యస్త స్వరమున కుదాహరణము - ఓయీ తపనా! పరాభూతదహనా! అశ్వపాలకనందనా! జయ ప్రగహుడా! గణశ్రేష్ఠుడా! అపహృతనిశా! సమ్మతోత్సవా!

వ్యాఖ్య : ప్రతివ్యంజన విన్యస్త స్వరమునందే యిదియొక ప్రకారము. దీనికి అపాస్తసమస్త స్వరమని భోజదేవుడు పేరుపెట్టెను. సమస్త స్వరములు అపాస్తములైనప్పుడు ఈ పేరు సమంజసముగానే యుండును. కాని ఉదాహరణము నందు అత్వము సముపాత్తమైనది. సర్వవ్యంజనవర్ణములు నత్వము నాశ్లేషించి యున్నవి. ప్రతి వ్యంజన విన్యస్తైకస్వరము అని యనుట యోగ్యముగా నుండును.

సంబోధనాంతములతోనే నాయిక తన భావమును వెల్లడించుట ఉదాహరణము నందు గోచరించును. 'అపహృతనిశా' అనగా నీమీది ప్రేమచేత నాకు రాత్రులు నిద్రపట్టుటలేదు — అని భావము. అట్లే 'సమ్మతోత్సవా' అనగా నాతో సమ్మోదించుటకు సమ్మతింపుము - అని భావము.

ఏక స్వరచిత్రమునందు పాదాంత పద్యాంతములందు హల్మాత్రస్థితి కవకాశము కలదు. ప్రతివ్యంజన విన్యస్తైక స్వరమునందు అట్లుండుటకు వీలు లేదు. ఇది యొక్కటియే యీ రెండింటి కున్న భేదము.

ఇంతటితో చిత్రాలంకారమునందు మూడవదైన స్వరచిత్ర భేదము ముగిసినది. నాలుగవదయిన ఆకారచిత్రభేదమును ప్రదర్శించుట ప్రారంభమగుచున్నది.

[ఆకారచిత్రము]

ఆకారంచిత్రేష్వష్టదలం యథా-

'యాశ్రితా పావనతయా యాతనచ్ఛద నీచయా
యాచనీయా ధియా మాయాయాయా మాయాపసం స్తుతా శ్రియా' 284

అర్థము : ఆకారచిత్రములందు అష్టదళమున కుదాహరణము - పావనత్వముచేత ఆశ్రయింపబడినదియు, ఉన్నతమైన బుద్ధిచేత మాయయందలి ఆయాసముమ (మాయానాశమును) యాచింపదగినదియు, లక్ష్మిచేత పైతము సంస్తుతింపబడినదియు, నరకాదికారణమైన యాతనను నాశము చేయును.

అత్ర -

140. కర్ణికాయాం న్యసేదేకం ద్వేద్వే దిక్షు విదిక్షు చ
ప్రవేశ నిర్గమౌ దిక్షు కుర్యాదష్ట దలాంబుజే॥

అర్థము : దుద్దునందు ఒక యక్షరము నుంచవలయును దిక్కులందున్ను, విదిక్కులందును రెండేసి యక్షరముల చొప్పున నుంచ వలయును. దిక్కులందు ప్రవేశమును నిష్క్రమణమును చేయవలయును. ఇది అష్టదళ పద్మమునందలి విధానము.

వ్యాఖ్య : దుద్దునందు 'యా'యుంచి మొదటి దళములో క్రిందనుండి పైకి రెండు అక్షరములు వ్రాసితిమి. ఇది నిష్క్రమణము. తరువాతి రెండక్షరములను రెండవదళమునందు క్రిందనుండి పైకి వ్రాసితిమి. మూడవదళమునందు పైనుండి కర్ణికవైపునకు రెండక్షరములను వ్రాసితిమి. కర్ణికలోని యక్షరముతో మూడయినవి. ఇది ప్రవేశము. కర్ణికయందలి యక్షరముతో మొదలుపెట్టి మూడవదళము కొనకు చదువవలయును. ఇది నిర్గమనము. రెండవపాదమునందు మూడక్షరములు మరల వ్రాయకుండనే ముగిసినవి. నాలుగదళమునందు కర్ణికవైపునుండి బయటికి రెండక్షరములు వ్రాసితిమి. ఐదవదళమునందు బయటనుండి కర్ణికవైపునకు రెండక్షరములు వరుసగా వ్రాసితిమి. కర్ణికతోడి యక్షరముతో మూడయినవి. ఇది ప్రవేశము. రెండవపాదము ముగిసినది. ఇట్లే తక్కిన యర్ధభాగమునందుకూడ అక్షర విన్యాసము

చేయవలయును. 1, 3, 5, 7 అంకెలున్నవి దిగ్దళములు. ఇచ్చట ప్రవేశ నిష్క్రమణములు చేయవలయును.




ఇట్లగుటచేత కర్ణికయందు నిల్పిన ఒకే యక్షరము మొత్తముమీద ఎనిమిది పర్యాయములు ప్రయుక్తమగుచున్నది. ప్రారంభమునందలి 'యాశ్రితా' పద్యాంతమందు 'తాశ్రియా' అని వ్యత్యయమునొంది పునరుక్తము లగుచున్నవి. పాదాంతమునందలి మూడు అక్షరములు తరువాతిపాదము మొదట వ్యత్యయమునొంది పునరుక్తము లగుట అన్నిపాదములందు అనుసృతమైన లక్షణము. దిగ్దళములందలి ప్రవేశ నిష్క్రమణములవల్లనే, మరల వ్రాయవలసిన యవసరము లేకుండగనే, యివి లక్షితము లయినవి.

ద్వితీయ మష్టదలం యథా-

'చరస్ఫార వరత్సార వరకార గరజ్వర
చలస్ఫాల వలత్సాల వల కాల గల జ్వల' 285

అర్థము : ద్వితీయవిధమైన అష్టదళ పద్మమున కుదాహరణము. పంచశర శీలుడా! అధికములయిన వరముల నిచ్చువాడా! శ్లేషకరుడా! విషజ్వరుడా! తాండవ కేళి యందు స్పందనములు గలవాడా! ధవళశరీరుడా! నీలగళుడా! ప్రకాశింపుము.

111. అష్టధా కర్ణికావర్ణః పత్రేష్వష్టౌ తథాపరే
తేషాం సంధిషు చాప్యష్టావష్టపత్త్రి సరోరుహే॥

అర్థము : అష్టపత్ర సరోరుహమునందు కర్ణికావర్ణ మొక్కటియే ఎనిమిది విధములు. ఎనిమిది దళములందు మిగిలిన అక్షరములు. వానియొక్క సంధుల యందు మరల ఎనిమిది.

వ్యాఖ్య : అష్టదళపద్మమున కిది రెండవభేదము. కర్ణికయందు రెండవ యక్షరమును నిల్పవలయును. ఇదే యక్షరము శ్లోకపూర్వార్థమందు ఎనిమిది



పర్యాయములు ప్రయుక్తమయినది. మొదటి యక్షరమును మొదటిదళమునందు, మూడవయక్షరమును రెండవదళమునందు, ఐదవయక్షరమును మూడవదళమునందు, ఏడవ యక్షరమును నాలుగవదళమునందు నిలుపవలయును. ఇట్లే ఒక్కొక్క యక్షరమును విడుచుచు తక్కిన యక్షరములను తరువాతి దళములందు నిలుపవల యును. ఎనిమిది దళములును పూర్తియగునరికి శ్లోకపూర్వార్థము పూర్తియగును. ఇక్కడి కిది యొక అష్టదళ పద్మము.

పైపద్మమున దళముల సంధులందు ఉపదళములుకూడ నున్నవి. ఉపదళ ములం దన్నింట 'ల'వర్ణమును వ్రాయవలయును. మొదటి దళములోని అక్షరమును,

ఉపదళములోని అక్షరమును, ఇట్లే దళోపదళాక్షరములను కలుపగా శ్లోకమునందలి ఉత్తరార్ధమేర్పడును. దీనిని షోడశదళపద్మమని యనవలయు ననిపించును. కాని పూర్వ పద్యమునందలి యెనిమిది యక్షరములే యిందు పునరావృత్తములై అష్టసంఖ్య నట్లే నిలబెట్టుచున్నవి. మొట్టమొదట కర్ణికయందు నిల్పిన యక్షరమున కింద్లు వినియోగము లేదు.

తృతీయ మష్టపత్త్రం యథా-

'న శశీశ నవే భావే నమత్కామ నతవ్రత

నమామి మానఘన నను త్వానునయంనయమ్' 286

అర్థము : తృతీయవిధమైన అష్టదళ పద్మమున కుదాహరణము. ఓ శశీశ్వరా! భగ్నకామా! సిద్ధవ్రతా! భక్తిభావము నొందినవాడనై, వినయవంతుడనై నేను దర్పదళనము చేయు నీకు నమస్కరింప కుందునా ?

అత్ర -

112. ప్రాక్కర్ణికాం పునః పర్ణం పర్ణాగ్రం పర్ణకర్ణికే
ప్రతిపర్ణం వ్రజే ద్ధీమానిత్థం త్వష్ట దలాంబుజే॥

అర్థము : ఇక్కడ, అష్టదళ పద్మమునందు మొదట కర్ణికకు, పిమ్మట దళమునకు, ఆపిమ్మట దళాగ్రమునకు, మరల దళమునకు కర్ణికకు - ఇట్లు పండితుడు ప్రతిదళమునకు వెళ్ళవలయును.



వ్యాఖ్య : ఇది మూడవ విధమైన అష్టదళ పద్మము. ఇందు మొదటి యక్షరమును దుద్దుపై నుంచవలయును. తరువాతి రెండక్షరములను మొదటి దళము నందు వ్రాయవలయును. చదువునప్పుడు కర్ణిక, దళము, దళాగ్రము, దళము – ఈ వరుసలో రాగా మొదటిదళము పూర్తియగునరికి నాలుగక్షరము లగును. అందు ఒక యక్షరము ద్విరుక్తము. మరల కర్ణికనుండి బయలుదేరి ద్వితీయదళమును వింపవలయును కర్ణికయందలి యక్షరము మారదు. దళారంభమున ఆరవ యక్షరమును, దళాగ్రమున ఏడవయక్షరమును వ్రాయవలయును. చదువునప్పుడు దళారంభమునందలి యక్షరము పునరుక్త మగును. ఇప్పటికి ఎనిమిదక్షరములు, అనగా ఒక పాదము పూర్తియగును. ఇట్లే తక్కిన దళములు.

ఇచ్చట కర్ణికయందున్న 'స' ఎనిమిది పర్యాయములు గ్రహింపబడును. దళారంభ వర్ణములు రెండేసి మారులు గ్రహింపబడును.

ఏవం చతుష్పత్త్రీ షోడశపత్త్రీ అపి ద్రష్టవ్యే. తయోశ్చతుష్పత్త్రీం యథా–

'సాసవా త్వా సుమనసా సా నతా పీవరోరసా
సార భామైతి సహాసా సాహాసర్ధ సువాససా' 287

అర్థము : ఈవిధముగానే చతుష్పత్ర షోడశపత్రములుకూడ ద్రష్టవ్యములు. వానియందు చతుష్పత్రమున కుదాహరణము. ఓయీ సాహసికుడా! మదిరను సేవించి, చక్కని కాంతివి కలిగి, హసించుచు, చక్కని మనస్సుతో, పీవరమైన యురస్సుతో, సుందర వస్త్రములు ధరించి ఆమె నిన్ను సమీపించుచున్నది.

113. కర్ణికాతో నయే దూర్ధ్వం పత్త్రాకారాక్షరావలీమ్
ప్రవేశయేత్కర్ణికాయాం పద్మ మేత చ్చతుర్దలమ్॥

అర్థము : కర్ణికనుండి పత్త్రాకారమున నక్షరసమూహమును మీదికి నడిపింపవలయును; కర్ణికయందు ప్రవేశపెట్టవలయును. ఇది నాలుగు దళములుగల పద్మము.

వ్యాఖ్య : నాలుగు దళములు గలది చతుర్దళపద్మము. మొదటి యక్షరమును కర్ణికయందుంచి ప్రథమ చతుర్థదళముల సంధియందు రెండవ యక్షర ముంచ

వలయును. తరువాతి నాలుగక్షరములను దళముయొక్క అంచున వ్రాయవలయును. తరువాతి యక్షరమును ప్రథమ ద్వితీయ దళముల సంధియందు వ్రాయవలయును.



కర్ణికయందలి యక్షరముతో కలిసి ఎనిమిదక్షరము లైనవి. ద్వితీయపాదమునందలి రెండక్షరములు ఇప్పటికే వ్యస్తములై యున్నవి. కావున మూడవ యక్షరమునుండి నాలుగక్షరములను రెండవ పత్త్రముయొక్క అంచున వ్రాయవలయును. ద్వితీయ తృతీయదళముల సంధియందు తరువాతి యక్షరమును వ్రాయగా కర్ణికాక్షరముతో కలిసి ద్వితీయపాదము పూర్తియగును. ఇట్లే తృతీయ చతుర్థపాదములు తృతీయ చతుర్థదళము లగును. ప్రతిపాదము కర్ణికనుండి ప్రారంభమై నిష్క్రమణము సాగించి దళాంతమునందు కర్ణికయందు ప్రవేశించును. ఇట్లగుటచేత మొదటి యక్షరము ఎనిమిది పర్యాయములు పునరావృత్తమయినది. దళసంధుల యందలి యక్షరములు రెండేసి సారులు వినియోగపడినవి.

షోడశపత్త్రం యథా—

'నమస్తే మహిమప్రేమ నమస్స్వామతిమర్దన
క్షామసోమ నమత్కామ ధామభీమ నమక్షమ' 288

అర్థము : మహిమతోడి ప్రేమగలవాడా! నీకు నమస్కారము. విపరీతదిక్కులను దమించువాడా! కృశించిన చంద్రుని ధరించినవాడా! లొంగిన కాముని గలవాడా! కాంతులచేత భీతిని గలిగించువాడా! నమ్రమైన యోర్పుగలవాడా! శంకరా! నమస్కారము.

114. గోమూత్రికా క్రమేణ స్యుర్వర్ణాః సర్వే సమాః సమాః
మధ్యే మవర్ణవిన్యాసాత్పద్మోఽయం షోడశచ్ఛదః॥

అర్థము : నడిమిభాగమున మవర్ణమును నిల్పుటవల్ల గోమూత్రికాక్రమమున సర్వవర్ణములును సమములు సమము లగును. (సమములని యనగా మవర్ణముతో కూడిన వని యర్థము.) ఇది షోడశదళ పద్మము.

వ్యాఖ్య : గోమూత్రికా క్రమమని యనగా వంకరటింకరగా నుండుట. మొదటి దళములోని యక్షరముతో కర్ణికాక్షరమును కలుపుకొని, రెండవ దళములోని యక్షరమును, మరల కర్ణికాక్షరమును గ్రహింపవలయును. ఇట్లు పదునారు రేకులను



చుట్టి రాగా, పద్మము పూర్తియగును. అక్షరమును విడిచి, అక్షరముచొప్పున మకారము పదునారు మారులు ప్రయుక్తమయినది. ఆకారచిత్రమునందు కర్ణికయందు ఒక్కసారి విన్యసించుటచేతనే అన్నియెడల వినియుక్తమయినది

అష్ట పత్త్రిమేవ కవినామాంకం యథా—

'రాతా పద్యాధిరాజ్యా విసరరరస విద్యావ్రజవాక్తత్స్మవకారా
రాకా పత్త్నాభ శేషా నయననయనస్వా ఖయా స్తవ్యమారా
రామా వ్యస్త స్థిరత్వా తుహినననహితః శ్రీః కరత్సారధారా
రాధా రత్సాస్తు మహ్యాం శివ మమమ వశివ్యాల విద్యావతారా' 289

అర్థము : కవినామాంకము గల అష్టపత్రమున కుదాహరణము. ఇయ్యబడిన వింధనీయమైన వ్యాధుల రాజ్యము గలదియు (రాళ, అవద్య, ఆధిరాజ్యా), వ్యాప్తిని గలిగించు వీరరసమును పొందునదియు (విసర, ర, రవ, విద్), భూమికి అపకారము గలిగించునదియు (క్ష్మా, అపకారా), చంద్రెండేండ్ల బాలయు (రాకా), శరీర లగ్నములయిన సర్పములు గలదియు (పక్ష్మ, అళి, శేషా), నీతిని నడిపించెడి నేత్రమయిన జ్ఞానమనెడి ఆత్మను గలదియు (నయన, న, వయన, ఖా), ఆకాశమునందు సంచరించునదియు (ఖ, యా), పొగడదగిన మారణకర్మ గలదియు (స్తవ్య, మారా), నశించిన స్థిరత్వము గలదియు (వ్యస్త, స్థిరత్వా), మంచుకురియు చంద్రుని తల యందు బంధించిన యీశ్వరునియొక్క శక్తియు (తుహిన, న, నహితుః, శ్రీః), సుఖములను గలిగించు చేతికి పదునైన ఖడ్గధారవంటిదియు (క, ర, క్షుర, ధారా), శివునియందును సుమతలేని వశచిత్తులకు వ్యాళవిద్యయై అవతరించునదియు (శివ, మమ, మ, వశి, వ్యాలవిద్యా, అవతారా), మాయయు వాగ్రూపయు (వ్యాజవాక్), రమణీయ (రామా)మైన ఆరాధాదేవి నాకురక్ష యగుగాక। (యుద్ధమునకేగుచు నొక వైనికుడు మారణోత్సాహమును, రక్షణమును కోరుకొనుచు రణాధిదేవతను ప్రార్థించుచున్న సన్నివేశము.)

115. నివిష్టాష్టదల న్యాస మిదం పాదార్ధభక్తిభిః
అస్పృష్ట కర్ణికం కోణైః కవినామాంక మంబుజమ్॥
తత్రాంకః 'రాజశేఖర కమల' ఏతేన చక్రమపి వ్యాఖ్యాతమ్.

అర్థము : అర్ధపాదములచేత అష్టదళములును నింపబడును. మూలలు కర్ణికావర్ణమును స్పృశింపవు. దళాగ్రములందలి అక్షరములు కవినామాంకమును తెల్పును. ఇది కవి నామాంకము.

వ్యాఖ్య : ఇది అష్టదళపద్మము మొదటియక్షరమును కర్ణికయందు నిల్పి, మూడక్షరములను దళసంధి యందు నిల్పితిమి. దళమునందు నాల్గవయక్షరమును దళాగ్రమునందు ఐదవయక్షరమును నిల్పితిమి. ఇది ఆరోహణము. అవరోహణమునందు ఆరవయక్షరమును, దళసంధియందు నాలుగక్షరములను నిల్పితిమి. ఇక్కడికి అర్ధపాదము పూర్తియైనది. ఇటనుండి ఆరోహణము చేయగా వెనుకటి నాలుగక్షరములే యథాక్రమముగా వినియుక్తము లగును. ద్వితీయదళము విడిన పిమ్మట ఐదవ యక్షరమును దళాగ్రమునందు ఆరవ యక్షరమును, అవరోహణమునందు

ఏడవ యక్షరమును దళసంధియందు వరుసగా మూడక్షరములను నిల్పగా, కర్ణికాక్షరముతో కలిసి మొదటిపాదముయొక్క ఉత్తరార్ధము పూర్తియగును. ఇట్లే మిగిలిన మూడు పాదములును సగము సగముచొప్పున తక్కిన యారు దళములందు నివిష్టము లగును. పాదాద్యంతములు మాత్రమే కర్ణికాక్షరమును కలుపుకొనును.



కావుననే పద్యమునందు 'రా' వర్ణము ఎనిమిదిసారులు ప్రయుక్తమయినది. ప్రతి పాదార్ధమునందలి తుది వర్ణమునకు పూర్వవర్ణములు మూడును, పరవర్ణములుగా వ్యతిక్రమమునొంది పునరుక్తము లయినవి. అట్లే పాదాంతవర్ణములు నాలుగును తరువాతి పాదమున నాద్యవర్ణములుగా వ్యతిక్రమమునొంది పునరుక్తము లయినవి. ప్రథమదళాగ్రమునుండి ప్రతిదళాగ్రమందలి వర్ణములను కలుపగా 'రాజశేఖర కమలం' అని యేర్పడినది. ఇదియే కవి నామాంకము.

చక్రం యథా—

'సత్వం మానవిశిష్ట మాజి రభసా దాలంబ్య భవ్యః పురో
లబ్ధాఘక్షయశుద్ధిరుద్ధ రతర శ్రీవత్సభూమి ర్ముదా

ముక్త్వా కామ మపాస్తభీః పరమృగవ్యాధః స నాదం హరే
రేకౌఘైః సమకాల మభ్ర ముదయీ రోపైస్తదాతస్తరే॥290

అర్థము : చక్రమున కుదాహరణము. అప్పుడు మానవిశిష్టమైన సత్త్వము నాలంబనముగా చేసికొని, పూర్వము లభించిన పాపము నశించుటచేత శుద్ధినొందినవాడు, నున్నతమయిన వక్షఃస్థలము గలవాడు నైన భవ్యుడు సంతోషముతో కామమును విడిచి, భీతి తొలగినవాడై శత్రువులనెడి మృగములకు వ్యాధుడై సంగ్రామ సంరంభమువల్ల అభ్యుదయము నొందినవాడై సమకాలమున ఏకప్రవాహమైన బాణములతో, సింహనాదముతో ఆకాశమును కప్పివేసెను.

116. పురఃపురో లిఖేత్ పాదానత్ర త్రీన్ షడరీకృతాన్
తుర్యం తు భ్రమయే న్నేమా నామాంక శ్చక్ర సంవిధిః॥

అత్రాంకః 'మాఘకావ్య మిదం శిశుపాలవధః'



అర్థము : ఇక్కడ మూడు పాదములను ఆరాకులుగా చేసి మం నకు వ్రాయవలయును. నాలుగవపాదమును నేమిమీద చుట్టుత్రిప్పవలయు నామాంకచక్ర విధానము.

వ్యాఖ్య : ఇది చక్రబంధము. ఈ చక్రమునకు ఆకులారు గలవు. యాకు నేమినుండి ఇరుసువరకు ప్రథమపాదము వరుసగా సగమైనది. సగము నచ్చటనుండి వ్రాయగా నాలుగవయాకు నిండి చివరి యక్షరము నిల్చినది. రెండవ పాదముతో రెండ యాకును, ఐదవ యాకును నిండినవి. పాదముతో మూడవ యాకును, ఆరవ యాకు నిండినవి ఇరుసునందున్న మూడు పాదములకు సరిపోయినది. ఆరవ యాకు నేమిపై నిల్చిన యక్ష చతుర్థపాద ప్రారంభాక్షరమును సమానమే. కావున అచ్చటనుండి ఆకు వ్యవధానమునందు రెండేసి యక్షరముల చొప్పున నిల్పితిమి. ఆకు మొదట నిల్చిన యక్షరములు యథాస్థితములై పాదమును పూర్తిచేసినవి. ఇప్పటి చక్రము పూర్తియైనది.

ప్రతిపాదమున నున్న యాద్యంతాక్షరములు చతుర్థపాదమునందు స్థానములందు కూర్పునొందినప్పుడు మాత్రమే చక్రబంధము సరిపోవును. నందలి రవర్ణము నియతస్థానమున విన్యస్తము.

ఇంక నామాంకము. ప్రతి యాకు నందలి మూడవ యక్షరమును యాకునుండి కలుపుకొని రాగా 'మాఘకావ్య మిదం' అని యగును. ఇ నామము విన్యస్తము. ఆరవ యక్షరమును కలుపుకొని రాగా 'శిశుపాల వ యగును. ఇది గ్రంథనామము. ఇచ్చట అక్షరముల లెక్క నేమినుండి వైపునకు సాగవలయును.

ఉదాహరణ శ్లోకము మాఘుని శిశుపాలవధమునుండి స్వీకృతము.

ఏవం చతురంక మపి యథా-

'శుద్ధం బద్ధసురాస్థి సార విషమ త్వాం రుగ్జయాతిస్థిర
భ్రష్టోద్ధర్మ రజఃపదం గవి గవాక్షీణేన చంచద్రుచా
తథ్యం చింతిత గుప్తిర స్తవిధి దిగ్భేదం న చక్రం శుచా
చారోఽప్రాంశు రదభ్ర ముగ్ర తను మే రమ్యాభవానీరుచా

అత్రాంకః 'శుభ్రతరవాచా బద్ధచితిచక్రం రాజగురుణేదం సాదరమవాది'.

అర్థము : ఇట్లే చతురంకమున కుదాహరణము. అలంకారములుగా ధరించిన అమరుల కపాలాస్థిమాలికలచేత భయంకరుడా! (బద్ధ, సుర, అస్థిసార, విషమ);



రోగములను జయించి మిక్కిలి స్థిరముగా నున్న వాడా! (రుక్, జయ, అతిస్థిర), చక్కగా పోషింపబడి సానందముగా కనురెప్పలను కదలించుచున్న వృషభముతో కనిపించువాడా! (గవా, అక్షీణేన, చంచత్, భువా), ప్రాణిరక్షణమునుగూర్చి తలపోయువాడా! (చింతిత, గుప్తిః), మనోహరమైనవాడా! (చారః), ఉగ్రుడా (ఉగ్ర), నీవు (త్వం), సర్వోన్నతుడవు (అప్రాంశుః); వామదేహమునందున్న పార్వతీకాంతిచేత (భవానీ, రుచా), రమ్యమైనవాడవు (రమ్యః); నాయొక్క (మే), వాక్కునందు (గవి), ధర్మాతిక్రమణముచేయు రజస్థానమును నష్టపుచ్చినదియు (భ్రష్ట, ఉద్ధర్మ, రజః, పదం), దుఃఖముచేత వక్రీభావము పొందనిదియు (న, చక్రం, శుచా) నైన కల్యాణము (అదభ్రం)ను విస్తరింపజేయును.

ఇక్కడ అంకము - శుభ్రతరవాచా, బద్ధచితిచక్రం, రాజగురుణేదం, సాదరమవాది.

వ్యాఖ్య : వెనుకటి చక్రమునందు వలెనే యీ చక్రమునందుకూడ విన్యాసము చేయవలయును. ఇదికూడ షడారచక్రమే. వెనుకటి చక్రమునందు అంకములు రెండు మాత్రమే కలవు. ఇందు నాలుగు కలవు. కావుననే దీనికి చతురంకము అన్నపేరు అన్వర్థమగుచున్నది. ప్రతి ఆకునందు నేమిపైనున్న యక్షరములను కలుపగా 'శుభ్రతర వాచా' అని యేర్పడుచున్నది. మూడవ వలయమునందలి వర్ణములను కలుపగా 'బద్ధ చితి చక్రం' అని యేర్పడుచున్నది. ఆరవ వలయమునందలి యక్షరములను కలుపగా 'రాజగురుణేదం' అని ఎనిమిదవ వలయమునందలి యక్షరములను కలుపగా 'సాదర మవాది' అని యేర్పడుచున్నది. ఇట్లు నాలుగంకములుగా పూర్తివాక్యము విన్యస్తమయినది. అతి స్వచ్ఛమైన వాక్కుతో, బంధరూపము నొందిన జ్ఞానచక్రము రాజగురువుచేత ఆదరపూర్వకముగా చెప్పబడినదని యర్థము.

[ గతి చిత్రము ]

గతిచిత్రేషు గత ప్రత్యాగతం యథా-

'వారణాగ గభీరా సా సారాభీగ గణారవా
కారితారివధా సేనా నాసేధావరితారి కా' 292

అత్రాయుక్పాదయో ర్గతిః, యుక్పాదయోః ప్రత్యాగతిః,

అర్థము : గతి చిత్రమునందు గత ప్రత్యాగతమున కుదాహరణము. ఏనుగు లనెడి పర్వతములతో గంభీరమైనదియు, సారమైనదియు, భయంకర సైనిక సమూహముల ధ్వనులు గలదియు, శత్రువులను సంహరించినదియు, అవరోధము లేనిదియు, శత్రుసైనికులను యుద్ధమునకై వరించునదియు నైన సేన.

ఇచ్చట బేసిపదములయందు గతి; సరిపాదములందు ప్రత్యాగతి.

వ్యాఖ్య : గతి చిత్రము అక్షరగమనమునుబట్టి యేర్పడిన చిత్రము. చిత్రాలంకార భేదములలో గతి చిత్రము ఐదవది. ఇది కూడ అవాంతర భేదములను పెక్కింటిని కలిగియున్నది.

అందు మొదటిది గత ప్రత్యాగతము. ఒక పాదమునందు ఒక క్రమమున నక్షరముల విన్యాసము జరుగును. ఇది అనులోమ క్రమము. ఇదే గతము. అవే యక్షరములు రెండవపాదమునందు వెనుకనుండి ముందువరకు విన్యస్తములగును. ఇది ప్రతిలోమక్రమము. ఇదే ప్రత్యాగతము. ఇట్లే మూడవ పాదము ప్రతిలోమ క్రమమున నాలుగవ పాదమగును.

ప్రకృతోదాహరణమునందు 'వా ర ణా గ గ భీ రా సా' అన్న ప్రథమపాదమును వెనుకనుండి ముందువరకు చదువగా 'సా రా భీ గ గ ణా ర వా' అని యైనది. ఇదే ద్వితీయ పాదము. 'కా రి తా రి వ ధా సే నా' అన్న తృతీయ పాదము ప్రతిలోమక్రమమునొంది 'నా సే ధా వ రి తా రి కా' అని చతుర్థ పాదముగా రూపొందినది. ప్రథమ తృతీయపాదముల గతియే ప్రత్యాగతమై క్రమముగా ద్వితీయ చతుర్థపాదములుగా అయినది. ఒక యర్థమునం దుపయుక్తములయిన వర్ణములే క్రమమును మార్చుకొని అర్థాంతరము ననుగ్రహించుచున్నవి. ఇట్లు చిత్తరంజనమును గావించుట చేతనే చిత్రము. ఇచ్చట వర్ణముల నాశ్రయించుకొని మార్పు చెందినదియు, సౌందర్యమును సంపాదించుకొన్నదియు శబ్దమే. కావుననే, ఇది శబ్దాలంకారముగా సంగృహీతమయినది.

తదక్షరగతం యథా-

'నిశితాసిరతోఽభీకో న్యేజతేఽమరణా రుచా
చారుణా రమతే జన్యే కోఽభీతో రసితాశిని' 395

అత్ర గత ప్రత్యాగతాభ్యాం స ఏవ శ్లోకః.

అర్థము : అక్షరగతమున కుదాహరణము. ఓ అమరులారా! వాడియైన ఖడ్గమునందు ఆసక్తి కలవాడును, భయములేనివాడును, తేజస్సుతో మిక్కిలి ప్రకాశించును. ఆస్వాదింపబడిన ఆహారముగల (పిశాచాదులతో నిండిన) యుద్ధమునందు భీతుడైన వాడెవ్వడు మనోహరముగా క్రీడించును ?

ఇచ్చట గత ప్రత్యాగతములందు అదే శ్లోకము.

వ్యాఖ్య : అక్షరగతమైన చిత్రమున కుదాహరణము. గత ప్రత్యాగతములందు పాదము ప్రమాణము. అక్షరగతమునందు అర్ధపద్యము ప్రమాణము- పూర్వార్ధము అనులోమ క్రమము, గతము; అదే అక్షర సమూహము ప్రతిలోమ క్రమమున విన్యస్తమై ఉత్తరార్ధ మగును ఇందు గతము నొక్కటియే, ప్రత్యాగతము నొక్కటియే. వీనిచేతనే పూర్వార్ధమును, ఉత్తరార్ధమును నిండిపోయి శ్లోకము పూర్తి యగును.

ప్రకృతోదాహరణమునందు 'ని శి తా సి ర తో' మున్నగు విధముగా మొదలయిన పూర్వార్ధము 'రుచా'తో ముగియుచున్నది. ఉత్తరార్ధము 'చారు....' మున్నగు విధముగా ప్రారంభమై 'ర సి తా శి ని' తో ముగియుచున్నది. ఇది పూర్వార్ధమునందలి అక్షరాక్షరము ప్రతిలోమక్రమమున విన్యస్త మగుటచేతనే యేర్పడినది. ఒక శ్లోకమునందే గత ప్రత్యాగతములు పూర్వోత్తరార్ధములం దిమిడిపోయినవి.

శ్లోకాంతర(గత)ం యథా-

'వాహనాజని మానాసే సారాజావనమా తతః
మత్తసారగరాజేభే భారీ హావజ్జన ధ్వని' 294

అత్ర ప్రాతిలోమ్యే నాపరః శ్లోకో భవతి యథా-

'నిధ్వనజ్జవహారీభా భేజే రాగ౽సా త్తమః
తత మానవజారాసా సేనా మానిజనాహవా' 295

అర్థము : శ్లోకాంతరమున కుదాహరణము. ఆపిమ్మట మదించిన సామర్థ్యము గలిగిన భద్రగజములను గలదియు, భారము వహించి తదనుకూల కార్య

ప్రవృత్తిగల జనుల ధ్వని గలదియు, శత్రువుల మానమును చెదరగొట్టునదియు నైన సారవంతమయిన యుద్ధమునందు సేన పరాక్రమము కావి దయ్యెను.

ఇచ్చట ప్రాతిలోమ్యముచేత మరొక శ్లోకమగును. దాని యర్థ మిది.

పెద్ద ధ్వనిచేయుచు వేగముచేత మనోహరములై యున్న యేనుగులను గలదియు, విస్తారమైన వైవికసంజాతమైన కోలాహలము గలదియు, పౌరుషవంతులయిన వీరవరుల సంగరము గలదియు నైన సేన క్రోధరసమువల్ల (పరరాజ్యలక్ష్మి యందలి అనురాగ రసమువల్ల) తమమును పొందినది.

వ్యాఖ్య : అనులోమక్రమముచేత ఒక శ్లోకమును, ప్రతిలోమక్రమముచేత మరొక శ్లోకము నగునది శ్లోకాంతరము. వాహనా, అజవి, మానాసే, సారాజా, అనమా, తతః, మత్త, సారగ, రాజేభే, భారీ, ఈహావత్, జనధ్వని - అని ప్రథమ శ్లోకమునకు పదవిభాగము. విధ్వనత్, జవ, హారి, ఇభా, భేజే, రాగరసాత్, తమః, తత, మానవజారాసా, సేనా, మావిజన, ఆహవా - అని ద్వితీయశ్లోకమునకు పదవిభాగము.

ప్రథమశ్లోకమే ప్రతిలోమక్రమమువల్ల ద్వితీయశ్లోక మయినది. మొదటిది గతము; రెండవది ప్రత్యాగతము. రెండును సంస్కృత భాషాశ్లోకములే. [శీర్షిక యందు 'శ్లోకాంతర గతం' అని యుండుట సమంజసము; అట్లుండిన పూర్వాపర శీర్షికలతో సాదృశ్యము నొందును.]

భాషాంతరగతం యథా-

'ఇహ రే బహలా ల్లాసే బాలా రావహు మలీమసా
సాలకా రసలీలా సా తుంగాలాలి కలారత' 296

అత్ర ప్రాతిలోమ్యే నాపరః ప్రాకృతశ్లోకో భవతి యథా-

'తరలా కలిలా గాతుం సాలాలీ సరకాల సా
సామలీ మహు రాలావా సేలాలా హావ రేహఇ' 297

అర్థము : భాషాంతర గతమున కుదాహరణము. ఓయీ! కళారతుడా! చెదరిన ముంగురులు గలదై, రాహుమలీమసయైన (చంద్రరేఖవంటి) బాల ల్లాస

విదితేదివి, కేనీకే, తం యాంతం, నిజితాజిని, విగదంగవి, రోద్ధారో, యోద్ధాయో, నతిమేతిన— అని యెనిమిది వర్ణగుచ్ఛములు వాడుక నొందినవి. ఎటునుండి చదివి నప్పటికి, ఇవి రూపమునందు గాని అర్థమునందు గాని మార్పు నొందవు. ఇందలి వర్ణగుచ్ఛములన్నియు గత ప్రత్యాగతములందు యథాస్థితములై యుపకరించును. అట్లగుటచేతనే శ్లోకరూపము మారినప్పటికిని శ్లోకార్థమునందు మార్పు కలుగుట లేదు. ఖండములుగా చూచినప్పుడు గత ప్రత్యాగతములేక రూపములు. అఖండముగా చూచినప్పుడు భిన్నరూపములు. అయినప్పటికిని అర్థము రెండింటియందు అనుగతముగా నొక్కటియే యున్నది. కావుననే, యిది అర్థానుగతమైన గత ప్రత్యాగతముగా పేర్కొనబడినది.

తురంగపదం యథా—

'బాలా నుకాలవాలాకా కాంతిలాలకలాలితా
సఖా నుతవతీ సారా దర్పికా వ్రతగర్థిత' 299

అర్థము : తురంగ పదమున కుదాహరణము . చక్కని నల్లని కేశపాశము గలదియు, కాంతిగల ముంగురులతో శోభించునదియు, స్నేహపూర్ణయు, పుత్రవతియు, ఉన్నతురాలును, దర్పము గలదియు, వ్రతానుష్ఠానము గలదియు నైన బాల యీమె. ఈమెను నీవు సేవింపుము.

117. క్రమాత్ పాదచతుష్కేఽస్య పంక్తిశః పరిలేఖితే
తురంగపదయాతేన శ్లోకోఽన్య ఉపజాయతే॥

యథా—

'బాలా లలితతీవ్రఖా నుకలా రాగతర్పికా
సుదంతికా వర్ధితావాసా కాలా తలలాసకా' 300

అర్థము : క్రమముగా దీనియొక్క నాలుగు పాదములను పంక్తుల క్రమములో వ్రాయగా తురంగపదగమనమువంటి గమనముచేత మరొక శ్లోకము పుట్టును.

శ్లోకార్థము – లలిత తీవ్రమైన ఆత్మ (స్వభావము) గలదియు, మంచి కళ గలదియు, రాగముచేత తృప్తిగలిగించునదియు, చక్కని పలువరుస గలదియు,

విధితేదివి, కేనీకే, తం యాంతం, నిజితాజిని, విగదంగవి, రోద్ధారో, యోద్ధాయో, నతిమేతిన– అని యెనిమిది వర్ణగుచ్ఛములు వాడుక నొందినవి. ఎటునుండి చదివి నప్పటికి, ఇవి రూపమునందు గాని అర్థమునందు గాని మార్పు నొందవు. ఇందలి వర్ణగుచ్ఛములన్నియు గత ప్రత్యాగతములందు యథాస్థితములై యుపకరించును. అట్లగుటచేతనే శ్లోకరూపము మారినప్పటికిని శ్లోకార్థమునందు మార్పు కలుగుట లేదు. ఖండములుగా చూచినప్పుడు గత ప్రత్యాగతములేక రూపములు. అఖండముగా చూచినప్పుడు భిన్నరూపములు. అయినప్పటికిని అర్థము రెండింటియందు అనుగతముగా నొక్కటియే యున్నది. కావుననే, యిది అర్థానుగతమైన గత ప్రత్యాగతముగా పేర్కొనబడినది.

తురంగపదం యథా–

'బాలా సుకాలవాలాకా కాంతిలాలకలాలితా
సఖా సుతవతీ సారా దర్పికా వ్రతగర్థితే' 299

అర్థము : తురంగ పదమున కుదాహరణము . చక్కని నల్లని కేశపాశము గలదియు, కాంతిగల ముంగురులతో శోభించునదియు, స్నేహపూర్ణయు, పుత్రవతియు, ఉన్నతురాలును, దర్పము గలదియు, వ్రతానుష్ఠానము గలదియు నైన బాల యీమె. ఈమెను నీవు సేవింపుము.

117\. క్రమాత్ పాదచతుష్కేऽస్య పంక్తిశః పరిలేఖితే
తురంగపదయాతేన శ్లోకోऽన్య ఉపజాయతే॥

యథా–

'బాలా లలితతీవ్రఖా సుకలా రాగతర్పికా
సుదంతికా వర్ధితావాసా కాలా తలలాసకా' 300

అర్థము : క్రమముగా దీనియొక్క నాలుగు పాదములను పంక్తుల క్రమములో వ్రాయగా తురంగపదగమనమువంటి గమనముచేత మరొక శ్లోకము పుట్టును.

శ్లోకార్థము – లలిత తీవ్రమైన ఆత్మ (స్వభావము) గలదియు, మంచి కళ గలదియు, రాగముచేత తృప్తిగలిగించునదియు, చక్కని పలువరుస గలదియు,

గృహము నభివృద్ధి పరిచినదియు, నల్లనిదియు, నాట్యమునందు పరాకాష్ఠ నందు కొన్నదియు నైన బాల.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బా 1 | లా 30 | సు 9 | కా 20 | ల 3 | పా 24 | లా 11 | కా 26 |
| కా 16 | ంతి 19 | లా 2 | ల 29 | కే 10 | లా 27 | అ 4 | తా 23 |
| నే 31 | శ్యా 8 | స్తు 17 | త్త 14 | వ 21 | తీ 6 | స్తా 25 | రా 12 |
| ద 18 | ర్భి 15 | కా 32 | ప్ర 7 | త 28 | గ 13 | ర్ధి 22 | త 5 |

వ్యాఖ్య : మొదట నిచ్చిన శ్లోకమునందలి నాలుగు పాదములను వరుసగా నాలుగు పంక్తులుగా వ్రాసితిమి. గుఱ్ఱము నడచునప్పుడు నాలుగు కాళ్లను రెండు వరుసలుగా కాని, నాలుగు వరుసలుగా కాని నియతముగా పాదముద్రలను వేయదు. ఒకప్పుడు ఒక కాలు ముందునకు వేసి మరియొక కాలు వెనుకకు వేయవచ్చును. ఆ పాదముద్రలను కలుపుకొనుచు పోయినచో వంకరటంకర గీత లేర్పడును. వానితో నైతము సౌందర్యము లేదనుటకు వీలులేదు. ప్రకృతశ్లోకము నుండి తురంగ చల నానుకరణముతో అక్షరములను గ్రహింపగా మరొక శ్లోక మేర్పడినది. ఈశ్లోకము రూపమునందును భిన్నమే; అర్థమునందును భిన్నమే. అయినప్పటికి ద్వితీయ శ్లోకము నందలి వర్ణము లన్నియు ప్రథమ శ్లోకములో నున్నవే. అందుండి ఒక్క యక్షర మును కూడ విడువలేదు; అదనముగా ఒక్కయక్షరమునుకూడ కలుపలేదు. చిత్రము నందు అక్షరముల దగ్గర సూచించిన అంకెలు క్రొత్తశ్లోకమునందు ఆ యక్షరముల స్థానమును నిర్దేశించును. కంటితో ఒక్కసారి ఒకటినుండి ముప్పదిరెండు వరకు గల అంకెలను కలుపుకొనగలిగిన యెడల తురంగ గతి స్పష్టగోచరము కాగలదు.

118. ఆహురర్ధభ్రమం నామ శ్లోకార్ధభ్రమణం యది
తదిదం సర్వతోభద్రం సర్వతోభ్రమణం యది.

అర్థము : శ్లోకముయొక్క సగముభాగము తిరుగబడినయెడల దానిని అర్థ

భ్రమణ మని యందురు. అదియే అన్నియెడలను తిరుగబడినయెడల, దానిని సర్వతోభద్రమని యందురు.

తయో రర్ధభ్రమం యథా–

'ససత్వరతిదే నిత్యం సదరామర్ష నాశిని
త్వరాధికకసం నాదే రమకత్వ మకర్షతి' 301

అర్థము : వానియందు అర్ధభ్రమకమున కుదాహరణము. నిత్యము బల వంతుల కాసక్తిదాయకమును, భయస్థుల క్రోధమును హరించునదియు. ఉత్సాహము చేత అధికముగా వీరనాదములు గలదియు, రంజకత్వ స్ఫోరకము (నయిన యుద్ధము నందు).

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స | స | త్వ | ర | తి | దే | ని | త్యం |
| స | ద | రా | మ | ర్ష | నా | శి | ని |
| త్వ | రా | ధి | క | క | సం | నా | దే |
| ర | మ | క | త్వ | మ | క | ర్ష | తి |
| తి | ర్ష | క | మ | త్వ | క | మ | ర |
| దే | నా | సం | క | క | ధి | రా | త్వ |
| ని | శి | నా | ర్ష | మ | రా | ద | స |
| త్యం | ని | దే | తి | ర | త్వ | స | స |

వ్యాఖ్య : శ్లోకపాదములు నాలుగింటిని వరుసగా నాలుగు పంక్తులలో వ్రాయవలయును. అప్పుడు కోష్ఠకమును తలక్రిందులు చేసి వరుసగా నాలుగు పంక్తులలో మరల నాలుగుపాదములను వ్రాయవలయును. ఇట్లు వ్రాయగా, ఎటు వైపునుండి చూచినప్పటికి ఎనిమిదేసి యక్షరములుగల శ్లోకపాదము లేర్పడును. పైనుండి క్రిందికి చదువగా సగమౌ నరికి (నాలుగు పంక్తు లగునరికి) శ్లోకము పూర్తి యగును. తలక్రిందులు చేసి చదువగా మరల నదేవిధముగా నాలుగు పంక్తుల

శ్లోక మేర్పడును. అట్లే నిలువుగా నున్న పంక్తులను పైనుండి క్రిందికి చతుష్క కుడివైపు నాలుగు పంక్తు లగుసరి శ్లోకము పూర్తియగును. చతుష్కమును క్రిందులుచేసి యిదే విధముగా చదువగా నాలుగు పంక్తులగునరికి శ్లోకము పూర్తి యగును. నిలువుపంక్తులను చదివినప్పుడు, అడ్డపంక్తులను చదివినప్పుడు సగము పంక్తులలోనే శ్లోకము పూర్తియగును. మరల తలక్రిందులు చేసి చదివినప్పుడుకూడ ఇట్లే యగుచున్నది. ఎట్లు చదివినను వచ్చెడి శ్లోక మొక్కటియే. చతుష్కము నందలి గడులలో సగము గడచునరికే శ్లోకము పూర్తి యగుచున్నది. తక్కిన సగము తలక్రిందులుచేసి చదువవలసివచ్చుచున్నది. కావుననే దీనికి 'అర్ధభ్రమము' అన్నపేరు అన్వర్థమగుచున్నది.

ఉదాహరణము భారవి 'కిరాతార్జునీయము'నుండి గృహీతము.

సర్వతోభద్రం యథా—

'దేవాకానిని కావాదే వాహికా స్వస్వకాహి వా
కాకారే భభ రే కాకా నిస్వభవ్య వ్యభస్వని' 302

అర్థము : సర్వతోభద్రమున కుదాహరణము. దేవతల కుత్సాహమును కలిగించునదియు, వాక్కలహమును గలదియు, క్రమప్రాప్తమయిన సమరమునకు స్వసైన్యములను పరసైన్యములను మోహరింపజేయునదియు, మదము స్రవించెడి యేనుగులతో నిండినదియు, కాకా నిస్వనములు చేయుచు నుత్సాహము చూపుచున్న వారిచేత భాసించుచున్నదియు (నయిన యుద్ధరంగమునందు).

వ్యాఖ్య : అన్నివైపులనుండియు భద్రమగునది సర్వతోభద్రము, ఎటు వైపునుండి చదివినను నాలుగు పంక్తు లగునరికి శ్లోకము పూర్తియగును. నిలువు పంక్తులను కుడివైపునకు చదువగా వరుసగా నాలుగు పాదము లేర్పడును. తుది పంక్తినుండి ఎడమవైపునకు (వెనుకకు) నాలుగు పంక్తులను చదువగా శ్లోకము పూర్తియగును. అడ్డ పంక్తులను నాలుగింటిని వరుసగా చదువగా ఇట్లే యగును. క్రిందనుండి మీదికి నాలుగు పంక్తులను చదివినప్పుడు కూడ ఇట్లే యగును.

అర్ధభ్రమమునందు చతుష్కమును కొన్ని పర్యాయములు తలక్రిందులుచేసి చదువుట యవసరమగును. ఇచ్చట అట్టి యవసరము లేదు. కాని ఒకవైపునుండి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దే | వా | కా | ని | ని | కా | వా | దే |
| వా | హి | కా | స్వ | స్వ | కా | హి | వా |
| కా | కా | రే | భ | భ | రే | కా | కా |
| ని | స్వ | భ | వ్య | వ్య | భ | స్వ | ని |
| ని | స్వ | భ | వ్య | వ్య | భ | స్వ | ని |
| కా | కా | రే | భ | భ | రే | కా | కా |
| వా | హి | కా | స్వ | స్వ | కా | హి | వా |
| దే | వా | కా | ని | ని | కా | వా | దే |

చదివినప్పుడు అనులోమక్రమమును, మరొకవైపునుండి చదివినప్పుడు విలోమక్రమమును పాటించుట యవసర మగును. కావున, సర్వతోభద్రమును 'సర్వతోభ్రమము' అని యన్నప్పటికి దోషము కాదు. ఇట్లు చదివినప్పటికి ఒక శ్లోకమే యేర్పడును. భిన్నశ్లోక మేర్పడదు.

ఉదాహరణము భారవి కిరాతార్జునీయమునుండి గృహీతము.

[ బంధచిత్రము ]

బంధచిత్రేషు ద్విచతుష్క చక్రబంధో యథా—

'జయదేవ నతేంద్రాదేవ లంబోదర వినాయక
జగదేధన చంద్రాభాలంఘి దన్త విభాయతే' 303

అర్థము : బంధచిత్రములందు ద్విచతుష్క చక్రబంధమున కుదాహరణము. దేవా! నతులయిన యింద్రాదులను కలవాడా! లంబోదరా! వినాయకా! లోకమును వడి వెలయించువాడా! చంద్రకాంతి నతిక్రమించు దంతకాంతి గల నీకు జయమగుగాక.

119. ఇహ శిఖర సంధి మాలాం
బిభృయాదర్ధం సమాశ్రితై ర్వర్ణైః
ద్విచతుష్క చక్రబంధే
నేమివిధౌ చాపరం భ్రమయేత్.

అర్థము : శ్లోకార్ధమునందున్న వర్ణములతో శిఖరములను, తన్మధ్య సంధులను నింపవలయును. చుట్టునున్న నేమిపైని మిగిలిన భాగమును చుట్టవలయును. ఇది ద్విచతుష్క చక్రబంధమునందలి న్యాసవిధానము.

వ్యాఖ్య : చిత్రాలంకారములో వర్ణ, స్థాన, స్వర, ఆకార, గతి నియమమునుబట్టి యేర్పడిన భేదములను చెప్పుకొంటిమి. ఇప్పుడింక ఆరవదైన బంధచిత్రమును గూర్చి చెప్పుకొందము.



ద్విచతుష్క చక్రబంధ మని యనగా రెండు చతుష్కములనుగల్గి చక్రాకారముగల బంధ మని యర్థము. రెండు చతుష్కములనుటచేత, ఎనిమిది శృంగములేర్పడును. శృంగమునకు శృంగమునకు నడుమ లోయ (ఎడము) కలుగును.

శ్లోకమునందలి తొలి సగమును ఒక్కొక్క యక్షరము చొప్పున వరుసగా శృంగము లందును లోయలందును వ్రాయవలయును. శ్లోకమునందలి రెండవ సగమును చక్రనేమిపైని విన్యసింపవలయును. రెండవ యక్షరమును మొదటి శృంగమునకు మీద, నాలుగవ యక్షరమును రెండవ శృంగమునకు మీద, ఆరవ యక్షరమును మూడవ శృంగమునకు మీద - ఈ విధముగా ఒక్కొక్క యక్షరమును విడుచుచు, ఎనిమిది శృంగముల మీద నేమియందు ఉత్తరార్ధమును నిలుపవలయును. ఇట్లు చేయగా ద్విచతుష్క చక్రబంధ మేర్పడును. చదువునప్పుడు మొదట శృంగము లందును లోయలందును గల యక్షరములను వరుసగా చదువవలయును. అప్పటికి సగము శ్లోక మేర్పడును. తరువాత మొదటి శృంగమునుండి మొదలుపెట్టి, శృంగాక్షరముతో నేమ్యక్షరమును కలుపుకొనుచు చదువవలయును. ఇట్లు చదువగా శ్లోకము నందు మీదిసగము పూర్తియగును. నేమ్యక్షరములను కలుపునపుడు లోయలందలి యక్షరము లుపేక్షితము లగునని గమనింప వలయును.

ద్విశృంగాటకబంధో యథా-

'కరాసంజ వశేశం ఖగౌరవస్య కలారసమ్
సంధాయ వలయాం శంకా మగారీం మే వనాత్మక' 304

అర్థము : ద్విశృంగాటక బంధమున కుదాహరణము. ఓయీ! జలాత్మకుడా! ఆకాశమునకు గౌరవమైనవాడా! కిరణపోషకుడా! శివుని వశము చేసికొన్న కళారసమును సంధానించి నల్లని వలయ మనెడి శంకను నాకు తొలగింపుము.

120. శృంగాద్గ్రంథిం పునః శృంగం గ్రంథిం శృంగం వ్రజేదితి
ద్విశృంగాటకబంధేఽస్మిన్నేమిః శేషాక్షరై ర్భవేత్.

అర్థము: శృంగమునుండి గ్రంథిని, మరల శృంగమును, గ్రంథిని, శృంగమును - ఈవిధముగా వెళ్ళగా ఈ ద్విశృంగాటక బంధమునందు మిగిలిన యక్షరములతో నేమి యేర్పడును.

అత్రాంకః - రాజశేఖరస్య

అర్థము : 'రాజశేఖరస్య' యని యిచ్చటి అంకము (ముద్ర).

వ్యాఖ్య : రెండు త్రిభుజములను గల్గి చక్రాకారము గల బంధము ద్విశృంగాటక చక్రబంధము. న్యాస శ్లోకమునందు ద్విశృంగాటక బంధ మనియే యున్నప్పటికిని, నేమి ప్రసంగముకూడ అందే యుండుటచేత చక్రాకారముండుట ఆవశ్యక మని స్పష్టమగుచున్నది.



రెండు త్రిభుజములను విరుద్ధక్రమమున నిలిపినప్పుడు ఆరు శృంగము లేర్పడును. శృంగమునకు శృంగమునకు నడిమి భాగము గ్రంథి. దానినే లోయ యని పూర్వప్రసంగమునందు చెప్పుకొంటిమి. ఈ లో యలు కూడ ఆరే యుండును. కావున శ్లోకమునందలి యక్షరములను మొదటి శృం ముునుండి వరుసగా శృంగములందును లోయలందును నిలుపుకొనుచు రాగా, పూర్వా ముునందు నాలుగక్షరములు మిగులును. ఉత్తరార్ధమంతయు మిగులును. ఈ మిగిలిన యక్షరములను నేమిపై నిసర్దవలయును. మొదటి యక్షరమును విడిచి, తరువాతి రెండక్షరములను ప్రథమ ద్వితీయశృంగములను కలుపు నేమిపై నిలుపవలయును. వెవరి యక్షరమును విడువ వలయును. ద్వితీయార్ధమునందుకూడ నిట్లే మొదటి యక్షరమును విడిచి, రెండక్షరములను ద్వితీయ తృతీయ శృంగములను కలుపు నేమిపై నిలిపి, మరల ఒక యక్షరము

విడిచి, తరువాతి రెండక్షరములను తృతీయ చతుర్థ శృంగములను కల్పన నేమిపై నిలుపవలయును. ఇట్లు నిలుపుకొనుచు పోగా నేమి మొదటి శృంగమును చేరు కొనునరికి తుది యక్షర మొక్కటియే మిగిలి యుండును. ఇది న్యాసవిధానము.

పాఠకుడు మొదటి శృంగమునందలి యక్షరముతో మొదలుపెట్టి శృంగము లందలి లోయలందలి వర్ణములను వరుసగా చదువవలయును. ఆపిమ్మట మొదటి శృంగమునందలి వర్ణముతో నేమిపైనున్న వర్ణములను కలిపి ద్వితీయ శృంగాక్షర మును చదువవలయును ఇప్పటికి పూర్వార్ధము పూర్తియగును ద్వితీయ శృంగము నందలి యక్షరమును మరల గ్రహించి నేమ్యక్షరములను శృంగాక్షరములను వరు సగా చదువుకొనుచు రావలయును. ప్రథమ శృంగముమీది వర్ణముతో ద్వితీయార్ధము పూర్తియగును. రెండవ శృంగమునందలి యక్షరముతో శ్లోకపూర్వార్ధము పూర్తి యగుచున్నది. ఉత్తరార్ధము మరల ఆ యక్షరముతోనే ప్రారంభమగుచున్నది. కావున, దానిని వెనువెంటనే తిరిగి చదువవలయును. నేమ్యక్షరములను గ్రహించు నప్పుడు గ్రంథ్యక్షరము లుపేక్షితము లగునని గమనింపవలయును.

గ్రంథ్యక్షరములను వరుసగా కలుపగా 'రాజశేఖరస్య' అని యగును. ఇది నామాంకము. ఇట్లుండుట ఆవశ్యలక్షణము కాదు. నామాంకముకూడ నుండుట చేత దీనిని 'ద్విశృంగాటక చక్ర నామాంక బంధము' అని యనవచ్చును. 'రాజ శేఖరునిది' అని నామాంకము యొక్క అర్థము.

వివిడితబంధో యథా-

'సా సతీ జయతా దత్తే నరంతీ యమితా త్రసా
సారం పారం స చ జయీ శమితా స్యందనేనసా' 305

అర్థము : వివిడితబంధమున కుదాహరణము. భయము లేనిదియు, నిరర్గళ ప్రసారము గలదియు, స్థిరమైన మాలిన్యములు నశించినదియు నైన ఆ పార్వతి జగత్తునకు పరమసారమైన ఎవనిని చేరుకొనెనో, ఆ జయశీలుడు జయము నొందును గాక !

121. శిఖరా దన్యతరస్మాత్
ప్రతిపర్వ భ్రమతి రేఖయాద్యర్ధమ్

నేమౌ తదితర మర్ధం
వివిడిత చక్రాభిధే బంధే॥

అర్థము : అన్యతరమైన శిఖరమునుండి ఆద్యర్ధము రేఖాకారమున పర్వ పర్వమున భ్రమించును. నేమియందు మిగిలిన సగము భ్రమించును. వివిడిత చక్రబంధమునకు న్యాసవిధాన మిది



వ్యాఖ్య : అయిదు కోణములు గల బంధము వివిడితబంధము. దీనికి చుట్టును నేమికూడ నుండుటచేత వివిడిత చక్రబంధము. దేవీస్తుతియందు 'కర్పూర కుందగౌరీం । తను మతనుం కార్ముక భ్రూకాం । వరదాన సుందరకరాం । వివిడిత చక్రస్థితాం వందే' అని కలదు. దేవి వివిడిత చక్రమునందు నిలిచియుండు నన్న సందర్భమున ఈ పేరు కనబడుచున్నది.

ఐదు శృంగములు గల తారను చుట్టుకొని ఒక చక్రముండిన వివిడిత చక్ర బంధ మగునని చెప్పుకొంటిమి. మొదటి శృంగము స్పృశించుచోట నేమిపై మొదటి యక్షరము నిలుపవలయును. తరువాతి రెండక్షరములను వరుసగా తరువాతి రెండు

లోయలందు నిలుపవలయును. నాలుగవ యక్షరమును మూడవ శృంగము తాకెడి చోట నేమిపై నిలుపవలయును. తరువాతి రెండక్షరములు తరువాతి రెండు లోయలందు నిలుపవలయును. ఐదవ శృంగము తాకెడిచోట నేమిపై ఏడవ యక్షరమును నిలుపవలయును. తరువాతి యక్షరములు లోయలందు నిలుచును. ఇట్లు చుట్టుతిరిగి వచ్చునరికి పూర్వార్ధము పూర్తియగును. చివరియక్షరము మొదటి శృంగముపై నిలిచినది, ఆ యక్షరమే ద్వితీయార్ధమున మొదట నున్నది. తరువాతి రెండక్షరములను నేమిపైని, నాలుగవ యక్షరమును శృంగము తాకెడిచోటికి వచ్చునట్లుగా వ్రాయవలయును. ఇట్లు చేయుచు రాగా ప్రథమ శృంగముమీది అక్షరముతో శ్లోకము పూర్తి యగును.

పాఠకుడు శృంగమును విడిచి శృంగమును గ్రహించుచు నడుమనున్న లోయలను స్వీకరింపవలయును. ఇట్లు రెండు చుట్లు తిరుగునప్పటికి పూర్వార్ధము పూర్తి యగును. ఉత్తరార్ధము నేమిపైనున్న అక్షరములను వరుసగా చదువుటచేతనే యేర్పడును; అనగా ఉత్తరార్ధమునందు లోయలయందలి యక్షరములు త్యాజ్యములని యర్థము.

శరయంత్రబంధో యథా-

'నమస్తే జగతాం గాత్ర సదానవకులక్షయ
నమస్తేఽజ సతాం నాత్ర ముదామవన లక్షయ' 306

అర్థము : సర్వలోకములకు గాత్రమువంటివాడా! రాక్షసకుల వినాశము కలవాడా! సంతోషములను సంరక్షించువాడా! నీకు నమస్కారము. అభవా! ఇక్కడి సజ్జనులలో నీకు సమానుడు లేడు. అనుగ్రహింపుము.

124. చతుర్ష్వపి చ పాదేషు పంక్తిశో లిఖితేష్విహ
ఆదే రాదే స్తురంగస్య పాదైః పాదః సమాప్యతే॥

అర్థము : నాలుగు పాదములందును బంతులుగా వ్రాయగా, మొదటినుండి మొదటికి తురంగపాదములతో పాదము సమాప్తి నొందును.

వ్యాఖ్య : నాలుగు పాదములను నాలుగు పంక్తులుగా వ్రాయవలెను. అట్లు చేయుగా ప్రతిపాదమునందు పరిస్థానము నందు రెండేసి వర్ణములు పునరుక్తము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| న | షు | స్త్రై | జ | గ | తాం | గా | త్ర |
| స | దా | న | వ | క్షు | ల | క్ష్మీ | యు |
| స | మ | స్త్రై | జ | స | త్రాం | నా | త్ర |
| ము | దా | షు | వ | న | ల | క్ష్మీ | యు |

లైనట్లు స్పష్ట మగును. మూడవ పాదము చదువుట ప్రారంభించినప్పటినుండియు మనచూపు తురంగగతివలె క్రిందు మీదు లగుచు ముందునకు సాగునే కాని సూటిగా ముందునకు పోదు. వచ్చిన వర్ణములే మరల వచ్చి మన చూపు నాకట్టుకొనుటయే దీనికి కారణము. ఇది యిట్లైయైనపుడు గతిచిత్రమునందు చేరవలయును. గతిచిత్రమునందు తురంగగమన మన్న భేదము పూర్వోక్తము. కాని అచ్చట అక్షరములు వెనుకముందు లగుట, క్రిందు మీదు లగుట స్వైరముగా జరుగును. ప్రకృత బంధమునందు తురంగ గమనమువంటి గమన మున్నప్పటికిని దీనికి నియతి కలదు. పరిస్థానములందు మాత్రమే తురంగ గతి నియతమై యుండుటచే దానికంటె విది భిన్నమై బంధచిత్ర భేదముగా శరయంత్ర బంధమగు చున్నది.




శరయంత్ర బంధమును పై విశ్వగంథకర్త చెప్పిన విన్యాసక్రమమును బట్టి దర్శించితిమి. ఈ శ్లోకము శరబంధమునందు విన్యసింపదగి యున్నది. దాని న్యాసవిధానమును పై చిత్రమునుబట్టి గుర్తింపవచ్చును.

వ్యోమబంధో యథా—

'కమలావలిహారి వికాస విశేషవతాం జనకాంక

న నగాధికరం దివి సార మనారమణాం జరతాం న

తమసా వలహాని విలాస వశేన వరం జనకాంత
న నమామి చిరం సవితార మనాది మహాంం జగతాం నః ॥307

అర్థము : వ్యోమబంధమున కుదాహరణము. జనులకు శిరోభూషణమైన వాడా! జనుల నాకర్షించువాడా! పద్మసముదాయములకు మనోహరమైన వికాసవిశేషము కలిగించువాడవును, ప్రసారశీలముగల కిరణములు గలవాడవును, ఆకాశమునకు సారభూతమైన వాడవును, పరిణామకాలమునుకూడ ఆనందింపజేయువాడవును, చీకట్లయొక్క బలమునకు హానికలిగించు విలాసము వశమునందుంచిన శ్రేష్ఠుడవును, జగత్తుల కన్నింటికి ఆదియైనవాడవును, అయిన నీకు సూర్యునికి నేను బహుకాలము నమస్కరింపకుందునా ? (నమస్కరింతు నని భావము).

123. అష్టాదశ శిఖర చరీం
గోమూత్రికయా చతుష్పదం పశ్యేత్
యత్రాద్యంతై ర్దృష్టాం
స జ్ఞేయో వ్యోమబంధ ఇతి॥

అర్థము : పదునెనిమిది శృంగములయందు చరించు చతుష్పదిని గోమూత్రికా విధానమున చూడవలయును. ఆద్యంతములచేత చూడబడు దీనిని వ్యోమబంధ మని యెరుగవలయును.

వ్యాఖ్య : పదునెనిమిది విభాగములు గల మూడు వృత్తములు గలది వ్యోమబంధము. మొట్టమొదటి (బహిరంగ) వృత్తమున మొదటి విభాగమునందు ప్రథమపాదమునందలి మొదటి యక్షరమును నిలుపవలయును; రెండవ వృత్తమునందలి రెండవ గడియందు రెండవ యక్షరమును నిలుపవలయును; మూడవ యక్షరమును మొదటి వృత్తమునందలి మూడవగది యందు నిలుపవలయును. నాలుగవ యక్షరమును రెండవ వృత్తమునందలి నాలుగవ గడియందు నిలుపవలయును. ఇట్లు మొదటిపాదమునంతటిని విన్యసించునరికి చివరి యక్షరము మొదటి యక్షరమే యగును. ఇప్పుడు మొదటి వృత్తము రెండవగడిలో ద్వితీయపాద ప్రథమాక్షరమును నిలుపవలయును, ద్వితీయాక్షరమును ద్వితీయవృత్తము మూడవ గడియందు, తృతీయాక్షరమును ప్రథమ వృత్తమున నాలుగవ గడియందు, చతుర్థాక్షరమును ద్వితీయవృత్తమున ఐదవ గడియందు నిలుపవలయును ఈ క్రమమును పాటిం

చుచు రాగా ద్వితీయపాదము ప్రథమాక్షరమే అంత్యమాక్షర మగును. ఇప్పటికి మొదటి రెండువృత్తములును పూర్తిగా నిండిపోవును. మూడవ (అంతరంగ)



వృత్తము నందలి మొదటిగడిలో మూడవపాదము నందలి మొదటి యక్షరమునుంచ వలయును. రెండవ వృత్తమునందలి రెండవగడి యందున్న యక్షరమే యా పాదమునందలి రెండవ యక్షరము. అంతరంగ వృత్తమునందు మూడవగడిలో మూడవ యక్షరమును, ఐదవ గడిలో అయిదవ యక్షరమును, ఏడవగడిలో ఏడవ యక్షరమును - ఈ క్రమమున వ్రాయుచు రాగా మొదటి యక్షరమే తుది యక్షరమై పాదము ముగియును. ఆ పిమ్మట అంతరంగ వృత్తమునందు రెండవ గడియందు మొదటి యక్షరము, నాలుగవ గడియందు మూడవ యక్షరము, ఆరవ గడియందు ఐదవ యక్షరము - ఈ క్రమమున ఒక్కొక్క వర్ణమును, ఒక్కొక్క గడిని వద

లుచు నాలుగవ పాదమును నిలుపవలయును. ఇట్లు చేయగా మూడు వృత్తముల లోనే నాలుగు పాదములును విన్యస్తమ్ము అగును.

చదువునప్పుడు మొదటివృత్తము మొదటిగడి నుండి గోమూత్రికా రీతిలో రెండవ వృత్తమును కలుపుకొనుచు చదువగా, రెండు చుట్లు చుట్టునరికి రెండు పాదములు పూర్తియగును. అట్లే అంతరంగ వృత్తమునందలి మొదటి గడినుండి గోమూత్రికారీతిలో రెండవ వృత్తమును కలుపుకొనుచు రెండు చుట్లు పూర్తిచేయువరికి చివరి రెండుపాదములు కూడ పూర్తియగును.

మురజబంధో యథా—

'సా సేనా గమనారంభే రసేనాసీ దనారతా
తారనాద జనా మత్తధీరనాగ మనామయా' 308

అర్థము : ఉన్నతనాదములు చేయు జనములతో కూడినదియు, అమయము లేనిదియు, మదించి ధీరములైన యేనుగులను గలదియునైన ఆ సైన్యము విక్రమముచేత గమన కార్యమునందు నిరంతరాయమయ్యెను. ఇది మురజబంధమున కుదాహరణము.

124· అత్ర పాదచతుష్కేఽపి క్రమశః పరిలేఖితే
శ్లోకపాదక్రమేణ స్యాద్రేఖాసు మురజత్రయీ॥

అర్థము : శ్లోకపాదముల క్రమమున నాలుగు పాదములను క్రమముగా వ్రాయగా రేఖలయందు మూడు మురజములు ఏర్పడును.

వ్యాఖ్య : న్యాసశ్లోకములో సూచించినట్లుగా మురజాకార చిత్రమునందు మొదటిపాదము నొకొక్క యక్షరము చొప్పున గడులలో నిలుపవలయును. రెండవ వరుసలో రెండవ పాదమును, మూడవవరుసలో మూడవపాదమును, నాలుగవ వరుసలో నాలుగవ పాదమును నిలుపవలయును. ఇట్లు చేయగా నాలుగు పాదములను యథాక్రమములో నుండి శ్లోకము పూర్తియగును. మురజాకారమునందు రెండు చతుష్కములు గలవు. వానిని కలుపుచు, ఒక ప్రక్కనుండి రెండవ ప్రక్కవరకు అధోముఖముగా ఒక త్రిభుజమును, ఊర్ధ్వముఖముగా మరొక త్రిభుజమును గలవు. ఈ చతుష్కములును, త్రిభుజములును మురజవాద్యమునకు పైని బిగించిన చర్మ

రత్నావులు. అధోముఖమైన త్రిభుజమునందు మొదటిపాదము విన్యస్తమై యుండును; మొదటి చతుష్కమునందు ప్రదక్షిణక్రమమున ద్వితీయపాదమును, రెండవ చతు



ష్కమునందు అప్రదక్షిణక్రమమున తృతీయ పాదమును, ఊర్ధ్వముఖమైన త్రిభుజమునందు చతుర్థపాదమును విన్యస్తములై యుండును. క్రమానుసారముగా మనము విన్యసించిన పాదములే కాక, చతుష్కాదులందు అదనముగా అవే పాదములు యథోక్తముగా ప్రాప్తించుట యిచ్చటి విశేషము.

రెండు చతుష్కములను, రెండు త్రిభుజముల కలయికవల్ల ఏర్పడిన చతుష్కమును కలిపి చతుష్కత్రయి అన్న యర్థమున 'మురజత్రయి' యని న్యాస శ్లోకమునందు ప్రయుక్తమయినది.

ఏకాక్షర మురజబంధో యథా—

'సురానన త్వాం న న హానసన్నయే
పునః స్తువేఽనర్ఘ ఘనప్లవావనమ్
మనస్యనూన వ్యసనప్రధూననం
సకాననస్థాన నదీన నర్దనమ్' 309

అర్థము : ఏకాక్షర మురజబంధమున కుదాహరణము. ఓ సురాననా! (దేవతలకు ముఖమైన అగ్నిహోత్రుడా!) అనర్ఘము లయిన మేఘములు తేలుటకు

చైతన్యము నిచ్చువాడవును, మనసునందలి అధికమయిన వేదనను తొలగించువాడవును, అడవులందు వైతను అంబోధి కలకలమును కలిగించువాడవును అగు నిన్ను హావినాశము గావించుటకే కాదా? మరి స్తుతించుచున్నాను.

125. శ్లోకస్యైతస్య పాదేషు లిఖితేషు చతుర్ష్వపి
త్రిమృదంగకరీహా స్యాచ్చతురేకాక్షరావలీ॥

అర్థము : ఈ శ్లోకముయొక్క పాదములు నాలుగింటిని వ్రాయగా మూడు మురజము లేర్పడును. చతురముగా ఒకే యక్షరము పునరుక్త మగును.



వ్యాఖ్య : మురజమునందు వాదనస్థలము నుండి మొదలిడి, ఒక్కొక్క యక్షరము చొప్పున మొదటి పాదమును మొదటి పంక్తిగాను, రెండవ పాదమును రెండవ పంక్తిగాను వ్రాసికొనుచు రాగా నాలుగు వరుసలలో శ్లోకము పూర్తియగును. చతుష్కములు రెండింటియందును, అన్నియెడల నవర్ణము మాత్రమే నిల్చును. మధ్యమము దీర్ఘ వృత్తాకారము నొంది ఊర్ధ్వభాగమునందు అధోభాగమునందు నవర్ణమునే కలిగియుండును. నడిమిభాగము ప్రక్కనున్న చతుష్కములతో కలిసి పోవుటచేత నవర్ణమే యుండును. ఇట్లు ఒకే యక్షరము పలుచోట్ల వచ్చునట్లుగా చతురముగా విన్యస్త మగుటచేతనే యిది ఏకాక్షర మురజబంధ మయినది.

మురజప్రస్తారో యథా-

'తాలసారప్రభారాకా తారకాపతిదంశితా
మారధామ రమాధీతా వలయామాన సాగరమ్' 310

అర్థము : మురజశ్లోకప్రస్తారమున కుదాహరణము. తాటిమొవ్వు యొక్క కాంతివంటి కాంతి గలదియు, చంద్రునిచేత కబళింపబడినదియు, మన్మథునికి వెలపైన లక్ష్మిని పైతము మించినదియునైన పూర్ణిమ సాగరునికి బలము చేకూర్చెను. (చుట్టు నావరించి యుండెను.)

126. క్రమేణైవాస్య పాదేషు ప్రసృతేషు చతుర్ష్వపి
తుర్యాన్మురజమార్గేణ శ్లోకోఽయ ముపజాయతే॥

'వరకారప్రదం ధీరం తారధామా సమాసికా
సా లతా మాలయామాప తారాభాతిరసాగతా'. 311

అర్థము : పై శ్లోకమునందలి పాదములు నాలుగును క్రమముగా ప్రసృతములు కాగా నాలుగవదాని నుండి మురజమార్గముచేత ఈ శ్లోకము (శ్లోకాంతరము) పుట్టును.

స్వచ్ఛమయిన కాంతి గలదియు (తారధామా), సాటిలేని స్థితి గలదియు (అసమాసికా), ముత్యములచేత ప్రకాశించునదియు (తారాభా), మిక్కిలి యానందము నొందినదియు (అతిరసాగతా) అయిన ఆమె (నాయిక) లతామండపమును చేరినది- ఇది శ్లోకాంతరమున కర్థము.



వ్యాఖ్య : న్యాస శ్లోకమునందు చెప్పినట్లు శ్లోకపాదములను వరుసగా వ్రాయగా నాలుగు వరుస లేర్పడును. నాలుగవ వరుసయందలి ప్రథమాక్షరము నుండి త్రిభుజాకారము మీది యక్షరముతో శ్లోకాంతర ప్రథమపాద మేర్పడును. మొదటి వరుసయందలి ప్రథమాక్షరము నుండి త్రిభుజాకారముగ పఠింపగా ద్వితీయ పాదమేర్పడును. ప్రథమ చతుష్కమును అప్రదక్షిణముగా పఠింపగా తృతీయ పాదము, ద్వితీయ చతుష్కమును అప్రదక్షిణముగా పఠింపగా చతుర్థపాదము కలుగును. ఇట్లు శ్లోకమునుండి శ్లోకాంతరము లభించుట యిచ్చటి విశేషము.

ఉదాహరణమాత్రం చైతత్. తేన గతివిచిత్రాది గోమూత్రి కాదయోఽన్యేఽపి చిత్రప్రకారా భవంతి.

అర్థము : ఉదాహరణ మాత్రమే యిది. దానిచేత గతి విచిత్రాదులైన గోమూత్రికాదులు చిత్రభేదములు కలుగును.

127. గతి రుచ్చావచా యత్ర మార్గే మూత్రస్య గోరివ
గోమూత్రికేతి తత్ ప్రాహుర్దుష్కరం చిత్రవేదినః.

అర్థము : చిత్రవేత్తలయిన పండితులు మార్గమునందు గోమూత్రమువలె వంకరటింకరయైన ఆ దుష్కరమైన గతిని గోమూత్రిక యని యందురు.

తేషు పాదగోమూత్రికా యథా—

'కాంక్షన్ పులోమతనయా స్తన పీడితాని
వక్షఃస్థలోత్థిత రయాంచన పీడితాని
పాయా దపాయభయతో నముచిప్రహారీ
మాయా మపాస్య భవతోఽంబుముచాం ప్రసారీ' 312

సేయ మయుగ్మతః పాదగోమూత్రికా.

అర్థము : వానియందు పాదగోమూత్రిక కుదాహరణము. శచీస్తనపీడిత ములను, ఉన్నతమై వేగముతోకూడి ఒప్పిదమైన వక్షఃస్థలపీడితములను కోరుచున్న వాడై మాయను తొలగించి నముచిసూదనుడును జలదచోదనుడునైన యింద్రుడు వియోగ భయమునుండి మిమ్ములను కాపాడు గాక! ఇది అయుగ్మ పాదగోమూత్రిక.



వ్యాఖ్య : ఉచ్చావచమైన గతిని కలిగి యుండుట గోమూత్రికా లక్షణము. ఎగుడు దిగుడుగా నుండుటయే ఉచ్చావచగతి. ప్రథమపాదమునందలి బేసి యక్షరములనన్నింటిని మొదటి పంక్తిలోను, సరియక్షరముల నన్నింటిని రెండవ పంక్తిలోను వ్రాయవలయును. ద్వితీయ పాదమునందలి బేసి యక్షరములను తృతీయ పాదములో వ్రాయవలయును. ఇందలి సరియక్షరములను వ్రాయవలసిన యవసరము లేదు. మొదటి బంతిలోని మొదటి వర్ణము, రెండవ బంతిలోని మొదటి వర్ణము; మరల మొదటి బంతిలోని రెండవ వర్ణము, రెండవ బంతిలోని రెండవ వర్ణము — ఈ క్రమములో చదువగా శ్లోకప్రథమపాదము పూర్తియగును. పిమ్మట మూడవ బంతిలోని మొదటి యక్షరము, రెండవబంతిలోని మొదటి యక్షరము — ఈ క్రమమున చదువగా ద్వితీయపాదము పూర్తి యగును. ఇచ్చట మధ్యమపంక్తి ప్రథమ పాదమునందును, ద్వితీయపాదమునందును ఒకే విధముగా ఉపయుక్తమైనది. ఇట్లు చేయుటకు చదువరి తన చూపులను పై నుండి క్రిందికి, క్రిందినుండి పైకి మార్చు చుండవలయును. ఇదియే ఉచ్చావచగతి. మూడు బంతులలో శ్లోకపూర్వార్ధము పూర్తియగును. మరి మూడు బంతుల నిట్లే వ్రాయగా ఉత్తరార్ధము పూర్తియగును.

దీనికి అయుగ్మపాద గోమూత్రిక యని పేరు. అయుగ్మ పాద మని యనగా బేసిపాద మని యర్థము. ప్రథమపాదమును మొదటి రెండు బంతులతోను వ్రాయగా, ద్వితీయపాదమునందలి కొంత భాగము దాని కదియే యేర్పడుచున్నది. బేసిపాదము నుండి సరిపాదము పుట్టుచున్నది. బేసి స్థానములందలి వర్ణములు మారుచుండుట వల్లనే దీనికి అయుగ్మపాద గోమూత్రిక యన్న పేరు అన్వర్థము.

యుగ్మతో యథా-

'దేవః శశాంక శకలాభరణః పినాకీ
దేయః శమైక వికలే భరణః సనాగః

చిత్తే మహాసురజనేన శుభం విధత్తాం
చిత్తం మహాసురజనానత భంగధన్వా' 313

అర్థము : యుగ్మపాద గోమూత్రిక కుదాహరణము. మహా శ్రేష్ఠ జనము చేత మనసున ధరింపబడువాడును, మహాసురజనానత భంగధన్వియు, చంద్రకళా భూషణుడును, పినాక ధారియు, సర్వసహితుడును, శమముచేతనే వికలము గావించిన గజయుద్ధముగలవాడునైన దేవుడు శుభచిత్తమును ప్రసాదించునుగాక :



వ్యాఖ్య : వెనుకటివలెనే ప్రథమపాదమును మొదటి రెండుబంతులలోను వ్రాయవలయును. ద్వితీయపాదము నందలి సమాక్షరములను మూడవబంతిలో వ్రాయవలయును; విషమాక్షరములను వ్రాయవలసిన యవసరము లేదు. చదువరి మొదటి బంతిని, రెండవబంతిని ప్రత్యక్షరక్రమమున కలుపుకొనుచు రాగా మొదటి పాదము పూర్తి యగును. అట్లే మొదటిబంతిని మూడవబంతిని కలుపగా రెండవ పాదము పూర్తియగును. ఉత్తరార్ధముకూడ ఇట్లే మూడుబంతులలో విన్యస్తమగును. ఇచ్చటకూడ ప్రథమపాదమునుండియే ద్వితీయపాదము పల్లవించుచున్నది. అయి నను, సమాక్షరములు మారుటవల్లనే ద్వితీయపాద మేర్పడుచున్నది. కావుననే దీనికి యుగ్మపాద గోమూత్రిక యన్నపేరు చెల్లుచున్నది. ఉత్తరార్ధముకూడ నిట్లే.

అర్ధశ్లోక గోమూత్రికా యథా—

'చూడాప్రోతేందు భాగద్యుతి దలిత తమస్కందలీ చక్రవాలో
దేవో దేయా దుదారం శమమరజనతానందనోఽనన్యధామా
క్రీడాధూతేశ భామా ద్యుసదనతనిమచ్ఛేదనీ చ భువా నో
దేహే దేవీ దురీరందమమరతనతా నందినోమాన్యధామా' 314

అర్థము : జటాజూటమునందు కూర్పబడిన చంద్రఖండకాంతిచేత ఛేదింపబడిన చీకటి మొలకల చక్రవాళము గలవాడును, ఏకైక శరణ మైనవాడును, దేవతాజనమున కానందమును గలిగించువాడు నైన దేవుడు (ఈశ్వరుడు) ఉదారముగా శమమును ప్రసాదించును గాక !

క్రీడా ధూతయు, భ్రూచలనము చేతనే దేవతల అల్పత్వమును ఛేదించునదియు, నందిచేత ఎల్లప్పుడు మ్రొక్కబడునదియు, అపూర్వ తేజస్సు గలదియు, ఈశ్వర పత్నియునైన ఉమ దురీరమైన దమమును మాదేహమునందు ప్రసాదించును గాక !

వ్యాఖ్య : పాదగోమూత్రికయందు ప్రథమపాద విన్యాసమువల్ల ద్వితీయ పాదము కొంతవరకు పల్లవించినట్లు చూచితిమి. అర్ధశ్లోక గోమూత్రిక యందు పూర్వార్ధమును విన్యసించుటచేత, ఉత్తరార్ధమున కొంతభాగము పల్లవించును. ప్రథమపాదమునందలి విషమాక్షరములను మొదటి బంతియందు, సమాక్షరములను రెండవబంతియందు వ్రాయగా ద్వితీయపాద ప్రథమాక్షరము రెండవబంతియందే మొదలగును. బేసిపాదములందు విషమాక్షరములు మారుచున్నవి; సమపాదము లందు సమాక్షరములు మారుచున్నవి. ఇట్లు బేసిపాదములనుబట్టి అయుగ్మమని సమపాదములనుబట్టి యుగ్మమని అనవలయును. కావుననే గ్రంథకర్త యుగ్మాయుగ్మ విభాగము నిచ్చట ముచ్చటింపలేదు.

శ్లోకగోమూత్రికాయాం ప్రథమశ్లోకో యథా-

'పాయాద్వ శ్చంద్రధారీ సకలసుర శిరోలీఢ పాదారవిందో
దేవ్యా రుద్ధాంగభాగః పురదనుజదవస్త్యానసంవిన్నిదానమ్
కందర్ప క్షోదపక్షః సరససురవధూమండలీ గీతగర్వో
దైత్యాధీశాంధకే నానత చరణనఖః శంకరో భవ్యభావ్యః' 315

ద్వితీయో యథా-

'దేయాన్న శ్చండధామా సలిల హారికరో రూఢకందారవిందో
దేహే రుగ్భంగరాగః సురమనుజదమం త్యాగసంపన్నిధానమ్

భందం దిక్షోభదశ్రీః సదసదరవధూ ఖండనాగీరగమ్యో
దైత్యైర్ధీ బంధహా నావతతరసనయః శంపరో దివ్యసేవ్యః 316

అర్థము : శ్లోకగోమూత్రిక కుదాహరణము. మొదటి శ్లోకము - చంద్ర ధారియు, సకలామర శిరోలీఢ పాదారవిందుడును, భార్యచేత రుద్ధము చేయబడిన (ఆక్రమింపబడిన)అంగభాగము గలవాడును, త్రిపురాసురులకు దావాగ్నియైనవాడును, ఘనమైన జ్ఞానమున కాశ్రయమైనవాడును, మన్మథుని చూర్ణము గావించినవాడును, సురవధూమండలీ వరసగీతములకు గర్వించువాడును, దైత్యాధిపతియైన అంధకుని చేత ఆశ్రయింపబడిన చరణనఖములను గలవాడును, ఉత్తములకు భావనీయుడైన వాడు నైన శంకరుడు మిమ్ములను కాపాడును గాక!

రెండవ శ్లోకము - జలములను హరించు కిరణములు గలవాడును, అరవింద కంద్రముల నధిరోహించినవాడును, రోగములను నశింపజేయు రాగము గలవాడును, దేవతలకు మనుజులకు దమమును గలిగించువాడును, త్యాగసంపదకు ఆశ్రయమైన వాడును, దిక్కులకు క్షోభను గలిగించు శ్రీగలవాడును, ఉపవనములందు భయము చెందిన ప్రమదల ఖండన వచనములకు పాల్పడనివాడును, దైత్యులను నశింపజేయు వాడును, సంసారబంధములను నశింపజేయుటలో మిక్కిలి వేగముగల మార్గముగల వాడును, సుఖమును నింపువాడును, దివ్యసేవ్యుడు నయిన చండధాముడు (సూర్యుడు) దేహమునకు శుభమును ప్రసాదించునుగాక!

వ్యాఖ్య : మొదటి శ్లోకమునంతటిని గోమూత్రికాక్రమమున రెండు బంతు లలో వ్రాయవలయును. రెండవ శ్లోకమును మొదటి యక్షరముతో మొదలుపెట్టి ఒక్కొక్క యక్షరము విడిచిపెట్టుచు మూడవబంతిలో వ్రాయవలయును. పాఠకుడు ఒక్కొక్క యక్షరమును ఉచ్చావచక్రమమున మొదటి రెండుబంతులను కలిపి చదువగా మొదటి శ్లోకము పూర్తియగును. అట్లే మూడవబంతిని, రెండవబంతిని ఉచ్చావచక్రమమున చదువగా రెండవ శ్లోకము పూర్తియగును. విషమపాదము లందు విషమాక్షరములును, సమపాదములందు సమాక్షరములును మార్పునొందినట్లు గమనింపగలము.

విపరీత గోమూత్రికాయాం ప్రథమశ్లోకో యథా-

'వినాయకం దాన సుగంధి వక్త్రం
స్మితాననం మందచరం కథాసు
నమామి విఘ్నావలి హారిసారం
సతీసుతం శంకరవల్లభం చ' 317

విపరీతశ్లోకో యథా-

'చలల్లతారబ్ధ శమం సుభాసం
సంసారహారం బహు విప్రమాన్యమ్
సుధాకరం చంద్రమసం నతోఽస్మి
సవర్ణగర్భం నవకంబునాఢ్యమ్' 318

అర్థము : విపరీత గోమూత్రిక కుదాహరణము. ప్రథమశ్లోకము - మదజలముచేత పరిమళించు వక్త్రముగలవాడును, దరహాస వదనుడును, కథలయందు మందగమనము గలవాడును, విఘ్నసముదాయమును నశింపజేయు శక్తిగలవాడును, పార్వతీ సుతుడును, శంకరప్రియుడును అయిన వినాయకునికి నమస్కరించుచున్నాను.

విపరీత శ్లోకము - చలించు తీగలకు శాంతిని గలిగించువాడును, చక్కగా ప్రకాశించువాడును, సంసారతాపమును హరించువాడును, బహుబ్రాహ్మణమాన్యుడును, అమృతమునకు నెలవైనవాడును, సవర్ణగర్భుడును, నవశంఖ సంపన్నుడు నయిన చంద్రునికి నమస్కరించుచున్నాను



వ్యాఖ్య : విపరీత గోమూత్రిక యనగా విలోమక్రమమున నడిచిన గోమూత్రిక యని యర్థము. ఇంతకు ముందున్న గోమూత్రికోదాహరణములు అనులోమ క్రమమునే కలిగియున్నవి. ఎడమ నుండి కుడికి సాగుటయే అనులోమక్రమము. దానికి విరుద్ధము విలోమక్రమము. ఇది కుడినుండి యెడమకు సాగును.

ఉదాహరణ శ్లోకములలో మొదటిదానిని గోమూత్రికాగతిలో విన్యసింపగా రెండు బంతు లేర్పడును. ఇంతవరకు పూర్వపరిచితమే. రెండవది విపరీత శ్లోకముగా గుర్తింపబడినది. దీని మొదటియక్షరమును చివరి యక్షరముగా వ్రాసి, ఒక్కొక యక్షరము విడుచుచు చివరివరకు వెనుకకు (విలోమక్రమమున) వ్రాసి కొనుచు రాగా విపరీత శ్లోకమేర్పడును. ఇందు రెండవబంతి అనులోమక్రమమున ప్రథమశ్లోకమునందును, విలోమక్రమమున ద్వితీయ శ్లోకమునందును భాగస్వామ్యము నొందును. పై చిత్రమునందు ప్రథమశ్లోకమునందలి ఉత్తరార్ధము గ్రహింపబడినది; ప్రథమ ద్వితీయ పంక్తులలో విన్యస్తమయినది. తృతీయ ద్వితీయ పంక్తులను విలోమక్రమమున చదువగా ద్వితీయశ్లోకమునందలి పూర్వార్ధ మేర్పడుచున్నది. సమగ్రశ్లోకము నిట్లు విన్యసించి చూడవచ్చును. (పూర్ణానుస్వారము ఒకప్పుడు పూర్వాక్షరముతోను, ఒకప్పుడు పరాక్షరముతోను కలియుచున్నది. 'బహూం' అను చోట 'వబయో రభేదః' అన్న నియమము నాశ్రయింపవలసి వచ్చుచున్నది.)

భిన్నచ్ఛందో గోమూత్రికాయాం ప్రథమశ్లోకో యథా—

'నమత చంద్రకలామయ మండనం
నగసుతా భుజ సంగత కంధరమ్
స్మర మభాగ్యరదం స్తవసాదరం
సమితి రావణ శాసన విక్రమమ్' 319

ద్వితీయశ్లోకో యథా—

'కామదం చండకక్రమం మదామర్దినో
నాగదంతాజ్యజయ్యం గదా కర్బురమ్
ధీర శోభాభర వ్యస్త కంసాసురం
నౌమి నారాయణస్యాసమం విభ్రమమ్' 320

అర్థము : భిన్నచ్ఛందో గోమూత్రిక కుదాహరణము. ప్రథమ శ్లోకము— చంద్రకళాభూషణుడును, పార్వతీ భుజలగ్న కంధరుడును, అభాగ్యవిచ్ఛేదకుడును, స్తోత్ర వత్సలుడును, యుద్ధమునందు రావణుని శాసించిన విక్రమము గలవాడునైన శివునికి నమస్కరింపుడు.

ద్వితీయ శ్లోకము – కోరికల నిచ్చునదియు, దారుణమై సుకుమారమైనదియు, నాగదంతముల (కువలయాపీడ మన్న యేనుగుదంతముల; కాళియఫణి కోరల) తోడి యుద్ధమందు ఓడింప శక్యము కానిదియు, గదాయుధమువలని చిత్రవర్ణములతో నొప్పునదియు, ధీరశోభౌన్నత్యముచేత కంసదానవుని కలతపెట్టినదియునైన మేదిమును సమగ్రముగా మర్దించు నారాయణుని విభ్రమమును స్తుతించుచున్నాను.

వ్యాఖ్య : గోమూత్రికాగతి గలిగి భిన్నవృత్తములు ప్రయుక్తము లయిన యెడల భిన్నచ్ఛందో గోమూత్రిక యని యందురు. నిజమున కిది భిన్నవృత్త గోమూత్రిక మాత్రమే. ఉదాహృత శ్లోకములు రెండును పండ్రెండక్షరముల ప్రమాణము గల జగతీచ్ఛందమునకు చెందినవే; కావున భిన్నచ్ఛందస్కత లేదు. మొదటి శ్లోకము 'న భ భ ర' గణములు గల ద్రుతవిలంబిత వృత్తము. రెండవ శ్లోకము నాలుగు రగణములు గల స్రగ్విణీ వృత్తము. వృత్తములు భిన్నములై నప్పటికిని అనులోమక్రమమున గోమూత్రికా చిత్రము నేర్పరుచును. (భిన్న చ్ఛందమైనప్పుడు కూడ కొంత సరుదుబాటుతో గోమూత్రికారచన చేయవచ్చును. భోజదేవుడు పేరుచేతనే సూచించుచున్నాడు కాని ఉదాహరణము చూపలేదు.)

సంస్కృత ప్రాకృత గోమూత్రికాయాం సంస్కృతశ్లోకో యథా–

'స్కందో రుందర్ధి మిష్టాం వితరతు సరలో దారితారాతివర్గో
నస్పందో మందసజ్జో భవభయకలనే సంగరే కేలికారీ
సందోహాల్లాఘులాసీ జన ఇహ బలిహా చండతాభూరఖర్వో
దేవాజ్జో రాజదేహే మహిమని నిరతో విక్రమాడంబరేణ' 321

ప్రాకృతశ్లోకో యథా–

'చందో కందప్పమిత్తం విహారణసహాలో హారితారాపబంధో
సచ్ఛందో వందణిజ్జో కుసలయదలనో సంకరే మేలికారీ
కందో వోల్లాసలాసీ జఅ ఇ సివసిహామండనీభూతఖండో
దేంతాజోణ్హా జలోహా పిహిఅణిలఅ ఈ పబ్భమాణంబలేన' 322

[ఛాయా-

'చంద్రః కందర్పమిత్రం విహరణసఫలో హారితారాప్రబంధః
స్వచ్ఛందో వందనీయః కువలయదలనః శంకరే మేలికారీ
కందోద్దోల్లాసలాసీ జయతి శివశిఖామండనీభూతఖండో
దత్తజ్యోత్స్నా జలౌఘో విహితనిజరతి ర్విభ్రమాణాం బలేన']

అర్థము : సంస్కృత ప్రాకృత గోమూత్రిక కుదాహరణము. సంస్కృత శ్లోకము - సరళస్వభావుడును, సుందర స్వరూపుడుచు, అనతి భూషణుడును, చీల్చబడిన శత్రువుల సమూహమునందు భవభయమును తొలగించు సంగ్రామమునందు వినోదించువాడును, ఇహలోకమునందు సందోహరూపమున లంఘింపజేసి ప్రకాశించువాడును, బలవంతులను నాశముచేయువాడును, త్రిపథ కాశ్రయమైనవాడును, మొక్కవోనివాడును, దేవశక్తిగల రాజులను ఖండించెడి కోరికతోడి మహిమయందు విరతిగలవాడును అయిన కుమారస్వామి విక్రమాడంబరముతో అభీష్టమైన వృద్ధిని కలిగించునుగాక !

ప్రాకృతశ్లోకము - మన్మథమిత్రుడును, సఫలమైన విహారము కలవాడును, మనోహరములైన చుక్కల యేర్పాటు గలవాడును, స్వతంత్రుడును, వందనీయుడును, కువలయ వికాస కారకుడును, శంకరునియెడ సన్నిహితత్వము గలవాడును, కలువల కుల్లాసము గలిగించి ప్రకాశించువాడును, శివుని జటాజూటమునందు అలంకారమైన ఖండము గలవాడు, వెన్నెలల జలప్రవాహముల నిచ్చువాడును, విభ్రమ బలముచేత తనయందు తాను మోదించువాడునైన చంద్రుడు వర్ధిల్లునుగాక!

వ్యాఖ్య : ఇదికూడ శ్లోక గోమూత్రికయే. ప్రథమ శ్లోకము సంస్కృతము. దీనిని ఉచ్చావచక్రమమున రెండు బంతులుగా వ్రాయవలయును. ద్వితీయ శ్లోకము ప్రాకృతము. దీనిని మొదటి యక్షరముతో మొదలుపెట్టి ఒక్కొక్క యక్షరమును విడుచుచు మూడవబంతిగా వ్రాయవలయును. పాఠకుడు మొదటి రెండు బంతులను గోమూత్రికా క్రమమున చదువగా సంస్కృతశ్లోక మేర్పడును; మూడవబంతితో మొదలుపెట్టి గోమూత్రికా క్రమమున రెండవబంతిని కలుపుకొనుచు చదువగా ప్రాకృత శ్లోకమేర్పడును. రెండవ బంతియందు విన్యస్తములయిన వర్ణములు మొదటిబంతితో సంస్కృతవర్ణములుగాను, మూడవబంతితో ప్రాకృతవర్ణములుగాను - రెండు విధములుగా వ్యవహృతము లగుచున్నవి. ఇదియే

యిచ్చటి విశేషము. కావుననే, దీనికి సంస్కృత ప్రాకృత గోమూత్రిక యన్న వ్యవహారము అన్వర్థ మగుచున్నది.

సమసంస్కృత ప్రాకృతేన పాదగోమూత్రికా యథా-

'బాలా విలాసావలిహారి హాసా
లోలా మలా భావసహా సహావా
దేహం హరంతీ సరసా సురామా
గేహం చరంతీ సహసాభిరామా' 323

అర్థము : సమసంస్కృత ప్రాకృతముతోడి పాదగోమూత్రిక కుదాహరణము. విలాసములను హరించునట్టి హాసము గలదియు, చంచలత్వము గలదియు, సరసత్వము గలదియు, చక్కని మనోహరత్వము గలదియు నగు బాల హఠాత్తుగా గృహమునందు చరించుచుండెను.

వ్యాఖ్య : సంస్కృతమునందును ప్రాకృతమునందును మార్పులేకుండ ఒకే మాదిరిగా నుండు భాష సమసంస్కృత ప్రాకృతము. గోమూత్రికా చిత్ర ప్రారంభమువద్ద చెప్పకొన్న పాదగోమూత్రికకును దీనికిని విన్యాసవిధానమునందు భేదములేదు; పఠన విధానమునందు భేదము లేదు. ఉపయోగించిన శబ్దములు సంస్కృతమైనట్లే ప్రాకృతముకూడ అగుట యొక్కటియే దీనిని వేరుగా పరిగణించుటకు కారణమైనది.

అర్ధగోమూత్రికా ప్రస్తారో యథా-

నమో దివసపూరాయ సుతామరస భాసినే
నతభవ్యారిదారాయ సుసారలయ భావినే' 324

అత్ర గోమూత్రికా శ్లోకోఽయ ముత్తిష్ఠతి-

'నతదివ్యాసదారాయ సుసామలసభాసినే
నమో భవరిపూరాయ్య సుతార రయ భావినే' 325

అర్థము :- అర్ధగోమూత్రికా ప్రస్తారమున కుదాహరణము. మంచి పద్మము లందు భాసించువాడును, ఆశ్రితులైన భవ్యుల శత్రువులను చీల్చువాడును, మంచి సారము (సముద్రము) నందు లయమొందుట కపేక్షించువాడు నయిన దివాకరునకు నమస్కారము.

ఇచ్చట ఈ గోమూత్రికా శ్లోకమేర్పడుచున్నది. నతులైన దివ్యులకు శత్రు సమూహము లేకుండ జేయువాడును (అనత్ + అరః), మంగళకరములయిన సామ ములు విలసిల్లుటచేత భాసించువాడును, నక్షత్రముల నావరించియున్న ఆకాశమున (శర్వరి) వ్యాపించువాడును, అత్యున్నతమైన వేగమును భావించువాడు నైన (చంద్రు నికి) వానికి నమస్కారము.



వ్యాఖ్య :- గోమూత్రికా చిత్రమును రెండు సమభాగములుగా చేసి తదను సారముగా విన్యాసము చేయుటచేత అర్ధగోమూత్రిక యన్నపేరు అన్వర్థ మగు చున్నది. శ్లోక గోమూత్రికయందు చిత్రించినట్లే ఆకారమును చిత్రింపవలయును. దానిని సరిగా నడిమికి ఖండించి రెండు భాగములు చేయవలయును. శ్లోకము నందలి మొదటి యక్షరమును ఖండనరేఖకు మొదటను, తుదియక్షరమును తుదను వ్రాయవలయును. ఆ పిమ్మట మిగిలిన ప్రథమపాదమును ఊర్ధ్వభాగమునందు ఉచ్చావచక్రమమున వ్రాయవలయును. రెండవపాదము నందలి మొదటి యక్షర మును ఖండనరేఖపై నిల్పి తరువాతి యక్షరములను ఉచ్చావచక్రమములో వ్రాయ వలయును. ఇట్లే ఉత్తరార్ధమును అధోభాగమునందు వ్రాయవలయును. పాదా ద్యక్షరములు పూర్వస్థితములే. అట్లే శ్లోకాంతవర్ణముకూడ పూర్వస్థితమే. ఈ అర్ధగోమూత్రికా శ్లోకమునే గోమూత్రికా క్రమము ననుసరించి పఠించినయెడల శ్లోకాంతర మేర్పడుచున్నది. న వర్ణముతో మొదలుపెట్టి అధోభాగమునను, ఊర్ధ్వ భాగమునను గల అధోవర్ణములను కలుపుకొనుచు రాగా పూర్వార్ధ మేర్పడును. మరల నవర్ణముతోనే మొదలుపెట్టి ఊర్ధ్వాధోభాగములందలి ఊర్ధ్వవర్ణములను కలు

పగా ఉత్తరార్ధ మేర్పడును. ఖండనరేఖమీది వర్ణములు రెండింట సమానముగా వర్తించును.

గోమూత్రికా ధేనుర్యథా—

'మమ స్ఫురతు చిద్గతః సతతచింత్యరక్షామతిః
సమస్త రవిచిత్రిత స్తుతరుచిః స్మరక్షేమకృత్
సమర్ధి రతచింతితః కృతవిచిత్ర రత్యామయో
సమస్కరణ చిహ్నిత స్మితరుచిర్హరః సామరః' 336

అర్థము : గోమూత్రికా ధేనువున కుదాహరణము. చిదాకాశము నారోహించినవాడును. సంతత చింతనీయమైన రక్షణమతి కలవాడును, సర్వసూర్యుల చేతను చిత్రింపబడిన ప్రశస్తప్రకాశము గలవాడును, మన్మథుని క్షేమమును ఖండించినవాడును, అణిమాది సిద్ధులం దాసక్తి గలవారిచేత చింతింపబడినవాడును, రతికి విచిత్రమైన వ్యాధిని కలిగించినవాడును, నమస్కార చిహ్నముగల దరహాసకాంతి గలవాడును, దేవతలతో కూడినవాడు నైన హరుడు నాకు గోచరించునుగాక!

128. చతుర్ణామపి పాదానాం క్రమేణ వ్యుత్క్రమేణ చ
ఇయం గోమూత్రికా ధేను ర్వైపరీత్యవశేన చ.

అర్థము : నాలుగుపాదములకును క్రమముతో, వ్యుత్క్రమముతో, వైపరీత్యముతో ఇది గోమూత్రికా ధేనువు.

వ్యాఖ్య : గోమూత్రికాధేనువునందు గోమూత్రికా లక్షణమును, ధేనులక్షణమును తెలిసియుండును. ఇది పాదగోమూత్రికయు, విపరీత గోమూత్రికయు కూడగును. పాదముల క్రమమును మార్చినప్పటికిని గోమూత్రికా లక్షణము భద్రముగా ప్రస్తమైయుండును. ప్రతిపాదమునందు మ, ర, చి, త; త, చి, ర, మ అన్నవి సమవర్ణములుగా విన్యస్తము లయినవి. పాదము పూర్వార్ధమున విన్యస్తములయిన వర్ణములే ఉత్తరార్ధమున విలోమ క్రమమున విన్యస్తము లయినవి. కావుననే విపరీత గోమూత్రికా లక్షణము చెల్లుచున్నది.

ఇంక ధేనులక్షణము. తెనుగునందున్న గర్భకవిత్వమువంటిదే యిది. ఒక ధేనువు అనేక తర్ణకములను ప్రసవించినట్లు ఒక శ్లోకము అనేక శ్లోకములను ప్రస

వించును. కావుననే దీనికి 'ధేనువు' అన్న పేరు అన్వర్థ మగుచున్నది. పైనున్న విధముగా ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ పాదములుండుట క్రమము. అటుకాక 4, 3, 2, 1 క్రమములో పాదములు నిలిచినయెడల విపరీతక్రమము. క్రమవ్యుత్క్రమమునందు 2 3 4 1 – 3 4 1 2 – 4 1 2 3 అన్న వరుసలో మూడుశ్లోకములు; విపరీత వ్యుత్క్రమమునందు 3 2 1 4 – 2 1 4 3 – 1 4 3 2 అన్న వరుసలో మూడు శ్లోకము లేర్పడును. ఇప్పటికి ఎనిమిది శ్లోకములైనవి. వ్యతికర జన్మముచేత, అనగా నియమరహితముగా పాదములను కలియగలుపుటచే ఇరువది రెండు శ్లోకము లేర్పడును. ఒక శ్లోకము ముప్పది శ్లోకములను ప్రసవించుటచేతనే ఇది ధేనువగుచున్నది అన్నింటి యందును గోమూత్రికాలక్షణము అనులోమక్రమమువను, ప్రతిలోమక్రమమునను కూడ అన్వయించును. కావుననే ఇది గోమూత్రికా ధేనువు.

శతధేనుర్యథా –

'వంద్యా దేవీ పర్వతపుత్రీ నిత్యం

మధుమధుర కమలవదనా పురంధ్ర్యధిదేవతా

దేవైః స్తుత్యా కిన్నరగేయా భక్త్యా

వరచరిత మహిషమథనీ జగత్త్రియనాయికా

సిద్ధైర్ధ్యేయా కేసరియానా కామ్యా

రణచతుర రసికహృదయా త్రిలోచన వల్లభా

ధీరైః పూజ్యా దర్పణపాణి ర్మాన్యం

గుణ నిలయ లటభలలితా సతీషుధురంధరా' 327

అర్థము : శతధేనువున కుదాహరణము. పర్వతపుత్రియు, మధుమధుర పద్మముఖియు, పతివ్రతల కధిదేవతయు, దేవతలచేత స్తుతింపబడునదియు, భక్తితో కిన్నరులచేత గానముచేయబడునదియు, వరముచేత నిరంకుశుడై ప్రవర్తించిన మహిషాసురుని మర్దించినదియు, మూడులోకములకు నాయకురాలును, సిద్ధులచేత ధ్యానింపబడునదియు, సింహవాహనయు, కోరదగినదియు, రణనిపుణులైన రసికులకు హృదయమునందుండునదియు, త్రినేత్రుని ప్రియురాలును, పండితులచేత పూజింపబడునదియు, దర్పణము హస్తమునందు గలదియు, గుణములకు నిలయమై మనోజ్ఞ

మయిన విలాసము గలదియు, సతులయందు మేటియు నైన దేవి నిత్యము నమస్కరింపదగినది.

129. యతి విచ్ఛేదినీ హ్యేషా శ్లోక ధేను రనుత్తమా
ఛందోభేదా చ్ఛతమియం ప్రసూతే శ్లోకతర్ణకాన్॥

అర్థము : యతివిచ్ఛేదినియైన యీ శ్లోకధేనువు పరమోత్తమమైనది. ఇది ఛందోభేదమువల్ల నంద శ్లోకవత్సములను ప్రసవించును.

వ్యాఖ్య : గోమూత్రికాధేను ప్రసంగమునుబట్టి గ్రంథకర్త ధేనుస్వరూపమును ప్రదర్శించుటకు అవకాశమును కలిగించుకొనుచున్నాడు. శతధేనువునందు గోమూత్రికా లక్షణము లేదు. అయినప్పటికిని చిత్రమునందు చేరుటకు యోగ్యమయిన దగుటచేతనే, యిది యిక్కడ నిరూపిత మగుచున్నది.

ఉదాహృత శ్లోకమునందు ప్రతిపాదము ఇరువది తొమ్మిదక్షరముల ప్రమాణము గలది. ఇది ఉక్తి నుండి ఉత్కృతి వరకు నున్న యిరువదియారు ఛందోభేదములలో చేరదు. ఇరువదియారక్షరములకంటె పాదప్రమాణ మెక్కువయిన యెడల ఉద్ధరమాలావృత్తమని యందురు. ఇది సామూహిక నామము. ఉదాహరణము ఉద్ధరమాలా వృత్తము. ప్రతిపాదమున ఏడుచోట్ల యతియున్నది. యతి యనగా విరతి యని మాత్రమే యర్థము. తెలుగులో నున్నట్లు సంస్కృతమున అక్షరమైత్రి యుండవలసిన అవసరము లేదు. సంస్కృతమునందు ప్రాసనియమము లేదన్నది స్మరింపదగినది.

యతిస్థానములందు తెగగొట్టి నాలుగు పాదములతోను వేర్వేరు వృత్తములను నిర్మింపవచ్చును. అట్లుచేయగా ఏడు వృత్తము లేర్పడును. వంద్యా । దేవై । ద్ధైః । ధీరైః॥ ఇది మొదటి వృత్తము. దేవీ । స్తుత్యా । ధ్యేయా । పూజ్యా॥ ఇది రెండవ వృత్తము. (3) పర్వతపుత్రీ । కిన్నరగేయా । కేసరియానా । దర్పణపాణిః॥ (4) నిత్యం । భక్త్యా । కామ్యా । నూనమ్॥ (5) మధుమధుర । వరచరిత । రణచతుర । గుణవిలయ॥ (6) కమలవదనా । మహిషమథనీ । రసికహృదయా । లటభలలితా॥ (7) పురంధ్ర్యధిదేవతా । జగత్త్రితయనాయికా । త్రిలోచన వల్లభా । సతీషు ధరంధరా॥ మొదటి రెండును, నాలుగవ శ్లోకమును అత్యుక్తాఛ్ఛందమునకు చెందినవి. పేరు మధ్యమావృత్తము. మూడవ శ్లోకము సుప్రతిష్ఠాఛందమునకు

చెందినది; సుందరీవృత్తము. ఐదవది కూడ సుప్రతిష్ఠయే. ఆరవది గాయత్రీ ఛందము. ఏడవది ఉష్ణిక్ఛందము.

ఇట్లే రెండేసి యతులను కలుపగా ఇరువదియొక్క వృత్తము లేర్పడును. మూడేసి యతులను కలుపగా ముప్పదియైదు; నాలుగేసి యతులను కలుపగా ముప్పదియైదు; ఐదేసి యతులను కలుపగా ఇరువది యొక్కటి; ఆరేసి యతులను కలుపగా ఏడు - (7+21+35+35+21+7=126) మొత్తము నూట యిరువదియారు భేదములు కలుగును. కావుననే యిది శతధేనువుగా పేర్కొనబడినది.

సహస్రధేను ర్యథా-

'నఖ ముఖ పాణి కంఠ చికురై ర్గతిభిః సహసా స్మితేన లలితేసుదృశా
మణి శశి పద్మకంబు చమరాః కరిణః సుతనోః సుధాచహసితాహరిణాః
ఫణిగణ సిద్ధసాధ్యదయితా న సమాః సకలా స్త్వయా చ ఖభువశ్చలితాః
తవ బల దర్పరూప విజితా నితరాం విబుధాశ్చిరాయ చతురై శ్చరితైః

అర్థము : సహస్రధేనువున కుదాహరణము. ఓ లలితా! నీ నఖములచేత మణులు, ముఖముచేత చంద్రుడు, చేతులచేత పద్మములు, కంఠముచేత శంఖము, కురులచేత చమరములు, నడకలచేత ఏనుగులు, ఆకస్మికస్మితముచేత అమృతము, చక్కని చూపులచేత హరిణములు పరిహసింపబడినవి. నాగ సిద్ధ సాధ్యగణములకు చెందిన యువతు లెవ్వరును నీకు సాటికారు. నీ చేతనే గ్రహతారకాదులు చలించు చున్నవి. చాలకాలమునుండి నీ బలదర్పరూప విజితులైన విబుధులు నీ చతురచరితలచేత పూర్తిగా ఓడిపోయిరి.

130. పదవిచ్ఛేదినీ హ్యేషా శ్లోకధేను రనుత్తమా
ఛందోభేదా ద్దశ శతం ప్రసూతే శ్లోకతర్ణకాన్॥

అర్థము : పదవిచ్ఛేదినియైన యీ శ్లోకధేనువు పరమోత్తమము. ఇది ఛందో భేదమువల్ల వెయ్యి శ్లోకవత్సములను ప్రసవించును.

వ్యాఖ్య : సహస్రధేనువువల్ల శ్లోకాంతరములు వెయ్యి పుట్టును. ఉదాహరణము ఇరువదియారక్షరములు పాదప్రమాణము గల ఉత్కృతిచ్ఛందము. ప్రతి

పాదమునందు ఆరు పదములు గలవు. మొదటి పదము (సమాసము) వలన నఖముఖపాణి శంకచికురైః । మణిశశిపద్మ కంబుచమరాః । ఫణిగణ సిద్ధసాధ్య దయితాః । తవ బలదర్పరూప విజితాః ॥ ఇది త్రిష్టుప్ఛందము. ఒక్కొక్క పదము చొప్పున విడదీయగా ఆరు వృత్తములు పుట్టును; రెండేసి పదములు కలుపగా ముప్పది; మూడేసి కలుపగా నూటయిరువది; నాలుగేసి కలుపగా రెండువందల నలువది; ఐదేసి కలుపగా నూటయెనుబది; ఆరేసి కలుపగా ఆరు - మొత్తము ఐదువందల ఎనుబదిరెండు వృత్తము లగును. ఇందలి మొదటి పదము సమాసము; ఐదు పదములు గలవు. ఇట్లు లెక్కించినపుడు ప్రతిపాదమునందు పదిపదము లున్నవన వలయును. ఈ లెక్కనుబట్టి పదివందల యిరువదిమూడు వృత్తములు పుట్టును అందు కొన్ని అర్థవంతములు కావు. ఉదాహరణమునకు - నఖ, మణి, ఫణి, తవ॥ అన్నది. ఇందలి ప్రతిపదము సమాసాంత్యపదముతో కలసి అర్థవత్పద్యముల నేర్పరుచును. ఉదాహరణమునకు - నఖ చికురైః, మణిచమరాః, ఫణిదయితాః, తవ విజితాః॥ ముఖచికురైః, శశిచమరాః గణదయితాః, బలవిజితాః॥ ఇట్లే తరువాతి పదములతోను కలియుటచేత, మరిరెండు వృత్తములు పుట్టును. ఇవి అన్నియు సుప్రతిష్ఠాచ్ఛందమునకు చెందినవి. రెండేసి పదములను సమాసాంత్య పదముతో కలుపుటచేత నఖ ముఖ చికురైః । మణి శశి చమరాః । ఫణి గణ దయితాః । తవ బల విజితాః ॥ మున్నగు విధముగా పెక్కు వృత్తము లేర్పడును ఇవి ఉష్ణిక్ఛందమునకు చెందినవి. అట్లే మూడేసి పదములను సమాసాంత్యముతో కలుపగా బృహతీ ఛందమునకు చెందిన వృత్తము లేర్పడును. సమాసాంత్య పదము నొక్కదానినే గ్రహింపగా - చికురైః, చమరాః, దయితాః, విజితాః॥ అవి మధ్యాచ్ఛందమునకు చెందిన వృత్తమేర్పడును. ఇట్లేర్పడిన ఈ వృత్తముల నన్నింటిని పూర్వమేర్పడిన వృత్తములతో చేర్పగా మరల భిన్నభిన్న వృత్తము లేర్పడును. అర్థరహితములైనవానిని (క్రియాహీనత్వముచేతను, కారకహీనత్వముచేతను) తొలగింపగా ఉదాహృత శ్లోకమునుండి సహస్ర శ్లోక పద్యములు పుట్టుచున్నవని గమనింపగలము. (చ, న - అన్న అవ్యయములు ద్వితీయ తృతీయపాదములం దున్నవి. వాని కిచ్చట ప్రత్యేక పదస్థితిలేదు, పూర్వపదావయవములుగానే ప్రవర్తించును).

అయుతధేనుర్యథా –

'క్రియే జయసి జృంభసే సృజసి జాయసే త్రాయసే
స్తుషే మిషసి మృష్యసే హృషసి పీయసే ప్రీయసే

స్తుషే మృడసి హాోడసే కుడసి గల్భసే క్లీబసే
హ్నుషే హారసి రజ్యసే రజసి రాజసే భ్రాజసే' 329

అర్థము : అయుత ధేనువున కుదాహరణము. ఓ క్రియా! జయము, జృంభణ, సృజన, జన్మ, త్రాసము, స్తోత్రము, స్పర్ధ, ఈర్ష్య, హర్షము, హాసము, ప్రీతి, ప్రశంస, సుఖము, అనాదృతి, సంహారము, ప్రగల్భత, క్లీబత, దాపరికము, హారణము, రంజనము, రంజకత, శోభ, ప్రకాశము - అనువానిని కలిగియున్నావు.

131. ఏషా తు పదవిచ్ఛేదిన్యేవ ధేనుః క్రియాపదైః
సంబోధనాగ్రైర్దృష్టాస్మాభిః శ్లోకాయుత ప్రసూః॥

అర్థము : సంబోధనముతో కూడియున్న క్రియాపదములతోడి యీ ధేనువు కూడ పదవిచ్ఛేదినియై పదివేల శ్లోకములను ప్రసవించునని మేము చూచితిమి.

వ్యాఖ్య : ఒక శ్లోకమే పదివేల శ్లోకములకు జన్మస్థానమైన యెడల దానిని అయుతధేను వని యందురు. ఉదాహరణమందు 'క్రియే' అనునది. యొక్కటియే సంబోధనాంతము; తక్కిన పదములన్నియు మధ్యమ పురుషైక వచనక్రియలు. ఒక్కొక్క పదము చొప్పున - క్రియే, స్తుషే, స్తుషే, హ్నుషే॥ అని యనగా అత్యుక్తా ఛంద మగును. జయసి, మిషసి, మృడసి, హారసి॥ అని యనగా మధ్యా ఛంద మగును. జృంభసే మున్నగు పదము నొక్కొకదానిని గ్రహించుటచేత మధ్యాఛందమే యేర్పడును. క్రియే జయసి, స్తుషే మిషసి, స్తుషే మృడసి, హ్నుషే హారసి॥ అని రెండేసి పదములచేత సుప్రతిష్ఠ పుట్టును. రెండేసి క్రియలను కలుపుటచేత గాయత్రీ ఛందస్సు కలుగును. మొదటి మూడు పదములను కలుపగా అనుష్టుప్పు, తరువాతి మూడింటిని కలుపగా బృహతి కలుగును. ఉదాహృత వృత్తము అత్యష్టిచ్ఛందమునకు చెందిన పృథ్వీ వృత్తము. ఇట్లు ఆయా పదము లను సంఖ్యానుగుణముగా కలుపగా ఆరుపదములు పాదప్రమాణముగా గల యీ వృత్తము (వెనుక చెప్పినట్లు) అయిమువందల యెనుబదిరెండు వృత్తము లగును. ఇట్లేర్పడిన వృత్తములను విలోమక్రమమున, వ్యుత్క్రమమున, విలోమవ్యుత్క్రమమున వ్రాయగా పదివేల శ్లోకములు పుట్టును. కావుననే యిది అయుతధేను వగుచున్నది

లక్షధేను ర్యథా -

'దుర్గే భద్రే సుభద్రేఽదతి సురభి దితే సైంహికే గౌరి పద్మే
నిత్యే హృద్యే వరేణ్యే కలి కమలి కలే కాలికే చండి చండే
ధన్యే పుణ్యే శరణ్యే శచి శబరి శివే భైరవే రాజ్ఞి సంధ్యే
ఛాయే మాయే మనోజ్ఞేఽవని జనని జయే మంగలే దేహి శంనః॥

అర్థము : (ఇందన్నియు భవాని నామములు సంబోధనాంతములుగా ప్రయుక్తము లయినవి.) దుర్గా! భద్రా!.... మాకు శాంతి నిమ్ము.

132. సంబోధనైరియం ధేనుః క్లప్తా సైకక్రియాపదైః
లక్షత్రియం సహస్రాణి షష్టిం శ్లోకాన్ ప్రసూయతే॥

అర్థము : ఒకే క్రియాపదముతో కూడి సంబోధనాంత పదములతో నున్న యీ ధేనువు మూడు లక్షల అరువది వేల శ్లోకములను ప్రసవించును.

వ్యాఖ్య : దేహి, శం, నః - అన్న మూడు పదములు తప్ప, మిగిలిన పదము లన్నియు సంబోధనాంతములు; అన్నియు దుర్గాదేవి నామధేయములే. ఉదాహరణము కృతిచ్ఛందమునకు చెందిన స్రగ్ధరావృత్తము. ఇందు ప్రతిపాదమునకు తొమ్మిది పదము లుండుటవల్ల $[2^9(-1)]$ ఐదువందల పదునొక్క వృత్తము లేర్పడును. ఆయా పదములను సంఖ్యానుగుణముగా కలుపగా - దుర్గే, నిత్యే, ధన్యే, ఛాయే॥ అని ఒక వృత్తము - భద్రే, హృద్యే, పుణ్యే, మాయే॥ అని మరొకటి - సుభద్రే, వరేణ్యే, శరణ్యే, మనోజ్ఞే॥ అని యింకొకటి; ఈ విధముగా తొమ్మిది వృత్తములు వచ్చును. ఇట్లే రెండేసి మూడేసి పదములచొప్పున ఆరుపదముల వరకు కలుపుకొనుచు రాగా సహస్రాధికముగా శ్లోకములు సంభవించును వానిని మరల వ్యుత్క్రమమున, విలోమక్రమమున, విలోమవ్యుత్క్రమమున వ్రాయగా మూడు లక్షల అరువదివేల శ్లోకములు పుట్టును. దీనిని లక్షధేను వని యనుట ఉపలక్షణము మాత్రమే.

133. ఏషాంత్యపదభేదేన సంభ్రమాద ద్విరుక్తిభిః
యావద్బోధం పునః సూతే ప్రయుతం శ్లోకతర్ణకాన్॥

అర్థము : ఇది (ఉదాహృత శ్లోకము) చివరిపదమును మార్చుటచేతను, సంభ్రమాదులవల్ల ద్విరుక్తిని ప్రయోగించుటచేతను, అర్థవంతము లగునట్లుగా పది లక్షల శ్లోకములను మరల ప్రసవించును. దీనిని ప్రయుతధేను వని పరిగణింప వచ్చును.

కోటిధేను ర్యథా-

'స్థూలం దత్సే సూక్ష్మం ధత్సే భువి భవసి
నభసి రమసే రమే దివి మోదసే
చింత్సే బాఢం భింత్సే గాఢం రుషి మిషసి
ధనుషి మనుషే జయే పురి జృంభసే
స్వల్పం శేషే కల్పం ప్రేషేఽచితి చరసి
యశసి యతసే చలే యుధి గల్భసే
బ్రూషే వామం సూషే కామం హృది విశసి
వచసి నచసే రుచే దృశి దీవ్యసే' 331

అర్థము : కోటిధేనువున కుదాహరణము. స్థూలము నిచ్చుచున్నావు. సూక్ష్మమును ధరించుచున్నావు. భూమియందు పుట్టుచున్నావు. ఆకాశమునందు క్రీడించుచున్నావు. ఓ రమా! స్వర్గమునందు సంతోషించుచున్నావు. మిక్కిలిగా ఛేదించుచున్నావు. గాఢముగా భేదించుచున్నావు. రోషమునందు పొంగుచున్నావు. ధనుస్సునందు విశ్వసించుచున్నావు, జయమునందు పురమున విజృంభించుచున్నావు. శేషమునందు స్వల్పముగా దుఃఖమునందు అధికముగా అజ్ఞానమునందు చరించుచున్నావు. కీర్తియందు యత్నించుచున్నావు. చలించు సంగ్రామమందు నేర్పు చూపుచున్నావు. వ్యతిరిక్తము పలుకుచున్నావు; కోరిక పుట్టించుచున్నావు. హృదయమందు ప్రవేశించుచున్నావు. ఓ వచసా! వచస్సునందు, కాంతిగల దృష్టియందు ప్రకాశించుచున్నావు

134. సంబోధనై ర్ద్వితీయాంతైః సప్తమ్యంతైః క్రియాపదైః
శ్లోకకోటీరియం త్రిసః సార్థా ధేనుః ప్రసూయతే॥

అర్థము : సంబోధనలచేతను, ద్వితీయాంతములచేతను, సప్తమ్యంతముల చేతను, క్రియాపదములచేతను ఈ ధేనువు మూడున్నర కోట్ల శ్లోకములను ప్రసవించును.

వ్యాఖ్య : ఉదాహరణ పద్యము ఇరువది యెనిమిదక్షరములు పాదప్రమాణముగల ఉద్ధరమాలా వృత్తము. ఇందు సంబోధనములు, ద్వితీయాంతములు, సప్తమ్యంతములు, క్రియాపదములు కలిసి నలువదియైదు కలవు కొన్ని క్రియాపదములను, సప్తమ్యంతములను గూడ సంబుద్ధులుగా గ్రహింపవచ్చును. అట్లు అర్థభేదముచేతను కారకభేదముచేతను పదములు బహుళప్రయోజనవంతములై ప్రవర్తించును. ఇట్లగుటచేత పైనున్న యుదాహరణ శ్లోకము మూడున్నరకోట్ల శ్లోకముల నుత్పన్నము చేయును. కోటి ధేను యనుట ఉపలక్షణము

135. యదా తు సంభ్రమాదిభ్యో భవంత్యస్యా ద్విరుక్తయః
స్థూలాదినా తదా చైషా దశకోటీః ప్రసూయతే॥

అర్థము : సంభ్రమాదులచేత దీనికి ద్విరుక్తులు సంభవించును. అప్పుడు స్థూలాదులచేత పదికోట్ల శ్లోకములను ప్రసవించును. దీనిని దశకోటిధేను యని పరిగణింపవచ్చును.

కామధేను ర్యథా—

"యా గీః శీః శ్రీ ర్ధీః స్త్రీ హ్రీ ర్భీ ర్జూ ర్మూ స్తూ సూర్ధూః పూర్నూః
స్రుక్స్రగ్భ్యుగ్రుక్ శుక్కృట్ ద్విట్త్యుత్కృత్ చిద్వాన్మద్గి గ్ద్యాః
ఋగ్దృగ్వామామృత్కృద్భా మాముత్ క్షుత్కాఽమాద్వా ర్ద్వార్గాః
సామాసాసా యామా మేహేభా మేనామాతే త్వం మే నోః॥ 332

యానం యాతీతి యా, కాచిచ్చ యా. గిరణం గిరతీతి వాక్చ గీః. శిరణం శీః శృణాతీతి శీః. శ్రయతీతి శోభా లక్ష్మీశ్చ శ్రీః. ధ్యానం ధ్యాయతీతి బుద్ధి ర్ధీః. స్త్రైవ స్తృణాతి మంత్రాక్షరం స్త్రీ. హ్రీంచ్ఛతీతి మాయా లజ్జా చ హ్రీః. బిభేతీతి భయకామో భయం చ భీః. జ్వరో గతి ర్జరా చ జూః. మూర్ఛా మోహః సమూర్ఛా

యతో ర్బంధనం చ యూః. త్వరా హింసా త్వరతే చ తూః. సూయతే స్రవనం సుష్టు ఉశ్చసూః. అగ్రే భాగే భారం ధురం వహతీతి ధూః. పురీ పాలనం చ పూరణం చ పూః భూమి ర్భవనం లోకశ్చ భూః. యజ్ఞపాత్రం స్రవతీతి స్రవణం స్రుక్. పుష్పమాలా వంశ్చ సృజ్యత ఇతి స్రక్. యోగః సమాధిః సమశ్చ యుక్. భోజనం పాలనం కౌటిల్యం చ భుక్. రోగో దీప్తి ర్భంగశ్చ రుక్. శోకః శుచిత్వం దీప్తిశ్చ శుక్. అభిలాషః పిపాసా హింసాచ తృట్. ద్వేషః శత్రుబల మభిలాషశ్చ ద్విట్. శుద్ధం మిశ్రణ మమిశ్రణంచ యుత్. క్రోధః క్రుధ్యతీతి రుద్రశక్తిశ్చ క్రుత్. చేతనా చినోతి చయనంచ చిత్. జ్ఞానం సత్తా విభవలాభశ్చ విత్. మోక్షో మోహో ముంచతీతి ముక్. ఆశా అతిసర్గ ఉపదేశశ్చ దిక్. క్రీడా విజిగీషా వ్యవహారశ్చ ద్యూః. శ్రుతివాక్యం వివేచనం చ హింసా చ ఋక్. దృష్టిర్జ్ఞానం పశ్యతీతి దృక్. గతి ర్గంధనం వికల్పశ్చ వా. లక్ష్మీర్నామ శబ్దావయవశ్చ మా. మృత్తికా మరణం మృద్నాతీతి మృత్. కృంతతి కరోతి కరణం చ కృత్. దీప్తి ర్భానం భాతీతి భా. శబ్దః శబ్దావయవశ్చ ప్రతిషేధశ్చ మా. హర్షో మోహ ఆమోదశ్చ ముత్. బుభుక్షా క్షుత్ క్షోదశ్చ క్షుత్. ప్రశ్నః సుఖం కానవం చ కా. అమతీత్యమా పీడార్థేఽలక్ష్మీశబ్దావయవశ్చ అమా. ద్వారం ద్వార్థ ఉపాయశ్చ ద్వాః. స్వర్గ ఆకాశో దేవనం చ ద్యౌః. వాగ్భూమి ర్ధేనుశ్చ గౌః. సహ ఏన అకారేణ విష్ణునా వర్తతే ఇతి సా లక్ష్మీః. మా మానం. తదో రూపం చ సా ప్రతిదానం శబ్దావయవశ్చ సర్వనామ చ సా. ఇష్టా అయత ఇతి శబ్దావయవశ్చ యా. చంద్రకలా మహాదర్ధశ్చ మా. లక్ష్మీసంబోధనా చతుర్థ్యంతం షష్ఠ్యంతం చ మే. ధారణం పోషణం శబ్దావయవశ్చ వే. ధాత్రీ పోషయిత్రీ శబ్దావయవశ్చ ధా. శబ్దావయవోఽస్మదర్థో లక్ష్మీ సంబోధనం చ మే. ప్రతిషేధః పురుషవాచీ శబ్దావయవశ్చ నా. మిమేతే మాతేతి శబ్దావయ

వశ్చ మా. తదర్థో యుష్మదర్థశ్చ లక్ష్మీసంబోధనం చ తే. యుష్మదర్థో భావప్రత్యయః శబ్దావయవశ్చ త్వమ్. శబ్దావయవాస్మదర్థౌ చ మే. జలయానం చ విద్యతే ఔర్ద్వివచనం యస్యాం సా అద్వితీయే త్యర్థః శబ్దావయవశ్చ నౌః.

అర్థము : యా - ప్రయాణము, వాహనము, పోవునది (వాడు), ఉక్తా నౌకతె. గీః - వచించుట, వక్త, వక్త్రి, వాక్కు. శీః - శరణము, శరణార్థి(ని). శ్రీః - ఆశ్రయించువాడు(నది), శోభ, లక్ష్మి. ధీః - ధ్యానము, ధ్యానించువాడు (నది), బుద్ధి. స్త్రీ - మహిళ, విస్తరించునది, మంత్రాక్షరము. హీః - కోరువాడు (నది), మాయ, లజ్జ. భీః - భయపడువాడు(నది), భయకాముము, భయము. జూః - జ్వరము, గతి, ముసలితనము. మూః - మూర్ఛ, మోహము, సమున్నతి, బంధనము. తూః - త్వర, హింస, వేగరి. సూః - సవిత్రి, యజ్ఞము, సక్రియైన ఉకారము. ధూః - అగ్రభాగము, భారవాహకుడు. పూః - పురము, పాలన, పూరణ. భూః - భూమి, పుట్టుట, లోకము. స్రుక్ - యజ్ఞపాత్ర, ప్రవహించునది, ప్రవహించుట స్రక్ - పూలమాల, వరుస. సృజింపబడునది. యుక్ - యోగము, సమాధి, సమము. భుక్ - భోజనము, పాలనము, వక్రత. రుక్ - రోగము, దీప్తి, భంగము. శుక్ - శోకము, శుభ్రత, దీప్తి. తృట్ - కోరిక, దప్పిక, హింస. ద్విట్ - ద్వేషము, శత్రుబలము, అభిలాష. యుత్ - శుద్ధము, మిశ్రణము, అమిశ్రణము. క్రుత్ - కోపము, కోపి, రుద్రశక్తి. చిత్ - చైతన్యము, సంగ్రహించేడివాడు(ది), చయము. విత్ - జ్ఞానము, ఉనికి, వైభవలాభము. ముక్ - మోక్షము, మోహము, విడుచువాడు(నది). దిక్ - ఆశ, అతిసర్గము, ఉపదేశము. ద్యూః - క్రీడ, విజయకాంక్ష, వ్యవహారము. ఋక్ - వేదవాక్యము, రవేచన, హింస. దృక్ - దృష్టి, జ్ఞానము, చూచునది(వాడు). వా - గతి, వాసింపజేయుట, వికల్పము. మా - లక్ష్మి, మానము, శబ్దావయవము. మృత్ - మట్టి, చావు, మర్దించెడి(ది)వాడు. కృత్ - ఖండించెడి(ది)వాడు, చేయు(నది)వాడు, చేయుట. భా - కాంతి, అనిపించుట, ప్రకాశించు(నది)వాడు. మా - శబ్దము, శబ్దావయవము, ప్రతిషేధము. ముత్ - హర్షము, మోదము, ఆమోదము. క్షుత్ - భోజనేచ్ఛ, ఆకలి అయినవు. కా - ప్రశ్న, సుఖము, అడవి. అమా - ఎదురువెళ్ళు(నది)వాడు, పీడ, అలక్ష్మిశబ్దావయవము. ద్వాః - ద్వారము, ద్వారస్థుడు, ఉపాయము. ద్యౌః - స్వర్గము, ఆకాశము, ప్రకాశించుట.

గౌః – వాక్కు, భూమి, గోవు. సా - విష్ణువు(అ)తో కలిసి వర్తించువది, లక్ష్మి. మా – మానము. సా – తచ్ఛబ్దముయొక్క స్త్రీలింగరూపము(ఆమె). సా - ప్రతి దానము, శబ్దావయవము, సర్వనామము. యా – యజనముచేయబడినది, పొందునది (వాడు), శబ్దావయవము. మా - చంద్రకళ, మహదర్థకము. మే – లక్ష్మిసంబోధన, అస్మచ్ఛబ్దముయొక్క చతుర్థీరూపము (నాకొఱకు), షష్ఠీరూపము (నాయొక్క) వే – ధారణ, పోషణ, శబ్దావయవము. ధా – ధాత్రి, పోషించునది, శబ్దావయవము. మే – శబ్దావయవము, అస్మదర్థకము, లక్ష్మిసంబోధన. నా – ప్రతిషేధము, వరుడు, శబ్దావయవము. మా – కొలుచువాడు, మితియొనర్చువాడు, శబ్దావయవము. తే – వారు, నీకొఱకు, నీయొక్క, లక్ష్మిసంబోధన. త్వం – నీవు, భావప్రత్యయము, శబ్దావయవము. మే – శబ్దావయవము, నాకొఱకు, నాయొక్క నౌః – నావ, ద్వివచనము లేనిది (న+ఔః = అద్వితీయము), శబ్దావయవము.

వ్యాఖ్య : ఉదాహరణ శ్లోకమునందలి ప్రతిపదమునకున్న నానార్థములను భోజదేవుడే అన్వయక్రమమున తెలిపియున్నాడు. భిన్నార్థకములయిన పదముల యోగముచేత భిన్నభిన్నవృత్తము లసంఖ్యాకముగా ఉత్పన్నము లగును. కావుననే దీనికి కామధేను వన్నపేరు అన్వర్థ మగుచున్నది.

136. పదగ్రాహాద్యథాకామం కామధేను రియం తు నః
పరార్ధానాం పరార్ధాని ప్రసూతే శ్లోకతర్ణకాన్.

137. ఏకాక్షరాది చ్ఛందోభి ర్గతిబంధాది భేదతః
ఉక్తానుక్తాని చిత్రాణి సర్వాణ్యేషా ప్రసూయతే.

అర్థము : కోరికకు తగినట్లుగా పదములను గ్రహించుటవల్ల ఈ కామధేనువు పరార్ధములకు పరార్ధములుగా శ్లోకవత్సములను మన కిచ్చును. ఏకాక్షరాది చ్ఛందోభేదములచేత, గతి బంధాదిభేదములవల్ల ఉక్తములును, అనుక్తములును అయిన సర్వచిత్రములను ఇది ప్రసవించును.

138. సకృదుచ్చారణే చాస్యా గచ్ఛత్యేకా వినాడికా
తత్ షష్ట్యా నాడికా తాభిః షష్ట్యాహోరాత్ర మృచ్ఛతి.

అర్థము : ఒక్కమా రుచ్చరించిన ఒక వినాడిక (గడియలో అరువదవ

వంతు) నడచును. అటువంటి అరువదింటిచేత నాడిక (గడియ, అటువంటి అరువ దింటిచేత అహోరాత్రము (24 గంటలు) గడచును.

139. ప్రణవాది నమోఽంతాని పదాన్యస్యా జపంతి యే
సర్వ భాషాసు వాక్తేషా మవిచ్ఛిన్నా ప్రవర్తతే.

140. సిద్ధై ర్మంత్రపదైః సేయం శాస్త్రాణ్యాలోచ్య నిర్మితా
జపతాం జుహ్వతాం దేవీ సర్వాన్ కామాన్ ప్రయచ్ఛతి.

అర్థము : ఓం కారముతో మొదలుపెట్టి నమః శబ్దముతో ముగించుచు ఇందలి పదములను జపించువారికి సర్వభాషలందును వాక్కు అవిచ్ఛిన్నముగా ప్రవ ర్తించును. సిద్ధములయిన మంత్రపదములచేత శాస్త్రాలోచన పురస్సరముగా ఇది (ధేనువు) నిర్మింపబడినది. జపింపుడు; హవనముచేయుడు; దేవి (సరస్వతి) సర్వ వాంఛలను ప్రసాదించును.

141. స్థితే నాగంతుకం హన్యా దీప్సితేన విభాజయేత్
తద్భేదా స్తే భవం త్యేవ మన్యేష్వపి హి యోజయేత్.

అర్థము : స్థితముచేత ఆగంతుకమును గుణింపవలయును; ఆ పిమ్మట ఈప్సితముచేత విభజింపవలయును. ఆ వచ్చిన సంఖ్య దానిభేదములను తెల్పును. ఇతరములందు పైతము దీనినే అన్వయింపవలయును.

వ్యాఖ్య : ధేను కల్పనము భోజరాజీయము. కావుననే తద్విశిష్టతను స్వయ ముగా గ్రంథకర్తయే చెప్పుచున్నాడు. శాస్త్రములను సమీక్షించి సిద్ధమంత్రపదము లతో వీనిని సంధానించినట్లు చెప్పుటచేత, ధేనుశ్లోకములందు గ్రంథకర్త కున్న ఆసక్తికూడ ఆవిష్కృత మగుచున్నది. శతధేనువు, సహస్రధేనువు మొదలయిన వానికి తత్సంఖ్యా సాధనోపాయమును తెలుపలేదు. కామధేనువుకడ నిచ్చట దానిని వెల్లడించుచున్నాడు. ఇదియే తక్కినవానియెడల పైత మనుసరణీయము.

స్థిత మనగా ప్రతిలోమ మని యర్థము. ఆగంతుక మనగా క్రమ విన్యస్త మని యర్థము, ప్రతిలోమము ననులోమముచేత హెచ్చవేయవలయును. అట్లు వచ్చిన మొత్తమును ఈప్సితముచేత భాగింపవలయును. ఈప్సిత మని యనగా

ప్రతిలోమ క్రమఫలము. ఇట్లు చేయగా ఏర్పడిన సంఖ్య ప్రసూత శర్గకసంఖ్యను తెలుపును.

142. దుష్కరత్వాత్కఠోరత్వాద్దుర్బోధత్వాద్వినావధేః
దిఙ్మాత్రం దర్శితం చిత్రే శేషమూహ్యం మహాత్మభిః.

అర్థము : దుష్కరత్వమువల్లను, కఠోరత్వమువల్లను, దుర్బోధత్వము వల్లను, అవధి లేకపోవుటవల్లను చిత్రమునందు దిఙ్మాత్రము (అల్పము)గానే ప్రదర్శింపబడినది. మిగిలిన వానిని మహాత్ము లూహించుకొనవలయును

వ్యాఖ్య : చిత్రకవిత్వమునందలి ప్రయోజనమునే కాక, పరిశ్రమనుకూడ భోజదేవుడు బాగుగనే గుర్తించెను. కావుననే చిత్రాలంకారమునందు కొన్ని భేదములను మాత్రమే తెలిపెను. అట్లని తక్కినవానియందు తనకు విముఖత్వములేదు. కంకణబంధము, ఖడ్గబంధము, మణిహారబంధము మొదలయినవానిని, గర్భకవితా విశేషములను భోజదేవుడు మహాత్ములకై విడిచిపెట్టెను; అనగా తద్వేత్తలగువారు వానియందు పరిశ్రమించి, సరస్వతి నారాధింపవలయు ననియే తన సంకల్పము.

వాకోవాక్యాలంకారము

143. ఉక్తిప్రత్యుక్తిమద్వాక్యం వాకోవాక్యం విదుర్బుధాః
ద్వయోర్బహూనాం వాక్యోక్తి స్తదిచ్ఛంతి బహూనామపి సంగమే.

అర్థము : పండితులు ఉక్తిప్రత్యుక్తులుగల వాక్యమును వాకోవాక్యమని యందురు. పెక్కుర సమావేశమునందుకూడ ఇద్దరు వక్తల వాకోవాక్యమును పండితు లభిలషింతురు.

144. ఋజూక్తిరథ వక్రోక్తి ర్వైయాత్యోక్తి స్తథైవ చ
గూఢప్రశ్నోత్తరోక్తీ చ చిత్రోక్తిశ్చేతి తద్భిదా.

అర్థము : 1. ఋజూక్తి 2. వక్రోక్తి 3. వైయాత్యోక్తి 4. గూఢోక్తి 5. ప్రశ్నోత్తరోక్తి 6. చిత్రోక్తి - అను వాకోవాక్యము ఆరు భేదములను కలిగి యున్నది.

వ్యాఖ్య : శబ్దాలంకారము లిరువది నాలుగింటిలో పదునేడవది వాకో వాక్యము. ఇందు ఋజూక్తి మొదలయిన విధముగా ఆరు భేదములు కలవు. ఒక్కొక్క భేదమునందును ప్రభేదములు గలవు. వానిని వరుసగా సోదాహరణముగా గ్రంథకర్త నిరూపించుచున్నాడు.

[ఋజూక్తి]

తాసు ఋజూక్తి ర్ద్విధా గ్రామ్యోపనాగరికా చ. గ్రామ్యా యథా -

'జంతీ మణురుంధుం రుచు కుహలుతుండ
ఉష్ణ ఉణ్హో విహాంసణ హాోమి
మహాోమి భారుంచులే మేల్లాసత్తో
వికిణకు ఉవాణఉ ఉజ్జు అక్షు కహాహి'

'వాణఉ ఉజ్జు మాణిగహిల్ల ఉఅణ్ణవి
కోమహ్లాణ ఉ వారిజ్జంతు ణ్ణట్టాణి
కరణి వలివం ఉఉ చ వక్కస మచ్చలు
అహిముహాం హి తరుణిహిం అలచ్ఛాసణి దుక్కమ్'

సేయ ముభయత్రోఽపి ఋజునైవ మార్గేణోక్తి ప్రత్యుక్త్యో: సమా ప్రవృత్తి రితీయం ఋజూక్తి ర్నామ వాకోవాక్యమ్.

అర్థము : వానియందు ఋజూక్తి గ్రామ్య యని ఉపనాగరిక యని రెండు విధములు. గ్రామ్య కుదాహరణ మిది. ఉభయవిధముల ఋజుమార్గముననే ఉక్తి ప్రత్యుక్తులకు సమమయిన ప్రవృత్తి యున్నది. కావున, ఇది ఋజూక్తి యనెడి వాకోవాక్యము

సైవోపనాగరికా యథా-

బాలే! నాథ! విముంచ మానిని రుషం, రోషాన్మయా కిం కృతం?
ఖేదోఽస్మాసు, న మేఽపరాధ్యతి భవాన్, సర్వేఽపరాధా మయి

తత్కిం రోదిషి గద్గదేన వచసా! కస్యాగ్రతో రుద్యతే!
నన్వేతన్మమ, కా తవాస్మి! దయితా, నాస్మీత్యతో రుద్యతే. 335

సేయ మేకతః కాక్వా కుటిలేతి వివ మేయమృజూక్తి ర్నామ వాకోవాక్యమ్.

అర్థము : అదే (ఋజూక్తియే) యైన ఉపనాగరికకు ఉదాహరణము - 'బాలా!' 'నాథా!' 'మానినీ! రోషము విడిచి పెట్టుము'. 'రోషమువల్ల నేమయ్యెనది?' 'మాయందు దుఃఖము'. 'నాపట్ల నీ వపరాధము చేయలేదా,' 'అన్ని యపరాధము లును నాయందే యున్నవి. మరి, గద్గదమైన వాక్యములతో ఎందుల కేడ్చుచుంటివి?' 'ఎవనిముందర ఏడ్చితివి?' 'నాముందరనే'. 'నేను నీకు ఏమవుదును?' 'ప్రియురాలవు' 'కాను. కనుకనే ఏడ్చుచున్నాను'.

ఇది ఒక పక్షమునందు కాకువుచేత కుటిల, అవగా యేవిషమయ్యెనను ఋజూక్తి యనెడి వాకోవాక్యము.

వ్యాఖ్య : వక్తలిరువురును సూటిగా పలికినప్పుడు గ్రామ్య ఋజూక్తియే, ఒకరు కాకువు నాశ్రయించి వక్రత ననుసంధించినపుడు ఉపనాగరిక ఋజూక్తి యగునని ఉదాహరణములనుబట్టి ఊహింపవలసియున్నది ఇర్వురియందును వక్రత యున్నయెడల అది వేరుభేదమై వక్రోక్తి యగును. ఉదాహరణము అమరుక శతకమునుండి గృహీతము.

[ వక్రోక్తి ]

వక్రోక్తి ర్ద్వివిధా నిర్వ్యూఢా అనిర్వ్యూఢా చ. తయో ర్నిర్వ్యూఢా యథా-

'కిం గౌరి మాం ప్రతి రుషా నను గౌరహం కిం
కుప్యామి కాం ప్రతి మయీత్యనుమానతోఽహమ్
జానామి సత్య మనుమానత ఏవ స త్వ
మిత్థం గిరో గిరిభువః కుటిలా జయంతి'. 336

నేయ మావాక్యపరిసమాప్తే ర్నిర్వాహా న్నిర్వ్యూఢేతి వక్రోక్తి ర్వాకోవాక్యమ్.

అర్థము : వక్రోక్తి నిర్వ్యూఢ యని అనిర్వ్యూఢ యని రెండు విధములు. అందు నిర్వ్యూఢ కుదాహరణము_ 'గౌరీ! నాయెడ రోషమేల?' 'నేను గోవును కదా! ఎవతె పట్ల కోపింతును?' 'నాపట్ల నని అనుమానము'(ఊహ). 'అది నేనెరుగుదును. నిజమే. అనుమానతుడవే మరి నీవు' – ఈ విధమైన గిరిజయొక్క కుటిల వాక్యములు జయించును గాక!

ఇది వాక్యము మొదటినుండి ముగింపువరకు నిర్వహింపబడుటవల్ల నిర్వ్యూఢ యన్న వక్రోక్తి వాకోవాక్యము.

వ్యాఖ్య : కాకువుచేత గాని, శ్లేషచేత గాని వక్తృభిన్నార్థసాధనచేసి ప్రసంగించుట వక్రోక్తి. ప్రకృతోదాహరణమునందు వక్రోక్తి తుదివరకు నిర్వహింపబడుటచేత నిర్వ్యూఢ వక్రోక్తి యన్న ఎకోవాక్యభేద మగుచున్నది. 'కిం గౌరి మాం ప్రతిరుషా' అని శివునివాక్యము 'గౌరీ! నా యెడల రోషమేల' అని యర్థము. పార్వతి 'గౌః+ఇమాం' అని విభాగముచేత 'నను గౌ రహం కిం?' అని ప్రశ్నించుచున్నది. 'మరి, నేను గోవును కదా!' అని యర్థము. గోవు సాధారణముగా సాధుస్వభావమునే కలిగియుండును. కోపించుట యన్న ప్రసక్తికి తావు కలుగదు. అయినప్పటికి 'కుప్యామి కాం ప్రతి' అని మరొక ప్రశ్న వేయుచున్నది. 'ఎవతె యెడల కోపింతును' అని యర్థము. శివుని మాటలో 'ఎవతె' అన్న ప్రశ్నకే అవకాశము లేదు. కాని పార్వతి 'గౌః+ఇమాం' అని విడదీయుటచేత 'దీనిని' అన్న అర్థమేర్పడి యీ ప్రశ్నకు అవకాశమేర్పడినది దీనికి సమాధానముగా 'మయి త్వమనుమానతః' అని శివుడు చెప్పెను. 'అనుమానమువల్ల నా యందని' అని అర్థము. ఇచ్చట అనుమాన శబ్దమునకు ఊహ యని యర్థము. 'నాయందే కోపమని ఊహించుచున్నాను' అని శివుని భావము. పార్వతి దీనిని కూడ 'న+అమానతః' అని పదవిభాగము చేసి భిన్నార్థమును సాధించినది. 'సత్యమే. నాకు తెలియును. నీవు అనుమానతుడవే' అని చెప్పినది. 'ఉమకుకాక, మరొక యామెకు లొంగిన వాడ' వని భావము. శివునికి అన్యస్త్రీ విధేయత్వమును స్ఫురింపజేయుట యందు పార్వతీ వచోవక్రత పరిణమించినది. తన కోపమునకు హేతువుకూడ అదియే. ఇట్లు శివుని భావమునకు భిన్నముగా పార్వతి సభంగశ్లేష సాధనముగా

అర్థకల్పన చేయుటవల్ల, ఇది వక్రత యగుచున్నది. సంభాషణరూపమున, చివ రంట నిర్వహింపబడుటవల్ల నిర్వ్యూఢ వక్రోక్తి వాకోవాక్యము.

ఉదాహరణము రుద్రటుని కావ్యాలంకారమునుండి గృహీతము.

అనిర్వ్యూఢా యథా-

'కేయం మూర్ధ్న్యంధకారే తిమిరమిహ కుతః సుభ్రుకాంతేందుయుక్తే
కాంతాప్యత్రైవ కామిన్నను భవతి మయా పృష్టమేతావదేవ
నాహం ద్వంద్వం కరోమి వ్యపనయ శిరసస్తూర్ణ మేనా మిదానీ
మేవం ప్రోక్తో భవాన్యా ప్రతివచనజడః పాతువో మన్మథారిః' 337

సేయ మనిర్వాహా దనిర్వ్యూఢేతి వక్రోక్తి ర్నామ వాకో వాక్యమ్. తే ఇమే ఉభే అపి శ్లేషవక్రోక్తిర్నామ వాకోవాక్యమ్.

అర్థము : అనిర్వ్యూఢ కుదాహరణము. 'అంధకారీ! తలమీద ఇది యెవరు?' 'సుభ్రూ! (చక్కని కనుబొమలు గలదానా) ప్రకాశమానుడైన చంద్రునితో కూడి యుండగా ఇక్కడ చీకటి యెక్కడ?' 'కాముకుడా! కాంతకూడ ఇక్కడనే' 'భవతీ! నే నింతవరకే కదా అడిగితిని!' 'నేను ద్వంద్వము చేయను. ఇప్పుడే వెంటనే దానిని శిరసునుండి తొలగించు' అని భవానిచేత చెప్పబడి ప్రతివచన జడుడయిన మన్మథారి మిమ్ములను కాపాడునుగాక !

ఇది అనిర్వాహమువల్ల అనిర్వ్యూఢ వక్రోక్తి యనెడి వాకోవాక్యము. ఈ రెండునుకూడ శ్లేషవక్రోక్తి యనెడి వాకోవాక్యము.

వ్యాఖ్య : 'అంధకారే కేయం మూర్ధ్ని' అని భవాని ప్రశ్న. 'అంధకవైరీ! తలమీద ఇది యెవరు?' అని అర్థము. శివుడు 'అంధకారే' అన్న సంబోధనాంతమును సప్తమ్యంతముగా మార్చుకొని 'చీకటియందు' అన్నయర్థముతో ఎదురుప్రశ్న వేసెను. 'కాంతేందుయుక్తే తిమిరమిహ కుతః?' ప్రకాశించుచున్న చంద్రుడు కూడియుండగా చీకటి యెక్కడ? — అని యర్థము. భవాని 'కాంతా+ఇందు+యుక్తః' అన్న విభాగముతో కాంతతోను, చంద్రునితోను కూడిన శిరసన్న యర్థమును సాధించి 'కామిన్! కాంతాప్యత్రైవ' అని అడిగినది. 'కాంతకూడ శిరస్సు

మీదనేనా?' అని ప్రశ్నించి, అట్టివాడు కాముకుడే యని నిర్ధారణ చేయుచున్నది. శివుడు 'నేను ప్రశ్నించితివి, సమాధానము చెప్పలేదు. ఇంతే' అని తప్పించుకొనఁ జూచెను. భవాని 'నాహం ద్వంద్వం కరోమి' అని యన్నది. 'నేను ద్వంద్వార్థ యుక్తముగా పలుకను' అని ఒక యర్థము. 'నేను మరొకస్త్రీతో జంట కట్టి సవతినై యుండను' అని మరొక యర్థము. ఇంతవరకు శ్లేషవల్ల వక్రత సిద్ధించినది. పార్వతి వక్రతను విడిచి 'తలమండి వెంటనే ఆమెను తొలగింపుము' అని మాటిగా ఆదేశించుచున్నది. శ్లోకమునందు సగముభాగమువరకు మాత్రమే వక్రత నిర్వహింపబడుటవల్ల, ఇది అనిర్వ్యూఢ వక్రోక్తి. శ్లేష నాశ్రయించుటవల్ల శ్లేష వక్రోక్తి. ఇరువురి సంభాషణ యగుటవల్ల వాకోవాక్యము.

## [ వైయాత్యోక్తి ]

వైయాత్యోక్తి ర్ద్వేధా స్వాభావికీ నైమిత్తికీ చేతి తయోః స్వాభావికీ యథా-

'నాదేయం కిమిదం జలం ఘటగతం నాదేయ మేవోచ్యతే
సత్యం నామ పిబామి కత్యపత్యమః పీతేన నామ్నాభవన్
కిం వర్ణా అపి సంతి నామ్ని రహితం కిం తైరలం త్వంకుతో
యస్మాదేవ భవాన్ భగిన్యసి తత స్తేనైవ మమ బాధసే' ౩౩౭

అత్ర స్వైరిణ్యాః సహజాద్వైయాత్యాత్ స్వాభావికీయం వైయాత్యోక్తి ర్నామ వాకోవాక్యమ్.

అర్థము : వైయాత్యోక్తి స్వాభావి అని, నైమిత్తికి అని రెండు విధములు. అందు స్వాభావికి కుదాహరణము. 'ఈ జలము నా దే య మా?' 'కుండలోనిది; నాదేయమే అని చెప్పబడుచున్నది.' 'నిజమా! త్రాగుదును.' 'ఎంతో మంది త్రాగి దప్పిక తీర్చుకొనిరి.' 'నామమునందు వర్ణములుకూడ నున్నవా?' 'రహితమా?' 'వాని సంగతి చాలు'. 'నీవెక్కడనుండి?' 'నీవు వచ్చినచోటు నుండియే' 'అయిన నీవు భగిని వవుదువు' 'దానిచేతనే నీవు నన్ను బాధించుచున్నావు'.

ఇచ్చట స్వైరిణియొక్క సహజవైయాత్యమువల్ల ఇది స్వాభావికీ వైయాత్యోక్తి యనెడి వాకోవాక్యము.

వ్యాఖ్య : వైయాత్యము అని యనగా చొరవ అనికాని, సిగ్గులేకపోవుట అని కాని అర్థము. కొందరు సహజముగానే సిగ్గుమాలినవారు; కొందరు కొన్ని సందర్భములలో సిగ్గుమాలినట్లు ప్రవర్తింతురు. మొదటి వారి మాట స్వాభావికీ వైయాత్యోక్తి కాగా, రెండవవారి మాట నైమిత్తికీ వైయాత్యోక్తి యగును.

నాదేయ మని యనగా నదీసంబంధమైన దని యర్థము. వక్త 'ఇది నదీ జలమా?' అని యడిగెను. ప్రపాపాలిక 'ఘటగత' మని సమాధానము చెప్పెను. అంతతో ఆగక (న+అదేయమ్) ఈయరానిది కా దని చెప్పెను. కుంభలో నుంచిన నదీజలమే యని మరొక యర్థము. 'సత్యమేనా? అయిన త్రాగుదును' అని బాటసారి పలికెను. బాటసారికి నదీజలమే యిష్టము. కావుననే, తన సమ్మతిని తెలిపెను. 'ఇంతకు ముందెందరో దప్పిక తీర్చుకొనిరి' అన్న భావమున 'పీతేన నామ్నా అభవన్' అని ఉపయోగించెను. 'పసుపువచ్చని పేరుతో' అన్న యర్థము సాధించి 'పేరులో వర్ణములున్నవా?' అని బాటసారి ప్రశ్నించెను. ఈ విధముగా ఘటశబ్దము మొదలు భగినీశబ్దమువరకు స్వైరిణి విర్లజ్జముగా అసభ్యార్థ ప్రేరకముగానే ప్రయోగించెను. ఇట్లు ప్రయోగించుట స్వైరిణికి సహజలక్షణము. కావుననే యిది స్వాభావికీ వైయాత్యోక్తి యనెడి వాకోవాక్య మగుచున్నది.

నైమిత్తికీ యథా—

'కుశలం రాధే సుఖితో౽సి
కంస, కంసః క్వ ను క్వ సా రాధా:
ఇతి పారీప్రతివచనై
ర్విలక్షహాసో హరిర్జయతి.' 339

అత్ర గోత్రస్ఖలితే వివక్షునామ్నైవ వైయాత్యేనోత్తరం దత్తమితి నైమిత్తికీయం వైయాత్యోక్తి ర్వాకోవాక్యమ్.

అర్థము : నైమిత్తిక కుదాహరణము, 'రాధా! కుశలమా!' 'ఓహో కంసా!

సుఖమే కదా!' 'ఇక్కడ కంసు డెక్కడ?' ఆ రాధమాత్ర మెక్కడ?' ఇట్లు పారీ ప్రతివచనములచేత విలక్షణహాసము చేయుచున్న హరి వర్ధిల్లును గాక!

ఇక్కడ గోత్రస్ఖలితముచేత శత్రునామముచేతనే వైయాత్యముతో బదులు చెప్పబడినది. కావున ఇది నైమిత్తికీ వైయాత్యోక్తి అనెడి వాకోవాక్యము.

వ్యాఖ్య : కృష్ణుడు సత్యభామను సమీపించి పొరపాటున 'రాధా' అని సంబోధించెను. ఇట్లు పొరపాటున నోరుజారి యితరనామమును పల్కుటను గోత్ర స్ఖలన మని యందురు. సత్యభామకు రాధ శత్రువర్గములోనిది కావున, సత్య భామ కొంటెతనము (వైయాత్యము)తో కృష్ణుని తద్విరోధియైన కంసునిపేర సంబో ధించుచున్నది. ఈ సంబోధనలోని అసంగతి అవగతమైనంతనే తన గోత్రస్ఖలన విషయము కూడ కృష్ణుని కవగతమైనది. కావుననే విలక్షహాసు డయ్యెను. ఒక కార్యమును నిమిత్తముగా చేసికొని కొంటెతనము ప్రదర్శించుట జరిగినది. కావు ననే, యిది నైమిత్తికీ వైయాత్యోక్తి అన్న వాకోవాక్య మగుచున్నది.

[ గూఢోక్తి ]

గూఢోక్తి ర్ద్విధా ముఖ్యా గౌణీ చ. తయో ర్ముఖ్యాయథా-

'కేశవ యమునాతీరే
వ్యాహృతవా నుషసి హంసికాం కోఽద్య
కాంతా విరహ భయాతుర
హృదయః ప్రాయః ప్రియేఽహం సః' 340

అత్ర 'ప్రియే హంస' ఇత్యత్ర తావర్ణలోపే 'ప్రియే అహం స' ఇత్యర్థస్య ముఖ్యయైవ వృత్త్యా గూఢత్వాదియం ముఖ్యా గూఢోక్తి ర్నామ వాకోవాక్యమ్.

అర్థము : ముఖ్య యని, గౌణి యని గూఢోక్తి రెండు విధములు. వాని యందు ముఖ్య కుదాహరణము – 'కేశవా ! నేటి యుదయము యమునాతీరమున హంసికను పిలుచుచున్నా రెవరు?' 'ప్రియా! కాంతావిరహ భయాతుర హృదయుమైన పురుషహంసయై యుండును.' ఇచ్చట 'ప్రియేహంసః' అనుచోట అవర్ణలోపము

నందు 'ప్రియే అహం సః' అన్న అర్థమునకు ముఖ్యవృత్తిచేత గూఢత్వమువల్ల, ఇది ముఖ్యాగూఢోక్తి అన్న వాకోవాక్యము.

వ్యాఖ్య : గూఢమైన వాక్కు గలది గూఢోక్తి. అందు ముఖ్యాగూఢోక్తి కిది యుదాహరణము. ప్రియురాలు 'కేశవా! హంసికను ఎవరు పిలిచిరి?' అని యడిగెను. హంసిక అనగా ఆపేరు కలిగిన ఒక యువతి; ఆడుహంస యని మరొక యర్థము. కృష్ణుడు ఈ ప్రశ్నకు సమాధానముగా 'ప్రియే హంసః' అని పలికెను మగహంస పిలిచియుండు నని సమాధానము చెప్పెను. ఇచ్చట ప్రియే+ అహం+సః' అని యుండగా సంబుద్ధియందలి ఏత్వమునందు 'అ' లీనము కాగా 'ప్రియే హంసః' అని యన్నట్లు వినిపించును. నిజమునకు 'ప్రియురాలా! పిలిచిన వాడను నేను' అన్నదియే గూఢమైన సమాధానము. ఇట్లు వాక్యమునందే సంధి సాధనముగా గూఢత సంపన్నమయినది. కావుననే యిది ముఖ్యాగూఢోక్తి అన్న వాకోవాక్యభేద మగుచున్నది.

గౌణీ యథా-

'నిరర్థకం జన్మ గతం నలిన్యా
యయా న దృష్టం తుహినాంశుబింబమ్
ఉత్పత్తి రిందో రపి నిష్ఫలైవ
కృతా వినిద్రా నలినీ న యేన' 341

తావిమౌ పూర్వోత్తరార్ధౌ పరస్పరోక్త్యా గూఢకామలేఖా వితీయం గౌణీగూఢోక్తి ర్నామ వాకోవాక్యమ్.

అర్థము : గౌణికి ఉదాహరణము – 'చంద్రబింబమును చూడని పద్మము జన్మము నిరర్థకమైపోయినది.' 'పద్మమును నిద్రలేపని చంద్రుని పుట్టుకకూడ నిష్ఫలమే అయినది.'

ఈ రెండును పూర్వోత్తరార్ధములు పరస్పరోక్తులతోడి గూఢకామలేఖలు: కావుననే యిది గౌణీగూఢోక్తి యనెడి వాకోవాక్యము.

వ్యాఖ్య : వాక్యమున నివిష్టమైయున్న గూఢత్వమును ముఖ్య యన్న

భేదమునందు చూచితిమి; అది సంధి నాశ్రయించికొన్నది. ప్రకృతమైన గౌణీభేదము నందు గూఢత్వము సంధ్యాదుల నాశ్రయించుకొని లేదు. అప్రస్తుత విషయ ప్రస్తావమే యిందు జరిగినది. ఒకరు లేఖను గూఢముగా వ్రాయగా, దానికి సమాధానము లేఖా రూపమున గూఢముగానే వచ్చినది. ఇచ్చట, ఇవి లేఖలలోని వాక్యము లని ప్రేయసీ ప్రియులు వ్రాసికొన్నవని తెలిసినప్పుడు గూఢత్వము తొలగిపోయి భావము స్పష్టము కాగలదు. ఇచ్చటి గూఢత్వము సందర్భము నాశ్రయించుకొని 'గౌణి' యగుచున్నది. ప్రియుడు వచ్చుసరికి ప్రియురాలు నిద్రపోవుచున్నది: ఆమెను లేపకుండ, అతడు వెళ్ళిపోయెను. తరువాత 'నిరర్థకం.... తుహినాంశు బింబ'మని లేఖ వ్రాసి పంపించెను. ఒకరిదే తప్పు కాదు; అట్లే నష్టముకూడ ఒకరిదే కాదు. కావుననే, 'వచ్చియు లేపకుండ వెళ్ళుటచేత నీవు వచ్చుటకూడ నిష్ఫలమే యైనది' అన్న భావముతో 'ఉత్పత్తి రిందో రపి.... యేన' అని ఆమె సమాధానము వ్రాసినది.

ఇచ్చట పైతము ఇరువురు వ్యక్తులు, వారి ఉక్తిప్రత్యుక్తులు ఉండుటవల్ల ఇది గౌణీగూఢోక్తి వాకోవాక్య మగుచున్నది.

[ ప్రశ్నోత్తరోక్తి ]

ప్రశ్నోత్తరోక్తి ర్ద్విధా. అభిధీయమానహృద్యా ప్రతీయమాన హృద్యా చ. తయో రాద్యా యథా-

'క్వ ప్రస్థితాసి కరభోరు ఘనే నిశీథే
ప్రాణేశ్వరో వసతి యత్ర మనఃప్రియో మే
ఏకాకినీ వద కథం న బిభేషి బాలే
నన్వస్తి పుంఖితశరో మదనః సహాయః' 342

సేయం హృద్గతప్రష్టవ్యస్యైవ స్పష్టమభిధయైవాభిధానా దభిధీయమానహృద్యా నామ ప్రశ్నోత్తరోక్తి ర్వాకోవాక్యమ్.

అర్థము : ప్రశ్నోత్తరోక్తి రెండు విధములు. అభిధీయమాన హృద్య యని ప్రతీయమాన హృద్య యని. ఆ రెండింటియందు మొదటిదాని కుదాహరణము – 'కరభోరూ! దట్టమైన చీకటిలో ఎక్కడికి బయలుదేరితివి?' 'నా మనః

ప్రియుడు ప్రాణేశ్వరుడు వసించుచున్న తావునకు.' 'బాలా! ఒక్కతెవుకదా! భయ పడకుండుటకు హేతువేమి? చెప్పు' 'బాణము సంధించి మదనుడు సహాయుడై యున్నాడు కదా!'

ఇది హృదయగతమైన ప్రష్టవ్యమునకే స్పష్టముగా అభిధచేతనే (సమాధానము) చెప్పుటవల్ల అభిధీయమాన హృద్య యనెడి ప్రశ్నోత్తరోక్తి యైన వాకోవాక్యము.

వ్యాఖ్య : వాకోవాక్యమునందు సంభాషణరూపమున గాని, ప్రశ్నోత్తర రూపమున గాని వక్తవ్యము ఆవిష్కృత మగును. ఇరువురు వక్త లుండుటకూడ ఆవశ్యకమే. స్థూలముగా చూచినప్పుడు ప్రకృతభేదమునందు విశిష్టత గోచరింపదు. పరిశీలించి చూడగా, ప్రాశ్నికుడు ఎదుటి వ్యక్తియొక్క హృదయగతమైన భావమును చెప్పించుటకే ప్రశ్న వేయు నన్నది గోచరించును. అంతేకాదు; తద్భావము తానూహించినదే, అయినను వక్తచేత చెప్పించుట ఆకాంక్ష.

వక్త స్పష్టముగా (వాచ్యముగా) తన మనోభావమును తెల్పినయెడల, అది అభిధీయమాన హృద్య యగును. ప్రకృతోదాహరణమునందు సంకేతస్థానమునకు చేరుకొనిన ప్రియురాలిని ప్రియుడు ప్రశ్నించుచున్నాడు. ఆమెచేత 'మనఃప్రియుడు, ప్రాణేశ్వరుడు' అని అనిపించుకొనుట అతని అభిలాష. అట్లే 'మదనుడు సహాయుడు' అని యనగా 'ప్రేమ వివశ' నని చెప్పించుకొనుట అతని కోరిక. తదనుగుణముగానే ఆమె స్పష్టముగా హృద్యముగా బదులుపలికినది. కావుననే, యిది అభిధీయమాన హృద్యప్రశ్నోత్తరోక్తి యగుచున్నది. ఉదాహరణము అమరుక శతకము నందలిది.

ద్వితీయా యథా-

'కియన్మాత్రం జలం విప్ర! జానుదఘ్నం నరాధిప!
తథాపీయ మవస్థా తే, న హి సర్వే భవాదృశాః' 343

సేయం శబ్దవిద్యావైశారద్యస్య హృద్యస్య ప్రతీయమానత్వాత్ ప్రతీయమాన హృద్య ప్రశ్నోత్తరోక్తి ర్వాకోవాక్యమ్.

అర్థము : ద్వితీయ కుదాహరణము - 'విప్రా! జల మెంతమాత్రము ?'

'నరాధిప! మోకాళ్ళవరకు' 'అంతమాత్రముననే నీకీ యవస్థయా?' 'అందరును భవాదృశులు కారు'.

ఇది శబ్దవిద్యావైశారద్యమునకు హృద్యమునకు ప్రతీయమానత్వమువల్ల ప్రతీయమాన హృద్య ప్రశ్నోత్తరోక్తి యైన వాకోవాక్యము.

వ్యాఖ్య : విద్వాంసుడు శబ్దవిద్యామహత్త్వముచేత హృదయగత భావమును హృద్యముగా భంగ్యంతరముగా స్ఫురింపజేసిన యెడల ప్రతీయమాన ప్రశ్నోత్తరోక్తి యగును. ఇచ్చట శబ్దము వాచకము కాక, వ్యంజక మగుచున్నది. ఇట్టి ఉక్తి సామర్థ్యము సామాన్యులకు సాధ్యము కాదు. ఉదాహృత శ్లోకము రాజునకును పండితునకును జరిగిన ప్రసంగము; ప్రశ్నోత్తరరూపము. రాజు జలమును గురించి అడుగలేదు; పండితుడు జలమును గురించి చెప్పలేదు. రాజు పండితుని దారిద్ర్యమును గురించి భంగ్యంతరముగా ప్రశ్నించెను. పండితుడు తదనురూపముగానే సమాధానము చెప్పెను. 'అందరును నీవంటి వారు కారు' అనుట రాజును శ్లాఘించుటయే. సంపన్నత్వము విషయమున, దాతృత్వము విషయమున రాజున కున్న స్థాన మున్నతము; అదియే పండితోక్తిచేత ప్రతీతమయినది కావుననే, యిది ప్రతీయమాన హృద్యప్రశ్నోత్తరోక్తి యగుచున్నది.

ఉదాహరణ పద్యము భోజరాజు శార్ఙ్గధరపద్ధతినుండి గృహీతము.

౧

[ చిత్రోక్తి ]

చిత్రోక్తి ర్ద్విధా చిత్రా విచిత్రా చ. తయో శ్చిత్రాయథా-

'లభ్యంతే యది వాంఛితాని యమునా భాగీరథీ సంగమే
దేవ ప్రేమ్యజన స్తదేమ భవతో భర్తవ్యతాం వాంఛతి
నన్వేత న్మనసైవ కిం ను మరణం కాయాన్మనోవిచ్యుతి
ర్దీర్ఘం జీవ మన స్తవాంఘ్రికమలే కాయోఽత్ర న స్త్వితి.' 344

తదిదం సంకల్పితోక్తి ప్రత్యుక్తి భ్యాం జీవితోఽపి జనాన్తరాంతరావాప్తి సాధనేనాశ్చర్యహేతు రితి చిత్రా నామ చిత్రోక్తి ర్వాకోవాక్యమ్.

అర్థము : చిత్రోక్తి చిత్ర యని విచిత్ర యని రెండు విధములు. అందు చిత్ర కుదాహరణము _ 'దేవా! యమునా భాగీరథీ సంగమమునందు వాంఛితములు లభించు నెడల, ఈ సేవకు డీ మరణముతో 'నీయొక్క భర్తృత్వ(స్వామిత్వము)నే కోరుచున్నాడు' 'మరణ మనగా శరీరము నుండి మనస్సు వేరుపడుటయే కదా!' 'దీర్ఘజీవి వగుము. నా మనస్సు నీ పాదపద్మమునందును, శరీర మిచ్చట నున్నవి.'

సంకల్పితమునకు చెందిన ఉక్తిప్రత్యుక్తులచేత జీవితుడై యుండియు జన్మాంతరముచేత పొందదగిన దానిని సాధించుటచేత ఆశ్చర్యమును కలిగించునదై చిత్ర యనెడి చిత్రోక్తి వాకోవాక్య మగుచున్నది.

వ్యాఖ్య : సంకల్పమున కనుగుణముగా ఉక్తిప్రత్యుక్తులను సాగించి ఆశ్చర్యమును కలిగించు నెడల చిత్రా చిత్రోక్తి యగును. ఆశ్చర్య జనకత్వము చిత్ర యందు అవశ్య లక్షణము. ఒకడు మరుజన్మమునందు కూడ తన ప్రభువునే కొలిచి యుండవలయు నని సంకల్పము చేసికొనును. కోరికలు తీరుట కుపాయము గంగా భాగీరథీ సంగమ స్థానమున మరణము. మరణ మనగా దేహమునుండి మనస్సు వేరు పడుటయే. అది మరణము నొందకుండనే అతనికి సిద్ధించినది. శరీర మెచ్చట నున్నప్పటికి అతని మనస్సు మాత్రము ప్రభుని పాదపద్మములమీదనే లగ్నమై యుండును. ఇది యంతయు సేవకుని మనస్సునందు ఉక్తిప్రత్యుక్తిరూపము నొందిన సంకల్పిత సంవాదమే. ఇచ్చట వ్యక్తు లిరువురు లేరు. ఇరువుర పక్షమున నుక్తిప్రత్యుక్తుల నొక్క వ్యక్తియే భావించుకొనెను. జన్మాంతరమున పొందవలయునని వాంఛించుచున్న 'భర్తృత' యిప్పుడుకూడ సిద్ధమై యున్నదే. సిద్ధమై యున్నదానిని సాధించుటకు యత్నించుట ఆశ్చర్య హేతువు. కావుననే, యిది చిత్రా చిత్రోక్తి యగుచున్నది.

ద్వితీయా యథా–

'కోఽయం భామిని భూషణం కితవ తే శోణః కథం కుంకుమాత్
కూర్పాసాంతరితః ప్రియే వినిమయః పశ్యాపరం క్వాస్తి మే
పశ్యామీత్యభిధాయ సాంద్రపులకో మృద్నన్మృడాన్యాః స్తనౌ
హాస్తేన ప్రతినిర్జితేందు రవతాద్ధ్యాతే హాసన్వో హరః' 345

అత్రోక్తి ప్రత్యుక్త్యో రనంతరం స్తన మర్దన వైచిత్ర్యాదినా పరిసమాప్తే ర్విచిత్ర సంజ్ఞమిదం వాకోవాక్యమ్.

అర్థము : ద్వితీయ కుదాహరణము. 'భామినీ! అదియేమి?' 'జూదగాడా! నీ అలంకారము.' 'ఎఱ్ఱగా నున్నదేమి?' 'కుంకుమ వల్ల' 'రవికలో దాచితివా? ప్రియా! మార్చలేదుగదా!' 'చూడు. నాకు మరొకటి యెక్కడ నున్నది?' 'చూచెదను' అని పలికి చేతితో పార్వతీ స్తనములను మర్దించుచు నవ్వుచు దట్టమైన పులకలు పొంది, చంద్రుని జూదమునందు తిరిగి గెలుచుకొనిన హరుడు మిమ్ములను రక్షించుచు గాక!

ఇచ్చట ఉక్తిప్రత్యుక్తులకు పిమ్మట స్తనమర్దన వైచిత్రి మున్నగు వానిచేత పరిసమాప్తి యగుటవల్ల ఇది విచిత్ర అన్నపేరుగల వాకోవాక్యము.

వ్యాఖ్య : ఉక్తి ప్రత్యుక్తులతోనే కాక, క్రియారూపమునకూడ ఆశ్చర్యము కలిగించునెడల, అది విచిత్రా చిత్రోక్తి యగును. ప్రకృతోదాహరణమునందు పార్వతీపరమేశ్వరుల ద్యూతసన్నివేశము వర్ణితము. జూదమునం దోడి శివుడు చంద్రకళను కోల్పోయెను. పార్వతి తాను గెలుచుకొన్న చంద్రకళను రవికలో దాచుకొన్నది. స్తనలేపనమైన కుంకుమ పంకముచేత చంద్రకళ ఎఱ్ఱగా వైనది. ఈశ్వరుడు తాను గెలుచుకొన్నప్పుడు తాను చంద్రకళను తిరిగి తీసికొనవలయును. పార్వతి చూపిన చంద్రకళ ఎఱ్ఱగా నుండుటచే, అది తనది కాదని శివుని యనుమానము. 'నాదగ్గర మరొకటిలేదు. నీవే వెదకికొనుము' అని పార్వతి అనుమాన నివృత్తికై పలికినది. శివుడు వట్టుదలతో 'వెదకెదను' అని పలికి స్తన స్పర్శముచేత పులకించి, స్తనమర్దనము చేసెను. ప్రసంగమునుండి ప్రకరణము చేష్టారూపమును గ్రహించెను. ఇదియు చమత్కారదాయకమే. కావుననే విచిత్రా చిత్రోక్తి యన్న వాకోవాక్య మగుచున్నది.

## ప్రహేలికాలంకారము

145. ప్రహేలికా సకృత్ప్రశ్నః సాపి షోఢా చ్యుతాక్షరా
దత్తాక్షరోభయం ముష్టి ర్బిందుమత్యర్థవత్యపి.

అర్థము : ఒకమాదిరి ప్రశ్న ప్రహేళిక. అది ఆరు విధములు. 1. చ్యుతా

క్షర 2. దత్తాక్షర 3. చ్యుతదత్తాక్షర (ఉభయము) 4. ముష్టి 5. బిందుమతి 6. అర్థవతి.

146. క్రీడా గోష్ఠీ వినోదేషు తజ్జ్ఞైరాకీర్ణ మంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగా ప్రహేలికా.

అర్థము : క్రీడాగోష్ఠి వినోదములందును, జనసంకుల ప్రదేశము (ఆకీర్ణము) లందు తజ్ఞులు రహస్యాలాపములు జరుపుటకును, ఇతరులకు వ్యామోహము (అజ్ఞానము)ను కలిగించుటకును ప్రహేళిక ఉపయోగపడును.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో పదునెనిమిదవదిగా ప్రహేలిక పేర్కొనబడినది. ఇది చ్యుతాక్షరాది భేదముల నారింటిని కలిగియున్నది. ప్రహేళిక క్రీడాగోష్ఠులందు వినోదముకొరకు మాత్రమే కాక రహస్యాలాపములకును, అన్య వంచనమునకును కూడ ఉపయోగించునని దండి చెప్పిన ప్రయోజన శ్లోకమునే భోజు డుద్ధరించి ప్రదర్శించెను. ప్రహేళిక శబ్దము నలంకరించుట యన్న లక్షణమును బట్టియే శబ్దాలంకారముగా గణనీయమగుచున్నది. ప్రహేళిక తెలుగునందున్న 'పొడుపుకథ' వంటిది.

[చ్యుతాక్షరం]

తాసు చ్యుతాక్షరా యథా—

'పయోధరభరాక్రాంతా సంనమంతీ పదేపదే
పదమేకం న కా యాతి యది హారేణ వర్జితా' 346

అత్ర విహాంగికా కాహారేణ వర్జితా న యాతీతి వక్తవ్యే హారేణ వర్జితేత్యుక్తమ్. అతః కా ఇత్యక్షరస్య చ్యుతత్వా చ్చ్యుతాక్షరేయమ్.

అర్థము : వానియందు చ్యుతాక్షర కుదాహరణము. పయోధరముల భారము చేత ఆక్రమింపబడినదియు, అడుగడుగునకు వంగుచున్నదియు నైన యేది హార వర్జితయైనయెడల ఒక్క యడుగుకూడ కదలకుండును ?

ఇచ్చట (విహంగికా) కావడిబద్ద (కాహారేణ వర్జితా) మోసెడివాడు లేని యెడల వెళ్ళదని చెప్పవలసియుండగా, హారములేని యెడల అని చెప్పుట జరిగినది. ఇచ్చట 'కా' అన్న అక్షరము చ్యుతినొందుటవల్ల, ఇది చ్యుతాక్షర.

వ్యాఖ్య : ఉండవలసిన అక్షరమును విడిచిపెట్టి చెప్పినయెడల చ్యుతాక్షరా ప్రహేళిక యగును. ఉదాహరణము ఒక స్త్రీనిగురించి చెప్పుచున్నట్లుగా భ్రాంతి కలిగించును. పయోధరశబ్దము ఆభ్రాంతికి మూలహేతువు: హారశబ్దము దానినే పోషించుచున్నది, పైగా అచ్చటి విశేషణము లన్నియు స్త్రీలింగమునందే యున్నవి. 'హారములేనియెడల స్త్రీ ఒక్క అడుగుకూడ నడవలేదు' అని అన్నప్పుడు సమస్య యుత్పన్నమైనది. దీనికి పరిష్కారమును కనుగొనవలయును. 'హార' శబ్దమును 'కాహార' శబ్దముగా మార్చుకొనవలయును. 'కాహారుడు' అనగా 'బరువులు మోయు వాడు' అని యర్థము. 'బరువులు మోయువాడు పయోధరభరాక్రాంతను నడిపించునా? మోయునా?' ఎటులయినను రుచిరము కాదు. కాబట్టి పై విశేషణములకు ఆధార మైన విశేష్యమును తెలిసికొనవలయును. మోయువాడున్నాడు కనుక మోసెడివస్తువు పల్లకియో, కావడియో, మరియేదియో కావలయును. పయోధరములు అనగా కుండలు. కుండలభారము కలది, అడుగడుగునకు వంగునది కావడిబద్ద. సంస్కృత మున కావడిబద్దను 'విహంగిక' అని యందురు. విహంగిక పై లక్షణములను కలిగి యుండు ననుట వాస్తవము. 'కాహారవర్జిత' యైనయెడల కదలదు. ఇచ్చట 'కా' అన్న తొలివర్ణము తొలగిపోవుటవల్ల, ఇది చ్యుతాక్షర యగుచున్నది.

[ దత్తాక్షర ]

దత్తాక్షరా యథా-

'కాంతయానుగతః కోఽయం పీనస్కంధో మదోద్ధతః
మృగాణాం పృష్ఠతో యాతి శంబరో రూఢయౌవనః' 347

అత్ర శబర ఇతి శంబర ఇత్యనుస్వారాక్షరస్య దత్తత్వాద్దత్తాక్షరేయమ్.

అర్థము : దత్తాక్షర కుదాహరణము. 'బలిసిన మూపులు గలవాడు, మదము చేత ఉద్ధతుడైనవాడు, కాంతచేత అనుసరింపబడినవాడు, మృగములవెంట వెళ్ళు చున్నాడు. అతడెవడు?' 'యౌవనవంతుడైన శంబరుడు'.

ఇచ్చట 'శబర' అని యనుటకు 'శంబర'అని అనుస్వారాక్షరము కూర్చుట చేత, ఇది దత్తాక్షర.

వ్యాఖ్య : అవసరములేనిచోట అదనముగా అక్షరమును చేర్చినయెడల దత్తాక్షర యగును. 'శంబరుడు' ఒక రాక్షసుడు. అతడు శివునిచేతిలో మరణించెను. మృగములవెంట వెళ్ళువానిని శంబరు డనుట సంగతము కాదు. 'శబరుడు' అని యనగా ఆటవికుడని యర్థము. వేటగాడు మృగములవెంట వెళ్ళుటకుగాని, కాంతచేత అనుగమింపబడుటకుగాని, మదోద్ధతు డగుటకు గాని ఆక్షేపముండదు. కావున, ఇచ్చట 'శబర' శబ్దమును వాడుటకు బదులుగా అనుస్వారము వదనముగా చేర్చి వాడుట జరిగెను. కావుననే దీనిని దత్తాక్షరా ప్రహేళిక యని పేర్కొనుట సముచిత మగుచున్నది.

[ చ్యుత దత్తాక్షర ]

చ్యుత దత్తాక్షరా యథా-

'విదగ్ధః సరసో రాగీ నితంబోపరి సంస్థితః
తన్వంగ్యాలింగితః కంఠే కలం కూజతి కో విటః' 348

అత్ర విట ఇత్యస్మిన్ పదే వికారే చ్యుతే ఘకారే దత్తే ఘటః కూజతీతి ద్వితీయోఽర్థో భవతీతి సేయం చ్యుత దత్తాక్షరా.

అర్థము : చ్యుతదత్తాక్షర కుదాహరణము. 'విదగ్ధుడును, సరసుడును, రాగవంతుడును, నితంబము నాధారముచేసికొన్నవాడును, స్త్రీచేత కంఠము కౌగిలింపబడినవాడును, మనోహరముగా కూయుచున్నాడు.' 'ఎవరు? విటుడా?'

ఇట విటశబ్దమునందు వికారము చ్యుతము కాగా ఘకారము దత్తము కాగా (ఘటః కూజతి) ఘటము శబ్దించుచున్నదని మరొక యర్థమేర్పడును. కావున, ఇది చ్యుతదత్తాక్షర.

వ్యాఖ్య : ఉన్నయక్షరమును తొలగించి లేనియక్షరమును నెలకొల్పినయెడల చ్యుతదత్తాక్షర యగును. ప్రకృతోదాహరణమునందలి 'విదగ్ధ' ప్రభృతి విశేషణము లన్నియు పుంలింగమునందు కూర్పబడి పురుషవ్యక్తిని బోధించుచున్నవి.

కావుననే యీ వర్ణనమును విన్న వ్యక్తి 'విటుడా?' అని ప్రశ్నించుట కవకాశము కలిగినది. ఇచ్చటి 'వి' స్థానమున 'ఘ' నిలుపగా 'ఘటః' అని అగును. పై విశేషణము లన్నియు ఘటశబ్దమున కనుకూలమయిన అర్థము నొసగును. 'విదగ్ధః' అనగా పండితుడని ఒక యర్థము; బాగుగా కాల్చబడినది అని ఘటవిషయమున గ్రహింపదగిన యర్థము. 'రాగి' అనురాగము గల పురుషుడని, ఎఱ్ఱని రంగుగల దని అర్థములు. ఒక యక్షరమును తొలగించి, తత్స్థానమునందు మరొక యక్షరము నిల్పుటచేత భిన్నమైన యర్థము మనోహరమై వాక్యము నంతటిని దీప్తి మంతము గావించుచున్నది. కావుననే, యిది చ్యుతదత్తాక్షరా ప్రహేళిక యన్న శబ్దాలంకార మగుచున్నది.

[ అక్షర ముష్టిక ]

అక్షరముష్టికా యథా—

'అతిః అతిః అన్మఅలం ప్రీద్య రద్య జద్య ఫద్య
మేలా మేలా మేలం మేలం ఫస ఫస ఫస ఫస' 349

సేయ మక్షరాణాం ముష్టి రిత్యక్షరముష్టికా. అత్ర పాదశః చతుష్పంక్తిలిఖిత చతుర్భి ర్మురజబంధైః శ్లోక ఉత్తిష్ఠతి.

త ద్యథా—

'అద్య మే సఫలా ప్రీతి రద్య మే సఫలా రతిః
అద్య మే సఫలం జన్మ అద్య మే సఫలం ఫలమ్' 350

అర్థము : అక్షరముష్టిక కుదాహరణము....ఇది అక్షరముల ముష్టి కావున అక్షరముష్టిక. ఇక్కడ పాదముల వరుసలో నాలుగు పంక్తులను వ్రాయుటచేత ఏర్పడిన నాలుగు మురజబంధములతో శ్లోక మేర్పడును. అది యిది — నేడు నా ప్రేమ సఫలమయినది; నేడు నా రతి సఫలత చెందినది; నేడు నా జన్మ సఫల మయినది; నేడు నా ఫలము కృతార్థమయినది.

వ్యాఖ్య : 'ముష్టిః' అని యనగా దొంగిలించుట యని యర్థము. 'అక్షర ముష్టి' అని యనగా అక్షరములను దొంగిలింపగా ఏర్పడినదని అర్థము. 'అతిః

అతిః అన్మ అలం' మున్నగు విధముగా ఉదాహరణగా చూపబడిన శ్లోకమునకు అర్థము లేదు. రెండవపాదమునందలి 'ప్రీద్య రద్య' మున్నగు రచనకూడ నట్టిదే. కాని తొలిపాదములోని 'అతిః' రెండవపాదములోని 'ప్రీద్య' ఒక విధముగా కలిసి నప్పుడు 'అద్య, ప్రీతిః' అని రెండు పదములు స్పష్టముగా ఏర్పడును. అనగా తొలుత స్పష్టముగా క్రమబద్ధముగా నున్న శ్లోకమునుండి అక్షరముల నపహరించి యథేచ్ఛముగా కలబోయుటచేత ఉదాహృత పద్య మేర్పడినది. ఎంతటి పండితుని కైనను దీనిని భేదించి, అర్థము నవగాహనము చేసికొనుట శక్యము కాదు. కాని ప్రహేళికానిపుణులకు దీనిని మురజబంధముగా విన్యసించినయెడల అసలు శ్లోక మేర్పడు నన్న రహస్యము తెలియును. వారు మాత్రమే దీనిని గ్రహింపగలరు. ప్రహేళికా ప్రయోజనమునందు పేర్కొన్న పరవ్యామోహనము అక్షరముష్టికయందు ప్రత్యక్షముగా అనుభవమునకు వచ్చుచున్నది.

### [ బిందుమతి ]

బిందుమతీ యథా-

'తవావవాదః ప్రత్యబ్ధి పతాకా ప్రతిసంగరమ్
ఫలం ప్రత్యద్భుతోపాయం యశాంసి నతు న క్వచిత్' 351

ఇత్యనేన శ్లోకేనోక్తార్థస్య యథాస్థిత స్వరానుస్వార విసర్జనీయ సంయోగస్య శ్లోకోత్తరస్య బిందుభిరేవ సూచనాక్రమ ఇతి బిందుమతీ. తద్యథా-

ంు ం ంా ంు ం ంా ంాంా ంంుే ంంుే ంంః
ంా ంే ంా.ంే ిిః ంౕంం ంం ంీౕంంః'

నిర్భేధః-

ఉదధావ్పుదధా వాజ్ఞా సంయుగే సంయుగే జయః
సాహసే సాహసే సిద్ధిః సర్వత్ర తవ కీర్తయః' 352

అర్థము : బిందుమతి కుదాహరణము. ప్రతిసముద్రముమీదను నీ అధి

కారమే; ప్రతియుద్ధమునందును నీ పతాకమే; ప్రతి కార్యమునందును నీకు విజయమే; మరియెక్కడను (నీకు తప్పించి) కీర్తులు లేవు.

ఈ శ్లోకమునందలి అర్థముతో స్వరములు, అనుస్వారములు, విసర్గనీయములు యథాస్థితములై సంయోగము చెందిన బిందువులతోనే మరొక శ్లోకమేర్పడిన సూచనాక్రమమే బిందుమతి.

వ్యాఖ్య : బిందువులను కలది బిందుమతి. కేవల స్వరముల స్థానమున, వ్యంజనాక్షరముల స్థానమున బిందువులను మాత్రమే యుపయోగించుటచేత బిందుమతి యన్న పేరు సార్థకమగుచున్నది. వ్యంజనములమీది స్వరములు, అనుస్వారములు, విసర్గలు సున్నలమీదనే చేరును. అర్థమును వ్యంజింపజేయు ధర్మమును బట్టియే హల్లులకు వ్యంజనములన్న సంజ్ఞ యేర్పడినది. బిందుమతి యందు వ్యంజనముల స్థానమున సున్నలే నిలుచుచున్నవి. అర్థబోధకత్వమునకు సహకరించు వర్ణము లదృశ్యము లగుటచేత అవగాహనము చేసికొనుట కష్టము. అందువల్లనే యిది ప్రహేళికయైనది. ఉదాహృతశ్లోకముయొక్క అర్థమునే యిముడ్చుకొని 'ఉదధావుదధా వాజ్ఞా' మన్నగు శ్లోక మేర్పడినది. ఇది యిట్లేయైనచో గ్రహించుట యందు కష్టములేదు; దానితోపాటే ప్రహేళికారూపముకూడ లేదు.

'ఉ' తొలియచ్చు: దీని స్థానమున ఉత్వముతోడి బిందువు నిలుపబడినది. తరువాతిది 'ద'. దీనికి బదులు బిందువుమాత్రమే. తరువాతిది 'ధా'. దీనికి బదులు దీర్ఘముతోడి బిందువు. ఇట్లు చివరంట బిందువులకే గుణింతమును చేర్చుకొనుచు రచింపవలయును. అప్పు డిది బిందుమతి యనెడి ప్రహేళిక యగును. ఇదికూడ పరవంచనము ప్రయోజనముగా ప్రవర్తించును.

[ అర్థప్రహేళిక ]

అర్థప్రహేలికా యథా-

'ఉత్తప్త కాంచనాభాసం సందష్ట దశనచ్ఛదమ్
సరసం చుంబ్యతే హృష్టైః ర్వృద్ధైరపి కిముజ్జ్వలమ్' ౭౯౭

సేయమపి సూచితస్యైవ పక్వామ్రఫల మిత్యస్య ద్వ్యర్థపద ప్రయోగేణాపగతే రర్థప్రహేలికా.

అర్థము : అర్థప్రహేళిక కుదాహరణము. కరగిన బంగారు కాంతి గలది, కొరకిన పెదవి కలది, సరసమైనది, ఉజ్జ్వలమయినది, హర్షముపొందిన వృద్ధులు కూడ చుంబించునది. ఏది ?

ఇది కూడ సూచితమైన పక్వామ్రఫలమునకు ద్వ్యర్థపద ప్రయోగముచేత అవగతివల్ల అర్థప్రహేళిక.

వ్యాఖ్య : అర్థసంబంధమైన సమస్య కలది అర్థప్రహేళిక. ఇది రెండర్థములు గల పదములను ప్రయోగించుటచేత సమస్యయై, సరియైన అర్థము నవగాహనము చేసికొన్నప్పుడు పరిష్కారము నొందును. ప్రకృతోదాహరణము 'చుంబ్యతే' మున్నగు పదములచేత అధరచుంబనమును స్ఫురింపజేయును. ప్రయుక్త విశేషణము దానిని బలపరుచును. కాని 'వృద్ధైరపి' (వృద్ధులచేత సహితము) అను మాటలు సందేహ కారణము లగును. మరికొంత ఆలోచింపగా 'పక్వమైన మామిడి పండు' కర్తృస్థానమునందు కనబడును. దీనిని వృద్ధులుకూడ హర్షముతో ఆస్వాదించుటలో ఆక్షేపము లేదు. 'ఉత్తప్త కాంచనాభాసం' మొదలయిన విశేషణములు 'మామిడిపండు' నకే అన్వయించును. అర్థమునుబట్టి యేర్పడిన సమస్యయగుట వల్లనే దీనికి అర్థప్రహేళిక అన్నపేరు అన్వర్థ మగుచున్నది.

[ గూఢాలంకారము ]

147. క్రియా కారక సంబంధైః పాదాభిప్రాయ వస్తుభిః
గోపితైః షడ్విధం ప్రాహు ర్గూఢం గూఢార్థ వేదినః.

అర్థము : దాచిన క్రియా కారక సంబంధములచేతను, పాదాభిప్రాయ వస్తువులచేతను గూఢమును ఆరు విధములుగా గూఢార్థవేత్తలు పేర్కొనుచున్నారు.

వ్యాఖ్య : శబ్దాలంకారము లిరువది నాలుగింటిలో క్రమప్రాప్తమైన పందొమ్మిదవ యలంకారము గూఢము. గోపనము చేయుట (గూఢముగా దాచియుంచుట)యే గూఢాలంకారము యొక్క ప్రధాన లక్షణము. ఈ గోపనము ఆరు విషయములలో జరుగవచ్చును. వానిని బట్టియే గూఢాలంకారము 1. క్రియాగుప్తము 2. కారకగుప్తము 3. సంబంధగుప్తము 4. పాదగుప్తము 5. అభిప్రాయగుప్తము 6. వస్తుగుప్తము – అని ఆరు విధములుగా పరిగణింపబడుచున్నది.

[ క్రియాగూఢము ]

తేషు క్రియాగుప్తం యథా-

'స్తన జఘన భరాభిరామ మందం
గమన మిదం మదిరారుణేక్షణాయాః ।
కథమివ సహసా విలోకయంతో
మదనశర జ్వరజర్జరా యువానః' 354

అత్ర జఘనభరాభిరామ మందం మదిరేక్షణాయా గమన మవలోకయంతో హే యువానాః, కథమివ యూయం మదనశర జ్వరజర్జరా నస్తేతి క్రియాపదస్య స్తన శబ్దేన జఘనసాన్నిధ్యాద్గోపితేన క్రియాగూఢ మిదమ్.

అర్థము : వానియందు క్రియాగుప్తమున కుదాహరణము. ఓ యువకులారా! మదిరారుణేక్షణయొక్క స్తన జఘనభార మనోహర మందమైన నడకను హఠాత్తుగా చూచుచున్నవారయ్యు మన్మథబాణ జ్వరజర్జరులు ఎట్లు....?

ఇక్కడ 'జఘనభరాభిరామ మందం.... మదన శరజ్వరజర్జరా న స్త' అని క్రియాపదమైన స్తనశబ్దమునకు జఘనసాన్నిధ్యమువల్ల గోపనముచేత ఇది క్రియాగూఢము.

వ్యాఖ్య : క్రియాపదమును గోపనము చేసినయెడల క్రియాగూఢమన్న అలంకార మగును. (గూఢ గుప్తములు పర్యాయములుగా ప్రయుక్తములు). ప్రకృతోదాహరణమునందు 'స్తనజఘనభర' మున్నగు విధముగా మొదలుపెట్టి చదువగా క్రియాహీన మయిన వాక్యమేర్పడును. వాక్యమునందు క్రియగాని, విధేయ విశేషణముగాని యుండవలయును. అట్లు లేనిచోట ఉద్దిష్టము స్పష్టముకాదు. దానిని 'అశరీరము' అన్న వాక్యదోషముగా పరిగణింతురు. ఉదాహరణ శ్లోకముకూడ ఆ దోషమున కగ్గమయ్యె నని అనిపించును. కాని జాగరూకతతో పరిశీలింపగా 'స్తనజఘన....' అనుచోటి 'స్తన' కుచవాచకము కాదని 'న, స్త' అన్న రెండు పదములు క్రమము మార్చుకొనగా ఏర్పడె నని స్పష్టమగును. 'స్త' లోట్ ప్రత్యయము; మధ్యమ పురుష బహువచనము. ఇక్కడ 'యువానః' అన్నది ప్రథమా

విభక్తి బహువచనము కాదు; సంబుద్ధి బహువచనము. కావుననే 'హే యువానః, యూయం కథం న మదనజ్వర పీడితాః స్త' అని యగును. 'ఓ యువకులారా! మీరు మదనజ్వరపీడితులు ఎట్లు కాకుందురు?' అన్న యర్థము కలుగును. జఘన భారము, స్తనభారము మొదలయిన విధముగా చెప్పెడి అభ్యాసమువల్ల జఘన సాన్నిధ్యమునందున్న 'స్తన' సమాసములో భాగమైపోయినది. ఇది భ్రాంతివల్ల ఏర్పడినది. 'న' వ్యతిరేకార్థకము. 'స్త' అస్ ధాతువుయొక్క లోట్ రూపము. కాబట్టి యిచ్చట క్రియాపదము లేకపోలేదు; లే దనిపించునట్లు గూఢముగా నున్నది. కావుననే యిది క్రియా గూఢమునకు లక్ష్యమగుచున్నది.

[కారక గూఢము]

కారకగుప్తం యథా-

'పిబతస్తే శరావేణ వారి కహ్లార శీతలమ్
కేనేమా దుర్విదగ్ధేన హృదయే వినివేశితా' 355

అత్ర శరావితి కర్మకారకస్య గూఢత్వాత్కారకగూఢ మిదమ్.

అర్థము : కారకగుప్తమున కుదాహరణము. జలజ శీతలమైన జలమును మూకుడుతో త్రాగుచున్న నీ హృదయమునందు, ఏ దుర్విదగ్ధునిచేత ఇవి ప్రవిష్టము లయినవి ?

ఇచ్చట 'శరా' అన్న కర్మకారకమునకు గూఢత్వమువల్ల, ఇది కారక గూఢము.

వ్యాఖ్య : కారకము కర్తృ, కర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణ విభాగముచే ఆరు విధములు. ఏ కారకమున గూఢముగా రచించినప్పటికి, అది కారకగూఢమే అగును. ప్రకృతోదాహరణమునందు కర్మకారకము గోపనము చెందినది. 'శరావేణ' అని యనగా 'మూకుడుతో' అని యర్థము. ఇది కరణ కారకము. జలపానము ప్రసక్తవిషయము కాబట్టి యిది యుచితముగానే యున్నది. కాని, ఉత్తరార్ధమునందు 'ఇమా వినివేశితా' (ఇవి ప్రవేశపెట్టబడినవి) అని యున్నది. సర్వనామమే కాని నామవాచకము ప్రయుక్తము కాలేదు. కర్మవాచకము నిర్దిష్టము కాలేదని అనిపించుచున్నది. అభినయపూర్వకముగా వచించునప్పుడు,

అభినయమే గ్రహణమునకు సహకరించి సౌందర్యమును పోషించును తక్కిన యెడల అస్పష్టత వలన, అది దోషమే యగును. తిరిగి పరిశీలించి చూచినచో, 'పిబతస్తే శరావేణ' అన్నచోట 'శరౌ+ఏణ' అన్న విభాగమునకు అవకాశమున్నది. 'శరౌ' ఇమౌ, వినివేశితౌ అనువానికి విశేష్యము 'ఇవి ప్రయోగింపబడినవి' అవి కాక 'ఈ బాణములు ప్రయోగింపబడినవి' అనియే యర్థము. నిగూఢముగా దాగి యున్న కర్మ యిప్పుడు పట్టుపడినది. ఇంతేకాదు. 'శరావేణ' అని యన్నప్పుడు కర్తృవాచకము 'తే' (నీయొక్క) అనియే తెలియును. యుష్మద్వాచకము ఎవరి కుద్దిష్టమో తెలియదు. 'శరౌ+ఏణ' అని యన్నప్పుడు ఏణము (లేడి) సంబోధింప బడుట స్పష్టముగా నున్నది. ఈ విధముగా కర్మకారకమే కాదు; కర్తృకారకము కూడ ఉదాహృతి యందు గుప్తమై యున్నది. కారకగూఢ మని యన్నప్పుడు రెండును సంగృహీతము లగును.

## [సంబంధ గూఢము]

సంబంధగూఢం యథా-

'న మయాగోరసాభిజ్ఞం చేతః కస్మాత్ ప్రకుప్యసి
అస్థాన రుదితై రేభి రల మాలోహితేక్షణే' 356

అత్ర న మే ఆగో రసాభిజ్ఞం చేత ఇది సంబంధిపదస్య మయేతి తృతీయాభ్రాంత్యా గోపితత్వాదిదం సంబంధగూఢమ్.

(అర్థము : సంబంధగూఢమున కుదాహరణము. అరుణలోచనా! అస్థానము లయిన రోదనములు చాలింపుము. మనస్సు గోరసము నెరుగనిది. ఎందులకు కోపించుచున్నావు? (మయా- అను దానికి పైని చెప్పిన అర్థమునందు వినియోగము లేదు. 'కిం కృతం?' అని అధ్యాహృతము చేసికొన్నచో 'నేనేమి చేసితిని?' అన్న యర్థము కలుగును.)

ఇచ్చట 'న మే ఆగో రసాభిజ్ఞం చేతః' అన్న సంబంధి పదమునకు 'మయా' అన్న తృతీయాభ్రాంతితోడి గోపితత్వమువల్ల సంబంధగూఢము.

వ్యాఖ్య : క్రియతోడి సంబంధము కారకము. అన్యపద సంబంధము శేషము. సంబంధగూఢమునందు శేషసంబంధమే గ్రాహ్యము. 'శేషే షష్ఠీ'యని

యగుటచేత శేషసంబంధమునందు షష్ఠీవిభక్తి యగును. ప్రకృతోదాహరణమునందు మయా, గోరసాభిజ్ఞం, చేతః, న - అని విభాగము చేసికొని పై యర్థము చెప్పుకొంటిమి. ఒకటి రెండు పదముల నధ్యాహృతము చేసికొనుట ఆవశ్యకమైనది. పాలరుచికి, ప్రియురాలి కోపమునకు ముడిపెట్టుటకూడ సరసముగా లేదు. తిరిగి పరిశీలింపగా 'మే, ఆగోరసాభిజ్ఞం, చేతః' అన్న విభాగము అనుకూలమై గోచరించును. మే (నాకు), ఆగోరసాభిజ్ఞం (పాపరసము నెరిగిన), చేతః (మనస్సు); న (లేదు). అనగా, 'నేను దోషము చేయలేదు' అని తాత్పర్యము. 'దోషము చేయనివాని యెడల కోపగించుటయేల ? ఏడ్చుటచేత కన్ను లెఱ్ఱబడినవి ఏడువవలసినచోటు కానిచోట ఏడ్చుట మానుము.' అన్న భావము సరసమై, సముచితమై కనుపట్టును 'మే' అస్మచ్ఛబ్దముయొక్క షష్ఠీవిభక్తి రూపము. 'పాపము' అన్న అర్థముగల ఆగశ్శబ్దము పరము కాగా అయాదేశముచేత 'మయాగః' అన్న రూపమేర్పడినది ఇందలి 'మయా' తృతీయా విభక్తి యన్న భ్రాంతిని కలిగించినది. అనుసరించియున్న 'గోరసాభిజ్ఞం' అన్న సముచ్చయము దీనికి సహకరించినది. నిజమునకు ఇచ్చట తృతీయా విభక్తిరూపము లేదనియు షష్ఠీవిభక్తిరూపమే యున్నదనియు తెలిసినప్పుడు అన్వయార్థము సులభమగును ఇట్లు శేషసంబంధము గుప్తమై యుండుటవల్లనే, ఇది సంబంధగూఢమునకు లక్ష్యమయినది.

## [పాదగూఢము]

పాదగూఢం యథా-

'ద్యువియద్గామినీ తార సంరావ విహతశ్రుతిః
హైమీష్వమాలా శుశుభే (విద్యుతా మివ సంహతిః)'. 357

అత్ర పూర్వార్ధస్థితై ర్ద్వితీయ ప్రథమ సప్తమ పంచమైకాదశ నవమ త్రయోదశ షోడశాక్షరై శ్చతుర్థ పాదో గూఢ ఉక్తాప్యః. యథా 'విద్యుతామివ సంహతిః' ఇతి. ఇదం పాదగూఢమ్.

అర్థము : పాదగూఢమున కుదాహరణము. స్వర్గవ్యోమమునకు పోవునదియు, ఉన్నత ధ్వనిచేత విహతమైన శ్రుతిగలదియునైన మాల హేమంత సమయములందు శోభించెను. (మెరపుతీగల సమూహము వలె).

ఇచ్చట పూర్వార్ధము నందున్న రెండవ, మొదటి, యేడవ, అయిదవ, పదునొకండవ, తొమ్మిదవ, పదుమూడవ, పదునారవ అక్షరములచేత గూఢమైన నాలుగవపాదము ఆవిష్కృతము కావలయును. 'విద్యుతా మివ సంహతిః' అని. ఇది పాదగూఢము.

వ్యాఖ్య : శ్లోకమునకు నాలుగు పాదము లుండును. అందు మూడు పాదములను మాత్రమే చెప్పి, వానిలోనే గూఢముగా నాలుగవపాదము నిమిడ్చి యుంచిన యెడల, అది పాదగూఢ మగును. ప్రకృతశ్లోకమునందు మొదటి రెండు పాదముల (పూర్వార్ధము)లోనున్న వర్ణములే అపేక్షానుసారముగా గృహీతములై నాలుగవపాదమైనవి. గ్రంథకర్తయే వివరణమునందు ఆయా వర్ణస్థానసంఖ్య లను వివరించి చతుర్థపాదమును ప్రదర్శించి యున్నాడు.

[అభిప్రాయ గూఢము]

అభిప్పాయగూఢం యథా-

'జఇ దేఅరేణ భణిఆ
ఖగ్గం ఘేత్తూణ రాఉలం వచ్చ
తా కిం సేవఅవహుప
హసిఊణ వలోఇఅం సఅణమ్' 358

[ఛాయా-

'యదా దేవరేణ భణితా
ఖడ్గం గృహీత్వా రాజకులం వ్రజ
తత్కిం సేవక వధ్వా
హసిత్వావలోకితం శయనమ్']

అత్ర నిరీక్షిత మనేన పురుషాయితలక్ష్మ పాదలాక్షాదికం, తేన నియుక్తే మాం న కర్మణీత్యభిప్రాయేణ వధ్వాః శయనావలోకన మిత్యభిప్రాయ గూఢమ్,

అర్థము : అభిప్రాయగూఢమున కుదాహరణము. కత్తిపట్టుకొని రాజభవనమునకు వెళ్లు మని మరది చెప్పినప్పుడు సేవకవధువు నవ్వి యెందులకని శయ్యా నవలోకించెను ?

ఇచ్చట పాదమునకున్న లత్తుక మొదలయిన పురుషాయితపు గుర్తులుచూచి 'నన్ను పనియందు నియోగించుట లేదు' అన్న అభిప్రాయముతో వధువు శయ్య నవలోకించినది. ఇది అభిప్రాయగూఢము.

వ్యాఖ్య : అభిప్రాయమునుబట్టి చేష్టను, చేష్టనుబట్టి అభిప్రాయమును గుర్తింపవచ్చును. వాక్కు అభిప్రాయమును కలుగజేయును; చేష్టకు చోదనము నందిచ్చును. కొన్నియెడల వాక్కువల్ల వెల్లడియైన యభిప్రాయముకంటె ప్రతిక్రియ భిన్నముగా నుండవచ్చును; అనగా అప్పటి ప్రతిక్రియ భిన్నమైన అభిప్రాయముతో జరిగిన దనియే అర్థము. ప్రకృతోదాహరణమునందు పురుషుడు పురుషాయితోచిత వేషరచనతోనున్న నాయికను చూచెను. అయినను 'ఖడ్గమును తీసికొని రాజగృహమునకు పొమ్ము' అని ఆదేశించెను. 'సేవాకార్యమునకై పొమ్ము' అని చెప్పినట్లే యైనది కాని, నాయిక అతని అభిప్రాయమును గ్రహించియే హసన్ముఖియై శయ్య నవలోకించెను. వాచకమునకు విరుద్ధమయిన కార్యాచరణమే యిచ్చట కానిపించును. కాని, ఆచరణము అభిప్రాయోచితముగానే యున్నది నాయకుడు 'ఇంటి పనులను మాని శయనమందిరమునకు రమ్ము' అన్న అభిప్రాయముతోనే పలికెను. దానిని గ్రహించుటచేతనే ఆమె సంతోషముతో శయ్యవైపు చూచుట జరిగెను. నాయకుడు వాచ్యము చెయ్యలేదు; నాయిక నోరువిప్పి పలుకలేదు. కావుననే యిది అభిప్రాయగూఢము.

### [వస్తుగూఢము]

వస్తుగూఢం యథా-

'పానీయం పాతు మిచ్ఛామి త్వత్తః కమలలోచనే
యది దాస్యసి నేచ్ఛామి నో దాస్యసి పిబామ్యహమ్' 359

అత్ర దాస్యసీతి దాసీలక్షణస్య వస్తునో గూఢత్వా దిదం వస్తుగూఢమ్.

అర్థము : వస్తుగూఢమున కుదాహరణము. ఓ కమలలోచనా! నీవల్ల పానీయమును త్రాగగోరుచున్నాను. నీ విచ్చినట్లయిన నేను త్రాగను (కోరను); నీ వియ్యనియెడల నేను త్రాగుదును.

ఇచ్చట 'దాస్యసి' అని దాసీలక్షణమైన వస్తువునకు గూఢత్వమువల్ల, ఇది వస్తుగూఢము.

వ్యాఖ్య : వస్తువును గోపనముచేసి పలికినయెడల వస్తుగూఢ మన్న శబ్దాలంకార మగును. 'ఇచ్చినయెడల త్రాగను; ఇయ్యని యెడల త్రాగుదును' అను మాటలు అర్థవంతములు కావు. 'ఇచ్చిన యెడల త్రాగుదును; ఇయ్యని యెడల త్రాగను' అని యున్నయెడల అర్థవంతము లనిపించుకొనును. కాని, యిచ్చట విరుద్ధముగానే ప్రయుక్తము లయినవి. విశేషార్థ మేమయిన నుండవలయును. 'దాస్యసి' అన్నది క్రియాపదము; 'దా' ధాతువుయొక్క భవిష్యద్రూపము; మధ్యమ పురుషైకవచనము ఈ రూపము విశ్లే గ్రహించి పై యర్థము చెప్పుకొంటిమి. కాని, ఇది సంగతము కాదు 'దాసీ+అసి' అను పదములుకూడ యణాదేశము వల్ల 'దాస్యసి' అని యగును 'యది దాస్యసి నేచ్ఛామి' దాసి వగుదువేని నేను త్రాగను. 'నో దాస్యసి పిబామి' దాసివి కావేని త్రాగుదును, ఇప్పు డర్థము సుసంగతమైనది. 'దాస్యసి' అనుచోట దాసీత్వము గూఢముగా నున్నది. కావుననే, ఇది వస్తుగూఢ మన్న యలంకారమునకు లక్ష్యమగుచున్నది

## ప్రశ్నోత్తరాలంకారము

148. యస్తు పర్యనుయోగస్య నిర్భేదః క్రియతే పదైః
విదగ్ధగోష్ఠ్యాం వాక్యైర్వా తం హి ప్రశ్నోత్తరం విదుః॥

అర్థము : పండితగోష్ఠియందు పదములచేత కాని, వాక్యములచేత కాని పర్యనుయోగమునకు పరిష్కారము చేయబడినయెడల, అది ప్రశ్నోత్తర మగును.

వ్యాఖ్య : పర్యనుయోగ మని యనగా ప్రతిపాదిత విషయమును ఖండించుటకు గాని, సమర్థించుటకు గాని చేయు వాద మని యర్థము. ప్రతిపాదిత విషయము ప్రశ్నరూపమున గాని సమస్యారూపమున గాని యుండును. దానికి తగిన

సమాధాన మగునట్లుగా పదములను గాని, వాక్యములను గాని ప్రయోగించుట విశ్లే దము. అది ప్రశ్నకు సమాధానము; సమస్యకు పరిష్కారము.

149. అంతఃప్రశ్న బహిఃప్రశ్న బహిరంతః సమాహ్వయో
జాతి పృష్టోత్తరాభిఖ్యౌ ప్రశ్నే స్తదపి షడ్విధమ్ ॥

అర్థము : 1. అంతఃప్రశ్నము 2. బహిఃప్రశ్నము 3. బహిరంతఃప్రశ్నము 4. జాతిప్రశ్నము 5. పృష్టప్రశ్నము 6. ఉత్తరప్రశ్నము - అని ప్రశ్నోత్తరాలంకారము ఆరు భేదములు కలిగియున్నది.

[అంతః ప్రశ్నము]

తేష్వంతఃప్రశ్నం యథా-

'కాహ మస్మి గుహే వక్తి ప్రశ్నేఽముష్మిన్ కి ముత్తరమ్
కథ ముక్తం న జానాసి కదర్థయసి యత్సఖే' 360

అత్ర 'కదర్థయసి' ఇతి పదం కథముక్తం రేఫయకారయుక్తం దర్యసీతి స్యాత్. అతో వాక్యాంతరే ప్రశ్నోత్తరం స్యోక్తత్వా దంతః ప్రశ్న మిదమ్.

అర్థము : వానియందు అంతఃప్రశ్నమున కుదాహరణము - "గుహ 'నే నెవరిని?' అని అడుగుచున్నది. ఈ ప్రశ్నలో సమాధాన మేమి?" "మిత్రమా! కష్టపెట్టెదవేల? చెప్పినదానినే యెరుగవా?"

ఇచ్చట 'కదర్థయసి' అన్న పదము కథముక్తమై రేఫ యకారయుక్తమై 'దర్యసి' అని యగును. అందువలన, వాక్యాంతరమునందే ప్రశ్నోత్తరములు చెప్పబడుటవల్ల, ఇది అంతఃప్రశ్నము.

వ్యాఖ్య : ప్రశ్నమునందే సమాధానము లీనమై యుండినయెడల అంతః ప్రశ్న మగు నని లక్షణము. 'కాహ మస్మి,' (నే నెవరిని?) ఇదొక ప్రశ్న. ఈ ప్రశ్నకు మరొక ప్రశ్న సమాధానమైనది. కథముక్తం న జానాసి? (చెప్పినదానినే యెరుగవా?) కదర్థయసి (బాధపెట్టుచున్నావు). ఈ ప్రశ్న 'ఎరుగవా?' అన్నంత

వరకే ప్రశ్న. తక్కినదంతయు సమాధానము. 'కదర్థయసి' అన్న పదమునందలి 'కథ' అన్న వర్ణములను తొలగింపగా 'దర్యసి' అని యగును. 'దరీ+అసి' గుహవు నీవు - అని యర్థము. కథము_క్తమ్ - అన్నప్పుడు 'కథం+ఉ_క్తమ్' అని ఒక మారును, 'క+థ+ము_క్తమ్' అని మరొకమారును విరుగును. ఇట్లగుటవల్ల ప్రశ్నయందే సమాధానము అంతర్నిహితమై యున్నది. కావుననే యిది అంతః ప్రశ్నమునకు లక్ష్యమగుచున్నది.

[బహిః ప్రశ్నము]

బహిఃప్రశ్నం యథా–

'భద్ర మాణవకాఖ్యాహి కీదృశః ఖలు తే పితా
వేలాందోలిత కల్లోలః కీదృశశ్చ మహోదధిః' 361

అత్ర 'మజ్జన్మకరః' ఇత్యస్యో_త్తరస్య ప్రశ్నాద్బహిరు_క్తత్వా ద్బహిఃప్రశ్న మిదమ్.

**అర్థము** : బహిఃప్రశ్నమున కుదాహరణము - 'భద్రుడా! బ్రహ్మచారీ! నీ తండ్రి యెటువంటివాడో చెప్పు.' 'చెలియలికట్టపైకి చెలరేగుచున్న కెరటములు గల మహాసముద్రము వంటివాడు.'

ఇక్కడ 'మజ్జన్మకరుడు' అన్న సమాధానము ప్రశ్నకు బయట ను_క్తమగుట వల్ల, ఇది బహిఃప్రశ్నము.

వ్యాఖ్య : ప్రశ్నకు చెప్పిన సమాధానము తత్పరిధిని దాటి ప్రస_క్తమైన పుడు, అది బహిః ప్రశ్న మగునని లక్షణము. 'నీ తండ్రి యెటువంటివాడు' అన్న ప్రశ్నకు 'సముద్రమువంటివాడు' అనుటతో సమాధానము చెప్పినట్లే. ఇందు ప్రశ్నకు సమాధాన మున్నది కాని చమత్కారమును కలిగించు శబ్దాలంకారము లేదు. విశేష ణము నాధారము చేసికొని సమాధానభాగము మరికొంత కల్పించుకొనవలయును. అదియే ఉద్దిష్ట ప్రతివచనము. సముద్రమునకు విశాలత్వము, గంభీరత్వము, భయంకరత్వము, రత్నగర్భత్వము మొదలయిన లక్షణములు గలవు. ఇక్కడ 'వేలాందోళిత కల్లోలః' అన్న విశేషణమువల్ల భయంకరత్వమే స్ఫురించుచున్నది. మకరాదులు మునిగియుండుటయే దీనికి హేతువు. 'మజ్జన్మకరః' అని యనగా

'నా జన్మకు కారణమైనవాడు' అని యనగా 'తండ్రి' యని యర్థము. సముద్రుని పక్షమున మజ్జత్ = మునిగియున్న, మకరః = మొసళ్ళు గలవాడు: అని యర్థము. 'కీదృశః మజ్జన్ మకరః సముద్రః తాదృశః మజ్జన్మకరః' అన్నది తాత్పర్యము. మొసళ్ళునిండిన సముద్రమువలె నా తండ్రి భయంకరుడు - అనియే భావము. ఇది సమాధానమునందు స్పష్టముగా వాచ్యము కాలేదు; విశేషణాదికముబట్టి అభ్యూహితము. కావుననే, యిది బహిఃప్రశ్నమునకు లక్ష్యమగుచున్నది.

[బహిరంతః ప్రశ్నము]

బహిరంతఃప్రశ్నం యథా-

'సుభద్రాం క ఉపాయంస్త ప్రశ్నేఽముష్మిన్ య ఉత్తరః
స కీదృక్కపి మాచష్టే వ్యోమ్ని పర్ణస్థితిః కుతః' 362

అత్ర 'వాయుతః' ఇత్యుత్తరేణ ప్రశ్నాద్బహిరుక్తేన వాయుతో నరో వానరో భవతీతి సుభద్రోపయంతాప్యుచ్యతే. తేనైతద్ బహిరంతః ప్రశ్నం భవతి.

అర్థము : బహిరంతః ప్రశ్నమున కుదాహరణము - సుభద్ర నెవడు పెండ్లియాడెను? ఈ ప్రశ్నకు సమాధానమైనవాడు ఎటువంటి కోతి (కేతనము) నెన్నుకొనెను? ఆకాశమునందు ఆకు ఎందువలన నిలుచుచున్నది?

ఇచ్చట 'వాయుతః' అని ప్రశ్నకు బయటనున్న సమాధానముచేత వాయుతః, నరః, వానరః అని యగును. సుభద్రను పెండ్లియాడినవాడు కూడ చెప్పబడును. అందుచేత, ఇది బహిరంతఃప్రశ్న మగుచున్నది.

వ్యాఖ్య : ప్రశ్నకు బహిఃస్థితమైన సమాధానము బహిఃప్రశ్నము; ప్రశ్నయందే నిహితమైయున్న సమాధానము అంతఃప్రశ్నము; రెండును గలది బహిరంతః ప్రశ్నము. ప్రకృతలక్ష్యమునందు 'వ్యోమ్ని పర్ణస్థితిః కుతః' అన్న ప్రశ్న కలదు. దీనికి సమాధానము 'వాయుతః' అని. 'ఆకాశమునందు ఆకు ఎట్లు నిలుచుచున్నది?' 'వాయువువల్ల' అని అర్థము. 'కీదృక్కపి మాచష్టే' అని యన్నప్పుడుకూడ 'వాయుతః' అన్నది సమాధానము. 'వా తో కూడిన' అని యర్థము. 'కపి' అన్న

యర్థమున వాయుతమైన పదము 'వానరః' అన్నది. 'వా' ను విడువగా 'నరః' అని మిగులును. అది మొదటి ప్రశ్నకు సమాధానము. 'నరుడు' అని యనగా 'అర్జునుడు' అని యర్థము. 'వాయుతః' అన్నదొక్కటే బహిఃస్థితము; తక్కిన రెండు నంతఃస్థితములు. కావుననే యిది బహిరంతఃప్రశ్నమునకు లక్ష్యమగుచున్నది.

[ జాతి ప్రశ్నము ]

జాతిప్రశ్నం యథా-

'కీదృశా భూమిభాగేన రాజా స్నాతోఽనుమీయతే
ప్రాంగణం కురుతేత్యుక్తాః కిమాహు స్తదనిచ్ఛవః' 363

'హైమవారక రంజినా' 'నాజిరం కరవామహై' ఇత్యుత్తరాభ్యాం గతప్రత్యాగతాభ్యాం ప్రశ్నోత్తరజాతి రభిధీయతే. తేన జాతిప్రశ్నమిదమ్.

అర్థము : జాతిప్రశ్నమున కుదాహరణము – ఎటువంటి భూమిభాగమున రాజు స్నానముగావించిన ట్లూహింపబడుచున్నది? ప్రాంగణమును నిర్మింపు దని చెప్పగా, అనిష్టు లేమని యందురు?

'హైమవారక రంజినా' 'నాజిరం కరవామహై' అన్న గత ప్రత్యాగతము లైన సమాధానములచేత ప్రశ్నోత్తరజాతి చెప్పబడుచున్నది. కావున, ఇది జాతి ప్రశ్నము.

వ్యాఖ్య : రెండు ప్రశ్న లున్నపుడు ఒకప్రశ్నకు అనులోమక్రమమున, మరొకప్రశ్నకు ప్రతిలోమక్రమమున ఒకే సమాధానము చెప్పగా అది జాతిప్రశ్న మగునని లక్షణము. 'ఎటువంటి భూమియందు రాజు స్నానముచేయును,' దీనికి సమాధానము 'హైమవారక రంజినా'అని. 'బంగారు గోడలతో మనోహరమైన' అని యర్థము. పై సమాధానమునే ప్రతిలోమముగా చదువగా 'నాజిరం కరవామహై అని యగును. 'ప్రాంగణం కురుత' అన్న ఆదేశమున కిది సమాధానము. 'న+అజిరం+కరవామహై' అని యనగా 'ప్రాంగణమును నిర్మింపము' అని యర్థము. రెండు ప్రశ్నలకు అనులోమ ప్రతిలోమక్రమములచేత ఒకే వాక్యము సమాధాన మగుటచేత, ఇది జాతిప్రశ్నమునకు లక్ష్యమగుచున్నది.

[ పృష్ట ప్రశ్నము ]

పృష్టప్రశ్నం యథా—

'కో సో జోఅణవాఓ కో దండాణం దువే సహస్సాఇం
కా కాలీ కా మధురా కిం శుక పృథుకాననచ్ఛాయమ్' 364

అత్ర య ఏవ ప్రశ్నాః కః స యోజనపాదః కః స యో దండానాం ద్వే సహస్రే ఇత్యాదయః త ఏవ 'క్రోశో యోజనపాదః' 'కోదండానాం ద్వే సహస్రే' ఇత్యాదీన్యుత్తరాణి భవంతి. ఏవం 'కా కాలీ' 'కా మధురా' 'కిం శుకపృథుకాననచ్ఛాయమ్' ఇత్యుత్తరం కిమభిహితశేషస్య ప్రష్టవ్యమితి పృష్టప్రశ్నమ్.

అర్థము : పృష్టప్రశ్నమున కుదాహరణము – యోజనపాదు డెవడు? రెండు వేల దండములకు (ప్రభువు) ఎవడు? నల్లనిదేది; ఏది మధుర? శుకశాబక వర్ణము గలది యేది?

ఇచ్చట 'కః స యోజనపాదః' 'కః స యో దండానాం ద్వే సహస్రే' మొదలుగా గల ప్రశ్నలే 'క్రోశో యోజనపాదః' 'కోదండానాం ద్వే సహస్రే' మొదలయిన సమాధానము లగును. ఇట్లే 'కా కాలీ ...' అని మొదలయిన సమాధానము కిమభిహితశేషమునకు ప్రష్టవ్యము. కావున పృష్టప్రశ్నము.

వ్యాఖ్య : పృష్టప్రశ్న మని యనగా ప్రశ్నింపబడిన ప్రశ్న యని కాని, ప్రశ్నింపబడిన ప్రశ్నను కలది అని కాని అర్థము. ప్రశ్నవాచకముతోడి శేషవాక్యమే ప్రశ్నకు సమాధానమైనపుడు పృష్టప్రశ్నమన్న శబ్దాలంకార మగును. ఇది లక్షణము.

కిం శబ్దము ప్రశ్నవాచకము. పుంలింగము 'కః' అని, స్త్రీలింగము 'కా' అని యగును. 'కో సో జోఅణవాఓ' అన్నది మొదటిప్రశ్న. 'కః సః యోజనపాదః' అని సంస్కృతచ్ఛాయ. 'యోజనపాదు డెవడు?' అని అర్థము. పైదానికి 'క్రోశో యోజనపాదః' అనియు సంస్కృతచ్ఛాయ యుండవచ్చును. 'యోజనము (ఎనిమిదిమైళ్ళు) లో నాలుగవవంతు క్రోశము.' అని యర్థము. దీనినిబట్టి 'యోజన పాద మేమి?' అని ప్రశ్నను అంగీకరించుకొనవలయును. రెండవప్రశ్న వేరుగా కనిపించినప్పటికి, అది మొదటిప్రశ్నకే సమాధానము, 'కోదండానాం ద్వే సహస్రే'

'కోదండములయొక్క రెండువేలు' అని యర్థము. కోదండ మనగా 'ధనుస్సు'. నాలుగు హస్తముల పరిమాణము గలది ధనుస్సు. రెండువేల ధనుస్సుల పరిమాణము గలది క్రోశము, ప్రశ్నవాచకమైన 'కః' తరువాతి వాక్యభాగముతో కలియగా ఇది యేర్పడినది. ఇట్లే కా (ఏది) కాలీ (నల్లనిది) అన్న ప్రశ్నకు 'కాకాలీ' (కాకుల సమూహము) అన్నదియే సమాధానము. కా (ఏది) మధురా (తియ్యనిది) అన్న ప్రశ్నకు 'కామధురా' (వాంఛాభారము) అన్నది సమాధానము. అట్లే చివరి ప్రశ్నకు 'కింశుక పృథు కానన చ్ఛాయమ్' (మోదుగుపూలు నిండిన విశాలమైన అడవియొక్క చాయ) అని యర్థము. ఇట్లు ప్రశ్నవాచకమయిన కిం శబ్దమే అభిహితశేషముతో కూడి సమాధాన మగుటచేత, ఇది పృష్టప్రశ్నమునకు లక్ష్యమగుచున్నది.

[ ఉత్తర ప్రశ్నము ]

ఉత్తరప్రశ్నం యథా-

'కిం వసంతసమయే వనభర్తుః
పృష్టవాన్ స పృథులోమ విలేఖః
ఉత్తరం చ కిమవాపతు రేతౌ
కానానాద తిమిరాదపి కాలీ' 365

అత్ర ప్రశ్నస్య హే కాననాద హే తిమిరాద పికాలీత్యేత దేవోత్తరం భవతీత్యుత్తరప్రశ్న మిదమ్.

అర్థము : ఉత్తరప్రశ్నమున కుదాహరణము - 'కాననమును మ్రింగు తిమిరముకంటె వసంత సమయమువందు నల్లనిదేది?' అని వనభర్త యడిగెను; పృథులోముడు కూడ అడిగెను. వీ రిరువురు పొందిన సమాధాన మేమి ?

ఇచ్చట ప్రశ్నకు 'హే కాననాద హే తిమిరాద పికాలీ' అనునదియే సమాధానము. కావున, ఇది ఉత్తరప్రశ్నము.

వ్యాఖ్య : ప్రశ్నయే సమాధాన మైనప్పుడు ఉత్తరప్రశ్న మగునని లక్షణము, ఇచ్చట ప్రశ్నవాచకమును విడిచి సమాధానము ప్రవర్తించును. పృష్ట

ప్రశ్నమునందు ప్రశ్నవాచకము కూడ కలిసియే సమాధాన మగును. రెండింటికున్న భేదమిది.

'వసంత సమయే కాననాదతిమిరా దపి కాలీ కిమ్?' అని ప్రశ్న. ఇచ్చట ప్రశ్నవాచకమైన 'కిం' విడువబడినది. 'కానవాద' అని వనభక్షునికి సంబుద్ధియైనది. 'తిమిరాద' అని వృధులోమ విలేఖునికి సంబుద్ధి యైనది. 'అపి' శబ్దశేషమైన 'పి' వర్ణముతో కలిసి 'పికాలీ' అని సమాధాన మేర్పడినది. 'నల్లనిది కోకిలల సమూహము' అని భావము. ప్రశ్నయందే ఉత్తరముండుటవల్ల, ఇది ఉత్తరప్రశ్నము నకు లక్ష్యమగుచున్నది.

## అధ్యేయాలంకారము

150. యద్విధౌ చ నిషేధే చ వ్యుత్పత్తేరేవ కారణమ్
తదధ్యేయం విదుస్తేన లోకయాత్రా ప్రవర్తతే॥

అర్థము : విధియందును, నిషేధమునందును వ్యుత్పత్తికి కారణమయిన దానిని అధ్యేయ మని యందురు. దానిచేతనే లోకయాత్ర సాగుచున్నది.

151. కావ్యం శాస్త్రేతిహాసౌ చ కావ్యశాస్త్రం తథైవ చ
కావ్యేతిహాసః శాస్త్రేతిహాస స్తదపి షడ్విధమ్॥

అర్థము : 1. కావ్యము 2. శాస్త్రము 3. ఇతిహాసము 4. కావ్యశాస్త్రము 5. కావ్యేతిహాసము 6. శాస్త్రేతిహాసము – అని అధ్యేయముకూడ ఆరు విధములు.

వ్యాఖ్య : అధ్యేయము అనగా 'అధ్యయనము చేయదగినది' అని యర్థము. కావ్యము, శాస్త్రము మొదలయిన యారింటిని భోజదేవుడు అధ్యేయభేదములుగా పరిగణించి ప్రదర్శించుచున్నాడు ఇతరాలంకారికులు వీనిని కావ్యభేదములుగా పరిగణించిరే కాని అలంకారభేదములుగా పరిగణించలేదు 'శబ్దము నలంకరించునది శబ్దాలంకారము' అన్న నిర్వచనమున కనుకూలముగానే భోజదేవుడు అధ్యేయాలంకారమును ప్రదర్శించుట జరుగుచున్నది శబ్దార్థములే సాహిత్యశరీరము. శబ్దము కావ్యమునం దొకవిధముగా, శాస్త్రమునం దొకవిధముగా – భిన్నభిన్న రూపములలో భిన్నభిన్న విధములుగా అలంకృత మగును. కావున నే కావ్యాదులుకూడ అలంకార

వాచ్యము లగుచున్నవి. విన్యాస విధానములోని విశేషమే అలంకారత్వ పోషక మగుచున్న దనుట గమనార్హము.

[ కావ్యము ]

తేషు కావ్యం యథా-

'యది స్మరామి తాం తన్వీం జీవితాశా కుతో మమ
అథ విస్మృత్య జీవామి జీవితవ్యసనేన కిమ్' 366

తదిద ముక్తిప్రాధాన్యాత్ కావ్యమిత్యుచ్యతే.

అర్థము : వానియందు కావ్యమున కుదాహరణము - ఆయువతిని స్మరించిన యెడల నా కింక జీవితాశ యెక్కడిది? మరి, విస్మరించి బ్రతుకుదునేని జీవిత వ్యసనమువలన నేమి లాభము?

ఉక్తిప్రాధాన్యమువల్ల దీనిని కావ్యమని యందురు.

వ్యాఖ్య : శబ్దాలంకారము లలో ఇరువదియొకటవది అధ్యేయము. అధ్యేయాలంకార భేదములలో మొదటిది కావ్యము; ఇది ఉక్తిప్రధానము చెప్పెడి రీతిని బట్టియే శబ్దము అలంకృతమగును. శబ్దముకాని అర్థముకాని యిచ్చట ప్రధానము కాదు. చెప్పవలసిన అర్థమునకు తగిన శబ్దమును చెప్పవలసిన భణితిలో చెప్పుటయే ఉక్తి అది యున్నప్పుడే కావ్యము సంపన్నమగును.

ప్రకృతోదాహరణమునందు నాయకుడు నాయికా విరహతప్తుడై యున్నాడు. ఆమెను స్మరించుకొనుచు కాలయాపనము చేయుచున్నాడు. స్మరణచేత తాపము పెరుగుచున్నది; ప్రాణములు పోవునన్న భయము కలుగుచున్నది. అట్లయిన, స్మరించుట మానుకొనరాదా, మరచిపోరాదా?' అని ప్రశ్నింపవచ్చును. అప్పు డింక బతుకున కర్థమేమున్నది? బ్రతుకు విప్రయోజనము అంతేకాదు. నాయకుడు 'జీవితవ్యసనేన' అని ఉపయోగించుచున్నాడు 'జీవితమునందలి లంపటత్వముచేత' అనికాని 'జీవించుట యనెడి దుఃఖముచేత' అని కాని అర్థము చెప్పవచ్చును. ప్రేయసియే తన జీవిత సర్వస్వ మని తాత్పర్యము. ఇట్లు చెప్పుటచేతనే యిది కావ్యాలంకార మగుచున్నది.

[ శాస్త్రము ]

శాస్త్రం యథా-

'స్నిగ్ధోన్నతాగ్ర తను తామ్ర నఖౌ కుమార్యాః
పాదౌ సమోపచిత చారు నిగూఢ గుల్ఫౌ
శ్లిష్టాంగులీ కమలకాంతితలౌ చ యస్యా
స్తా ముద్వహేద్యది భువోఽధిపతిత్వ మిచ్ఛేత్' 367

అత్ర స్నిగ్ధత్వాదేః శబ్దస్య ప్రాధాన్య మితి శాసనాచ్ఛాస్త్ర మిదమ్.

అర్థము : శాస్త్రమున కుదాహరణము – స్నిగ్ధములు, ఉన్నతాగ్రములు, సన్నములునై రాగిరంగుగల గోళ్ళుగలిగి, సమముగా ఉపచితములై అందములైన చీలమండలు గలిగి, శ్లిష్టములయిన వేళ్ళను కలిగి, పద్మకాంతివంటి కాంతిగల పై భాగము కలిగిన పాదములుగల కన్యకను భువనాధిపత్యము నభిలషించువాడు పరిణయము చేసికొనవలయును.

ఇచ్చట స్నిగ్ధత్వము మొదలయిన శబ్దమునకు ప్రాధాన్య మన్న శాసనము వల్ల, ఇది శాస్త్రము.

వ్యాఖ్య : 'శాసనాత్ శాస్త్రమ్' అని వ్యుత్పత్తి. శాస్త్రమునందు శబ్దమునకే ప్రాధాన్యము. ఉదాహరణమునందు స్నిగ్ధ, సమోపచిత, శ్లిష్టాంగులీ - మున్నగు విధముగా నుపయుక్తములైన పదములను యథాతథముగా గ్రహింపవలయును. ఇదే యర్థమున మరొక శబ్దము నుపయోగించుటకు శాస్త్రము అంగీకరింపదు. ఇంకొక విషయము. ఉద్వహేత్, ఇచ్ఛేత్–అన్న క్రియారూపములు విధిలిఙ్ణనం దుపయుక్తము లయినవి. వీనినిబట్టికూడ శాసించుటయే జరుగుచున్నది. కావుననే, యిది శాస్త్రము అన్న అధ్యేయాలంకారభేదమునకు లక్ష్యమగుచున్నది.

[ఇతిహాసము ]

ఇతిహాసో యథా-

'హిరణ్యకశిపు ర్దైత్యో యాం యాం స్మితాప్యుదైక్షత
భయాద్ భ్రాంతైః సురైశ్చక్రే తస్యై తస్యై దిశే నమః'

సో౽యు మతీతార్థ ప్రాధాన్యా దితిహాసః.

అర్థము : ఇతిహాసమున కుదాహరణము – దైత్యుడైన హిరణ్యకశిపుడు స్మితపూర్వకముగా నైనప్పటికి ఏయే దిక్కును చూచెనో, భయభ్రాంతులయిన దేవతలు ఆయా దిక్కునకు నమస్కరించిరి.

అతీతార్థ ప్రాధాన్యమువల్ల, ఇది యితిహాసము.

వ్యాఖ్య : 'ఇతి+హ+ఆస' ఈవిధముగా నయ్యె నన్న వ్యుత్పత్తివల్ల ఇతిహాసము గతవృత్తాంతమునకు బోధకము. హిరణ్యకశిపుడు పురాణపాత్రము. అతడు దేవతలపై దండెత్తుటయు, వారు భయముతో వణకిపోవుటయు జరిగిపోయిన విషయములు; ప్రాచీనములు. అతీతమైన అర్థమునకు (విషయమునకు) ప్రాధాన్యము గలది ఇతిహాసము. ఇచ్చటి క్రియాపదము 'చక్రే' కర్మార్థకము; పరోక్షభూతము (లిట్)నందు ప్రయుక్తము. ఈ ప్రయోగము దానిని బలపరుచుచున్నది. కావుననే, ఇది యితిహాస మన్న అధ్యేయాలంకార భేదమునకు లక్ష్య మగుచున్నది.

[ కావ్య శాస్త్రము ]

కావ్యశాస్త్రం యథా–

'నాందీపదాని రతనాటక విఘ్నశాంతా
వాజ్ఞాక్షరాణి పరమాణ్యథవా స్మరస్య
దష్టే౽ధరే ప్రణయినా విధుతాగ్రపాణేః
సీత్కార శుష్కరుదితాని జయంతి నార్యాః' 369

అత్ర కావ్యేన శాస్త్ర మభిహిత మితీదం కావ్యశాస్త్రమ్.

అర్థము : కావ్యశాస్త్రమున కుదాహరణము – ప్రియుడు అధరదంశనము చేయగా ముంజేతిని విదలించి సీత్కారము చేయుచు శుష్కముగా రోదించిన నారీ రోదనములు, రతనాటకవిఘ్నోపశాంతికి నాందీపదములు; లేదా మన్మథుని పరమ శాసనాక్షరములు. అవి జయించును గాక!

ఇచ్చట కావ్యముచేత శాస్త్రము చెప్పబడినది. కావున, ఇది కావ్యశాస్త్రము.

వ్యాఖ్య : కావ్యమునందు శాస్త్రసంజ్ఞలు కాని, శాస్త్రపరిభాషలు కాని ప్రయుక్తములైనయెడల, అది కావ్యశాస్త్ర మగును నాంది దృశ్యకావ్యమునందు ప్రయుక్తమగును; లేదా అలంకార శాస్త్రమునందు ప్రసక్తమగును. నాటక విఘ్నశాంతికై నాంది ప్రవర్తించునని శాస్త్రము నిర్దేశించుచున్నది. అదే విషయము కావ్యమునందు స్థానము గడించుకొని సౌందర్య సంవర్ధకమైనయెడల, అది అలంకారమే యగును. ప్రకృతోదాహరణమునందు నాందీప్రసంగము సాధర్మ్యప్రదర్శనమునకై ప్రవర్తిల్లినది. నాంది నాటకమునందలి విఘ్నములను తొలగించును; నాయికా సీత్కారాదులు రతనాటకమునందలి విఘ్నములను తొలగించును. నాటకాగ్రభాగమున నాంది యుండును; రతనాటకాగ్రభాగమున సీత్కారాదులుండును. ఇట్లు సాధర్మ్యము చమత్కారావహమై యున్నది. కావుననే, ఇది కావ్యశాస్త్రమన్న శబ్దాలంకార భేదమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణము దశరూపకమునుండి సంగృహీతము.

[కావ్యేతిహాసము]

కావ్యేతిహాసో యథా-

'స సంచరిష్ణు ర్భువనాంత రేషు యాం
యదృచ్ఛయా శిశ్రియ దాశ్రయః శ్రియామ్
అకారి తస్యై ముకుటోపలస్ఖలత్
కరై స్త్రిసంధ్యం త్రిదశై ర్దిశే నమః' 370

అత్ర ప్రాగుక్తస్యై వేతిహాసార్థస్య కావ్యే నాభిధానాత్ కావ్యేతిహాసోఽయమ్.

అర్థము : కావ్యేతిహాసమున కుదాహరణము. అతడు (హిరణ్యకశిపుడు) లోకములందు సంచరించువాడై యాదృచ్ఛికముగా ఏదిక్కును సంపదల కాశ్రయముగా ఆశ్రయించెనో, ఆదిక్కునకు కిరీటములందలి రత్నములనుండి జారుచున్న చేతులుగల దేవతలు మూడు సంధ్యలందును నమస్కరించిరి.

ఇచ్చట పూర్వోక్తమైన యితిహాసార్థమే కావ్యద్వారమున చెప్పబడుటవల్ల ఇది కావ్యేతిహాసము.

వ్యాఖ్య : కావ్యమునందు పురాణ సన్నివేశము నివేశింపబడినయెడల కావ్యేతిహాస మగును. ఇది లక్షణము. ఇచ్చట కావ్యము ప్రధానము; పరిమితపరిధిలో ఇతిహాసము ప్రయుక్తమగును. మాఘకృతమైన శిశుపాలవధ కావ్యమునుండి ప్రకృతోదాహరణము సంగృహీతము. కావ్యస్థమయిన యితిహాసప్రసంగలేశ మగుట చేతనే, యిది కావ్యేతిహాసమునకు లక్ష్యమగుచున్నది.

## [ శాస్త్రేతిహాసము ]

శాస్త్రేతిహాసో యథా-

'ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్' 371

అత్ర ధర్మార్థ కామమోక్షాణా మితిహాస నివేశితత్వా దయం శాస్త్రేతిహాసః.

అర్థము : శాస్త్రేతిహాసమున కుదాహరణము – ఓ భరతశ్రేష్ఠుడా! ధర్మమునందును, అర్థమునందును, కామమునందును, మోక్షమునందును ఇచ్చట నేమికలదో అది యింకొకచోట (ఉండవచ్చును); ఇక్కడ లేనిది మరెక్కడను లేదు.

ఇక్కడ ధర్మార్థ కామమోక్షములకు ఇతిహాసమునందు నివేశితత్వమువల్ల, ఇది శాస్త్రేతిహాసము.

వ్యాఖ్య : ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు. ఇవి ఆధ్యాత్మిక శాస్త్రమునకు సంబంధించిన విషయములు. ప్రకృతోదాహరణము భారతమునందలిది. భారతము ఇతిహాసము. ఇతిహాసమునందు శాస్త్రప్రసంగము చొప్పింపబడినది. కావుననే యిది శాస్త్రేతిహాసమునకు లక్ష్యమగుచున్నది. (కావ్యమునందు చొప్పింపబడిన శాస్త్రము కావ్యశాస్త్రమైనట్లే, కావ్యమునందలి యితిహాసము కావ్యేతిహాసమైనట్లే, ఇతిహాసమునందలి శాస్త్రము ఇతిహాసశాస్త్రమగుట అభిధానానుగుణము. కాని భోజదేవుడు శాస్త్రేతిహాసమనియే పేర్కొనెను. పై సామ్యమునుబట్టి శాస్త్రమునందలి యితిహాసమని పొరపడకుండుట అవసరము).

## శ్రవ్యాలంకారము

152. శ్రవ్యం తత్కావ్య మాహు ర్యన్నేక్ష్యతే నాభినీయతే
శ్రోత్రయో రేవ సుఖదం భవే త్తదపి షడ్విధమ్॥

అర్థము : దర్శించుటకు గాని అభినయించుటకు గాని వీలుకానిదై చెవులకు సుఖమును కలిగించు కావ్యమును శ్రవ్యము అని యందురు. ఇదికూడ ఆరు విధము లగును.

153. ఆశీ ర్నాందీ నమస్కారో వస్తునిర్దేశ ఇత్యపి
ఆక్షి ప్తికా ధ్రువా చేతి శేషోఽధ్యేయం భవిష్యతి॥

అర్థము : 1. ఆశీస్సు 2. నాంది 3. నమస్కారము 4. వస్తునిర్దేశము 5. ఆక్షిప్తిక 6. ధ్రువ - ఈ ఆరును శ్రవ్యభేదములు. గ్రంథమునందు మిగిలిన యంశము అధ్యేయమే యగును.

[ ఆశీస్సు ]

తత్రాశీర్యథా-

'భూయాద్వః శ్రేయసే దేవః పార్వతీదయితో హరః
పాతు వః పరమం జ్యోతి ర వాఙ్మనస గోచరః' 372

అత్రాశంసాయాం లిఙ్ లోట్ చ. తదిదం వాక్యద్వయ మాశీః.

అర్థము : ఆశీస్సున కుదాహరణము - పార్వతీనాథుడును, దేవుడు నైన హరుడు మీకు శ్రేయస్సున కగునుగాక! వాక్కులకును మనస్సునకును గోచరము కాని ఆ పరమజ్యోతి మిమ్ములను రక్షించునుగాక!

ఇచ్చట ఆశంసయందు లిఙ్ను లోట్టును ప్రయుక్తములు. అందువలన, ఈ వాక్యద్వయమును ఆశీస్సు.

వ్యాఖ్య : సాహిత్యము గద్యపద్యాది రూపముగను, శ్రవ్యదృశ్యాది రూప ముగను వెలయుట ప్రసిద్ధవిషయమే. అందు అధ్యయనమువల్ల తెలిసికొనవలసినవి

అధ్యేయములు. శ్రద్ధాపూర్వకమైన పఠనమే అధ్యయనము. దృశ్య శ్రవ్యకావ్యములు రెండింటగూడ అధ్యేయము లధికముగానే యుండును. దృశ్యకావ్యమునందు దర్శనీయతయే ప్రధానము; అయినప్పటికిని అభినేయము కాకుండ, కేవలము శ్రవణయోగ్యముగా నుండెడి యంశములు కొన్ని కలవు. వానిని శ్రవ్యాలంకార భేదములుగా భోజదేవుడు పరిగణించి ప్రదర్శించుచున్నాడు. అందు మొదటిది అశీస్సు. ప్రకృతోదాహరణమునందు 'ఈశ్వరుడు మిమ్ములను కాపాడి మీకు శ్రేయముగూర్చుగాక' అన్న భావముతో ఆశీర్వచనమున్నది. ఆశీర్వచనమునందు లిఙ్రూపమును (భూయాత్)గాని, లోట్రూపమును (పాతు)గాని వాడవచ్చును. ఇచ్చట రెండును వాడబడినవి. ఈ రెండు క్రియలచేత రెండు వాక్యములలో ఆశీర్వచనము నిర్వహింపబడినది.

[ నాంది ]

నాందీ యథా–

'భద్దం భోదు సరస్సఈఅ కఇణో ణందంతు వాసాయిణో
అణ్ణాణం పి పరం పఅట్టదు పరా వాణీ ఛఇల్లప్పిఆ
వచ్ఛోభీ తహా మాఅహీ ఫురదు ణో సా కిం అ పంచాలిఆ
రీదీఓ విలిహంతు కవ్వకుసలా జోణ్హం చఓరా విఅ.' 373

[ఛాయా–
'భద్రం భవతు సరస్వత్యాః కవయో నందంతు వ్యాసాదయః
అన్యేషా మపి పరం ప్రవర్తతాం వరా వాణీ విదగ్ధప్రియా
వైదర్భీ తథా మాగధీ స్ఫురతు నః సా కిం చ పాంచాలికా
రీతికా విలిహంతు కావ్యకుశలా జ్యోత్స్నాం చకోరా ఇవ.']

సేయం రంగమంగలాంతం స్వస్త్యయనం నాందీ.

అర్థము : నాందికి ఉదాహరణము – సరస్వతికి భద్రమగుగాక। వ్యాసాదులయిన కవులు ఆనందింతురుగాక। విదగ్ధప్రియము, శ్రేష్ఠము నైన వాణి యితరుల యెడల పైతము ప్రవర్తించునుగాక। మాకు వైదర్భీ, మాగధీ, పాంచాలికారీతులు స్ఫురించునుగాక। వెన్నెలను చకోరములవలె కావ్యకుశలులు ఆస్వాదింతురుగాక।

ఇది రంగమంగళాంతము స్వస్త్యయనము నైన నాంది.

వ్యాఖ్య : శ్రవ్యాలంకారము నందొక భేదము నాంది. రంగమునకు శుభమును కలిగించుటయే ప్రయోజనముగా ప్రవర్తిల్లును. విఘ్నములను నాశమొందించుటకు, మంగళములను ప్రతిపాదించుటకు సూత్రధారుడు నాందీశ్లోకమును పఠించును. కావుననే ఇది శ్రవ్యాలంకారభేదముగా పరిగణితమగుచున్నది.

ఉదాహరణము రాజశేఖరుని కర్పూరమంజరినుండి గృహీతము.

[ నమస్కృతి ]

నమస్కృతి ర్యథా-

'జయతి బ్రహ్మభూః శంభు ర్వందేమహి మహేశ్వరమ్
ఇదం గురుభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే' 374

సేయం స్తుతి ర్నమస్క్రియా చ నమస్కృతి రేవ భవతి.

అర్థము : నమస్కృతికి ఉదాహరణము - బ్రహ్మభూతుడైన శంభుడు జయించునుగాక! మహేశ్వరునికి నమస్కరింతుము. పూర్వులయిన గురువులకు నమోవాకము నర్పింతుము.

ఇది స్తుతియు నమస్కృతియు, నమస్కృతియే యగును.

వ్యాఖ్య : నమస్కారము క్రియారూపముగను, వాగ్రూపముగను కూడ నుండవచ్చును. వాగ్రూపమయిన నమస్కృతియే శ్రవ్యాలంకార భేదముగా పరిగణనీయమగును. 'మేము నమస్కరించుచున్నాము' అని చెప్పుటయేకాక, నమస్కారమున కుద్దిష్టుడైన వ్యక్తిని సవిశేషణముగా పేర్కొనుట జరుగును. అట్లు విశేషణ విశిష్టముగా పేర్కొనుటయే స్తుతి. నమస్కృతియందు స్తుతియు నమస్కారమును జతగానే యుండును. స్తుతి యెప్పుడును శ్రవ్యమే; ఇచ్చట నమస్కారము కూడ శ్రవ్యమగుచున్నది. కావుననే ప్రాధాన్యమునుబట్టి నమస్కృతియనియే నామకరణము చేయుట జరిగినది.

[ వస్తునిర్దేశము ]

వస్తునిర్దేశో యథా-

'అత్యుద్దామ జటాభార భ్రాంత గంగాంబుశేఖరః
ఆదిదేవో హరో నామ సృష్టి సంహారకారణమ్' 375

సోఽయం కథాశరీరవ్యాపినో వస్తునో నాయకస్య నిర్దేశో వస్తు నిర్దేశః.

అర్థము : వస్తునిర్దేశమున కుదాహరణము- అత్యధికమయిన జటాజూటము నందు భ్రాంతి నొందుచున్న గంగాజలములను శిరసున ధరించినవాడును, సృష్టి సంహార కారణుడునై, హరుడను పేరుగల ఆదిదేవుడు కలడు.

కథాశరీరమంతట వ్యాపించిన వస్తువుయొక్క నాయకునియొక్క నిర్దేశమే వస్తునిర్దేశము.

వ్యాఖ్య : ఇతివృత్తమునే వస్తువని యందురు. కావ్యమునందు వస్తువు వివిధ సన్నివేశముల మూలమున, వివిధ వర్ణనలమూలమున, బహువిధములైన యితరాంగముల సహాయమున ప్రస్తరింపబడును. కావ్యమునందంతట వ్యాపించి యున్న వస్తువునుగాని, తద్వస్తునాయకునిగాని తొలుతనే స్ఫురింపజేయుటచేత పఠితకు ప్రరోచన కలుగును. కావుననే, యిదియు శబ్దాలంకారభేదముగా పరిగణన కెక్కుచున్నది.

[ ఆక్షిప్తిక ]

ఆక్షిప్తికా యథా-

'పఅవీడిఅ మహిసాసుర దేహేహిం
భుఅణ భఅలుఆ వససి లేహిం
సురసుహా దేత్త వలిఅ ధవలచ్ఛిహిం
జఅఇ సహాసం వఅణు మహాలచ్ఛిహిం' 376

[ఛాయా-

'పదపీడిత మహిషాసుర దేహయా
భువన భయ లావక శశిలేఖాయాః

సురసుఖ దాతృ వలిత ధవలాక్ష్యా
జయతి సహాసం వదనం మహాలక్ష్మ్యాః']

సేయ మభిధిత్సిత రాగవిశేష ప్రయోగమాత్ర ఫలం వచన మాక్షిప్తికా.

అర్థము : ఆక్షిప్తిక కుదాహరణము - మహిషాసురదేహమును కాళ్ళ క్రింద త్రొక్కినదియు, భువనత్రయమును తొలగించు చంద్రలేఖలను గలదియు, దేవతలకు సుఖమును గలిగించు వలిత ధవళేక్షణములను గలదియు నైన మహాలక్ష్మియొక్క హాసయుక్తమయిన వదనము జయించును గాక!

ఇది వర్ణిత రాగవిశేషమును ప్రయోగించిన ఫలము నపేక్షించెడి వచనము. కావున ఆక్షిప్తిక.

వ్యాఖ్య : ఉదాహరణమునందు మహాసురమర్దనియొక్క రూపచిత్రణము జరిగినది. ఇది రంగస్థలమునందు అభినయపూర్వకముగా ప్రదర్శితము కాక, పాత్రముఖమున వాగ్రూపమున నభిహితమయినది. ఇది సూచ్యమే కాని దృశ్యము కాదు. కావుననే మాటలతో సూచించుట జరిగినది. ఇట్లు సూచించినప్పటికిని, దృశ్యమువలన నుద్దిష్టమగు ఫలమే యిచ్చుటకూడ నుద్దిష్టము. వధాదులు ప్రదర్శనీయములు కావు; కావున, ఆక్షిప్తిక యన్న శ్రవ్యాలంకారముచేతనే తత్ప్రయోజనము సాధింపబడుచున్నది. కనులకు గోచరము చేయరాని దానిని మనసునకు గోచరము చేయుట జరుగుచున్నది.

## [ ధ్రువ ]

ధ్రువా యథా-

'మలవవహాణిమిత్త ణిగ్గఅ
మఅందసుణ్ణం గుహాం ణివేఊణ
లద్ధావసరో గహిఊణ
మోత్తిఅఅం గఓ వాహో'

[ఛాయా-

'మృగ వధ నిమిత్త నిర్గత
మృగేంద్రశూన్యాం గుహాం నిరూప్య
లబ్ధావసరో గృహీత్వా
ముక్తికాని గతో వ్యాధః']

నేయం పాత్రప్రవేశ రసానుసంధానాది ప్రయోజనా ధ్రువా-

అర్థము : ధ్రువకు ఉదాహరణము – మృగవధ నిమిత్తమై మృగేంద్రమైన సింహము పోగా శూన్యముగా నున్న గుహనుచూచి, అవకాశము నొందినవాడై వేట కాడు ముత్యములను తీసికొని వెళ్ళిపోయెను.

ఇది పాత్రప్రవేశము, రసానుసంధానము మొదలయిన ప్రయోజనములు గల ధ్రువ.

వ్యాఖ్య : ధ్రువ యన్నదికూడ శ్రవ్యాలంకారభేదమే. పూర్వాపర కథా సంధానమునకు గాని, పాత్ర స్వరూపనిరూపణమునకు గాని వాగ్రూపమున సూచన క్రియ నాచరించెడి అంగమే ధ్రువ. ప్రకృతోదాహరణమున మహారాజు రాజధానిలో లేని సమయమున అసమర్థుడయిన శత్రురాజు రాజ్యము నాక్రమించుకొనె నన్న విష యము సూచిత మగుచున్నది. ఇదంతయు రంగస్థలముపై ప్రదర్శింపబడకుండ, వాగ్రూపమున వర్ణితమగుచున్నది. కావుననే యిది శ్రవ్యాలంకార భేదమునకు లక్ష్యమగుచున్నది.

## ప్రేక్ష్యాలంకారము

154. యదాంగికైకనిర్వర్త్య ముజ్ఝితం వాచికాదిభిః
నర్తకై రభినీయేత ప్రేక్షణాక్ష్వేడికాది తత్॥

155. తల్లాస్యం తాండవం చైవ ఛలికం శంపయా సహ
హాల్లీసకం చ రాసం చ షట్ప్రకారం ప్రచక్షతే॥

అర్థము : వాచికాదులు లేకుండ ఆంగికముచేతనే నిర్వర్తింపదగినదై ప్రద ర్శన గర్జనాది రూపమున నర్తకులచేత అభినయింపబడునది ప్రేక్ష్యాలంకారము.

అది 1. లాస్యము 2. తాండవము 3. ఛలికము 4. శంప 5. హల్లీసకము 6. రాసము - అని ఆరు విధములుగా పరిగణింపబడుచున్నది.

[ లాస్యము ]

తేషు లాస్యం యథా-

'ఉచ్చిఉ వాలీయిఅ పంథపిం జంతఉ
పేక్ఖమి హత్థం హోఇ జఇ లోఅణవంతఉ' 378

[ఛాయా-

'ఉచ్చా పాలిః ప్రియః పథా యాతి
ప్రేంఖయామి హస్తం భవతి యది లోచనవాన్']

తదిదం శృంగార రసప్రధానత్వా ల్లాస్యమ్.

అర్థము : వానియందు లాస్యమున కుదాహరణము - పంతెన యెత్తుగా నున్నది. ప్రియుడు మార్గమున వెళ్ళుచున్నాడు. అతడు లోచనవంతుడైనచో (ఇటు కనులు త్రిప్పినచో) చేయి యూపుదును.

శృంగార రసప్రధానత్వముచేత ఇది లాస్యము.

వ్యాఖ్య : అభినయము ఆంగికము, వాచికము, ఆహార్యకము, సాత్త్వికము- అని నాలుగు విధములు. లాస్యమునందు ఆంగికాభినయము మాత్రమే యుండు నని నర్తకులు అంగవిన్యాస మాత్రముచేతనే అభినయింతు రని లక్షణము. 'వాచికాదిభి రుజ్ఝితమ్' అని యనుటచేత వాచికాభినయము మొదలయినవి యుండనే యుండ వని అర్థము. ప్రకృతమైన ప్రేక్ష్యాలంకారము శబ్దాలంకారములలో నొకటి యగుట చేతను, లక్ష్యముగా ఒక శ్లోకము ప్రదర్శింపబడుటచేతను శబ్దవివహిత మని చెప్పుటకు వీలుకాదు. నటులు వాచికాభినయము చేయరాదు; ఆంగికాభినయము మాత్రమే చేయుదురు. మత్తవారణము (నేపథ్యము) నందు లక్ష్య శ్లోకమును గానము చేయుదురు. తదనుగుణముగానే ఆంగికాభినయము నిర్వర్తింపబడును. ఇది శృంగార రసప్రధానమై యుండును. కావుననే, ప్రకృతశ్లోకము లాస్యమునకు లక్ష్యమయినది. ఇది ప్రదర్శనయోగ్యమగుటవల్లనే ప్రేక్ష్యాలంకారభేదముగా పరిగణింపబడుచున్నది.

[ తాండవము ]

తాండవం యథా-

'సుఅ వహ వఇఅర ణిసుణిఅ
దారుణ రోస విసట్టపహారరుహిరారుణు
జలిఉ జాణఇ ణరు రిఉ
సంతావణు అణలసరిచ్ఛు జఇ హోఇ మహారణు' 379

[ఛాయా-

'సుతవధ వ్యతికరం నిశమ్య
దారుణ రోష విసృష్ట ప్రహార రుధిరారుణః
జ్వలితో జాయతే నరో రిపు
సంతాపనోఽనలసదృశో యది భవతి మహారణః']

-ఇదం వీరరస ప్రధానత్వా త్తాండవమ్.

అర్థము : తాండవమున కుదాహరణము - సుతవధకు సంబంధించిన వార్తను వినినవాడై దారుణరోషముతో విడువబడిన ప్రహారములవలని రక్తముచేత ఎఱ్ఱబడినవాడై, మహారణము కలిగినప్పుడు, అర్జునుడు రగులుకొల్పబడిన అగ్ని వలె శత్రుసంతాపకు డగును.

ఇది వీర రసప్రధానత్వమువల్ల తాండవము.

వ్యాఖ్య : శృంగారప్రధానమైన ఆంగికాభినయమునకు ఆకరమైన రచన లాస్యమైనట్లే, వీర ప్రధానమైన ఆంగికాభినయమునకు ఆకరమైన రచన తాండవ మగును లాస్యము సుకుమారము; తాండవము ఉద్ధతము. ఇదికూడ అన్యపురుష ప్రోక్తము కావలయును; నటులు తదనురూపముగా ఆంగికాభినయము చేయవల యును. అభినయ సమన్విత మగుటచేతనే యిది ప్రేక్ష్యమై, వీర రసప్రధాన మగుట చేత తాండవ మగుచున్నది.

[ ఛలికము ]

ఛలికం యథా-

'ణిసుణిఉ పచ్ఛా తురంగరఉ భుండి హింసి హసంతి
ణిఅకంతం డాఢజుఅలేహిం పుణు పుణు ణ అ బలంతి' 380

[ఛాయా-

'నిశమ్య పశ్చాత్తురగరవం శూకరీ హింసార్థం హసతి
నిజకాంతం దంష్ట్రాయుగలేన పునః పునర్న చ దశతి']

ఇదం తు శృంగార వీరరసప్రధానత్వాచ్ఛలికమ్.

అర్థము : ఛలికమున కుదాహరణము — తన వెనుక గుఱ్ఱపు సకిలింపును విని సూకరి (ఆడుపంది) హింసకొరకై నవ్వుచున్నది. తన భర్తను కోరలజంటతో మరల మరల కొరకుట లేదు.

ఇచ్చట శృంగార వీరరస ప్రధానత్వమువల్ల ఛలికము.

వ్యాఖ్య : శృంగార వీరరస ప్రధానమైన ఆంగికాభినయమునకు ఆకరమైన రచనకు ఛలిక మనిపేరు. సూకరముతో నున్న సూకరి శృంగారావిష్టయై యున్నది; ఇంతలో తురంగరావము వెనుకనుండి వినిపించినది. దీనివల్ల వీర రసావేశము కలిగినది. ఇట్లు శృంగార వీరముల కేకకాలమున ప్రాధాన్యము ప్రదర్శింపబడుటకు చేసెడి ఆంగికాభినయము ఛలికము.

## [ శంప ]

శంపా యథా-

'వీహేసి హరిముహి అవి హోహి మం గలే లేహి సఆ
కందఅ రిట్ఠాసురమారిఉ కంఠవలిఉ ణపఅ' 381

[ఛాయా-

'బిభేషి హరిముఖి అపి భవ మాం గలే గృహాణ సదా
క్రందతి రిష్టాసురమారితః కంఠవలితో నృపతిః']

తదిదం ఛలికమేవ కిన్నరవిషయం శంపా.

అర్థము : కంప కుదాహరణము - హరిముఖీ (కిన్నరీ)! నీవు భయపడు చున్నావా? నన్ను సదా కంఠమునందు పట్టుకొనుము. (కంఠమును కౌగిలించుకొని యుండుము). రిష్టాసురునికి పట్టుబడినవాడై, మెడ త్రిప్పబడినవాడై రాజు ఆక్రం దించుచున్నాడు.

ఛలికమే కిన్నరవిషయమైనపుడు కంప యగును.

వ్యాఖ్య : శృంగార వీరములకు ప్రాధాన్యము గలది ఛలికము; అదియే ఉత్తమపాత్ర గతమైనప్పుడు కంప యగునని లక్షణము. ఉదాహరణమునందు నృప రక్షణోద్యుక్తతవల్ల వీరత్వము ద్యోతక మగుచున్నది. అదే సమయమున, ప్రియురాలి భీతిని పోగొట్టు మిషతో కంఠాలింగన ప్రేరణముచేత శృంగారము ద్యోతక మగుచున్నది. ఇచ్చట కిన్నరీ కిన్నరులు నాయికా నాయకులు. ఉత్తమాశ్ర యము గలిగి వీరశృంగారములకు ప్రాధాన్యము కలిగి ఆంగికాభినయమునకు యోగ్యమై యుండుటచేతనే యిది కంపకు లక్ష్యమగుచున్నది.

[ హల్లీసకము ]

హల్లీసకం యథా-

'చందణధూసరఅం ఆఉలిఅ లోఅణఅం
హాసపరమ్ముహఅం ణీసాస కిలాలి అమ్
దుమ్మణ దుమ్మణఅం సంకామిఅ మండణఅం
మాణిణి ఆణణఅం కింతుహ్మకరట్ఠిఅఅమ్.' 382

[ఛాయా-

'చందన ధూసర మాకులితలోచనం
హాస పరాఙ్ముఖం నిశ్వాసక్లేశితమ్
దుర్మనసాం దుర్మనస్కం సంక్రామితమండనం
మానిన్యాననం కిం తవ కరస్థితమ్']

అర్థము : హల్లీసకమున కుదాహరణము - చెదరిన చందనముతో, కలత

నొందిన కన్నులతో, నిట్టూర్పుల వేదనతో, దుర్మనస్కులకు దుర్మనస్కమై, చిక్కు పడిన భూషణములు గలదై మానినీ వదనము నీచేతియందున్న దేల ?

156. మండలేన తు యత్ స్త్రీణాం నృత్యం హల్లీసకం తు తత్
తత్ర నేతా భవే దేకో గోపస్త్రీణాం హరిర్యథా॥

హల్లీసక మిదమ్.

అర్థము : స్త్రీలు మండలాకారమున చేయు నృత్యమునకు హల్లీసక మని పేరు. గోపస్త్రీలకు హరివలె అచ్చట నాయకుడొక్కడే యుండును. ఇది హల్లీసకము.

వ్యాఖ్య : పెక్కుండ్రు నాయికలు మండలాకారమున నుండి నడుమ నాయకు నుంచి చేయు నృత్యమును హల్లీసక మని యందురు. ఏ తదభినయమున కనువైన శబ్దరచనకూడ హల్లీసక మన్న పేరున ప్రేక్ష్యాలంకార మగును. ప్రేక్ష్యము శబ్దము నలంకరించుటచేతనే యిది శబ్దాలంకార మగుచున్నది.

[ రాసము ]

రాసో యథా–

'అఇ దుమ్మణ దుమ్మణఅ అజ్జ కిం ణో పుచ్ఛామి తుమమ్
ణ జివిజ్జఇ జేణ విల్లాసో పరిహిజ్జఇ కీస జణో' 334

[ఛాయా–
'అయి దుర్మనస్క దుర్మనస్క అద్య కిం నో పృచ్ఛామి త్వామ్
న జీవ్యతే యేన విలాసః పరిహీయతే కిం న జనః']

తదిదం హల్లీసకమేవ తాలబంధ విశేషయుక్తం రాస ఇత్యుచ్యతే.

అర్థము : రాసమున కుదాహరణము – ఓయోయీ! దుర్మనస్కుడా! నేడు నిన్ను ప్రశ్నింపకుందునా? ఏ జనముచేత విలాసమునకు జీవము కలుగదో ఆ జనము పరిహరింపబడవలసినదేనా ?

హల్లీసకమే తాలబంధవిశేషయుక్తమైనపుడు రాస మని పిలువబడును.

వ్యాఖ్య : అనేక నాయికలు నాయకుని చుట్టును వలయాకారమున నుండి చేయు నృత్యమును హల్లీసక మందు రని చెప్పుకొంటిమి. అదియే తాళలయాన్విత మైనప్పుడు రాస మనిపించుకొనును. రాసరూపమైన ఆంగికాభినయము తదాశ్రయ మైన శబ్దము నలంకరించుటచేతనే రచనను రాస మను పేర శబ్దాలంకారముగా పేర్కొనుట జరుగుచున్నది.

## అభినయాలంకారము

157. అంగ వాక్ సత్త్వజాహార్యాః సామాన్య శ్చిత్ర ఇత్యమీ
షడత్రాభినయా స్తద్యదభినేయం వచో విదుః॥

అర్థము : ఆంగికము, వాచికము, సాత్త్వికము, ఆహార్యకము, సామాన్యము, చిత్రము – అని యిచ్చట అభినయములు ఆరు విధములు. అభినేయ మగు వచనమును అభినయవంతముగా గ్రహింతురు.

[ ఆంగికాభినయము ]

తేష్వాంగికాభినయవద్యథా–

'దోర్దండాః క్వ ధృతాంగదాః క్వను శిరానద్ధౌ భుజౌ ద్వావిమౌ
వక్త్రాణి క్వ ను కాంతిమంతి బలమత్క్వేదం మమైకం ముఖమ్
వాచస్తాః క్వ జితార్ణవధ్వనిఘనాః క్వాయం వచస్సంయమో
హేలాకంపితభూధరః క్వ చరణన్యాసః క్వ మందా గతిః' 387

అత్రాంగికాభినయానాం ప్రతిపాదితత్వా దిద మాంగికాభినయమ్.

అర్థము : వానియందు ఆంగికాభినయవంతమున కుదాహరణము – బాహుపురులను ధరించిన ఆ దోర్దండము లెక్కడ? ఓరనరములు తేలిన యీ రెండు భుజము లెక్కడ? కాంతిమంతములైన ఆ ముఖము లెక్కడ? ముడుతలు పడిన యీ నాముఖ మెక్కడ? సముద్ర ఘోషను జయించు ఘనధ్వని గల ఆ వాక్కు లెక్కడ? ఈ

వాక్సంయమ మెక్కడ? భూధరములనుగూడ హేలగా కంపింపజేసిన ఆ పాదవిన్యాస మెక్కడ? ఈ మందగమన మెక్కడ?

ఇక్కడ అంగికాభినయములకు ప్రతిపాదితత్వమువల్ల అంగికాభినయము.

వ్యాఖ్య : శబ్దాలంకారములలో చిట్టచివరిది అభినయాలంకారము; దీనినే అభినీత్యలంకార మనియు వాడుట కలదు. ప్రేక్ష్యాలంకారమునందు అభినయము కొంతవరకు అంతర్భూతమై యున్నది. అయినను, అచ్చట అంగికాభినయము మాత్రమే ప్రసక్తమై యున్నది. రసమునుబట్టి ప్రేక్ష్యప్రభేదములు పేర్కొనబడి నవి; కావున అచ్చట రసమునకే ప్రాధాన్యము. అభినయాలంకారమునందు షడ్విధ ములయిన అభినయములకే ప్రాధాన్యము. ఇక్కడ కూడ అభినయమునకు ఆధార మైనది శబ్దరచనమే. అభినయము ఆ శబ్దరచనకు అందమును గూర్చుటచేతనే అభినయవంతము శబ్దాలంకార జాతిలో చేరినది.

ఆరు విధములైన అభినయములలో అంగికాభినయము మొదటిది. కరచర ణాది విన్యాసముచేత ఉద్దిష్టవిషయమును స్ఫురింపజేయుటయే అంగికాభినయము. ప్రకృతోదాహరణమందు దోర్దండములు, వక్త్రములు, వాక్కులు, గతివిన్యాసము-అంగికాభినయ సాపేక్షకములు. ఇట్లు రచనచేయుటచేతనే అంగికాభినయమున కవకాశము కలుగుచున్నది. తదభినయముచేతనే రచన సౌందర్య సంపుల్లమై సహృదయచేతోమోదమునకు సహకరించుచున్నది. కావుననే, యీ పద్యము అంగి కాభినయ మన్న శబ్దాలంకారమునకు లక్ష్యమగుచున్నది.

## [వాచికాభినయము]

వాచికాభినయపద్యథా-

'దుర్వారాం మదనశరవ్యథాం వహంత్యా
తన్వంగ్యా యదభిహితం పురః సఖీనామ్
తద్భూయః శిశు శుక శారికాభి రుక్తం
ధన్యానాం శ్రవణపథాతిథిత్వ మేతి' 3:5

అత్ర వాచికాభినయ ప్రతిపాదనా దిదం వాచికాభినయమ్,

అర్థము : వాచికాభినయమంతమున కుదాహరణము- దుర్వారమయిన మదన శరవ్యథను భరించుచున్న తన్వంగి తన చెలికత్తెల యెదుట చెప్పిన మాటలు శిఖు వులచేతను, శుకములచేతను, గోరువంకలచేతను మాటిమాటికి అనుకరింపబడి ధన్యుల చెవులకు అతిథిత్వమును పొందుచున్నవి. (బంధువులై చవులు గూర్చు చున్నవి).

ఇక్కడ వాచికాభినయ ప్రతిపాదనవల్ల, ఇది వాచికాభినయము.

వ్యాఖ్య : భావస్ఫోరకముగా శబ్దము నుచ్చరించుటయే వాచికాభినయము. దీనికి ఆంగికాద్యభినయములు కూడ సహకరింపవచ్చును. ఉదాహరణ శ్లోకమునందు నాయికాభాషితమును, శిశు శుక శారికలు అనుకరించుట కలదు. నటులు ఈపద్యము నభినయించినప్పుడు నాయికావాచికమునే కాక శిశు శుకాదుల అనుకృతవాచికమును కూడ అభినయింపవలయును. అట్టి అభినయము సహృదయుల నలరించును. ఇట్టి వాచికాభినయమున కాశ్రయ మగుటచేతనే ప్రకృతశ్లోకము వాచికాభినయమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణము శ్రీహర్షుని రత్నావళినుండి గృహీతము.

[ సాత్త్వికాభినయము ]

సాత్త్వికాభినయుమవద్యథా-

'వారం వారం తిరయతి దృశో రుద్గతో బాష్పపూర
స్తత్సంకల్పోపహిత జడిమ స్తంభ మభ్యేతి గాత్రమ్
సద్యః స్విద్య న్నయ మవిరతోత్కంపలోలాంగులీకః
పాణి ర్లేఖావిధిషు నితరాం వర్తతే కిం కరోమి' 386

అత్ర బాష్ప జాడ్య స్తంభ స్వేద కంపానాం ప్రతిపాదిత్వా దిదం సాత్త్వికాభినయమ్.

అర్థము : సాత్త్వికాభినయమంతమున కుదాహరణము - కన్నులనుండి పుట్టిన కన్నీటిప్రవాహము మాటిమాటికిని అడ్డువచ్చుచున్నది. ఆమెను తలచుకొన్న మాత్రముననే పుట్టిన జడత్వము శరీరమును స్తంభింపజేయుచున్నది. లేఖారచన

సఖుఁయమ్ములందు వెనువెంటనే చెమటపట్టి యెడతెగని కంపముతో పంచలించుచున్న ప్రేశ్యతో ఈ ఛేయి వర్తించుచున్నది. ఏమిచ్ఛేయుదురు ?

ఇచ్చట బాష్ప జాడ్య స్తంభ స్వేద కంపములకు ప్రతిపాదిత్వమువల్ల సాత్త్వికాభినయము.

వ్యాఖ్య : సత్త్వజములయిన భావములు సాత్త్వికములు. ఉద్దీపన విభావములు హేతువులుగా అనుభావములు కలుగును. నాయికను మాటిమాటికి స్మరించుటచేత నాయకునియందు అశ్రువు, స్తంభము, జడిమ, స్వేదము, కంపము మొదలయిన అనుభావములు కలుగుచున్నవి. ఈ యనుభావములవల్లనే ప్రకృతోదాహరణమునందలి నాయకుడుతన ప్రియురాలి చిత్రమును లిఖించుకొనుటకు పైతము అసమర్థుడగుచున్నాడు ఇందలి సాత్త్వికభావములను అభినేత రంగస్థలముపై అభినయింపవలయును. అభినయముచేత ఆయా భావములు స్పష్టములై సరసుల నలరించును. అట్టి అభినయమునకు ఆశ్రయమైన శబ్దరచన మగుటచేతనే యీ శ్లోకము సాత్త్వికాభినయమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణము భవభూతి మాలతీమాధవమునుండి గృహీతము.

## [ ఆహార్యాభినయము ]

ఆహార్యాభినయవద్యథా-

'చూడాచుంబిత కంకపత్ర మభితస్తూణీ ద్వయం పృష్ఠతో
భస్మస్తోక పవిత్రలాంఛన మురో ధత్తే త్వచం రౌరవీమ్
మౌర్వ్యా మేఖలయా నియంత్రిత మధో వాసశ్చ మాంజిష్ఠకం
పాణౌ కార్ముక మక్షసూత్రవలయం దండోఽపరే పైప్పలః' 387

అత్రాహార్యాభినయానాం ప్రతిపాదితత్వా దిద మాహార్యాభినయమ్ .

అర్థము : ఆహార్యాభినయవంతమున కుదాహరణము - అన్నిపైపుల శిరోజములచేత చుంబితము లగుచున్న బాణపుంఖములు గల అమ్ములపొదులు రెండు వీపుపై నున్నవి. కొలదిపాటి విభూతియొక్క పవిత్ర చిహ్నముగల వక్షఃస్థలము

చుక్కల లేడి చర్మమును ధరించియున్నది. మౌర్వితో చేసిన మొలత్రాటితో నియంత్రితమై ఎఱ్ఱనిరంగుగల అధోవస్త్రమున్నది. చేతియందు కార్ముక మున్నది. రెండవచేతియందు పిప్పలదండము నక్షసూత్రవలయము నున్నవి.

ఇచ్చట ఆహార్యాభినయముల ప్రతిపాదితత్వమువల్ల ఇది ఆహార్యాభినయము.

వ్యాఖ్య : ఆహార్య మని యనగా వేషభూషాదిధారణ మని యర్థము. ఒక్కొక వ్యక్తి ఒక్కొక స్థితియందు ఒక్కొక విధమైన ఆహార్యము కలిగి యుండును. ప్రకృతోదాహరణము రామ లక్ష్మణుల వేషధారణ ప్రసంగము. రామ లక్ష్మణులు క్షత్రియకుమారులు; బ్రహ్మచారులు; నూత్నయౌవనులు. అల్లెత్రాడు (వరముతో చేసినది) మొలత్రాడుగా, మాంజిష్ఠము అధోవస్త్రముగా, రౌరవచర్మము వక్షశ్ఛాదనముగా రాజవంశస్థులకు ఆపస్తంబమహర్షిచే విహితములు. తదనుగుణము గానే రామలక్ష్మణుల ఆహార్యము వర్ణితము. ఈ వర్ణన కనుగుణముగానే ఆహార్యాభినయము నిర్వహింపబడవలయును. కావుననే, యిది శబ్దాలంకారమగుచున్నది. ఉదాహరణము భవభూతి మహావీర చరితమునుండి గృహీతము.

## [ సామాన్యాభినయము ]

సామాన్యాభినయవద్యథా—

'రాహోశ్చంద్రకలా మివాననచరీం దైవాత్సమాసాద్య మే
దస్యోరస్య కృపాణ పాతవిషయా దాచ్ఛిందతః ప్రేయసీమ్
ఆతంకా ద్వికలం ద్రుతం కరుణయా విక్షోభితం విస్మయాత్
క్రోధేన జ్వలితం ముదా వికసితం చేతః కథం వర్తతామ్' 388

అత్ర చతుర్ణా మభినయానాం ప్రయోగా దిదం సామాన్యాభి నయమ్.

అర్థము : సామాన్యాభినయవంతమున కుదాహరణము - అదృష్టవశమున నిచ్చటికి (శ్మశానమునకు) చేరుకొని, యీ దస్యుగియొక్క నోటియందు పడిన ప్రేయసిని రాహుముఖమునందు పడిన చంద్రకళనువలె ఖడ్గపాతము నిమిత్తముగా వేరుచేసి లాగుకొనిన నాయొక్క మనస్సు సందేహమువల్ల వికలమై, కరుణచేత

కరగినదై, విస్మయముచేత విక్షోభితమై, క్రోధముచేత ఉద్దీపితమై, సంతోషముచేత వికసితమై యెట్లో యగుచున్నది.

ఇచ్చట నాలుగువిధములయిన అభినయములకును ప్రయోగమువల్ల ఇది సామాన్యాభినయము.

వ్యాఖ్య : నాలుగువిధములయిన అభినయములకు సమానత్వము కలది సామాన్యాభినయము. మొదటి రెండుపాదములందు అఘోరఘంటుని హస్తములందు చిక్కుకొనిన మాలతి రాహుముఖమునందు చిక్కిన చంద్రలేఖతో పోల్చబడినది. మాధవుడు ఖడ్గధారణముచేసి అఘోరఘంటుని నెదిరించి మాలతిని విడిపించును. ఇంతవరకు, ఆహార్యాంగికాభినయములకు సమృద్ధముగా అవకాశము కల్పింపబడినది. తరువాతి రెండు పాదములలోను జంకు, జాలి మున్నగు భావములను ప్రదర్శింపవలయును. కావున సాత్త్వికాభినయమున కవకాశము కలదు. మొత్తము శ్లోకమునందు వాచికాభినయము వాంఛనీయము. ఇట్లు చతుర్విధాభినయ సంపన్నమగుటచేతనే యీ శ్లోకము సామాన్యాభినయమునకు లక్ష్యమగుచున్నది.

ఉదాహరణము భవభూతి మాలతీమాధవమునుండి గృహీతము

[ చిత్రాభినయము ]

చిత్రాభినయవద్యథా—

'వ్యతికర ఇవ భీమ స్తామసో వైద్యుతశ్చ
క్షణ ముపహత చక్షు ర్వృత్తి రుద్భూయ శాంతః
కథ మిహ న వయస్య స్తత్కి మేతత్కిమన్యత్
ప్రభవతి హి మహిమ్నా స్వేన యోగేశ్వరీయమ్' 489

అత్ర హస్తాద్యాయ పదాధ్యాయయోః కథితత్వాచ్చిత్రాభినయ మిదమ్.

అర్థము : చిత్రాభినయవంతమున కుదాహరణము — 'చీకటివెలుగుల భయంకర మిశ్రమువలె, క్షణము సేపు చూపు కనిపించకుండజేసి, పుట్టి శాంతి నొందెను.' 'ఇటనెట్లు, వయస్యుడు కాడా? ఇదేమి?' 'మరొకటి యెట్లగును, ఇదిగో యోగేశ్వరి. తన మహిమచేతనే సమర్థ కదా!'

ఇచ్చట హస్తాద్యాయ పతాక్యాదుల కథనమువల్ల, ఇది చిత్రాభినయము.

వ్యాఖ్య : ఒకే శ్లోకమును కొంత కొంత చొప్పున పంచుకొని పఠించుట చిత్రాభినయము. సగము శ్లోకమును కామందకి ఆశ్చర్య సంభ్రమముతో పలికినది. తాను చూచిన దృశ్యము ఎట్టిదో స్పష్టముకాక కుతూహలము నుద్భూతము గావించినది. అందువలన ఆకాశమువంక పరిశీలనముగా చూచుట ఆవశ్యకమైనది. తన శిష్యుడయిన మకరందుడు తన్ను సమీపించుచున్నాడు. ఇది ఆశ్చర్యానంద సంధాయకము. కుతూహల మింకను శాంతింపలేదు. అందువల్లనే 'తత్కిమేతత్,' అని ప్రశ్నించినది. తుదిపాదము పూర్తిగా మకరందుని సమాధానము. ఇది యోగినీ ప్రశంసాపరము. దీనివలన మాలతీమాధవుల సంక్షేమ సమాచారము ప్రతీయమానమగుచున్నది. ఆశ్చర్యము, కుతూహలము, సంప్రశ్నము, సంతృప్తి మున్నగు భావములు అభినేయము లగుటవల్లనే ఇది చిత్రాభినయము. ఉదాహరణము భవభూతి మాలతీమాధవమునుండి గృహీతము.

158. చతస్రో వింశతిశ్చైతాః శబ్దాలంకార జాతయః
శబ్ద సందర్భమాత్రేణ హృదయం హర్తుమీశతే॥

అర్థము : శబ్దాలంకార జాతులయిన ఇరువది నాలుగును శబ్దసందర్భ మాత్రముచేతనే హృదయమును హరించుటకు సమర్థములై యున్నవి.

ఇతి శ్రీ మహారాజాధిరాజ భోజదేవేన విరచితే
సరస్వతీ కంఠాభరణనామ్ని అలంకారశాస్త్రే
శబ్దాలంకార వివేచనో నామ
ద్వితీయః పరిచ్ఛేదః